శ్రీ

లోకమాన్య బాలగంగాధర

# తిలక్ మహాశయుని జీవితము

## సంపూర్ణోపన్యాసములు.



క॥ "ఆపదగడవన్ బెట్టగ । నోపికసుఖంబైవదాని వాడగూర్పనుమన।
కీపుట్టువునకు తిలక । క్ష్మాపాలుడు గాంధిజీవి జనియె మహాత్మన్॥

"స్వరాజ్యము నాజన్మహక్కు"



మానికొండ సత్యనారాయణశాస్త్రి

ది మోడరన్ పబ్లిషర్సు [రిజిష్టర్డు]
తెనాలి : : విజయవాడ

 1950 [ వెల రూ. 5-0-0

# విషయసూచిక

# ప్రస్తావన

శ్లో॥ యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజామ్యహం.

భగవంతుడు మానవకల్యాణార్థము భిన్నయుగములందు భిన్నావతారములను దరించి ధర్మసంస్థాపనము చేసినవిధము మతసిద్ధాంతములందు సుప్రతిష్ఠితము. భగవన్నిర్ణయముల కనుకూలముగ కాలపాత్రములు పరిణామమును పొందుచుండును. మానవకల్యాణమునకు తోడ్పడుచుండును. మహానుభావులు దేశకాలపాత్రప్రవృత్తిని పరోక్షసృష్టియుచేత లోకోద్ధరణమునకు తోడ్పడుచుందురు. మానవులు లౌకికస్వరూపములను విడిచి కర్తవ్యమును గానక పరితపించెడి సమయములందు భగవంతుడాత్మవిశ్వాసమును గలుగజేసి యాత్మస్వరూపమును వ్యక్తము సేయుచుండును. భాగవతమహాపురుషులైన మహాత్ముల తరణోపాయమునకు మహానుభావుల పవిత్రజీవితములు పరమసాధనములు. శ్రీరామకృష్ణ బౌద్ధాదులు సంగ్రహముగా ధర్మప్రతిపాదనమును జేసి లోకోద్ధరణమును జేసిన విధమును భారతేతిహాసము అనంతశాఖముల బోధించుచున్నవి.

సనాతనధర్మవిలసితమైన భారతహృదయము భిన్నయుగములందు భిన్నరూపములను దాల్చి వికసించినది. ఆదికాలమునుండియును భారతహృదయ వికాసమునకు భాగవతధర్మము మహాబీజముగ నుండెను. వేదయుగమునందు ప్రతిపాదితమైన భాగవతధర్మము బౌద్ధయుగమునందు క్షీణించి సన్న్యాసధర్మము ప్రబలినది. పునర్నిర్మాణ యుగమునందు శ్రీ శంకరాదులు భాగవత ధర్మమునకును సన్న్యాస ధర్మమునకును సంయోగమును ప్రతిపాదించిరి.

మానవహృదయమునందు కర్మజిజ్ఞాస ధర్మజిజ్ఞాస బ్రహ్మజిజ్ఞాస సంరంభము సహజముగ జరుగుచుండును. తత్త్వజ్ఞులు కర్మయోగమును ధర్మారాధనమును బ్రహ్మజ్ఞానమును జీవనప్రవాహమునందు సమన్వయము జేసి పరమప్రదమైన భాగవతధర్మము నుపదేశించుచుండిరి. కాలక్రమమున భాగవతధర్మము లుప్తమై భారతహృదయమునందు నిర్లేపత్వము జనించినది. అంతఃకలహములు పరరాజాక్రమణములు నిశ్చేష్టతను గలిగించినవి. ఆంగ్లపరిపాలనము పాశ్చాత్యసంసర్గము భారతహృదయము నావరించి నిశ్చేష్టతను స్థిరము చేసినవి. బ్రిటీషు పరిపాలనము బాహ్యప్రవృత్తియం దపారమైన సంచలనమును గలుగ జేసినను సాంతరంగిక ప్రవృత్తియందు స్తంభనమును గలుగజేసినది. యంత్రములు యానములు వస్తువులు పరికరములు భాగ్యములు భోగములు వృద్ధిని పొందినను జాతీయజవసత్వములు స్తంభించినవి. సకల వ్యవస్థలయందును నాత్మావలంబన మస్తంగతమై పరావలంబన ముదయించినది. పరావలంబన రహితమైనజాతీయ

నందు సమచిత్తతతో శాంతస్వభావమును బూని సాహసధైర్యముల నవలంబించి పరమార్థమును గనుగొనుటకు ధర్మమే శరణ్యము. కాని ధర్మస్వరూప మిదమిత్థమని నిర్ణయించుట దుస్తరము. తిలకు మహాపురుషుడు మిత్రులు విసర్జించినను దండనము కలిగినను కష్టములు వచ్చినను తదేకదృష్టితో ధర్మనిర్వహణమును జేసి విషాదభరితమైన జాతికి ధర్మమార్గము నుపదేశించెను. తన జీవితమునందు స్వయముగ నాచరించిన ధర్మపథమునే గీతారహస్యమునందు తిలకు పండితుడై వ్యాఖ్యానము చేసి జీవిత పరమార్థమును స్వదేశస్థులకును లోకమునకును సువ్యక్తము చేసెను.

పండితులకు జయాపజయములు లాభనష్టములు సుఖదుఃఖములు మానావమానములు పామరులకువలె ధర్మనిర్వహణమునకు ప్రతిబంధకములుగావు. పండితుడు ఫలాపేక్షలేకయే ధర్మానుష్ఠానము జేయుచు భగవత్సందర్శనమునందు మహానందమును బొందగలుగును. ప్రాచీనమైన యీ భాగవతధర్మమునే తిలకుమహాశయుడు పునరుద్ధారణ చేసి జాతీయ హృదయమునందు మహాస్పందనమును బుట్టించెను. తిలకు మహారాజు నాటిన స్వరాజ్య ధర్మబీజము గాంధి మహాత్ముని యీదేశమున దివ్యస్వరూపమును దాల్చి వికసించుచున్నది. లోకమాన్యుడు జాతీయసంతరణమున కాత్మావలంబనము సాధనమని బోధించినను గత పురుషాంతరము నాపహించిన పాశ్చాత్య వ్యామోహమును సమ్మతము కలిగియుండెను. మహాద్రోహిగ బరిగణింపబడిన బాలగంగాధరతిలకు స్వరాజ్యమును గోరినను బ్రిటిషు సంబంధ విచ్ఛేదమును గోరలేదు. స్వరాజ్యము జన్మస్వత్వమని నిర్భయముగ బోధించినను బ్రిటిషు ప్రజాదయాపాత్రతయందును విశ్వాసమును గలిగియుండెను. స్వయంసహాయము నవలంబించినను స్వయంసహాధర్మ స్వరూపమును విస్పష్టము చేయలేదు. ఆత్మధర్మమును ప్రతిష్ఠించినను నాత్మోపలబ్ధికి విశుద్ధ పూర్ణయోగమును నిర్ణయించలేదు. భారత జాతీయ స్వయంవ్యక్తిత్వమును బ్రకటించుటకు సాధకుడైనను స్వయంవ్యక్తిత్వ యోగనిర్మాణకుడు గాంధీ మహాత్ముండు. సంతరణసాధనమైన స్వధర్మము లుప్తమై, భయావహమైన పరధర్మము ప్రబలిన సమయమునం దాత్మస్వరూపమును వ్యక్తము చేసిన తిలకుమహారాజు చరిత్రము సకలజనులకు సంకీర్తనీయము.

మహాధర్మోపేతమును పురుషార్థప్రదమునునైన లోకమాన్య బాలగంగాధర తిలకు జీవితచారిత్రము భారతీయుల ప్రత్యభిజ్ఞానమునకు పరమప్రమాణముగ నున్నది. లోకమాన్యు డుపదేశించిన తారకమంత్రసారమును గ్రహించుటకు వారి సమగ్రజీవితమును జదువుటయవసరము. ఆంధ్రభాషయందు లోకమాన్యుని జీవితచారిత్రమును వారి ఉపన్యాసములను రచియించి ప్రచురించిన శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి ప్రయత్న మాంధ్రుల పోషణములకు దగియున్నది. ఈ గ్రంథమునందు స్వరాజ్యము జాతీయోత్సవములు, జాతీయతత్త్వము, కర్మయోగము, భక్తియోగము, సంఘసంస్కరణము, పైసాఫండు, జాతీయవిద్య, రాజ్యభారము, సంధినభ మొదలగు ననేకవిషయములకు సంబంధించిన యమూల్యోపన్యాసములు గలవు. రచన తేటతెలుగున సుబోధ

కముగ నున్నది. ఆంధ్రలోకము సత్యనారాయణ శాస్త్రిగారి సత్ప్రయత్నములకుఁ బ్రోత్సాహ మొసగి తిలకుచరితామృతమును గ్రోలి నిశ్చలదేశభక్తిని సేవాదక్షత్వమును త్యాగశీలతను నిరంతర వ్యవసాయపరాయణత్వమును బడయుగాత !

శ్రీ కృష్ణపరమాత్ముఁడు - స్వధర్మపరాఙ్ముఖుఁడై విషాదయోగ భరితుఁడైన విజయునకు సంపూర్ణయోగ స్వరూపమును సాధనమును ఫలమును బోధించి యాత్మసాక్షాత్కారమును జేసి యుద్ధరించిన విధమున తిలకాచార్యుఁడు విషాదభరితమైన భారతజాతికి స్వధర్మానుష్ఠానవిధానము నుపదేశించి గురుపదము నధిష్ఠించెను. లోకమాన్య తిలకుమహారాజు స్వీయజీవితమునందును నిర్యాణకాలమునందును నుపదేశించిన యాత్మసాక్షాత్కారధర్మము నే గాంధీమహాత్ముఁడు భారతజాతీయ జీవనప్రవృత్తియందును ప్రపంచప్రవృత్తియందును పరిపూర్ణసమన్వయము చేసి జాతీయోద్ధరణమును మానవకళ్యాణమును జేయుచున్నాఁడు. సంకల్పసిద్ధికి బహిరంగాంతరంగిక సాధనములం దాంతరంగిక సాధనము బలిష్ఠము. గాంధీమహాత్ముఁడు జాతీయనిరీక్షణము నాంతరంగిక బహిరంగసాధనముల నేకముఖమున బ్రవహింపజేసి జీవితసర్మమును నుపదేశించుచున్నాఁడు. భారతపుత్రులు మహాత్ముల యుపదేశములను గ్రహించి వ్యామోహమును విడిచి స్వధర్మనిర్వహణమును జేసి పార్థునిరీతిని శాశ్వతప్రతిష్ఠను బడయుదురు గాత !

శ్లో. మోహో నష్టః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ.

చెన్నపురి
25-1-21.

కా. నాగేశ్వరరావు.

ఓం

# లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయుని జీవితము

## ప్రస్తావన

లోకమున ధర్మములు తారుమారై ధర్మమడంగి యధర్మమును, సత్యము నశించి యసత్యమును, దైవసంపద యడుగంటి యసురసంపదయు, సర్వప్రాణులకు స్వేచ్ఛాప్రవృత్తి మృగ్యమై బంధనాద్యవస్థలును ప్రబలమై ప్రపంచ మంధకారమున మునిగియున్న తరుణమున లోకరక్షణార్థమై మహాపురుషులుద్భవించుట దైవనిర్ణీతమై యున్నది. ఇట్టియవస్థ లోకమున కెన్ని పర్యాయములు తటస్థించినను అన్ని పర్యాయములును విసువక యిట్టిమహాత్ము లుద్భవ మగుచునే యుందురు. కాబట్టి యొకవేళ యెప్పుడైన లోక మధోగతిని బడియుండుట సంభవించెనేని "మనగతి యింతియే" యని దుఃఖముతో మనము నిరుత్సాహులము కావలసిన పనిలేదు. మన లోకము నుద్ధరింపగల మహాపురుషు డెప్పుడో యొకప్పుడు జన్మించి తీరునని మన మాశతో నెదురు చూచుచుండవలెను. నిశాసమయమున లోకము నంతను నావరించిన గాఢాంధకారములు సూర్యోదయకాలమున పటాపంచలై పోవా ?

ఈ పరమోత్కృష్టమైన ధర్మరహస్యమును మన భారతీయులే ప్రపంచమున కంతటికిని మొదట చాటిరి. అందువలన మన భారతవర్షమున కెట్టి యిక్కట్టులు సంభవించినను ఎంత అధోగతిని పడియున్నను, భారతీయులమైన మనము నిరుత్సాహులము కాజాలమనుటలో నేమియు నాశ్చర్యము లేదు. సూర్యభగవాను లుదయించి మనల నంధకారమునుండి లేవనెత్తగలడని మన మెదురు చూచుచునే యుందుము. సూర్యోదయము గాకుండ నెవడైన నాపగలడా ?

కాలచక్రము గిరగిర తిరుగుచుండును. ఈ కాలచక్రభ్రమణములో నొకప్పు డొకయాకును, మరియొకప్పు డింకొకయాకును పైకివచ్చుచుండును. ఒకప్పు డొక ఖండమును మరియొకప్పు డింకొక ఖండమును కాలగతిని బట్టి యున్నతశిఖరము నధిష్ఠింపుచుండును. పూర్వ మొకప్పుడు కీర్తిశిఖరము నధిష్ఠించి, దేదీప్యమానంబుగ వెలుంగుచుండిన మన భరతఖండము నేడు, కాలగతి ననుసరించి సంపాతము నొంది యంధకారావృతమై మరుగుపడియున్నది. కాని తిరిగి మనము మన పూర్వస్థానమునకు రాగల మను మనోనిశ్చయము మనకుగలదు. మనము సంకల్పసిద్ధులము. మనసంకల్పానుసారముగ నరుణోదయమైనది.

# జననము

(1856 సం॥ జూలై 23-వ తేదీ జననము) నేటికి అరువది నాలుగు సంవత్సరముల క్రిందట శాలివాహనశకపు సం॥ ౧౭౭౮-కి సరియగు రాక్షసనామ సంవత్సర ఆషాఢ బహుళ షష్ఠి (౬) బుధవారమున, శుభలగ్నమున తనకీర్తి విశ్వవ్యాపకమును గల యభేదమును దెలుపుటకో యన మన సూర్యభగవానులు బాలగంగాధరుని రూపమున మహారాష్ట్రమున నుదయించెను. గంగాధరుని రూపమేల ధరింపవలెను? ఇది యుగధర్మము. ఈ యుగధర్మము ననుసరించియే ఈ రూపమును ధరింపవలసి వచ్చినది. ప్రహ్లాదుని గాచుటకై లోకేశ్వరుడేల నృసింహావతారమును దాల్పవలెను? తత్తదవతార ప్రయోజనముల నెరుంగునది.

శ్లో॥ జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ॥ స్వర్గముకంటె శ్రేష్ఠతరమైనది జన్మభూమి. అట్టి మన జన్మభూమియైన భరతఖండము వంక నొకసారి దృష్టి నిగిడింపుడి; భరతమాత నొకసారి మీ మనంబుల సాక్షాత్కరింప జేసికొనుడి. సర్వాంగసుందరియైన యామె దక్షిణయామ్య ప్రదేశము నవలోకింపుడి, ఇదియే మహారాష్ట్ర భూభాగము. ఇదియే శ్రీ దేవి కాపట్టు. ఇదియే మహారాష్ట్ర వీరయోధుల జన్మభూమి. ఇదియే మహారాష్ట్రవీరవాహినులకు శరణ్యంబైన గిరిగహన దుర్గప్రదేశంబు. ఇదియే మహారాష్ట్రవీరుల యధిష్ఠానదేవతయైన భవానీదేవి తాండవకేళి సల్పు రంగప్రదేశంబు. ఇదియే తురుష్క యవన బర్బరాది మ్లేచ్ఛవాహినీ పతులకు గర్వనిర్భేదకరంబైన మహారాష్ట్రము.

ఇట్టిమహారాష్ట్రంబున భరతమాత దక్షిణయామ్యప్రదేశమున వేలాదురత్నస్థగితమైన మొలనూలికొనను వేలాడగట్టిన నాయకరత్నమో యనబరగు "రత్నగిరి" పట్టణము విరాజిల్లుచుండును. అట్టిరత్నగిరిని గంగాధరుని రూపమును దాల్చిన మన సూర్యభగవాను లుదయించిరి. ఆహా! గంగాధరుడు రత్నగిరి నుదయించు టెంతయు ప్రకృతిసిద్ధమే గద!

## వంశము

మహారాష్ట్రమున కలంకారభూషణమో యనబరగు నిట్టి రత్నగిరిని యుత్తమ బ్రాహ్మణవంశంబున గంగాధరు డవతరించెను. ఇదెంతయు సహజము. మహారాష్ట్ర ప్రతిభయంతయు నీ బ్రాహ్మణవంశస్థుల పరమోత్కృష్ట కార్యములమీదనే యాధారపడియున్నది. పరశురామ ద్రోణాచార్యాది బ్రాహ్మణ వీరయోధులచే పవిత్రీకృతముగ జేయబడిన మన భరతవర్షంబున మహారాష్ట్ర బ్రాహ్మణయోధు లుద్భవించి వేదవేదాంగ పారంగతులయ్యు వీరరసావేశ పరవశులై కదనరంగంబుల శత్రువుల నురుమాడి "ఇదంక్షాత్ర మిదంబ్రాహ్మ్యం" బను బిరుదము నిలుపుకొను టెంతయు మన భరతవర్షమునకు సహజాలంకారంబైన కీర్తిప్రతిష్ఠలను ప్రపంచమునకు మరియొకమారు చాటుటయే యగును గాని యిందు వింతగాని యతిశయోక్తిగాని లేశమాత్రమును లేదు. శివాజీ బాలాజీ విశ్వనాథుడు మొదలగు వీర శ్రీబ్రాహ్మణ వంశ

సంభూతులే. వీ రా దేశంబున "చిట్పవన" బ్రాహ్మణులని పిలువబడుదురు. అప్పటి బ్రాహ్మణులలో నీ చిట్పవనశాఖ యెంతయు ఖ్యాతికెక్కినది. నేటివరకును మహారాష్ట్రములో ప్రసిద్ధికెక్కిన పురుషు లందరు నీ శాఖయందే యుద్భవమైరి. మన కథానాయకుండగు గంగాధరుడు కూడ నీశాఖయందే యుదయించెను. గంగాధరుని వంశీయులు మహారాష్ట్ర చరిత్రయందు ఖ్యాతివడసిన మహామహులు. వీరి వంశము మహారాష్ట్రవంశముల కెల్ల తిలకాయమానంబుగ వెలుగుచున్నదని తెల్పుటకు "తిలక్" వంశమను పేర బరగు వీరి వంశనామమె నిదర్శనము. ఈ తిలకవంశమున జనించిన మహాత్ముడగు మన కథానాయకుడు నేడు భరతఖండంబు నంతయు "బాలగంగాధరతిలక్" అను పేరున సర్వలోకమాన్యుడయ్యెను. వీరి తండ్రిపేరు గంగాధరరామచంద్రతిలక్. గంగాధరరామచంద్రుల వారు ప్రతిమప్రతాపాఢ్యులు; విద్యాసంపన్నులు నానావిద్యాప్రవీణులు; వీరు రత్నగిరియందు ఉపాధ్యాయపదవిలో నుండిరి. పిమ్మట కొంతకాలమునకు పునహా థాణాపట్టణములలో ప్రభుత్వపక్షమున విద్యాశాఖలో "డెప్యూటీ ఎడ్యుకేషనల్ ఇన్‌స్పెక్టరు" పదవియందుండిరి. వీరి తల్లిగారి పేరు పార్వతీబాయి. ఆహా! సర్వలోకమాన్యుని కడుపారగన్న నీ యిల్లాలు తొలిజన్మంబున నెట్టి నోములు నోచెనో గదా! ఈమె తన ముద్దుకొమరుని ఒక్కింత ప్రేమతో పెంచుచు, ఇట్టి తేజోమూర్తిని గన్న తనజన్మము తరించినది గద యని లోలోపల నెంతయు సంతసించుచు తనకుమారునికి ఆయురారోగ్య భాగ్యభోగ్యము లనుగ్రహింప వలసినదని సదా భవానీదేవిని ప్రార్థించుచుండెడిది. కాని తనకుమారుడు, తన నోముల పంట, పెరిగి పెద్దవాడై తనమహోత్కృష్టకార్యములవలన దేశమునంతను నుద్ధరించి భారతీయులెల్లరచేతను సర్వలోకమాన్యుడని పొగడ్తకెక్కుచుండగ తానుకన్నారజూచి యానందించు భాగ్య మామెకు కలుగలేదు. ఏలనన మన గంగాధరుడు పదియేండ్లప్రాయము వాడై యుండగనే యామె తన ముద్దుకొమరుని భవానీదేవి పదసాన్నిధ్యమం దునిచి పార్వతీబాయి తన లోకమునకు తానేగెను. పాపము రామచంద్రులవారు సతీవియోగమునే నెంతయు కృశించి ఎట్లెట్లో తన ముద్దుబిడ్డను సంరక్షించుకొనుచుండెను. ఇట్లు కొంతకాలము తన కొమరునికి విద్యాబుద్ధులు గరపుచు 5,6 సంవత్సరములు గడపెను.

అప్పటికి మన గంగాధరునకు పదునారు సంవత్సరముల వయస్సు వచ్చెను. ఈ వయస్సునకే తలిదండ్రులు తమ బిడ్డలను బహుజాగరూకతతో కాపాడుకొనుచుండవలెను. శ్లో. "ప్రాప్తేతు షోడశేవర్షే పుత్రం మిత్ర వదాచరేత్" ఇదివరకు చేయుచుండినట్లుగ కేవలము దండనభయముచేత తలిదండ్రులు తమ బిడ్డలను తమను వశవర్తులనుగ జేసికొనుటకు వీలు లేదు. ఇప్పటినుండియు బాలురకు స్వంతత్రేచ్ఛ గలుగుచుండును. కాని తలిదండ్రులు స్వతంత్రేచ్ఛను త్రుంచివేయకుండ దానితోబాటు ముందు జీవితకాలములో తాను తెలుసుకొనవలసిన బాధ్యతలను, కష్టనిష్ఠురములను వారికి బాగుగ తెలియజెప్పి, యీ స్వతంత్రేచ్ఛను మంచి మార్గమున నడిపించునట్లు వారిని మంచిమాటలతో సన్మార్గప్రవర్తకులను జేయు భారము తలిదండ్రులయందు

గలదు. ఒక మనుష్యుడు సన్మార్గుడగుటయు లేక దుర్మార్గుడగుటయు. నీతియున్ననే నిర్ణయమగును. అట్టి సందిగ్ధ తరుణములో, తండ్రి ముందునడచుచు తన కొమరునికి సన్మార్గమును జూపింపవలసిన యత్యవసర సమయములో మన గంగాధరుఁడు తన తండ్రిని గోల్పోవలసినవాడాయెను! ఆహా ఇకముందు మన గంగాధరుని జీవిత మెంత కష్టసాధ్యమగునో చింతింపుడు. అయినను మన గంగాధరు డసామాన్యమానవుడుగాన, తనకు విద్యాబుద్ధులు గరపువారెవరును లేకపోయినను, తాను దుర్వృత్తివంక బోక సన్మార్గమునే యనుష్ఠించుచు. ద్రవ్యోపపత్తికి లోపములేదు గాన కాలక్రమమున పరిపూర్ణవిద్యను సంపాదింపగలిగెను. ఆకాలపు టాచారము ననుసరించి హూణ విద్యాభ్యాసము చేసెను. ఆవ 1876 సంవత్సరములో బి. ఏ పట్టభద్రుడాయెను. తిరిగి 1879 సంవత్సరములో న్యాయశాస్త్రమునం దుత్తీర్ణుడై బొంబాయి విశ్వవిద్యాలయములో ఎల్. ఎల్. బి. పట్టమును బడసెను.

## దేశచింత—దీక్షాస్వీకారము

ఇప్పటికి విద్యాభ్యాసము పూర్తియైనది. ఇక నేమిచేయవలెను? స్వోదర పోషణార్థమై ప్రభువులయొద్ద సేవావృత్తి నంగీకరింపవలెనా. లేక న్యాయవాదవృత్తి నవలంబించి ధనరాసులు గణింపవలెనా? సాధారణముగ నిప్పటికాలపు యువకులకీ రెండుమార్గములే తప్ప మరి వేఱుమార్గ మేమియును గోచరము కాదు. కాని మన గంగాధరుఁడీ రెండు మార్గములను దాటి, వీని యన్నిటికంటె నతీతమైన ధర్మపథమును తన జ్ఞాననేత్రమను తృతీయ నేత్రముచే వీక్షించి గంగాధర నామమును సార్థకము చేసికొనెను. తన ఫాలలోచనము నొకసారి విప్పి, యాసేతుహిమాచలపర్యంత భూభాగము నొకసారి వీక్షించెను. ఈ పుణ్యభూమి యొక్క తొల్లింటి యౌన్నత్యము నొకసారి స్మరణకు తెచ్చికొనెను. వెంటనే నేత్రము లశ్రుపూరితము లయ్యెను. హృదయము తప్తమయ్యెను. కాని తనహృదయమును చలింపనీక పట్టియుంచి ఒక్కక్షణము నిమీలితనేత్రు డయ్యెను ఆ! హృదయమును దిట్టపరచుకొనెను. ప్రతిజ్ఞ చేసికొనెను. దీక్షను స్వీకరించి దీక్షితు డయ్యెను. "ఈ భారతభూమిని తొంటి యౌన్నత్యమునకు తేవలెను." — ఇదియే దీక్ష, యిదియే ప్రతిజ్ఞ. మాతృదేశము పరాధీనమై మహోత్కృష్టమైన సనాతన ధర్మ మన నేమియో యొక్కింతయు మెరుంగని విదేశీయాధికార ధూర్వహుల చేతులలో జిక్కి శల్యమై, కళావిహీనమై పడియున్నతరిని దైవాంశసంభూతుడైన నీభారతవర్ష కుమారుడు తానుకన్నార జూచుచు నెట్లూరుకొనగలడు? తానెట్లు విదేశీయాధికార ధూర్వహుల కొలువులో జేరి దేశదౌర్భాగ్యమును మరింత యెక్కువ జేసి, తానెట్లు దేశద్రోహి కాగలడు? కాన తన జీవితము నంతను మాతృదేశారాధనకై వినియోగింప నెంచెను. తన కెన్ని కష్టములు వచ్చినను చింతింపక, నిశ్చల నిర్మల మనోభావముతో, ఉత్సాహమును గోల్పోక, ప్రజాపక్షమును జారవిడువక, ప్రతిజ్ఞను మరువక, ఫలాపేక్ష లేక, నిష్కా-

కర్మయోగాచార్యుండై తన స్వధర్మమును నెరవేర్ప బద్ధకంకణు డయ్యెను. అవతారపురుషులగు నిట్టివారు గాక మరెవ్వరు గలరు?

## మిత్రవర్గము; పాఠశాల; కేసరీ మరాటాపత్రికల స్థాపనము

లోకమాన్యుడు తనస్వధర్మము నెట్లు నెరవేర్చెనో చూచెదము గాక! వీరి తండ్రి కొంతకాల ముపాధ్యాయపదవిలో నుండెనని చెప్పియుంటిమి. "అవశ్యంపిత్రాచారమ్మని" వీరుకూడ నొకపాఠశాల నేర్పరచి, బాలురకు విద్య గరప మొదలిడెను. ఇది గవర్నమెంటువా రేర్పరచిన "స్కూలు" కాదు. తాను తన స్నేహితులగు "అగార్కర్" గారను కలిసి మొదట తాము స్వంతముగ నొకపాఠశాల నేర్పరచిరి. వీరిద్దరిట్లు పని చేయుచుండగ కొంతకాలమునకు "విష్ణుకృష్ణచిప్లుంకర్" గారను వారొకరు వచ్చి వీరితోపాటు పనిచేయుచు వీరికెంతయో సాయముగ నుండిరి. వీరు పాఠశాలను క్రమముగ వృద్ధిపరచి 1880 సం॥న పూనా పట్టణములో "నూతనాంగ్ల పాఠశాల" నొకదానిని స్థాపించిరి. వీరికి సహాయము చేయుటకై "ఆప్టే", "నామజోషి" యను మరి యిరువురు మిత్రులు వచ్చి యీ పాఠశాలలో బనిచేయుచుండిరి. మహారాష్ట్ర పాండవులనఁగు నీ యైదుగురు మిత్రవర్గము కలిసి యీ పాఠశాలకై తమ శక్తి వంచనలేక పాటుపడుచుండిరి.

## కొల్హాపురసంస్థానము-విమర్శన; కారాగారశిక్ష

ఈ పాఠశాలతోపాటు వీరు "కేసరి" "మరాటా" యను రెండు వార్తాపత్రికలను గూడ నెలకొల్పిరి. ఈ రెండువార్తాపత్రికలను చిప్లుంకర్ గారిచే స్థాపింపబడిన ఆర్యభూషణ ముద్రాక్షరశాలయందు అచ్చు వేయించుచుండిరి. ఈ పత్రికలలో రాజకీయ విషయములను గూర్చియు, దేశముయొక్క యితర స్థితిగతులను గూర్చియు సర్వజనవిదితముగ వ్యాసములు ప్రకటింపబడుచుండెను. అందువలన రాను రాను ఈ పత్రికల ఖ్యాతి మహారాష్ట్రదేశమునం దంతటను విరివిగ వ్యాపించి దేశమున కెంతయో మహోపకారిగ నుండెను. అహా! లోకమునకు మేలుచేయ దలచుకొనినవారి కన్నియును విఘ్నములేకద. "శ్రేయాంసి బహువిఘ్నాని" యని పెద్దలు చెప్పియే యున్నారు. ఈ పత్రిక లిట్లు విరివిగ దేశమునం దంతటను అల్లుకొనుచున్న సమయమున కొల్హాపుర సంస్థానములో నొక గొప్ప యాందోళనపుట్టెను. ఆసంస్థానాధిపతి పేరు "శివాజీరావు గారు." ఆ సంస్థానములో గవర్నమెంటు పక్షమున రీజెంటు కర్భారిగ నుంపబడిన యాతడే మహారాజాగారిని పరిభవించెను. మన స్వదేశసంస్థానాధిపతికి గలిగిన యిట్టి యవమానమును కేసరీ మరాటా పత్రికాధిపతులు సహింపజాలక యీ చర్యను తమపత్రికలలో నిర్భయముగ ఖండించిరి. ఇట్టి తీవ్ర విమర్శవలన గవర్నమెంటువారికి తలనొప్పి యెత్తెను. వెంటనే గవర్నమెంటువారు ఈపత్రికాధిపతులమీద రాజద్రోహ నేరమును మోపిరి. ఈ కేసువిచారణ జరుగుచుండగనే చిప్లుంకరుగారు స్వర్గస్థులైరి; గాని మిగిలిన తిలక్, అగార్కారు గార్లను నేరస్థులని యెంచి వారిద్దరికిని నూరు దినముల కారా

గారశిక్షను (విడిశిక్షయను) విధించిరి. ఆహా! యెంత చిత్రము! సేవచేయబోయిన కీడెదురయ్యెను. అయినను, ఎట్టికష్టములు వచ్చినను, వానినెల్ల తృణప్రాయములుగ నెంచి, తన స్వధర్మమును నెరవేర్ప దీక్షితుడైన వానికి కారాగారవాస మొక యాటంకము కానేరదు. ఆహా! ధీశాలుర సిద్ధి పారేగదా. తమ మిత్రులు చెరసాలయందు బంధింపబడినందులకై "ఆప్టే" "నామ్‌జోషి" యను వీరిరువురును లేశమైనను జంకక తాము మొదట బూనుకొనిన కార్యమును నెరవేర్చుచునే యుండిరి. దానిని మాత్రము వారు జారవిడువలేదు. అది గాక ప్రజాక్షేమముకొరకై పాటుపడుచున్న తిలక్, అగర్కారు గారిరువురును అన్యాయముగ చెరసాలను జెందినారని చింతించి ప్రజలందరును వారిరువురియెడ నత్యంతప్రేమ జూపసాగిరి. వారు స్థాపించిన పాఠశాలను ప్రజలందరును తమ కన్నబిడ్డవలె నత్యంతప్రేమతో జూచుచు దానిని పోషింపసాగిరి. ఇప్పటికి ప్రజలకు తిలక్ మహాశయుని యెడ నున్న భక్తి పరిపూర్ణముగ తెలియవచ్చెను. ఆహా! కీడులో కూడ మేలొనగూడి యుండును గదా!

## దక్కను విద్యాసంఘస్థాపనము : భిన్నాభిప్రాయములు : రాజీనామా

చెరసాలనుండి విముక్తులైనపిదప తిరిగి వీరు దేశోపకారకార్యముల యందే ప్రవేశించిరి. ఆ 1884 సం॥ లో వీరందరును "దక్కను విద్యాసంఘము" (Deccan- Educa-tional Society) అను దానినొకదానిని స్థాపించి, యీసంఘముయొక్క యాజమాన్యము క్రింద "ఫర్గూసన్ కళాశాల" యను నొక గొప్ప జాతీయకళాశాలను స్థాపించిరి. అందు వీరందరును కొద్దిజీతములను పుచ్చుకొనుచు నుపాధ్యాయులుగ నుండిరి. మన గంగాధర్ తిలక్ గారా కళాశాలలో గణితశాస్త్రము, రసాయనశాస్త్రము, సంస్కృతము మొదలగునవి బాలురకు బోధింపుచుండెను. వీరు తమ నిరుపమాన పాండిత్యము వలనను, దేశభక్తి మతభక్తి విద్యాసక్తిని పురికొల్పు నుత్సాహకరములగు వాక్యములవలనను తమ సహజ సౌహార్దము వలనను, విద్యార్థులప్రేమకు పాత్రులై తొల్లింటి గురుకులాశ్రమ విధానమును, తొల్లింటి గురుశిష్యన్యాయమును యీనాటి వారికి గోచరింప జేసెను. ఈకళాశాలకై దొరతనమువారి సహాయము నేమియు గోరక తామంతట తామే స్వతంత్రముగ నీకార్యము నెరవేర్పవలయునని తిలకుగారి పట్టుదల. కాని తమ మిత్రులు దీనికి సమ్మతింపలేదు. అందువలన వీరిలో వీరి కభిప్రాయభేదములు ఘటిల్లుటచే, 1891 సం॥ న తిలకుగారీ కళాశాలతో సంబంధమును వదలుకొనవలసినవారైరి. అవును! దొరతనమువారి సహాయమేమియు నపేక్షింపగూడదని తన యంతరాత్మ బోధించుచుండగ తా నెట్లా కళాశాలలో పనిచేయగలడు? ఏమి! ఒకరిసహాయములేకుండ మనంతట మనమే యీ చిన్నకార్యమును నెరవేర్పజాలమా? ఇదెంతయు మన యాత్మగౌరవమునకు లోపమని యెంచి తిలకుగారీ కళాశాలతో తమ సంబంధమును వదలుకొనిరి.

## సంఘసంస్కరణము: భిన్నాభిప్రాయము: మిత్రవర్గముతో చీలిపోవుట

మతసాంఘికవిషయములలో నిదివరకే తిలకుగారికిని అగర్కారుగారికిని అభిప్రాయభేదము లేర్పడెను. తిలకుగారు హిందూమతము నందును, సనాతనధర్మములందును, అత్యంతమైన అభిమానము గలవారు. హిందూమతసారమును బాగుగ గ్రహించినవారు. హిందూమతము సర్వమతసారమని యాయన దృఢనిశ్చయము. సర్వమతములను కన్నతల్లివలె తనలో నిముడ్చుకొనగలిగినది వేదమతమే యని వారి నిశ్చితాభిప్రాయము. అయినను కాలక్రమమున మనహిందూసంఘములోనికి కొన్ని దురాచారములు ప్రాకివచ్చినవని మాత్రము వారొప్పుకొందురు. వీని నన్నిటిని సనమే క్రమముగ విశేష ప్రయాసలేకుండ ఇతరుల ప్రమేయము లేకుండ నిమ్మదిగ సవరించుకొనవలసియున్నది; సవరించుకొనవలసినదేయని వారు నొక్కి చెప్పుచున్నారు. సంఘసంస్కర్తల మని పట్టి యాడంబరములు జేయుచు, హిందూసంఘమున సెట్టిమహోత్కృష్టమైన సంఘమో యెరుంగక విదేశీయులైన దొరలయొద్దకు బోయి “మా సంఘము పట్టి పనికిమాలిన సంఘ”మని మాతృద్రోహపూరితములైన వాక్యములు పలుకుచు ఆ దొరలచే మెప్పుబడయుగోరువారు నిజముగ సంఘసంస్కర్తలు గారనియు దేశద్రోహులనియు వారి గట్టి యభిప్రాయము. సంఘసంస్కర్తలమని చెప్పువారేగాని చేయువారు బహు కొద్దిమంది మాత్రమే గలరు. కాని తిలకుగారు మాత్రము నిజమైన సంఘసంస్కర్త యని నిస్సందేహముగ జెప్పవచ్చును. వీరు తాము చెప్పినదానినే తప్పక చేయుదురు. “ఇతడు తనకొమారితను నెనవు జెప్పెను. ఆ బాలికకు యుక్తవయస్సు వచ్చు పర్యంతము వివాహము సేయలేదు. బ్రాహ్మణేతరుల మాన్ప సద్యమించెను. తక్కువజాతి వారికి విద్య నేర్ప నాతడు పాఠశాలలను స్థాపించెను. వారిని ఉత్తమజాతివారికి సములుగ చేయ నెంచెను.” ఒకసారి గణపతియుత్సవ సందర్భములో నొక మాలవానిని ఎవరును చెంతకు జేరనీయకుండుటను జూచి, యీయన వానిని వెంటనే తనవద్దకు రమ్మని పిలిచి తన బండిలో కూర్చొండబెట్టుకొని పోయెను. మొదట మనసంఘమును బాగుపరుచుకొనినగాని మనము స్వరాజ్యమును బొందనర్హులము గామని చెప్పువాదములు కేవలము పట్టిపనికిమాలినవాదము లనియు మనకు స్వరాజ్యమివ్వకుండ తప్పించుకొనుటకై యితరులు చెప్పు సాకులనియు వారు ఖండితముగ జెప్పిరి. సంఘసంస్కరణమునకును రాజకీయాధికారములకును సంబంధమేమి కలదు? ఇట్టి యభిప్రాయములతో అగర్కారుగారు ఏకీభవించనందున వారు 1888 సం॥ లో “కేసరి” పత్రికతో సంబంధమును వదలుకొని “సుధారక్” అను వేరొకపత్రికను స్థాపించిరి. పిమ్మట తిలకుగారే “కేసరి” “మరాటా” పత్రికల కధిపతి యయ్యెను.

## న్యాయశాస్త్ర పాఠశాలలు: దేశసేవాంగములు పరచుట: విమర్శనము

ఫర్గూసన్ కళాశాలతో సంబంధమును వదలుకొనినప్పటినుండియు తిలకుగారు స్వయముగ తానొక చిన్నపాఠశాలను స్థాపించి దానిలో ప్లీడరు పరీక్షకు చదువువిద్యా

సంబంధము కలదు. ఈ రెండు వలయములును కలియుచోటికి "విషువన్" స్థానమని పేరు. సూర్యుడీ "విషువన్" వద్దకు వచ్చినప్పుడు రాత్రింబవళ్ళు సమముగనుండును. వసంత ఋతువు ప్రారంభమగును. ఇదియే నూతన సంవత్సరాది.

ఈ విషువన్ స్థానము స్థిరముగ నుండునా లేక చలించునా? రాశిచక్రము స్థిరముగ నుండుననియు, ఖగోళమధ్యరేఖ చలింపుచుండుననియు ఇదివరకు చెప్పియుంటిమి. కనుక ఈ రెంటియొక్క సంధిస్థానమగు 'విషువన్' స్థిరముగ నుండజాలదు. ఈ విషయము మతిసూక్ష్మము. ఈ విషువన్ స్థిరముగ నుండనిచో సంవత్సరాది కూడ చలింపుచుండును. వసంతర్తువు స్థిరముగ నుండదు. దీనిననుసరించి ఋతువులు అయనములు, సంవత్సరము పొడవునను జరుగు యజ్ఞయాగాదిక్రతువులు నక్షత్రములను మార్పుచెందుచుండును. ఇవి యిట్లు మార్పుచెందినట్లు వేదములనుండి శ్రీలోకమాన్యులు ప్రమాణములను జూపియున్నారు. ప్రస్తుతము ఈ విషువన్ స్థానము అశ్వినీ నక్షత్రమును గడచి క్రమముగ రేవతిలోనికి పోవుచున్నది. అందువల్లనే సూర్యుడు మీనరాశిలో నుండగనే మన కిప్పుడు వసంతర్తువు ప్రారంభమగుచున్నది. ఈ యంశమును గుర్తింపకుండ గుణించిన పంచాంగములకును క్రియలో జరుగుచున్నదానికిని విశేష తారతమ్యము గానిపించుచున్నది. పూర్వ మొకప్పుడీ విషువన్ స్థానము 'మృగశీర' లో నుండెననియు, పిమ్మట కాలము గడచినకొలదియు ఈ విషువన్ స్థానము క్రమక్రమముగ వెనుకకు జరుగుచు రోహిణి, కృత్తిక, భరణి నక్షత్రములను గడచి యిప్పుడు అశ్వినీ నక్షత్రములోనికి వచ్చి తిరిగి వెనుకకుగ రేవతీ నక్షత్రమును జేరుచున్నదని లోకమాన్యులు సెలవిచ్చియున్నారు. వీని కన్నిటికిని వేదప్రమాణములను జూపిరి.

ఈ 'విషువన్' స్థానమిట్లు వెనుకకు జరుగుచువచ్చినందున, దీనితో సంబంధించిన నూతన సంవత్సరాది వసంతర్తువు, మొదలైనవి సైతము తదనుగుణముగ మార్పు చెందుచుండెను. నూతన సంవత్సరాది యిట్లు మార్పు చెందెననుటకు వేదములందనేక నిదర్శనములను లోకమాన్యులు చూపియుండిరి. ఒకప్పుడు సూర్యుడు మృగశీర్షలో నుండగ సంవత్సరారంభ మయ్యెననియు, ఇట్లే క్రమముగ రోహిణి, కృత్తిక, భరణి మొదలగు వానిలో సూర్యుడుండగ నూతన సంవత్సరము ప్రారంభ మయ్యెనని వేదములయందు ప్రమాణములు గలవు. ఇప్పుడు అశ్వినీ నక్షత్రముతో నూతనసంవత్సరము ప్రారంభమగుచున్నదనుట సుప్రసిద్ధమే గదా. ఇంక కొంతకాలము గతించినపిమ్మట సూర్యుడు రేవతిలో నుండగనే నూతనసంవత్సర ప్రారంభమగును. [రాత్రింబవళ్లు సమముగనుండుటయు, వసంతర్తువు ప్రారంభమగుటయు, నూతనసంవత్సరాదికి చిహ్నములు.] వేదములలో కొన్నిచోట్ల ఆర్ద్ర, పునర్వసువులతో నూతనసంవత్సరారంభ మైనట్లు సూచనలు గలవట. వానిమాట యెట్లున్నను, ఒకప్పుడు మృగశీర్షతో సంవత్సరారంభ మయ్యెనని చెప్పుటకు బలవత్తరములగు ప్రమాణములు వేదములందు గానిపించుచున్నవి. కనుక నింతవరకు నిస్సందేహముగ చెప్పవచ్చును.

కనుక నిట్టిప్రకృతివైచిత్ర్య మెంతకాలముక్రింద జరిగి యుండవలెను? విషువన్ స్థానము మృగశీర్షలోనుండి అశ్వని నక్షత్రములోనికి జరిగివచ్చుట కెంతకాలము పట్టును? లెక్కజేసి చూచెదము: ఈ విషువన్ స్థాన మిట్లు చలించుటకు కారణము భూమియొక్క యిరుసు చలించుటవలననే గదా. భూమియొక్క యిరుసొకచుట్టు (అనగ 360 డిగ్రీలు) తిరుగుటకు 26 వేలసం॥ లు పట్టునని చెప్పితిమి. అవిధముననే ఈవిషువన్ స్థానము 360 డిగ్రీలు తిరిగివచ్చుటకు 26 వేలసం॥ లు పట్టును. మృగశీర్ష అశ్వినులమధ్య 66 2/3 డిగ్రీలున్నవి; ఒకప్పుడు ఆర్ద్రా, పునర్వసులలో విషువ మండెననుటకు దృష్టాంతములు గలవు గనుకను, ఇప్పుడు అశ్వనిని కూడ దాటి రేవతిలోనికి పోవుచున్నందునను ఈ రెండు చిల్లరలక్రింద మొత్తముమీద నొక నక్షత్రప్రమాణము (అనగ $13\frac{1}{3}$ డిగ్రీలు) కలుపుకొనవచ్చును. దీనిబట్టి వేదకాలమునకు నిప్పటికిని కనీసము 80 డిగ్రీలు గడచినదని చెప్పవచ్చును.

360 డిగ్రీలు తిరుగుటకు 26000 సం॥ లు పట్టినయెడల

80 డిగ్రీలు......... $\frac{26000}{360} \times 80''$ 5777 సం॥లు అనగ 6000సం॥లు పట్టును. కనుక వేదకాలమప్పటికి 6 వేల సం॥ లకు పైన నుండవలసినదేకాని, యీలోపుగ నుండుటకు వీలులేదని శ్రీ లోకమాన్యులు సిద్ధాంతము చేసిరి. ఇట్టి యనుపమాన మేధాసంపత్తికి పాశ్చాత్యలోక మంతయు నివ్వెరపాటు నొందెను.

## "బాపట్" యభియోగము

తిలక్ మహాశయునియొక్క సంస్కృత పాండిత్యమును వేదవిద్యయందు వారికి గల యసాధారణప్రజ్ఞను మనము చూచితిమి. ఇట్టి వేదవేదాంగ పారంగతుడు మొదట తాను ఎల్. ఎల్. బి. పరీక్ష నివ్వగనే న్యాయవాదవృత్తి నవలంబించి యుండినయెడల దానియందు తా నెంతఖ్యాతి గడసి యశేషధనరాసుల గడించెడివాడో మన మీక్రిందివిషయమువలన తెలిసికొనగలము. ఆకాలములలో బరోడా సంస్థానములో రావుసాహెబు బాపట్ గారనువారొకరు సెటిల్మెంటు డిపార్టుమెంటులో నొకగొప్పయధికారిగ నుండెను. వీరు తిలక్ గారికి ప్రాణస్నేహితులు, ఇట్లుండగ బాపట్ గారిమీద నేవోకొన్ని నేరములు మోపబడెను వీ రేవో అబద్ధపు లెక్కలను వ్రాసిరనియు, లంచములు పుచ్చుకొనిరనియు అన్యాయముగ కేసువచ్చెను. వీరియొక్క ప్రతిష్ఠను భంగము కలుగజేయదలచుచు కొందరు కుట్రదారులు చేరి యీపని చేసిరి. వీరిమీద నీ కేసు రాగనే దేశమంతయు నట్టుడికినట్లుడుక నారంభించెను. ఇట్టిసందిగ్ధతరుణములో తనప్రాణస్నేహితునకు గలిగిన నిందాపవాదమును తొలగించవలయునను సుహృద్భావముతో తిలక్ గారు వెంటనే యచ్చటకిపోయి వారికి తోడ్పడి తనమిత్రునిపక్షము పూని న్యాయసభలో వాదించి జయమొంది తనప్రాణ

స్నేహితుని కాపాడగలిగెను. ఆహా ! నిజముగ మిత్రులన నిట్టివారేగద ! ఆపత్సమయమున తోడ్పడువారే నిజమైన మిత్రులు. దీనివలన తిలక్ మహాశయు డెట్టి సుహృద్భావము కలవాడో మనకు తేటపడుచున్నది.

## జాతీయ సభా సంపర్కము

ఇంతవరకును కాలమొకరీతిగ గడచినది. ఇక తిలక్ మహాశయుడు రాజకీయ రంగమున దుముకనున్నాడు. ఆ 1885 సం॥ లో దేశాభ్యుదయమును గోరిన మహామహులు కొందరు అందు ముఖ్యముగ శ్రీయుత దాదాబాయి నౌరోజీగారు జాతీయ మహాసభ యను కాంగ్రెసు సభను స్థాపించిరి. ఈసభలో ప్రతిసంవత్సరమును యావద్భారతవర్షమునకు సంబంధించిన విషయములన్నియు చర్చకువచ్చును. దేశమునం దప్పటి కప్పు డుత్పన్నములగు క్లిష్టసమస్యలనెల్ల మనమే స్వయముగ పరిష్కరించుకొనుట కేర్పడిన స్వయంనిర్ణయ ప్రతిష్ఠాపనమిదియే. (self determining body) ఈ సభ పుట్టిననాటినుండియు దేశమున కెంతయో మేలొనగూర్చినది. ఇక నొనగూర్చనున్నది. ఇట్టి మహాసభకు భారతీయు లెల్లరును కృతజ్ఞులై యుండి దానిని దైవసమానముగ పూజింపవలసిన ధర్మమై యున్నది. కేవలము దేశోద్ధరణకై జన్మమెత్తి యుద్ధానికై కంకణము గట్టుకొనియున్న మన లోకమాన్య తిలక మహాశయుడు తానెట్లు జాతీయసభతో సంబంధములేక యెడముగ నిలచి యూరక చూచుచుండ గలడు ? జాతీయమహాసభ బయలుదేరిన రెండుమూడు సంవత్సరములకే తిలకుగారు దానిలో జేరి తానుకూడ పాటుబడ నారంభించెను. జాతీయమహాసభా పక్షమున దక్షిణ హిందూదేశ స్థాయీసంఘమునకు వీరు కార్యదర్శులుగ నుండిరి. బొంబాయి రాష్ట్రీయసభను మొదటి యైదుసంవత్సరములును జయప్రదముగ జరిపించెను.

## శాసననిర్మాణసభ్యత; విశ్వవిద్యాలయసభ్యత;
## పురపాలకసంఘసభ్యత

బొంబాయి శాసననిర్మాణసభలో వీరు పదిసంవత్సరములు ప్రజాపక్షమున పనిచేసిరి. బొంబాయిరాజధానిలో నుండు ప్రజలు వీరినే రెండుపర్యాయములు తమ ప్రతినిధిగ నెన్నుకొనిరి. వీరా సభలో నున్నంతకాలమును తమ పట్టుదలను వదలక ప్రజాపక్షమును జారవిడువక కృషి సలిపి తమ దేశప్రజల కృతజ్ఞతకు పాత్రులైరి. అదిగాక బొంబాయి విశ్వవిద్యాలయములో వీరు సభికులుగనుండి దేశీయవిద్యార్థుల పక్షమున వాదింపుచు దేశమునందు విరివిగ విద్యను వ్యాపింపజేయ సాయపడిరి. ఆవ 1895 సం॥ లో పునహా మ్యునిసిపాలిటీలో సభ్యులుగ ప్రజలచే నెన్నుకొనబడి పట్టణపారిశుద్ధతకై యెంతయో వీరు శ్రమపడిరి. ఆసంవత్సరమే జాతీయమహాసభ

యొక్క పదునొకండవ సమావేశము పునహాపురిలో జరిగెను. ఆ సభకు వీరు కార్య

దర్శిగ నెన్నుకొనబడిరి. ఇట్లుండగ కొన్నిచిక్కులు ఉపస్థించెను. జాతీయమహాసభతో పాటు సంఘసంస్కరణసభ కూడ ఆసంవత్సరము పునహాలో జరుగవలసివచ్చెను. జాతీయమహాసభ జరుగుచోటనే, అపందిరిలోనే యీమతసంబంధమైన సంస్కరణ సభకూడ జరుగవలయుననికొందరు పట్టుబట్టిరి. కాని దానికి తిలకుగారు సమ్మతింప లేదు. తన మనస్సాక్షికి వ్యతిరేకముగ ప్రవర్తింపనివాడగుటచే వెంటనే తన కార్యదర్శిపదవిని వదలుకొనెను. కాని తాను పదవిని వదలుకొనను కాంగ్రెసు సభను జయప్రదముగ కొనసాగించుటకై మిక్కిలి పాటుపడి సహాయము చేసెను.

## శివాజీయుత్సవము: జాతీయప్రబోధము: ప్రజానురంజకము

ప్రస్తుతము మన భారతవర్షమునకు సంభవించిన నీ యతినీచస్థితినిబాపి యీ కర్మభూమిని తొల్లింటి యున్నతస్థితికి తీసికొనివచ్చుటయే లోకమాన్యుల పరమ సంకల్పమని చెప్పియుంటిమి. ఇదెట్లు సాధ్యముకాగలదు ? ఈపనిని నిర్వహించుటకు పూర్వము దేశముయొక్క నిజస్థితిగతులను అజ్ఞానమున మునింగియున్న ప్రజలకు తెలియజెప్పి తొల్లింటి మన యౌన్నత్యమును వారికి స్మరణకు తేవలయును. పూర్వము మన దేశములో నెట్టి మహాపురుషు లుద్భవించిరో, వీరే పరమోత్కృష్ట కార్యములను జేసిరో, మన జాతియందును మన మతమునందును గల ప్రాశస్త్యమెట్టిదో ప్రజల మనస్సునకు బాగుగ నాటునట్లు చెప్పవలసి యున్నది. మన మొకసారి మన పూర్వుల చరిత్రను స్మరించి నప్పుడుగాని, భారత రామాయణాది మన జాతీయోద్గ్రంథములను పఠించినపుడు గాని మన దేహ మెట్లు పులకలెత్తునో వేరుగ జెప్పవలెనా ? మన కెన్ని కష్టములు వచ్చినను మన మెట్టి యధోగతిని బడి యున్నను, ఒక్కసారి ఆ శ్రీరామచంద్రుల చరిత్రను స్మరించినయెడల మన మనస్తాపములన్నియు శమించి, చెప్పుటలేని యుత్సాహము కార్యదీక్షాపరత్వము మనలో నుద్భవించునుగద. మానవుని జీవితయాత్ర కత్యంతోపయుక్తములైన యట్టి పూర్వవీరుల జీవితచారిత్రములను మనము మరచిపోకుండుటకై మనవారు ప్రతిసంవత్సరమును వీనిని ఉత్సవరూపములుగను, పండుగల రూపములుగను, తరతరములవరకు, సంతతము, స్మరించుచుండవలసిన దని గట్టి యేర్పాటులు చేసియున్నారు. మత సంబంధమైనట్టియు ఆధ్యాత్మికసంబంధమైనట్టియు నిట్టిపండుగలు, యుత్సవములును మనకనేకములు గలవు. కాని రాజకీయ సంబంధమైన జాతీయోత్సవము లేమియును మనకంతగ లేవు. ఈ కొరతను బాపుటకై యిప్పటి దేశకాలపాత్రాదుల కత్యంతోపయుక్తమైన జాతీయోత్సవము నొకదానిని తిలక్ మహనీయుడు బయలు దేరదీసెను. దీనికే "శివాజీఉత్సవము" అనిపేరు. పూర్వము మన దేశమంతయును ఔరంగజేబుయొక్క దుర్భరమైన ప్రభుత్వముక్రింద నణగియున్న తరిని, శివాజీ యను మహావీరపురుషుడు, మహారాష్ట్రమునం దుద్భవించి ఆప్రభుత్వముబాపి

నుండి దేశమును రక్షించి మహారాష్ట్రరాజ్యమును స్థాపించి, మహారాష్ట్రుల నందరనొ యేకజాతివారినిగ జేసి మహారాష్ట్రుల జాతీయస్వత్వమును తేజోవంతముగ ప్రకాశించు నట్లుచేసిపోయెను. అట్టిమహాపురుషుని జీవితచారిత్ర మెంతయును పూజనీయముగద. అట్టిచరిత్రను చదువుటవలన నొక్క మహారాష్ట్రులకేకాక, అఖిలభారత కుమారులకును దేహము పులకరించును. విదేశీయాధికార ఘోర్వ్యూహులక్రింద బడియున్న మనజాతివారి కీ శివాజీ జీవితచారిత్రము తారకమంత్రము. దేశప్రజలలో నణగి మరుగుపడియుండి నిద్రించుచున్న యుత్సాహశక్తులను, వీరరసావేశమును దేశభక్తిని సౌభ్రాత్రృత్వమునొ మేల్కొల్పుట కీశివాజీయుత్సవమువంటిజాతీయోత్సవము లెంతయుమహోపకారములు.

ఈ ధర్మరహస్యమును బాగుగ గుర్తెరింగినవాడు గాన తిలకుమహాశయుడు మహారాష్ట్రదేశోద్ధారకుడైన శివాజీయొక్క జయంత్యుత్సవమును, (1894 సంవత్సరములో) బయలుదేర దీసెను. దీనికై మొదట రాయఘుర్ కోటలో నున్న శివాజీ యొక్క సమాధిని మరమ్మతు జేయించి యుత్సవాదులను జరుపుటకై దేశమంతయు సంచారముచేసి ద్రవ్యమును ప్రోగుచేసెను. తన కేసరీపత్రికలో శ్రీ శివాజీమహారాజును గూర్చి యుత్సాహపూరితలైన వ్యాసములను వ్రాసి శ్రీ శివాజీయొక్క కార్యదీక్షను అతని దేశభక్తిని అతని శౌర్య ధైర్య సాహసాది వీరపురుషోచితలక్షణములను వేనోళ్ల నుగ్గడించెను. ఈవ్యాసములనుజదివి మహారాష్ట్ర దేశమంతయునుత్సాహపూరితమయ్యెను. తమ తొల్లింటి యౌన్నత్యమును వారు మనోనయనానందకరముగ జూడగలిగిరి. తమ దేశోద్ధారకుడైన శ్రీ శివాజీమహారాజు వారికంట్లయెదుట ప్రత్యక్షమై వారిని అత్యంత దేశభక్తిపూరితులనుగ జేసెను. తొల్లింటి వీరాధివీరుల యశోగీతములను గానముజేసి తమ మేనులను మరపించజేసిన శ్రీతిలకు మహాత్ముని దేశప్రజలందరును శ్రీ శివాజీమహారాజుతో సమానముగ ప్రేమించి పూజింపనొడగిరి. శ్రీ శివాజీయుత్సవదినమున లక్షలకు లక్షలప్రజలు రాయఘుర్ కోటలో శ్రీ శివాజీసమాధివద్ద జేరి, అత్యంతవైభవములో కాలమునుగడపి, తమ జన్మములు తరించినవిగదా యను పరమానందములో మునిగి పోయిరి. మహారాష్ట్రదేశమంతయు నొక్కసారి యేకమనస్సుతో శ్రీ శివాజీమహారాజును స్మరించెను. తమ దేశమును తిరిగి తొల్లింటి యున్నతస్థానమునకు తీసికొని వచ్చినగాని తాము నిదురింపగూడదను గాఢాభిమానము ప్రజలమనస్సులలో నొక్కిపెట్టునట్లుగు లొక్కవెను. తమ జన్మభూమియం దిట్టి గాఢాదరము పుట్టునట్లు చేయుటయే శ్రీ తిలకుగారి ముఖ్యోద్దేశము. ఈ యుత్సవసందర్భములలో రాయఘుర్ కోటలోని శ్రీ శివాజీమహారాజుగారి సమాధివద్ద చేరియున్న యసంఖ్యాకులగు మహారాష్ట్రప్రజలకు శ్రీ శివాజీయొక్క యనంతకళ్యాణగుణములు బాగుగ తెలియజెప్పుటకై అచ్చట తిలకుగారు శ్రీ శివాజీనిగూర్చి యుపన్యాసము లిచ్చుచుండెను. ఇట్టియుత్సవములను ఏటేటను పట్టువిడువక చేయుచునే యుండెను.

## గణపతియుత్సవము

ఈ శివాజీయుత్సవముతోపాటు గణపతి యుత్సవము నొకదానిని గూడ నీతడు బయలు దేరదీసెను. ఈ యుత్సవము లన్నిటిని జూచి ప్రభుత్వమువారు విశేషముగ భయపడసాగిరి. ఇంగ్లీషుపత్రికలన్నియును, ఈ యుత్సవోద్దేశములకు పెడర్థములులాగి, యీ యుత్సవములు కేవలము మహమ్మదీయులకును హిందువులకును పోరాటపెట్టవలయునను తలంపుతో తిలక్ గారు బయలుదేరదీసెనని యకటావికటపు వ్రాతలను వ్రాసి, మహమ్మదీయులను హిందువులపై నుద్రేకింపజేయ జూచెను. కాని యిట్టిదేశద్రోహకారకమైన యుద్దేశము తమ మనస్సులో నెంతమాత్రమును లేదనియును, ఈ యాంగ్లేయులు వ్రాయు వ్రాతలను బట్టి మహమ్మదీయ సోదరులు మోసపోయి హిందువులతో కలహింపజన దనియును, హిందువులు మహమ్మదీయులు వారు వీరననేల భారతవర్ష మాతృగర్భమున బుట్టిన ప్రతిమనుజుడును ఈ యుత్సవమును చేసికొనవచ్చుననియు, ఈ మొదలగు సుబోధభావపూరితము లగు వాక్యములను వ్రాసి, తననిజహృదయమును దేశప్రజల కెఱింగించి ఆంగ్లేయపత్రికాధిపతులు చేయుకుతంత్రములను సాగనీయలేదు.

## పునహాలో మహామారి; క్షామము; ప్రజాసేవ

సంగతిసందర్భము లిట్లుండగ, 1896 సం॥ లో మహారాష్ట్రదేశమునందంతటను క్షామము సంభవించెను. అన్నము గంజి లేక ప్రజలు మలమల మాడిపోవుచుండిరి. ఆహారపదార్థములధర అపరిమితముగ పెరిగిపోయెను. రోడ్లప్రక్కను చెట్లక్రిందను మనుష్యుల కళేబరము లెక్కడజూచిన నక్కడపడియుండెను. జీవములను దాల్చియున్న ప్రజ లాహారములేని కారణముచే కృశించి కేవలము శవాకారములవలె బడియుండిరి. తన దేశప్రజలకు సంభవించిన యిట్టి యతి దీనదశను జూచి తిలక్ మహాత్ముని మనస్సు కరగి నీరయ్యెను. ఇట్టి యిక్కట్టులను తొలగించుటకై తిలక్ మహానుభావుడు ప్రజలకు సాయపడజొచ్చెను. ఆహారపదార్థములను పేదలకు చౌకధరలకమ్మవలసినదని వర్తకులను ప్రోత్సహించెను. దేశమంతటను సంచారముచేసి, చౌకధరల కమ్ముదుకాణముల నేర్పరచెను. దేశములో క్షామము సంభవించినప్పుడు పేదజనులను రక్షించుటకై గవర్నమెంటువారు కొంత ధనసహాయమును చేయవలసియున్నది. దీనికై ప్రత్యేకముగ కొంతధనమును వేరుగ పెట్టియుంచెదరు. అట్టిధనమును ఆ క్షామసమయములో కర్చుపెట్టవలసినదని ప్రభుత్వమువారికి తెలియజెప్పుచు తన కేసరీ మరాటాపత్రికలలో వ్యాసములను వ్రాసెను. కాని యీ మాటలను ప్రభుత్వమువారు పెడచెవిని పెట్టిరి. వారు చేయవలసిన సహాయమునకై గవర్నమెంటువారిని గట్టిగ నడుగవలసినదని ప్రజలకు బోధించెను. కాని యధికారము సంపదను తమవశమున నుంచుకొనిన గవర్నమెంటు ఉద్యోగస్థులకు తిలక్ గారి మాటలు రుచింపవయ్యెను. గవర్నమెంటులోని లోపముల నన్నిటిని ప్రజలకు తెలియబఱచుచున్నాడను క్రోధము అధికారవర్గమువారికి పూర్ణముగ

గలిగెను. ఆహా ! జనుల స్వాతంత్ర్యము కొరకై పోరాడు నిట్టివారు అధికారధూర్వహుల యాగ్రహమునకు పాల్పడరి వచ్చునుగద ! ఈ క్షామముతోపాటు దేశమునంటంతను మహామారిజాడ్యము (ప్లేగు) వ్యాపించెను. ఈ మహమ్మారి వచ్చి దేశములో వేలకువేల ప్రజలను నోటపెట్టుకొని పోవజొచ్చెను. ఈ జాడ్యము రాగనే ప్రజలందరును ఇతరచోట్లకు పారిపోవజొచ్చిరి. ఇతర సమయములలో వట్టి వాగాడంబరములు పలుకు పెద్దలందరును తోకలు ముడచపెట్టిరి. కాని తిలక్ మహాత్ములుమాత్రము చలింపని మనోధైర్యముతో ప్రజలకు సాయపడి యీ జాడ్యమును రూపుమాప యత్నించెను. తా నూరూరను తిరిగి వైద్యశాల లేర్పరచి రోగులవద్దకు బోయి ఔషధముల నిచ్చి, భయపడవలదని వారికి ధైర్యముచెప్పి, తనదేశప్రజల కెంతయో మేలొనగూర్చి తన మాతృదేశ ఋణమును దీర్చుకొన యత్నించెను. ! తల్లి ఋణమునుతీర్పగలిగిన నిజమైన భారత మాతపుత్రు డితడేగద !

ఈ మహాత్ము డిట్లు తన దేశప్రజల కుపచారములు చేయుచుండగ, ఈ ప్లేగు జాడ్యమును మాపుటకై దొరతనమువారు ప్రత్యేకముగ కొంతమంది యుద్యోగుల నేర్పరచిరి. కాని వీరు నిజముగ దేశప్రజలకు మేలు చేయుటకు బదులు తమ స్వలాభాపేక్షయే చూచుకొనుచు ప్రజలను ఈ ప్లేగు జాడ్యముతో పాటు తాము కూడ పీడింపజొచ్చిరి. అందువలన నీ యధికారులపై ప్రజలకయిష్టము పుట్టెను. వారవలంబించు మార్గము లేవియును ప్రజలకు రుచింపవయ్యెను.

ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట 1897 సంవత్సరములో నీప్లేగుమూలమున సకాలమున శివాజీ యుత్సవమును జరుపుటకు వీలు గాదయ్యెను. ఆ కారణముచే శివాజీ పుట్టినదినమున జరుగవలసిన యుత్సవము శివాజీపట్టాభిషేకదినమున, అన 1897 సం॥ జూన్ 13 వ తేదీని శివాజీయుత్సవము జరిగెను. ఈ యుత్సవ మతివైభవముతో జరిగెను. శివాజియొక్క పటము నొకదానిని పెద్దమందిరములో బెట్టి యూరంతట నూరేగించిరి. ఆటపాటలతోడను, నృత్యగానములతోడను, ఉపన్యాసములతోడను ఆ దినమంతయు నత్యుత్సాహముతో గడచెను. యీయుత్సవము జరిగినవిధాన మంతయు పిమ్మట జూన్ 18 వ తేదీని కేసరీ పత్రికలో ప్రచురమయ్యెను. ఆ యుత్సవసందర్భమున పాడిన కీర్తన నొకదానిని కేసరీ పత్రికలో ప్రచురించిరి. వీని నన్నింటిని జదివి ప్రజ లత్యుత్సాహపూరితులై యుండిరి.

## ర్యాండు ఐర్స్టుల హత్య; తిలక్ గారిపై యభియోగము (1897) 18 మాసముల శిక్ష

ఇది యిట్లుండగ జూన్ 22 వ తేదీని కాలవశమున ఆకస్మికముగ, గవర్నమెంటువారిచే ప్లేగు నివారణార్థమై నియోగింపబడిన ర్యాండు, ఐర్స్టు అనునిద్దరు యూరోపియను ఉద్యోగస్థుల నెవరో చంపివేసిరి. ఈ సమాచారము వెల్లడికాగానే, దేశమునం దంతట నుండు తెల్లవారిలో గొప్పకలవరము పుట్టెను. వీరిని జంపినహంతకు

కష్టముగ దోచెను. తనస్నేహితులు తన్నిట్లు క్షమాపణ కోరుకొనుమనుచున్నారనియు, తా నందుల కంగీకరింపజాలననియు మొదలగు విషయము లన్నియు తెలియబరచుచును తమ ప్రాణమిత్రులగు మోతీలాల్ ఘోషు గారి కొక యుత్తరమును వ్రాసెను. ఆయుత్తరమును ఘోషుగారు ప్రకటించిరి. దానిలో కొన్నిభాగముల నీ క్రిందఁ బొందుపరచుచున్నాను.

"వారు నన్ను దోషినని యొప్పుకొనుమనుచున్నారు. కాని నే నట్లు చేయజాలను. ప్రజలకు నాయందుండు గౌరవమంతయు నాయొక్క సత్ప్రవర్తనమీదనే ఆధారపడియున్నది. ప్రాసిక్యూషన్ తరఫు కేసులో నేమాత్రమును బలము లేదని నాకు పూర్ణముగ తెలియును. ఇంత దుర్బలమైన కేసెప్పుడును విచారణకు రాలేదు. ఇట్టి దుర్బలమైన కేసును జూచి నేను జంకినయెడల (నింక నేమిప్రయోజన మున్నది.) అండమాను ద్వీపములలో (ద్వీపాంతరవాసశిక్షలో) నున్న నెంతప్రయోజనమో, నేను దీనికి జంకి మహారాష్ట్రదేశములో (నింటివద్ద) నున్నను అంతియే ప్రయోజనమని నా హృదయపూర్వకమైన అభిప్రాయము. మనపక్షము చాలబలమైనదనియు, మనకే జయము రాగలదనియు నాకు దృఢనమ్మకము గలదు. దీనికి తగిన కారణముల నన్నిటిని ఈ యుత్తరమునం దీ ప్రస్తుత దేహముయొక్క అనారోగ్యస్థితిలో వివరించి వ్రాయజాలను. మహారాష్ట్రభాషయందున నేమో బొత్తుగ తెలియని యీ జూర్యరీలను జూచిన నాకు భయము కలుగుచున్నదేగాని, అసలు కేసులోని న్యాయాన్యాయముల గూర్చి నా కెంతమాత్రమును భయములేదు. బ్రిటిషుపరిపాలన యెడ మన కెట్టి ద్రోహచింతయు నుండజాలదను విషయము మీకు తెలియును. నాకు తెలియును. కనుక మనలో నెట్టివారిమీదనైనను రాజద్రోహనేరము స్థిరపడుటకు వీలు లేదు. మనము రాజకీయవిషయములలో జోక్యము కలిగించుకొనవలచుకొనిన యెడల నిట్టి యిక్కట్టులు వచ్చితీరును; ఇట్టి కష్టముల కెల్ల మనము తల యొగ్గవలసినదే. ఇది మనవృత్తి, ఈవృత్తిని అవలంబించువారికి యిట్టికష్టములు వచ్చితీరును. అట్టికష్టముల నెల్ల నెదుర్కొనుటకు నేను సంసిద్ధుడనై యున్నాను. కావలయునని నయెడల నే నింతవరకు మాత్రము జెప్పుకొనగలను. ఏమన: "నేను వ్రాసిన వ్యాసములు రాజద్రోహపూరితములని నే నెంచను. కాని గవర్నమెంటు పక్షము వా రన్యథా తలంచిరి. (దానికి నే నేమిచేయగలను?) దానికి నే నెంతయు చింతింతును కాని యింతమాత్రముచే గవర్నమెంటు వారూరుకొనరు. వారియుద్దేశ మేమనగ పూనాలోనుండు ప్రజానాయకులనందరిని అవమానపరచవలయునని గవర్నమెంటువారి సంకల్పము. కాని తక్కిన నాయకులందరి వలె నేను కూడ "కచ్చారకపు" మనుష్యుడను కానని గవర్నమెంటువారు తెలిసి కొందురు గాక యని నాయభిప్రాయము. అదిగాక పూర్ణ మాలోచించినయెడల మన మందరమును ప్రజాసేవకులమే సుమా యని మనము జ్ఞాపకముంచుకొనవలెను. ఇట్టి సందిగ్ధసమయములలో, ఇట్టికష్టములలో మనము ధైర్యమును వీడి, క్షుద్రమైన హృదయ దౌర్బల్యముతో ప్రవర్తించినయెడల ప్రజలకు మనము నిరాశను గలుగజేయుటయే గాక

వారికి ద్రోహముచేసితివాదముకూడ నయ్యెదము. ఇదంతయూ నటుండగ నామనము నందు నాకెట్టి రాజద్రోహచింతయు లేనప్పుడు, నేను రాజద్రోహము తలంచితినని నన్ను నేనే యెట్లు నిందించుకొనగలను? ఆత్మగౌరవమును, సహజసత్యమును గలనే నెట్లు దీనికి సమ్మతింపగలను ! ఒకవేళ నామీద నీ నేరము స్థిరపడినయెడల నాకీ కష్టసమయములలో, నా దేశప్రజలయొక్క అభిమానము, సానుభూతి, ప్రేమ, నన్ను రక్షింపగలవు." ఇట్టి మనోనిబ్బరము, వజ్రసంకల్పము లోకమాన్యులబోటి ధీరులకే చెల్లును గాని నాయకుల మని చెప్పుకొను ప్రతివానిలో నుండజాలవుగద !

## దక్షిణదేశయాత్ర

ఒకసంవత్సరకాలము కఠినాగారశిక్ష ననుభవించిన కారణముచేత తిలక్ మహాత్ముని దేహారోగ్యము కొంత చెడిపోయెను. కాని తనకెన్నికష్టములు వచ్చినను చలింపని మనోధైర్యముతో, వెనుకకువోవని నిర్మల నిశ్చలమైన వజ్రసంకల్పముతో కళంకరహితమైన దేశభక్తితో, పగలును రేయి చూడరాక నిశ్చలజ్యోతివలె దేదీప్యమానంబుగ వెలుంగు మాతృదేశారాధన దీక్షాపరత్వముతో, తనజన్మమును సాఫల్యత నొందించుకొన బూనినవాని కివియెల్ల తృణప్రాయములేగద. ఈమహాత్ముడు కారాగారమునుండి విముక్తుడైన సంవత్సరమే దేశీయమహాసభ చెన్నపురిలో సమావేశమయ్యెను. ఈసభలో పాల్గొనుటకుగాను తిలక్‌గారు చెన్నపురికివెళ్లిరి. ఆసభముగిసిన పిమ్మట దక్షిణదేశమంతయు సంచారముచేసి, రామేశ్వరమువద్ద సేతుస్నానము చేసి, సింహళద్వీపవాసులను తమపాదకమలరజముచే పునీతులనుగ జేసి తిరిగి స్వస్థానమునకు వచ్చి చేరిరి.

## ఆర్యుల ఉత్తర ధ్రువనివాసము

వీరిదేహము కారాగారమునందు బంధింపబడియున్నను, వీరియంతరాత్మ సదా లోకసంగ్రహార్థమయియే స్వేచ్ఛగ వర్తింపుచుండెను. ఆత్మను బంధింపగలవారెవరు ? వీ రిదివరకే అనేకకార్యములందు మగ్నులైయుండియు, "వేదవేదాంగములను భగవద్గీతలను, ఉపనిషత్తులను, బహుశ్రద్ధతో పఠింపుచుండి రని చెప్పియుంటిని. అదిగాక వేద గ్రంథములయొక్క యతిప్రాచీనతను స్థాపించుటకై "మృగశీర్ష" యను గ్రంథమును కూడ వ్రాసెనని చెప్పియుంటిమి. ఇక వేదకాలమునాటికి మన యార్యసంతతివా రెచ్చట నివసించియుండిరను విషయమును పరిష్కరించుటకై "ఆర్యుల యుత్తర ధ్రువనివాసము" అను గ్రంథము నొకదానిని తిలక్‌గారు కారాగారమునందుండగా రచించిరి. భూగర్భ, భూనిక్షేప పరిశోధక శాస్త్రసంబంధమైన నూతన పరిశోధనవలన స్థిరపరుపబడిన యంశముల నాధారముగ చేసికొని పూర్వమెప్పుడు ఉత్తరధ్రువ ప్రాంతదేశములు సమశీతోష్ణముగ నుండి, "సంతత వసంతసమయ సౌభాగ్యసంపదల"తో తులదూగుచుండెననియు, మనుష్యులకు నివాసయోగ్యముగ నుండెననియు మొదట రుజువుపరచిరి. పిమ్మట హిమవత్ప్రళయము మొదలగు ననేకకారణాంతర

ములచే నచ్చటి శీతోష్ణస్థితియు, భూజల భాగములును మారిపోయి, దేశమంతయు ననేకవేలయడుగుల యెత్తువరకును మంచుతో ఘనీభవించుకొనిపోయె ననియు, ఆ కారణముచే మనుష్యు లచ్చట నివసించుటకు వీలుకానందున, మనయార్యులు దక్షిణముగ భూమధ్యరేఖ వైపునకు వచ్చిచేరిరనియు బుజువుపరచిరి. ఉత్తరధృవమువద్ద శీతోష్ణస్థితి యనుకూలముగ నున్న కాలములో మనపూర్వులచ్చట నివసించియుండి, యామంచు యుగముతోక (హిమవత్ ప్రళయము) రాగనే దక్షిణదేశములకు వచ్చి చేరిరని యుక్తియుక్తముగ దెలిపియున్నారు. వీరివాదమునకన్నిటికిని వేదములయందు ప్రమాణమును జూపియున్నారు. ఉత్తరధృవమువద్ద ఆరునెల లెడతెగని పగలును, మిగిలినయారునెల లెడతెగని చీకటియు నుండుననుమాట సహజమే. ఇట్టివర్ణన లనేకములు వేదవేదాంగములయందు గలవని ప్రమాణములను జూపిరి. వేదములయందు తరుచుగ గానిపించు ఉషఃకాలవర్ణన లన్నియును ఉత్తరధృవప్రాంతదేశములలోని యుషఃకాలమునకే వర్తించునుగాని, ముహూర్తమాత్రముండి మాయమైపోవు మన దేశపు ఉషఃకాలమున కెంతమాత్రమును వర్తింపవు. వేదములయందు వర్ణింపబడిన యాగములు, యజ్ఞములు, సత్రములు, మొదలగు వైదిక కర్మకాండయంతయును ఉత్తరధృవప్రాంతదేశ లక్షణములనే సూచింపుచున్నవని సప్రమాణముగ తెలియజెప్పిరి. ప్రాతఃకాలమున కధిష్ఠానదేవతలైన అశ్వినులు, సూర్యుడు, అగ్ని మొదలగు వానిని గూర్చినగాథలను, వృత్రాసురవధనుగూర్చినగాథలును, సమస్తమును ఉత్తరధృవదేశమునే సూచింపుచున్నవి. ఇక మన హిందువార్యుల పూర్వగ్రంథములగు వేదవేదాంగములయందేగాక పారశీకము, గ్రీసు, నార్వే, మొదలగు ఆర్యజాతులవారి పూర్వగ్రంథములందు సైతము ఉత్తరధృవనివాసమును బలపరచు వర్ణన లనేకములు గలవని తిలక్ గారు జూపించిరి.

ఈగ్రంథము వీరియపారమైన మేధాశక్తి కీపన్నె పెట్టుచున్నది. ఈగ్రంథమును జూచి జర్మనీ, అమెరికా, మొదలగు పాశ్చాత్యులును, ఖండఖండాంతరములవారును అత్యాశ్చర్యమగ్నులైరి. ఇట్టి మేధాసంపన్నుడొకడు భారతవర్షంబునన్గలడా, ఆహా! ఏమి భారతవర్షభాగ్యం బని వారెల్లను విస్మయావహులైరి. ఆహా! ఇట్టివారుగద తమ జన్మభూమికి పేరుప్రతిష్ఠలను దెచ్చువారు! ఎందరు పుట్టుటలేదు, ఎందరు గిట్టుటలేదు? ఎవరు మాతృభూమికి అలంకారభూషణులై, తమమాతృదేశమును ప్రపంచములోని దేశములకెల్ల మకుటాయమానంబుగ వరలునట్లు చేసెదరో, అట్టి వారిజన్మమేగద సార్థకమైనది.

తే. గీ. ప్రాణిలోకంబు సంసారపతితమగుట
వసుధపైబుట్టి గిట్టనివాడుగలడె?
వానిజన్మంబు సఫల మెవ్వానివలన
వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు.—భారతము.

జరిగినది. ఈమె ఔరంగాబాదునుండి తిరిగివచ్చిన కొలదికాలమునకే యీమె మనస్సులో దురూహలు జనింప మొదలిడెను. దీనికి కారణము కేవల మీమెకు దుస్సలహాలను జెప్పు కొందరు కుట్రదారులేయని తెలియవచ్చినది. ఈ కుట్రదారుల కుతంత్రములను విని యీమె తిలకుగారియెడ ద్వేషమును వహించెను. "ఈ తిలకు గారు నీ కుటుంబసంరక్షణాధికారము నేల వహింపవలెను? నీకు స్వాతంత్ర్యము లేదుగా? మధ్య వచ్చి యీయన వ్యవహరించు టేమి?" అని కొందరు స్వలాభపరాయణులు ఈమెకు దురాలోచనలను గావించిరి. యీమెకు స్వాతంత్ర్య మున్నయెడల, యీమెను మోసము చేసి, యేదోవిధముగ యీ విఠంటపుయొక్క గొప్పయాస్తి సంపాదించ తామే యీపోక డను పట్టవచ్చునను దురభిప్రాయముతో నీమాటలను వా రామెకు బోధించిరి. వీరి కుతంత్రముల కామె లోబడి "యీ మరణశాసనము నా భర్త వ్రాయలేదనియును, తిలక్ గారికి ట్రస్టీయధికార మీయలేదనియు, ఇదంతయును తిలక్ గారే ఫోర్జరీచేసిరనియును, యీదత్తత తనకిష్టములేనిదే తిలక్ గారు బలవంతముగ తనకిష్టములేని మరవాని నెవనినో తీసికొనివచ్చి దత్తత చేయించెననియు, కనుక ఈయనను ట్రస్టీపదవిలోనుండి తొలగించి యీదత్తతను రద్దుచేయవలసిన" దనియును పూనహా జిల్లాజడ్జీవద్ద వ్యాజ్యము దాఖలుచేసెను. ఆమె కోరికప్రకారమే జిల్లాజడ్జీ తిలక్ గారికిచ్చిన ట్రస్టీయధికారమును కొట్టివేసి, దత్తతను రద్దుపరిచెను. జిల్లాజడ్జీ యింతటితో నూరకొనక తిలక్ గారి కిదివరకే దేశమునందంతటను వ్యాపించియున్న ప్రతిష్టకు భంగముజేయవలయుననుతలంపుతో, ఫోర్జరీచేసెననియు, తప్పుడుసాక్ష్యము చెప్పెననియు, ఏవియో లేనిపోని నేరములను తిలక్ గారిమీద మోపి వీరికి 18 మాసములు కఠినకారాగారవాసశిక్షను విధించెను. కాని బొంబాయి హైకోర్టులో అప్పీలుచేయగ, తిలక్ గారు నిర్దోషి యనియు, ఆయన సత్ప్రవర్తన గలవాడనియు నిరూపించి క్రిందికోర్టుతీర్పును రద్దుపరచిరి. మొదటవీరిమీదమోపిన నేరము లన్నిటిని వారు వదలుకొనిరి. 1904 సం॥ వరకు ఈకేసువిషయమై యనేకకష్టములుపడి యీమహనీయుడు తుదకు నిష్కల్మషహృదయముతో, మచ్చలేని సత్ప్రవర్తనముతో విజయము గాంచగలిగెను. హైకోర్టువారు మొదట తిలక్ గారు చేయించినదత్తతను స్థిరపరచిరి. దుర్మార్గులును, అసూయాపరులును, ఎందరెన్నివిధముల వీరిప్రతిష్టకు భంగము కలుగజేయవలెనని చూచినను, తుదకు సత్యమునకే, ధర్మమునకే విజయము చేకూరినది. "యతో ధర్మస్తతో జయః" యను వాక్య మిచ్చట సార్థకమైనది.

## బంగాళవిభజన: జాతీయప్రబోధము
## స్వరాజ్యము, బహిష్కారము, జాతీయవిద్య, స్వదేశీప్రతిజ్ఞ

ఆ 1905 సంవత్సరమున భారతవర్షంబున నూతనయుగము ప్రారంభమైనది. రాజకీయరంగమున చిత్రవిచిత్రప్రదర్శనములు బయలుదేరెను. భారతవర్ష సామ్రాజ్యచక్రమును త్రిప్పుటకై కర్జనుప్రభువు వైస్రాయిగ మనదేశమునకు వేంచేసియుండెను.

ఈయన నిరంకుశచర్యలు దేశప్రజలయందు కలవరమును పుట్టించెను. ప్రజలయందు ప్రబలిన యీ యశాంతి రానురాను క్రమముగ వృద్ధియై, ఆవ 1905 సంవత్సరములో బంగాళా విభజనతో నతిమిక్కుటమయ్యెను. కర్జనుప్రభువు చూపిన ప్రజాభిప్రాయ నిరసనమునకు ప్రజలత్యుగ్రులైరి. వైస్రాయిగ గావించిన యకార్యములను ఖండించుటకై ప్రజలందరేకమైరి. ఆహా! కీడుతోపాటు మేలుకూడ నుండు నను పెద్దలవాక్యమునకిది తార్కాణమయ్యెను. కర్జనుప్రభువు గావించిన నిరంకుశచర్యలు ప్రజలయందైకమత్యమును పెంపొందించినవి. "మనమందరమొక జాతివారము, మనమందరమొక తల్లిబిడ్డలము, మన జన్మభూమియందు మనము గాఢాదరము గలవారమై ఆమెయొక్క యాత్మగౌరవమును గాపాడవలెను. మన జాతీయస్వత్వములను నిలుపుకొనవలెను." అను గాఢమైన దేశభక్తి ప్రజల మనంబులలో రగుల్కొల్పెను. పూర్వజన్మజ్ఞానమును మరచి నిదురించుచున్న ప్రజలను తట్టిమేల్కొలిపెను. ప్రజలప్పుడు కన్నులువిప్పి తమ చుట్టుప్రక్కలను పరికించిచూచి తమ యునికిని తెలిసికొనిరి. అప్పుడు ప్రజలలో పూర్వజన్మజ్ఞానము మొలిగెను. వెంటనే ప్రస్తుతము తాముపడియున్న యధోగతినుండి తప్పించుకొని తొల్లింటి కీర్తిశిఖరమునధిష్ఠింప నొక్కుమ్మడి హుమ్మని హుంకరించి ప్రయత్నింపసాగిరి. "జగన్నాథరథము కదలినది. దాని నాయకులవారెవరు? రథపగ్గములను బట్టుకొని రథమును లాగికొనిపోవువారు ధన్యులు. ఆ జనసమూహములో రథపగ్గములను పట్టుకొని లాగపోయి ఆరథచక్రములక్రింద బడి పరలోకప్రాప్తి నొందినవారంతకంటె ధన్యులు." ఆహా! ఏమి! ప్రజలలోని భావోద్రేకము! ఒక్క బంగాళాసోదరులకు గలిగిన యన్యాయమునకై యఖిలభారతవర్ష కుమారుల మనంబు లొక్కుమ్మడి చలించినవి. భారతజాతీయైక్యతకిది ప్రబల నిదర్శనము కాదా! భారతీయులకు గలిగిన యీ యన్యాయమునకై యాత్మగౌరవము గల మన ప్రజలేమి చేయవలెనను సమస్య బయలుదేరెను. ఆసంవత్సరమే పుణ్యక్షేత్రమైన కాశీక్షేత్రమున దేశబాంధవ గోపాలకృష్ణ గోకులుని యధ్యక్షత క్రింద నఖిలభారతవర్ష జాతీయమహాసభ సమావేశమయ్యెను. ఆ సభలోని నాయకు లేమని యుద్ఘోషించిరి! గవర్నమెంటువారు గావించిన యిట్టి యపకృతికై భారతీయులమైన మనకు బహిష్కారాయుధమే సాధనమని సభాపీఠమునుండి ముక్తకంఠధ్వనితో ప్రజావాణి సింహగర్జన గావించెను.

"బహిష్కారము" అననేమి? విదేశవస్తువులను, విజాతీయవిద్యను, విదేశ వేషభాషలను, విదేశీయాచారసాంప్రదాయములను విదేశీయాధికారమును ఇది యది యననేల విదేశమునకు సంబంధించిన సమస్తవిషయములను మనము బహిష్కరించుట యని తాత్పర్యము. విదేశవస్తువుల నుపయోగించుటవలన మన పరిశ్రమలు, వృత్తులు, అన్నియును అడుగంటి ప్రజలు తమ జీవనాధారములను గోల్పోయి దరిద్రులైరి. విదేశీయాచారములను, వేషభాషలను, అవలంబించుటవలన మన పూర్వులయున్నతస్థానమునుండి మనము పతితులమైతిమి. పాశ్చాత్యాచారములచే సమ్మోహితులమై మన యాత్మగౌరవమును గోల్పోతిమి. రాజకీయాధికారము మనచేతులలోనుండి జారిపోయిన కారణ

వారొక్కొక్కరు వేలకొలది రూపాయలిచ్చెడి వారే. కాని తిలకుగారియుద్దేశమది కాదు. మన స్వదేశ పరిశ్రమలు, వృత్తులంగీకరించిన పనియును, వానిని పునరుద్ధరించు భారము మనమీదనే యున్నదనియును పరుల సహాయము లేకుండ మనంతట మనమే ప్రజలందరును ఐకమత్యభావముతో, మెలంగుచు, ఈపనిని నిర్వహించవలెననియు, మొదలగు నీ యంశములన్నియు ప్రతివానికి తెలియజెప్పి ప్రతివానిచేతను తనకు తోచినంత సొమ్మును, మూడుదమ్మిడీలకు తక్కువగాకుండ, ఈ స్వదేశోద్ధరణకై సమర్పించునట్లు చేయవలయుననియు తిలకుగారియభిప్రాయము. ఎంతబీదవాడైనను యీ కార్యములో పాల్గొనునట్లు చేయుటకై ఆ దమ్మిడీలనే నియామకముగను యేర్పరిచెను. ఈ సంగ్రహముగ ప్రోగుచేసిన సొమ్ము వేలకువేలు మొత్తమైనది. దీనివలన దేశప్రజలకు నీయుద్యమములయెడ గల గాఢాదరమును మీ దేశప్రజలలో పురికొల్పిన స్వదేశాభిమానమును తేటపడగలవు. ఏ దేశోద్యమము మొదలుపెట్టినను దేశప్రజలందరును సహాయముగనుండి దానికి కావలసినంత ధనమును బీదసాదలవద్ద సమర్పించుటకై సిద్ధపడి యుందురు. ప్రజానాయకు లన నిట్టివారే గద !

## 1906 సం॥ జాతీయసభ
## రాజకీయములో భిన్నాభిప్రాయములు

నూతన యుగోదయారంభమున దేశప్రజలందరును ఈ విధముగ నత్యుత్సాహపూరితులైయున్న తరుణమున 1906 సంవత్సరమున దేశీయమహాజనసభ భారతవర్ష పితామహుండగు దాదాభాయి నౌరోజీగారి యధ్యక్షతక్రింద హుగ్లీనదీ తటమున కాళీఘట్టక్షేత్రమున సమావేశమయ్యెను. ఆ సభావేదికనుండి, భారతవర్ష పితామహుండు స్వరాజ్యశృంగమును పూరించెను. ఆశృంగధ్వని యాసేతుహిమాచలపర్యంతభూభాగమునందంతటను మారుమ్రోగెను. ఆ సభావేదికనుండియే స్వరాజ్యము, బహిష్కారము, స్వదేశవ్రతము, జాతీయవిద్య మొదలగు దేశక్షేమంకరములగు గాఢతీర్మానము లంగీకృతమయ్యెను. స్వదేశోద్యమభావరసముపొంగి పొరలి మిన్నుముట్టెను. దేశప్రజలందరును ఆ భావరసప్రవాహములో మగ్నాంగులై పావనత గాంచిరి.

## ఇరుపక్షము లేర్పడుట (జాతీయవాద మితవాదములు)

ఆ 1906 సంవత్సరమున కాళీఘట్టమున స్వరాజ్యనాదము వినవచ్చినప్పటి నుండియు దేశనాయకులలో భేదభావము లుదయింపజొచ్చెను. ఆ నాదముయొక్క స్థాయిని కొంచెము తగ్గించవలయునని కొందరు పట్టుపట్టిరి. కాని జాతీయపక్షావలంబకులును వారి గురువర్యులగు తిలకుగారును దాని కొడంబడరైరి. కాని తిలకుగారికి ప్రతిపక్షులైన మితవాదులెగవారు దీని నెట్లయినను సాధింపవలయునని ప్రయత్నము చేసిరి. మొదటి యేర్పాటుప్రకారము 1907 వ సంవత్సరపు జాతీయమహాసభ నాగపురములో జరుగవలసియుండగ, దాని నచ్చట జరుగనీయక ఆ సంవత్సరపు సభను

సూరత్ పట్టణమునకు లాగికొని వచ్చిరి. ఆ సంవత్సరపు సభకు దేశబాంధవ లాలా లజపతిరాయి గారే యధ్యక్షులుగ నుండవలయునని దేశప్రజలందరును తీర్మానించినను సూరత్ పట్టణములోని యాహ్వానసంఘమువారు అతనిని తొలగించి, రసవిహార ఘోషు గారిని అధ్యక్షులుగ నియమించిరి. క్రిందటి సంవత్సరము కలకత్తాలో సంగీకృతములయిన స్వదేశీ, బహిష్కారము, స్వరాజ్యము, జాతీయవిద్య మొదలగు గాఢమైన తీర్మానములను తొలగించవలయునని మితవాదపక్షమువారు ప్రయత్నము జేసిరి. తిలక్ గారికి ప్రతికక్షులుగ నిలువబడి, ఆ సంవత్సరపు సభాకార్యములను పరిష్కరింప సమకట్టిన మితవాదనాయకులలో సర్ ఫిరోజిషా మెహతా, గోపాలకృష్ణగోఖ్లే మొదలగువారు నిగ్రగణ్యులు. తిలకు గారికి ప్రతికక్షులుగ నిలువబడినంతమాత్రమున వీరు స్వరాజ్య మక్కరలేదని వాదించుచున్నారని మన మనుకొనగూడదు. వీరందరు కూడ, మితవాదులయినను జాతీయవాదుల వలెనె, సమస్తప్రజలును మనదేశమునకు స్వరాజ్యము గావలయు ననియే కోరుచున్నారు. స్వరాజ్యమక్కరలేదని వాదించు మూఢాత్ముడెవడు నుండజాలడు. అందరి కోరిక యొక్కటియే. అందరి గమ్యస్థాన మొక్కటియే. కాని వారవలంబించు మార్గములలో మాత్రము భేదము కలదు. భగవంతు డొకడున్నాడనియు ఆ భగవంతునిలో నైక్య మగుటకై మనమందరమును ప్రయత్నింపవలయుననియు సమస్తమతములవారు నొప్పుకొందురు. కాని క్రీస్తుద్వారా పోయిననే గాని మోక్షము లభింపదని క్రైస్తవులును, మహమ్మదుద్వారా పోయిననే గాని మోక్షము రాదని మహమ్మదీయులును, జొరాష్టరు ద్వారా పోయిననే గాని మోక్షము రాదని పారశీకులును, ఏయే విధముగ వివిధమతములవారు వాదించుకొనుచున్నారో, అట్లే యీ మితవాదులును జాతీయవాదులును స్వరాజ్యమును పొందు మార్గమునను భిన్నాభిప్రాయులై యున్నారు. మన భారతీయుల పూర్వపు నాగరికత మహోత్కృష్టమైనదనియు, మన పూర్వులు పెద్దపెద్ద సామ్రాజ్యములను స్థాపించి మిక్కిలిసమర్థతతో పరిపాలింపగలిగి రనియు, మనకుకూడ ప్రస్తుత మవకాశమిచ్చినయెడల మనదేశ వ్యవహారములను మనమే పరిష్కరించుకొనగల మనియు, అందువలన మనకిప్పుడు తక్షణమే స్వరాజ్యము వచ్చితీరవలయుననియు జాతీయవాదుల మతము. వీరికే అతివాదు లను మారుపేరుకూడ గలదు. ఇక మితవాదులమత మేమనగ :— మనమిప్పుడే స్వరాజ్యమును బొందనర్హులము గామనియును, మనము క్రమక్రమముగ, చిన్నపిల్లలు పాఠములు నేర్చుకొన్నట్లు, కొంచెముకొంచెముగ "రాజ్యము చేయుట యనునేమో" తెల్లవారి దగ్గరనుండి నేర్చుకొనవలెననియు, మనమట్లు నేర్చుకొన్న పిమ్మట వారే దయచేసి మనకు స్వరాజ్యమును ఎప్పటికో యొకప్పుడిత్తురనియు మితవాదులు చెప్పుచున్నారు. అందువలన వీరిని ప్రభుత్వమువారు తమకుగ చేరదీసి బుజ్జగించుచుందురు. బంగాళా విభజనసమయములో దేశమునందంతటను కలవరము పుట్టినప్పుడు "మితవాదులను మన గవర్నమెంటు పక్షమునకు త్రిప్పుకొనవలసినది" అని సీమనుండి మార్లిమంత్రి యిక్కడ యుద్యోగస్థులకు సలహా నిచ్చియున్నాడు. ఇదిభేదోపాయము, జాతీయ

వాదులను చూచిన గవర్నమెంటువారికి కంటకముగ నుండును. ఇదిగాక యుభయపక్షములవారికిని ముఖ్యమైనభేద మింకొకటికలదు. మనకెన్నికష్టములు వచ్చినను, గవర్నమెంటువారి కెంతయాగ్రహము వచ్చినను, మన ప్రజలను వారెన్ని బాధలను పెట్టినను, మనబుద్ధి, తయు సర్వకాలసర్వావస్థలయందును స్వరాజ్యమునందేయుంచి మధ్యవచ్చిన ఈకష్టములనెల్ల తృణప్రాయముగనెంచి లెక్కచేయక, వీనినెల్ల జయించి, తుదకు ఆస్వరాజ్యమోక్షమును పొంది తీరవలె యనెడి దృఢసంకల్పులై జాతీయవాదులున్నారు. ఇక మితవాదులన్ననో మధ్య నేమాత్రము కష్టమువచ్చినను "ఓస్వామీ!" యని యులికిపడి దీనినెల్లు జయింతుమని యధైర్యపడి, తాము చేరవలసిన స్వరాజ్యమోక్షస్థానము, సంగతియే మరచి తోవతెన్నుగానక, యీ చిన్నచిన్న క్షుద్రవిషయములకే దగుల్కొని ఇటుప్రజలకు మార్గమును జూపలేక, అటు ప్రభుత్వమువారిచే పూర్ణముగ మెప్పును బొందజాలక, మధ్య త్రిశంకుస్వర్గములోవలె నున్నారు. మనమేమి చేసిన గవర్నమెంటు అధికారులకు అయిష్టముకలుగునో, లేక కోపము వచ్చిపోవునో, గవర్నమెంటు ఉద్యోగస్థుల కేమి మనసునొచ్చిపోవునోయని వీరికి సదా భీతియుండును. ఈకారణము చేతనే 1907 సంవత్సరములో లాలాలజపతిరాయిగారిని దేశీయసభాధ్యక్షునిగ నియమించుటకు మితవాదులు సమ్మతింపలేరు. ఏలననగా లాలాలజపతిరాయిగారు అప్పటికి కొద్దిదినములక్రిందటనే కారాగృహమునుండి ప్రభుత్వమువారిచే విడుదలచేయబడెను. ఇట్టివానిని సభాధ్యక్షునిగ నేర్పరచినయెడల, ఎక్కడ గవర్నమెంటువారికి కోపమువచ్చునోయని మితవాదులు భయపడిరి. కాని ప్రజలందరిచేతను ఎన్నుకొనబడినవాని నేలతీసివేయవలెనని జాతీయవాదులు పట్టుపట్టిరి. ఇట్టి ఇడుములకు జంకిన, మనకెక్కడ మోక్షమని జాతీయవాదులవాదము. నాయకులలోని యీయభిప్రాయభేదములు సూరత్ పట్టణములో 1907 సంవత్సరపు జాతీయసభలో క్రియారూపమును దాల్చెను. మితవాదప్రాబల్యము గల సూరత్ పట్టణపు ఆహ్వానసంఘమువారి నిరంకుశచర్యలను జాతీయవాదులు, తిలకుగారి యధ్యక్షతక్రింద, తీవ్రముగఖండించిరి. ఒకసారి జాతీయసభవారిచే నంగీకృతమైనతీర్మానములను త్రోసివేయుట కెట్టివారికిని హక్కులేదు. మితవాదుల జాతీయసభను వెనుకకు నెట్టవలయునని తలంచిరి. ఇట్టియకార్యము జరుగకుండ చేయవలెయునని తిలకుపక్షమువారు కృతనిశ్చయులైయుండిరి. జాతీయసభ సమావేశము కాకపూర్వము తిలకుగారిచ్చిన యుపన్యాసమును చదివినయెడల నీవిషయములన్నియు బోధపడగలవు.

## సూరతు జాతీయసభావిచ్ఛేదము

జాతీయసభ అన 1907 సంవత్సరము డిశంబరు 27వ తేదిన సమావేశముయ్యెను. సభ సమావేశము కాక పూర్వము ప్రతినిధుల కందజేయవలసిన చిత్తుతీర్మానములను సభ సమావేశమగువరకును అందజేయలేదు. సభ్యులందరును సభనలంకరించి కూర్చుని

కొన నారంభించిరి. ఈ గల్లంతులో నెవరో యొక్క పెద్దచెప్పొకటి విసిరివేసిరి. ఆ చెప్పువచ్చి మెహతాగారి చెంపకు తగిలి యావలకు బోయిపడెను! ఈ చెప్పు నెవరు వేసిరో నెవరికిని తెలియదు. ఈ గల్లంతునంతను జూచి సభాధ్యక్షులు భీతావహులై "ఈ సభ నింతటితో నాపివేసినా" మని చెప్పి ఠీవాలున లేచి పోయిరి. నాయకులందరు నెచ్చటివా రచ్చట పారిపోయిరి, సభికులందరును చెల్లా చెదరైరి. అంతటితో ఆ సభ ముగిసెను. జాతీయమహాసభ భగ్నమైపోయె. ఎన్నియో లక్షల రూప్యములను వ్యయముచేసి ఎంతమందియో ఎన్ని సంవత్సరములనుండియో కష్టపడి నిర్మించిన యీ జాతీయభవనము ఈ మితవాదనాయకుల నిరంకుశచర్యవలన భగ్నమైనది. కాని యీ సభ భగ్నమగుటకు తిలకుగారే కారకులని ప్రతిపక్షులు నిందింప జొచ్చిరి. దీని కంతకును మూలకారణ మెవరో లోకులే తీర్మానించెదరు గాక!

జాతీయమహాసభను భగ్నము చేయవలయు నను తలంపు తిలకుగారి కేకోశమునను లేదు. దేశక్షేమమున కత్యంతావశ్యక మగు నిట్టి సభను దేశక్షేమమునుగోరు తిలకుగారు భగ్నము చేయ నెంచుదురా? 1906 సంవత్సరములో నంగీకృతములైన స్వరాజ్యాది నాలుగు గాఢతీర్మానములను అంగీకరించినయెడల ప్రభుత్వమువారి కాగ్రహము వచ్చునను తలంపుతో, జాతీయసభాగౌరవమును నా[illegible]కు ద్రోసి ఈ సభను వెనుకకు నెట్టవలయునని మితవాదులు గట్టిపట్టుపట్టిరి. ఇట్టియగౌరవమును తొలగింపవలయు నని తిలకు పక్షమువారు పూనిరి. దీనికి ఫలిత మేమి? అసలు సభకే భంగము వాటిల్లెను.

## ఉదారభావము : ఏకాగ్రదీక్ష

తిలకుగా రీసభను భగ్నముచేయగోరలేదనియును, తనకెన్నికష్టములు వచ్చినను, యెన్నిపాట్లను బడియైనను జాతీయసభాగౌరవమును నిలువబెట్ట సంకల్పించిరనియును, అమృతబజారు పత్రికాధిపతి యగు బాబుమోతీలాల్ ఘోషు గారు నూతనముగ ప్రకటించిన యంశములను జదివినయెడల విదితముకా గలదు.

జాతీయసభకు భంగము వాటిల్లినందులకై సమస్త ప్రజలును చింతింపుచుండిరి. మితవాదులీనిందను తిలకుగారిమీదికి త్రోసివేయ జూచుచుండిరి. ఇట్టి తరుణములో నుభయపక్షములవారిని సమాధానపరచి, సభ నెట్టులైనను కొనసాగింపవలెనని మోతీలాల్ ఘోషు మొదలగువారు ప్రయత్నించిరి. తిలకు, మోతీలాల్ మొదలగు జాతీయవాదులందరు నొకచోట కూర్చునియుండగ ఘోషుగారిట్లు ప్రసంగింపదొడంగిరి.

"అయ్యా! ఇదిగో! గంగాధరా! నీ వొక్కడవే యీసంధిగ్ధావస్థను తప్పింపగలవు. కాని యిందులకై నీవు మాత్రము ఘోరమైన ఆత్మసమర్పణము గావింపవలసివచ్చును. నీయంతరాత్మను బలియివ్వవలసివచ్చును. (నీయాత్మ గౌరవమును నీవు చంపుకొనవలసివచ్చును.) నీహృదయమును నేను బాగుగ నెరుంగుదును. అయినను నీవీతరుణమున నట్టి ఆత్మబలి నిచ్చుటకై వెనుదీయవని నానమ్మకము. ఇదిగో! లో

సంగ్రహకారకమైన మహోత్కృష్టకార్యము నీయెదుటనున్నది. వారు (ప్రతిపక్షులు) నీహృదయశోణితమును (బలిగ) కోరుచున్నారు. ఈ యఖిలభారతవర్ష మహాజనసభ యొక్క గౌరవమును నిలువబెట్టుటకై, నీ వేల నీహృదయశోణితమును బలియీయ గూడదు ? దుఃఖభాజనమైన యీయకార్యమునకు నీవు కర్తవు గావని నాకు బాగుగ తెలియును. కాని యీనిందనంతయు నీనెత్తిమీద నేవేసి, యీమలినమును, ఈకళంకమును, ఈమచ్చను, నీకేమంటగట్టి నీకీర్తిని మలుపుగావింప ప్రతిపక్షులు కుతూహలురై యున్నారు. కనుక ఈనిందనంతయు నీనెత్తిమీద నే వేసికొని, "యీయకార్యమును జేసిన పాపిని నేనే, యీపాపభారమును నేనేవహించెదనని" నీవు బహిరంగసభలో నొప్పుకొని, వ్రాతమూలముగ వ్రాసియిచ్చినయెడల యీ జాతీయమహాసభ యకాలమృత్యువు వాతబడకుండ యొకవేళ తప్పిపోవు నను కొనుము. నీయొప్పుదలమూలమున జాతీయసభ మృత్యువువాత బడకుండ తప్పిన యెడల నీ విట్టియొప్పుదలకు సమ్మతింతువా ? నీయంతరాత్మనైనను బలియిచ్చుటకు సంసిద్ధుడ వయ్యెదవా ? నీ కిది యిష్టమైనయెడల, నా కిప్పుడే నీయొప్పుదలను వ్రాతమూలముగా వ్రాసియిమ్ము. ఇదెంతయు నీవు గావించు మహోత్కృష్టమైన బలిసమర్పణ మని యెరుంగునది. ఇట్టి సమర్పణమునకై నిన్ను నీ వెంతయు నభినందించుకొనవచ్చును. ఈయకార్యమును నిజముగ నీవు గావించి యుండని కారణముచే సహజముగ నొకవేళ నీకది కష్టముగ దోపవచ్చును. నాయంతరాత్మను నేనే యన్యాయముగ చంపివేసికొనుట యగునే యని నీమనస్సు పరితపింపవచ్చును. కాని నేను చెప్పునదేమనగా:— సర్వజనక్షేమకరమైన యిట్టిజాతీయ మహాసభను మృత్యువువాత బడవేయుటకంటె, నీయొక్కనియంతరాత్మను చంపుకొనుటయే మహోత్కృష్టమైన బలిసమర్పణ మని నాతలంపు. దీనికి నీ వేమనెదవు అని మోతీలాల్ ఘోషుగారు ప్రశ్నించిరి. గంగాధరుని హృదయము తప్తమయ్యెను. అంతట కొంతతీవ్రమైన చర్చ జరిగినది. వారి శిష్యులందరు నిట్టియన్యాయమువలదని ప్రతిఘటించిరి. తమగురువర్యులు నీవిధముగ క్రూరబలినిచ్చుటకై వారెవరును సమ్మతింపలేదు. అంత గంగాధరుడు కొంతవరకు నిమీలితనేత్రు డయ్యెను. మనస్సును దిట్టపరచుకొనెను. ఆత్మబలికి, ఆత్మవితరణమునకు, సంసిద్ధుడయ్యెను. హృదయశోకమును పైకిజిమ్మి నొకచిరునవ్వు ఆ మొగమున గానవచ్చెను. అంతట, "ఇదిగో ! నే నీభారమును వహించుట కంగీకరించుచున్నాను." అని యీక్రింది విధముగ వ్రాసియిచ్చెను. "ప్రతిపక్షులు జాతీయసభాకార్యమును కొనసాగించిన యెడల, ఇదిగో ! నేనిప్పుడే యీభారమును వహించుటకు సిద్ధముగనున్నాను. దుఃఖభాజనమైన యీకార్యమునకు నేనే కారకుడనని ఒప్పుకొని యీభారమును నేనేవహించుటకు సంసిద్ధుడనైయున్నాను" అని వ్రాసియిచ్చెను. ఆయనవ్రాసిన మాటలన్నియును నాకిప్పుడు జ్ఞాపకములేవు. అయినను వానిసారాంశమిది. అపారమైన ఆయనమహోదారభావమును, ఆత్మవితరణబుద్ధిని, ఒకసారి చింతింపుడు. తా నీ యకార్యమును గావింపలేదనిహృదయపూర్వకముగ నెరింగినవాడయ్యు అవకాశము చిక్కినయెడల తనను కండలుకండలుగ జీల్చివేయుటకు సంసిద్ధులైయున్న ప్రతిపక్షుల

యెదుట నిష్కారణముగ, (లోకసంగ్రహార్థమై) తనయాత్మగౌరవము నైనను వదలుకొని, సంతోషపూర్వకముగ, ఆత్మను బలియిచ్చుటకై సంసిద్ధు డయ్యెను.

అదిగాక ఈయొప్పందమువలన వారిప్రతిష్ఠ కెంతభంగము కలిగెనో చింతింపుడు. వారెట్టిసదుద్దేశ్యముతో నీయాత్మబలిని గావించిరో యావిషయమును దాచియుంచి, యీయవకాశము నాధారముచేసికొని దేశప్రజలయెదుట వీరిప్రతిష్ఠకు భంగము కలిగింప, నిశ్శంకముగ వీరిప్రతికక్షులు కొందరు యత్నింపవచ్చును. అంతట నేనును మరికొందరు స్నేహితులును ఈశాంతిమును చేత పట్టుకొని, సాధ్యమైనయెడల నుభయులకును సంధికుదుర్చవలె నను సదుద్దేశముతో మేమందరమును మితవాదుల శిబిరమునకు బోతిమి. కాని సర్ ఫిరోజిషా మెహతాగారిచే ప్రేరితులైన మితవాద నాయకులందరును మమ్ముల నుజూచి గేలిసేసి కేకలు వేయ మొదలిడిరి. వారంద రావేశముతోనున్న మిక్కుటముగ నుద్రేకపూరితులై యుండిరి. అందువలన వారితో నప్పుడు సహేతుకముగ వాదింప దుస్సాధ్యమయ్యెను."

అని మోతీలాల్ ఘోషుగారు "Step in the Steamer" అను పుస్తకము యొక్క పీఠికలో వ్రాసిరి. ఆహా! సంధిసమర్పవచ్చిన మధ్యవర్తులకు వారు దర్శనమే యీయలేదట! ఇప్పుడైనను జాతీయమహాసభాభంగపాటునకు మూలకారకు లెవరో లోకము పరిష్కరించు గాక. సభ చీలిపోయినపిమ్మట తిలకుగారిచ్చిన యుపన్యాసమును జదివి చూచినయెడల సమస్తమును తేటపడగలదు.

## మద్యపాననిషేధము

సూరత్ లో జాతీయసభ చీలిపోయినపిమ్మట, 1908 సంవత్సరములో తిలకుగారు తిరిగి దేశోపకారకార్యములయందే మగ్నులై యుండిరి. దేశములో మద్యపాన మెక్కువయ్యె, దేశప్రజలందరును దరిద్రులగుటయే గాక, దేహబలమును సైతము గోల్పోయి దుర్బలులై యుండిరి. శోకోపద్రవకారకమగు నిట్టిమద్యపానమును తొలంగింపవలయు నని తిలక్ గారు ప్రయత్నము చేసెను. ఇట్టిమద్యపానమును నిషేధించుటకు బదులుగ గవర్నమెంటువారు తమకు దానిమీదవచ్చు రివిన్యూను మాత్రమె చూచుకొనుచు నూరకుండిరి. "మద్యపాననిషేధకసంఘము" నొకదానిని తిలక్ గా రేర్పరచి, దానివిషయమై యనేకవిధముల పాటుపడెను. గవర్నమెంటువారి కీవిషయములనెల్ల తెలియపరిచెను. కాని దీనికి ఫలిత మేమి? నిజమాడిన నిష్ఠురముగద. సత్యమును బల్కు తిలకుగారి మాటలనువిని ప్రభుత్వాధికారులు గినిసిరి.

## దేశస్థితి - క్రూరశాసనప్రయోగము

దేశీయమహాసభ భంగపాటువలన దేశములో గలిగిన కలవరము నెమ్మదిగ శమింపజొచ్చెను. 1908 సంవత్సరము ఏప్రిల్ నెలాఖరునకు తిరిగి దేశములో గొప్ప కలవరము బయలుదేరెను. ఇదెంతయును కర్జనుప్రభువుగారి రాజ్యపాలనాతంత్రము

యొక్క ఫలితము ! బంగాళారాజధానిలో ముజఫరునగరములో బాంబులను ప్రయోగించి, కొందరు అరాజకులు తెల్లజాతివారిని జంప మొదలిడిరి. సూరత్తులో జాతీయసభ యొక రెండుమూడుదినములలో జరుగుచుండగ, నెవరో కొందరరాజకులు డక్కాజిల్లా మాజీమేజిస్ట్రేటును బాంబు ప్రయోగించి చంపిరి. బంగాళాగవర్నరును, చంద్రనగరపు ఫ్రెంచిగవర్నరును, చంపవలెనని కొందరు ప్రయత్నము చేసిరి. ప్రజలకును ప్రభుత్వాధికారులకునుగల సామరస్యము చెడెను. దేశమున బిట్టి కల్లంతులు జరుగుటనుజూచి గవర్నమెంటువారు ప్రజాపీడాకరము లగు శాసనములను విచ్చలవిడిగ బ్రయోగింప మొదలిడిరి. దేశనాయకుల యరెస్టులు, రాజద్రోహపు నేరముక్రింది శిక్షలు, మిక్కుటము మయ్యెను. వార్తాపత్రికలు బ్రదుకుటయే కష్టమాయెను. పత్రికాధిపతులును, ఉపన్యాసకులును బహుక్రూరదండనములకు బాల్పడిరి. ఇట్టిత్రుణములో దొరతనమువారి కన్ను కేసరీ పత్రికమీద పడకుండునా? "బొంబయి రాజధానిలో రాజద్రోహులను మేము బహిరంగముగ నణచివేయ దలచుకొన్నాము." అని బొంబయి గవర్నరుగారు బహిరంగసభలో బలికిరి. ఈమాటలను చెప్పుచుండగ వారిమనస్సులోనున్న వారెవరో మనము గ్రహింపలేమా ? కేసరీపత్రిక గవర్నమెంటువారి రాజ్యపరిపాలనా తంత్రమును నిష్కర్షగను, నిర్భయముగను ఖండించుచుండును. అందువలన దీనియెడ ప్రజలకు అత్యంతమైన యభిమానమును, ప్రభుత్వోద్యోగులకు అయిష్టమును ప్రబలుచుండెను. ఈ పత్రిక మహారాష్ట్రమునందంతటను అతివ్యాప్తమై యున్నది. ఆదినములలో "కాల్" పత్రికాధిపతులగు పరంజపేగారిని రాజద్రోహ నేరముక్రింద బొంబయి హైకోర్టులో విచారణ చేయుచుండిరి. ఈపరంజపేగారు తిలకుగారికి ప్రాణస్నేహితులు. ఈ కష్టసమయములో తనస్నేహితులైన పరంజపేగారికి సహాయముగనుండుటకై తిలకుగారప్పుడు బొంబయికి వచ్చిరి. జూన్ 23 వ తేదీని తిలకుగారిని అరెస్టుచేయుటకై ప్రభుత్వము వారు బందోబస్తు చేసిరి. జూన్ 24వ తేదీని సాయంకాలము మూడుగంటలవేళ తిలకుగారిని సర్దారుగృహమందు నరెస్టుచేసిరి.

## రాజద్రోహ అభియోగము. (1908)

ఆదివసమునందే "సింహగడ్" కోటలో నున్న తిలకుగారియిల్లును సోదా చేసిరి. సోదా చేయుచుండగ నచ్చట నొకకార్డు దొరకినది. ఆకార్డుమీద నేమి యున్నది! మందుగుండు సామానుల నేయే విధముగ తయారుచేయవలయునో తెలియజేయు రెండుపుస్తకముల పేళ్లు ఆకార్డుమీద పెన్సిలుతో వ్రాయబడియున్నవి. ఈ కార్డును కోర్టులో దాఖలు చేసిరి. విచారణసమయములో నీకార్డును గూర్చి యనవసరముగ విశేషమైన యప్రస్తుత ప్రశంసను జేసిరి. 28 వ తేదీని తిలకుగారిని మేజస్ట్రీటువద్దకు తీసుకొనివచ్చిరి. అయన జామీనుమీద తిలకుగారిని వదలిపెట్టుటకు వీలులేదని చెప్పి కారాగారమందే యుంచవలయునని తీర్మానించెను. కేసరీపత్రికలో ప్రచురించిన కొన్ని వ్యాసములు రాజద్రోహప్రేరితములుగ నున్నవను నేరముమీద (124 ఏ. సెక్షను క్రింద) వీరిని అరెస్టు చేసిరి. వీరు జెయిలులోనుండగ యిదివరకు

తా మేర్పరచియుంచిన వ్యాసములు చాలక యింక మరికొన్ని వ్యాసములను కూడ బయటికిలాగి వీరివిషయమై కూడ విచారింపవలసి యున్నదని చెప్పుచు, యీక్రొత్త వారంటును యీతనమీద జెయిలులోనుండగ జారీచేయించిరి. ఇదెంతయు నన్యాయమని తిలక్ గారువాదించిరి. కాని ప్రయోజనమేమి? జూలై 29 వ తేదీని హైకోర్టుకు “కమిట్టు” చేసిరి. అరెష్టు కాబడినప్పటినుండియు వీరు కారాగారమందే బంధింపబడియున్న కారణముచేత, తమ కేసు విషయమై యే విధమైన ప్రయత్నము చేసికొనుటకును వీలుగలుగలేదు. ఈ కేసు విచారణలో నొక విచిత్రము తటస్థించినది. 1897 సంత్సరములో వీరిమీద నిట్టికేసే వచ్చినప్పుడు తిలక్ గారి పక్షమున “దేవరు” గారను నొక గొప్పప్లీడరొకరు వాదించెనని చెప్పియుంటిమి. అప్పుడీ దేవరుగారు తిలక్ గారి పక్షముబూని, జామీనుమీద తిలక్ గారిని వదలపెట్ట వలసినదని గట్టిగ వాదించి, అప్పుడు జడ్జిగనున్న తయ్యాబ్జీగారిని తన వాదమువలన ఒప్పించి, తిలక్ గారికి జామీనిప్పించెనని యిదివరకు చెప్పియుంటిమి. ఇట్టి దేవరుగారే యీ తరుణమున జడ్జిపదవికి వచ్చి తిలక్ గారి కేసును విచారించుట తటస్థమయ్యెను. ఇప్పుడు తిలక్ గారి పక్షమున “జిన్నా” యను బారిష్టరుగారొకరు వాదింపబూనుకొనిరి. జామీనుమీద తిలక్ గారిని వదలిపెట్టవలసినదని జడ్జిగ కూర్చునియున్న దేవరుగారికి జిన్నాగారు పిటీషను పెట్టిరి. కాని యందుపైని దేవరుగారేమని సెలవిచ్చిరి? “ఇదివరకు 1897 సంవత్సరములో తయ్యాబ్జీగారు జామీనిచ్చినమాట వాస్తవమే. కాని అప్పుడు జామీనిచ్చుటలో తయ్యాబ్జీగారు జామీను యొక్క “లా” ను కూర్చి చెప్పిన యభిప్రాయము సరియైనది కాదు. దానితో నే నిప్పు డేకీభవింప జాలను; గనుక నేనిప్పుడు తిలకునకు జామీనీయజాలను” అని అపిటీషనును కొట్టివేసెను! ఆహా! చూచితిరా విచిత్రము! ఎంతలో నెంతమార్పు! 1897 సంవత్సరములో జామీనిచ్చుట న్యాయమని వాదించి తయ్యాబ్జీ జడ్జీగారిని ఒప్పించిన యీ దేవరుగారే యిప్పుడు 1908 సంవత్సరములో జడ్జిపదవిని యలంకరింపగనే తమ యభిప్రాయము నే విధముగ మార్చుకొనవలసి వచ్చెనో చింతింపుడు! అదిగాక యీ కేసును విచారించుటకై “మాకు ప్రత్యేకము జ్యూరీ యుండవలయును”ని గవర్నమెంటు తరపుప్లీడరు వాదించెను. దానికి తిలక్ పక్షమువారభ్యంతరపరచిరి. కాని జడ్జిగారగు దేవరుగారు గవర్నమెంటు పక్షమువారి వాదమునే యామోదించి, వారి యిష్టప్రకారమే, యెక్కువమంది యూరోపియనులు గల జ్యూరీని యేర్పాటు గావించెను. ఈ జ్యూరీలో 7 గురు యూరోపియనులును యిద్దరు పార్సీలు నుండిరి. ఈ నేరము క్రిందదీసికొని రాబడిన వ్యాసములు మహారాష్ట్రభాషలో వ్రాయబడియున్నవి. మహారాష్ట్రభాష యన నేమియో ముక్కయైన నెరుంగని యీ యూరోపియనులు జ్యూరీగ నేర్పరచుట యేటిన్యాయమో మన మూహింపజాలము.

## విచారణ 6 సం॥ల కారాగారశిక్ష

ఆ 1908 సం॥ జూలై 13 వ తేదీని విచారణ ప్రారంభమయ్యెను. ఇది యత్యద్భుతమైన విచారణ. ఇట్టిదెప్పుడును యెచ్చటను జరిగియుండలేదు. భారతీయుల

గౌరవమును గాపాడుటకును, దేశములోనుండు వార్తాపత్రికల స్వాతంత్ర్యమును నిలువబెట్టుటకును, తిలక్ గారు తామే స్వయముగ, బొంబయి హైకోర్టులో వాదింప జొచ్చిరి. విచారణ మొదలుపెట్టిన 3 వ దినము సాయంత్రము 4 గంటలకు తిలక్ గారు తమ పక్షపు వాదమును ప్రారంభించి, 8 వ దినము నాటికి ముగించిరి. తిలక్ గారు 21 గంటల పది నిముషముల సేపు, ఘంటాపథముగ వార్తాపత్రికలస్వాతంత్ర్య రక్షణార్థమై, హోరాహోరిని బొంబయి హైకోర్టులో వాదించెను. ఇట్టి వాదము నెన్నడు నెవరును వినియుండలేదు. [illegible] పిమ్మట గవర్నమెంటు తరపున ఆడ్వకేటుజనరలు వాదించెను. కాని తిలక్ గారు వేసిన ప్రశ్నల కొకదానికిని ఆడ్వకేటు జనరలుగారు సరియైన ప్రత్యుత్తర మీయలేక పోయిరి. జడ్జీగారు యీకేసును రాత్రి 10 గంటలవరకును విచారించుచునే యుండెను. రాత్రి పదిగంటలవగాను "జ్యూరీ"ల యభిప్రాయమేమి యని యడుగగ, 7 గురు యూరోపియనులును "తిలక్ దోషి" యని తమ యభిప్రాయమును దెల్పిరి. ఈ మెజారిటీ యభిప్రాయప్రకారము దేవరుగారు తిలక్ గారికి ఆరు సంవత్సరముల ప్రవాసశిక్షయు ఒక వేయిరూపాయిల జరిమానాయును విధించిరి. కాని యీశిక్ష చెప్పుటకు పూర్వము "నీవింక నేమైన చెప్పుకొనదలచినయెడల చెప్పుకొనవచ్చునని" జడ్జీగారు తిలక్ గారి నడిగెను. అంతట తిలక్ గారు చలింపని హృదయముతో నచలాక్షితులై నిలువబడి నిర్భయముగ భావోద్రేక పూరితములగు నీవాక్యములబల్కిరి. "నేను దోషినని జ్యూరీ తమ యభిప్రాయమును దెలిపినప్పటికిని, నేను నిర్దోషిననియే గట్టిగ వాదింతును. ఈప్రపంచములోని సమస్తకార్యములను పరిశీలించి న్యాయాన్యాయములను పరిష్కరించు తీర్పరులు వీరి యందరికంటెను పైన కలరు. నేను స్వేచ్ఛగ వర్తింపుచుండుటకంటె, నేను కష్టపరంపరల పాలైననే, నేబూనిన యీకార్య మెక్కువగ సఫలత నొందునని, బహుశః ఆసర్వేశ్వరుడు తలంచి యుండవచ్చును" ఆహా! యీ మాటలు వినిన నే భారతీయుని హృదయము కరగదు? ఆ యధికారపదవి నలంకరించిన ఆ దేవరుగారొక్కరే వానిలోని నిజభావమును గ్రహింపలేక "యివన్నియు పట్టిబూటకపు మాటలు"ని మీదుమిక్కిలి తిలక్ గారినే నిందించెను గాని, నిజమైన భారతమాత పుత్రుడైన వాడెట్లు యీ మాటలకు గరగి నీరైపోడు? అట్టి సందిగ్ధావస్థలో సామాన్య మానవుడైనయెడల నిట్టి గంభీరవాక్యములు నోటినుండి వెడలి రాగలవా? సామాన్యనరుల కతీతమైన నిట్టికార్యముల గావింప తిలక్ గారి బోటి మహనీయులకే చెల్లును గాని యితరుల కెంతవారికైనను సాధ్యమగునా!

రాత్రి రెండు జాముల వేళ శిక్ష చెప్పగనే, యిదివరకే సిద్ధముచేసి యుంపబడిన మోటారుబండిలో తిలక్ గారి నెక్కించి కొంతమంది సిపాయిలపారాతో, తెల్లవారు సరికి బొంబయి దాటించి త్వరత్వరగ అహమ్మదాబాదు పట్టణమునకు జేర్చిరి. పిమ్మట కొంతకాలమునకు బర్మాదేశములోని మాండలేకోటకు తీసికొనిపోయి యచ్చట ప్రవాసములో నుంచిరి.

## ప్రజలయుద్రేకము

ఇచ్చట బొంబయిలో తెల్లవారునరికి తిలకుగారిని బొంబయి దాటించిరను వార్త వాయువేగ మనోవేగములతో పట్టణమంతయు వ్యాపించెను. ప్రజలయందు కలవరముపుట్టెను. ప్రజలందరును దుఃఖాక్రాంతులైరి. అత్యుగ్రులైరి. దుకాణములు ఫ్యాక్టరీలు మూసివేసిరి. యావత్తువ్యాపారము నాపివేసిరి. చేతులలో లాఠీలు పుచ్చుకొని 'తిలకుగారెక్కడ! ఎక్కడ! తిలకుగారిని మాకు చూపింపవలసినది'' అని వీధులవెంట పరుగెత్తుచు యూరోపియ నుద్యోగస్థుల జంప యత్నించిరి. యూరోపియనులకంపెనీల తలుపులు పగలగొట్టిరి! పట్టణమంతయు నల్లకల్లోలమయ్యెను. ఈ గల్లంతు నంతయు నణచుటకు శిపాయిలను, తుపాకులను, రావలసి వచ్చెను. అంతట కొంతవడికి సద్దణగెను. తిలకుగారనిన దేశప్రజల కెట్టిగౌరవము, అభిమానము, ప్రేమ, భక్తి గలదో మనము దీనివలన తెలిసికొనవచ్చును! ఆ మహనీయుని దేశోపకారబుద్ధియే యిట్టి ప్రజాప్రేమకు, యిట్టి ప్రజారంజకత్వమునకు కారణమని వేరుగ చెప్పవలెనా?

## దేశ మెట్లుండెను ?

తిలకు మహనీయుడు కారాగారమునందున్న ఆరు సంవత్సరముల దీర్ఘకాలమున దేశస్థితి యెట్లుండెను? వీరి యనుచరులైన జాతీయవాదులు గవర్నమెంటువారి యాగ్రహమునకు గురియైరి. ప్రజాపీడాకరములగు శాసనములు విచ్చలవిడిగ దేశమునందంతటను సంచారము చేయుచు గవర్నమెంటువారి బుజ్జగింపులకు పాత్రులైన మితవాది నాయకులను సైతము బాధింపజొచ్చెను. అప్పటి సూరత్ సభాభంగపాటువలన గలిగిన వ్రణమింకను మానలేదు. తమ ప్రతిపక్షనాయకుడగు తిలకుగారు కారాగారమునందు బంధింపబడుటచే మితవాదులకు కొంత ఊపిరి పుచ్చుకొనుట కవకాశము చిక్కినది గాని, క్రమక్రమముగ వారికిగూడ గవర్నమెంటు వారివలన చిక్కులు రాదటస్థించెను. ఎంత మితవాదపక్షపు పత్రికయైనను విశ్వవ్యాపకము గల ముద్రణాశాసనము క్రిందికి రావలసివచ్చెను.

## స్వాతంత్ర్య వాయువులు

పిమ్మట కొంతకాలమునకు హార్డింజిప్రభువు వైస్రాయిగ వచ్చెను. ఒక్క మన భారతవర్షంబుననే గాక ప్రపంచమునందంతటను స్వాతంత్ర్యవాయువులు వీవ నారంభించెను. ఈ వాయువులు తొందరతోడనే పర్షియా చైనా మొదలగు ఆశియాఖండములోని దేశములుకూడ తెలుపు నారంభించెను. అదిగాక ఆన 1911 సంవత్సరములో జార్జి రాజేంద్రుడు మనదేశమునకు వేంచేసి ఢిల్లీసింహాసనమున పట్టభద్రుడై బంగాళా విభజనను రద్దుపరచి, దేశప్రజల మనంబులలో శాంతి నెలకొల్పెను. దేశప్రజల హృదయోత్సాహము పెరికివైచెను. దేశనాయకులలో తిరిగి యైకమత్యమును నెలకొల్పవలయునని కొందరు యత్నించిరి. కాని బొంబయిలోని మితవాదులు దీనికి సమ్మతింపలేదు. తిలకుగారు లేనిసమయములో కెల్కారుగారును, అన్నాసాహెబు పట్వరను

గాటను మహారాష్ట్రములో జాతీయవాద పక్షమును పనిచేయుచుండిరి. కేసరీ,మరాటా పత్రికలను, నశించిపోకుండ, కాపాడుచుండిరి. దేశనాయకులలో నైక్యము కుదురు తయుణమింక రానున్నదను కాలేదు. వీరందరును తిలకుగారి విడుదలకై యెదురుచూచు చుండిరి. వీరిట్లు చూచుచుండగ, భగవదనుగ్రహమున తిలకుగారు విడుదల జేయబడిరి.

## కారాగార విముక్తి

ఆన 1914 సంవత్సరము జూన్ నెలలో నొకనాటి రాత్రి, రెండు ఝాముల వేళ, యెవరికి తెలియకుండ, నూరింకేయము మాటు మణిగిన తరువాత ఒక మోటారు బండిలో తిలకు గారిని తీసికొనివచ్చి, పునహాలో వారియింటి వద్ద వదలి వేసివెళ్ళిరి. మొందటు ఆరుసంవత్సరముల క్రింద వీరిని తీసికొని వెళ్ళినప్పుడును తిరిగి యిప్పుడు విడుదల జేసినప్పుడును, ఈరెండు పర్యాయములను వీరిని రాత్రిరెండు జాములవేళనే కదలించిరి ! దీనికి కారణ మేమి ?

తెల్లవారునప్పటికి తిలకువారినిని విడుదల చేసిరను వార్త యూరంతయు వ్యాపించెను. వెంటనే జనులు వీరియింటి చుట్టుమూగి, యిసుక వేసినను, రాలకుండ నగ రంతయును, మరునాటి రాత్రి వరకును, వీరి దర్శనమునకై యత్యుత్సాహముతో నెదురు చూచు చుండిరి. వీరిస్నేహితు లందరును వచ్చి, ఆనంద బాష్పములతో, హృదయ సంతోషమును వెలుబుచ్చు ముఖ కాంతితో పరుగెత్తుకుని వచ్చి, వీరినికౌగ లించుకొని, తమసంతోషమును నోటి మాటలతో జెప్పలేక నయనముల ద్వారా వెలి బుచ్చిరి.

## ఆహ్వానము

పిమ్మట కొన్ని దినములకువీరికి ఆహ్వాన పూర్వకముగ గొప్ప యుత్సవమును చేసిరి. ఆనాడు దేశ దేశముల నుండి ప్రజలుమూగి, తిలకు మహనీయుని సందర్శించి తమ జన్మములు తరించినవని సంతుష్టాంతరంగులై యుండిరి. తిలకు గారి యింటి యెదుట నున్న పెద్దమైదాన మంతయు ప్రజాసమూహముతో నిండిపోయెను. పైన ఆకాశ మంతయు మబ్బులతో క్రమ్ముకొని, కొంచెము కొంచెముగ తుంపర పడనారంభించెను. కాని ఒక్కరును కదలలేదు. పిమ్మట తిలకుగారు వచ్చి తమయెదుట నిలువ బడగనె, ప్రజాసమూహ మంతయు నొక్కసారి సాష్టాంగ దండ ప్రణామము నాచరించిరి. ఆకాశ వాణి సైతము ఆనంద బాష్పములు గురిపించెను. ఆదినమున ప్రజలు వారికి వేసిన పూల హారములకు మితము లేదు. ఇదంతయు నైన తరువాత, తిలకు గారు లేచి నిలుచుండి కొంచెము సేపు ప్రసంగించిరి. తానారు సంవత్సరముల క్రిందట స్వదేశమును బాసిపోతి ననియు, యీలోపుగ నిచ్చట నేమి జరిగి నదియు తనకు తెలియ దనియు, కనుక ఈవిషయముల నన్నిటిని తాను తెలిసికొని యిక ముందేమి చేయవలసి యుండునో పరిష్కరించు కొనవలసి యున్నదనియు వారు నుడివిరి. అంతట ఆనాటి సభముగిసెను. తిలకు గారినిగూర్చి యనేక లనేకవిధ

ముల తలపోయ మొదలిడిరి. ''ఇన్ని సంవత్సరముల శిక్ష యనుభవించి వచ్చినాడు గనుక, యికనేమియు మాట్లాడడనియు గవర్నమెంటుతో సమాధానపడి యుండు ననియు'' కొందరు తలంచిరి. 'తనకిన్ని సంవత్సరము లన్యాయముగ గవర్నమెంటు వారు శిక్షను వేసిరను క్రోధముతో మరింత రౌద్రాకారము దాల్చున'ని మరికొందరు తలంచిరి. ''ఇంక నేమున్నది! అంతయు చల్లారిపోయినద''ని మరికొందరు తలంచిరి. ఇట్లు పలువురు పలుతెరగుల దలపోయుసాగిరి. కాని బొంబయి గవర్నరుగారగు వెల్లింగుడన్ ప్రభువు మాత్రము వీరియం దేవిధమైన ద్వేషభావమును వహింపక ఆదరముతో జూచుచుండిరి.

ఆరుసంవత్సరముల ప్రవాసశిక్షను వీరెట్లు సహింపగలిగిరి? వీరికి శిక్షవిధించు నప్పటికే 52 సంవత్సరముల వయస్సుకలదు. అప్పటికి వీరి దేహారోగ్యము కూడ మంచి స్థితిలో లేదు. * ''ఇవన్నియు విచారింపగ దేవరుగారు విధించిన యీ యారు సంవత్సరముల కారాశిక్షయు కొంచమించుమించుగ మరణదండనయే యని ప్రజలందరును భయపడిరి. ప్రభుత్వమువారి మనశ్శాంతికై తిలకును యీ దేశమునుండి ఆరు సంవత్సరములపాటు, వెడలగొట్టవలెనని దేవరుగారు శెలవిచ్చియున్నారు. ఇట్టి స్థితిలో, ఆరుసంవత్సరముల శిక్షను అనుభవించి, తిలక్‌గారు తిరిగి స్వదేశమునకు వచ్చి చేరుట కేవలము భగవదనుగ్రహము వలననే గాని వేరుకాదని నిశ్చయమగు చున్నది. ఆరుసంవత్సరముల కారాదండనము విధించిన ఆ దేవరుగారిప్పుడు పరలోకమున నున్నారు. పాపమిప్పుడా గాథల నన్నిటిని మనము త్రవ్వనేల''

## గీతారహస్యము

తిలక్‌గారెన్ని కార్యములలో మగ్నులైయుండినను సదా వేదములు, భగవద్గీతలు, ఉపనిషత్తులు, మొదలగు జాతీయోద్గ్రంథములను పఠింపుచుండెనని చెప్పియుంటిమి. వీరు కారాగారమునందున్న యారుసంవత్సరముల కాలమును, వీరూరక కూర్చొనక ''గీతారహస్యము'' అను మహోత్కృష్ట గ్రంథమును మహారాష్ట్ర భాషలో వ్రాసిరి. ఇది భగవద్గీతలమీద వ్యాఖ్యానము. అందు ముఖ్యముగ ''కర్మయోగము''ను గూర్చి విస్తరించి వ్రాసియున్నారు. వీరు కారాగృహమునుండి విడుదలయైన పిమ్మట నీ పుస్తకమును ప్రచురించిరి. ప్రచురించినవారము దినములలోనే వేలకువేల ప్రతులు అమ్ముడు పోయినవని చెప్పిన, నీ గ్రంథప్రాశస్త్యమును కొంత వరకు తెలిసికొన నగును. ఈ గ్రంథము హిందీ గుజరాతీ మొదలగు ననేకభాషల లోనికి తర్జుమాచేయబడినది. మన యాంధ్రులభాగ్యవశమున, తెనాలి సంస్కృత పాఠశాలాధ్యక్షులగు బ్రహ్మశ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులవారీ గ్రంథమును తెలిగించిరి. ఈ గ్రంథములోని పీఠిక సన్నని అచ్చుతో వేయబడిన 800 పేజీలున్నవి.

* Step in the Steamer అనే పుస్తకపు పీఠికలో బాబుమోతీలాల్ ఘోషుగారు వ్రాసియున్నారు.

శ్లోకములును వ్యాఖ్యానములును కలిపి 400 పేజీలున్నవి. ఈ గ్రంథము మన భాష కెంతయు వన్నె పెట్టు చున్నది.

## గ్రంథప్రాశస్త్యము

ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యమేమి ? శ్రీ శంకరులవారు వ్రాసిన గీతా "భాష్యము" నకును, యీ "రహస్యము" నకును గలతారతమ్యమేమి ? ఈ వాద ప్రతి వాదముల నన్నిటిని నేనిచ్చట వ్రాయుటకు సాధ్యపడదు. అయినను వీనిలోని ముఖ్యాంశముల నొకటి రెంటిని మాత్రము చెప్పి ముగించెదను.

సంసారబంధములనుండి తప్పించుకొని, మోక్షము నొందవలయునని నరునకు బ్రహ్మాత్మైక్యజ్ఞానమావశ్యకము. "ఈ జ్ఞానము శ్రౌతస్మార్తకర్మలను నిష్కామబుద్ధితో నాచరించుటచే సిద్ధించును. జ్ఞానము కలిగినపిదప సంచితములైన పుణ్యపాప కర్మలన్నియు నశించును,......... జ్ఞానము కలిగినపిదప నుండుస్థితికే "జీవన్ముక్తావస్థ" యందురు. జ్ఞానిచే చేయబడు నెవిధమగు పుణ్యపాప కర్మలయొక్కయు కర్తృత్వమాతని కుండదు ...... అవి యున్నను లేనివానితో సమానములే. మోక్షమునకు ప్రతిబంధకములగు పూర్వోత్తరములగు పుణ్యపాపకర్మలు జ్ఞానముచే నశించును గావునను, అవివాని నంటనేరవు గావునను, జ్ఞానికి దేహపాతానంతర మవశ్యము ముక్తి లభించును." నరునకు జీవన్ముక్తావస్థ సిద్ధించువరకు నుండవలసినవిషయములయందెల్ల శ్రీ శంకరులవారికిని, లోకమాన్యులకును భేదాభిప్రాయ మేమాత్రమును లేదు. ఇక జీవన్ముక్తావస్థ సిద్ధించినది మొదలు, దేహపాతపర్యంతమును జ్ఞాని కాల మెటుల గడపవలయును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుటలో మాత్రము యిరువురకును మతభేదము కలదు. జ్ఞాని కర్మచేయవలయునా ? చేయ నక్కరలేదా ? కేవలము తన ఆత్మకు మోక్షము లభింపవలయుననిన, జ్ఞాని కర్మచేసినను, చేయకున్నను ఒకటియే. "ఆత్మజ్ఞాని యాప్తసర్వ కాముడగుటచే బొందదగిన దేదియు లే నేలేదు గాన నాతండు సర్వకర్మలను, కర్మసాధనములను, యజ్ఞోపవీతము, శిఖ మొదలగు నన్నిటిని పరిత్యజించి, యుదరనిర్వాహార్థమై భిక్షాటనము మాత్రము చేయవలయుననియు, మిగిలినకాలమువంతను ఆత్మచింతనమునందే గడపవలయుననియు, మరియొక కార్యము నెంతమాత్రమును చేయకూడదనియు భగవత్పాదుల యభిప్రాయము." కేవలము మోక్షదృష్టితో నైనయెడల యీయభిప్రాయము తిలకుమహాశయునకు సైతము సమ్మతమే. అదిగాక నివృత్తి, ప్రవృత్తి, (అనగా — కర్మచేయకుండుట, కర్మచేయుట) మార్గముల రెంటియందును జ్ఞానికి అధికారము గలదని శ్రీ శంకరాచార్యులవారే యొప్పుకొనియున్నారు. జ్ఞాని యీ రెంటిలో నేది యిష్టమైన నది చేయవచ్చునని శ్రీ శంకరులవారు ఒప్పుకొనియున్నారు. ఈ మతము సైతము లోకమాన్యులకు సమ్మతమే. రెంటియందును జ్ఞాని కధికారము కలదని తిలకుమహాశయులు సైతము సమ్మతించిరి.

కాని వీరికిక భేదమెక్కడ ? వీరిద్దరికిని రుచిభేదము మాత్రము కలదు. శ్రీ శంకరులవారికి నివృత్తిమార్గమును శ్రీ లోకమాన్యులకు ప్రవృత్తిమార్గమును రుచించినవి. అవునుగాక ! రుచిభేదముండవచ్చును. ఒకరికొకటి యిష్టముకావచ్చును, మరియొకరికింకొకటి యిష్టముకావచ్చును. దానికై లోకమాన్యులేమియు తగాదాచేయరు. "నామతమే మంచిది, నీ మతము మంచిదిగాద"ని వారెన్నటికి ననరు.

ఇప్పుడు వచ్చినతగాదా యెక్కడ? భగవద్గీతలో శ్రీకృష్ణులవారు బోధించిన మతమేది ? శ్రీ శంకరాచార్యులవారి కేది రుచి, శ్రీ లోకమాన్యుల కేది రుచి—యను విషయముకాదు మనమిప్పుడు పరిష్కరింపవలసినది. శ్రీకృష్ణులవారి కేది రుచి ? యను విషయమును పరిష్కరింపవలయును. అందులో ముఖ్యముగ యుద్ధరంగమున "నేను యుద్ధముచేయను" అని నిరుత్సాహియై కూర్చున్న అర్జునునకు శ్రీకృష్ణులవారా సమయములో "నాకిది సమ్మతము" అని యేమతమును బోధించెను. ఆ విషయమే, ఆమతమే, మనమిప్పుడు తెలిసికొనవలయును. మోక్షదృష్టితో కాకపోయినను, తుదకు లోకసంగ్రహార్థమైయైనను జ్ఞాని కర్మలను చేయవలయును. "లోకసంగ్రమే వాపి సంపశ్యన్ కర్తు మర్హసి" ఆకర్మలను నిష్కామబుద్ధితో, ఫలాపేక్షరహితముగ, చేయవలయును. జ్ఞాని నిష్కామకర్మాచరణము చేయుచున్నాడు గనుక, ఆకర్మలు తనకంటవు. ఆకర్మఫలము తనకంటదు. ఇట్టికర్మలు మోక్షమునకు ప్రతిబంధకములు కావు. "జ్ఞాని యీ లోకమున తనకు కావలసినదేదియు లేకపోయినను, లోకసంగ్రహార్థమైయైనను కర్మలను చేయవలెను. "ఈమతము నాకు పరమసమ్మతము, ఈ మతము నాకు రుచించినది"అని శ్రీకృష్ణులవారు తమరుచిని స్పష్టముగ తెలియజెప్పియున్నారు. "నాకీలోకములో కోరదగినదేదియులేకపోయినను, నేనీలోకమునకు వచ్చి, లోకసంగ్రహార్థమై, కర్మలను నా నెత్తిపైన వేసికొని చేయుచున్నాను" అని శ్రీకృష్ణులవారే చెప్పియున్నారు. మోక్షప్రాప్తికి నివృత్తి ప్రవృత్తిమార్గములు రెండును స్వతంత్రమార్గములని చెప్పుచు, లోకసంగ్రహదృష్టితో జూచినయెడల, ప్రవృత్తిమార్గమే శ్రేయస్కరమని స్పష్టముగ శ్రీకృష్ణులవారు పల్కియున్నారు. "సన్న్యాసం కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ, తయోస్తుకర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే" ఈ విషయమునే తిలకమహాశయులవారు తమ "గీతారహస్యము"లో విశదీకరించి యున్నారు. అందువలననే యీ గ్రంథమునకు కర్మయోగశాస్త్రమని పేరిడిరి.

కాని శ్రీశంకరులవారు గీతలకు భాష్యమును వ్రాయుటలో "నివృత్తిమార్గమే గీతలకు సమ్మతము" అను నభిప్రాయమును దెల్పిరి. శ్రీకృష్ణులవారికి "నివృత్తిమార్గమే రుచి" యని తెల్పిరి. సుస్పష్టముగను, నిస్సందేహముగను, నిస్సందిగ్ధముగను, సరళముగను, గనుబడుచున్న శ్లోకములలోని మాటలను విరిచి పెడార్థమును లాగిననే గాని యిట్టి యభిప్రాయము రాజాలదనియు, ఇది కేవలము శ్రీకృష్ణులవారి— యుద్ధరంగమున నర్జునునకు సారథ్యమును నడుపుచున్న శ్రీకృష్ణులవారి—మతమునకు

విరుద్ధమనియును తిలకమహాశయులు సహేతుకముగ ఋజువుపరచిరి. శ్రీ శంకరా చార్యులవారికి, స్వయముగ నివృత్తిమార్గము రుచించిన రుచించునుగాన, అంతమాత్ర ముచే భగవద్గీతలలో శ్రీకృష్ణులవారికి రుచించినమార్గముకూడ నివృత్తిమార్గమేయని చెప్పుట సాహసమని తిలకుగారు చెప్పియున్నారు. ఆవాదప్రతివాదముల నన్నిటిని మూలగ్రంథము జదివిననేగాని బోధపడదుగాన పాఠకమహాశయుల కీ ముఖ్యవిషయ ములను మాత్రము చెప్పి, మిగిలిన వివరములన్నిటికొరకై మూలగ్రంథమును జూడ ప్రార్థింపుచున్నాడను.

## నిష్కామ కర్మబోధ

శ్రీలోక మాన్యుల మనస్సున కెక్కిన మతమీ నిష్కామ కర్మాచరణమే గాన, వారికెన్ని యిక్కట్టులు సంభవించినను, కారాగారమునందుండగ సతీ వియోగము కలిగినను, వీనినన్నిటి నవలకు ద్రోచి, కర్మఫలమును గోరక, తమ స్వధ ర్మమును నెరవేర్పగలిగిరి. ఆహా! హృదయ దౌర్బల్యము గలవారికీ గీతాసారము అమృత ప్రాయముగద! ఎన్ని యిక్కట్టులువచ్చినను, నిరుత్సాహమును జనింప జేయక, నరుని జీవిత యాత్రను విజయ వంతముగ గొనసాగింపజేయునదీ గీతా మృతమే. ఈ గీతా సారమును గ్రోలిన మహామహులు ధన్యులు. మనకెన్ని సామ్రాజ్యములు పోయినను, ఎన్ని కోహీనూరు వజ్రములు పరుల పాలైనను, ఎన్ని రత్నరాసులు మాయమై పోయినను యీ గీతామృత పానముచే మన భారతీ యులు జీవింపగలిగి యమర్త్యత్వమును బొందగలిగిరి. ప్రస్తుతము మనముకూడ తిలక్ మహాశయునిచే నొసంగబడిన, యీ గీతా మృతమును పానముచేసి ధన్యుల మయ్యెదముగాక. లోకమునకిట్టి యమృతమొసంగినవారవతార పురుషులుకారా? తిలక్ మహాత్మున కెన్ని యిక్కట్టులు సంభవించినను వారిని కాపాడగలిగినదేది? ఈ నిష్కామ కర్మయే, యీ గీతా సారమే. "గీతా శాస్త్ర పయోధి వీచి కలలో నెందరో గ్రీడించిరి. కాని తన్నవనీతమొక్కరికిని చిక్కలేదు" ఆ నవ నీతమును బొందగలిగినవారు యీ కాలమునకు తిలక్ మహనీయు లొక్కరే. ఆన 1915 సంవత్సరములో వీరు నాశికా పట్టణమునకు బోయినప్పుడు, అచ్చటిబ్రాహ్మణు లందరును వీరిని సందర్శించి, వీరికి "కర్మయోగాచార్య" యను బిరుదు నొసంగిరి. తన దేశ ప్రజలచే, నందుసమకాలికులచే మెప్పొందిన మహనీయులెంతవారై యుండవలెను. ఏలననగ: చేమకూర వేంకట కవిగారు చెప్పినట్లు "ఏగతి రచి యించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా"! ! సమకాలమువారలచే మెప్పొం దినవాడే మహనీయుడు.

## ఐరోపా సంగ్రామము, రాజభక్తి

లోక మాన్యులు చెరసాలనుండి విడుదలయైన రెండు మాసములలోనే, ఐరోపా ఘోర సంగ్రామదవాలనము ప్రపంచము నంతను ముట్టడించెను. గర్మ

రక్షణార్థమై మన ప్రభువులుకూడ నీ సంగ్రామాగ్నిలో నురకవలసినవారైరి. ఈ యుద్ధము ప్రకటింపబడిన వెంటనే, లోకమాన్యులొక బహిరంగలేఖను వ్రాసి, దేశ ప్రజల కందరకును ప్రకటించెను. ఏమని ప్రకటించెను? "ధర్మ సంరక్షణార్థమై మనప్రభువులీ సంగ్రామములో కత్తి దూయవలసివచ్చినది గనుక, ధర్మ సంరక్షణమే దీక్షగాగల మన భారతీయు లెల్లరును, యీ సంధిగావస్థలో, మనశక్తివంచనలేక, మన ప్రభువులకు సమస్త విధముల సాయపడవలసినది. మన రాజభక్తిని జూపుట కిదియే మంచి యనుకూలమైన తరుణము. ఈ యవకాశమును మనము జారవిడువకూడదు." అని ప్రజలనుద్బోధించెను. దీనిని జూచియైనను, అధికార ధూర్వహులు, తిలక్ గారు బ్రిటిష్‌వారిని ద్వేషించువాడుగాడని తెలిసికొందురు గాక. కాని యీ రాజ్యపాలనా పద్ధతిలోనుండు లోపములను ఖండించుటలో మాత్రము వెనుదీయడు. అంతమాత్రముచేత నీ మహనీయుని రాజద్రోహియను టెంతయుతగదు. ఆంగ్లేయులతో బాటు భారతీయులకుకూడ సైన్యములో సమాన పదవుల నొసంగినయెడల, రెండు మాసములలో 50 వేల మంది ప్రజలను సైన్యములోనికిచేర్చెదననియు, తానట్లుచేర్చ లేక పోయినయెడల, ఆసంఖ్యకుకొరవడిన మనుష్యుని కొక్కొంటికి 100 రూపాయిల చొప్పున జరిమానా నిచ్చుకొనెదననియు, యీ మహనీయుడు బొంబయిలోబహిరంగముగ ప్రతిజ్ఞచేసెను. వీరి రాజభక్తిని వెల్లడిజేయుట కింతకంటె నేమి కావలయును? వీరు కారాగారమునందున్న కాలములో యీ మహనీయుతేర్పరిచిన యనేకమైనదేశోపకారకములగు యేర్పాటులకు భంగము కలిగెను. అందుముఖ్యముగ స్వదేశ పరిశ్రమాభివృద్ధికై యేర్పాటు గావించిన పైసాఫండు, శివాజీ, గణపతి యుత్సవములు మొదలగునవి మందగించెను. వీరు చెర సాలనుండి విడుదలయైన పిమ్మట వీనినన్నిటిని పునరుద్ధరించి, వీనికి నూతనోత్తేజము నొసంగెను. తమకువచ్చిన కష్టములకు జంకి, ముందుతామేమి జేయవలసినదియు తెలియక, అంధకారమునబడి దారిగానకయున్న యువకులకు నిష్కామకర్మాచరణమును బోధించి, వారికి నూతనోత్సాహము నొసంగెను. ఈ పనికై వీరు పునరుద్ధరించిన గణపత్యాది యుత్సవము లెంతయు సాయపడినవి. ఈ యుత్సవ సందర్భములలో దేశ ప్రజలకు వీరు నిష్కామ కర్మాచరణమును బోధించెను. దేశోపకారమే, దేశోద్ధరణమే, మనకు పరమ మోక్షమని యువకులకు బోధించి, వారి హృదయ శల్యములను బాపెను. ఇతర నాయకులకును, వీరికినుండు భేదమిచ్చటనేయున్నది. తక్కిన నాయకు లెల్లరును పాశ్చాత్య నాగరికతావ్యామోహంబునబడి ఆపాశ్చాత్య మార్గములనే, ఆపాశ్చాత్య ధర్మములనే, ఆపాశ్చాత్య భౌతిక దృష్టినే, మన ప్రజలకు ఉపదేశింప బూనుకొనెదరు. ఇవి మనప్రజలకెట్లు రుచించును? ఇవి మనప్రజలమనస్సులకెట్లెక్కును? ఇవి మన ప్రజల మనస్సుల నెట్లాకర్షించి, రంజింప గలవు? ఇవి మనకు వంటబుట్టినవి కావు. కాని లోకమాన్యులన్ననో; కేవలము మన భారత ధర్మముల యొక్క మూర్తి భావమే యనుని నమ్మివచెను. మనకు మోక్షము గలిగిన మన సనాతన ధర్మముల

మూలముననే గలుగవలెనుగాని, పాశ్చాత్య నాగరికత వ్యామోహంబున నెంత మాత్రమును కలుగనేరదు. ఈ రహస్యమే లోకమాన్యుల ప్రతిభకు మూలకారణము.

## జాతీయసభ స్థితి

ఇక నీ విషయములనటుంచి మన మిప్పుడు రాజకీయ విషయములను గూర్చి విచారింపుదము. ఆన 1907 సంవత్సరములో సూరత్ పట్టణమున జాతీయ సభ విచ్ఛిన్నమైనప్పటినుండియు జాతీయవాదులా సభకు బోవుటలేదు. తిలక్ గారు కారాగారమున నుండవలసివచ్చెను. అప్పటినుండియు నీసభ కేవలము మితవాద నాయకుల చేతిలోనుండెను. తరుపరి యాసభవారేర్పరిచిన కొన్ని నియామకముల వలన జాతీయవాదులా సభలోనికి పోవుటకే వీలు చిక్కలేదు. ఉభయపక్షముల వారికిని తీవ్రభేదము లేర్పడెను. జాతీయ సభలో జాతీయవాదులు లేనికారణముచే, ఆసభ నేతిబీరకాయ చందమయ్యెను. ఆ సభ సహజ చైతన్యమును గోల్పోయి కేవలము జీవన్మృతయై యుండెను. ప్రతివత్సరమును ఆసభాకార్యము లేదో విధముగ, కొన్ని కొన్ని యిప్పటి దేవాలయములలోని వత్సరోత్సములవలె, పేరునకు మాత్రము జరుగుచుండెను. కాని ప్రజలలో నూతనోత్సాహమును బుట్టించి జీవన బలము నొసంగలేక పోయెను. అనగ, తన స్వధర్మము నెరవేర్పలేక పోయెను. రాను రాను అది శుష్క ప్రదర్శనము క్రిందికి దిగెను. పిమ్మట మితవాదులలోనే కొందరికీ సభయొక్క నిరుపయోగత తెల్లముగా జొచ్చెను. జాతీయ వాదులనుగూడ నీ సభలోకి రానిచ్చిననేగాని యీ సభకు తిరిగిప్రాణము రాదని గ్రహింప జొచ్చిరి. ఉభయ పక్షముల వారును సమాధాన పడిననేగాని దేశమునకు మేలు లేదని మితవాదులలో సుహృదయులు కొందరు గ్రహింప గలిగిరి. కాని బొంబయిలోని పెద్ద పెద్ద నాయకు లందరును దీనికి ప్రతి ఘటించిరి. జాతీయవాదు లందరును తిలకుమహాశయుని విడుదలకై యెదురు జూచుచుండిరి.

## గోకులుని నిర్యాణము; తిలక్ మహాసీయుని సంతాపము

ఇట్లుండగ 1914 సం॥ము జూలై నెలలో తిలకుగారు విడుదలయైరని యిదివరకే చెప్పియుంటిమి. ఆసంవత్సరమే డిశంబరు నెలలో జాతీయసభ చెన్నపురిలో సమావేశమయ్యెను. కాని జాతీయ సభానాయకులలో గోక్లే మొదలగు పెద్దలు యీ రాజీకి పూర్తిగ సమ్మతింప లేదు. మితవాద నాయకుడగు గోక్లేగారికిని, జాతీయవాద నాయకుడగు తిలకుగారికిని మధ్య రాయబారములు జరుగుచుండెను. ఉభయులకును రాజీకుదురగలదను నాశకలుగు చుండెను. కాని వీరిద్దరి మధ్యనున్న హృదయ ప్రేమము పూర్తిగ మానకమునుపే, దైవవశమున గోపాల కృష్ణ గోకులుడు పరమపదము జెందవలసి వచ్చెను! ఆహా! యిట్టి సంధిగ్దావస్థలో గోకులునివంటి దేశబాంధవుని గోల్పోయిన భారతీయుల దురదృష్టమే మనవచ్చును? ఈ గోపాలకృష్ణుడు 1915 సంవత్సరము ఫిబ్రె

వరి 15 వ తేదీని పునహాలో పరలోక ప్రాప్తుడయ్యెను. ఆ సమయమున తిలకుగారు గ్రామాంతరమునుండి, యీ దుఃఖవార్త వినగనే, ప్రత్యేకము మోటారుబండిమీద పునహా పురికి పరుగెత్తుకొనివచ్చెను. వీరు పునహాకు చేరుసరికి గోపాలకృష్ణుని అప్పటికే శ్మశానవాటికకు గొంపోయిరి. ఇక వీరి దుఃఖమేమని చెప్పుదును. ఆ గోకులుని మోముజూడగనే, తిలకు మహనీయుడు పలికిన బల్కులవలన వారి హృదయవేదన మన మెరుంగగలము. ఈ దేశబాంధవుని మరణము, అందరికంటెను తిలకుమహనీయునకే యెక్కువ దుఃఖకారణమయ్యెను. ఏలనన మొదట గోకులుని రాచకీయక్షేత్రమున దింపినది వీరే. ఈక్షేత్రమున గోకులుడు తన యపారమైన కృషివలన తనప్రాణములనుగూడ గోల్పోవలసిన వాడయ్యెను. రాచకీయ విషయములలో నిరువురికిని అభిప్రాయభేద మున్నప్పటికిని, వారిరువురికిని గల ప్రేమబంధము వారికేగాని మరియొకరికి తెలియదు. కనుక పై పైవిషయములనుజూచి, వారిరువురికిని గల సంబంధమును మనము విచారింపకూడదు. ఎన్నికష్టములు వచ్చినను, ఎంతమనోవేదన, యెంతదుఃఖమువచ్చినను, కంటతడిపెట్టని తిలకుమహాత్ముడా సమయమునను, బొంబయి రాష్ట్రీయసభలో గోకులుని నిర్యాణమునుగూర్చి తాను జెప్పవలసి వచ్చినప్పుడును, దుఃఖబాష్పముల నాపుకొనలేక పోయెను. దేహమంతయు కంపించెను. ఆహా! మహాత్ముల మహోదారభావములును, కరుణార్ద్రచిత్తము లిట్లుండును గద! పరలోకమునందున్న గోకులుని యాత్మకు శాంతిగలుగుగాక యని దైవమును ప్రార్థింపుచు, నింక మనము మనకథాభాగమునకు వత్తము.

తిలక్ మహాత్ముడు విడుదలయైన రెండుమాసములలోనే యైరోపామహాసంగ్రామము ప్రారంభమైనదని చెప్పియుంటిమి. తాను మొదట బూనిన కార్యమును తిరిగి యుపక్రమించుట కిది మంచితరుణమని తిలక్‌గారు గ్రహించిరి. ఈ సంగ్రామమువలన మన భారతవర్షము యొక్క యమూల్యమైన విలువను ఆంగ్లేయులు గ్రహింపగలిగిరి. మన భారతవర్ష మభివృద్ధిగాంచిననే గాని, బ్రిటిషుసామ్రాజ్యము నిలువదని యీ యుద్ధమువలన ఆంగ్లేయు లిప్పు డిప్పుడే గ్రహింప గలిగిరి. కనుక యిది మన కెంతయు ననుకూలమైన తరుణము. మన ప్రభువులు మనలనుగూర్చి మంచి యభిప్రాయముతో నున్నారు. ఈ మంచియవకాశము జారిపోకుండ, మనముపయోగించు కొనవలెనని దూరదృష్టిగల తిలక్‌మహనీయుడు తన దివ్యనేత్రమువలన జూడగలిగెను. వెంటనే తత్కార్యాచరణమునకై గడంగెను. ఇంతవరకును పరుండి నిదురబోవుచున్న బొంబయిరాష్ట్రీయ సభను మేల్కొలిపెను. 1915 సంవత్సరము యేప్రిల్ నెలలో సభను పునహాపురిలో సమావేశపరిచెను. దీనికి కొందరు మితవాదులు గినిసిరి. ఎవరు గినిసిననేమి, తాను బూనిన దేశోద్ధరణ కార్యమును మానువాడు కాడు.

## రాష్ట్రీయ సభోద్ధరణము, హోంరూలు

ఇది 17 వ రాష్ట్రీయ సభ. ఈ సభలోనే మొట్టమొదట "హోంరూల్" అనుమాట పుట్టినది. ఈ సభలో "హోంరూల్" లేక "స్వరాజ్యము"ను గూర్చి

నాయకులందఱును గాఢముగ నుపన్యసించిరి. మన భారత ప్రజల కష్టములనెల్ల దొలగ ద్రోయుటకు స్వరాజ్యము తప్ప వేరొకమందు లేదని ఘంటాపథముగ సభావేదికనుండి తెలియబల్కిరి. "హోంరూల్" అనుమాట వినగనే, మితవాదులు కొందఱు ఉలికి పడిరి. దేశీయమహాసభవారప్పటి కింకను స్వరాజ్యతీర్మానమును ఆమోదింపలేదు గాన ఆ సభలో నప్పటికి స్వరాజ్యవిషయమై ప్రత్యేకముగ తీర్మానము చేసియుండలేదు. కాని మనకు మోక్షము రావలయు ననిన స్వరాజ్యమే తారకమని ఘంటాపథముగ నాసభలోని నాయకులందఱును బల్కిరి. మనమీ సభను తర తరములవరకును మఱచి పోజాలము. ఏలనన మొదట నీసభలోనే స్వరాజ్యము, హోంరూలు అనుమాటలు పుట్టినవి. ఇందులకు మన మెంతయు కృతజ్ఞులమై యుండవలెను. ఈసభలో బయలు దేరిన స్వరాజ్యనాదము భారతదేశమందంతటను మార్మోగెను. ప్రతిభారతీయుని హృదయములోను ఆనందరసము పొంగి పొరలినది. స్వరాజ్యమను మాట యెల్లప్రజలకును కర్ణరసాయనమయ్యెను.

ఈ సమయముననే చెన్నపురిలో శ్రీమతి అనిబిసెంటమ్మగారు కూడ "హోంరూల్" విషయమై కొంత చలనము బుట్టించెను. పిమ్మట గాంధి మహాత్ములును, బిసెంటమ్మగారును తిలక్ మహాశయుని దర్శించి మితవాద, జాతీయవాదుల కిరువురకును సంధిని గూర్చు విషయమై ముచ్చటించిరి. సంధికుదుర్చుకొనవలయునని మితవాదులకు బాగుగ కోరిక యున్న యెడల తమకు కూడ సంతోషమే యనియు, దేశీయ సభలోనికి జాతీయవాదులు రాకుండ నేర్పాటు గావింపబడిన నిర్బంధములను కొన్ని తొలగించిన యెడల తాము సంధికి సమ్మతింతుమనియు తిలకుగారు ప్రత్యుత్తరము చెప్పిరి. దేశమునందంతటను మితవాదులలో కొందరి కిదివఱకే రాజీపడవలయునని కుతూహల మున్నది. తదభిప్రాయానుసారముగ 1915 సంవత్సరములో దేశీయసభ వారు జాతీయవాదులు కూడ సభలోనికి రావీలు గలుగజేసిరి.

## ఉభయ రాజకీయ పక్షములకును రాజీ

జాతీయవాదులందఱును 1915 సం॥ డిశంబరు 29 వ తేదీని పునహాలో సభ చేసి "స్వరాజ్యసమితి" నొకదాని నేర్పాటుచేయుటకు ముందే యే ప్రయత్నములను జేయవలయునో ఆలోచించిరి. "స్వరాజ్యసమితి" నేర్పరచుటకై దేశమునందంతటను ప్రయత్నములు జరుగుచుండెను. మరుసటి సంవత్సరము (1916) బొంబయి రాష్ట్రీయ సభ బెల్గాములో సమావేశమయ్యెను. ఈ యవకాశము నాధారము చేసికొని తిలకుగారు "భారతవర్ష స్వరాజ్యసమితిని," ఆ దినముననే స్థాపించెను. ఇప్పటికి తాను పడిన శ్రమలన్నియు కార్యరూపములు దాల్ప మొదలిడెను. తిలక్ గారి జీవితకాలములో నిదియొక గొప్ప సుదినము. వారు సంకల్పించిన భారత వర్ష మోక్షప్రాప్తి కిది యొక సోపానము. ఈ సోపానమును నిర్మించి, తిలక్ మహాత్ముడు ధన్యుడయ్యెను. తన భారతవర్ష ప్రజల కృతజ్ఞతకు పాత్రుడయ్యెను.

ఈ సభలోనే మితవాద జాతీయవాద పక్షములవారికి "రాజీ"ని గూర్చి తిలక్ గారొక తీర్మానమును ప్రతిపాదించిరి. దేశనాయకులలో నొకరికొకరికి అభిప్రాయభేదములున్నను, యీ సందిగ్ధతరుణమున నందరును యెట్టి భేదమునులేక మాతృదేశారాధనకై గడంగవలెనని గట్టిగ బోధించెను. జాతీయవాదులలోనే కొందరికి మొదట రాజీపడవలయునని కోరికలేక పోయినను, వీరి యుపన్యాసము వినిన తరువాత దేశప్రజలలో నిట్టితరుణమున నైకమత్యము లేకపోవుట యెంత యనర్ధదాయకమో వారు పూర్తిగ గ్రహించిరి. తిలకుగారు ప్రతిపాదించిన తీర్మానము నందరును ఆమోదించి, రాబోవు సంవత్సరము దేశీయసభకు పోవ నిచ్ఛగించిరి. "రాజీ"ని గూర్చి తిలకుగా రిచ్చిన యుపన్యాసమును జదివిజూచిన యెడల వారికి మాతృదేశారాధన తప్ప వేరుకక్షలులేవని తేటపడగలదు.

## స్వరాజ్య ప్రబోధము

స్వరాజ్యసమితిని స్థాపించిన దినముననే జెల్లాములో స్వరాజ్యమునుగూర్చి ప్రజలకందరకును తెలియునట్లు బోధించెను. పిమ్మట దేశమునందంతటను సంచారము చేసిరి. స్వరాజ్యమన నేమియో, దానిని మన మెందుకు కోరుచున్నామో, మొదలగు నీ విషయముల నెల్ల నాబాలగోపాలమునకు చక్కగ బోధపడునట్లు తేటమాటలతో నుపన్యసించిరి. వేలకు వేల ప్రజలువచ్చి వీరియుపన్యాసములను విని ధన్యులైరి. వీరిచ్చిన యుపన్యాసములలో ముఖ్యముగ మూడుగలవు. వానిని యీ పుస్తకములో నచ్చువేసినారము. మన యాంధ్రులెల్లరును వీనిని చదివి ధన్యులయ్యెదరు గాక.

## షష్టిపూర్తి; లక్షరూప్యములు కానుకలు

దేశమంతయు నిట్టి స్వరాజ్యవాంఛలతో నుఱ్ఱూతలూగుచున్నతరిని తిలకు మహాత్మునకు షష్టిపూర్తి యయ్యెను. వీరి మిత్రులందరును కలిసి వీరి షష్టిపూర్తి దినమున గొప్పయుత్సవముజేసి తమ కృతజ్ఞతను దెల్పికొనుటకై లక్షరూప్యములను బహుమానముగ నీయవలయునని సంకల్పించుకొనిరి. వీరి సంకల్పానుసారము నొక వారము దినములలో లక్షరూప్యములు చందాల మూలమున సమకూరెను. మాతృదేశమునకై తన జీవితము నంతను ధారవోసిన యీ మహనీయునకు లక్షరూప్యములన నెంత ? ప్రజలందరును అత్యుత్సాహపూరితులై యుండిరి. భారత వర్షమున వివిధ ప్రదేశములనుండి ప్రజలందరును ఆనాటికి పుణ్యక్షేత్రమగు పునహాపురికి వచ్చిచేరిరి. సాయంకాలమగు సరికి తిలకుగారి యింటి ముందరనుండు బహిరంగ మైదానమంతయు ప్రజాసమూహముతో నిండిపోయెను. ఆమైదానముకూడ చాలక ప్రజలు యిండ్ల కప్పులమీదను, దూరముగనుండు త్రాటి చెట్లులమీదను కూడ నెక్కి తిలకు మహాత్ముని జూచి తమ నేత్రములను పవిత్రములుగ జేసికొనిరి. తిలకుగారిని కూర్చుండబెట్టుటకై పెద్ద యెత్తైన వేదిక నొకదానిని నిర్మించిరి. ఆవేదికమీద వీరిని కూర్చుండబెట్టి పుష్పహారములతో నలంకరించిరి. కొందరు జాతీయ గీతముల బాడిరి. బ్రాహ్మ

ణులు స్వస్తివాచకమును పఠించిరి. సమస్త ప్రజలును యేకకంఠముతో వీరికి "లోకమాన్య" యను బిరుదనొసంగిరి. లోకమాన్యులు చిరంజీవియగు గాక యని సమస్త ప్రజలును దీవించిరి. భూసురాశీర్వాదములు, మంగళవాద్యంబులు, నింగి ముట్టెను. వీరి నిష్కామ కర్మాచరణమునకును, స్వార్థత్యాగమునకును, వీరిని దేశ ప్రజలందరును వేనోళ్ళబొగడిరి. ఎన్నియుగములు గతించినను, ఎందరు పుట్టినను, ఎందరు గిట్టినను, యీ మహనీయునికీర్తి యాచంద్రతారార్క మీకర్మభూమిపై నిలుచునని పలువురు నొక్కి వక్కాణించిరి. ప్రజలందరు నొక విజ్ఞాపన పత్రమును వ్రాసి ఒక వెండిపళ్ళెరములోనుంచి వీరికి సమర్పించిరి. పిమ్మట లక్షరూప్యములు గల ఖజానాపెట్టెలను వీరికి కానుకగ నొసంగి తమ ఋణమును దీర్చుకొన ప్రజలు యత్నించిరి. లక్షరూప్యములతోనా వీరి ఋణము దీరునది? కాదు కాదు. వీరి ఋణము దీర్ప నేరితరము? కొందరు రత్నస్థగితమైన దుస్తుల నొసంగిరి. కొందరు అమూల్యమైన కాశ్మీర శాలువలను గప్పిరి. అందులో నొకరు అంగమైన కిరీటము నొసంగి లోకమాన్యుని పట్టభద్రుని జేసెను. మాణిక్యభూషణములును, ఉంగరములును గుట్టలు గుట్టలుగ వీరికి సమర్పించిరి, ఇదంతయుజూడ నన్నయభట్టుగారు వర్ణించిన యుధిష్ఠిరుని పట్టాభిషేకము జ్ఞప్తికి వచ్చుచున్నది.

మ॥ మదమాతంగ తురంగ కాంచనల సన్మాణిక్య గాణిక్యసం
పదలోలిన్ గొనివచ్చియిచ్చి ముదమొప్పన్ గాంచి సేవించిర
య్యుదయాస్తాచల సేతుసీత నగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజు దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్?

ఇట్టివన్నియును మనము పూర్వగ్రంథములలో చదివి యానందించుటయే గాని, మహారాష్ట్రుల భాగ్యవశంబున వారు గంగాధరుని షష్టిపూర్తి యుత్సవమును కళ్ళారజూచి తమ జన్మములను తరింపజేసికొనిరి. ఇది కేవలము దేశప్రజలు తమంతటతాము అనన్యప్రేరితముగ ప్రేమపూరితులై గావించిన మహోత్సవముగాని వేరుగాదని యెరుంగునది. గంగాధరుడు తానిదివరకే సూక్ష్మరూపమున ప్రజలహృదయాబ్జములపై పట్టభద్రుడై యుండెను. ఇది కేవలము దానియొక్క స్థూలప్రదర్శనమే. పిమ్మట గంగాధరుడు లేచి ప్రజలిచ్చిన యీసొమ్మను కేవలము తన స్వలాభమునకే వినియోగ పరుపక దీనినంతను స్వరాజ్యసమితికి దానముజేసెదనని తెలియజెప్పెను. అంతట నెచ్చటివారచ్చట వెడలిపోయిరి.

## సెక్యూరిటీ కేసు

దేశ ప్రజలచే నిట్లు పట్టభద్రుడైన మహనీయుని జూచి యధికారులు తత్తర పాటునొందసాగిరి. అదిగాక వీరికిచ్చిన లక్షరూప్యములను దేశోపకారార్థమే వినియోగపరచెదనని కూడ వాగ్దానము చేసియున్నాడు. అధికారు లేమితలంచిరో

మనమెరుగ జాలము. కాని మే జూన్ నెలలలో వీరు బెల్గాము, అహమ్మదాబాదు లలో స్వరాజ్య విషయమై యిచ్చిన యుపన్యాసములు రాజద్రోహ పూరితములుగ నున్నవనియును, అందువలన తానిక ముందిట్టి యుపన్యాసముల నీయనని వ్రాత మూలముగ నొప్పుకొని, అందులకై హామీగా 40 వేలరూపాయలను దాఖలు చేయవలసినదనియును, పునహా మేజస్ట్రీటుగారు తిలకుగారిపై యుత్తరవును జారీ చేసిరి. కాని హైకోర్టునకు అప్పీలుచేయగా, నచ్చట వారు మేజస్ట్రీటుగారి తీర్పును రద్దుపరచిరి. యీయుపన్యాసములు రాజద్రోహ పూరితములు కావని హైకోర్టు వారు తీర్మానించిరి. తిలకుగారు విజయమును బడసిరి.

బెల్గాము సభలో జాతీయ వాదులందరును దేశీయ సభకు పోవుటకై సమ్మ తించిరని చెప్పియుంటిమి. ఆన 1916 సంవత్సరములో జాతీయ సభ లక్ష్మణ పురిలో సమావేశ మయ్యెను. ఆన 1907 సంవత్సరములో చీలిపోయిన జాతీయ వాదులంద రును తిరిగి జాతీయ సభావేదిక నలంకరించిరి. దేశ ప్రజలలో సమకూడిన నిట్టి సమా ధానమునకై, యిట్టి యైకమత్యమునకై ప్రజ లందరును సంతసించిరి. ఆనాటి సభ యత్యుత్సాహ పూరితమై యుండెను. తిలకుగారు సభలోనికి రాగానే ప్రజ లందరును వినయ పూర్వకముగలేచి నిలువబడి స్వాగత మొసంగిరి.

## 1916 సం॥ జాతీయసభ : లక్ష్మణపురము :

## హిందూమహమ్మదీయైక్యము : జాతీయమితవాదైక్యము :

1916 సంవత్సరమునకు పూర్వము మహమ్మదీయులు దేశీయ మహాసభతో కలియక ప్రత్యేకముగనుండి "మస్లిము" లీగు అను వేరొక సభను నిర్మించుకొని పనిచేయుచుండిరి. కాని యీ 1916 సంవత్సరములో హిందూ మహమ్మదీయు లిరువురకును ఐక్యము కుదిరెను. మస్లిము లీగువారు కూడ, కాంగ్రెసు (దేశీయ సభ) తో పాటు కలిసి, హిందూదేశమునకు స్వరాజ్యమిచ్చి తీరవలయునని యేక కంఠముగ నుద్ఘోషించిరి. భారత వర్షంబునం దిట్టి యైక్య మిదివర కెన్నడును కుదిరియుండలేదు. మాభారతీయుల కీయీ హక్కులనిచ్చి తీరవలయునని హిందూ మహమ్మదీయ సభల వారిరువురును కలిసి స్వరాజ్యపు స్కీము నొకదానిని తయారు చేసిరి. దీనికే "కాంగ్రెసు – లీగుస్కీము" అని పేరు.

తిరిగి 1917, 1918, సంవత్సరములలో జరిగిన దేశీయ సభలకు తిలక్ గారు వెళ్ళి స్వరాజ్య సందేశమును చాటిరి.

## సీమకు రాయబారము :

స్వరాజ్య విషయమై యింగ్లాండులోనున్న ప్రజలకు బోధించుటకై తిలక్, బిపిన్ చంద్రపాలు మొదలగు దేశభక్తులందరును భారతవర్ష స్వరాజ్య సమితి పక్షమున రాయబారులుగ బయలుదేరి సింహళము వరకు వెళ్ళిరి. కాని యీ యుద్ధ

సమయములో సీమకు రావద్దని యింగ్లాండులోని ప్రభుత్వము వారు వీరిని యాపివేసిరి. ఈనిరంకుశ చర్య దేశ ప్రజలయందు అశాంతిని ప్రబల జేసెను.

## షిరోలు కేసు.

తిలక్ గారు 1908-1914 సంవత్సరముల మధ్య కారాగృహమునం దుండగ వీరిమీద "సర్ వాలంటైన్ షిరోలు" అను నాంగ్లేయు డొకడు కొన్ని నిందా వాక్యములను వ్రాసి ప్రకటించెను. హిందూదేశములో నరాచకము, రాజద్రోహము, ప్రబలుటకు తిలక్ గారే ముఖ్యకారకుడని నిందించెను. ఇందులకై వీరు కారా గృహమునుండి విడుదలకాగానే, షిరోలుగారి మీద సీమలో మాన నష్టపుదావా వేసిరి. ఆకేసును నిర్వహించు కొనుటకై వీరు రెండు సంవత్సరముల క్రిందట సీమకు పోయిరి.

వీరిని సీమకు బోనిచ్చిన యెడల నేమికొంప మునుగునో యను భీతిచే నిచ్చటి యధికారులు వీరికి మొదట రహదారీ చీటినివ్వలేదు. కాని సీమలో వ్యాజ్యము దాఖలు చేసియున్నందున ఆకేసు నిమిత్తమై వీరిని పోనివ్వక తప్పినదిగాదు. అందు లకై గవర్నమెంటు వారొక కుతంత్రమును బన్నిరి. 'నీవు సీమలో నుండగ నెట్టి బహిరంగ సభలోను మాట్లాడకుండ, నీకేసు పనిమాత్రము చూచుకొని, తిరిగి యీ దేశమునకు వచ్చివేయవలెను. ఈషరతులకు లోబడు నెడల నీవు సీమకు బోవచ్చు'నని యిచ్చటి యధికారులు నిర్బంధించిరి. ఇది కేవలము అన్యాయమని ఖండించుచు, తుదకు దీనికి సమ్మతించి వీరు సీమకు పయనమైరి.

## సీమలో చేసిన కృషి

ఆన 1918 సం॥ అక్టోబరు మాసాంతమునకు తిలక్ గారు లండను పట్టణ మును చేరిరి. సీమలోనున్న 10 మాసములలోను వీరు భారతవర్ష మోక్షమునకై సలిపిన కృషి వర్ణనాతీతము. వీరచ్చట కాలు పెట్టినది మొదలు వీరి కన్నియు ప్రతికూల పరిస్థితులే తటస్థించెను. 'ఈతడు బ్రిటిష్ వారిని ద్వేషించువాడనియు, బ్రిటిష్ సామ్రాజ్యవిచ్ఛేదమునకై యత్నించుచున్నాడనియు, వీరి రాచకీయ ప్రతికక్షులు సీమలోనుండు బ్రిటిష్ ప్రజలకు వీరియెడ విపరీతాభిప్రాయములను కల్పింప సమకట్టిరి. ఇదిగాక, హిందూదేశములో నరాచకము ప్రబలుటకు యీతడే కారకుడని రౌలతు కమిటీవారు తమ రిపోర్టులో వ్రాసిరి. ఆ రిపోర్టు అప్పుడే సీమలో ప్రచురణమయ్యెను. సీమలోనుండు బ్రిటిష్ ప్రజలెల్లరును దీనిని చదివి సాధారణముగ నేమనుకొందురు ?

దీనికితోడు తిలకుగారు వాలంటైన్ షిరోలుమీద తెచ్చిన దావాకూడ వీరికి ప్రతికూలమయ్యెను. అధికార ధూర్వహుల యధీనములోనున్న హిందూదేశములో తమకు న్యాయము గలుగక పోయినను, తుదకు స్వాతంత్ర్యప్రియులను బిల్చు

సీమలోని యధికారులైనను తమకు న్యాయము గలుగ జేయగలరని తిలకుగారు తలంచిరి. కాని యిదికూడ నిరాశయయ్యెను. బ్రిటిష్ ప్రజలకు నష్టమును గలిగించు నిట్టి రాచకీయ సంబంధమైన విషయములలో మనకు న్యాయము కలుగజాలదని దీనివలన స్పష్టమగుచున్నది. ఏ ప్రక్క జూచినను వీరికి ప్రతికూలురేగాని వీరికి చేదోడుగ నెవరును లేక పోయిరి. ఇట్టి ప్రతికూల పరిస్థితుల నెల్లగడచి తుదకు వీరెట్లు జయప్రదముగ కృషి సలిపిరో చూతము.

సీమకు పోయిన కొద్ది దినములకే వీరు మంత్రిగారిని సందర్శించి, తమపై యిండియా గవర్నమెంటువారు విధించిన వాగ్బంధమును తొలంగించుకొనిరి. తమ కేసు నిమిత్తమై సీమకు బోయినను వీరు సదా హిందూదేశ విషయమునుయే చింతింపుచుండిరి. హిందూదేశమునకు స్వరాజ్య మిచ్చుట యావశ్యకమని తిలకుగారు బ్రిటిష్ ప్రజలకు బోధించిరి. పార్లమెంటు సభ్యులతో సంప్రతించిరి. పార్లమెంటు సభ్యులలో కార్మిక పక్షమువారిని మన పక్షమునకు త్రిప్పిరి. హిందూదేశమునకు స్వరాజ్యమిచ్చి తీరవలెనని వీరందరిప్పుడు పార్లమెంటులో గట్టిగ వాదింపుచున్నారు. స్వరాజ్యము విషయమై బ్రిటిష్ ప్రజలలో అనుకూల భావము బాగుగ వ్యాపించుటకై వీరనేక విధముల ప్రయత్నించిరి.

కాంగ్రెసుపక్షమున సీమలో పనిచేయుటకై "బ్రిటిష్‌కమిటీ" యను నొక కమిటీయును, "ఇండియా" యను పేర నొక పత్రికయును గలవు. వీనికి మన కాంగ్రెసువారు ప్రతియేటా కొంతసొమ్ము నిచ్చుచుందురు. కనుక మన హిందూదేశ పక్షమున సీమలో కృషిసలుపుట వీని ధర్మమైయున్నది. కాని యీ కాంగ్రెసు వారిచ్చు సొమ్మును తినుచు యీ కమిటీవారు సీమలో కాంగ్రెసునకు ప్రతికూలముగ పనిచేయు చుండిరి. తిలకుగారు సీమకు పోగానే యీస్థితిగతులన్నియు వారికి తెలియవచ్చెను, వెంటనే దాని భరతముపట్ట సంకల్పించెను. ఆ కమిటీ వారు మొదట తిలకుగారి మాటలను లక్ష్యపెట్టలేదు. 'నీ వెవరో మే మెరుగము, నీవువచ్చి మమ్ములను అడుగుటకు నీ కేమి యధికారమున్నద'ని వారు క్రిందు మీదెరుంగక మాటాడ నారంభించిరి. వారి బెదరింపులును, వారి పెంకతనమును, వారు తిలకు మహనీయుని యెడ గావించిన పరాభవములను చూచిన యెడల యెట్టివాడైనను అహంకరించు కొనియో, లేక తెల్లబోయి మొగము వ్రేలాడవేసి కొనియో తిరిగి యింటికి వచ్చెడివాడేనని చెప్పవచ్చును. కాని యీ త్రాటియాకు చప్పుళ్ళకా యీమహారాష్ట్ర కేసరి బెదరునది ! ధర్మము తన పక్షముననున్నదనియు, తప్పక తాను వీరి బెదరింపులనెల్ల నణచివేసి, తిరిగి యీకమిటీని కాంగ్రెసు పక్షమునకు త్రిప్పగలననియు, తిలకుమహారాజు కృతనిశ్చయుడై యుండెను. ఇట్టిస్థితిగతులనెల్ల వెంటనే యిండియాకు తెలియబరిచి యేటా వీరికిచ్చు సొమ్మును తక్షణమాపించి వేసిరి. ఈలోపుగ ఢిల్లీకాంగ్రెసు సభవారు తిలకు మహారాజుగారిని తమ ప్రతినిధిగ నియమించిరి. వీరికి తోడ్పాటుగ నుండుటకై మరి కొందరు రాయబారులనుకూడ పంపించిరి. ఈ రాయబారులు

సీమలో దిగగనే వీరికి మరింత ధైర్యమువచ్చెను. వీరును, వీరి స్నేహితులగు క్లార్కు, రూథర్ ఫర్డు మొదలగు నాంగ్లేయులును కలిసి, ఆ కమిటీ నంతను తీసివేసి, క్రొత్త కమిటీ నేర్పాటుచేసి, దీనిని తిరిగి కాంగ్రెసు పక్షమునకు త్రిప్పిరి.

ఈ కమిటీతో నిట్లు పోరాడుటయేగాక, లోకమాన్యులు అనేక కాగితములను అచ్చువేయించి, ప్రజలకు పంచి పెట్టించియు, గొప్ప గొప్ప పార్లమెంటు సభ్యులతో స్వయముగ మాట్లాడియు, స్వరాజ్యోద్యమమును బాగుగ వ్యాపింప జేసెను.

"హిందూదేశమును మరువవద్దు"

"గర్భశత్రులగు వారి కందరకును స్వయంనిర్ణయాధికార మిచ్చుచుండగ యుద్ధములో మీ కెంతయో తోడ్పడిన మాహిందూ దేశమునకు స్వరాజ్యమివ్వరా"?

"హిందూదేశమునకు స్వరాజ్య మిచ్చితీరవలెను. లేని యెడల ప్రపంచములో శాంతియుండదు."

"హిందూదేశమునకు మోక్షములేనిది ప్రపంచమునకు మోక్షము కలుగ గలదా?"

"హిందూదేశమునకు స్వరాజ్యమిచ్చి తీరవలెనని మీ పార్లమెంటు మెంబర్లతో గట్టిగ చెప్పండి,"

ఈ విధముగ పెద్ద పెద్ద అక్షరములతో లక్షలకు లక్షలు కాగితములు అచ్చువేసి పంచిపెట్టించెను; గోడలకంటింపించెను. ఇవిగాక స్వరాజ్యమును గూర్చియు, స్వయంనిర్ణయాధికారమును గూర్చియు పుస్తకములను వ్రాసి ఉచితముగ ప్రజలకు పంచిపెట్టించెను.

అప్పుడు ప్యారిస్‌లో కూడనున్న సంధిసభకుబోయి హిందూదేశపక్షమున ఆ సభలో వాదింపవలెనని తిలకుగారు విశ్వప్రయత్నములు జేసిరి. ఆ సభకు వీరిని పో నిచ్చిన నేమి వచ్చునో యను భీతిచే బ్రిటిష్మంత్రులు వీరి నచ్చటికి పో నివ్వలేదు. అయినను హిందూదేశపక్షమున వాదింపుచు వీ రొక పెద్ద యుత్తరమును సంధి సభాధ్యక్షులకు వ్రాసిరి. దీని నీ పుస్తకములో ముద్రించినాము.

పుస్తక రూపమున నిట్లు స్వరాజ్యాందోళనమును వ్యాపింపజేయుటయేగాక వీ రనేకచోట్ల ప్రతిదినమును ఉపన్యాసముల నిచ్చుచుండిరి. వీరి యుపన్యాసముల వినుటకై వేలకువేల ప్రజలు మూగిరి. ఈ యుపన్యాసముల విని వారు పరవశులైరి. ఇదివరకు వీరియందున్న యనుమానమంతయు పోయి, యీతడు బ్రిటిషువారిని ద్వేషించువాడు గాడనియు, యీతడు రాజభక్తిపరుడనియు వారు పూర్తిగ గ్రహిం

చిరి. హిందూదేశమునకు తప్పక స్వరాజ్యమిచ్చి తీరవలెనని ప్రజల కందరకును నచ్చ చెప్పెను. వీరి వాదముల నెవరును పూర్వపక్షముచేయ సాహసింపరైరి. అదిగాక పార్లమెంటులో నున్న కార్మికపక్షపు నాయకులనందరును వీరి వైపునకు తిరిగిరి. వారెల్లరును హిందూదేశమోక్షమునకై పాటుబడెదమని వాగ్దానముచేసి యున్నారు.

మాంటేగ్యుగారు హిందూదేశపక్షమున పార్లమెంటులో ప్రవేశపెట్టిన సంస్కరణముల బిల్లు అప్పుడు పార్లమెంటులో చర్చలో నుండెను. హిందూదేశమునుండి వచ్చిన రాయబారులనెల్ల విచారించుటకు పార్లమెంటు వారొక జాయంటుకమిటీ నేర్పరచిరి. ఆ కమిటీయెదుట తిలకు మహారాజుగారు కాంగ్రెసుపక్షమున సాక్ష్యమిచ్చెను. వారడిగిన ప్రశ్నలకన్నిటికిని యుక్తియుక్తమైన సమాధానములను వ్రాసి యిచ్చెను. సంపూర్ణస్వరాజ్యమునకు మాదేశమిప్పుడు తగియున్నదనియు, రాజ్యాంగములోనే యే సంస్కరణము లవుసరమో, మేమేస్వయముగ నిర్ణయించుకొనుటకు మాకే హక్కుండవలెననియు, అధికారధూర్వహుల చేతులలో నుండిన ప్రయోజనము లేదనియు వీరు పార్లమెంటు కమిటీవారియెదుట నొక్కివక్కాణించిరి. వీరియత్యంత గంభీరమగు నుపన్యాసమును విని కమిటీవారాశ్చర్యమగ్నులైరి. వీరిని తిరిగి యే ప్రశ్నలడుగుటకును వారికి నోరాడలేదు. ఎంతమంది సాక్షులనో యెన్నిప్రశ్నలనో యడిగిరిగాని, ప్రతివాది భయంకరుడగు వీరిని మాత్రమొక ప్రశ్నయైన నడుగలేదు.

ఈ విధముగ విఘ్నముల నెల్ల గడచి, కాంగ్రెసు ఉద్యమమునకు బలమును చేకూర్చి, ఆంగ్ల ప్రజల మనంబులను త్రిప్పి, యికముందు పార్లమెంటులో అధికారపదవికి రానున్న కార్మికపక్షపు నాయకుల నెల్ల స్వరాజ్యపక్షమునకు జేర్చుకొని, ధన్యుడై యీ భారతరత్నము తిరిగి 1919 సం॥ నవంబరు మాసారంభమున జన్మభూమికి జేరెను.

## హిందూదేశమునకు తిరిగివచ్చుట

తిలకు మహారాజుగారు హిందూదేశమునకు తిరిగివచ్చిన కొలది దినములకే పార్లమెంటులో నూతనచట్టనిర్మాణము పూర్తియయ్యెను. ఈ చట్టము సంతృప్తికరము గాదనియు, పార్లమెంటువారేమిచ్చినను, యీయకున్నను మనముసంపూర్ణస్వరాజ్యము నకైసదా కృషిసలుపుట మన స్వధర్మమనియు వీరు ప్రజల నుద్బోధించుచున్నారు.

## దేశముయొక్క సందిగ్ధావస్థ

మన భారతవర్షముయొక్క ప్రస్తుత స్థితి బహు విషమముగనున్నది. పంజాబు వధలు ప్రపంచమునంతటిని తల్లడిల్లజేసినవి. ఇచ్చట యిండియా గవర్నమెంటువారును, సీమలో పార్లమెంటువారును సైతము యీ విషయములో మనకు న్యాయము గలుగజేయుదు రనునాశ లన్నియు నడుగంటినవి. మహమ్మదీయులలో ఖిలాఫతుసమస్య తీవ్రాందోళనమును గలిగించుచున్నది. ప్రస్తుత మొసంగిన రాచకీయాధికారములు ప్రజ

లకు ఆశాభంగమును కలిగించినవి. ఇట్టి తరుణమున ప్రజల కర్తవ్యమేమి? ఈ ప్రశ్న కెవరును సమాధానము చెప్ప సాహసింపజాలకున్నారు. ఎల్లరును మనకన్న తల్లియగు జాతీయసభావతల్లి యెట్లాజ్ఞాపింప బోవుచున్నదోయని నిరీక్షించుచున్నారు. రేపు సెప్టెంబరునెలలో కలకత్తాలో ప్రత్యేక జాతీయసభ జరుగబోవుచున్నది; ఆసేతు హిమాచలపర్యంతము గల ప్రజల మనంబులు అట్లుడికినట్లుడుకు చున్నవి. గాంధి మహాత్ముడు సహాయనిరాకరణ గర్జన మొనర్చుచున్నాడు. అధికారులుక్రూరనిరంకుశాధి కారములను చేధరించి సిద్ధముగనున్నారు, మహమ్మదీయులు మతావేశ పూరితులయి యీ దేశమును విడిచి పరరాజ్యములకు జేరుచున్నారు.

## ని ర్యా ణ ము

భారతవర్ష రాజ్యాంగ వాతావరణ మంతయు నిట్లు ప్రళయకాల సంవర్త వలాహకంబులచే నిండి నిబిడీకృతమై యుండుటచే ఆలోక బాంధవు డస్తమింప బోవుచున్నాడాయను భీతి వొడముచున్నది. లోకమాన్యునకు శరీరమస్వస్థతగ నుండె నను విషాదవార్తలు వినవచ్చుచుండెను. బొంబాయి సర్దారు గృహములో లోక మాన్యుడు శుష్కీభూత శరీరుండైన మన లోకమును మరచి యింద్రియ వ్యాపారము లను చాలించి యోగారూఢుడై, ఆలోక నియంతయొక్క యుత్తరువునకై వేచి యుండెను. భారత కుమారులందరుమ ప్రక్కను నిలువబడి కర్మయోగియగు నా పితా మహుని యంత్యోపదేశమును వినుటకై యేకాగ్ర చిత్తములో నుండిరి. గీతామృత పాన మొనర్చి ధన్యుడైన ఆ పరమ కర్మయోగి యవసాన కాలమందు,

శ్లో॥ "యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

భగవద్గీత 4. 7

అనుశ్లోకమును పఠింపుచు శాంతిసాగరములో లీనుడైపోయెను. ఆకాశమధ్యమున కృష్ణ పక్షపాడ్యమినాటి చంద్రుని శీతకిరణములు శీతలమైయున్న లోకమాన్యుని శరీరముమీద ప్రసరింపుచుండెను. ప్రక్కన తన దేహసంబంధులగు కుమారీకుమారులును, ఆత్మసంబంధులగు గాంధి, లజపతిరాయి, మొదలగు భారతనాయకులును నిలువబడి యుండిరి. తెల్లవారకమునుపే యీ నిర్యాణవార్త భారతభూమి యందంతటను చీకట్లు గ్రమ్మినట్లు క్రమ్ముకొనెను. ఎచ్చటివారచ్చట తమ వ్యాపారములను చాలించి,

## దేశీయులసంతాపము

"క. మనసారధి మనసచివుడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుడుఁ
మనగురుడు మనకు దేవర
[illegible] "

నని దుఃఖసాగరమున మునిఁగిపోయిరి. మరునాఁడు అఖిలభారత కుమారులును శోకింపుచుండ, లోకమాన్యుని కుమారు లిరువురును తమ తండ్రికి చందన కాష్ఠములతో అగ్నిసంస్కార మొనర్చిరి. ఆ దినమున శ్మశానవాటికయందు గూడిన ప్రజాసమూహమును లెక్కింప నెవ్వతరము? వేలకువేల ప్రజలు సాగి మ్రొక్కులిడి, ఆ చితియందనేక కానుకల నర్పించిరి. దశాహమునాఁడు ఆ సేతు హిమాచల పర్యంతమును ప్రజలు జాతీయ సంతాపదినముగ భావించి విచారసాగరమగ్నులైయుండిరి. లోకమాన్యుని కుమారులు తమతండ్రి యస్థులను ప్రయాగకు తీసుకొనిపోయి మొన్ననే జాహ్నవీ పవిత్రామలతోయములందు కలిపిరి ఆహా! యిట్టి యెందరి మహామహుల యస్థుల సంస్పర్శమున నోగద గంగామతల్లి యింత లోకపావని యయ్యెను !

## తిలకు అవతారసమాప్తి

## గాంధిమహాత్ముని నూతనావతార ఆవిర్భావము

*"లోకమాన్యుడు రాత్రిఒంటిగంటకు నిర్యాణము నొందుననగా మధ్యాహ్నము గాంధిమహాత్ముడు లోకమాన్యుని సందర్శింపవచ్చెను లోకమాన్యుడు అంత్యనిమిషమువరకును స్పృహగలిగి యుండుటచే మహాత్ముని జూచి నేజబ్బుగానుంటినని చూడవచ్చితివా? నేజబ్బుగా లేనే యని ప్రశ్నించెనట. ఇదియెంతయు యదార్థము. లోకమాన్యుని ముక్తాత్మకు జబ్బెక్కడిది. దానికి మహాత్ముడు బదులు చెప్పక లోకమాన్యుని పొట్టలో తలతలయుంచగ ఉభయులును ఒండొరుల గావలించుకొని ఏడ్చుచు ఒక్క అరగంట ఆ విధముగనే యుండిరట. అంతట మహాత్ముడు లేచి నిలువబడెను వెంటనే డాక్టరులు లోకమాన్యుని పరీక్షింపగా లోకమాన్యుని శక్తియంతయును నాయనను విడచి మహాత్మునిలో నావిర్భవించినట్లు, లోకమాన్యుడు విగతజీవుడైనట్లు కన్పట్టెను. లోకమాన్యుని శక్తి యంతర్ధాన మయ్యెను గాని నిర్యాణమును తరువాత కొన్నిగంటల వరకును పొందలేదు. ఈ చిత్రరంగము మతియొక పూర్వరంగమును జ్ఞాపకమునకు దెచ్చుచున్నది. పరశురామ శ్రీరాముల అవతారములు మారుట ఈ కడపటి రంగముతో పోల్చవచ్చును. పరశురామ యుగము అంత్యమైన తరువాత శ్రీ రామచంద్రుని యుగము ప్రారంభ మయ్యెను. పరశురామ శ్రీరాము లొండొరుల సందర్శించి నప్పుడు పరశురాముని శక్తియంతయు శ్రీరామునిలో బ్రవేశించినతోడనే పరశురామునకు సామాన్య మనుజునివలె కొంత కాలము జీవించి యుండెను. గాని పూర్వపు ప్రతిభ ఆతనియందు గన్పట్టలేదు. పరశురాముడు కేవల సాత్త్విక స్వరూపుడుగాడు. జన్మముచే బ్రాహ్మణుడయ్యును అతని యాత్మ క్షాత్రమును పూనియుండెను. అందుచేతనే పరశురాములు శరశాపబలంబుల రెంటిని వుపయోగించి శత్రుసంహారము గావించెను. పరశురామావతారము

---

* ఆంధ్రపత్రిక 18-8-20 తేదీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు వ్రాసిన వ్యాసమునుండి యెత్తి వ్రాయబడినది.

అనేక విషయముల శ్రీకృష్ణావతారమును బోలియుండును. "చంపువాడెవడు, చచ్చువాడెవడు. నీధర్మమును నీవు చేయుము, ధర్మము నెరవేర్చుటలో జాలినొందుట మనోదౌర్బల్యమునే సూచించును గాని దయను సూచింపదు. స్వలాభమును మాత్రము కోరకు" అను గీతారహస్యమును శ్రీకృష్ణుడు బోధించెను. పరశురాముడాచరణయందు జూపెను. పై ధర్మమునే లోకమాన్యుడు లోకమునకు వ్యక్తీకరించి తన జీవితమును మాతృకజేసెను. శ్రీరాముని యవతారమట్టిదిగాదు. ఆయన కేవలము సాత్వికమూర్తి. క్రౌర్యమును సేయనొల్లడు. ఆయనకు ఒకటేమాట, ఒకటే బాణము. శరభంగుడను శూద్రతపస్విని సంహరించునపుడు ధర్మము నిర్వహించుట ఎంతక్రూరమైన పనియని వగచెను. ఆతపస్వినిపై బాణము తనంతటనే పోయెనుగాని రాముడు విడువలేదు. పితృవాక్య పరిపాలనకై శ్రీరాముడు 14 సంవత్సరములు వనవాసము జేసెను. చాకలవాని నిందను బాపుకొనుటకై సీతను అడవులపాలు జేసెను. అటులనే గాంధి దయామయుడు, తన అనుచరులు తప్పుజేసిన తాను ఉపవాసము జేయును. లోకులీ సాత్వికపథమును అతిక్రమించినచో తాను వనవాసము చేయును. శ్రీరామచంద్ర గాంధి మహాత్ములయొక్క ధర్మనిష్ఠ అనుపమేయము. అసాధారణము. వీరి చరిత్రలయొక్క లోతు వైశాల్యము సామాన్యులకు బోధపడవు., ఇట్టిది గాంధియవతారము. తిలకు యుగము గతించినది గాంధియుగము ప్రారంభమయినది. పరశురామ శ్రీకృష్ణులవలె శ్రీరాముడును దుష్టసంహారమును గావించెను, కాని శ్రీరాముని మార్గము వేరు. రెండును సమకాలమున నుండజాలవు. గాంధిమార్గము వేరు, లోకమాన్యుని మార్గము వేరు. లోకమాన్యుని యవతారము మారనిచో వీరిద్దరును ఒండొరులను ప్రతిఘటింపవలసియుండును. అందుచే తిలకు తన యవతారము చాలించెను."

## మన కర్తవ్యము

లోకమాన్యుని యిహశరీరము మనలను దిగనాడి పోయెను. కాని లోకమాన్యుని ఆత్మ భారతవర్ష ప్రజల హృదయమందే స్థిరనివాసమేర్పరచుకొనెను. ఆమహామహుడు తనయొక్క యనంత కల్యాణ గుణ గణంబులనెల్ల మనకు స్వాస్థ్యముగ నిచ్చిపోయెను. లోకమాన్యుని కార్యదీక్ష, స్వధర్మాచరణానురక్తి, దేశమతభక్తి, పవిత్ర జీవితము, నిష్కామకర్మయోగము—యివన్నియును మన సొమ్ములే! వీనిని మనమెట్లు వినియోగపరచుకొందుమో చూడవలసియున్నది. మన పితామహు డిచ్చిన స్వాస్థ్యమును వృథ పుచ్చకుండ, దానిని అభివృద్ధిలోనికితెచ్చి, మన పితామహుడెకార్యమునకై తన జీవితమును ధారపోసెనో యట్టి మహత్తరకార్యమును నెరవేర్చి, వారిని తరింపజేసి, మనమును సద్గతికి పోవుదముగాక! ఆదివ్య పురుషుడు చూపిన మార్గమును మనమవలంబించుటయే మనకు పరమావధి, దీనివలననే వారియాత్మకు శాంతిగలుగగలదు. లోకమాన్యులు జూపిన నిష్కామ కర్మమార్గమును మన మవలంబింతుమేని మనము నిరుత్సాహులముగాక, ముందునకు సాగి పోగలము. దేశ ప్రజల మనంబు లిట్లు తల్లడిల్లుచున్న సందిగ్ధసమయములో జాతీయసభ కలకత్తాలో సమా

వేశము కానున్నది అచ్చట వీరు లేనికొరంత చెప్పతరముగాదు. అయినను, మన శక్తిని పరీక్షించుట కిదియే సమయమాసన్నమైనది. మనకిప్పు డిది పరిశోధనకాలము. మన మెంతవరకు లోకమాన్యుని యుపదేశమును గ్రహింపగలిగితిమో రేపే తెలియ గలదు. కనుక, దేశనాయకులందరును లోకమాన్యులులేని కొరంతలేకుండ, వారియాత్మ శక్తి నాధారముచేసికొని, కార్యదీక్షను గడంగి ధన్యులయ్యెదరుగాక! లోకమాన్యుని యొక్క జీవితసారము రేపు రానున్న జాతీయ సభా తీర్మానము వ్యక్తము జేయ గలదు. దీనికై లోకమంతయు వేచియున్నది. లోకమాన్యుని యాత్మకు శాంతికలుగు గాక, వీరియాత్మ పైన కాపుండి మనల నీ సందిగ్ధ తరుణమున దరికిజేర్చుగాక! దేవ గణములందుకూడ నాందోళన పుట్టించి భారత సమస్యను పరిష్కరించుటకై వారిని పురిగొల్పును గాక!

## పరిశిష్టము

దేశమునం దెందరు నాయకులున్నను వీరివలె ప్రజానురాగమును బడసినవారు గాంధిమహాత్ములు తప్ప, మరి యెవ్వరును లేరు. దీనికి కారణమేమి? ప్రజల కష్ట సుఖములు వీరికి బాగుగ తెలియును. తన దేశప్రజలు పడుచున్న కష్టములనుచూచి, సహింపలేని వాడగుటచేతనే ప్రజలకు వీరియం దనురాగ మెక్కుడు. స్వరాజ్యము లభించిననే గాని సర్వప్రజలకును సౌఖ్యము చేకూరదని వీరు నిస్సందేహముగ గనుగొనగలిగిరి. "మన కష్టముల నెరిగి మనకొరకై తన ప్రాణమును గూడ ధార వోయ సిద్ధపడియున్న వారీ తిలకు మహాశయులే" యని ప్రజలు గ్రహింపగలి గిరి. ప్రజాపక్షమును బూనిప్రజాగౌరవమును గాపాడ కంకణముగట్టుకొనిన వారు వీరొక్కరే. అట్టి వారియెడల ప్రజల కనురాగ ముండదా? ఇతరనాయకులకు వలె వీరికి విశేష భాగ్యముగాని, యధికారపదవిగాని, తదితరములగు నాడంబరములుగాని లేవు. వారికి స్వయముగ, ఆత్మోపభోగార్థమై కావలసిన దేదియును లేదు. వారి వేషభాషలు సామాన్యముగనే యుండును. ఏవిధమైన గర్వమును లేనివాడు. ఎట్టి కడజాతివానితోనైనను, ఎంత చిన్నపిల్లవానితోనైనను, మిక్కిలి భ్రాతృభావ ముతో నెమ్మదిగ, చనువిచ్చి చెవియొగ్గి మాటాడును. ఇంటిలో నెట్టి బట్టలను ధరించునో బయటికి వచ్చినప్పుడు సైత మా బట్టలనే ధరించును. ఇంచుకంతైనను కోపమన్న దెరుగని వాడు, "చలిచీమనైనను జాద్రొక్క జాలని శమదమాదుల నొప్పు సత్వఘనుడు" దయాళుడు, కరుణార్ద్రహృదయుడు. ఆన 1897 సంవత్సర ములో పునహాలో ప్లేగుచేతను, కరువుచేతను చచ్చియు చావకయు బాటల ప్రక్కను పడియున్న హీనజాతివారి వద్దకు తాను స్వయముగ బోయి, వారికి ఔషధములనిచ్చి సేదదీర్చి ఆపత్కాలమున రక్షించిన మహామహుడు.

వీరి విగ్రహము కేవలము భారత పుత్రుడన, ఆర్యసంతతివాడన, నిట్లుండవల దాయని యనిపించును. ఆజాను బాహుడు, దృఢకాయుడు, మేరుసమధీరుడు. అంతఃశక్తులను పైకి జిమ్ము ముఖతేజస్సుగలవాడు. ఆ మహారాష్ట్ర తలపాగ,

ఆ మహారాష్ట్ర మీసము, మహారాష్ట్ర ప్రజలకెల్ల—ఆ మహారాష్ట్రులననేల, అఖిల భారత కుమారులకును—భావోద్రేకమును గలిగించును. తొల్లింటి భీష్మద్రోణాది భారత వీరయోధులు జ్ఞప్తికి వత్తురు.

వీరి మేధాశక్తి నిరుపమానమైనది. వీరి మేధాశక్తికి అతీతమైనదేదియు లేదని చెప్పిన నతిశయోక్తి కాజాలదు. వీరు హూణ భాషయందును, న్యాయశాస్త్రమునందును అప్రతిమాన పాండిత్యముగలవారని జెప్పుటకు బి. ఏ. ఎల్. ఎల్. బి. బిరుదమే సాక్ష్యము. వీరికి సంస్కృతమునందును, గణితశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము వేదవేదాంగములయందును గల పాండిత్యమపారమైనదనుటకు, వీరు రచించిన, ''గీతా రహస్యము, మృగశీర్ష, ఉత్తర ధృవనివాసము'' మొదలగు గ్రంధములే సాక్ష్యములు. వీరి దేశభక్తియు, సత్యదీక్షయు వర్ణనాతీత మనుటకు వీరు గావించిన దేశసేవయు, స్వార్థత్యాగమును, తార్కాణములు. ఇది యది యననేల విశ్వమే లోకమాన్యుడు, లోకమాన్యుడే విశ్వము. ''లోకమాన్య లోక విశ్వవిద్యాలయము'' అని యొక మహనీయుడు వక్కాణించియున్నాడు. ఇట్టి ప్రజ్ఞలు వేర్వేరుగ, ఒక్కొక్కటి ఒక్కొక్కనియందు గానబడుచుంట సాధారణ విషయమే. కాని యివన్నియు నొకనియందే నమరియుండు టెంతయును విచిత్రము. భగవన్మాయను భేదింప మన మెంత వారము. ఇట్టి యవతారపురుషుల గాంచిన మన భారతమాత యెంతయు ధన్యురాలు. ఇట్టి సత్పురుషులనే సదా భగవంతుడు మన కనుగ్రహించుగాక! యని ప్రార్థింపుదము—లోకమాన్యుని యాత్మకు శాంతిగలుగుగాక!

ఆంధ్రదేశము
స్వస్తి శ్రీ రౌద్రినామ సం॥
అధికశ్రావణ బ 30.

ఓం. తత్ సత్,
'బ్రహ్మార్పణ మస్తు'
''దేశ సేవకుడు''

ఓం శాంతిః శాంతిః శాంతిః.



ఓం

# ఉపోద్ఘాతము

## (స్వరాజ్యతత్త్వము)

ఈ పుస్తకములో చాల భాగము స్వరాజ్యమును గూర్చిన యుపన్యాసములే యైయున్నవి. మనహిందూదేశమునకు స్వరాజ్య మత్యవసరమని ప్రతిచోటను నొక్కి వక్కాణించిరి. స్వరాజ్యమనగనేమి ? స్వరాజ్య మని చెప్పగనే మనలో చాలమందికి ఏదియో మహాపాతకమనియు, ద్రోహమనియు, తోపవచ్చును. స్వరాజ్య మనగనే, "ఇంగ్లీషువారిని యీ దేశమునుండి తరిమివేయుట" యని కొందరు భయ పడుచున్నారు. ఇట్లెంతమాత్రమును కాదు, మనము కోరుస్వరాజ్య మెట్టిదియో మీకిప్పుడు చెప్పెదను.

ఇంగ్లీషువారి రాజ్యము బహువిస్తీర్ణ మైనది. ప్రపంచములో అయిదవవంతు మన ఇంగ్లీషువారి రాజ్యమే. ఈ పెద్ద సామ్రాజ్యములో ననేకదేశము లున్నవి. అవేవ నగ; (1) ఇంగ్లాండు, స్కాట్లాండు, ఐర్లాండు దేశములు. సరే, యివి వారు పుట్టిన లంకలే గద. (2) అమెరికా ఖండములోని కనడాదేశము, ఆస్ట్రేలియాదేశము, న్యూజిలండు దేశము. ఈ దేశములకు "కాలనీలు" లేక "వలసదేశములు" అని పేరు. ఈ దేశములకు వలసదేశములని పేరేలవచ్చెనని మీరడుగవచ్చును కారణమే మనగ, మొదట కొన్నివందల సంవత్సరముల క్రిందట ననేక కారణాంతరములచే సీమలో నుండు ప్రజ లీ దేశములకు లేచివచ్చి, యిచట స్థిరనివాసము లేర్పరచుకొనిరి. ఇట్లు తమ జన్మభూమిని వదలి యితరదేశములకు బోవుటకు "వలసపోవుట" యని పేరు. ప్రజ లాదేశములకు వలసపోయిరి. కాన ఆదేశములకు వలసదేశములని పేరు. ఈపైన జెప్పిన వలసదేశములన్నియును యింగ్లీషు సామ్రాజ్యములోనివే (3) మన హిందూ దేశము; (4) అక్కడక్కడ నింక సముద్రములలోని లంకలు. ఈ దేశములన్నియును కలసి పెద్ద ఆంగ్లేయసామ్రాజ్య మగుచున్నది. వీని నన్నిటిని పాలించు ప్రభువు మన జార్జిచక్రవర్తిగారే. ఈ సామ్రాజ్యములోని కష్టసుఖముల కన్నిటికిని మనమే బాధ్యులము. కష్టములు వచ్చినప్పుడు అందరును సమానముగ కష్టపడవలసినదే; సుఖము వచ్చినప్పుడందరును సమానముగ సుఖింపవలసినదే. ఒక తండ్రికి నలుగురు కుమాళ్ళు కల రనుకొనుడి. తండ్రియాస్తికి యీ నలుగురు సమాన హక్కుదారులే కద, తండ్రికేమైన కష్టసుఖములు వచ్చినప్పుడు అందరును సమానముగ కష్టపడవలసినదే, సమానముగ సుఖ మనుభవింప వలసినదే, ఈ విషయమందరకిని తెలిసినవిషయమే. కాని యీ

యాంగ్లేయ సామ్రాజ్యములో చేరిన యీ దేశములకన్నిటికిని సమానమైన కష్టములు గలవా ? సమానమైన హక్కులు గలవా ? లేవా యని విచారింపుదము. అట్లు విచారింపగా అందరికిని సమానమైనహక్కులు లేవని తేలుచున్నది. వలసదేశముల కెక్కువ హక్కులును, ఎక్కువ స్వాతంత్ర్యములును కలవు. కాని మన హిందూదేశమున కట్టి హక్కు లేమియును లేవు. మనలను వారు సవతిబిడ్డలను చూచినట్లు "ఒకకంటిలో బెల్లము, ఒకకంటిలో సున్నము"తో చూచుచున్నారు. అట్టి భేదముతో, మాయందనాదరబుద్ధితో చూడక, అందరితోడను సమానముగజూడవలసినదని మనము కోరుచున్నాము, వలసదేశములకున్న హక్కులే మాకుకూడ ప్రసాదింపవలసినది, వారికిచ్చిన స్వాతంత్ర్యమే మాకుకూడ నివ్వవలసినది. మేమును వారివలెనే జార్జిసార్వభౌముని యేకచ్ఛత్రాధిపత్యము క్రింద హాయిగా సుఖించెదము, అని మనము కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము. ఆంగ్లేయ సామ్రాజ్యముతో సంబంధము త్రెంపుకొనవలయునని కోరిక మాకెంతమాత్రమును లేదు. మమ్ముల నెవరైన "మీరెవరు" అని ప్రశ్నించినయెడల మేము ఆంగ్లేయ సామ్రాజ్యపౌరులము అని గర్వముతో జెప్పుకొనవలయునని మనకు కుతూహలము గలదు. కాని ఆంగ్లేయ సామ్రాజ్యపౌరున కుండవలసిన ఆ హక్కులను ఆ స్వాతంత్ర్యశక్తులను మనకు లేకుండజేసిరి. వానినే మనమిప్పుడు పొందకోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

"వలసదేశములకున్న హక్కులేమి ? మనకు లేకపోయిన వేమి ?" యని మీరడుగ వచ్చును. ఈ ప్రశ్నకు సమాధాన మిదిగో చెప్పుచున్నాను. జాగ్రతగ వినుడి.

## పార్లమెంటువారి యధికారము

మన హిందూదేశములో జరుగు నన్ని వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటకు సీమలో నున్న ఇంగ్లీషు పార్లమెంటువారికి పూర్ణమైన యధికారము కలదు. మన హిందూదేశమునకు సంబంధించినంతవరకు, మన దేశములోని, మన యింటిలోని, వ్యవహారములను మన యిష్టానుసారముగ పరిష్కరించుకొనుటకు మన కేవిధమైన హక్కునులేదు. దీనికొక చిన్న యుదాహరణ జెప్పెదను. ఒక గ్రామములో మన మొకయిల్లు కట్టుకొని కాపురము చేయుచున్నా మనుకొనుడు. మన యింటికి సంబంధించినంతవరకు, వ్యవహారములను మన యిష్టము వచ్చినట్లు పరిష్కరించుకొనుటకు మనకు హక్కుగలదుగద. మనకువచ్చు ఆదాయమును బట్టి, మనము భోజనమున కెంత కర్చుపెట్టవలయునో, బట్టల కెంత కర్చుపెట్టవలయునో, వివాహాదికార్యముల కెంత కర్చుపెట్టవలయునో, మొదలగు గృహకృత్య సంబంధమైన ఆంతరంగిక వ్యవహారముల నన్నిటిని ఇతరుల జోక్యములేకుండ మనమే పరిష్కరించుకొనవలెనుగద. ఎవరో యిరుగు పొరుగువారు వచ్చి, ఇదిగో ! మీ యింటిలో పెళ్ళికి లక్షరూపాయలు కర్చుపెట్టు! నీదాసీ జనమునకు నెలకు 1కి 50 రూపాయిలు జీతమియ్యి! ప్రతి దినమును నీయింటిలో వందమందికి సంతర్పణము చేయుము! మీయింటిలో ప్రతివారును విలువగల పట్టుపీతాంబరములనే ధరింపవలెను ! అని మన

లను నిర్బంధపెట్టిన నెట్లుండును? మన గృహకృత్యములలో యిరుగు పొరుగువారి కెట్టి సంబంధమునులేదు; మన యిష్టము వచ్చినట్లే చేసికొనవచ్చును. కాని గ్రామమంతటికిని సంబంధించిన వ్యవహారమేదైన వచ్చినప్పుడు, నీ యిష్టమువచ్చినట్లు చేయుటకు వీలు లేదు. అప్పుడు గ్రామస్థులందరితోడను సంప్రతించి పనిచేయవలసి యుండును. ఆవిధముగనే, యీవిశాలమైన ఇంగ్లీషువారి సామ్రాజ్యమే యొకగ్రామ మనుకొనుడు; దానిలో మన హిందూదేశమే మన యిల్లనుకొనుడు. ఇది తక్కిన యిళ్ళన్నిటి కంటెను మిక్కిలి పెద్దది. అనాదినుండియు పేరు ప్రతిష్టలతో మెలగుచు సర్వజనులకు పూజనీయులైన గొప్పకుటుంబము వారీ యింటిలో కాపురము చేయుచున్నారు. వీరికి పూర్వమునుండియు దేశము నందంతటను చాల పలుకుబడి గలదు. గ్రామములో నుండు తక్కినయన్ని యిళ్ళవారికిని తమతమ గృహకృత్యములలో స్వాతంత్ర్యముండగ, వీరికి, అనగా మన హిందూదేశమను యింటికి, అట్టి స్వాతంత్ర్యము నేడేల లేకపోవలెను? మన యీ గృహకృత్యములలో పార్లమెంటు వారేల ప్రతిదానికిని అడ్డము రావలెను? మా యింటిలోని దాసీవాండ్లకు నెలకు రూపాయి జీతమే యిచ్చుకొనెదమని మనమనుచుండగా, "అట్లుకాదు! వారికి నెలకు 50 రూపాయిలు యిచ్చి తీరవలెను!" అని మన పొరుగింటి పార్లమెంటు వారేల మనలను నిర్బంధించవలెను! ఇట్టి నిర్బంధము వలసదేశములవారికి లేనప్పుడు, మనపైననేల చలాయించవలెను. తమ గృహకృత్య సంబంధమైన ఆంతరంగిక వ్యవహారములను పరిష్కరించు కొనుటకు వలస దేశములవారి కెట్టి స్వాతంత్ర్యము కలదో, అట్టి స్వాతంత్ర్యమే మన హిందూదేశమునకు గూడ నుండవలసినదని మనము కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## ప్రజాభిప్రాయము

సీమదేశములోను, వలసదేశములలోను, రాజ్యాంగవ్యవహారము లన్నియును ప్రజాభిప్రాయాను సారముగ జరిగితీరవలెను. వలస దేశములలోని గవర్నరులు, వైస్రాయిలు, తక్కిన గొప్పయుద్యోగస్థు లందరును కలిసి "ఫలాని పెద్దమనిషిని గవర్నరుగ నేర్పరుచుకొందాము" అని నిర్ణయించు కొందురు: ప్రజల కిష్టము లేనియెడల "ఇదిగో! వీనిని యీ యుద్యోగములోనుండి యూడబెరుకుడు" అని యాజ్ఞాపించెదరు. కనుక యీ యుద్యోగస్థు లందరును ప్రజాభిప్రాయమునకు గడగడ వణకుచుందురు. ప్రజలకు తమమీద నెప్పుడు కోపము వచ్చునోయని కడు జాగరూకతతో మెలంగుచుందురు. ఈయుద్యోగస్థు లందరును ప్రతి విషయములోను ప్రజలకు జవాబు చెప్పి తీరవలెను. ఒక చిన్న యుదాహరణ;...గవర్నమెంటువారు ప్రజల వద్దనుండి యేదైన నొకపన్ను వసూలు చేయుదురనుకొనుడు. మన దేశములో ప్రతిగ్రామములోను ఎన్నియో సంవత్సరములనుండి రోడ్డుపన్ను ప్రతిరైతు వద్దనుండి వసూలు చేయుచున్నారు గద. ఈపన్నును మీరేమి చేసినారు? మీరీడబ్బును ఏయే విధముగ కర్చుపెట్టినారు? ఎన్ని గ్రామములలో రోడ్లువేసినారు? అని ప్రజలు గవర్నమెంటు వారిని ప్రశ్నింపవచ్చును. ఈప్రశ్నకు వారుతగిన సమాధానము చెప్పితీరవలెను.

అనగా గవర్నుమెంటువారు ప్రజలకు ఉత్తరవాదులై, బాధ్యులై యుండవలెను. ఇదియే బాధ్యతాయుత పరిపాలన. కాని మన దేశములో గవర్నుమెంటువారు ప్రజలకు జవాబు చెప్పవలసిన యవసరము లేదు. మనము దీని విషయమై యనేక సంవత్సరముల నుండియు మొఱపెట్టుకొనగ మీదుకూడవచ్చి గవర్నమెంటు వారితో చెప్పుకొనవచ్చును అని అనుగ్రహించిరి. అప్పుడే తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులు, చట్టనిర్మాణసభలు మొదలైనవి బయలుదేరినవి. చట్టనిర్మాణ సభల విషయమై కొంచెము విప్పిచెప్పవలసి యున్నది. ప్రతిరాజధానికిని రెండు తరగతుల ప్రభుత్వసంఘములు గలవు. (1) చట్టనిర్మాణసంఘము. (2) కార్యనిర్వాహక సంఘము. మొదటి చట్టనిర్మాణసభలో ప్రజలచేత పంపింపబడి, ప్రజల పక్షమున మాట్లాడువారుందురు. రెండవ దానిలో గవర్నుమెంటు వారిచే నియమింపబడిన ఉద్యోగస్థులుందురు. ఈ రెంటిలో నుండు విశేష మేమనగా:—చట్టనిర్మాణ సంఘములో నుండి ప్రజల పక్షమున వాదించు వారెన్ని చట్టములనైన నిర్మింపవచ్చును. కాని వానిని అమలులో పెట్టుటకు వారికేవిధమైన యధికారమును లేదు.

రెండవ తరగతి కార్యనిర్వాహక సంఘములోనుండు గవర్నమెంటు తరపు ఉద్యోగస్థులే వానిని అమలులో పెట్టవలెను. ఈ పనిని వారికి యిష్టమైన చేయుదురు, లేనియెడల చేయరు. అట్లు చేసి తీరవలెనను నిర్బంధమేమియును లేదు. అనగా యీ కార్యనిర్వాహక సంఘమువారు ప్రజాపక్షపు చట్టనిర్మాతలకు జవాబు చెప్పవలసిన పనిలేదు. అట్లయినప్పుడీ చట్టనిర్మాణసంఘముల వలన నేమి ప్రయోజనమున్నది ? ప్రజలు చెప్పుమాటలను అమలులో పెట్టనప్పుడు యీ సభల వలనను, యీ చర్చలవలనను, నేమి ప్రయోజనమున్నది ? వట్టి కంఠశోషయే గాని యేమియును లాభములేదు. ఆ విధముగనే, యీ మ్యునిసిపాలిటీలు, యీ తాలూకా బోర్డులు, యీ జిల్లా బోర్డులునుకూడ పైకి కనబడు వట్టి యాడంబరమేగాని, ప్రజలు చెప్పుమాటయేమియు పైకి రాజాలదు. వీనియన్నిటి పైనను కలెక్టరు దొరవారు మరమేకులాగున బిగించుకొని కూర్చుండును. ఆయన ఆ మరమేకును త్రిప్పినట్లయిన మనవారి యాటలేమియును సాగవు. కలెక్టరు యిష్టములేనిది చింతాకంత పనియైనను జరుగనేరదు. ఇట్టి సందర్భములో ప్రజల స్వాతంత్ర్య మెక్కడ ? ప్రజలు చెప్పిన మాట వినకపోయిన యెడల "అమ్మో ! నా యుద్యోగ మెక్కడ యూడిపోవునో" యను భయమాకలెక్టరునకు కలుగునవరకును మనకు నిజమైన స్వాతంత్ర్యములేదు. వాని యుద్యోగము మన చేతులలో లేనంతవరకును ఆ కలెక్టరు మన మాటలనేల లక్ష్యము చేయును ? మనపైన స్వారిచేయునుగాని మనకు విధేయుడైయుండడు. కాని సీమ దేశములోను, వలసదేశములలోను యీ యాటలు సాగవు. మనకుకూడ నీ విధమైన స్వాతంత్ర్యమే యుండవలెనని మనము కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## కోశాధికారము

ఈ విషయ మతి ముఖ్యమైనది. ఇది డబ్బుకు (ధనమునకు) సంబంధించిన విషయము. మన మందరమును కలసి మన గ్రామములో నొకచెరువు త్రవ్వించుకొనుటకై చందాలు వేసికొని కొంతడబ్బును ప్రోగుజేసినా మనుకొనుడు. ఎవరి చేతిలోని డబ్బు వారిచేతిలోనే యుండిన నేమిప్రయోజన మున్నది? పని కొనసాగు టెట్లు? కనుక డబ్బంతయు ప్రోగుచేసి, ఒక ఫండుగ నేర్పాటుచేసి, గ్రామములో నున్న నొక పెద్ద మనుష్యుని చేతికిచ్చి "అయ్యా! మీరు ఫలాని పనికై ఈ విధముగ కర్చుపెట్టవలసినది"ని యిచ్చెదము. అట్లిచ్చినప్పుడా పెద్దమనిషి మన కోరిక ప్రకారము కర్చుపెట్టవలెనా? లేక తన యిష్టము వచ్చినట్లు దుర్వ్యయముచేసి, మనము లెక్కయడిగినప్పుడు సరిగ లెక్కచెప్పక, పెంకెతనముగ వర్తింపవలెనా? అందరి కోరిక ప్రకారము కర్చు పెట్టవలెనని మనకు తెలియునుగదా. గవర్నమెంటువారు ప్రజలవద్దనుండి వసూలు చేయు పన్నులనుకూడ నదేవిధముగ కర్చుపెట్టవలెను. పన్నులను మారుపేరుతో మన మందరమును ప్రతివానివద్దనుండియు చందాలను ప్రోగుచేసి, గవర్నమెంటను నొక పెద్దమనిషి చేతికిచ్చి దానిని మన యందరి యుపయోగార్థమై కర్చుపెట్టవలసినదని చెప్పుచున్నాము. గవర్నమెంటువారావిధముగ మన యిష్టానుసారము కర్చుపెట్టని యెడల మన మీచందాలను అనగ యీ పన్నులను యివ్వనక్కర లేదు. మన మిచ్చిన డబ్బుతో చెరువు త్రవ్వించకుండ, ఆ పెద్దమనిషి యీ డబ్బుతో తన కూతురు పెండ్లి చేసికొని మనకేమియు జవాబు చెప్పకుండ కూర్చున్నయెడల తిరిగి మీరెన్నడైనను ఆయనను నమ్మి చిల్లిగవ్వయైనను ఆయన చేతికిత్తురా? దీనిలో నుండు రహస్యమిది.

మన హిందూదేశము మీద వసూలగు ధనమునంతను యేవిధముగ కర్చుపెట్టవలయునో, యేయే పన్నులనువేసి, యేయేవిధముగ డబ్బువసూలు చేయవలయునో, యీ విషయముల నన్నిటిని నిర్ణయించుటకు మనప్రజల కేమియును స్వాతంత్ర్యము లేదు. నీ యింటిలోనికి నేనువచ్చి డబ్బుకర్చుపెట్టు విషయమై పెత్తనమంతయు నేనేచేసిన యెడల రెండు దినములలో నీవు దివాలా యగుదువు. అదేవిధముగ డబ్బు పెత్తనము యితరుల చేతులలోనున్నందువలన సమస్త భాగ్యభోగ్యములతో తులతూగుచుండవలసిన మనదేశమిప్పుడు కడుబీదస్థితియందు బడియుండి ప్రజలు త్రాగుటకు ముప్పొద్దులను గంజియైనను లేని దురవస్థలో మునిగి యున్నది. ఇట్టి కడు పేదపడిన దేశము ప్రపంచములో మరియెచ్చటను లేదు. దీనికి కారణమేమి? ఈ దేశములో చాలినంత ధాన్యము పండదా? తినుబండారములు పండవా? ఖనిజములులేవా? ప్రత్తి పండదా? మన దేశము యితర దేశములవలె భూసారములేనిదా! ప్రపంచములో నన్ని దేశముల కంటెను మిగుల సారవంతమైన దేశమిప్పుడు అన్ని దేశముల కంటెను యిట్లు పేదపడియుండుటకు కారణమేమని దాదాభాయి నౌరోజీ గారు ప్రశ్నించిరి. జవాబులేదు. దీనికి కారణము రాజ్యపాలనా పద్ధతిలోని లోపమే. ఇంగ్లండునకువచ్చు ఆదాయములో నూటికి ౩౩కెక్క వంతున పరిపాలనా కర్చుల క్రింద

వ్యయము చేసెదరు. తిరిగి యీ సొమ్ము ప్రజలకేదో రూపమున వచ్చిచేరును. దేశము దాటి బయటికి పోదు. దేశములోనేయుండును. కాని మన బీద దేశములో నూటికి 22 రూపాయలు పరిపాలన క్రింద కర్చుపెట్టుచున్నారు. ఈ 22 రూపాయలలో చాలభాగము మనకు తిరిగి రాకుండ పరదేశములకు బోవుచున్నది. అందు వలన ప్రజలంత కంతకు దరిద్రులగుచున్నారు. డబ్బుపెత్తనము పొరుగింటి వాని చేతిలో పెట్టిన వాని గతి యేమగును? మన దేశముమీద వసూలగు పన్నులను కర్చుపెట్టుటలో మనకేమియు స్వాతంత్ర్యము లేదు. అందువలన మనకీగతి పట్టినది. కాని వలసదేశములవారి కీహక్కుగలదు. వారు తమ యిష్టప్రకారమే డబ్బును కర్చుపెట్టుదురు. ఇట్టి యధికారమునే మన మిప్పుడు కోరుచున్నాము. ఇదియే (ముఖ్యముగ) స్వరాజ్యము.

## సివిలు కర్చులు

సొమ్ము కర్చుపెట్టు విషయములో మనకు స్వాతంత్ర్యము లేనందువలన మన డబ్బంతయు నెట్లువృధాగ దుర్వ్యయపరుపబడుచున్నదో చూపెదను. మొదట శివిల్ ఉద్యోగస్థుల జీతములను గూర్చి విచారించెదము. కలెక్టరునకు నెలకు రు 2500 లు జీతము; నల్లవాడైన 1200 లు మాత్రమే. గవర్నరునకు నెలకు పదివేలు. వైస్రాయికి నెలకు 20 వేలు. ఒక్క మన యిండియా పక్షమున మాత్రమే సీమలోనున్న మంత్రికి (సెక్రటరికి) వారిసిబ్బందికి నెలకు 287500 లు కర్చు. ఇంత విపరీతపుజీతము లెచ్చటను, యేదేశములోను, యేరాజ్యములోను లేవు. వలసదేశములో జీతము లెట్లుండునో విచారింపుడు. ఇచటి జీతములలో సగముండును. వలసదేశము లన్నిటిపక్షమున సీమలోనొకడే మంత్రియుండును. ఆ మంత్రికి వారిసిబ్బందికి నెల 1-కి రు 261, 250 లు జీతము. దీనిలో నింకొక చిత్రమున్నది. సామ్రాజ్యమున కంతకును సంబంధించిన వ్యవహారము లన్నిటిని పరిష్కరించుటకు ముఖ్యమంత్రి యొకడుండును. అందరి యుద్యోగస్థులకంటెను ఈ మంత్రియెక్కువయిన వాడుగదా. కాని ఈ మంత్రికి జీతము నెల 1 కి రు 6,250 లే; కాని హిందూదేశ వ్యవహారములను మాత్రము జూచు మన వైస్రాయికి జీతమెక్కువ; మనవైస్రాయిగారికి రు 20,000 లు జీతము. దీనికి కారణమేమి ? ఎందుకనగా:— వైస్రాయిగారికిచ్చే జీతము మనవద్దనుండి పన్నుల ద్వారా వసూలుచేసిన డబ్బునుండి యిచ్చుచున్నారు. కాని ముఖ్యమంత్రికి జీతము సీమలోని ప్రజలిచ్చుకొనుచున్నారు. అది వారి సొంతడబ్బు కనుక డబ్బు నేవిధముగ పొదుపుగ వాడుకొనవలయునో వారికి బాగుగ తెలియును. కాని వైస్రాయికి జీతమివ్వవలసి వచ్చినప్పుడు వారిసొంతడబ్బులో నుండితీసి కర్చుపెట్ట నక్కరలేదు. గనుక యెన్ని వేలరూపాయలిచ్చినను లెక్కలేదు. ఇది పొరుగింటి డబ్బు, పొరుగింటి పెత్తనము; అది సొంతడబ్బు. ఈ రెంటికిని భేదము మనము సులభముగ గ్రహింపవచ్చును. ఇంకొకవిషయము:—సీమలో మన ఒక్కయిండియా తరఫున నొక మంత్రియు,

వలసదేశములన్నిటి తరఫున నొక మంత్రియు నుండునని చెప్పియుంటిని. మన ఇండియా మంత్రికిని ఆయన క్రింది తాబేదార్లకును సిబ్బందికిని, * మనమే జీతము లిచ్చుకొనవలెను. దాని కగుకర్చంతయును మనమే భరింపవలెను. కాని వలసదేశపు మంత్రికి జీతములుగాని, వారికగు నితరకర్చులనుగాని, తమ వలసదేశపు డబ్బులోనుండి యిచ్చుకొన నక్కరలేదు. సీమలోనివారే పెట్టుకొనెదరు. ఈ భేదమును గమనించితిరా! ఈ కారణముచేతనే ఇండియామంత్రికి వారి సిబ్బందికి ఎక్కువ జీతమును, వలసదేశముల మంత్రికి వారి సిబ్బందికి తక్కువజీతములను యిచ్చుచున్నారు తామిచ్చుకొనవలసి వచ్చినప్పుడు తక్కువజీతమును మన ఇండియా యిచ్చుకొనవలసినప్పుడు ఎక్కువజీతములునా? ఇదియేటి యన్యాయమో తెలియరాకున్నది.

ఇక ఫించనులు వగైరాలను గూర్చి విచారింపుదము. ఉద్యోగము చేయుచుండగ నిచ్చు జీతములో సగము జీతము ఫించను పుచ్చుకొనిన పిమ్మట నిచ్చుచుందురు. కాని మన నల్లవాండ్లెన్ని వేల రూపాయిల యుద్యోగము చేసినను దానిలో సగము ఫించను క్రిందనివ్వరు. రు 500 ల కంటె యెక్కువ ఫించను యివ్వరు. ఈభేదమేలయుండవలెనో తెలియరాకున్నది. నల్లతోలుండిన తక్కువజీతములు, తక్కువ ఫించనులును; తెల్లతోలుండిన ఎక్కువజీతములును, ఎక్కువ పింఛనులునా? తోలు యొక్కరంగును బట్టి జీతములలో భేదమేర్పరుచుట యీ ప్రభుత్వములో తప్ప మరియెచ్చటను గానరాదు.

ఈ జీతము లిచ్చుటలో మరియొక చిత్రమున్నది. ఈ దొరలకు జీతము క్రింద మన రూపాయ లిచ్చిన పనికిరావు. వారికి బంగారు నవరసులేకావలెను. ఒక కలెక్టరునకు రు. 1500 లు జీతమనుకొనుడు. ఈయనకు మన 1500 వెండి రూపాయి నాణెము లిచ్చిన పనికిరాదు. 15 రూపాయీలకు ఒక నవరసు చొప్పున లెక్కవేయగ 100 నవరసులగును గద; యీ లెక్క ప్రకారమాయనకు నూరు బంగారు నవరసులను కొని యివ్వవలెను. కాని యీ మధ్యను మన వెండి రూపాయిలలో పూర్తిగా నికరమైన వెండిలేదు. ఒక రూపాయిలో సుమారు 10 అణాలు స్వచ్ఛమైన వెండియును, మిగిలిన 6 అణాలును యేదియో మరియొక లోహము నున్నది. ఇట్టి కలితీ కలిసిన రూపాయి మన దేశములో 16 అణాల క్రింద చెల్లుబడియగును, కాని సీమ దేశములో 10 అణాల క్రిందనే లెక్కచూచెదరు. కనుక మన యీ 15 వెండి రూపాయిలును సీమకు తీసికొని వెల్లి యెవరికైనను యిచ్చి ఒక బంగారు నవరసు

* క్రొత్తచట్టములో దీనిని మార్చివేసిరి. ఈ కర్చునిక సీమవారేభరింతురు. అయిననేమి; ఇదివరకే ఎక్కువగ నున్నవని మొత్తుకొనుచున్న శివిల్ మిలిటరీ యుద్యోగస్థుల జీతముల మరింత ఎక్కువ జేసిరి. ఈ యెక్కువ జీతములను మనమే యిచ్చుకొనవలెను. ఏ మొగము పెట్టుకొని పై యుద్యోగస్థుల జీతము లెక్కువ జేసిరో యూహింపరాకున్నది.

యివ్వమని యడిగిన యెడల నెవరును యియ్యరు. ఈ 15 రూపాయలను రు 9-6-0 లు గనే లెక్క చూచెదరు. కనుక మిగిలిన రు 5-10-0 లును మనకుష్టమే. రూపాయలో సికరమైన వెండిలేకందున మారకములో మనకీ దండుగవచ్చుచున్నది. కలెక్టరున కివ్వవలసిన రు 1500 లకును 100 బంగారు నవరసు లివ్వవలెను. కాని పైన చెప్పిన లెక్క ప్రకారము రూపాయికి 6 అణాలు మారకములో నష్టమువచ్చుచున్నది. అనగా రూపాయికి ఆరు అణాలు వట్టమివ్వవలెను. గనుక 1500 రూపాయిలకు రు 562-8-0 లు వట్టమగుచున్నది. ఈ వట్టమును కూడా మనమే భరింపవలెను. అనగా జీతము రు 1500 లును, వట్టము రు 562-8-0 లును, మొత్తము రు 2062-8-0 ఖర్చుపెట్టిననే గాని ఆ దొరగారికి 100 బంగారు నవరసులనుకొని యిచ్చుటకు సాధ్యపడదు. కాని లెక్క జెప్పునప్పుడు మాత్రము దొరగారికి 1500 రూపాయలే జీతమని పైకి జెప్పుదురు. ఈ విషయముగ "మారకపు వట్టము" (Exchange Compensation) క్రింద సాలుకు కోట్లరూపాయిలు కర్చు అగుచున్నవి. దీనికి గతియేమి ?

ఇదిగాక "మత సంబంధమైన డిపార్టుమెంటు" అని యొక డిపార్టుమెంటు కలదు. ఇది దేశమును పాలించు రాజుల స్వమతము; అనగా క్రైస్తవ మతము; ఈ క్రైస్తవ మతమునకై గవర్నమెంటువారు, మన ప్రజల వద్దనుండి పన్నులద్వారా వసూలుచేసిన సొమ్ములోనుండి సాలుకు షుమారు 20 లక్షల రూపాయలను ఖర్చుపెట్టెదరు. ఈ సొమ్మును బిషప్పులకును, క్రైస్తవ పాదిరీలకును జీతములు వగైరాల క్రిందను క్రైస్తవ "చర్చి" ల క్రిందను ఖర్చుపెట్టెదరు. సర్వమతములును మాకు సమానమేయని చెప్పుచు యీ పక్షపాత దృష్టి యేమో తెలియకున్నది సహాయము చేసిన నన్నిమతములకును చేయవలెను. లేని యెడల నన్నిమతముల యెడలను తటస్థభావము వహించి యూరకొనవలెను. అదిగాక సమస్తమైన జనులనుండి వసూలు చేసిన సొమ్ములోనుండి కేవల మొక్క మతమువారి మతాభివృద్ధికై యేల కర్చుపెట్టవలెనో తెలియ రాకున్నది. దీని విషయమై ఇప్పటికే విశేషముగ వ్రాసియున్నాను. డబ్బుకర్చుపెట్టు విషయములో నెంత యన్యాయము మనకు జరుగుచున్నదో పూర్తిగ వ్రాయుదలచు కొనిన నొకపెద్ద గ్రంథమగును. డబ్బుకర్చుపెట్టుట కధికారము మన చేతులలో నుండిన యెడల నిట్టి యన్యాయము జరుగునా? మనమిప్పుడీ యధికారము కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## మిలిటరీ ఖర్చులు : (సైన్యపు ఖర్చులు)

ఆన 1858 సం॥ లో మన దేశముకుంపుణివారినుండి తొలగి, విక్టోరియా రాణీగారి చేతిలోనికి బోయినది. అప్పటినుండియు మన దేశముకూడ బ్రిటిష్ సామ్రాజ్యములో నొక భాగమే యనియు, సామ్రాజ్యపు కష్టసుఖములను, హక్కులను బాధ్యతలను సమస్తవానిని మనముకూడా వారితోబాటు భరింపవలెననియు చెలిపియున్నారు. అందువల్లనే, మంచు మనహక్కులు, స్వాతంత్ర్యములు, సౌఖ్యము సీనిమాట యెట్లు

న్నను, సామ్రాజ్య రక్షణార్థమై యొక పెద్దసేనను తీసికొనివచ్చి మన దేశములో
నిలువయుంచిరి. ఈపెద్దసేనకగు కర్చంతయును మనమే భరింపవలెను. అనగ మనశిస్తు
డబ్బులలో నుండియే తీసికొని వారికివ్వవలెను. బ్రిటిష్ సామ్రాజ్యములో నెచ్చట
యే యుద్ధములు వచ్చినను వారీసేనను, తీసికొని వెళ్ళవచ్చును. అట్లు యీసేనను మన
దేశమునుండి తీసికొని పోయినను, దానికగు మామూలు కర్చంతయును, సాధారణ
ముగ, మనమే భరింపవలసి వచ్చుచున్నది! ఈసేనకగు కర్చు సామాన్యపు కర్చను
కొంటిరా! ఈసేనకై మనము సంవత్సరమునకు 33 కోట్లరూపాయలు కర్చుపెట్టు
చున్నాము! అనగ మన ఇండియా దేశమంతటి మీదను వసూలగు రివిన్యూలోనుండి
నాల్గవవంతు డబ్బు కేవల మీసైన్యముక్రింద ఖర్చగుచున్నది. యుద్ధము ముగిసిన
పిమ్మట యీకర్చు మరింత యెక్కువైనది! రివిన్యూలో సగమువంతు యిప్పుడు
యీ మిలిటరీక్రింద కర్చగుచున్నది! ఇంత విపరీత మేదేశములోను లేదు. "ఇంతకర్చు
మేము భరింపలేము, ఈసేనను తగ్గించి వేయవలసినది." అని దాదాభాయి నౌరోజీ
గారును, గోక్లే మొదలగు దేశభక్తు లందరును, పార్లమెంటులోను, తదితర సభల
లోను మొరపెట్టుకొనిరి. కాని యీ మొరను వినువారెవరు? ప్రజల చేతులలో నధి
కారములేదు గాన, మనడబ్బంతయు నీవిధముగ బాడగుటయు, మనము దినములవరు
సను గ్రుంగి దారిద్ర్యాంబుధిలో మునిగి పోవుటయు తటస్థించుచున్నది. వలసదేశము
లిట్టి దుర్వ్యయము నొక దినమైనను సహింపవు, అదిగాక ప్రపంచములో నెచ్చటయే
యుద్ధముజరిగినను, ఎవరితో మన ఇంగ్లీషువారు కలహించి, యుద్ధములోనికి దిగినను,
అట్టి యుద్ధమునకును మన హిందూదేశమునకును ఎట్టి సంబంధము లేకున్నను, ఆయుద్ధ
మునకగు కర్చంతయును కొన్ని సమయములలో మనమే భరింపవలసి వచ్చినది. దీనికి
1,2, ఉదాహరణములను చూపించెదను. అన 1880 సం॥ ప్రాంతములో మనయింగ్లీషు
వారికిని (అఫ్ఘనిస్తానము) కాబూలు వారికిని యుద్ధము తటస్థించెను. ఆయుద్ధమునకు
మొత్తముమీద 30 కోట్ల 50 లక్షల రూపాయలు కర్చయినది. ఈ యుద్ధము కేవలము
ఒక్క యిండియా దేశమునకు సంబంధించినది కాదనియు, బ్రిటిష్ సామ్రాజ్యమున
కంతటికిని సంబంధించినదనియు, ఆంగ్లేయ సామ్రాజ్యముయొక్క కీర్తిప్రతిష్టలను
నిలువ బెట్టుటకై యీ యుద్ధములోనికి దిగవలసి వచ్చినదనియు, పార్లమెంటు సభ్యు
లును మంత్రులును సమస్తమైనవారును ఏకగ్రీవముగ నొక్కిపక్కాణించిరి. ఇట్టి
స్థితిలో యీ ముప్పైకోట్లన్నర రూపాయల కర్చును బ్రిటిష్ సామ్రాజ్యములోని దేశ
ముల వారందరును సమానముగ భరించు టవుసరమని యెంతమందబుద్ధిగలవాని
కైనను తెలియునుగద. కాని యిచ్చట జరిగిన యన్యాయమేమియో తెలియునా?
ఈ 30 కోట్ల 50 లక్షల కర్చులో 24 కోట్లరూపాయలను మన దేశము భరింపవలె
ననిరి. మిగిలిన 6½ కోట్లు తాము భరించెదమనిరి! ఈయుద్ధమునకై వలసదేశము వా
రేమిచ్చిరో యెవరికిని తెలియదు. ఏమి? మనమీద నింత నిష్కారణ ప్రేమయేల?
ఇట్టిప్రేమ, ఇట్టిపక్షపాతము, హక్కులు గాని, లాభములుగాని పంచుకొనవలసి వచ్చి
నప్పుడు చూసిన బాగుండునుగద. నష్టము పంచుకొనుటలో మాత్రమింత నష్టమును

మన నెత్తిమీద నేలవేయవలెను? దీనికి కారణము ప్రజలకు నోరులేదు గనుక. భాగములు పంచుకొను నప్పుడు మనమాట నచ్చుట చెప్పువారేరి? ప్రజలకు రాజ్యాంగ వ్యవహారములలో జోక్యము పుచ్చుకొనుట కధికారము లేనంతవరకిట్టి యన్యాయములు జరుగుచునే యుండును.

ఆఫ్రికా ఖండములో తిరిగి మన యింగ్లీషు వారికిని అబ్బిసీనియా దేశస్థులకును యుద్ధము తటస్థించినది. ఆయుద్ధపుఖర్చు మన నెత్తిమీదనే వేసి పులిమిరి. ఎక్కడ ఆఫ్రికా, ఎక్కడ ఇండియా? ఆఫ్రికాలో మన ప్రభువులు యుద్ధము చేసినారట. ఆఖర్చు మనము భరింపవలెనట. ఇట్లే 1900 సం॥లో జరిగిన బోయరు యుద్ధపు ఖర్చు కూడా మనలనే భరింపవలసినదనిరి. ఈ ఖర్చుల నేల సామ్రాజ్య మంతటిమీద పంచకూడదు? ఈ యుద్ధముల కన్నిటికిని డబ్బు మే మివ్వమని కాదు. బ్రిటిష్ సామ్రాజ్యములో నున్నప్పుడు యీ కర్చులను భరింపవలసినదే. మా దేశస్థితికి తగినట్లుగ, మే మాకర్చులో మా వంతు ఖర్చును మేము భరించుట న్యాయముగాని, లేనిపోని కర్చుల నన్నిటిని మా నెత్తినేవేసిన యెడల మే మెట్లు భరింపగలము. మా వర్తకము, మా దేశపరిశ్రమలు, వృత్తులు, సమస్తము మన్ను కొట్టుకొనిపోయినందున దేశ మిదివరకే పేదపడియున్నది. ముప్పొద్దులను త్రాగుటకు గంజియైనను లేక ప్రజలు మలమల మాడిపోవుచున్నారు. క్షామదేవత దేశమునందంతటను తాండవమాడుచు జనులను పీల్చి పిప్పిచేసి, ఎందరినో తననోట వైచుకొనుచున్నది. ఇట్టి స్థితిలో లేనిపోని కర్చులను మా నెత్తిపైనవేసిన మే మెట్లు భరింపగలము? ప్రజల శరీరములలో నింక నేమైన రక్తమాంసాదులున్న యెడల నవికూడ కరగిపోవును గాని మరేమియును లేదు. ఇదివరకే రక్తమంతయు కారిపోయి, దేశము ప్రేతకళవహించి యున్నది. మమ్ముల నింక నిట్టికర్చులతో చంపవద్దని దాదాభాయి నౌరోజీగారు బ్రిటిష్ ప్రజలముందర మొరపెట్టుకొనిరి. కాని ప్రయోజన మేమి? ప్రస్తుత యుద్ధమునుగూర్చి విచారించుదము. ఈ యుద్ధమునకుగాను మనము మన ఖజానాలో నుండి మొట్టమొదట 150 కోట్ల రూపాయలను సీమకు పంపించితిమి. దీనిలో కొంత డబ్బును మన యిండియా గవర్నమెంటువారు ప్రజలవద్దనుండి ఋణముచేసి పంపించిరి మన గవర్నమెంటువారీడబ్బును తిరిగి ప్రజలకు తీర్చెదరు. కాని వీరికి తీర్చుటకు డబ్బెక్కడిది? ఇండియా గవర్నమెంటు వారికి డబ్బేవిధమున వచ్చును? సీమనుండి యేమైనా మూటలుగట్టి డబ్బును మన యిండియాకు పంపించెదరా? అట్లెంత మాత్రమునుకాదు. "ఇండియా గవర్నమెంటువారి డబ్బు" అనగ ప్రజలవద్ద నుండి వసూలుచేసిన రివిన్యూ పన్నులు, మొదలైనవేగాని మరి వేరేమియును లేదు. మన మిచ్చే రివిన్యూశిస్తులే గవర్నమెంటువారి డబ్బగుచున్నది. (యీ విషయ మందఱును బాగుగ గుర్తెఱుంగవలెను.) కనుక గవర్నమెంటువారు తిరిగి ప్రజలకు ఋణము తీర్చెదరనగ నేమియర్థము? మనమిచ్చు శిస్తు డబ్బులోనుండియే కొంత తీసి తిరిగి మనకిచ్చెదరు. మనకు ఋణము తీర్చెదరు. గవర్నమెంటు డబ్బనగ ప్రజల డబ్బేగద. అనగ మనడబ్బులోనుండి మనమే మన

ఋణమును తీర్చుకొనెదము. ప్రతిరాజ్యములోను ప్రతిదేశములోను ఉండు పద్ధతి యిదియే: దీనిలో నిచ్చట విశేషమేమియును లేదు. కనుక ప్రజలవద్దనుండి ఋణము తీసికొని సీమకు పంపించినను, మరియేవిధముగ పంపించినను మొత్తము యీ 150 కోట్ల రూపాయలును కేవలము ప్రజల సొమ్మే యనుటలో నేమియును సందేహము లేదు. మనము చేసిన యుద్ధ సహాయ మింతటితో ఆగలేదు.

యుద్ధములేని సాధారణదినములలో మన మీ సైన్యమునకై కర్చుపెట్టు మొత్తము సాలుకు 33 కోట్ల రూపాయలని చెప్పియుంటిని. యుద్ధమురాగానే, సైన్య మెక్కువ జేసినందున యీ కర్చు 40 కోట్లవరకును పెరిగినది. మొదట మనదేశము లోనీ సైన్యమునంతను నిలువయుంచినప్పుడు మన మేర్పరుచుకొన్న షరతేమనగా మనదేశములో నిలువయున్నంతకాలము ఈ సైన్యమున కగు సాధారణకర్చు లన్నియును అనగ జీతములు, ఫించనులు, దుస్తులు, తిండికర్చు, మొదలైన వన్నియును మన ఇండియా భరించేలాగునను, ఒకవేళ యుద్ధ మేదైనను తటస్థించి యీ సైన్యమును మన దేశపు పొలిమేరను దాటించి యితరదేశములకు దీసికొనిపోవలసిన యవుసరము తటస్థించిన యెడల దాని కగు సాధారణ కర్చులును, తదితర కర్చులును, ఇంగ్లండువారే భరించునట్లును యేర్పాటుచేసికొని యుంటిమి. కాని యీ యుద్ధము రాగనే యీ షరతును తీసివేసిరి.

మన సైన్యమును వారితరదేశములకు తీసికొనిపోయి యీ సైన్యముచేత నచ్చట వారు తమ పనులను నెరవేర్చుకొనుచున్నను, దాని కగు సాధారణకర్చు—అనగా జీతములు, పింఛనులు, తిండికర్చు, దుస్తుల కర్చు—నంతను మనమే భరింపవలె నని తేలుచున్నది. అనగ మనదేశములో మన ప్రజలను కాపాడుటకు సైన్యము లేక పోయినను దానికగు కర్చుమాత్రము తగ్గినది కాదు. చిన్నయుదాహరణ:—మనము మన సముద్రపు రేవులను, కోస్తాలను, కాపాడుకొనుటకై సాలుకు 75 లక్షల రూపాయలను నౌకాదళమునకై కర్చుపెట్టుచున్నాము. కాని యుద్ధపు మొదటి దినములలో నెచ్చటను యెూరు పేరులేని "ఎమ్డెన్" అను నొక శత్రు నావవచ్చి, మన సముద్రములన్నిటిని కలతపెట్టి అనేక యోడలనుముంచి, అనేక రేవుపట్టణము లకు నష్టము కలిగించి, ఎంతయో బాధగలిగించిన కొన్ని దినములకుగాని, మనకు ముక్తిరాలేదు. ఆకష్టదినములలో, ప్రజలు తమ యరచేతులలో ప్రాణములు పెట్టు కొని చెన్నపట్నములోనివా రందరును భయపడుచుండగ, గవర్నరుగారగు పెంట్లండు ప్రభువుగారు నీలగిరి కొండలెక్కి కూర్చొనిరి. ప్రజలు మొరలు పెట్టుకొనగ వారు దిగివచ్చి ప్రజల కభయహస్తమిచ్చి వెడలిపోయిరి. కనుక నేనిప్పుడు చెప్పున దేమనగ, వారు మనలను రక్షించుటలేదనికాదు; ఒకవేళ మనకేమైన కష్టము సంభ వించినను, మనలను సమయమునకు కాపాడుటకు సైన్యము లేకపోయినను, మన కర్చు మాత్రము మనకు తప్పదు ! భగవంతుని దయవలన మనకే జయము గలిగినది గాన, మన మిప్పు డెంతమాత్రమును భయపడ నక్కరలేదు.

ఈ 150 కోట్ల రూపాయ లిచ్చుట, మనదేశములో లేకపోయినను సైన్యపు సాధారణ కర్చులన్నిటిని మనమే భరించుట; యివిగాక ప్రజలందరును తమ శక్తి కొలది సుచితముగ దాన మొసంగుట, మొదలగు నీ యుద్ధ సహాయము గాక తిరిగి యింకను యుద్ధమునకు సహాయముచేయుటకై (యుద్ధము 1920 సం॥ మార్చివరకు సున్నట్టయిన) మొత్తము 67 కోట్ల రూపాయలను "ఎక్కువ యుద్ధలాభపుపన్ను" అను క్రొత్తపన్ను ద్వారా వసూలుచేసి మనమివ్వవలయునని ప్రభుత్వమువారు తీర్మానించిరి. యుద్ధమువచ్చిన తరువాత సైన్యము సంఖ్య నెక్కువచేసిరి; జీతము లెక్కువ చేసిరి, యీ 67 కోట్లను వీనిక్రిందను, యింక యితర కర్చుల క్రిందను కర్చు పెట్టుదురట.

## సింహావలోకనము

| | |
|---|---|
| మొదటివాగ్దత్తము:— | 150 కోట్లు |
| సైన్యపు సాధారణ కర్చులు సంవత్సరమునకు 42 కోట్ల చొ॥ 4 సం. | 168 కోట్లు |
| ఎక్కువ యుద్ధలాభపు పన్ను | 67 కోట్లు |
| మొత్తము | 385 కోట్లు. |

ఇవిగాక ఉచితముగ నిచ్చిన దానములకు మితియే లేదు. చూచితిరా! మన మెంతసహాయము చేసినామో! మనరాజభక్తిని వెల్లడించుట కింతకంటె ఎక్కువ నిదర్శన మేమి కావలెను. మనము సామ్రాజ్యమున కింతసహాయము చేసినాముసరే! మనకేమైన దీనికి తగినట్లు హక్కులేమైన గలవా? లేవనియే యిదివరకు చెప్పియుంటిమి. ఏమైనను కష్టనష్టములు భరింపవలసి వచ్చినప్పుడు "మనమందరమును ఒకటి; మన దంతయును ఒకటే సామ్రాజ్యము; హిందూదేశమునకు కూడ సమానభాగమే, సమాన బాధ్యతయే కలదు." అని నోరుదెరిచి ఆడంబరము చేసెదరు. కాని హక్కులు గాని, స్వాతంత్ర్యములుగాని, లాభములుగాని పంచుకొనవలసివచ్చినప్పుడు "అబ్బే! మీ చేతగాదు, మీ రింకను మాక్రింద కొన్నిదినము లుండవలెను. మీరింకను చిన్న పిల్లలు; మీకీ హక్కు లుండకూడదు. అమ్మో! మీరు కత్తిపుచ్చుకొన కూడదు. మీలో మీరు గొంతుకలు తెగకోసికొనెదరు" అని త్రోసివేసెదరు. హక్కులను స్వాతంత్ర్యములను పొందుటకు చేతకాదన్నప్పుడు, పాపము వీరు బీదలు, వీరివద్ద నుండి డబ్బుతీసికొనుట న్యాయము కాదు. వీరు డబ్బిచ్చుకొనలేరు, అని యేల యూరకొనకూడదు. ఇది మన చిన్నపిల్లలు చెప్పుకొను కథలాగున్నది. "నీవు శనగ పప్పు తీసికొనిరా, నేను ఊక తీసికొనివచ్చెదను, రెండునుకలిపి, ఊదుకొని తిందాము. శనగపప్పు నేను తింటాను, ఊక నీవుతిను." అన్నట్లుగనున్నది. మన మిప్పుడు యుద్ధములో చూపిన రాజభక్తికి మనకు వారిచ్చు పారితోషికమేమి? "రౌలతు చట్టములు, పంజాబువధలు" అనగ గవర్నమెంటువారికి ఎవనిమీదనైనను "వీడు

రాజద్రోహిగ కనుపడుచున్నాడు'' అని అనుమానము తోచినయెడల, వానిని వెంటనే జెయిలులో వేయుడమే. ప్లీడరుడేడు జ్యూరీ అసెస్సర్లులేరు, విచారణలేదు, సాక్ష్యము లేదు, అప్పీలులేదు! ఇట్టి యమానుషపు చట్టములు ప్రపంచములో నెచ్చటను, ఏరాజ్యములోను, యే కాలములోను లేవని ఆసేతు హిమాచల పర్యంతమును ఘోషించిరి. కాని యేమిలాభము, ప్రజలమొరలు అరణ్యరోదనములు. యుద్ధములో సహాయము చేసినందుకు మనకేదో "మెహర్బానీ'' చేస్తారని నోరుతెరచుకొని చూచు చుండగ మనకీ రౌలతుచట్టముల ననుగ్రహించిరి. మాకు వేరే మేలేమియు లేకపోయి నను బాగుగాని యీ క్రూర చట్టములు మాకువద్దు బాబో! అని ప్రజలందరును మొర పెట్టుకొనిరి. ''బిచ్చము పెట్టకపోతే పోయినావు గాని కుక్కను మాత్రము మీదికి ఉసుకలుపవద్దు!'' అన్నట్లుగ నున్నది.

ఇట్టి కర్చులను, యిట్టి విపరీత శాసనములను ఖండించి తగ్గించుటకై ప్రజలకు స్వాతంత్ర్య ముండిన బాగుండునుగదా! బ్రిటిషు సామ్రాజ్యములో నుండు అన్ని దేశ ముల వారికి నిట్టిహక్కులుండగా మనపాపమేల పండవలెను. వారితో సమానమైన హక్కులు గావలెననియే మనమిప్పుడు కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## వర్తకము

దేశమును పాలించు విషయములో మన కధికారములేదు సరిగదా, తుదకు మన యిష్టము వచ్చినట్లు వర్తకము చేసికొనుటకు కూడ మనకు స్వాతంత్ర్యము లేదు. పూర్వ మింగ్లీషు వారీ దేశములో నడుగిడుటకు పూర్వ మీదేశములో వర్తకమెంత యభివృద్ధిలో నున్నదియు, యీ కుంపిణీవారు వచ్చి యీ మన దేశీయ వర్తకము నేవిధముగ, బుద్ధిపూర్వకముగ, పాడుచేసి, అణగద్రొక్కినదియు, శ్రీయుత రమేశ చంద్ర దత్తుగారు వ్రాసిన గ్రంథములను చదివిచూచిన తెలియగలదు. నేనిప్పుడా వివరముల నన్నిటిని వ్రాయబూనిన నదియొక మహాభారతమగును. కుంపిణీ ప్రభుత్వము పోయి రాణీగారి పరిపాలన వచ్చినట్టయిన మనకీ యన్యాయము జరుగదని పూర్వము మనవారాశపడిరి. కాని మనయాశ లన్నియును నిరాశలయ్యెను. వర్తక విషయములోని యీయన్యాయ మట్టులనే నిలిచిపోయెను. తమ చేతులలో నుండు రాజ్యాధికార పదవిని యాధారము చేసికొని మనవర్తకము నిట్లు నొంపజూచుట యేటి న్యాయమో తెలియ రాకున్నది. వలస దేశములవారి కిట్టినిర్బంధము లేమియును లేవు. వారు తమ యిష్టము వచ్చినట్లే వర్తకము చేసికొనెదరు. వలస దేశముల వారికి నూటికి 15 రూపాయల చొ॥ లాభము వచ్చుచుండగ మన దేశమునకు 30, 40 సం॥ లలో 2, 3 వందల కోట్లరూపాయలేల నష్టము రావలెను. మనకు జరుగు యన్యాయ మేమియో, వలసదేశముల వారికి లేని యన్యాయమేమియో యీక్రింద వివరించెదను. కుంపిణీవారి రాజ్యకాలములో జరిగిన యన్యాయమును బట్టి మనదేశపు నేతపనులు, చేతిపనులు, శిల్పములు, పరదేశముల కీదేశమునుండి యెగుమతులు మొదలగునవన్ని

యును అడుగంటినవి. వర్తకము నశించినది. జనులు దారిద్ర్యమున మునిగిపోయిరి. హిందూదేశపు రవశెల్లాలు, పట్టుబట్టలు, రత్నకంబళ్లు, చిత్తరువులు, పోతపనులు, సమస్త యైశ్వర్యములును కలలో కనుపడిన ధనరాసులవలె మాయమయ్యెను. ప్రపంచములో నుండు సమస్తదేశములకు కావలసిన సమస్తవస్తు సామాగ్రిని సప్లయిచేయుచు తనూల్మలమున విశేషధనము నార్జింపుచుండిన మనదేశ మిప్పుడు, మనకు కావలసిన ప్రతి వస్తువునకును విదేశములవంక నోరుతెరచికొని నిరీక్షింపుచుండ వలసివచ్చెను. స్వీడను జపాను దేశములు నిప్పుపెట్టెలను పంపిన మనయింటిలో ప్రోయి రాజేసికొనవలెను, లేదా అన్నము వండుకొనుట మానుకొని యుపవాస ముండవలెను. పద్దు వ్రాసికొనుటకు కాగితపుముక్క కావలెనన్నజర్మనుదేశము పంపించవలెను. స్వీడను దేశము గొల్లభామనూరుక్క డబ్బాలను పంపిననే గాని పసిపిల్లలకు పాలులేవు. మనదేశ మిట్టి దౌర్భాగ్యస్థితికి వచ్చినది. పరదేశములలో యంత్రసహాయముచే చేయబడు సమస్త విదేశవస్తువులును మన దేశములోనికిగుమతియగుచున్నవి, విదేశ వస్తువులు మన దేశమును ముంచివేసినవి. మనవర్తకము చచ్చినది. మనము దరిద్రులమైతిమి, పరదేశస్థులు భాగ్యవంతులైరి. దీనికి గతియేమి? ప్రజలు బాగుపడవలెనన్న, యీవిదేశవస్తు ప్రవాహమున కడ్డుకట్టవైచి (అనగా అవి మనదేశములోనికి దిగుమతి కాకుండుటకై వానిమీద దిగుమతి పన్నులను వైచి), మన ప్రజలకు గవర్నమెంటువారు తగు ప్రోత్సాహమును కలుగచేసి, వర్తకమును పెంపొందించి, మనదేశ ప్రజల నధోగతిపాలు కాకుండ నిలువబెట్టవలెను. మనవర్తకము నశింపకుండ రక్షింపుకొన వలెననిన, మన మీవిదేశవస్తు దిగుమతులమీద గాఢమైనపన్నులను వేయవలెను. వీనికే "రక్షణపన్నులు" అనిపేరు. విదేశవస్తు దిగుమతులమీద నిట్టిరక్షణ పన్నులనువైచి పేదవడియున్న స్వదేశవర్తకమును కాపాడుట ప్రభుత్వమువారి ధర్మమైయున్నది. వలసదేశముల వారిట్టి పన్నులను వేసి తమ స్వదేశ వర్తకమును కాపాడు కొనుచున్నారు. అనగా సీమలో తయారైన సీమ సరకులను తమదేశములోనికి రాకుండ వారు గాఢమైన పన్నులను వేసెదరు. కాని మనమట్లు చేయుటలేదు సీమసరకులు నిరభ్యంతరముగ మన దేశములోనికి రావచ్చును. వలసదేశములవారు చేసినట్లుగ, మనముకూడ నేలజేయ కూడదు? మనమట్లు చేయలేకపోవుటకు కారణమేమి? కారణము తెలిసియేయున్నది. అట్టిపన్నులను వేయుటకు ప్రజలకు స్వాతంత్ర్యమేది? ప్రజ లెన్ని మొరలను పెట్టుకొనినను వినువారెవరు? "అమ్మో! సీమసరుకుల మీద పన్ను వెయ్యడమే! సీమలో నున్న మాంఛెస్టరు, లంకషైరు ఫ్యాక్టరీల కధినాధులగు వణిగ్రాజుల కాగ్రహము రాదా? వారు కుబేరులు. వారలిగిన నీ మంత్రులును, వైస్రాయిలును, పార్లమెంటు మెంబర్లును, నే మూలనో నొదిగి యుండవలసినదే. ఇక మనదేశ ప్రజలగతియేమి? మనను పాలించునది లంకషైరు, మాంఛెస్టరు వణిక్శిఖామణులేగాని, జార్జిరాజేంద్రుడు కాడా యను శంక వొడముచున్నది. మనవారు చాలకాలము మొరలు పెట్టుకొనగ సీమయుద్ధమొకప్పుడు మనగవర్నమెంటువారికి ధనముకావలసివచ్చి, సీమసరుకుల దిగుమతిమీద లేలికపన్ను నొకదానిని విధించిరి. ఈమాట వినగనే మాంఛెస్టరు, లంక

షైరు వర్తకుల కమిత యాగ్రహము వచ్చినది. వెంటనే వారేమిచేసిరి? ''మీకు డబ్బు కావలసి వచ్చినందున మాసరుకులమీద పన్ను వేసినారు గనుక, మీ దేశములో నేయబడు బట్టలమీదకూడ పన్ను వేసికొనవలసినది. అట్లయిన మీదేశపు సరుకులును మాదేశపు సరుకులును సమానముగనే నష్టమును భరింపును'' అని యాజ్ఞాపించిరి. వెంటనే మనదేశపు బట్టలమీదకూడ పన్ను వేసిరి. అనగా విదేశవస్తువులమీద పన్ను వేసినా రను సంతోషము మనకు లేదు. ఏలననగ మనదేశపు బట్టలమీదకూడ పన్ను వేసినప్పుడు మనకు వచ్చులాభ మేది? కనుక యిప్పుడున్నస్థితియేమి? మనదేశము లోనికి విదేశవస్తువులు రాకుండ నాపుటకై విదేశవస్తు దిగుమతులమీద రక్షణపన్ను లేకపోగా, మనదేశములోనే నేసికొని మనదేశములోనే ఈ బట్టలను వాడుకొందమన్నను, వానిమీద సైతము మనము పన్ను చెల్లింపవలసివచ్చెను! ఇట్టి కష్టము లేమియును వలసదేశముల వారికిలేవు. సీమసరుకులు వలసదేశములలోనికి నిరభ్యంతరముగ పోవుటకు వీలులేదు; మన హిందూదేశములోనికి రావచ్చును. యీభేదమేల?

## ఎగుమతులు

హిందూదేశములో విశేషముగ ప్రత్తి, జనపనార మొదలగునవి పండును. సీమలో పండవు. కనుక సీమలోఫ్యాక్టరీలభివృద్ధి జెందుటకై యీవస్తువులన్నియును వారికి కావలెను. ఈ సరుకులన్నియు హిందూదేశమునుండి యెగుమతి కావలెను. ఈయెగుమతులమీద పన్నులు వేసినయెడల సీమవర్తకులకు నష్టము వచ్చును. కాని మనదేశస్థులకు లాభమువచ్చును. ఏలనన, మనదేశములో పండిన ప్రత్తి మన దేశములోనే యుండును; మన ఫ్యాక్టరీలకు కావలసినంత ప్రత్తి దొరకును. మన వర్తక మభివృద్ధి నొందును. అదిగాక యీ పన్ను ద్వారా మనకు కావలసినంత ధనము రాగలదు. కాని యీపన్నును వేయగలవారెవరు? మన దేశమునుండి ప్రత్తి, జనపనార మొదలగునవి ఎగుమతికాని యెడల, సీమలోని ఫ్యాక్టరీలన్నియు దీర్ఘ నిద్రపోవలసినదే! కనుక యీపన్నును వేసినయెడల సీమవర్తకులు సమ్మతింపరు. అట్లు వేయుటకు మన ప్రజలకు స్వాతంత్ర్యమును లేదు. దీనికంటె విశేషమగు చిత్రమొకటి కలదు. మనదేశము నుండి ప్రత్తి, నార, మొదలగునవి సీమ ఫ్యాక్టరీల కొరకు యెగుమతి కావచ్చును. గాని, మన దేశములో యంత్రములమీద తయారైన బట్టలు గాని, జనుపనార సంచులుగాని, ఎగుమతి చేయకూడదు. మన ముతక జనుపనారను సీమకుపంపించి యీ నారతో అచ్చట యంత్రములమీద నేయబడిన సంచులను మనము తెప్పించుకొనుటకంటె, మన జనపనారను మనదేశములోనే యుంచుకొని, మనదేశములోనే మన యంత్రముల మీదనే నేసికొని, మనమే వానిని వాడుకొనిగాని, లేక యితర దేశముల కెగుమతి గాని చేసిన యెడల మనకెక్కువ లాభముండును గద. ఇట్లు చేయుట సీమవర్తకులకు గిట్టదు. మనమే నేసినబట్టను సంచులను యెగుమతి చేయ మొదలిడిన వారికి నష్టము వచ్చును. కనుక మనమీ నేతసంచులను బట్టలను యెగుమతి

చేసిన యెడల వారు సమ్మతింపరు. అందువలన యీ యెగుమతులమీద పన్నులను వేసిరి. సీమసరుకుల దిగుమతులకు పన్నులేదు. మనదేశపు సరకుల ఎగుమతికి పన్నులు కలవు. ఆహా! యేటిన్యాయము! ఇట్టిస్థితిలో మన మేమియును చేయలేక పోవుచున్నాము. సీమలో వర్తకులు చెప్పినట్లు మనము తలయొగ్గి కష్ట నష్టములకోర్చి పడియుండవలసినదే కాని మన వర్తకవిషయములో మన యిష్టమువచ్చినట్లు చేసికొనుటకు వీలులేదు. మన కీస్వాతంత్ర్యములేదు. వలసదేశముల వారికి గలదు. ఈవిషయములో వలసదేశముల వారికున్న స్వాతంత్ర్యమే మాకుకూడ నుండవలయునని కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## వృత్తులు, పరిశ్రమలు, చేతిపనులు, శిల్పములు

ఏదేశములోని ప్రజలైనను సుఖజీవనముచేయుటకై యనేక వ్యాపారములుండవలెను. ప్రజలకందరికిని వారి వారికి తగినట్లు వ్యాపారము లుండవలెను. ఇట్టి వ్యాపారములను, ఇట్టి వృత్తులను ప్రభుత్వమువారు కల్పించి, ప్రజలజీవనమునకు త్రోవజూపవలెను. పూర్వము మనదేశములో ననేకవృత్తు లుండెడివి. ప్రజలందరు ననేక విధములైన వ్యాపారములలో సంచరింపుటకు వీలుండెడిది. ఎవనివృత్తిని వాడు చేసికొనుచుండెను. మొట్టమొదట సంఘోపయోగార్థమయియే యీ చాతుర్వర్ణ విభజనము వచ్చినదని మనము సులభముగ గ్రహింపనగును. పిమ్మట రాను రాను యీ విభజన మతి కఠినమై, దానివలన కొన్ని చిక్కులు తటస్థించినను కొంతవరకీ విభజన ముపయోగకారి యనియే చెప్పవలెను. కాని యిప్పుడన్ననో, యీ ఇంగ్లీషు వారి ప్రభుత్వము వచ్చిన పిమ్మట వృత్తులన్నియును నశించినవి. సాలీలకు సాలెవృత్తి నశించినది. విదేశవస్తు ప్రవాహము ముందు మనసాలీలు తాళలేక పోయిరి; ఇట్టి సమయములో నేను పైన జెప్పిన విధముగ, ప్రభుత్వమువారే మనదేశపు సాలీలకు తగిన ప్రోత్సాహము నొసంగి మన యీ నేతవృత్తిని కాపాడవలసిన ధర్మము ప్రభుత్వమువారిదై యున్నది. కాని వారి యింగ్లీషు వర్తకాభివృద్ధికి భంగము కలుగునను కారణముచేత, మనవృత్తి నశించి పోవుచుండినను ప్రభుత్వమువారు చూచి యూరకుండిరి. ఇట్టి కష్టసమయములో తగిన రాజపోషణలేని యెడల నా వృత్తినశింపదా? దీనికి కారణము కేవలము ప్రభుత్వమువారే. ఇదేవిధముగ, నీలిమందు వర్తకము అద్దకపువృత్తి, ముచ్చివృత్తి, రాతిచెక్కడపు పనులు, శిల్పములు, ఇనుపఫిరంగులు మొదలగువానిని తయారు జేయువ్యాపారములు సమస్తవ్యాపారములు నశించినవి. మనకు కావలసిన వస్తువు లన్నియును విదేశములనుండి దిగుమతి యగుచున్నవి. మనమో క్రమక్రమముగ ననాథలమగుచున్నాము. మనకిప్పు డేపనిచేయుటకును చేతకాదు. పరదేశ రాజులచేతను రాణులచేతను ధరింపబడిన మనదేశపు రవశల్లాలు, పట్టుబట్టలు, రత్నకంబళ్ళు కత్తులు డాళ్ళు మొదలగునవన్నియును మూలబడినవి. సన్నబట్ట నేయుట యనసేమియో మనకు మహావింతగ కనుబడుచున్నది. మనమిప్పుడొక కత్తిని చేయగలమా యను సందేహముతోచు చున్నది. కొన్నిదినములు

పోయిన తరువాత మనము మనుష్యులమే నాయను సందేహము కూడ తోచిన తోచవచ్చును. దీనికి కారణ మేమి? ప్రభుత్వమువారి నిరాదరణ భావమే యని తెలుచున్నది. సాలెవాని వృత్తిఅయిపోయినది. మంగలివాని వృత్తిపోయినది. కమ్మరివాని వృత్తి పోయినది. కమ్మరి, వడ్రంగుల వృత్తులు పోయినవి. తుదకు చెప్పులు కట్టుకొను మాదిగవాని వృత్తికూడ పోయినది, సీమనుండి బూట్సులు వచ్చుచుండగ మాదిగవాని చెప్పులేల? ఈవృత్తులన్నియు నశించినయెడల నిక ప్రజలు జీవించుటెట్లు? వారికి మార్గమేది? ఏదో విధముగ జీవనము జరుగవలెనుగద! ఇదెట్లు జరుగును ఏ వ్యాపారము ఏవృత్తిలేనిది జనులు బ్రతుకుటెట్లు? నిర్వ్యాపారముగ నుండుట కాపురుష గుణము గద. పోనీ యీవృత్తులు నశించినను, మరియొక మార్గమేదియో ప్రజలకు జూపవలెను గద. ప్రజలు బ్రతుకుటకు ప్రభుత్వమువారే మార్గమును కల్పించిరి? వీరికి దరియేమి? మనదేశములోనుండు ముప్పదికోట్ల ప్రజలును బ్రతుకుట కేమి మార్గమును జూపిరి! మన గవర్నమెంటువారొకటే మార్గమును జూపిరి. అదేమి? గవర్నమెంటు నౌకరీ! కలెక్టరాఫీసులో గుమస్తాపని! ఆహాహా! 30 కోట్లమంది కెన్ని గుమాస్తా పనులిచ్చెదరు? ఇది కేవల మసంభవము. అందులకయియే ప్రతివాడును తమ తమ వృత్తులు నశించినందున కలెక్టరాఫీసు గుమస్తాపనికై యెదురు చూచుచున్నాడు. ఈ గవర్నమెంటు నేర్పించు చదువులన్నియును కూడ నిందులకయియే యేర్పడినవి. మనకు నిజమైన జ్ఞానము రావలెననిగాని, నిజమైన విద్య రావలయుననిగాని తలంచువారీ చదువులను చదివిన నావంతయు ప్రయోజనము లేదు. గవర్నమెంటు నౌకరీలకే యీ చదువు పనికివచ్చును గాని మరిదేనికిని పనికిరాదు. 30 కోట్ల మందికి గవర్నమెంటు నౌకరీ లెక్కడ దొరకును! అందువలననే ప్రజలలో, ప్రజలకు పోటీవచ్చినది. "మాకు నౌకరీ కావలెను" "మాకు నౌకరీ కావలెన"ని ప్రజలందరును యెగబడిరి. "మీకు యెక్కువ నౌకరీలు దొరికినవి, మాకు దొరకలేదు" అని ప్రజలలో నౌకరిని జూచిన నౌకరి కసూయ, ద్వేషము ప్రబలినవి. ఇదివరకు చక్కగ యేపారుపులు లేకుండ జీవింపుచున్న ప్రజలలో నిట్టిద్వేషములు, భేదములు పుట్టుటకిదియే కారణము. ప్రభుత్వమువారీ వృత్తులను కాపాడని కారణముచేత ప్రజల కీ కష్టము కలిగినది. ఈ విభేదమునకు కారణము కేవలము గవర్నమెంటువారి చర్యయే యని నిర్భయముగ చెప్పవచ్చును. కాన మనవారందరును యీ విషయమును బాగుగ గ్రహించి, తమలో తాము పోరాడుకొనక, అందరును కలిసి మనకు కావలసిన యీ హక్కులను, యీ స్వాతంత్ర్యములను గవర్నమెంటువారి వద్దనుండి మన ప్రజలచేతులలోనికే తీసికొనుటకై గట్టిగ ప్రయత్నింపవలెను అట్లయిన యెడల, దేశాభ్యుదయమున కత్యంతావశ్యకములైన యీ వృత్తులను, యీ చేతి పనులను, యీ సమస్తమైన పరిశ్రమలను మనము చక్కగ కాపాడుకొని, మన ప్రజలను బ్రతికించుకొనవచ్చును. ఈ పరిశ్రమలును, యీ వృత్తులును మంచి యభివృద్ధిలో నుండిన యెడల, ప్రజలలో నిట్టి ద్వేషములు పుట్టుటకు కారణము కన్పింపదు. ఎన్నియోవేల సంవత్సరములనుండియు యే పోరాటములులేని మన సంఘ మిప్పుడు చీలిపోవుటకు కారణమేమి? వారి వారి వృత్తులు

నశించి, అందరును ఒకే వృత్తికై యఱ్ఱులు చాచుటచేతనే గదా! మార్గము విశాలముగ నుండి యెవరిత్రోవను వారు పోవుచుండిన యెడల ఏ చిక్కులును రావు; కాని జనులందరును ఒక సన్నని ఇరుకు ద్వారముగుండ పోవలయుననిన, ఒకరి నొకరు త్రోసికొని, తలలు పగులగొట్టుకొందురు గద. మన సంఘస్థితియు నట్లే యున్నది. కనుక సమస్తవృత్తులను, సమస్తకళలను, పరిశ్రమలను, పూర్వమువలె యభివృద్ధి నొందించిన యెడల యెవరిమార్గమున వారే పోవుచుందురు. చిక్కులుండవు. దీని విషయమై మనము త్వరపడవలెను. లేనియెడల ద్వేషములు ముదిరి, వానిని తిరిగి పాటునకు దెచ్చుటకు చాలకాలము పట్టును. ఒక చిన్న యుదాహరణ:- ప్రభుత్వము వారు నేతవృత్తిని పోషించి దానికి తగిన ధనము నిచ్చి, ప్రోత్సాహపరచి దానికి తగిన విద్యను నేర్పింప మొదలిడినయెడల, పూర్వమెన్నితరముల నుండియో యావృత్తి నవలంబించుచున్న సాలీలందరును ఆవిద్య నభ్యసించి దానిలో నుత్తీర్ణులగుదురు. అట్లే సమస్తకళలను పోషించినయెడల, పూర్వమునుండియు అనుక్రమముగ తామే వృత్తుల నవలంబించు చుండిరో, వారాయావృత్తులలోనే ప్రవేశించి తాము తరించి, సంఘమును తరింపజేసి, తన్మూలమున దేశమునంతను తరింపజేయగలరు. గవర్నమెంటువారు నేతపనులను పోషించి, ఆవిద్య నభ్యసించినవారికి మిక్కిలి ప్రోత్సాహము కలుగజేయుచున్నారని వినగనే, సాలీలందరును ఆక్షణమున, ఆవృత్తి నవలంబించుటకై పరుగెత్తరా? అట్లే ఆ యావృత్తులవారా రా యాపనులకై పాటుపడెదరు. సాలీలందరును సాలివృత్తినే యవలంబించి తీరవలయునను కఠినశాసనమేమియు నుండ నక్కరలేదు. నే జెప్పున దేమనగ, సాలీవృత్తిని ప్రభుత్వమువారు పోషించి, దానిలో తగిన లాభము వచ్చునట్లు వీలుకలుగజేసినయెడల, నిర్బంధమేమియు లేకుండగనే, మనదేశములోని సాలీలందరును ఆవృత్తి నవలంబించుటకై బహుసంతోషముగా పరుగెత్తెదరు, కాని యిప్పు డావృత్తిలో నేమియు లాభము కనబడనందున, సాలీలందరునుకూడ నే యింగ్లీషు ముక్కలనో చదువుకొని యే తాలూకా కచ్చేరిలోనే ఉద్యోగమేమైన దొరకునేమోయని, స్కూల్ ఫైనల్ పంచాంగపు కట్టలుపుచ్చుకొని తిరుగవలసి వచ్చుచున్నది. సాలెవృత్తి లాభముగనుండినయెడల వా డాసాలెవృత్తిలోనే యుండెడివాడు. అట్లే సమవృత్తుల నెరుంగునది. వీని నన్నిటిని యాలోచించి చూచి మనకళలను, మన వృత్తులను, మన పరిశ్రమలను, వలసదేశమువారు కాపాడు కొనుచుండిన విధమున కాపాడి, ప్రోత్సాహము కలుగజేయవలయునని కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## వలసదేశములలో భారతీయుల యిక్కట్టులు

1858 సంవత్సరములో విక్టోరియా రాణీగారు మనకు చక్రవర్తినియైన కాలమున, నొక పెద్దప్రకటన గావించిరి. దానిలోని ముఖ్యాంశ మేమనగ:— "ప్రపంచములో నెచ్చటెచ్చట మా బ్రిటిష్‌పాలన క్రింద ప్రజలు నివసింపుచుండిరో, వారంద

రును మాకు సమానులే; ఒకరియెక్కువ లేదు, ఒకరి తక్కువలేదు. అందరును బ్రిటిష్ సామ్రాజ్యపు ప్రజలే. ఆ విధముగనే భారతీయులు, (అనగా హిందూదేశ ప్రజలు) అందరితోపాటు బ్రిటిష్ సామ్రాజ్యపు ప్రజలే" యను మిక్కిలి తియ్యని మాటలను చెప్పిరి. ఈ మాటలనే తిరిగి ఎడ్వర్డు చక్రవర్తిగారును, జార్జిచక్రవర్తిగారును తమ తమ పట్టాభిషేకకాలమున, సప్రమాణముగ దేవుని యెదుట, వాగ్దానము చేసి యున్నారు. ఇంతవరకును బాగుగనే యున్నది. చెప్పినమాటలు బహుశ్రవణానంద ముగ తియ్యగ తేనెలొలుకుచున్నవి. కాని జరుగుచున్న పని మాత్రము వేరుగ నున్నది. మన దేశస్థులు వలసదేశములకు, (వారి యుత్తరువులేనిది) పోకూడదు. మనము వెళ్ళి ఆస్ట్రేలియా దేశములో అడుగు పెట్టుటకు వీలులేదు. కనడా దేశములో కాలు పెట్టుటకు వీలులేదు. న్యూజీలండు దేశములో నిలుచుండుటకు వీలులేదు. ఈ దేశము లన్నియును మన దేశమువలెనే యింగ్లీషు వారికి లోబడియే యున్నవి. కాని మన మక్కడికి పోవుటకు వీలులేదు. కాని ఆదేశములవా రిచ్చటికి వచ్చి తమ యిచ్చవచ్చినట్లు స్వేచ్ఛగ విహరింప వచ్చును. మనము వారిదేశములకు పోగూడదట. గాని వారుమాత్రము మన దేశములోనికి రావచ్చునట. ఇది యేనాటి పాపమో యెరుగరాకున్నది. ఇంకొక చిత్రము: వారి కేపనికైనను అవసరము వచ్చినప్పుడు మన దేశమునుండి, తక్కువ కూలికి, కూలీలను మాత్రము తీసికొని పోయెదరు. దక్షిణాఫ్రికాలో వారికి తేయాకు తోటలలోను, బొగ్గుగనులలోను, అచ్చటి తెల్లదొరలకు పనిచేయుటకై కూలీలు కావలసి వచ్చిరి. వారు మన వైస్రాయిగారికి "మీదేశము నుండి మాకు 5 సంవత్సరముల కంట్రాక్టు పద్ధతిమీద, కూలీలను పంపించవలసిన"దని యడిగిరి. దానికి మన వైస్రాయిగారు సమ్మతించిరి. ఇచ్చటనుండి కూలీలను నేటాలు ట్రాన్స్వాలు మొదలగు ప్రదేశములకు పంపించిరి. ఒకొక్క కూలి 5 సంవత్సరములు పనిచేయవలెను. పిమ్మట ఇష్టమైన తిరిగి యింటికి రావచ్చును. వారికేదియో కొంత కూలినిచ్చెదరు. ఇది కంట్రాక్టుపద్ధతి. ఈవిధముగ మనదేశమునుండి వెళ్ళిన కూలీలను ఆ దేశమువారు బహుకష్టములపాలు చేసిరి. ఆకష్టములు చెప్పిన తీరవు, కంట్రాక్టుప్రకారము 5 సంవత్సరములైన పిమ్మట కొందరు మనవా రచ్చట భూములను కొనుక్కొని యిల్లుకట్టుకొని, కొంచెము కొంచెముగ వర్తకము ప్రారంభించి, మంచిదశలో నుండ జొచ్చిరి. వీరిట్లు బాగుపడుట జూచి యచ్చటివారికి కళ్లుకుట్టినవి. వెంటనే మనవారిని బాధింప మొదలిడిరి. కఠినశాసనములను కల్పించిరి. మనవారెవరును పట్టణములో నివసింపగూడదు. ఊరిబయట మాలపల్లెవలె గుడిసెలు వేసికొని యుండవలసినదే. మనవారు మొదటితరగతి రైలుబండ్లలో నెక్కకూడదు. వీధులవెంట గుర్రపుబండిగాని, బైసికిలు గాని యెక్కి వెళ్ళకూడదు. ఒకసారి గాంధివంటి మహాత్మునకే యిట్టియవమానములు జరిగినవి. వీరందరును సంవత్సరమునకు 5 పౌనులు తలపన్ను ఇవ్వవలెను. వీరందరును తమపేళ్ళ నొకగుమాస్తావద్ద నమోదుచేయించుకొనవలెను. గవర్నమెంటువారి యొక్క ఉత్తరువు లేనిది యొకయూరినుండి మరియొకయూరికి వెళ్లకూడదు. ఇట్టి యవమానపు చట్ట

ములనెన్నియో కల్పించి మనవారిని బాధింపజొచ్చిరి. మనవారు గనులలోను తోటలలోను పనిచేయుచున్నప్పుడచ్చటి యజమానుల కేమైన యాగ్రహము వచ్చినయెడల మనవారిని వారు కొరడాలతో గొడ్డులను బాదినట్లు బాది, బూట్సుకాళ్ళతో తన్ని యవమానపరచి, నానా చిత్రక్షోభ గావింపుచుండిరి. మన హిందూదేశస్థు లనిన వారు కడునీచముగ జూచుచుండిరి. ఎంతగొప్ప చదువు చదువుకొనిన వాడైనను భాగ్యవంతుడైనను గౌరవమైన కుటుంబములోని వాడైనను, జమీందారుడైనను, మహారాజైనను, మనమందరమును కూలీలనియే వారియూహ. హిందూదేశస్థుడనగ "కూలీ" యని వారియర్థము. మనల నిట్లవమాన పరచుచుండగ జూచి సీమలోని యాంగ్లప్రభువు లేమియును చేయలేక యూరకుండిరి? పిమ్మట కొంతకాలమునకు మన మహాత్మ గాంధిగారచ్చటికి బోయి కూలీలను పనిచేయవద్దని సమ్మెకట్టు కట్టి, సత్యాగ్రహ వ్రతమును బూని, తానే యనేక కష్టములకు స్వయముగ లోనయి, అచ్చటి ప్రభుత్వమువారితో హోరాహోరి పోరాడి కొంతవరకు మనదేశపు గౌరవమును నిలువబెట్టెను. పూర్వపు కష్టములలో చాలభాగము తొలగిపోయినవి. కాని మన దేశమువారిని చూచిన వారింకను ద్వేషభావముతోడనే వర్తింపుచున్నారు. మనల నింకను నీచముగనే జూచుచున్నారు. "హిందూదేశస్థులు కూడ బ్రిటిష ప్రజలే. మనకున్న హక్కులే వారికిని గలవు. వారును మనతోటివారే. వారికిని మనకునేమియు భేదములే"దను జ్ఞానము వారికింకను కలుగలేదు. మనలను వారిదేశములో కాలుపెట్టనీయకుండ జేసి, అథవా ఒకవేళ రానిచ్చినను మనలను మర్యాదచేయకుండ, నీచముగ జూచుచున్నప్పుడు, మనము మాత్ర మేల వారిని ఆవలస దేశస్థులను, మనదేశములో నడుగుపెట్ట నీయవలెను? వారి నేల మనము గౌరవముగ జూడవలెను! ఇట్లు చేయుటకు ప్రజలకధికార మేది? ప్రజలకు స్వాతంత్ర్య మేది? ఇట్టి యన్యాయమును సీమలోని మంత్రులును జార్జి రాజేంద్రుడును చూచుచు నేల యూరకుండవలెను? వలస దేశముల వారికున్న స్వాతంత్ర్యములును, హక్కులును మన ప్రజలకు లేక పోవుటచేతనే గద మనకీదురవస్థ పట్టినది, కనుక మన మిప్పుడు కోరునదీ స్వాతంత్ర్యమే. ఇదియే స్వరాజ్యము.

## ఆయుధశాసనము; ముద్రణాశాసనము

నేను పైన సూచించిన విధముగ, 1858 వ సంవత్సరపు రాణీగారి ప్రకటన ప్రకారము, బ్రిటిష్ సామ్రాజ్యములోని ప్రజల కందరకును సమానమైన హక్కులుండవలయును గద. కత్తిపట్టుకొనుట ప్రతిమనుష్యున కుండవలసిన సహజమైన హక్కు. ప్రపంచములోనుండు ప్రతిమానవ జాతికిని ఈ హక్కు గలదు. కాని మన పాపమే పండినది మన కీ హక్కు లేదు. మనము కత్తిపుచ్చుకొనకూడదు. వలసదేశములలోని ప్రజలు కత్తిపుచ్చుకొనవచ్చును. ఈ యన్యాయ మేల? ఈ చిన్న హక్కు మనకు లేనందువలన మనదేశము నిర్వీర్యమాయెను; ప్రజలలో శౌర్యపరాక్రమములడుగంటినవి. యుద్ధకాంక్ష పోయినది. యుద్ధము పేరు చెప్పగనే మనకు భయమగు

చున్నది. ఫిరంగిని చూపగనే మన మెన్నివేలమంది యున్నను పారిపోవలసి వచ్చుచున్నది. అందువలన ప్రపంచములో మన పేరుమాసి పోయినది. హిందూదేశస్థులకు దేహబలములేదు. వారు కత్తిగట్టి యుద్ధము చేయలేరు. ఫిరంగిని చూడగనే యందరును పారిపోదురు అను నపకీర్తి మనకు వాటిల్లినది. మనకు యుద్ధము చేయుట చేతగాదని మనలను నిందించుచున్నారు! ఆహాహా! కత్తి పట్టకూడదని శాసించి, యుద్ధము చేయుట చేతగాదని మనలను పైగా నిందించుటయా? కత్తియే పట్టవద్దన్నప్పుడు యుద్ధముచేయుట కెట్లుచేతగును. పిల్లవానిని నీటిలోనికి దిగవద్దని యాపివేసి, వాడు పెరిగి పెద్దవాడైన పిమ్మట, 'ఛీ! నీకు యీత చేతగాదు. నీ వెందుకు పనికిరావు; నేను చూడు యెట్లు యీతగొట్టుచున్నానో'' యని ప్రగల్భములు కొట్టిన నేమి ప్రయోజనము? ముందు మాకన్యాయముచేసి, పైగా నిందించుటయా! ఈ యాయుధ శాసనమువలన దేశమంతయు పాడైనది. ఇక నీ శాసనమును మన మొకదినమైనను భరింప నేరము. పోనీ యీ కత్తి పట్టకూడదను నిర్బంధము అందరికినుండిన నొక విధముగ బాగుండును. కాని తెల్లదొరల కీ నిర్బంధము లేదు. వారు కత్తి పట్టవచ్చును; తుపాకులను పట్టవచ్చును. ఆ కారణముచేత మనలోని వానికిని తెల్లవానికి నేమైన పోరాటము వచ్చినప్పుడు మనచేతిలో నాయుధము లేనికారణమున మనము తెల్లవానిని చూచి భయపడవలసివచ్చుచున్నది. మరియు, తనచేతిలో నాయుధము కలదు గదా యను నహంభావముచే నా తెల్లవాడు మన ప్రజలను లక్ష్యముచేయక మన ప్రజలను హానిచేయుచు, నెంతగౌరవము గల వారినైనను అవమానపరుప జూచును. ఈ కారణముచే మనకు ప్రాణహాని జరుగుటయే గాక, మన భారతదేశగౌరవమునకు కూడ కళంకమువచ్చుచున్నది. ఇట్టి యమానుషపు చట్టమును మనమేల సహింపవలెను? మన కేదైనహాని జరిగిన యెడల కోర్టులో వ్యాజ్యము వేసికొనవలెను. ఇట్టి కోర్టులలో నిట్టికేసులలో న్యాయము జరుగుట దుస్తరము. ఏలననగ, ముద్దాయి తెల్లవాడగుటచేత మనవాళ్ల మేజస్ట్రీటులు, విచారించుటకు వీలులేదు. ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు సెషన్సు జడ్జీ మొదలగు హోదాగల వారే విచారించవలెనట ఈ భేద మెందులకో? ఇట్టిచో మనకు న్యాయము దొరకుట దుస్తరము. అనేక వ్యయప్రయాసలకులోను గావలసి వచ్చును. ముద్దాయి తెల్లవాడైన కారణమున వాని కనేకసౌకర్యము లున్నవి. తెల్లవాడొకమనిషిని కాల్చి నందుకై వానికొక కేసులో రు 75 లు జరిమానా వేసి వదలి పెట్టిరి! ఇదియే శిక్షయైన యెడల వాడెంతమందినైన నిర్భయముగ కాల్చుటకు వెనుదీయడు. ఈదిక్కుమాలిన శాసనము వలన మన కెంతహాని, యెంత అగౌరవము జరుగుచున్నదో చూచితిరా! మన భారతవర్షము యొక్క ధనమాన ప్రాణాదులను గాపాడుకొన దలచిన యెడల నిక నీ శాసనమును మన మొక దినమైనను భరింపజాలము. ఇక నీ శాసన మెంతకాలముండునో అంతకాలమును మనము దినక్రమమున బలహీనులమగు చున్నామని గ్రహించునది. మన శక్తు లన్నియు నుడుగు చున్నవి. ప్రజలకు ప్రభుత్వమువారు యుద్ధశిక్షయందు ప్రోత్సాహము కలిగింపక పోగా నిట్టి దౌర్భాగ్యపు శాసనమును కూడ పెట్టినయెడల

మనలో యోధవీరు లెట్లుద్భవింప గలరు? మనలో పూర్వము ప్రాణములమీద నాసనుకూడ వదలి, రణరంగముల నిలిచి హోరాహోరిని పోరాడి, శత్రుజన భయంకరముగ ఘోరసంగ్రామ మొనర్చిన నాటి వీరు లిప్పుడేమైరి? అట్టి వీరులు నేడేల లేక పోయిరి? ఆవీర్య మేమాయె? ఆతేజ మేమాయె? ఆభారతవీరులు రక్తనాళపటిమ యేమూల డాగెను? పల్నాటి వీరుల శౌర్యాగ్ని చల్లార్చుటకు కారణ మేమి? బొబ్బిలి దెబ్బలు లేమాయె? "ఇదంక్షాత్ర మిదంబ్రాహ్మ్య"మ్మను బ్రహ్మక్షత్రియుల క్షాత్ర తేజ మెక్కడి కెగిరిపోయెను? అట్లు పోవుటకు కారణమేమి? ఇట్లు మాయమై పోవుటకు కారణము కలిమాయయేనని మనవారు తలంతురు. మనము దుర్బలుల మగుటకు కారణము కలిమాహాత్మ్యమేనని మనవారు తలంతురు. ఇది కేవలము భ్రమ. దీనికి ప్రత్యక్షకారణ మీయాయుధశాసనమే. మనము కత్తిపట్టుటయే తప్పైనప్పుడు, మనము బలవంతుల మెట్లగుదుము? కలిమాహాత్మ్యమే యీయాయుధ శాసన రూపముగ పరిణమించినదని తలంచిన మనము తలంపవచ్చును. ఏది యెట్లున్నను ఈయాయుధ శాసనమును త్వరలో రద్దుపరచిననే గాని మనకు మేలులేదు.

ఈశాసనమువలన మన ప్రజల కొక్కరికేకాక గవర్నమెంటు వారికి కూడ నష్టమే. ఏలనన మన హిందూదేశమువంటి పెద్దరాజ్యముండియు ప్రజలు దుర్బలులైన కారణముచేత నేడైనయుద్ధము తటస్థించినప్పుడు మన దేశమువలన వారికేమియు ప్రయోజనము లేకున్నది. అదిగాక మనదేశమువలన వారి కుపయోగము లేకపోగా, పరరాజు లెవరైన దండెత్తివచ్చినప్పుడు గాని, లేక పరసీమలలో మనగవర్నమెంటువారు యుద్ధముచేయ పోయినప్పుడు గాని, మన హిందూదేశముగతి యేమగునోయని, తిరిగి తిరిగి వెనుకకు చూచుకొనవలసి వచ్చుచున్నది మన హిందూదేశము వారికి మెడలోని పెద్దబండ రాయివలె నున్నది. అట్లుగాక ప్రజలకు యుద్ధశిక్ష నేర్పిన యెడల నీ యిబ్బందు లేమియు నుండవుగద. ప్రస్తుతపు యుద్ధములో మన మేమియును తగినంత సహాయము చేయలేక పోయినాము. మన ప్రజల కందరికిని, జర్మనీదేశములోవలె, యుద్ధశిక్ష నేర్పినయెడల జర్మనీగాని గిర్మనీగాని కన్నెత్తి మనవంక జూడగలదా? సమయము వచ్చినప్పుడు ప్రజలందరును కత్తులు పుచ్చుకొని నిలువబడి శత్రువులను పారద్రోలెడివారుకారా? మన గవర్నమెంటువారీ సంగతిని బాగుగ మొదట దూరదృష్టితో విచారించి పనిచేయలేదు. కాని యిప్పుడు యుద్ధము తటస్థింపగనే, కన్నులు తెరచి జూచిరి. ప్రజలనందరిని గుంపులు గుంపులుగవచ్చి సైన్యములో చేరవలసినదని చేతులెత్తి బిగ్గరగ నందరిని పిలిచిరి. కాని వెళ్ళగలవారెవరు? పాపము మన గవర్నమెంటువారికి ఆపత్కాలము వచ్చినది. గనుక మన మందరమును సహాయము చేయవలయునని మన మెంతో మనస్సులో నుత్సాహపడితిమి కాని మనము కూర్చొనిన చోటునుండి లేవలేనట్టి దుర్బలస్థితిలో నున్నప్పుడు మన మేమి చేయగలము? కత్తి పట్టుటయన నేమియో మనము చాలకాలము క్రిందనే మరచిపోతిమి. యుద్ధము చేయుట యన నేమియో మనము మరచిపోతిమి, "కత్తిపట్టకూడద"ని గవర్నమెంటు

వారు శాసించిరి. కనుక నిప్పుడు మన మేమి చేయగలము ? ఇది స్వయంకృతాపరాధ మనియే గవర్నమెంటు వారు గ్రహించినట్లు తోచుచున్నది. కాని యిప్పుడైనను, తెలివి తెచ్చుకొని, ఆశాసనమును రద్దుపరపరాదా? అట్లు చేయుదమను తలంపున్నట్లు కాన్పింపదు. అయినను మనలోనివారు, బలమంతయు పూర్తిగ నశింపని కొందరు ఫ్రాంసు దేశమునకుబోయి, జర్మనీవారితో హోరాహోరి పోరాడి, మొదటి దెబ్బను తప్పించిరి. ఆసమయమున, మనవారు సైంధవునివలె నడ్డముపడని యెడల జర్మనీదేశ మీపాటికే ఫ్రాంసు దేశమును ఆక్రమింగివైచెడిది. కనుక నికనైనను యీశాసనమును తొలగించి, మనదేశ ప్రజలకును, సామ్రాజ్యమున కంతటికిని మేలొనగూర్తురు గాక యని కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

ప్రజల కష్టసుఖములను తెలుపుకొనుటకును గవర్నమెంటులో నేమైన లోప ములున్న యెడల వానిని గవర్నమెంటు వారికి తెలియజెప్పి, వానిని సవరించుకొను నట్లు చేయుటకును, నేదైన సందిగ్ధతరుణము వచ్చినప్పుడు ప్రజల కోరికలను, ప్రజల యభిప్రాయములను తెలుపుటకును వార్తాపత్రిక లత్యవసరములు. ఇవి ప్రతిదేశములోను కలవు. ఈపత్రికలద్వారా ప్రజలు తమ యభిప్రాయములను తెలిపెదరు. ఆ యభి ప్రాయానుసారముగ, ప్రభుత్వమువారు సంచరింపవలెను. గవర్నమెంటువారు ప్రజాభిప్రాయమును గౌరవించి తీరవలెను. ఆప్రకారము వారు రాజ్య మేలవలెను. సీమలోను; వలసదేశములలోను ప్రజాభిప్రాయమున కిట్టి గౌరవము గలదు. కాని మన దేశములో నిది యంతయును తలక్రిందే. ప్రజాభిప్రాయ మెట్లు మన గవర్న మెంటువారు నిరసింపుచున్నారో యిదివరకే చెప్పియుంటిని. ప్రజల యభిప్రాయ మెట్లున్నను సరే, గవర్నమెంటువారు తమయిష్టము వచ్చినట్లే చేయుదురుగాని, మన ప్రజలమాట లక్ష్యముచేయరు. ప్రజాభిప్రాయము వారిమనస్సునకు వ్యతిరేకముగనున్న యెడల వారికి బహుకోపము వచ్చును. "మాప్రజలయొక్క యభిప్రాయమిట్లున్నది." అని గట్టిగ చెప్పి వాదించు పత్రికలను చూచిన వారికి తలనొప్పి. కనుక నిట్టిపత్రికల నాపుటకై యనేక కఠినశాసనములను చేసిరి. దానిలో ముద్రణాశాసన మొకటి. ఈ శాసనములవలన నెన్నియోపత్రికలు నాశనమైనవి. మొదట గవర్నమెంటువారు యీ పత్రికలవద్దనుండి కొన్ని వేలరూపాయలను హామీ పుచ్చుకొనెదరు. గవర్నమెంటు వారికి అయిష్టముగ నీ పత్రికలలో నేమైన వ్రాసినయెడల, ఆ హామీ సొమ్మును గవర్నమెంటువారు తీసికొని, తిరిగి హామీ కట్టమనెదరు. ఇట్టి హామీలను కట్టలేక యెన్నియో పత్రికలు నోరుమూసికొని పడియున్నవి. ఈవిధముగ ప్రజల నోరు మూయజూచుట యేటిన్యాయమో తెలియకున్నది. వలసదేశములవారికి లేని యీ నిర్బంధము మనకేల యుండవలెను ? ఇట్టి యసహ్యాకరములగు చట్టము లనేకములు గలవు. వాని నన్నిటిని తొలగించ వలసినదని కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## సంప్రతింపు

బ్రిటిష్ సామ్రాజ్యము బహువిస్తీర్ణమైనదనియు, దానిలో ననేకదేశము లిమిడి యున్నవనియు, ఆదేశములలో మనహిందూదేశముకూడ తక్కిన వలసదేశములతో పాటు నొకదేశ మనియు తెలిపియుంటిని. సామ్రాజ్యమంతటి విషయమై యేదైన విషయము విచారణకు వచ్చినప్పుడు సామ్రాజ్యములో నున్న దేశములవారందరును కలిసి యాలోచించుకొన వలెనుగద. కాని యిట్టివిషయములలో వారు మనతో సంప్రతింపరు; వలసదేశముల వారితో సంప్రతించెదరట. యుద్ధము ముగిసినపిమ్మట సామ్రాజ్యముసందంతటను మార్పులుచేసెదరట. ఎచ్చటెచ్చట నేయేమార్పులు చేయ వలెనో సీమలోనివారును, వలసదేశములవారును కలిసి యాలోచించి చేసెదరట! కాని మనతో నాలోచింప నక్కరలేదు. బహుశః మనయిండియావిషయ మేదైన వచ్చినప్పుడు మన మంత్రిని, మన సెక్రటరీని అడుగుదురు. ఆయన తనకు తోచినమాట లేవియోచెప్పును. కాని మన ప్రజాభిప్రాయ మెట్లాతనికి తెలియును. ఒకవేళ మన యభిప్రాయ మాతనికి తెలిసినను, మన యభిప్రాయమును తెలిపి మనపక్షమున గట్టిగ వాదింపవలెనను బాధ్యత యతని కేమికలదు? మనప్రజలకు జవాబు చెప్పవలసిన బాధ్యత యాతనికి లేదు.

ఈ మంత్రి పార్లమెంటువారికి జవాబు చెప్పవలెను గాని, మనప్రజలకు జవాబు చెప్పనక్కరలేదు. ఈ మంత్రియు, వైస్రాయి మొదలగు నుద్యోగులును ప్రజలకు బాధ్యులై యుండిననేగాని మనకు నిజమైన స్వాతంత్ర్యము లేదు. ఇదియే "బాధ్యతాయుత పరిపాలన" ఇట్టి బాధ్యతలేని కారణముచేత, సాధారణముగ మన తరఫున సీమలో మాట్లాడు మంత్రులకు మనవిషయమై యేమియు బొత్తుగ తెలియదు. మన కష్టములు బాగుగ తెలియని కారణముచేత, వారు చెప్పుమాటలవలన మనదేశమునకు నష్టమేకలుగుచుండును. కనుక యీ మంత్రులవలన మనకేమియు ప్రయోజనము లేక పోగా నెలకు కొన్నివేల రూపాయలు వారిసిబ్బంది కర్చుల క్రింద నష్టము వచ్చుచున్నది: ఈ యుభయభ్రష్టత్వము తొలగించుటకై యీ మంత్రిని, యీయన ఆఫీసును, సిబ్బందిని పూర్తిగ నెత్తిపారవేయవలసినదని మనవారు కోరుచుండిరి. ఈ విషయమంతయు విచారించి చూడగ మన హిందూదేశమునకు బహు అన్యాయము జరుగగలదనుట స్పష్టము. యుద్ధము ముగిసిన పిమ్మట సామ్రాజ్యములో జరుగ వలసిన మార్పుల విషయమై యచ్చటివారందరు నొకచోట కూర్చుని విచారించి, తీర్పుచేసెదరు. ఆ సభలో మన ప్రజలపక్షమున వాదించుట కెవరునులేరు. మనలను తమ దేశములలోనికే అడుగు పెట్టనీయని వలసదేశములవారు మనపక్షము పలుకుదు రన్నమాట సున్న. ఎట్లు విచారించినను మనకు నష్టమే. వారందరేమి తీర్పుచేసిన నా ప్రకారము మన మందరమును బద్ధులము కావలసినదే. "హిందూ దేశస్థులందరును తలక్రిందపెట్టి, కాళ్ళుపైకి పెట్టి నడువవలసినదే కాని మామూలుగ నడువకూడదు" అని వారొకవేళ తీర్పుదిద్దినయెడల, మనము నోరుమూసికొని, ఆప్రకారము బద్ధులమై

నడువవలసినదేగాని మారుపలుక వీలులేదు. ఇట్టి యన్యాయము జరుగకుండ ప్రతి విషయములోను పరదేశములతోబాటు మనదేశప్రజలతోకూడ సంప్రతింపవలసినదని కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము.

## జాతీయస్వత్వమునకు భంగము వాటిల్లుట
## జాతీయకళలు, శాస్త్రములు, విద్యలు నశించుట

రాజపోషణ లేనికారణమున మనవృత్తులు, చేతిపనులు, పరిశ్రమలు, వర్తకము, మొదలగునవన్నియు నెట్లు నశించునో, తన్మూలమున మనదేశప్రజ లెట్లు పేదవడియుండిరో యిదివరకు సూచించియుంటిమి. ఇదివరకు సమస్త యైశ్వర్యములతో తులదూగుచు, రత్నగర్భయని పేరొంది, పరదేశములవారికెల్ల కన్నెఱ్ఱగనున్న మనదేశ మిప్పుడు కడుబీదస్థితిలో నుండనేల? ఇన్ని కలవు లిట్లు తటస్థింపనేల! వీని కన్నిటికిని కారణము రాజపోషణలేమియే యనియు, ప్రజల చేతులలో రాజకీయాధికారములేమియే యనియు, సూచించియుంటిమి. ఈ యైశ్వర్యములతో బాటు మనదేశమున కలంకారముగనున్న కళలు, శాస్త్రములు, విద్యలుకూడ నశించినవి. జాతీయస్వత్వమునకు భంగము వచ్చినది. మన జాతికూడ నొక జాతియేనా యని సందేహింపవలసి వచ్చుచున్నది. మన కళలను పోషించువా రెవరు? చిత్రలేఖనము, ప్రతిమలు చెక్కుట, సంగీతము, మొదలగు హృదయాహ్లాదకరములగు కళలు నేడేమాయె? మన సంగీతశాస్త్రము నభివృద్ధిపరచి మన సంగీతశాస్త్రజ్ఞులకు బహుమానములనిచ్చి పోషించు రాజులేరీ? మన తెల్లప్రభువులకు ఈ మన సంగీతము పనికిరాదు. సంగీతమనగ "బ్యాండే" చర్చిలో వాయించు "ఆర్గ[illegible]"యే మంచి పాట. కనుక మనకళ లెట్లభివృద్ధి నొందును? ఆ విధముగనే సమస్త శాస్త్రములును నశించినవి. వేదాంతశాస్త్రజ్ఞులను, మీమాంసాది యుత్కృష్ట శాస్త్రములను పఠించినవారిని పోషించువా రేరీ? ఈ శాస్త్రములను చదువుకొనినందున నా వంతయు ప్రయోజనములేమిచే మనవా రాశాస్త్రములను వదలి యీ యల్పవిద్యలభ్యసించి కలెక్టరాఫీసు గుమాస్తాల పనికై యెగబడిరి. ముందు భుక్తికుదిరినగదా ముక్తి కుదురుట.

ఒక్క వైద్యశాస్త్రము విషయమై యోచింపుడు. ఈ ఆస్పత్రులలో విదేశపు మందులు వచ్చిన కారణముచేత మన యాయుర్వేద మడుగంటినది. మన యాయుర్వేదమును పోషించువా రెవరు? "మా యాయుర్వేదమునకు కొంత డబ్బు నిచ్చి, యీ విద్యను ప్రోత్సాహపరచి, యీ యాయుర్వేదము చదువుకొనిన వారిని వైద్యులనుగ నియమించి యీ యాయుర్వేదౌషధములను ప్రచారములోనికి తీసికొని రావలసినద"ని మనవారు గవర్నమెంటును కోరగ, "ఎబ్బెబ్బే! ఆయుర్వేదమేమిటి! ఆయుర్వేదశాస్త్రమనే వైద్యశాస్త్ర మొకటియున్నదా? అది మంచి వైద్యశాస్త్రమేగాదు. దానిలో మంచిమందులు తయారుచేయు పద్ధతియే లేదు. ఆ మందులు పనికిరావు.

మే మొప్పుకొనము" అని గవర్నమెంటువారు జవాబు చెప్పిరి. అయ్యో ! చూచితిరా ! మన యాయుర్వేదమునకు పట్టినగతి ! ఈ జవాబు చెప్పిన సర్జను జనరలు (డాక్టరు) గారికి ఆయుర్వేదముయొక్క ముక్కు మొగము తెలియనిదే ఆయన యట్టి జవాబును చెప్పనేల సాహసించెనో చూడుడు. ప్రపంచములో నింగ్లీషు ద్రావకములు తప్ప మరేమందులు లేవని యాయనయూహ. కప్ప నూతిలో కూర్చుని, యీ నూయియే ప్రపంచముగాని, యింక ప్రపంచమనునది వేరొకటి యున్నదాయని తలంచును. నిజము విచారింపగ, ఒక్క వ్రణములను, కురుపులను పడగోయు శస్త్రభాగములో తప్ప, మరియింక నేరోగములకును మనమందులు పనిచేసినట్లుగ యీ ఇంగ్లీషుమందులు పని చేయజాలవన్న సంగతి మనకందరికిని తెలిసిన విషయమే. ఆవ్రణములను సైతము వారు పూర్తిగ నివారింప జేయజాలరు. ఏలననగ ఒక మేహవ్రణ మున్నదనుకొనుడు. ఆవ్రణమునకు కారణము మేహప్రకోపమేగద. మేహమును శమింపజేసిననేగాని ఆవ్రణముయొక్క మూలము నశింపదు. కనుక మనవారు ఆ మూలకారణమును నశింప జేయుటకై మందు లిచ్చెదరు. ఇంగ్లీషు వారన్ననో పైపైన వ్రణమును పడగోసి మాన్పజూచెదరు. ఒకవేళ తాత్కాలికముగ నావ్రణము మానిపోయినను, అసలు మూలకారణము నశింపనందున, కొంత కాలమునకు మరియొకచోట వ్రణము వేయుచుండును. ఇవన్నియు విచారింపగ మన వైద్యశాస్త్రమే ప్రశస్తమైనదని తేలుచున్నది. ఇట్టి సందర్భములో మన దేశీయ ఆయుర్వేద, యునానీ, వైద్యముల నేల పోషింపగూడదు ? ఈ యాస్పత్రులలో మన మందుల నేల తయారు చేయించి ప్రజల కివ్వకూడదు ? మన డబ్బు కర్చుపెట్టి సీమనుండి యింగ్లీషుమందులను తెప్పించి వాడుటకంటె ఆ డబ్బుతో మన మందుల నేల తయారు చేయించి వాడకూడదు ? దీనివలన మన కింకొకనష్టము వచ్చుచున్నది. మన వైద్యశాస్త్రము నశించుట యట్లుండగ, మన డబ్బంతయు ఈ సీమ మందులను కొనుటవలన, పరదేశములకు పోవుచున్నది. మన మందులను ప్రోత్సాహ పరచిన యెడల నికసీమమందును కొనువారెవరు ? వాని మొగము జూచువారెవరు ! సీమవర్తకులకును, డాక్టరులకును లాభము వచ్చుటెట్లు ? కనుక మీలో వైద్యశాస్త్రమేలేదు, మీలో మందులే లేవు అని జవాబు చెప్పినయెడల సరిపోవునని వారియూహ. మనలో వైద్యశాస్త్రము లేదనిచెప్పిన యెడల నెవడును నోటితో నవ్వడు. చెన్నపట్నంలో ఆయుర్వేదభిషగ్మణి యైన గోపాలాచార్యులగారి వద్దకు బోయినయెడల నీకెన్ని గ్రంథములు కావలెనన్న అన్నిగ్రంథములను, వైద్య ప్రకరణములను జూపగలరు. గవర్నమెంటువారు మన విద్యలయందును, మన శాస్త్రములందును నిట్టి యనాదరణ జూపుచుండగ, మన శాస్త్రము లెట్లభివృద్ధి యగును ! పోనీ మనమైన యభివృద్ధి నొందించుకొందుమాయన్న, మన చేతులలో రాజకీయాధికారము లేదు. వలసదేశములలోను, సీమలోను ప్రజల కిట్టియధికారమున్నందున వారి శాస్త్రములు, వారి జాతీయస్వత్వములు నిలిచియున్నవి. కనుక మనము కూడ నభివృద్ధి నొందవలెనన్న మనకు కూడ నిట్టి రాజకీయాధికారమే కావలెను. ఈ రాజకీయాధికారము మనచేతిలోనుండి జారి

పోవుటవలన మనదేశము కళావిహీన మయ్యెను. పూర్వపు వైశ్వర్యము రావలె ననిన ఈ రాజకీయాధికారము ప్రజచేతులలో నుండవలెను. ఇదియే స్వరాజ్యము.

వలసదేశములకును, మనకు నున్న భేదములను సూచించియుంటిని. దీనివలన వారి కెక్కువలాభములు, మనకెక్కువ నష్టములు వచ్చుచున్నవని చెప్పితిని. ఇట్టి లాభ నష్టము లందరికిని సమానముగ నుండునట్లు చేయవలసినదని మనము కోరు చున్నాము. ఇదియే స్వరాజ్యము. దీనిలో నింకొక ధర్మరహస్య మున్నది. "ఆత్మ బుద్ధిః సుఖంచైవ" యనియు: "సర్వంపరవశం దుఃఖం, సర్వం ఆత్మవశం సుఖం" అనియు, మన శాస్త్రములు బోధించుచున్నవి. మన వ్యవహారములను మనము చేసి కొనిననే బాగుండునుగాని, పరులువచ్చి చేసిన బాగుండదు. పరలోకవేళ మనకంటె యెంత బాగుగచేసినను మనకది రుచింపదు. మనము చేసికొనిననే మన మనస్సునకు సంతోషముగ నుండునుగాని, యితరులు చేసినయెడల మనకు దానిలో నన్నియు దోషములే కనబడుచుండును. మన మనస్సునకు తృప్తి యుండదు. కనుక మనధర్మ ములే మనకు రుచించునుగాని, పరులధర్మము లెంతయుత్కృష్టమైన వైనను మనము వాని ననుష్ఠింపజాలము. "స్వధర్మే నిధనంశ్రేయః, పరధర్మోభయావహః" మనము కోరు స్వరాజ్యముయొక్క మూలతత్వమిది. ఈపైన చెప్పిన విషయములనెల్ల నీక్రింద నొకజాబితా రూపమున జూపెదను.

| హిందూ దేశము | వలస దేశములు |
|---|---|
| (1) హిందూదేశ అంతరంగిక వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటకు పార్లమెంటువారి కధికారము కలదు. | (1) ఇట్టి యధికారము పార్లమెంటు వారికి వలస దేశములపై లేదు. |
| (2) ప్రభుత్వము ప్రజాభిప్రాయ ప్రకారము జరుగుటలేదు. కార్యనిర్వాహకులు ప్రజాప్రతినిధులకు బాధ్యులై యుండ నక్కరలేదు. అనగ బాధ్యతాయుత పరిపాలనలేదు. | (2) ప్రభుత్వము ప్రజాభిప్రాయ ప్రకారము నడచి తీరవలెను. కార్యనిర్వాహకులు ప్రజాప్రతినిధిసభకు బాధ్యులై యుండవలెను. అనగ బాధ్యతాయుత పరిపాలన కలదు. |
| (3) డబ్బుసంచి ప్రజల చేతులలో లేదు. | (3) డబ్బుసంచి ప్రజల చేతులలో నున్నది. |
| (4) విపరీతపు శివిల్ ఖర్చులు. సీమ మంత్రిజీతము నిన్నటివరకును మనమే యిచ్చుకొనుచుంటిమి. క్రొత్త చట్టప్రకారము యీ విపరీతజీతములను మరింత యెక్కువ జేసిరి. | (4) కొద్ది జీతములు కొద్ది కర్చులు. సీమ మంత్రిజీతము వీరెప్పుడును యిచ్చు కొనుటలేదు. |

(5) మిలిటరీకర్చు లెక్కువ: రాబడి యంతయు దీనిక్రిందనే కర్చు. హక్కులు స్వాతంత్ర్యములు తక్కువ. తేనిపోని కర్చులు మన నెత్తిమీదనే వేయుదురు.

(5) మిలిటరీ కర్చులు తక్కువ. హక్కులు స్వాతంత్ర్యములు యెక్కువ.

(6) వర్తకస్వాతంత్ర్యములేదు రక్షణ పన్నులు లేవు.

(6) వర్తకస్వాతంత్ర్యము పూర్తిగ నున్నది. రక్షణపన్నులున్నవి.

(7) పరిశ్రమలు, వృత్తులు, రాజపోషణలేమిచే నశించినవి. దేశము దారిద్ర్యాంబుధిలో మునిగియున్నది. యేటా దేశములో కరువులే వచ్చుచున్నవి. ప్రజలకు జీవనాధారము లేదు.

(7) రాజపోషణ యుండుట వలన సమస్త పరిశ్రమలును వికసించి వృద్ధిలో నున్నవి. దేశములో కరువులు లేవు. జీవనాధారము కలదు.

(8) హిందూదేశస్థులు వలసదేశములలో కాలుపెట్టకూడదు. మనవారచ్చట పడుకష్టములు, అవమానములు దుర్భరములు.

(8) వలసదేశస్థులు వచ్చి మనహిందూదేశములో స్వేచ్ఛగ విహరింపవచ్చును.

(9) మనము కత్తిపట్టకూడదు. మన యభిప్రాయములను గట్టిగ పత్రికలలో వ్రాయకూడదు. వాక్ స్వాతంత్ర్యము లేదు.

(9) కత్తిపట్టవచ్చును. ప్రజాభిప్రాయమును పత్రికలద్వారా ధారాళముగ వెల్లడింపవచ్చును.

(10) సామ్రాజ్య వ్యవహారములలో మన హిందూదేశస్థులతో సంప్రతింప నక్కరలేదు.

(10) వలసదేశములతో సంప్రతించి తీరవలెను.

(11) సర్వమును 'పరవశమున' నుంటచే మన స్వధర్మము నశించినది. జాతీయ స్వత్వమునకు భంగము వాటిల్లుచున్నది.

(11) సర్వమును 'ఆత్మవశమున' నుంటచేస్వధర్మములు నిలిచి, వృద్ధినొందుచున్నవి.

వలస దేశములకును మనకు నిట్టి భేదము లనేకము లున్నవి. అంతదూరము పోనేల. మన దేశములోనే తెల్లదొరలకును మనకును హక్కులలో విశేషభేదము లున్నవి. కొన్నిటి నిదివరకే సూచించియుంటిని. వీనినన్నిటిని మనము ప్రతిదినమును కండ్లార చూచుచున్నాము. తెల్లవాడు కత్తిపట్టవచ్చును, మనము పట్టకూటదు; రైళ్ళలో వారికి ప్రత్యేకపు బండ్లుండవలెను. ఒక నల్లవాడును ఒక తెల్లవాడును ఒకే తరగతి టిక్కెట్టును కొందురనుకొనుడు. కాని ఆతెల్లవాడు కూర్చున్న బండిలో మన నల్లవాడు కూర్చొనకూడదు. ఈభేదమేల యుండవలెను; ఇది మనదేశ గౌరవమునకు లోపముకాదా? ఎంచ మొదలిడిన నిట్టి యన్యాయము లింక ననేకములు గలవు.

కాన వీని నన్నిటిని తొలగించి మమ్ములనుకూడ సమానముగ నాదరించి విక్టోరియా రాణీగారు చేసిన వాగ్దానమును చెల్లింపవలెనని కోరుచున్నాము. ఇదియే స్వరాజ్యము. ఇంతకంటె వేరేమియును లేదు. ఈమాట వినగనే ప్రజలుగాని ప్రభుత్వమువారుగాని ఉలికిపడ నవసరములేదు. స్వరాజ్యమును మీరు కోరవచ్చుననియు, మేమే క్రమ క్రమముగ మీకిచ్చెదమనియు గవర్నమెంటువారే వాగ్దానము చేసియున్నారు. అంత మాత్రముచేత మనము చంకలు కొట్టుకొని సంబ్రపడుచు కూర్చున్న లాభములేదు. అహోరాత్రములు సంపూర్ణ స్వరాజ్యప్రాప్తికై దేశప్రజ లెల్లరును శక్తివంచనలేక పాటుపడవలెను. మనము చేయవలసినపని యతివిస్తారముగ నున్నది. యిప్పటికి ఆవగింజలో అరభాగమైనను కాలేదు. మన మోక్షమునకై పాటుబడుట మనవిధి. మన మీ విధినిగూర్చి యెప్పుడు మరతుమో, అప్పుడే మనము అధోగతికి పోవనారంభింతుము. మనము పురుష ప్రయత్న మొనర్చినయెడల దైవము తప్పక మనకు తోడ్పడగలడు.

స్వరాజ్యతత్వ మెల్లవారికిని సులభముగ తెలియుటకై తేట మాటలతో వ్రాసితిని వ్యాకరణ సూత్రముల పాటింపలేదు. ఎచ్చట నేపదము వేసిన ప్రతి వానికిని దానిలోని భావము మనస్సునకు బాగుగపట్టునో, అట్టి పదమునే వేసితిని. ఈగ్రంథములో నున్న సుగుణములన్నియు శ్రీలోకమాన్యులవిగను, దోషము లన్నియు నావిగను భావించి యాంధ్రలోకము నన్ను మన్నింతురుగాక యని వేడుకొనుచున్నాను.

ఓం ! తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

ఇట్లు :
విన్నవించు విధేయుడు,
"దేశ సేవ కుఁ డు."

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 1. స్వ రా జ్య ము

(ఆన 1916 సం॥ మే నెల 1-వ తేదీని బెల్గాములో నిచ్చిన ఉ ప న్యా స ము)

నేడు నన్నిచ్చట నుపన్యసింపవలసినదని మీరు కోరినప్పుడు ఏ విషయమును గూర్చి యుపన్యసింపవలెనో నేనాలోచించుకొనలేదు. ఏ విషయమును గూర్చి యుపన్యసింపుటకును నేను సంసిద్ధుడనై వచ్చియుండలేదు. నేను మీవలెనే యీ మహాజనసభను చూచిపోవుదమని వచ్చియుంటిని. మన మీ సభలో 2, 3, దినముల నుండియు స్వరాజ్యమును గూర్చి చర్చించియుంటిమి; తత్కార్య సాఫల్యత కొరకై మనమిచ్చట స్వరాజ్యసమితి నొకదానిని స్థాపించితిమి. గనుక నిట్టి స్వరాజ్యమును గూర్చి నేను నేడిచ్చట యుపన్యసింప బూనుకొనిన యెడల దోషమేమియు లేదను తలంపుతో నేనీ స్వరాజ్యవిషయమునే నేటి యుపన్యాసమునకు ముఖ్యాంశముగ గ్రహింప నెంచితిని.

స్వరాజ్యమన నేమి ? అనేకులు దానిని గూర్చి దురభిప్రాయపడుచున్నారు. కొందరి కామాట అర్థమే కాలేదు. కొందరికి తెలిసియుండియు విపరీత భావములను కల్పించుచున్నారు. మరికొందరి కది అక్కరనేలేదు. ఇట్లు పలువురు పలుతెరంగులుగ నున్నారు. గనుక ఏ ఒక్క విషయమును గూర్చి పూర్ణచర్చ గావింపకుండ, వానిలో నీ క్రింది ముఖ్యాంశములనుగూర్చి మాత్రమే ఏవియో ఒకటి రెండుచెప్పదలచుకొంటిని. నేటిదినమున అంతకంటె నెక్కువ చెప్ప సంసిద్ధుడనై యుండలేదు. స్వరాజ్యమన నేమి ? దానిని మనమెందుకు కోరుచుంటిమి ? దానికి మనము తగుదుమా ? తగమా ? దానికై అడుగవలసిన వారిని మన మేవిధముగ నడుగవలెను ? మనము నిర్వహింపవలసిన కార్యములనెల్ల నేవిధముగ, నెట్టి పద్ధతుల ననుసరించి నిర్వహింపవలెను ? నే చెప్పబోవు సంగతులన్నియు నేను నా పరిశ్రమవలన గాని, నా కృషివలన గాని, కనిపెట్టిన క్రొత్తవిషయములు గావు. స్వరాజ్యమనునది బహుపురాతనమైన విషయము. స్వరాజ్యమనుమాట చెప్పగనే యేమితోచును ? మన స్వపరిపాలనకు అనగా స్వంత పాలన కేదియో వ్యతిరేకమైన పరిపాలన యిప్పుడున్నదనియు, అట్టి వ్యతిరేకపాలన యున్నప్పుడే మనకు స్వరాజ్యము కావలయునను యూహ తోచుననియు స్పష్టపడుచున్నది. ఇట్టిస్థితి కలిగినప్పుడే మనలో స్వరాజ్యవాంఛ జనించును. తత్ఫలప్రాప్తికై

ప్రజలు పాటుబడుదురు. మన కిప్పు డిట్టిస్థితి ప్రాప్తించినది. మనపాలకులు మన మతమునకు జెందినవారు కారు; మన జాతికి జెందినవారుకారు; మనదేశమునకు జెందిన వారుకారు. ఆంగ్లేయప్రభుత్వము మంచిదా? చెడ్డదా? యనువిషయము ప్రస్తుతాంశముకాదు. ఆ విషయము వేరు. "మావారా" "పరులా" యను విషయము కూడ ప్రస్తుతాంశముకాదు. ఆ విషయము వేరు. మొదట వీనియర్థములను మీరు బాగుగ గ్రహింపవలెను; చిక్కుపడకూడదు. మనపాలకులు "మావారా ?" "పరులా ?" యను ప్రశ్న వచ్చినప్పుడు "పరులని"యే చెప్పవలెను. ఈ ప్రభుత్వము "మంచిదా?" "చెడ్డదా" యను ప్రశ్నవచ్చినప్పుడు "మంచిది" యని చెప్పు, లేదా "చెడ్డది" అని చెప్పు, కాని నీవేమి చెప్పినను దానికి కారణము చూపవలెను. చెడ్డది అని చెప్పినప్పుడు ఏయే విషయములలో చెడ్డది ? దానిని బాగుపరచుటకై యేయేయభివృద్ధికర మార్గముల నవలంబింపవలెను ? యీ విషయములన్నియు వేరు. ఒకవేళ "మంచిది" అని చెప్పిన యెడల పూర్వరాజన్యుల పరిపాలనలో లేని యే యే క్రొత్తసుగుణములు దీనియందుగలవు ? ఇవన్నియు వేర్వేరు విషయములు. వేర్వేరుదృష్టుల నాలోచింపవలసిన విషయములు కాని నే నిప్పు డీ వివిధరాజ్యముల యొక్క గుణాగుణముల తారతమ్యములను గూర్చి చర్చింప బూనుకొనలేదు. ఈ విషయమును మాత్రము మీరు మరచిపోకూడదు. ఏది యెట్లున్నను పూర్వమున్న రాజ్యము లన్నియు ప్రస్తుతమాంగ్లేయ ప్రభుత్వము క్రిందికివచ్చిన వనుమాట స్థిరము. పూర్వము మన భారత వర్షములో ననేకరాజ్యములుండెడివి. కొన్నిచోట్ల మహమ్మదీయ రాజ్యము, కొన్నిచోట్ల రసపుత్రరాజ్యము; కొన్నిచోట్ల హిందూరాజ్యము; కొన్నిచోట్ల మహారాష్ట్రరాజ్యమును యీ విధముగ ననేకములుండెను. ఈ స్వరాజ్యములన్నియు మంచివా చెడ్డవా యనునది ప్రస్తుతాంశము కాదని తిరిగి చెప్పుచున్నాను. దీనివిషయమై తరువాత నాలోచించుదము. ఈ రాజ్యము లన్నియు జీర్ణించిపోవగనే ఆంగ్లేయ దొరతనమువారి విశ్వపాలకత్వము భారతవర్ష మంతటి మీదను నెలకొల్పబడినది. ఆ రాజ్యము లెట్లు జీర్ణించినవా యని నేడు తలపోయుబనిలేదు. నేనావిషయమును గూర్చి ముచ్చటింపబోవుటకూడలేదు. కొందరు యువకులు సీమదేశములో విద్యల నభ్యసించి, కళాశాల శిక్షలబొంది, భారతవర్షమునకు వచ్చి, వారందరు మన పరిపాలననెల్ల నిర్వర్తింపుచుండిరి. ప్రస్తుతమున జరుగు పరిపాలనా పద్ధతి యిది. "చక్రవర్తి" పదము నామమాత్రమే. రాజనామశబ్దోచ్చారణ మాత్రమున మన మానసవీధియం దుత్పన్నమగు భావమునకు ప్రత్యామ్నాయముగ గనిపించు ప్రత్యక్షస్వరూపము మన ప్రస్తుతచక్రవర్తియే. ఈ భావము చక్షుర్గోచరముకాదు. ఇది నిర్గుణము. ఇట్టిరూపరహిత భావమునకు ఇట్టినిర్గుణాత్మకమైన భావమునకు, రూపకల్పన గావింప నెంచిన యెడల మన యీ చక్రవర్తియే అట్టి రూపముగ గ్రహింపనగును. ఈ నిర్గుణభావము రూపము దాల్చినప్పుడు, సగుణాకారుడైన మనచక్రవర్తిగా పరిణమించును. కాని ప్రస్తుతము మనపరిపాలనను నిర్వహించునది యీ చక్రవర్తి కాదు. మనస్వరాజ్యసమస్య యీ చక్రవర్తికి వర్తించునది కాదు. ఈ నిర్గుణాత్మకమైన భావమునకు వర్తించునది కాదు. మొట్ట మొదట

మీ రీవిషయమును బాగుగ గ్రహింపవలెను. ఏదేశమున కైనను రాజ్యాంగనిర్వహణమున కొకడుండి తీరవలెను. దేశములో నేదియో యొక విధమైన పరిపాలన యుండి తీరవలెను. అరాచకమునందణగిన జాతులస్థితివేరు. ఇట్టిజాతులెన్నడును పైకిరాజాలవు. మన యిండ్లలో సకలగృహ కార్యములను చక్కబెట్టుటకొక గృహకర్తకావలసి యుండును. అట్టి యజమాని లేనియెడల యితరుల నెవరినో ఒక పెద్దమనుష్యుని బయటనుండి తీసికొని రావలసి వచ్చును. రాజ్యాంగ విషయములలోకూడ నిదియే వర్తించును. ప్రతిదేశములోను రాజ్యపరిపాలనను నడపునాయక సంఘమొకటి యుండును. తత్సంబంధమైన యేర్పాటులు కొన్ని యుండును. వీనినన్నిటిని మనము బాగుగ పరిశీలింపవలెను. ఈనాయకసంఘమును, దానికి సంబంధించిన యేర్పాటులును వేరు; రాజశబ్దభావము వేరు. వీని రెంటికిని గల భేదమును మనము బాగుగ గ్రహింపవలెను. (పరిపాలకసంఘము వేరు, రాజశబ్దభావము వేరు) రాజొకడుండవలెను; రాజ్యపరిపాలన యనునది యొకటి యుండవలెను. ప్రపంచ చరిత్ర యీరెండు మూలధర్మములను వ్యక్తీకరింపుచున్నది. "ఏదేశమునందు క్రమమైన పరిపాలన యుండునో ఏదేశమునందు రాజుండడో, ఏదేశమందు పరిపాలన సంఘముండదో, అట్టిచోట సజ్జనులైనవా రొక నిముసమైనను నిలువకూడదు. మనప్రాణములకెప్పుడు భంగముకలుగునో, మనధనసంపద లెప్పుడు తస్కరింపబడునో, మన యిండ్లయం దెప్పుడు బందిపోటులు జరుగునో, మనగృహము లెప్పుడు పరశురామప్రీతి గావింపబడునో, యెవనికెరుక" యని మహాభారతములో చెప్పియున్నారు. ప్రభు వుండితీరవలెను. పూర్వము కృతయుగమునం దెట్టి పద్ధతు లుండెడివో వానినిగూర్చి నేనిప్పుడు చెప్పుటలేదు. ఇవి కృతయుగమునాటి మాటలు కావు. వారికి కృతయుగములో రాజక్కర లేకపోయెను. జను లందరును పరోపకారపారీణులై యుండి తమ తమ కార్యముల నెల్ల పరస్పరోప యోగములగు నట్లు నిర్వర్తింపు కొనుచుండిరి. రా జెవరును లేకుండగనే, అట్టి స్థితి పూర్వమొకప్పు డుండెనని పురాణములు చాటుచున్నవి. కాని అట్టి స్థితి చారిత్రకయుగము నందెచ్చటనైనను కలదాయని విచారించి చూచిన నెచ్చటను గానరాదు. ఎవరో ఒకరు రాజ్యచక్రమును త్రిప్పువారుండి తీరవలెను. అట్టి కార్యనిర్వహణము ప్రజలంద రెల్లప్పుడు ఒకచోట నొకటిగాచేరి గావించుటకు వీలుండదు. కాబట్టి రాజ్యాధికారము నెప్పుడును రెండుభాగములుగ విభజింపవలెను. ఒకటి సలహానిచ్చు ఆలోచనసంఘము. మఱియొకటి సలహాను కార్యరూపమందు ఆచరించు కార్యనిర్వాహకసంఘము. మన భారతవర్షమునం దిప్పుడుత్పన్నమైన స్వరాజ్య సమస్యపైన చేర్కొనబడిన (మూపరహిత) నిర్గుణభావమునకు వర్తింపదు. మనపైన నెవరు పరిపాలన చేయవలెను? ఈ రాజ్యపాలన నంతను యెవరి నాయకత్వము క్రింద నడపింపవలెను? ఎవరి యుత్తరువు ప్రకారము నడపింపవలెను? దీనికి మార్గదర్శకులుగ నుండువా రెవరు? అను యీ వివిధవిషయములకు కూడ వర్తింపదు. మనకు మేలు చేకూరిన ఆంగ్లేయుల పాలన క్రిందనే చేకూరవలెను. ఆంగ్లజాతి సహాయమువలననే చేకూరవలెను. మన కష్టసుఖముల నరసి పోషింపగల వారిప్రేమ మూలముననే చేకూర

వలెను. వారి అప్రమత్తానురాగము మూలముననే, వారి యవ్యాజానురాగమువలననే, వారియందున్న ఉదారభావముల మూలముననే చేకూరవలెను. ఇది నిర్వివాదాంశము. దీనిని గూర్చి నేను వేరుగ జెప్పవలసిన దేమియును లేదు. ఇది మొదటి విషయము. ఈ రెండు విషయములను అర్థము చేసికొనుటలో చిక్కు పడకుడు. ఈ రెండును ప్రత్యేక ప్రత్యేక విషయములు. ప్రస్తుతము మనము దౌర్భాగ్యస్థితిలో నున్నారము. గనుక యెవరి సహాయముననో నొకరి సహాయమున మనము పైకిరావలెను. మన కార్యములెల్ల నిర్వర్తించుకొనవలెను. గనుక ఆంగ్లేయుల రక్షణమునందుండగనే మనకు మేలొనగూడవలెను. ఇది నిర్వివాదాంశము. అట్లు కానియెడల మన స్వాతంత్ర్యము పోయి యుండెడిదే కాదు. (అనగా మన స్వాతంత్ర్యము పోయినది గనుకనే వారి రక్షణము వలననే మనకు మేలు చేకూరవలసి యున్నది, అని తాత్పర్యము) ఆంగ్లేయ ప్రభుత్వసహాయమువలననే, బ్రిటిష్‌సామ్రాజ్య సహాయమువలననే, మనకు శుభోదయము కావలసియున్నది. మన మీసంగతిని ఒప్పుకొనిన యెడల మనలో కొందరికుండు కొన్ని దుర్భ్రమలు కూడ తొలగిపోవును. అనగా దీనిలో రాజద్రోహ మేమియు లేదని తెలియనగును. ఈ నిర్గుణాత్మకమైన ఆంగ్లేయప్రభుత్వము క్రిందనే మనకు శుభోదయము కావలసియున్నయెడల, ఇంక మన మడుగునదేమి ? ఇప్పు డీ రెండవప్రశ్న బయలుదేరినది. దీనికి ప్రత్యుత్తరమునే వేరుగ చెప్పనక్కర లేదు. దీనికి ప్రత్యుత్తరము నేను పైన పేర్కొనిన సగుణ నిర్గుణ భావభేదములోనే నిమిడియున్నది. ప్రభుత్వము నిర్గుణమైనను, అది సగుణముగ మారినప్పుడు రాజ్యపాలనా నిర్వహణమంతయు ఆసగుణ రూపముద్వారానే గావింపబడుచున్నది. సగుణస్థితివేరు, నిర్గుణస్థితివేరు, బ్రహ్మ వేరు, మాయవేరు, అగుట ఎట్లో అట్లే సగుణ ప్రభుత్వమువేరు, నిర్గుణ ప్రభుత్వమువేరు. ఈ సగుణ నిర్గుణములను యీ రెండు పదములను వేదాంత శాస్త్రము ననుసరించి ప్రయోగించుచున్నాను. * రూపరహితుడైన నిర్గుణబ్రహ్మ నిజమాయావృతుడైనప్పుడు వేరుగ మారుచున్నాడు. మాయవలన కలిగిన యీ యవస్థాభేదము లన్నియు మార్పు నొందుచుండును. క్షణ క్షణమును మారుచుండును. క్షణక్షణమును మారుచుండుటయే మాయయొక్కలక్షణము. శాశ్వతముగ నిలచియుండున దొక ప్రభుత్వమే. ఇది నిర్గుణ ప్రభుత్వము. కాని సగుణ ప్రభుత్వము ప్రతినిమిషమును మార్పు నొందుచుండును. ఇప్పుడు క్రొత్తగ బయలు వెడలిన స్వరాజ్యమను పదము సగుణ ప్రభుత్వమునకు వర్తించును. శాశ్వత బ్రహ్మ కల్పముగ నుండు నిర్గుణ ప్రభుత్వము నటుంచి, క్షణక్షణమును మార్పు నొందుచుండు యీ

---

* భాగవతము:—గజేంద్రమోక్షము, అష్టమస్కంధము.

సీ॥ భవము దోషంబు రూపంబు | గర్మంబు నా
హ్వయములు గుణము నెవ్వనికిలేక
జగముల గలిగించు సమయించుకొఱకునై నిజమాయ
నెవ్వ డిన్నియును దాల్చు—

సగుణ ప్రభుత్వములో నెట్టిమార్పుల నొందించిన మన జాతికి మేలొనగూడును? ఇదియే స్వరాజ్యసమస్య. దీనిని స్వరాజ్య సమస్య యనినప్పుడు "ప్రస్తుతము మన భారతవర్ష పరిపాలన యంతయు నెవరిచేతులలో నుండవలెను.?'' అని వేరొక సమస్య బయలు దేరుచున్నది. నిర్గుణ ప్రభుత్వమైన ఆంగ్లేయాధికారమును మార్చుటకు మాకిష్టము లేదు. ఈనిర్గుణ ప్రభుత్వము తన కార్యములనెల్ల సగుణ ప్రభుత్వముచేత చేయించు కొను చున్నది. మే మిప్పుడు కోరునదేమనగ, నిర్గుణ ప్రభుత్వ కార్యములన్నియు యీ సగుణ ప్రభుత్వపు చేతులలో నుండకూడదు. మరి యింకొకరి చేతులలో నుండ వలెనని కోరుచున్నాము. ఈ యధికారమంతయు నింకొకరివలన, ప్రజల తోడ్పాటు వలన, మరియొక సగుణ స్వరూపమువలన నిర్వహింపబడిన యెడల ప్రజల కిదివరకు కంటె నెక్కువ లాభకారిగా నుండగలదు. కనుకనే, ప్రజల మేలుకోరియే, యీ స్వరాజ్యాందోళన గావింపబడుచున్నది. దీని కింకొక ఉదాహరణ జూపెదను, ప్రస్తుతము సీమలో చక్రవర్తియున్నాడు. "రాజు గుణదోషాతీతుడు'' అనగా గుణదోషములకు అతీతుడు. (రాజు ద్రోహముచేయజాలడు) అని ఆంగ్లేయచట్ట మొకటి గలదు. ఏలనన ఆ రాజుయొక్క ఆధికారమంతయు కొన్ని కొన్ని నియామకములకు లోబడి యున్నది. (రాజునకు పూర్ణాధికారములేదు.) ఏ విషయమైనను మంత్రివచ్చి రాజుతో చెప్పిననే గాని లేనియెడల రాజున కా విషయము తెలియనే తెలియదు. ముఖ్యమంత్రి గావించు పనుల కన్నిటికిని ఆ మంత్రియే (యుత్తరవాదియై)జవాబుదారియైయుండును. మనలో నిచ్చట ఆంగ్లేయ దేశచరిత్ర బాగుగ చదివినవారున్నారు. పైనుదహరించిన విషయములన్నియు కాదనుటకు వీలులేదు. ఆంగ్లేయదేశచరిత్రలో నిదియే ముఖ్య సూత్రము. ఆంగ్లేయదేశములో నిట్టి సూత్రముండుటవలన రాజద్రోహపు నేరములు క్రమక్రమముగ తగ్గనారంభించినవి, కాని యిచ్చట హిందూదేశమునం దన్ననో, రాజ ద్రోహపు నేరము లెక్కుడుగ మోపబడుచున్నవి. (ఇచ్చట ప్రజలేమిమాట్లాడినను రాజద్రోహమే యగుచున్నది.) అచ్చట రాజ్యకార్యముల నడపువారు వేరుగను, రాజు వేరుగ నున్నారు. రాజొక్కడు మాత్రమే స్థిరముగ నుండును; కాని మంత్రి ౫ సంవత్సరముల కొక పర్యాయము మారుచుండును. గనుక యిట్టి సందర్భములలో మంత్రుల మార్పుదలను గూర్చి ఎవరైన చర్చింప మొదలిడిన నది రాజద్రోహమని సీమలో నెవ రును నిందింపరు. ఆంగ్లేయుల కంఠ్లయెదుట నీ కార్యములన్నియు ప్రతిదినమును జరుగుచునేయున్నవి. ప్రజల యిష్టాయిష్టముల ననుసరించి మంత్రివర్గమును ౫ సంవత్సరములలోనే తొలగింపవచ్చును లేదా ప్రజల కనుకూలముగ నుండునని తోచిన యెడల యింకొక రెండుసంవత్సరములు ఆ మంత్రులనే నియమింపవచ్చును. (ప్రజలకు యిష్టములేని యెడల, మంత్రులను పదభ్రష్టులను గావింపవచ్చును.) బ్రిటిషు ప్రజల కిట్టి హక్కుగలదు. తమ కిష్టములేని మంత్రులను తీసివేయవలసినదని ప్రభుత్వము వారితో పోరాడగల హక్కు బ్రిటిషు ప్రజలకు గలదు. ఇట్టి పోరాటములు రాజున కేవిధమునను వర్తింపవు. రాజున కేమియు సంబంధింపవు. రాజు నామరూపరహిత నిర్గుణబ్రహ్మ. అవికల్పుడు ఈ దూషణభూషణ తిరస్కారములు రాజునకేమాత్రమును

అంటవు. వీనివలన రాజుచలింపడు. ఇప్పుడు మన మీ భారత వర్షమునందు గావించు స్వరాజ్యాందోళన యంతయు యీమంత్రివర్గములోని మార్పులనుగూర్చియే గాని రాజును గూర్చి యెంతమాత్రమునుకాదు. ఇచ్చట మనదేశములో రాజ్యముచేయుచున్నవారెవరు? చక్రవర్తివచ్చి రాజ్యము నడపుచున్నాడా! గొప్పగొప్ప ఉత్సవ సమయములలో దేవుని యూరేగించినట్లుగ, రాజుగారి విగ్రహమును మాత్రము మన మూరేగించుచున్నాము. మన మీ విధముగ రాజభక్తిని చూపుట మనయొక్క ధర్మమైయున్నది. అట్లయిన యెడల నిచ్చట రాజ్యపాలన యెవరి ద్వారా జరుగుచున్నది? రాజుగారు పంపిన రాజసేవకులద్వారా జరుగుచున్నది. స్టేటుశెక్రటరీ, వైస్రాయి, గవర్నర్, కలెక్టరు, పటేలు, తుదకు పోలీసు బంట్రోతు, వీరందరును రాజసేవకులు. వీరి ద్వారా యిచ్చట రాజ్యపాలన జరుగుచున్నది.

ఒక పోలీసుభటుని తీసివేసి, మరొకని నేర్పరుపవలసినదని కోరిన నది రాజద్రోహమగునా? ఒక కలెక్టరును తీసివేసి మరొకని నేర్పరుప వలసినదని కోరిన నది రాజద్రోహమగునా? ఒక గవర్నరును తీసివేసి మరొకని నేర్పరుపవలసినదని కోరిన నది రాజద్రోహమగునా? ఒక రాజ్యకార్యనిర్వాహకుని అనగ శెక్రటరీని తీసివేసి మరొకని నేర్పరుపవలసినదని కోరిన నది రాజద్రోహమగునా? దీనిని రాజద్రోహమనిన వారెవరునులేరు. పోలీసు భటునకు వర్తించు సూత్రమే, రాజ్యకార్య నిర్వాహకునికి కూడ వర్తించును. మన మందర యొక్క చక్రవర్తి యొక్క పౌరులమే. రాజ్యకార్య నిర్వాహకుడు చక్రవర్తియొక్క మంత్రి, చక్రవర్తియొక్క సేవకుడు, ఇట్టి పరిస్థితు లలో నిప్పుడెవరైనను, "మాకు రాజ్యకార్యనిర్వాహకు డక్కరలేదు, యీ రాజప్రతి నిధి మాకక్కరలేదు, మా బంగాళాదేశములో నీ ఫుల్లర్ దొర మా కక్కరలేదు." అని సకారణముగ, (తగిన హేతువులను జూపుచు) బలికిన "వీని తల తిరిగిపోయినది ఇతడు చెప్పుకారణము లేవియు తృప్తికరముగలేవు" అని వానిని నిరసించుచున్నారు. గవర్నరులను గూడ తొలగింపవలసినదను తీర్మానము లనేకములు పూర్వ మొకప్పుడు గావింప బడుచుండెను. పూర్వచరిత్ర పరిశీలించి చూచినయెడల, యీ గవర్నరులు మొదలగువారు మా కక్కరలేదని చెప్పుట రాజద్రోహముగ పరిగణింపబడ జాలదని తేలుచున్నది. మా కోర్కెలు రాజద్రోహ పూరితములు కావు; ఈ కోర్కెలన్నియు మన స్వరాజ్యమునకే వర్తించును. నే జెప్పు నంశములనెల్ల మీరు బాగుగ యోచిం పుడు. ప్రస్తుత పరిపాలనా పద్ధతి బాగుగనున్నదని మీకు తోచినయెడల, నేను వేరుగ చెప్పవలసిన దేమియునులేదు. ప్రతిసభలోను, ప్రతిమహాజన సభలోను మీరేల తీర్మానములను గావించెదరు? "మావంశ పరంపరానుగతమైన హక్కులు పోయినవి; అటవీ శాఖలో (ఫారెస్టు డిపార్టుమెంటులో) ప్రజలపై బలాత్కారాధికారము గావించుచున్నారు. ఆబ్కారీ డిపార్టుమెంటులో చూచిన యెడల మద్యపానము దేశమునం దమితముగ వ్యాపించినది. మన కపుసరమైన నిద్యావిధానము గావింపబడు టలేదు." అని ప్రజలేల గోలబెట్టుచున్నారు? వీని కన్నిటికి మూలమేమి? ఇట్లు

గోలబెట్టిననేమి ప్రయోజనము ? విద్య ఎందులకు వ్యాపించుటలేదు ? మన కవుసరము లేని ప్రదేశములలో సారాదుకాణము లేల యుండవలెను ? అటవీ శాఖలో రిజర్వు (ప్రత్యేక) అడవుల విషయమై, వివిధములగు చెట్లు, తరువుల విషయమై అనేక చట్టములు నిర్మింపబడినవి. అవి ఎందులకు నిర్మింపబడినవి ? ప్రస్తుతము వీనివిషయమై అనేక జాబితాలు దేశీయ మహాజనసభలో చర్చకు వచ్చుచున్నవి. మన కిష్టములేనిది మన పంచాయతీల నేల తీసివేసిరి ? కర్ణాటకములో నింతవర కొక్క కళాశాల యైనను లేకపోవుట కేమి కారణము ? వీని కన్నిటికి ఒక్కటే ప్రత్యుత్తర మియ్యవలసి యుండును. ప్రస్తుతము మన ఊహ లిట్లుండును — (ఎట్లు ?) కళాశాలలేదా ? సరే, కలెక్టరుకో, గవర్నర్ కో అర్జీ పంపుకొనుడి. ఆ కార్యము నెరవేర్చుటకు వారి కధికారము కలదు అని చెప్పరుము. ఈ అధికారము మన చేతులలోనికే వచ్చినయెడల ఆ యుద్యోగపదవులలో మనమే యుండియుండిన యెడల, వారి అధికారమంతయు ప్రజాభిప్రాయమునకు ఉత్తరవాదియైయుండిన యెడల, ఇట్టి స్థితి సంభవింపక పోయి యుండును గదా. పైదాని కింతకంటె ఎక్కువ సమాధానము చెప్పవీలులేదు. ఇట్టి స్థితి సంభవించుటకు కారణమేమి ? మన చేతులలో నధికారములేదు గనుక ఈ ఏర్పాటులన్నియు మన మేలుకొరకు చేయబడినవి; కాని వానిని ఎట్లు ఏర్పరచవలెనో నిర్ణయించుకొను అధికారము మన చేతులలో లేదు. కాబట్టి మన కోర్కెలన్నియు పసిపిల్లలు కోరు కోర్కెలగుచున్నవి. ఆకలి అయినప్పుడు శిశువు ఏడ్చును. కాని తనకు ఆకలి అగుచున్నదని పైకి చెప్పజాలదు. కాబట్టి శిశువేడ్చినప్పుడు దానికి ఆకలిఅయి ఏడ్చుచున్నదో లేక కడుపునొప్పివచ్చి ఏడ్చుచున్నదో తల్లి చూచుకొనవలసి వచ్చుచున్నది. ఒకప్పుడు రోగమొకటి అయిన తల్లివేసినమందు మరియొకటి అగుచున్నది. మన ప్రస్తుతస్థితి అట్లున్నది. మొట్ట మొదట మనకేమి కావలసియున్నదో మనకే తెలియదు. మనకున్న కష్ట మెక్కడనున్నదో మనకే తెలియదు. మన కష్టములు మనకు తెలిసినప్పుడు మనము నోరువిప్పి మాట్లాడ యత్నింతుము. కాని మన మాటల ప్రకారము కార్యము నడపింప గల యధికారము మన చేతులలో లేదు. అందు వలన మనస్థితి యేమైనది ? మనమేమి చేయదలచుకొనినను, మనకేమి కావలసి వచ్చినను — దొడ్డిలో బావిత్రవ్వించుకొనవలసివచ్చినను — కలెక్టరు దొరవారికి అర్జీపెట్టుకొనవలసివచ్చుచున్నది. అడవిలోనుండు పులిని చంపవలెనన్న కలెక్టరుగారితో మనవిచేసికొనవలెను. అడవులలో గడ్డి కోసుకొనుటకు వీలులేదు. కట్టె పుల్లలు కొట్టుకొనుటకు వీలులేదు. గడ్డి కోసికొనుటకు ఉత్తరువు గావలెను. కలెక్టరుగారికి అర్జీపెట్టుకొనవలెను. అనగా మనగతి దౌర్భాగ్యస్థితికి వచ్చినదని తేలుచున్నది. ఇట్టి యేర్పాటు మన కక్కరలేదు. దీనికంటె సత్తమ మగు యేర్పాటు కావలెను. ఇదియే స్వరాజ్యము. ఇదియే 'హోంరూలు'. మొదట నీ విషయము లన్నియు నెవరికిని తెలియవు. పసిబాలుడుగ నున్నప్పుడు యేమియును తెలియదుగదా. కొంచెము పెద్దవాడై వయస్సువచ్చిన తరువాత యిట్టి విషయములన్నియు గ్రహింప నారంభించును. అంతట గృహకృత్యములన్నియు కొంతవరకైనను తన యిష్టానుసార

ముగ కొనసాగుచుండిన బాగుండునని తలపోయ మొదలిడును. ఇట్లే ప్రతిమానవజాతి యును, దేశమును, తలపోయుచుండును. బుద్ధి తెలిసి, యీ విషయములనుగూర్చి యోచింప మొదలిడినప్పు డిట్టి సందేహము లన్నియు కలుగుట సహజము. యోచనా శక్తి కలిగిన పిమ్మట యిట్టి సందేహములు తప్పక కలుగును. ఈ విషయము లన్నియు నటుంచి ప్రస్తుతాంశమునకు వత్తము. నిర్గుణ ప్రభుత్వపుమాట ప్రస్తుతము వదలివేయు దము. సగుణ ప్రభుత్వమునుగూర్చి విచారించుదము. మన ప్రస్తుత రాజ్యపాలనను నడుపువా రంపరను సీమదేశమునుండి వచ్చుచున్నారు. అచ్చట నేర్పాటుగాబడిన కొన్ని నిబంధనల ననుసరించి మన దేశమునకు వచ్చుచున్నారు. ఇచ్చట గావింపబడు చట్టనిర్మాణమంతయు వారి రాజ్యపాలనా తంత్రమునకు లోబడి యుండునట్లుగా గావింపబడుచున్నది. ఈ చట్టములన్నియు మంచివి కావచ్చును, లేక చెడ్డవి కావ చ్చును. అవి మంచివి కావచ్చును, మంచిపద్ధతుల ననుసరించియే, మంచియేర్పాటుల ననుసరించియే నిర్మింపబడి యుండవచ్చును— కాదని నేనను. ఇతరులచే నేర్పఱుప బడిన పద్ధతు లెంత మంచివైనను, యీ ఏర్పాటులన్నియు తానే స్వయముగా చేసికొన వలెనని కోరువానికి, యివి అంతగా ఎల్లప్పుడును రుచించవు. స్వరాజ్య సూత్రమిదియే. కలెక్టరు నెన్నుకొనుట కధికారము మనకుండినను, మనచే నెన్నుకొనబడిన కలెక్టరు ప్రస్తుతమున్న కలెక్టరుకంటె ఎక్కువ పనిచేయునని చెప్పుటకు వీలులేదు. (నిశ్చయము లేదు). చేయక పోవునేమో యని కూడ చెప్పవచ్చును. ప్రస్తుతమున్న దానికంటె కూడ పాడుగ చేయవచ్చును; దీనిని కూడ ఒప్పుకొనెదను. కాని యీ కలెక్టరునకును, ఆ కలెక్టరునకును భేదముండును. ఈ కలెక్టరును మనము స్వంతముగ నేర్పరచు కున్నాము. ఈతడు మనవాడు. మనల నెట్లు సంతోష పెట్టవలయునో యని సదా యోచింపు చుండును. కాని సీమనుండి పంపబడిన కలెక్టరు ఏమను కొనును? "నే నేది మంచిదని యనుకొనెదనో అదియే యితరులకు కూడ మంచిదిగా కనుపడి తీరవలెను. నే నితరుల మాటలేల వినవలెను? నే నింత గొప్పచదువు చదువుకొని నాను, నాకింత గొప్పజీతము వచ్చుచున్నది. నాకంత శక్తి సామర్థ్యమున్నది. ఇత రులకు హానికలుగు పనుల నే నేల చేయుదును? (నే చేసిన దంతయు మంచిదే) యని (యహంభావముతో) వర్తించును. తనకింత శక్తిసామర్థ్యము, తెలివి తేటలున్నవను గర్వముచేతనే, అహంభావముచేతనే, ప్రజలకు హానికరమైన కార్యములు చేయుటకు కారణమగును. అట్టివానికి మనమేమి ప్రత్యుత్తరము చెప్పవలెను? "నీకింత స్వాతి శయ మేల యుండవలెను? నీకింత యహంభావ మేల యుండవలెను?" అని తిరిగి చెప్ప వలెను. ప్రస్తుతమున్న పరిపాలనా పద్ధతి బాగుగ లేదు; ఇది మాకు పనికిరాదు; దీని వలన మాకు ప్రయోజనములేదు; అని ప్రజలేల మొఱపెట్టుచున్నారు? ఎవరి కష్టనిష్టుర ములు వారికి తెలియునుగాని యితరుల కెట్లు తెలియును? ఎవరికడుపుమంట వానికే తెలియవలెను.

ఈ మొఱల కన్నిటికిని కారణమేమని విచారించి చూచినయెడల, ప్రస్తుత పరిపాలనా పద్ధతిలోని లోపములే యని తేలుచున్నది. ఆంగ్లేయ ప్రభుత్వము మనకక్కఱలేదనికాదు - చక్రవర్తి మనకక్కఱలేదని కాదు. ప్రస్తుత పాలనా పద్ధతిలో కొన్ని కొన్ని మార్పుజలలు చేయవలసినదని మేము కోరుచున్నాము. అట్లు చేసినయెడల ఆంగ్లేయ ప్రభుత్వమున కేవిధమైనహానియు కలుగనేరదని నా దృఢనమ్మకము. కాని యీ మార్పులనెల్ల గావించినయెడల బ్రిటిష్ ప్రభుత్వమునకు భంగము వాటిల్లునని కొందరు భయపడుచున్నారు. వీరి మనస్సులలో నీ భయమేల పుట్టవలెను? వీ రీమాటల నేల పలుకవలెను? ఇట్లు పలుకవలెనని వారి మనస్సులో నిశ్చయించుకున్నారు కనుక. (అనవలయునని అనుచున్నారే గాని వేరుకాదు.) వారు కండ్లకు పెట్టుకొనిన సులోచనములు వేరుగనుక, వారి కండ్ల కట్లు కనుబడుచున్నవని మన మనుకొనవచ్చును. ప్రస్తుతాధికారమును వహించియున్న ఆంగ్లేయ ప్రభుత్వములో నెట్టి మార్పులు గావింపవలసి యుండునని ప్రజలాలోచింప మొదలిడిరి. మన మడుగుచున్న వన్నియును చిన్న చిన్న కోర్కెలే. "ఘోడాగాఙ్"లో నున్న సారాదుకాణమును మూయించవలసినదని మన మెన్ని దినముల నుండియో ప్రార్థింపుచున్నాము. "ఆదుకాణమును మూయుటకు వీలులేద"ని గవర్నమెంటువారు జబాబు చెప్పుచున్నారు. ఆ విషయమంతటితో సరి. ఉప్పుమీదపన్ను తగ్గించవలసినదని మనము కోరుచున్నాము. "దానిమీద సాలుకువచ్చు రెవిన్యూను చూచుకొనవలెను. పన్నుతగ్గించినయెడల, ధనములేనియెడల, ప్రభుత్వమెట్లు సాగగలదు." అని వారు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు. నిజమే, రాజ్యపాలన కివియన్నియు అవుసరమే. రెవిన్యూకొరకును, పన్నులకొరకును, కూడ చూచుకొనవలసినదే. డబ్బు అక్కఱలేదని నేను చెప్పను. నా గృహకృత్యనిర్వహణాధికారము నా చేతులలోనే యుంచవలసినదని నేను కోరుచున్నాననగా నేమి యర్థము? వచ్చిన ఆదాయమంతయు నా చేతులలో వేసి ఒక దమ్మిడీయైనను ఖర్చుపెట్టవద్దనియా దానిభావము? అట్లెన్నడును కాదు. మనముకూడ డబ్బు ఖర్చుపెట్టవలసియుండును; అందులకై తగినంత ధనము పన్నులద్వారా ప్రజలవద్దనుండి వసూలుచేయవలసి యుండును. పన్నులు వేయుటకును, వానిద్వారా వచ్చిన ధనమును ఖర్చుపెట్టుటకును, యీరెండు పనులనుచేయుటకును అధికారము మాచేతులలోనే యుంచవలెను. ఈద్వంద్వాధికారమునే మాకుకావలయునని కోరుచున్నాము. ఈ యధికారమును మాకిచ్చిన పిమ్మట మేమేమి చేయవలసియుండునో ఆలోచించెదము. ఇప్పుడున్న చిక్కు అంతయు నిచ్చటనేయున్నది. "మాయిష్టప్రకారము నడుచుకొనుడని" సీమనుంచి వచ్చిన అధికారవర్గమువారును, "మా యిష్టప్రకారము నడుచుకొనుడి; అట్లయిన మా కష్టములెల్ల తొలగిపోవును" అని మన ప్రజలును వాదించుకొనుచున్నాము. చిన్నపిల్లవా డొకప్పుడు పెంకెతనముగ తండ్రిని 25 రూపాయలు వెలగల టోపీని కొనిపెట్టమని వేధించును. (ఇది మన కందరకు తెలిసిన సంగతియే.) ఆ కుఱ్ఱవాడే ఆ తండ్రి స్థితిలో నున్నట్లయిన, 25 రూపాయలు వెచ్చించి టోపీ కొనునా? కొనడా? యనునది సందేహాస్పదము. తండ్రి కొని

పెట్టడు. కాని కొంచముసేపు, ఆ బాలుడేడ్చును. ఆ బాలు డెందు కేడ్చును! వానికి దానిలో నుండు కష్టసుఖములు తెలియవు గనుక. ఆ యిల్లుదిద్దుకొను అధికారము, (చింత), బాధ్యత, వానిచేతిలోలేదు గనుక. కాబట్టి అట్టి అధికారమును మాకిచ్చుట హిందూదేశమునకు శ్రేయస్కరము. మే మిప్పుడు కోరునదిది. ఇది మా చేతులలోనికి వచ్చిన తక్కినవన్నియు తమంతట తామే మా చేతిలోనికి వచ్చిపడును. మే మిప్పుడు కోరు వేలకొలది కోరికలన్నియు దానిలోనున్నవి. వానికిదే మూలము. ఈ బీగము మా చేతిలోనికి వచ్చినయెడల, ఒకటిగాదు 10, 15 ద్వారముల నన్నిటిని ఒక్కమారే తెరచెదము. ప్రస్తుత విషయ మట్టిది. ప్రజలందరు తమదృష్టిని దీని వైపునకు మరలించి యీ విషయమును బాగుగ గ్రహించుటకే మొన్నటిదిన మిచ్చట "స్వరాజ్యసమితి" నొకదానిని నెలకొల్పినాము. ఇందులకై కొందరు దుఃఖింపవచ్చును. దుఃఖించువా రుండరని నే ననను. ప్రతివాడును దుఃఖించును. తండ్రి చనిపోవు కాలమునకు కుమారుడు మైనరుగ నుండినయెడల తండ్రిచనిపోవునపు డొక పంచాయితీ నేర్పరుచును. ఈ పంచాయితీ దారులు మైనరు ఆస్థికి సంబంధించిన వ్యవహారములన్నియు నెరవేర్చుచుందురు. దీనివలన కొంతలాభ మున్నదని కాని, లేదనికాని చెప్పుటకు వీలులేదు. ఆ బాలుడు పెద్దవాడు గా నారంభించిన తోడనే, పంచాయితీదారుల మేనేజిమెంటులో నేవియో దోషము లున్నవని కనిపెట్టును. "నా ఆస్థిని నిర్వహించుకొను హక్కులన్నియు నాకే రావలెను. అట్లయినయెడల, యిప్పటికంటె నే నెక్కువగ వ్యవహారములను నడుపుకొన గలను" అను గట్టినమ్మక మతనికి కలుగును. ఇంతకంటె ఎక్కువబాగుగ వ్యవహారములను నడుపునికాదు - దుర్వ్యయపరుడైన యెడల, తండ్రియాస్థినంత నొక్కతృటికాలములో ధ్వసంముచేసి పారవేసిన వేయవచ్చును. కాని వానియూహ లట్లుండును. కాబట్టి యీ రెంటికిని సంఘర్షణము కలుగకుండునట్లు కుఱ్ఱవాని కిరువదియొక్క సంవత్సరములు వచ్చినతోడనే పంచాయతీదారులు తమఅధికారమును వదలుకొని, ఆస్థినంతను, తత్సంబంధమైన అధికారమును, హక్కులను ఆ కుఱ్ఱవాని కిచ్చివేయుదురు. ఇది న్యాయశాస్త్రసమ్మతము. మనము చూచుచున్న యీ కార్యమే, జాతులకును, దేశములకునుకూడ వర్తించును. ప్రజలు విద్యావంతులై, తమకార్యముల నెట్లు చక్కబెట్టుకొనవలెనో బాగుగ తెలిసికొన్నప్పుడు, యితరుల చేత నిర్వహింపబడు కార్యము లన్నియు తామే నెఱవేర్పవలయునను ఊహజనించుట స్వభావసిద్ధము. ఈ రాజకీయవిషయములలోనుండు చిత్రమేమన, నిచ్చట 21 సంవత్సరముల నియామకము మాత్రము లేదు. నూరుసంవత్సరము లొక జాతివారికి విద్యాప్రదానము గావించిన పిమ్మట, రాజ్యపాలనాధికారము వారి చేతికిచ్చి వేయవలయునను నియామక మొకటి యున్నదని మన మనుకొందము. (బ్రిటిష్‌వారు మనలను 100 సంవత్సరములకు పైగా నేలుచున్నారు. మనలను తగినంత తరిఫియతు చేసినారు.) కాని యిప్పుడు రాజ్యపాలనాధికారమును మనచేతికి వప్పగింపవలసినదని వారినినిర్భంధపెట్టలేకున్నాము. ప్రజ లీకార్యమును నెరవేరునట్లు చేయించుకొనుటకు వారికి హక్కు గలదు. కాబట్టి అట్టియేర్పాటేదియో యొకటి యిచ్చటమనకుండి తీరవలెను. పూర్వ

కాలమం దీయేర్పాటులు కొద్దిగనో గొప్పగనో యిచ్చట నుండెడివి. కాని యిప్పు డట్టివేమియును లేవు. అందువలననే మన కిప్పుడిన్నికష్టములు కలుగుచున్నవి; యిన్ని చిక్కులు గలుగుచున్నవి. "మాకిది కావలెను. అది కావలెను." అని గోలపెట్టు చున్నాము. అందువలననే మనకీ ప్రభుత్వములో యిన్నిలోపములు, యిన్ని అసంద ర్భపుచిక్కులు, కనుపించుచున్నవి. దీని కిదియే మూలకారణము. వీనినన్నిటిని బాగుగ నాలోచించి కనిపెట్టిన మందొకటి కలదు. దానిపేరు స్వరాజ్యము. దానిపేరే హోం రూల్. మనయిల్లును దిద్దుకొను అధికారమును మన చేతులలోనే యుంచవలసినదని కోరుటయే స్వరాజ్యమును కోరుటయనబడును. దీనినిగూర్చి యనేకమంది యనేక యభ్యంతరములు చెప్పుచున్నారు. మీ కీవిషయములు బాగుగ తెలియుటకై స్వరాజ్య మననేమో ముందే చెప్పియుంటిని. కాని మన ప్రతివాదులు దీని కెల్లప్పుడును విపరీ తార్థములను కల్పించుచుందురు. నేచెప్పు సకారణమైన హేతువాదమునకు కొంతవరకు విపరీతార్థమును తీసిననే తప్ప, లేనియెడల దీనిలో దోషమేమియు కన్పింపదు. నేచెప్పు దానిలో దోషములను కనిపెట్టవలయు నన్న నా వాక్యములకు కొంతవరకు విపరీతార్థ మును లాగవలెనే గాని, వేఱువిధముగ నెట్లు సాధ్యమగును? కాబట్టి తప్పు లెన్ను వారు, నే చెప్పిన వాక్యములకు విపరీతార్థములను కల్పించి "ఇదిగో! నిచ్చట నీ దోష మున్నది," "ఇదిగో! అచ్చట నీ దోషమున్నది" అని వ్రేలువెట్టి చూపుచున్నారను మాట సత్యము. మన మెన్న డెఱుగని దోషములను మనయం దారోపించి మనలను క్రూర పరిశోధన గావించి ప్రజల యెదుట మనల నవమాన పరుపజూచుట సత్పురుష లక్షణము కాదు. ఇంతకంటె నే చెప్పవలసిన దేమున్నది. (నవ్వు) కాబట్టి మీలో నెవరికైన అట్టి దుర్భ్రమ లున్నయెడల వానిని వెంటనే తొలగించుకొనుడు. నేచెప్పు దానిలో నేవిధమైన అసందర్భములు లేవనియైన గ్రహింపుడి. స్వవచన వ్యాఘాతము లేదు. ఒకదానికిని మఱొకదానికిని పెడార్థకల్పన లేదు. నే జెప్పునది తర్కశాస్త్రాను సారముగ నున్నది; లోకచరిత్రాను కూలముగనున్నది. రాజనగా నిర్గుణస్వరూపుడ నియు, నిర్గుణాధికారమనియు చెప్పియున్నాను. దీనిలోదోష మేమియునులేదు. మధ్యదేవత లనేకులున్నారు. సాధారణముగ దేవునకు తరుచు కోపమురాదు. (తరుచు రుద్రాకారుడు కాడు.) మధ్యనుండు యీ దేవతల కకారణముగ తరుచుకోపము వచ్చుచుండును. వీనిని గూర్చి కొన్ని నూతన యేర్పాటులు గావింపవలసి యున్నది. ఈ విషయములో ఎవరికైన దురూహ లున్నయెడల నవి వెంటనే తొలగిపోవలెను. అవి తొలగిపోవు నిమిత్తమే నే నిప్పు డీవిషయము లన్నియు మీకు తెలియ జెప్పు చున్నాను. మీ కివన్నియు విప్పిచెప్పుచున్నాను. దీనియొక్క స్వభావమును మీకి ప్పుడు చెప్పెదను. దీనికి ముందు మనము యధికార నిర్వహణమునకు తగుదుమా, తగమా యని కొంచెమాలోచించుకొందము. ఇదివరకు "పంచాయతీదార్లు, మైనరును" గూర్చి చెప్పియుంటిని. మైనరు పెద్దవా డగుచున్న కొలది, తమ చేతులలోనుండి అధికారమంతయు పోవునను ఉద్దేశముతో, ఆ పంచాయితీ దార్లందరు మైనరును గూర్చి అపవాదములు వ్యాపింపజేయుదురు. యిది సాధారణముగ జరుగు సంగతి.

ఒకడు "వాని తలతిరిగిపోయిన దని"యు, యింకొకడు "వీనికి పూర్ణముగ పిచ్చి యెక్కలేదు. సగము పిచ్చిఎత్తినట్లుగా నున్నదని"యు యీ విధముగ ననేకములు బయలుదేరును. దీనికంతటికి కారణమేమి? ఈ అధికారమంతయు తమచేతులలో నింకొక రెండుసంవత్సరములపాటు ఉండునుగదా యని. మూడవవాడు "నిజమే, అధికార మతని కిచ్చివేయ వచ్చును గాని వానికి కొన్ని దురభ్యాసము లున్నవట, మీకేమైనా తెలియునా?" యని యనును. ఈ పంచాయితీ దారులందరు వానిని గూర్చి ఇట్టివి ఎన్నోసంగతులు చెప్పెదరు. దీనివలన గలుగు లాభమేమి? వీరందరు కలిసి కోర్టున కెక్కుదురు. నిజముగ వీనికి పిచ్చిపట్టినదని కోర్టులో తీర్మానించెదరు. ఇట్టి సంగతులు ప్రస్తుత మిచ్చట జరుగ నారంభించినవి. అధికార మంతయు ప్రజల చేతులలో బెట్టుట ఉత్తమోత్తమము. దీనిని కాదనువా రుండరు. ఎందుకనగా మన అధికారుల దేశములో ప్రజాస్వాతంత్ర్యమే యున్నది గనుక. తమ సీమదేశమునకు పోయినపుడు వా రచ్చటివారికి బోధించునది యీ తత్వమే. (ప్రజాస్వాతంత్ర్యతత్వమే) ఈ చరిత్రాత్మకతత్వము దోషమని ఎవరును చెప్పరు. ఇకదోషము దేనిలో నున్నది? హిందూదేశ ప్రజ లీదినమున స్వరాజ్యమునకు తగరని వారు స్పష్టముగ చెప్పుచున్నారు. పంచతంత్రములో చెప్పబడిన ముగ్గురు ధూర్తుల కథలోని దొంగల [ధూర్తుల] వలె మనలో కొందరిప్పుడున్నారు. ఆ కథ యేమనగా; "ఒక పల్లెటూరికాపు ఒక గొర్రెను నెత్తిమీద పెట్టుకొని, మోసికొనిపోవుచుండెను. ఒక దొంగ (ధూర్తుడు) వానిని చూచి "అబ్బీ! నీ నెత్తిమీద ఆడగొర్రెవున్నదే" అనెను; ఇంకొకడు "నీ నెత్తిమీద కుక్కయున్నదే" యనెను. ఇంకొక డేదో మరొకటి యున్నదే యనెను. అంతట వాడాగొర్రెను క్రిందపారవేసి పారిపోయెను. ఆధూర్తులాగొర్రెను తీసుకొని వెడలిపోయిరి. మనస్థితి యిప్పు డిట్లున్నది. ఆ కాపువాని గతియే మనకును పట్టినది. ఎల్లపుడును ఒకనికి వంగి, శాశ్వతముగ బానిసత్వములో (గులాంగిరిలో)నుండుట మానవ ప్రకృతి కెంతయు విరుద్ధము. మనము స్వరాజ్యమున కెందులకు అర్హులముకాము? స్వరాజ్యమును చేయుటకును, దానిలో తరిఫీయతగుటకును మా కెట్టియవకాశ మీయకుండ "మీరు చేతగాద"ని మమ్ములను నిందించిన నేమిలాభము? మాకుగాని, మా తాతతండ్రులకుగాని, మీ రెప్పుడును స్వరాజ్యమును చేయుటకు అవకాశ మిచ్చియుండలేదు. చట్టనిర్మాణసభలో నూరక శుష్కవాగ్వాదము చేయుచుచర్చించు నవకాశము తప్ప మీకు మాకు పూర్ణస్వరాజ్యాధికారమును ఎన్నడును యిచ్చియుండలేదు. సర్ యస్. పి. సింహా, చౌబల్ మొదలగు బహుకొద్దిమంది మాత్రము ప్రభుత్వము వారి కార్యనిర్వాహక సంఘ సభ్యులుగ గవర్నమెంటువారిచే నియమింపబడిరి. వీరికీయధికారపదవు లిచ్చునప్పుడు ప్రజలెవరైనను "మా ప్రజలు యీ యుద్యోగములకు తగరు. యీ యుద్యోగములు మాకివ్వవద్దు" అని చెప్పిరా? అట్లెవరును చెప్పియుండలేదే దాని నిప్పుడు చెప్పిన నేమిప్రయోజనము? "మీకుచేతగాదు, మీరుతగరు" అని పదేపదే వాదించిన ప్రయోజనమేమి? అధికారవర్గము వా రెప్పుడైన మీకు గొప్పగొప్ప అధికారపదవులను ప్రసాదింపవచ్చినప్పుడు "అవి మాకక్కరలేదు. మేము

వానికి తగము" అని ఎవరైన లేచి నిలువబడి చెప్పుదురా ? అట్లు మీరు చెప్పినప్పుడే "మేము స్వరాజ్యమునకు తగము, మేము అర్హులము కాము యీ యధికారవర్గము వారే మమ్మేలవలెను" అని మీరు చెప్పిన వాక్యములు మీరు నిజముగ చెప్పిరని నేను నమ్మెదను. అప్పుడే మీ వాక్యములు సత్యములని నమ్మెదను (గాని అంతవరకును నమ్మజాలను) ఎవరో, ఏవియో కారణములు చెప్పినారనియు, ఎవరికో యిష్టము లేదనియు ఇతరుల యెవరి మెప్పునో పొందగోరి చెప్పు నీ మాటలవలన నేమిప్రయోజనము ? ఇట్టి వాక్యములు చెప్పువారు కేవలము తమ హృదయ దౌర్బల్యమును వెలిబుచ్చుకొనుచున్నారని నాతాత్పర్యము. మనమేలతగము ? మనకు ముక్కు లేదా ? చెవులులేవా ? తెలివిలేదా ? మనము గ్రంథములు చదువలేమా ? మనము గుర్రపుస్వారి చేయలేమా ? మనమెందుకుతగము ? మనకేమిలేదంట ! షేక్స్పియరు మహాకవి నాటకములో "షైలాకు" చెప్పినట్లుగ "మనకేమిలేదు ? మనకేమి తక్కువ ?" యని మిమ్ముల నడుగుచున్నాను. "మీ కేమియు చేతకాదు మీరెప్పుడేపనిచేసియుండలేదు" అని అధికారవర్గమువారు మమ్ముల ననుచున్నారు. మనకు పనియిచ్చిన దెప్పుడు ? మనము చేయనిదెప్పుడు ? మన కేదైన పని నిచ్చినప్పుడు మనము తెలివితేటలతో దానిని నిర్వర్తించి యుండలేదా ? మనకు పని యిచ్చినప్పుడు "మేము తగము, మా కాయుద్యోగమివ్వవద్దు" అని యెవరును చెప్పియుండలేదే. ఇట్టి స్థితిలో మేమసమర్థులమని మీరెట్లు చెప్పగలరు ? మీరు మా కెట్టి గొప్ప జవాబు దారీగల పనుల నివ్వరు. ఈ గొప్పపనులకు విదేశస్థుల నెవరినో నియమించెదరు. విదేశస్థులచేత ఆ పనులను చేయించుకొని "అచ్ఛా ! బహెత్ ! ఈతడు బహుబాగుగ పనిచేసినాడు" అని గెజెట్టులలో ప్రచురించి చాటించి మెచ్చుకొనెదరు. అదిగాక సీమదేశములనుండి 21 సంవత్సరముల వయస్సుగల క్రొత్తచిన్న కుర్రవాని నొకని తీసికొనివచ్చి, వానికిచ్చట గొప్ప యుద్యోగపదవి నిచ్చెదరు. అత డేమిచేయగలడు ? వానికేమైన ప్రపంచానుభవముండునా ? అతడు సరాసరి రావడముతోడనే "అసిస్టాంటుకలెక్టరు దొరవారు"గా వచ్చి యధికారము వహించును. వెంటనే 60 సంవత్సరముల వయస్సుగల మమ్లత్‌దారునకు పైయధికారియగును. కలెక్టరునకు 21 సంవత్సరములేయుండును. 60 సంవత్సరములు పనిచేసి మంచిలోకానుభవమును గలిగిన మమ్లత్ దారుని యందేమియును విలువలేదా ? 60 సంవత్సరముల యనుభవమున కేమియు విలువలేదా ? 21 సంవత్సరముల కుర్రవాడు వచ్చి మనకు నీతులు బోధింప మొదలిడును. అతడు 60 సంవత్సరముల మమ్లత్‌దారుని తన యెదుట నిలుచుండ బెట్టును. కూర్చుండుట కొక కుర్చీయైన నివ్వడు. పాప మీ ముదుసలి మమ్లత్ దారుడు తన యెదుట చేతులు కట్టుకొని నిలువబడవలసినదే ! ఎందువలన ? అట్లు నిలువబడనియెడల యీ మమ్లత్‌దారునకు నెలకు 200,400 జీత మెట్లువచ్చును ? ఈ దొరకు ప్రపంచానుభవమెట్లు కలుగ గలదు ? అత డీపని నిర్వహించుట కెట్లు సమర్థుడగును ? బండి సాగుట యెట్లు ? దీనినిగూర్చి యెవరైన నాలోచించినారా ? భారతీయులు స్వరాజ్యపాలనకు అర్హులుకారనుమాట సత్యమే యైనయెడల, తమ పనులను తాము నిర్వహించుకొన

లేరనుమాట సత్యమేయైన యెడల, పూర్వకాలమున హిందూమహమ్మదీయ ప్రభువులు గొప్పగొప్ప సామ్రాజ్యముల నెట్లు స్థాపించి పరిపాలింప గలిగిరి? మనకును సామ్రాజ్యము లుండెను. రాజ్యపరిపాలనా నిర్వాహకులుండిరి. దీనికొక నిదర్శనము జూడుడు. ఆంగ్లేయ ప్రభుత్వము రాకముందిచ్చట కొన్ని రాజ్యములైనను నుండియున్నవి. దేశములో ప్రతిచోటను అల్లకల్లోలములేదు. ఒకరి తల లొకరు పగులగొట్టుకొనుట లేదు. అట్టి సందర్భములలో మన ప్రజలిప్పుడు తగరనుట యేటిమాట? వర్తమాన కాలమున ప్రకృతిశాస్త్రము లభివృద్ధినొందినవి విజ్ఞానము ప్రబలినది. కాబట్టి పూర్వమునకంటె మనకిప్పు డెక్కువ స్వాతంత్ర్యముండవలెను. పూర్వమునకంటె మనమిప్పుడు అర్హతర ప్రజలమైతిమి. కాని మన మింకను అసమర్థులమనియే వా రనుకొనుచున్నారు. పూర్వమెట్టి పరిస్థితులున్నను, యిప్పుడిట్టి నిందారోపణము అసత్యము. దీనికంటె "మేము మీకు స్వరాజ్యము యివ్వము, యివ్వదలచు కొనలేదు" అని చెప్పిన బాగుండును. అంతియేగాని ఊరక "మీరు అసమర్థులు, మీచేతగాదు" అని మమ్ములను నిందింపకుడు. "అసమర్థులము" అను పదమును మాకంట గట్టకుడు. "మీకు స్వరాజ్యమివ్వము" అని ఒకపర్యాయమే ఖండితముగ జెప్పినట్లయిన, మాకు కూడ సులభమే. ఇది మాకు వారు నిజముగ యిచ్చునదికాదు అని యైన తెలిసికొనెదము. మే మే సంపాదించుకొనెదము. కాని మనకు స్వరాజ్యమెందుకురాదు? "మీరు తగర"ని యేవో కొన్నిమాట లూరక పలుకుచున్నారు. మీ రిచ్చటికి మాకు రాజనీతి బోధింప వచ్చితిరని మే మొప్పుకొనుచున్నాము. కాని యెంతకాలము మాకు బోధించెదరు? ఒకతరమా! రెండుతరములా! మూడుతరములా! దీనికేమైన యంతమున్నదా? అవసానమువరకు యీ విధముగ బానిసలవలె (గులాములవలె) మీ క్రింద సేవచేయవలసినదేనా? ఏదో కాల నియామక మేర్పరచుడి. మీరు మాకు బోధింపవచ్చితిరిగద. మన కుర్రవాని కింటివద్ద పాఠములు చెప్పుట కుపాధ్యాయు నొకని యేర్పరచుకొందుమనుకొనుడు. అతని నేర్పరచుకొనుటకు ముందు అతనిని "ఎన్నిదినములలో నీవీపాఠములను నేర్పుదువు?" అని యడుగుదుము, "10 సంవత్సరములా? 20 సంవత్సరములా? 25 సంవత్సరములా? రెండునెలలలోనా? నాలుగు నెలలలోనా" ఆరు నెలలలో పూర్తి కాగలదని మన మనుకొనిన చదువునకు అతడు ఒకసంవత్సరకాలము పట్టునని ప్రత్యుత్తర మిచ్చిన యెడల మన మతనితో నేమి చెప్పుదుము? "నీవు పనికిరావు; వెళ్ళిపో! మేమింకొకయుపాధ్యాయుని యేర్పరచుకొందుము" అని వానిని సాగనంపుదుముగద. ప్రజలకు స్వరాజ్యవిద్య నేర్పుట కూడ నిట్టిదే. ప్రజలకు విద్య గరపవలసిన భారము అధికారవర్గము వారి మీద గలదు. ఇట్లాచరించుట వారి ధర్మము. ఈవిషయమును వారుకూడ ఒప్పుకొనియే యున్నారు. కాని యీ ధర్మమును వారు సక్రమముగ నెఱవేర్చియుండలేదు. అట్లు నెఱవేర్పక పోగా "మనకెంత నేర్పినను మనకు స్వరాజ్యము చేయుట చేతగానే గాదని" వారానిందను మనమీదనే త్రోసివేయుచున్నారు. మన ప్రజలు స్వరాజ్యముచేయ నర్హులగుదు రనుమాట కలలోని మాటయగుట. ఇట్టి యాభ్యంతరములను (ఇట్టి వంకలను)

యిట్టి సాకులను చెప్పువారు కేవలము స్వార్థపరాయణులని జెప్పిన దోషమేమియును లేదు. (ఇట్లు చెప్పువా రందరును తప్పక స్వార్థపరులే యనుమాట సత్యము) ఎందు కనగ, భారతీయులమైన మేము మీ యాంగ్లేయుల బోటివారమే, మీకున్న తెలివి తేటలే మాకు నున్నవి. మాకు గొప్ప ఉద్యోగములిచ్చి మాచేత నౌకరీచేయించుకొనుట లేదా ? మే మా పెద్ద యుద్యోగములను చేయుటకు సమర్థులమై యుండుటలేదా ? గనుక మే మసమర్థులమని మీ రెట్లు చెప్పగలరు ?

ఇప్పుడు స్వదేశ సంస్థానములలో రాజ్యపాలన యెట్లు నడచుచున్నది? ఖాల్సా పరగణాలలో నేమి జరుగుచున్నది ? అచ్చటి రాజ్యవ్యవహారములు యే విధమైన చిక్కులేకుండ సక్రమముగ నడచుటలేదా ? రాజ్యవ్యవహారములు సాగకుండ నట్లే నిలిచిపోయినవా ? మైసూరు రాజ్యములో పరిపాలన సక్రమముగ సాగకుండ నిలచి పోయినదా ? మైసూరులో రాజ్యమును నడపువారెవరు ? మైసూరు మహారాజు భారతీయుడు: మంత్రి భారతీయుడు; పౌరులందరు భారతీయులు; చిన్న చిన్న యుద్యోగస్థు లందరును భారతీయులే; వీరు మైసూరువంటి గొప్ప రాజ్య చక్రమును త్రిప్పుచున్నారు. కాని మైసూరు రాజ్యపు పొలిమేర దాటి రాగనే, ప్రజలు రాజ్య కార్యముల నిర్వహింపలేరని, అధికారవర్గము వారు వాకొనుచున్నారు. మైసూరులో ప్రజలు రాజ్యమేలగలిగినప్పుడు,ఆరాజ్యపు పొలిమేరను ఆనుకొనియున్న దేశప్రజ లేల రాజ్యముచేయులేరో (తెలియరాకున్నది.) మైసూరులో ఆరుజిల్లా లున్నవి. కాబట్టి వారు చెప్పుదానినిబట్టి మన మేమనుకొనవలెను ?మైసూరులోఆరు జిల్లాలున్నవి గనుక మైసూరువారు స్వరాజ్యమున కర్హులు. మనదేశములో ఎనిమిది జిల్లాలున్నవి. గనుక మనము స్వరాజ్యమునకు కర్హులము కాము ? (నవ్వు) సమర్థత, అర్హత, మనలో నున్నవనుమాట నిస్సందేహము ఇది నిర్వివాదాంశము. దీనిని మీరు ఒప్పుకొనిన ఒప్పు కొనవచ్చును; లేనియెడల లేకపోవచ్చును. ఏకారణముల చేతనైన మీరు ఒప్పుకొనక పోదురుగాక. ఏది ఎట్లున్నను మేము సమర్థులమనుమాట సత్యము. మనలో సమర్థత యున్నదనుట కే నిదర్శనము గలదు ? (అని మీరడుగ వచ్చును.) స్వదేశసంస్థా నములలో రాజ్యపాలన చక్కగ జరుగుచున్నదని మీకుజూపియుంటిని. ఇదియొక నిదర్శనము, ఇదియొక ప్రమాణము. మరియింకొక ప్రమాణము జూపెదను. సరే, మీరు 10 సంవత్సరములపాటు రాజ్యమును మాచేతులలోపెట్టి, మీ రావల నుండుడు. మేము రాజ్యము చేయగలమో, లేమో, చూచుకొనుడు. (చప్పట్లు) లపది సంవత్స రముల కాలములో మేము నిర్వహింప లేనియెడల తిరిగి యధికారమును మీక్రిందికి తీసికొనుడు. మీరట్లు చేయుటకేమియు నభ్యంతర ముండదు. మీ రీ పనిచేయ కుండ, మమ్ములను "అసమర్థులమ"ని యేల నిందించెదరు ? మనకు స్వరాజ్యములేదు; మనకు స్వరాజ్యము లేదనిన అర్థమేమి ? మన మేమి కోరుచున్నాము ? ఆంగ్లేయ ప్రభుత్వమును తెరిమివేయుడని కోరుచున్నామా ? ఇది చక్రవర్తికి వర్తింపదు. ఇచ్చట రాజ్యాధికారమంతయు యూరపియన్ సివిల్ వుద్యోగస్థుడు చెలాయించుచుండిన నేమి ? మన బెల్వీసాహెబు చెలాయించుచుండిన నేమి ? దీనివలన చక్రవర్తి కేమి

నష్టమువచ్చును ? దీనివలన చక్రవర్తిగారికిగాని, సామ్రాజ్యమునకుగాని, యేమైన నష్టమువచ్చునా ? ఆంగ్లేయాధికారముండియేతీరును. చక్రవర్తియుండనే యుండును. కాని ఇదివరకున్న తెల్లవుద్యోగస్థుడుపోయి, నల్లవుద్యోగస్థుడువచ్చును. మన కోర్కెలకు చక్రవర్తి యభ్యంతరము చెప్పుటలేదు; కనుక నిక నీ యభ్యంతర మెచ్చటనుండి వచ్చుచున్నది ? ప్రస్తుత మధికారపదవుల నధిష్ఠించియున్నవారి వద్దనుండి వచ్చుచున్నది. చక్రవర్తి వద్దనుండి వచ్చుటలేదు. దీనిలో అరాచకమున్నదనిగాని, రాజద్రోహమున్నదనిగాని చక్రవర్తి యెన్నడును తలంపడు. రాజద్రోహమన నేమి? రాజును నిరసించుట లేక అసహ్యించుకొనుట. "రాజు" అనగా పోలీసుబంట్రోతా? ఈ భేదమును బాగుగ గమనింపుడని యిదివరకే చెప్పియుంటిని. "ఆ పోలీసు బంట్రోతును తీసివేయ వలసినది" మనము కోరినయెడల నది రాజద్రోహమగునా ? పాపము ! అది రాజద్రోహమని పోలీసువారి నమ్మకము. ఈ విధముగనే, యింక కొంచెము కొంచెముగ పైకిబోయి చూచినయెడల, మనము కోరు కోర్కెలన్నియు సరియైనవనియు, క్రమమైనవనియు, న్యాయ సమ్మతమైనవనియు, మానవ స్వభావాను కూలమైన వనియు బోధపడగలదు. ప్రపంచములోనుండు యితర జాతులన్నియు నీ విధముగనే స్వరాజ్యమునకై కృషిసలిపినవి. మనము వెనుకబడియున్నాము. స్వరాజ్యము, స్వరాజ్యమనగ నేమి ? ఆంగ్లేయ ప్రభుత్వ మక్కరలేదని కాదు; అది ఎంతమాత్రమును కాదు. ఆ మాటను కలలోనైన తలంపవద్దు. మన నిజోద్దేశములకు విపరీతార్థముల నెవరైన గల్పించినయెడల, అట్టివారు తప్పక స్వార్థపరులని (అనగా తమ మేలును తాము చూచుకొనువారు) గ్రహించునది. మన యభివృద్ధిని ఆటంకపరచి, మనలను ముందునకు పోనీకుండ చేయవలయునని తలంచువారే, మన మాటల కిట్టి విపరీతార్థములను కల్పించుచుందురు. అట్టివారి మాటలనువిని మోసపోకుడు. మనముకూడ మనుష్యులమే యను నమ్మకము మీకున్నదిగద; సరే! ఆ నమ్మకము మీకున్నయెడల, మీరు సీమకువెళ్ళి (ఐ. సి. యస్.) కలెక్టరు పరీక్షకు చదివి అచ్చట పరీక్షనిచ్చి చూడుడు. ఆపరీక్షకు వచ్చిన వారందరిలో మీరే ఎక్కువ బాగుగ పరీక్షనిచ్చి. మీరే పై మొదటి తరగతిలో ప్యాసగుదురు. మీరె పైచేయిగా నుందురు. కనుక దీనివలన నేమితేలుచున్నది? మీరు మంచికుశాగ్రబుద్ధులనియు, మేధాసంపన్నులనియు మంచి మనోవికాసము గల వారనియు తేలుచున్నది. ఈవిషయమై ఆంగ్లేయులు కూడ ఒప్పుకొనియే యున్నారు. కాని ఆ యాంగ్లేయులలో నున్న మనో నిబ్బరము, ధైర్యము, సుశీలము, ఏకజాతీయ స్వత్వము (National Character) మొదలగు లక్షణములు మనలో లేవట. కొంచెము సేపు, ఒక ఘడియసేపు, ఆసుగుణములు మనలో లేవనియే యొప్పుకొందము, కాని అవకాశము లున్నయెడల మన మాసుగుణములు నలవరచు కొనజాలమా? ఆ సుగుణములను మనలో పెంపొందించు కొనలేమా? ఆ జన్మాంత మెల్లప్పుడును శ్వవృత్తి నవలంబించి, సేవకావృత్తిలోపడి, ఒకరిక్రింద దాస్యముచేయుచునే ఘటయాత్ర సలుపు వానికి సుగుణము లెట్లబ్బును? 25,30, సంవత్సరములు గుమాస్తాపనిచేసి, ఎల్లప్పుడును దొరగారి ఆర్డర్లు వ్రాయుచు, ఆయనచేత క్రిందదస్కతు చేయించు కొనుచు, ఆయన

క్రింద సేవజేసిన వానికి మొదట నీ స్వరాజ్య కార్యములను తనంతటతానే నిర్వహింపవలెనని కొంచెము కష్టముగనే తోచవచ్చును, ఇదినిజమే. కాని యిప్పుడున్న యీపరిపాలనా పద్ధతి యంతయును మారి, పరిస్థితులు మార్పుచెంది నప్పుడు, మన ప్రజలా సుగుణములను అలవరుచు కొనలేరా? ఒక తరము గాక పోయిన మరియొక తరమువారైనను, స్వరాజ్యార్హతను సంపాదించు కొనలేరా? సంపాదించు కొనలేరని చెప్పుటకు వీలులేదు. మనకేమి కావలయునో, మన మేమి కోరవలయునో, యీ రెండు విషయములను గూర్చి, రెండుమాటలు చెప్పి యింతటితో నా యుపన్యాసమును ముగించెదను!

ప్రస్తుతము భారతవర్ష పరిపాలన యంతయు నే విధముగ జరుగుచున్నదో మీకు తెలిసియే యున్నది. ఏవియో కొన్ని నిబంధనలు, చట్టములు, (రూల్సు) ననుసరించి యీ పరిపాలన నడచుచున్నది. వీని నన్నిటిని ఒక్కసారియే శాశ్వతముగ నేర్పాటు గావించిరి. సీమలో నుండు మనమంత్రి, అనగా ఇండియా శెక్రటరీయొక్క అధికారమేమి? వైస్రాయికుండు అధికారమేమి? గవర్నరునకుండు అధికారమేమి! తక్కిన అధికారులమాట ప్రస్తుతము వదలివేసి యీ ముగ్గురకుండు అధికారములనుగూర్చి విచారించుదము. ఇండియామంత్రి సీమలోనుండును; వైస్రాయి ఢిల్లీలో నుండును: అతని క్రింద ఒక్కొక్క రాష్ట్రమున నొక్కొక్క గవర్నరుండును! రాజ్యాధికారమంతయు ముఖ్యముగ నీ మూడుభాగములుగ విభజింపబడి యున్నది. ఒక్కొక్కదానినిగూర్చి ప్రత్యేకముగ విచారించుదము. సీమలో మంత్రిని (శెక్రటరీని) యేర్పరచిన దెవరు? మనము కాదు. ఈపద్ధతి పూర్వము ఈస్టుఇండియా కంపెనీవారి పరిపాలనాపద్ధతి ననుసరించియే యేర్పరుపబడినది. కుంపిణీవారి కాలములో నిచ్చట రాజ్య వ్యవహారములన్నియు వాణిజ్య, వ్యాపార సూత్రములను, (అనగా వణిక్తత్వమును=*Commercial Policy*) అనుసరించి జరుగుచుండెడివి. వారి యాలోచనయంతయు "కుంపిణీ భాగస్వాములకు కావలసినంత లాభ మెట్లు వచ్చునా?" యను దాని వైపునకే ప్రసరింపుచుండెడిది. (ఇండియామీద లాభము తీయుటయే వారి పని.) కుంపిణీ డైరక్టర్లు ఇప్పుడున్న శెక్రటరీస్థానమున నుండెడివారు. పూర్వ మిండియానంతను పరిపాలించుటకై కుంపిణీవారికి కంట్రాక్టు యిచ్చివేసినారని మన మనుకొనవచ్చును. ఇది యొకవిధమైన కంట్రాక్టుపద్ధతి. (బిల్మక్తా పద్ధతి) పీష్వాలపాలనలో మమ్లత్ దారు ఉద్యోగములు కంట్రాక్టుపద్ధతిమీదనే ఇచ్చుచుండెడివారు. కుంపిణీవారి కాలములో మన హిందూదేశ పరిపాలనయంతయు నొకవిధమైన వర్తక వ్యాపారముగ నుండెడిది; కుంపిణీవారే వర్తకులు. అప్పటి గవర్నమెంటు చట్టముల ననుసరించి యిదంతయు వర్తక వ్యాపారముగనే యెంచుకొనబడుచుండెను. ఇందువలన వారికి వీలయినంత లాభమును రాబట్టుకొనుచుండిరి. కుంపిణీ డైరక్టర్లు సీమలో నుందురు. కుంపిణీ భాగస్వాముల కందరకును వీలయినంత ఎక్కువ లాభము రావలయునని వారి కోరిక; ఏటేటా "ఈ సంవత్సరము మాకింత లాభము కావలసి యున్నది- ఏదోవిధముగ ఇండియామీద యీ లాభమును తీసి మాకు

తప్పక పంపించవలసినది.'' అని డైరక్టరులవద్దనుండి యిచ్చటి గవర్నర్ జనరల్‌కు ఉత్తరములు వచ్చుచుండెడివి. వారి రాజ్యపద్ధతి యిది! ప్రజల మేలు చూడవలసిన పనిలేదు ఇదంతయు ''గొల్లవాడు-ఆవులు,'' కథలాగు నున్నది. ఆవులు పాలివ్వనియెడల నీళ్ళతో నింపి కుండలు తీసుకొనిరా యని చెప్పినట్లున్నది. పూర్వము మనదేశ పరిపాలన యంతయు నీ విధముగ నుండెడిది. పిమ్మట దీనినిగూర్చి పలువురు చర్చింప మొదలిడిరి. ఇదేమియు ఎంతమాత్రమును బాగుగ నుండలేదని తీర్మానించిరి. (ఈ పద్ధతి నంతను మార్చి బాగుపరుపవలయునను తలంపుతో) నీ పరిపాలనా భారమునంతను విక్టోరియారాణి, అనగా పార్లమెంటువారు, తమ చేతులలోనికి తీసికొనిరి. కుంపిణీవారి వద్దనుండి తమ చేతులలోనికి యీ రాజ్యభారమును తీసికొనిన కాలములో ''కుంపిణీ పరిపాలనయేమియు బాగుండలేదని'' పార్లమెంటువారు కుంపిణీపాలనను నిందించిరి. కాని పార్లమెంటు వారు రాజ్యభారమును వహించి నప్పటికిని, పూర్వము కుంపిణీవారి పద్ధతియే యిప్పుడు కూడ నిలిచియున్నది. రాజ్యపాలనా పద్ధతిలో నేమి, యుద్యోగము లిచ్చు పద్ధతిలో నేమి అంతయును పూర్వము కుంపిణీవారి యేలుబడిలోని పద్ధతులే యిప్పుడుకూడ నిలిచియున్నవి. కుంపిణీవారి వర్తక వ్యాపార సూత్రములను, వణిక్తత్త్వమును, అనుసరించియే యిచ్చట ప్రజాపాలన కవుసరములయిన చట్టములనెల్ల నిర్మించిరి. పూర్వపుపద్ధతియే యిప్పుడును నిలిచియున్నది. మన పరిపాలన యంతయు నిజముగ మన చక్రవర్తి చేతులలోనికే పోయినట్టయిన యీ కుంపిణీ రాజ్యపద్ధతి తప్పక అంతరించియుండ వలసినది. మనకు చక్రవర్తి కలడు. మనము ఆ చక్రవర్తి ప్రజలము. ప్రజల కోర్కెల కనుగుణ్యముగ, ప్రజానురంజకముగ, రాజ్యపాలన గావించుట రాజునకు ధర్మమై యున్నది. ఈ ధర్మము ననుసరించియే శాసనములను, చట్టములను నిర్మించి తగు యేర్పాటుల గావింపవలెను. కాని ప్రస్తుతపద్ధతి యీ ధర్మసూత్రానుగుణ్యముగ లేదు. పూర్వపు కుంపిణీపద్ధతియే యిప్పుడును నడచుచున్నది; పూర్వమున్న డైరక్టరులకు బదులుగ నిప్పుడు శెక్రటరీ వచ్చినాడు. పూర్వపు గవర్నరు స్థానమున నిప్పుడు వైస్రాయియున్నాడు. కనుక యిప్పుడు వచ్చిన క్రొత్తమార్పేమి? రాణీ రాజ్యాధికారమును తనచేతులలోనికి తీసికొనినది; కాని ఉద్యోగులను నియమించుటలో పూర్వపు పద్ధతియే నిలిచియున్నది. ఇది 1858 సంవత్సరములో ''సిపాయిల తిరుగుబాటు'' నాటిమాట. అప్పటినుండి యిప్పటివరకును రాజ్యపాలన యంతయును కుంపిణీచట్టముల ననుసరించి యేర్పాటు గాబడిన విధముననే సాగుచున్నది. మన హిందూదేశములో నేయే పన్నులను విధింపవలెను? ఎంతెంతసొమ్ము వెచ్చింపవలెను? మొదలగు నీ విషయములనెల్ల నెవరు పరిష్కరించుచున్నారు? సీమలోనున్న శెక్రటరీ పరిష్కరించుచున్నాడు. గవర్నర్ జనరలునకే యధికారములేదు. శెక్రటరీ వీరి యందరిపైన నుండు ముఖ్యాధికారి. గవర్నరులందరును ఆతనిక్రింద నుందురు. తిరిగి యీ గవర్నరులక్రింద ననేక యుద్యోగస్థులుందురు. ఇక్కడ జరుగు వ్యవహారమంతయు సీమలోనున్న శెక్రటరీ అనుమతితోడనే, ఆయన ఆలోచనతోడనే, ఆయన

యుక్తరావు ప్రకారమే, నెఱవేరవలసియున్నది. దీనిఫలితమేమి ? రాజ్యాధికారమంతయు కుంపిణీవారి చేతుల లోనుండితొలగి, రాణీగారి చేతులలోనికి పోయినప్పుటికిని, 1858 సంవత్సరములో రాణీగారు గొప్ప "ప్రకటన"ను గావించినప్పటికిని, ప్రస్తుత రాజ్యపాలనా పద్ధతియంతయు ఆ ప్రకటనాను గుణ్యముగ, ఆ ప్రకటనలోని యుద్దేశాను కూలముగ, సాగుటలేదు. కుంపిణీవారి వర్తకపద్ధతియే సాగుచున్నది గాని, రాణీగారి ప్రకటనాను కూలముగ నెంతమాత్రమును పరిపాలన నడచుటలేదు. మనప్రజలప్పుడు దీనిని గ్రహింపలేదు. ఇప్పుడున్నంతచనువు అప్పుడే యున్నట్లయిన "రాజ్యపాలనాధికారము రాణీగారి చేతులలోనికి వచ్చినది గనుక, పాలక పాలితుల కుండవలసిన సంబంధము, ప్రజాక్షేమమున కనుకూలముగనుండునట్లు యేర్పాటుగావించి తదనుకూలముగ చట్టములనెల్ల నేర్పాటు గావించవలసినది" అని ప్రజలప్పుడే తమ హక్కులకై పోరాడియుండెడి వారని నా నమ్మకము. కుంపిణీవారి యేర్పాటులన్నియు వారి స్వలాభమునకే చేయబడినవి గనుక ఆయేర్పాటులన్నిటిని తప్పక మార్చివేయవలసినదని మన ప్రజలప్పుడే తెలియజెప్పెడివారు. మీరిప్పుడేర్పరచిన యీ క్రొత్తపద్ధతికూడ కుంపిణీవర్తక పద్ధతి ననుసరించియే యున్నది. గనుక దీనిని తప్పక మార్చివేయుడని మన ప్రజలు కోరెడివారు. అంతదూరము పోనేల. చాలకాలము క్రిందటనే మన ప్రజలిట్టి హక్కులకై పోరాడుచున్నట్లు నిదర్శనములు గలవు. ప్రస్తుతము సజీవులైయున్న దాదాభాయి నౌరోజీగారు 1858 సంవత్సరములో కుంపిణీరాజ్యము పోయి యీ క్రొత్తయేర్పాటులు జరిగినప్పుడు (ఆయన) వీని నన్నిటిని కండ్లారచూచెను. ఆయన యీ యేర్పాటులన్నిటిని బాగుగ పరిశీలించి చూచి, వానిలోని దోషములు నన్నిటిని అందరికిని తెలియపరచెను. వెంటనే యీ యేర్పాటులు మాకు పనికిరావు, వీనిని మార్చివేయవలసినదని యాందోళన ప్రారంభించెను. "కుంపిణీ రాజ్యతంత్రమునకును, యీ క్రొత్తరాజ్యతంత్రమునకును మాకేవిధమైన భేదమును కనిపించుటలేదు. ఇదంతయును కుంపిణీవారివర్తక పద్ధతి (వణిక్తత్వము) ననుసరించియే యున్నది గాని, అంతకంటె ఉపయోగకరముగ లేదు. దీనివలన ప్రజలకేమైన మేలుగలుగ గలదా?" యని ప్రభుత్వమువారికి తెలియజెప్పెను. అప్పుడు యీ "చట్టనిర్మాణసభలు" (లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు) బయలుదేరినవి. కాని దానిలోనికి సభికుల నెన్నుకొను అధికారమంతయు గవర్నరుజనరలునకే యుండునట్లు మొదట నేర్పాటు గావింపబడినది. మొదట సభికులను (మెంబర్లను) ఎన్నుకొను అధికారము ప్రజలకు లేదు. క్రమక్రమముగ మన ప్రజలందరు "మ్యునిసిపాలిటీలలోను, చట్టనిర్మాణ సభలలోను మెంబర్లు (సభికులు) గా జొచ్చిరి. కాని ఇంకను చివరకు త్రిప్పు అధికారమను బీగమంతయు ఆంగ్లేయాధికారుల చేతులలోనే నిలిచి యుండెను. "చట్టనిర్మాణసభలో చర్చగావింపవచ్చును. చర్చగావించుటకు పూర్ణాధికారమున్నది. డబ్బుఖర్చుపెట్టు విషయములో చర్చ గావింపవచ్చును. కాని తుదకు ఖర్చుపెట్టవలెనో, అక్కరలేదో యను విషయమును మేమే నిశ్చయించెదము. మీ యిష్టము వచ్చినట్లు నోరు, మెదడునొప్పి యెత్తునట్లుగ చర్చించుకొనుడి; మాకేమియు సభ్యాంత

కముతేను. రాత్రి తెల్లవార్లు మేలుకొని, దీర్ఘోపన్యాసములు వ్రాయుడి; వానిని వార్తాపత్రికలలో ప్రచురించుటకు బదులుగ, మేమే గవర్నమెంటు గెజెట్టులో ప్రచురించెదము.'' (అని అధికారవర్గమువారు శెలవిచ్చుచున్నారు.) పూర్వపుపద్ధతికిని ప్రస్తుత పద్ధతికి యున్న భేద మిది! దీనివలన నావంతయు లాభములేదు. ఏదియో మేలుగలుగునని మాత్రమాశపెట్టుదురు. మహాభారతములో నొక శ్లోకమున్నది; ''ఆశ కల్పించి, ఆ యాశను నెఱవేర్చకుండ కాలము జరుపుచుండవలెను.'' అధికారవర్గము వా రేమని శెలవిచ్చుచున్నారు ? ''మీకు సమర్థత కలిగినప్పుడు హక్కుల నిచ్చెదము; యిచ్చట మీ దేశములో పీఠము వేసికొని కూర్చొన వలయునను ఉద్దేశము మాకు లేదు. మీకు సమర్థత గలిగినతోడనే, అంతయును, (అహాలము ద్దచేసి) మూటకట్టి ఆమూటను మీ చేతికిచ్చివేసి, యింగ్లీషు స్టీమరెక్కి మా సీమదేశమునకు మేము వెళ్ళిపోదుము !'' (చప్పట్లు) మనకు యీ విధముగ, ''యిప్పుడిచ్చెదము, రేపిచ్చెదమని'' ఆశకలిగించుచు కాలహరణము చేయుచున్నారు ! ఈ కాలహరణమున కేదియో యొక కారణము చూపవలెనుగద ! మనకు దినములు బాగుండలేదట ! ఇది మనకు కష్టకాలమట; ఇంకను కొంతకాలము వేచియుండినచే గాని మంచిదినములు రావట ! సమయము వచ్చినప్పుడు ఏదియో అభ్యంతరమువచ్చును. ఈ అభ్యంతరము యెందువలన వచ్చినది ? ఎవరు తెచ్చిపెట్టినారు ? దీనిని సమర్థించుటకు వీలులేదు. ఏమో ! ఎందువలన వచ్చినదో ఎవరికేమి తెలియును. ఇదియొక విధమైన తంత్రము. దేనినైన నిచ్చుటకు మనకు మనస్ఫూర్తిగ యిష్టము లేనప్పుడు, మన మెట్లు మాట్లాడుదుము ? ఈ యీ విధముగ మాట్లాడవలయునని మనము వేలుగ గ్రంథములు చదివి నేర్చుకొనవలెనా ? యీ విషయము యే నీతిశాస్త్రములోగాని, రాజ్యతంత్ర గ్రంథములోగాని కనిపించదు. ఇది పూర్వమునుండి ఆచారముగ సాగివచ్చుచున్నది. ఈ విధముగ నధికారవర్గమువారు మనకు ఉబ్బుమాటలు చెప్పి మనలను సంతోషపెట్టుచున్నారు. 40,50 సంవత్సరములనుండి సెక్రటరీ, గవర్నర్ జనరలు మొదలగువారు మనల నుబ్బవేయుచున్నారు; ప్రజలెప్పుడైన కొంచెము గల్లంతుచేయ మొదలు పెట్టగనే-సరే ! ఇదిగో ! చూడండి. మీ ప్రజల పక్షమున అయిదుగురు మెంబర్లుండిన మీకు చాలనట్లు కనిపించుచున్నది ! సరే ! ఇదిగో ! రేపటినుండియు ఆఱుగురు మెంబర్లను తీసికొనండి ! అని మనలను సంతోష పెట్టుచున్నారు. ఇదివరకుకంటె యింకొక్క మెంబరు ఎక్కువ యుండిన మాత్రము మనకు వచ్చులాభ మేమి ? ఇదివరకు అయిదుగురుండెగ, యింకొక ఆరవవాడుపోయి, వారితోబాటు నాలుగు దినములచ్చట వృథగ కాలముబుచ్చి రావలసివచ్చునేగాని, అంతకెక్కువ మేలేమియు చేకూరజాలదు. ఈ యారవవాడు చేరినంతమాత్రముచేత, యిదివరకు 5 గురున్నప్పటికంటె ఎక్కువ మేలేమియు కలుగనేరదు. ఈ యార్గురుతో మనము తృప్తినొందని యెడల ''సరే ! యెనమండుగురు మెంబర్లను మీకిచ్చెదములే !'' యని వారు శెలవిచ్చెదరు. ఇంకను యీ 8 మందుగురితో సైతము తృప్తికానియెడల ''సరే ! మీ పక్షమున 12 గురు మెంబర్లను పెట్టుకొనుడి'' యని చెప్పెదరు. ఇది ! వారిచ్చు ప్రత్యుత్తరము ! కాని

యీ వ్యవహారము యీ విధముగ పరిష్కరింపబడ నేరదని ప్రజలప్పుడే గ్రహించినారు. దీనివలన నేమియు లాభము లేదని యందఱికిని తెలిసినది. మా కేయధికారమును మీ రీయదలచుకొనినను, దానిని సంపూర్ణముగ, యితరుల జోక్యమేమియు లేకుండ మాకిచ్చివేయుడు. ఒకవిద్యాశాఖ విషయమై యోచించుడు. ఆ డిపార్టుమెంటులో క్రింది యుద్యోగస్థులందరును మనదేశీయులే; మన భారతీయులే. కాని వీరియందరిపైన ఒక తెల్లదొరయుండును. వానినచ్చట ఎందుకు పెట్టిరి? తక్కినవారినందరిని నోరెత్తి మాట్లాడకుండ చేయుటకా? విద్యార్థుల బుద్ధి యతివిశాలముగ వికాసము జెందకుండ నాటంకపరచుటకా? మనవాఁ డెవడైన ఆ డిపార్టుమెంటులో 20 సంవత్సరములు పనిచేసి మంచి యనుభవము కలవాడైనను, "పైన దొరలేనిది పని సరిగ జరుగదయ్యా!" యని మనవాఁడే యనును! ఆ నౌకరీలో, ఆ సేవకావృత్తిలో నున్నందువలన మనవారి బుద్ధులు మారిపోయి యిట్టి (విపరీత) భావములు వారికి పొడగట్టును. ఇట్టి బుద్ధులలవడును. ఇప్పుడిట్టివారే బయలుదేరుచున్నారు. గవర్నమెంటువారిప్పుడిట్టివారినే తయారుచేయుచున్నారు. ఇట్టివారిని తయారుచేయుటయే వారి పద్ధతి. "మేమీవిధముగ, యీ పద్ధతి ననుసరించి రాజ్యమేలుచున్నామ"ని వారు పైకి చెప్పకపోయినను, మనము గ్రహింపగలము. వారిపద్ధతికెల్ల నిదియే ముఖ్యసూత్రమని మనము గ్రహింపనగును. మీరిప్పుడు రెండువిషయము లాలోచించుడి. మన మొకతోటవేసి దానిలో చెట్లను పెంచవలయునని కోరుదుమనుకొనుడు. ఆపని కొక తోటమాలిని పెట్టుదు మనుకొనుడు. వాడు మొదట కొన్ని కుంపట్లను తెచ్చి, దానిలో చిన్న చిన్న మొక్కలను నాటును. ఇకనొక పెద్దయడవిని పెంచవలయునని కోరుదు మనుకొనుడు. ఈ యడవిని పెంచుటకు కుంపట్లు అక్కరలేదు. సంచులతో విత్తులు తీసికొనివచ్చి విశాల ప్రదేశములలో విరజిమ్మినట్లయిన చెట్లు పెరుగును. మొదట నీ విత్తులు మొలచి, చిన్న మొక్కలై, పిమ్మట నిరాటంకముగ పెరిగి పెద్దచెట్లగును. కొన్ని చిన్నవిగ నుండవచ్చును. మరికొన్ని పెద్దవృక్షములు కావచ్చును. కాని మన ప్రస్తుత రాజ్యపాలనా పద్ధతి తోటమాలిచేత నాటించిన తోటవలెనున్నది. ఈ తోటమాలి కుంపటులలో నాటినచెట్లు స్వేచ్ఛగ, విజృంభించి పెరుగజాలవు. అదిగాక, కుంపట్లలో నాటినచెట్లు వాడిపోకుండ, మనము వాని విషయమై బహుజాగ్రత్తగ నుందుము. వానిని జాగ్రత్తగ గాపాడుదుము. ఆచెట్లను పూసిన పుష్పములను మనము చక్కగ చేతితో కోసికొనవచ్చును గదా యని మనమెంతో శ్రద్ధగ వానిని పెంచుదుము. ఆకుంపటిలో నాటిన మృదువైన, అందమైన ఆచెట్ల నెట్లు పోషించుచున్నారో, మన భారతీయులనుకూడ నట్లే కడుగారాబముగ పెంచుకొనుచున్నారు. మనకు చక్కగ చదువు చెప్పించుచున్నారు. మనచేత పనులన్నిటిని చేయించుకొను చున్నారు. కనుక మనవాడు వారివద్ద 25, 30 సంవత్సరములు నౌకరీ చేయగనే "అమ్మో! నిజముగ నేనాపని చేయలేను. నేనాపనికి తగను" అని తలపోయును. ఇకమీద మన కీపద్ధతి పనికిరాదు. మనకు బ్రిటిష్ ప్రభుత్వమువుండి తీరవలెను. ఈ బ్రిటిష్

వారి యేకచ్ఛత్రాధిపత్యముక్రింద, యీ చల్లని నీడలో, మనము సురక్షితముగ నుండెదము గాక. కాని అట్టివారింటి క్రొత్తయల్లుని మాదిరిగ కూర్చుండు యీ సీను సెక్రటరీ మాకక్కరలేదు. (చప్పట్లు) ఒకవేళ ఆయనను తీసివేయుటకు వీలులేని ఎడల ఆయనవద్ద ఆలోచన చెప్పుటకై మా భారతీయులచేత నెన్నుకొనబడిన ప్రజలే యుండవలెను. సెక్రటరీకి ఆలోచన చెప్పువారు మావారలై యుండవలెను. మొట్టమొదట నీ మార్పు చేయవలసి యున్నది. అదేవిధముగ మా దేశములో పన్నులవలన ప్రోగగు డబ్బునంతయు నెట్లు ఖర్చుపెట్టవలయును ? ఏ ఏ పన్నులను వేయవలయును ? మొదలగు నీ యంశముల నన్నిటిని మేమే పరిష్కరించుకొనుటకు మాకేయధికార ముండవలయును. మన మిప్పుడేయైన పన్ను విధింపవద్దని ప్రభుత్వమువారికి అభ్యంతరము చెప్పినట్టయిన, "ఇప్పుడు కావలసిన ఖర్చునకు మరియొక్కెడనుండి తెచ్చిపెట్టుదుము" అని వారు మనకు తిరిగి ప్రత్యుత్తరము చెప్పుచున్నారు. కాని దానినిగూర్చి మనము తరువాత నాలోచింపుదము. మొదట మనకువచ్చు ఆదాయమునుబట్టి మన ధనమును వెచ్చింపవలయును; ఇక అవుసరమైన ఖర్చునకు కావలసిన ధనమును పన్నులద్వారా వసూలు చేయవలసి యున్నది — ఏది తెలిసినను, ఏది తెలియక పోయినను తుదకు మన కీ రెండు విషయములైనను తెలియును గద. ఈ విషయములన్నియు మనకు బాగుగ తెలియును. ఇవిగాక యింకను చేయవలసిన యేర్పాటులేవియైన యున్నయెడల వాని విషయమై మన మాలోచించెదము. డబ్బునకు (లేక ధనమునకు) సంబంధించిన వ్యవహారమంతయు ప్రజల యాధీనములో నుండవలయును. ప్రజల యధికారములో నుండవలయును ప్రజలచేత నెన్నుకొనబడిన నాయకుల స్వాధీనములో నుండవలయును. ఇదియే స్వరాజ్యముయొక్క మూలసూత్రము. వర్తమానకాలమున ఐరోపా ఖండమున మహా ఘోరయుద్ధము జరుగుచున్నది. ఈ యుద్ధమునకై యెంతధనమును వెచ్చింపవలయునో రాజు నిశ్చయింపడు. ఈ విషయమును ఆస్క్విత్తుమంత్రి నిశ్చయించును. ఆస్క్విత్తు మంత్రి చేసిన పనులకు ప్రజలు సమ్మతింపనియెడల, పార్లమెంటువారితో బోయి చెప్పుకొనవచ్చును. ఈ విషయమై పార్లమెంటులో విచారణ జరుగును. ఈ విచారణలో ఆస్క్విత్తు మంత్రి చేసిన పని తప్పని పార్లమెంటువారు తీర్పు చెప్పినయెడల, వెంటనే మంత్రి తన పదవికి రాజీనామాయిచ్చి తొలగి పోవలసినదే. మంత్రి తన పదవిని వదలుకొని పోవలసివచ్చిన యెడల, నది ప్రజల తప్పా ? మంత్రిని తన పదవిని వదలుకొని పోవునట్లు చేసిన ప్రజలు రాజద్రోహులా ? అంత మాత్రముచేత ప్రజలు రాజద్రోహులగుదురా ! అవిధముననే; ప్రస్తుత పరిపాలనా పద్ధతిలో కొన్ని మార్పులు చేయవలసినదని మనము కోరుచున్నాము. ఈ మార్పుల వలన బ్రిటిష్ పాలనకు భంగము వాటిల్లుననిగాని, బ్రిటిష్ రాజ్యము పడిపోవునని కాని తలంచుట శుద్ధ వెఱ్ఱితలంపు. బ్రిటిష్ వారితో సంబంధము త్రెంపుకొనవలయునను ఉద్దేశము మాకే కోశమునను లేదు. కలలోనైనా మాకట్టి తలంపులు లేవు. ఇట్టి కోర్కెల నెమెన్నడును కోరియుండలేదు. భారత ప్రజలు సౌఖ్యముగనుండి, వృద్ధి నొందవలయునని, మాకిప్పుడున్న వేలకొలది కష్టములు తొలగి పోవలయుననియు,

యీప్రస్తుత పాలనాపద్ధతిని తప్పక మార్చివేయు టత్యవసరము; దీనిని తప్పక మార్చి వేయుమని నేను తిరిగి చెప్పుచున్నాను. మహారాష్ట్రములో నొకసామెత యున్నది. "గుర్రమెందుకు మదుగుతనము చేసెను. (హరాంచేసెను)? తమలపాకు లెందుకు కుళ్ళి పోయెను? రొట్టె యెందుకు మాడిపోయెను?" వీని కన్నిటికిని ఒకటే ప్రత్యుత్తరము కలదు. "ఎందుకనగా తిరుగ వేయలేదు గనుక" తమలపాకుల నప్పుడప్పుడు తిరుగ వేయుచుండవలెను; రొట్టె మాడిపోకుండ, తిరుగ వేయుచుండవలయును; గుఱ్ఱమును తరుచుగ నటునిటు త్రిప్పుచుండవలయును; అట్లు త్రిప్పుచుండిన నది మదుగుతనము చేయదు. మనకష్ట పరంపరలకును, మన మొరల కన్నిటికిని మూలకారణ మొకటియే కలదు; అదేదన, వీని నన్నిటిని పరిష్కరించుకొనుట కధికారము మన చేతులలో లేదు గనుక. దీనినే కొద్దిగ మాటలుమార్చి చెప్పినయెడల "మనకు స్వరాజ్యములేదు గనుక" మనకీ చిక్కులన్నియు కలుగుచున్నవి. ఇదెంతయు మనకు ముఖ్యావసరమై యున్నది. మన కీయధికారము చేతులలో నున్నట్టయిన, ఎవరెట్లాడించిన నట్లాడ వలసిన యవసరముండదు. తోలు బొమ్మలవలె యితరుల ఇష్టప్రకారము భోగమాట చూడవలసిన యవసరముండదు. మనకు స్వరాజ్యము వచ్చినప్పుడు సైతము, ఒకవేళ డబ్బుతక్కువైన యెడల, మనముకూడ పన్నుల నెక్కువ జేయవలసిన యవసరము రావచ్చును. పన్నుల నెక్కువ జేయనక్కరలేదని నేను చెప్పను, ఒకప్పుడు మనం తటమనమే పన్నుల నెక్కువ చేసికొనవలసి వచ్చును. పన్నుల నెక్కువ చేయని యెడల, రాజ్యకార్య నిర్వహణమున కవసరమైన పనులెట్లు నెరవేరగలవు? కాని పన్నులప్పుడెక్కువ యైనందువలన మన మనస్సునకు కష్టముగ తోచదు. అది యొక భార ముగ మనకు కనబడదు. ఎందువలన ననగా మన యుపయోగార్థమై, మనమే, స్వంతముగ పన్నులను వేసికొనినాము గనుక మనకు కష్టముగ తోచదు. మన మేదైన యొక మార్గమున బోవుచుండగ, యితరు లెవరైన వచ్చి "మీ రీ మార్గమున పోవద్దు; ఇదిగో యీ మార్గమున పోవుడి" యని వేరొక మార్గము చూపి, మన త్రోవకడ్డము నిలచినయెడల, వారి నావలికొక త్రోపుత్రోసి, నెట్టుకొని పోవలయును. స్వరాజ్య విషయములోకూడ నిట్లే చేయవలయును. అధికారివర్గమువారే యీ స్వరాజ్యమున కభ్యంతరము చెప్పెదరు. ఇట్టి యభ్యంతరముండ కూడదు. స్వరాజ్య వాంఛకును, రాజద్రోహమునకును యెట్టి సంబంధములేదు. స్వరాజ్య స్వభావము వేరు. రాజద్రోహము వేరు. ఇది నిర్గుణ ప్రభుత్వమునకు వర్తింపదు. మన యిష్టప్రకారము, మనగృహకృత్యములను, మనమె నిర్వహించుకొనుట కధికారముండ వలయును. ఇదియేస్వరాజ్య సారము. ఇట్లు గావించుటవలన గలుగు లాభమేమియని మీరడుగవచ్చును, మన మిట్లు చేసికొనిన యెడల మన మనస్సులకు శాంతి గలుగును. మనకు తృప్తికరముగ నుండును. ఇదియే మొదటి లాభము. మన మేపని గావించినను మనమేలు కొరకే జేసికొనుచున్నాము గదాయను మనశ్శాంతి మనకుండును. (ఆత్మబుద్ధిస్సుఖంచైవ) ఇంటి ఖర్చును తగ్గించుకొన వచ్చును. స్వరాజ్య సంస్థానములలో నెచ్చటనైన, యే కలెక్టరును, 2 వేల 5 వందల జీతము పుచ్చుకొనుచున్నాడని నేననుకొనను. కలెక్టరుచేయు

పనికి ఏ దేశములోనైన ఎక్కువజీతము యిచ్చుచున్నారాయని విచారించిన, ఒక్క మన హిందూ దేశములోతప్ప నిక ఏదేశములోకూడ నిట్టివిపరీతములేదు. ఇప్పుడు కలెక్టరుకు 2,500 రూపాయలు జీతమిచ్చు చున్నారనిన పూర్వకాలము సాలుకు 30 వేల రూపాయలు ఆదాయవచ్చు గొప్ప జాగీరిచ్చిన దానికి సమానమగు చున్నది. పూర్వము మన స్వరాజ్యములలో నిట్టి 30,000 రూపాయల జాగీరిచ్చి యున్నామా? 30,000 రూపాయలు స్వల్పసాధనముకాదు. దీని కనేక కారణము లున్నవి. వారు చెప్పు కారణమేమి? ప్రతిదానికి ఏదో ఒక కారణముండి తీరునని మీమనస్సునందుంచు కొనుడి. ఆతడు (యీ కలెక్టరు) సీమకు తన పిల్లలకు 2500 రూపాయలు పంపవలసి యున్నది, మరియు ఇంకననేక కారణము లున్నవి. మనమేలు కొరకు పాపమువారు శీతల ప్రదేశములనుండి ఉష్ణ ప్రదేశమైన మన దేశమునకువచ్చి, తమ దేహారోగ్యమును జాగ్రత్తగ కాపాడుకొన వలసియున్నది. అట్టి సందర్భములలో వారికి ఎక్కువ జీతము లివ్వవద్దా? వారింత కష్టపడినారు; వారెంత స్వార్థత్యాగము గావించి, మన మేలుకై యింతదూరము వచ్చినారు. ఎన్నియో కష్టములపాలైనారు. అట్టి సమయములో మీరు వారికి ఎక్కువ జీతము లివ్వవద్దా? ఈమాటలు చెప్పగనే చాల బాగున్నదనియు, చాల సహేతుకముగ నున్నదనియు మనకుతోచును. కాని దీనిలో ముఖ్యమైన విషయ మొకటిగలదు. వారిని మొట్టమొదట అచ్చటినుండి యిచ్చటికి రమ్మనిన వారెవరు? అంతదూరమునుండి రావలసినదని మనము వారిని పిలువనంపలేదు. మీకున్న సామర్థ్యము మాకునుగలదు. మీరుచేయు పనినంతను, చాల తక్కువ జీతమునకు, మేమేచేయగలము. అట్లు చేయగలవారు మాలో కావలసినంత మందియున్నారు. ఆపని చేయగలవారు మనలో చాలమంది యున్నప్పుడు క్రొత్తగ ఆంగ్లేయు నొకని నంతదూరమునుండి తీసికొనివచ్చి వానికంత యెక్కువ జీతమెందు కియ్యవలయును? ప్రస్తుతము దేశజనులకు చదువు చెప్పింప వలయుననిన దానికి కావలసినంత ధనము లేదని మొరపెట్టుకొనుచున్నాము. సర్వజనోపయోగ కరములైన నిట్టిపనుల కన్నిటికిని "ఫండులేదని" ప్రతి సారియు గవర్నమెంటువారు వంక జెప్పుచుందురు. రాజ్యపాలనాధికారము మన చేతులలోనికి రాగనే ఇట్టికష్టములు ఇట్టివంకలన్నియు తొలగి పోవును. కావలసిన పనులన్నియు, నిప్పటివలెనే, నిరభ్యంతరముగ, జరుగుచునే యుండును. బహుశః మొట్టమొదటగనే, అంతనిరభ్యంతరముగ, సరిగ, జరుగక పోవచ్చును. పనులన్నియు మొదట నింతసరిళముగ నడువక పోవచ్చును. (అక్కడక్కడ కొన్నిలోపములు మొదట రావచ్చును) సమర్థత విషయములో, నంత ఎక్కువ సమర్థత యుండక పోవచ్చును; మొదట రూపాయి కొక అణావంతున "సమర్థత"లో లోపమురావచ్చును. కాని రాజ్య కార్యములన్నియు మన యిష్ట ప్రకారము మన ప్రజలే నిర్వహింపు చున్నారుగదా యను మనశ్శాంతి యుండును. ఇట్టి యుత్సాహమును, నిర్మలమనో భావమును ఎక్కువ విలువైనవి. ఈవిధముగ నిపుడున్న పాలనలో మంచి ఏర్పాటుల గావింపవలెనని కోరవలెను. ప్రస్తుత చట్టములలో సవరణలు చేయవలసి యున్నది. ఇది పార్లమెంటు ద్వారా

కావలసియున్నది. ఇతరుల నెవరిని అడుగబోవము. ఫ్రాంసు దేశముతో మొఱ పెట్టుకొనిన మనకది లభింపవు. (మన కోర్కెలు నెఱవేరజాలవు.) మిత్రమండలి వారుండవచ్చును. కాని వారికి నివేదింప వలసిన పనిలేదు. ఇంగ్లీషు పార్లమెంటు వారితో, ఇంగ్లీషు ప్రజలతో, మనము నివేదింపవలసి యున్నది. మన యీ స్థితి గతుల నన్నిటిని వారికి తెలియపర్చవలెను; దీనికి కావలసిన పనినంతయు మనమే చేయ వలసియున్నాము. మీరీ యత్నములను కొద్దిసంవత్సరములపాటు గావించిన యెడల ఫలము నందకపోదు. ప్రస్తుతము యూరపుఖండమున ఘోరసంగ్రామము జరుగు చున్నది. ఇదెంతయు మనకు మంచియనుకూలమైన తరుణము. భారతవర్షము యొక్కయు, భారతవీరుల వీరోత్సాహాతిశయములయొక్కయు, భారతజాతీయస్వత్వ స్థైర్యములయొక్కయు, భారత నిష్టాపరత్వముయొక్కయు, అమూల్య ప్రతిభను ద్విగుణీకృతము గావింప సమకట్టవలసిన సమయ మిప్పు డాసన్నమైనది. స్వోద్ధరణకై మనంతట మనమే కృషిసలుపుచున్నారమని ప్రభుత్వము వారికి తెలియవచ్చిన యెడల మన కోర్కెలెల్ల నచిరకాలములోనే సఫలీకృతములగునని తలంపనగును. త్వరలో ఫలించుటకు కెక్కువ యవకాశముండును. కాబట్టి నేనిప్పు డీవిషయమును పనిబూని మీయందరితో నీ యుపన్యాసపూర్వకముగ మనవిచేసి కొనుచున్నాడను. ఈ విషయ మును గూర్చియే ప్రస్తుతము దేశమునందు నల్లడలను చర్చ గావింపబడుచున్నది. దీనికై "స్వరాజ్యసమితి" యొకదాని నేర్పరచినాము. నేనో లేక నాబోటివారెవరైననో, యీ విషయము నెప్పుడో యొకప్పుడు మీకు తెలియజెప్ప వలసియేయున్నది. ఈ విషయమును మీరెల్లప్పుడును బాగుగ చర్చింపుడి. దీనినిగూర్చి బాగుగ నాలోచింపుడి. దీనిలోని లాభాలాభములను బాగుగ తెలిసికొనుడు. దీనిలో నెంత రాజభక్తి యున్నదో జాగ్రత్తగ పరిశీలింపుడి. నేనిప్పుడు మీకు చెప్పిన దిదియే. నేను చెప్ప వలసినది చాలయున్నప్పటికిని దాని సారాంశమును మాత్రము క్లుప్తముగ మీకిప్పుడు చెప్పినాను. దీనినిగూర్చి మీరు దీర్ఘముగ నాలోచించిన యెడల (విశేష లాభము కలుగును) ఈ మన ఒక మహారాష్ట్రదేశములో మాత్రమే గాక, భారతవర్షమునం దంతటను ఇది బాగుగ వ్యాపించి, దీనివిషయమై ప్రజలందరు బాగుగ శ్రద్ధవహించిన యెడల యీ కార్యము తప్పక సఫలత నొందగలదని నాదృఢనమ్మకము. ఈ కార్య సాఫల్యము భగవంతుని చేతులలో నున్నను మన పురుషప్రయత్న మత్యావసరము. కార్యసిద్ధి మనచేతులలో లేదని నే నొప్పుకొనెదను. కాని యీ ప్రపంచమునందు కర్మకు ఫలము కలిగితీరును. నే జెప్పినంత త్వరగ గలుగకబోవచ్చును. నా కండ్లయెదుట కలుగకపోవచ్చును. బహుశః నేనా కర్మఫలము నందకపోవుదునేమో ! కాని యీ కర్మకు ఫలముండి తీరును. కర్మసిద్ధాంత ప్రకారము, కర్మగావించినప్పుడు దానికొక ఫలము కలుగును. దానినుండి యింకొక మూడవఫలము కలుగును. ఈ విధముగ ఫల పరంపర గలుగుచునేయుండును కాని యీఫలప్రాప్తికి కొంతకాలము గడువవలెను. కాలయాపన అయితీరును. మనకు మోక్షమెసంగుమని భగవంతుని ప్రార్థించునప్పు

డెట్లు ప్రార్థింతుము? మనము బ్రతికియుండగనే మన కండ్లయెదుట మోక్షము కావలయునని గట్టిగ గోరుదుమా? లేక ఎవరిద్వారానో మోక్షము రావలయునని కోరుదుమా? జాతీయవాదులకును మితవాదులకు నెట్టిభేదముండకూడదని మనమిప్పు డొక తీర్మానము చేసికొంటిమిగద. అనగా మనలో స్వరాజ్య మెవరి కిచ్చినను మన కందరి కొకటేయని దీని తాత్పర్యము. రేపు స్వరాజ్యమును మన సిపాయిలకిచ్చినను సరే. ఎవరికిచ్చినను సమ్మతమే: అభ్యంతరమేమియును లేదు. మనకు మన హక్కు లుండి తీరవలెను. మనకు సౌఖ్య మొసంగజాలు పరిపాలన యొకటియుండి తీరవలెను. మన కడవచ్చి తీరునని గట్టినమ్మకము గలదు; మనకు గాకపోయిన మన సంతతివారి కైనను వచ్చితీరును. మనము న్యాయమార్గమున కృషిసలుపవలసియున్నది. ఈ పని నంతను మీసొంతపనిగా నెంచుకొని మనస్ఫూర్తిగ దీనికై పాటుబడవలెను. భగవద నుగ్రహమువలన మీ జీవితకాలములో కాకపోయినను, మీసంతతివారైనను స్వరాజ్య మును సంపాదింపక పోరని నాదృఢనమ్మకము.

---



# లోకమాన్యుని ఉపన్యాసములు

## 2. స్వ రా జ్య ము

(ఆన **1916** సం॥ మే నెల **31**-వ తేదీని అహమ్మదునగరములో నిచ్చిన ఉ ప న్యా స ము)

**ఆర్యులారా !**

ఇతర విషయములను గూర్చి ముచ్చటించుటకు పూర్వము నేను ముందుగ మీ కందరకు నా హృదయపూర్వక వందనము లర్పింపవలసి యున్నది. మీరు నన్నిక్కడికి పిలిపించి గౌరవించినందులకును, మీ సన్మానపత్ర ప్రదానమునకును నేను నా హృదయపూర్వకవందనము లర్పించుట ధర్మమైయున్నది. మీరు నన్నే యుద్దేశముతో గౌరవించినను నేనిప్పుడు చెప్పబోవు నాలుగు మాటలును నేగావించు కార్యమునకే వర్తించును. బహుశః మీకిది యాశ్చర్యముగ గాన్పింపవచ్చును. మీరు నన్నిక్కడికి పిలిపించి మర్యాదచేసినప్పుడు నేజేసిన ఘనకార్యములను మీ యెదుట జెప్పుకొనన మొదలిడిన నది అసందర్భముగ మీకు గనుపడవచ్చును. "తిలక్‌గారు వచ్చి, మా యెదుట తన ప్రతాపమంతయు చెప్పుకొన్నాడ"ని మీరనుకొందురేమో. అయినను, నేజెప్పబోవు విషయములన్నియు, నాకెంత లాభదాయకమో మీకుకూడ నంత లాభదాయకమేగాన, నే నాకార్యముల నిచ్చట మీ యెదుట జెప్పుట కెంత మాత్రమును సందేహింపను; ఎంతమాత్రమును వెనుదీయను. మన భారతవర్షము యొక్క ప్రస్తుత స్థితిని గూర్చి వివిధప్రదేశములందు వివిధములుగ నిప్పటివరకును వాదప్రతివాదములు జరుగుచునేయున్నవి. జనసామాన్యమున కంతటికిని మేలొనర గూర్చున దేది ? మేలొనగూర్చున వనేకములు గలవు. పరలోక సౌఖ్యము లొసంగు దైవచింత, మతభక్తి మొదలగునవి నరులకు లాభదాయకమే. సన్మార్గావలంబనము, ధర్మప్రవర్తన మొదలగునవియు లాభదాయకమే. జీవయాత్ర గడచుటకై ధనధాన్య సంపదలు లాభదాయకమే. ఈ లోకమున మనకు సౌఖ్యము చేకూరవలెననిన మన వర్తకవ్యాపార మభివృద్ధి నొందవలెను. మన ప్రజ లభివృద్ధిగాంచవలెను: మనకు భాగ్యభోగ్యము లుండవలెను; అట్టి సంపదలన్నియు మన చేతిలోనికివచ్చి పడవలెను. ప్రపంచములోని ప్రతిజాతియు నిహసంబంధమైన యీ కోర్కెలనన్నిటిని కోరుచున్నవి. అటువలెనే మనమును కోరుచున్నాము. నాకిప్పుడు మీరు దయచేసిన యీ కొద్దికాలపరిమితిలో వీనినన్నిటిని గూర్చి పూర్ణ చర్చ గావించుట కవకాశము

లేదు. కాబట్టి పైన జెప్పిన విషయములలోనెల్ల నతిముఖ్యమైన విషయమును గూర్చి, వేలకువేల ప్రజలచే నన్నిటిలో ముఖ్యతరమైనదని నిర్ధారణ పరుపబడిన విషయమును గూర్చి, ప్రస్తుతము దేశమునం దెల్లెడల చర్చింపబడు ముఖ్యతమమైన విషయమును గూర్చి మీ యెదుట నాలుగు వాక్యములను, చెప్పెదను. ఇట్టి విషయమేదన నదియే స్వరాజ్యము. మన గృహమునకు సంబంధించిన పనులనెల్ల మనము మన యిష్టము వచ్చినట్లుగ, మన యధికార ప్రకారము, యితరుల ప్రమేయము లేకుండ, గావించుకొనెదము గద. కేవలము మన గృహకృత్యములకు సంబంధించిన ఆంతరంగిక విషయములలో నితరులతో సంప్రతింపవలసిన యవుసరములేదు. ఇతరుల యనుజ్ఞ పుచ్చుకొనవలసిన పనిలేదు. ఇతరుల నడుగవలసిన పనిలేదు. కాని బహిరంగవిషయములలో, సర్వజనోపయోగ కరమైన పబ్లికు వ్యవహారములలో నట్లు చేయువలనుపడదు. మన మేలెంతయో, యితరుల మేలుకూడ నంతియే. మన స్వగృహకృత్యములలో మనకెంత సంబంధమున్నదో, పబ్లికు వ్యవహారములలో కూడ సర్వజనులకును అంత సంబంధమేయున్నది. ఇది అందరికిని కావలసిన విషయము. (దేవుని పెండ్లికి అందరును పెద్దలే) ప్రజలెట్లు సౌఖ్యముగనుండి క్రమక్రమముగ నభివృద్ధి మార్గముల బట్టగల స్థితికెట్లు రాగలరాయని యోచించి, తదనుకూలమైన మార్గములను మన మవలంబింపదలచినప్పుడెల్ల మనచేతిలో నధికారము లేనందున మన కన్నియు చిక్కులే తటస్థింపుచున్నవి. మన మేదిచేయబోయినను మనకన్నియు అడ్డములేవచ్చుచున్నవి. ఒకచోటినుండి మరియొకచోటికి రైలుమార్గము వేయవలయుననిన, అధికారము మనచేతిలో లేదు. ఒక వర్తకవ్యాపారవిషయములో విచారింపుడు. మన పరిశ్రమల కన్నిటికిని ప్రోత్సాహము కలుగజేయవలయునని నేను నోటిమాటలు, వట్టికబుర్లెన్నియైన చెప్పవచ్చునుగాని దానికి తగువిధమున పనిచేయుటకు మనచేతులలో నధికారము లేదు. విదేశీయుల వర్తకము నణచి మన వర్తకము నభివృద్ధి నొందింపగల యధికారము మన చేతులలోలేదు. మన దేశీయవర్తకమునకు తగినంత ధనసహాయముచేసి, పెంపొందింపగల రాజపోషణలేదు. అట్లుచేయుటకు రాజకీయాధికారము మనవశమునలేదు. ఏ విషయమై యాలోచించినను యిట్లేయున్నది. సారా అమ్మకమును మనము ఆపివేయదలచుకొనిన యెడల దాని నాపలేకున్నారము. మనకుగాని మనప్రభుత్వమువారికిగాని యవుసరము లేని విట్టి వనేకములు గలవు. ఇప్పుడు జరిగిపోవుచున్న ప్రభుత్వపద్ధతి యీ తీరుననున్నది. ఎట్టిమార్పు చేయుటకును, చింతాకంతైన జోక్యముకలిగించుకొనుటకును ప్రజలమైన మన కధికారములేదు. ఇంతవరకు ప్రభుత్వమువారి కనేక మొరలు పెట్టుకొనినాము; వారును వినియేయున్నారు. కాని యీ మొరల కన్నిటికిని మూలకారణమేమి? మనస్థితిని, మన యిచ్చవచ్చినట్లభివృద్ధి నొందించుకొనుట కేమి అడ్డువచ్చుచున్నది? మనకు సంభవించిన యిక్కట్లేమి? వీనివిషయమై గత 50 సంవత్సరముల నుండియు దేశమునం దంతటను ఆలోచన జరుగుచున్నది. ఇట్లాలోచించిన పిమ్మట మనలోని గొపగొప్ప చదువులు చదువుకొనిన ధీశాలు లందరును దీనికొక కారణమును కనిపెట్టిరి. వీని కన్నిటికిని ఒకటే కారణము; అదేదనగా "మన ప్రజలచేతులలో నధి

కారములేదు, కనుక యిట్టి యిబ్బందులన్నియు మనకు తటస్థించుచున్నవి.'' ఈ విషయమై అనేకమంది కనేక యభిప్రాయము లుండవచ్చును. ఇది సర్వజనులకును కావలసిన విషయము. ఒక్కొక్కరి కొక్కొక్క యోచనతోపవచ్చును. కొందరు దీని కింకొక మార్గమును చూపుచున్నారు. 'మీకధికారములేదా ? (లేకపోయిన మాత్రమేమి ?) సారాను అమ్ముచుండిన యెడల మీరుపోయి త్రాగకుడు. అంతటితో నంతయు తీరిపోవును'' అని సమాధానము చెప్పుచున్నారు. ఈ మాటలు చాల తియ్యగనున్నవి. కాని ప్రజల నందరను మద్యపానము చేయకుండ నిషేధింపవలయు ననిన వట్టి తీయనిమాటలు పనికిరావు. * దానికి కొంత దండనాధికార ముండవలెను. అధికారము చేతిలో లేనియెడల నాపని నెవడును నెరవేర్పజాలడు. వట్టి నోటిమాటలతో నిట్టిపనులు సానుకూలమగు నెడల, మనకు రాజుతో నేమిపని ? (రాజుగాని అధికారముగాని అక్కరలేదు.) సర్వజనసమ్మతమై, యెల్లరచే గోరబడు కార్యముల నెల్ల ఆచరణలో బెట్టుటకే ప్రభుత్వమనున దొకటి యేర్పరుప బడినది. ప్రస్తుత మట్టి ప్రభుత్వము మనచేతిలో లేదుగనుక మన ప్రజల కోర్కెలన్నియు సఫలీకృతములగుచుండుటలేదు. పాలకుల కిష్టములేనియెడల నేపనియు నెరవేరుటలేదు

ఒక్కకరువు విషయ మాలోచింపుడు. దేశములో కరువు సంభవించినప్పుడు తన్నివారణార్థమై యెట్టి యేర్పాటుల గావించిరి? ఈ కరవులవలన యీ అహమ్మదాబాదు ప్రాంతదేశములోనుండు సాలీలందరును బహుయిక్కట్టులపాలు గావలసి వచ్చెను. ఈ విషయము గవర్నమెంటువారి నోటీసులోనికి వెళ్ళువరకు నెవరును యెట్టి యేర్పాటులను జేసియుండలేదు.

మన వర్తకమంతయు నశించినది. పూర్వము కమీషన్ ఏజంట్ల వ్యాపారముండెడిది. ఈవ్యాపార మిప్పుడుకూడ నడచుచునే యున్నది. కాని పూర్వపు వ్యాపారమునకును యిప్పటి వ్యాపారమునకును చాల భేదము కలదు. పూర్వము మన దేశీయ వర్తకులకే, మనదేశీయవర్తకాభివృద్ధికొరకే, మనవారందరు కమీషన్ ఏజంట్లుగ నుండెడివారు; ఇప్పుడన్ననో, సీమవర్తకులకు, (విదేశవ్యాపారాభివృద్ధికై) మనవారు ఏజంట్లుగనున్నారు. ఈ యేజంట్లు యిక్కడ ప్రత్తినికొని సీమ కెగుమతి చేయుదురు. దానినుండి సీమలో నేయబడినబట్టలు మనదేశములోనికి దిగుమతి యగును. ఆబట్టలను యీ యేజంట్లే కమీషన్‌కుకొని వానిని తిరిగి ప్రజల కమ్ముచున్నారు. కమీషన్ యేజన్సీవ్యాపార మప్పుడునున్నది, యిప్పుడు నున్నది; కాని

---

* శ్లో॥ సర్వోదండ జితోలోకో దుర్లభోహి శుచిర్నరః ।
దండస్యహి భయాత్సర్వం జగద్భోగాయ కల్పతే॥
మనుస్మృతిః సప్తమాధ్యాయం; ౨౨-వ శ్లో॥

తాత్పర్యము:—దండనచేసినట్టైనమాత్రమే లోకులు చక్కగ నడుతురు గాని, స్వభావమువలన చక్కగ నడువరు; దండనకు జడిసియే లోకమంతయు సుఖము ననుభవించుచున్నది.

యిదివరకు మన స్వదేశమునకు జెందుచుండిన లాభమంతయు పోయి, ఇప్పుడాలాభము విదేశీయులైన ఇంగ్లీషువారికి జెందుచున్నది. అప్పుడున్న మనుష్యులే యిప్పుడు నున్నారు. అప్పుడున్న వ్యాపారమే యిప్పుడునున్నది. కాని రాజ్యపాలనాధికార వర్గములో మార్పువచ్చినది. రాజ్యపాలనపద్ధతి మారిపోయినది; అందువలన దేశాభ్యు దయకరములగు పనులను జేయుటకు మనమిప్పు డశక్తులమై యున్నాము. దేశమును అభివృద్ధిమార్గమున బెట్టుటకు అనుకూలమైన యేర్పాటులను మన మిప్పుడు చేయలేక న్నాము. మన ప్రభుత్వమువారు నిజమాలోచించిన, విజాతీయులే గావున మన యభివృద్ధికి తోడ్పడగల యేర్పాటులు జరుగుచుండుటలేదని మనము మొదట తలంచి తిమి. ఈ "విజాతీయత" వలన కలిగిన ఫలితమేమి? మనకును, విజాతీయులకును గల భేదమేమి? వారిదృష్టి, వారిమాపు వేరు: మనదృష్టి, మనమాపువేరు. రెండును యేకీభవింపజాలవు. మఱియందు వారికెల్లప్పుడు నెట్లుండును? వారు మనకు విజాతీ యులు గావున. మన కోర్కెల ప్రకారము, మన యిష్టప్రకారము (రాజ్యపాలన) చేయవలయునను తలంపు వారికి యుండనేయుండదు పూర్వ మీ యహమ్మదునగర ములో హమ్మదీయ ప్రభువులు రాజ్య మేలిరి. ఈ మహమ్మదీయులు "విజాతీయుల"ని నే చెప్పను. (ఏలనన) మహమ్మదీయు లీ దేశములో స్థిరవాసము లేర్పరచుకొని, దీనినే తమ స్వదేశముగ జేసికొనిరి. ఈ దేశములోనే వంశపారంపర్యముగ నివసింప సంకల్పించు కొనిరి. కాన యీ దేశ మభివృద్ధి నొందవలయునని వారు కోరిరి. ఈ దేశవర్తకము, స్వదేశవ్యాపారము, స్వదేశపరిశ్రమలు పెంపొందవలయునని కోరిరి. వారిమతము వేరుకావచ్చును; ఈ భారతవర్షమును తమ స్వగృహముగ, స్వదేశముగ జేసి కొని, తమ పుత్రపౌత్ర పారంపర్యంతము నీదేశములోనే నివసింప సంకల్పించుకొని, (యీదేశములోనే పుట్టెదము, యీదేశములోనే చచ్చెదము అను నభిమానముతో వర్తింపుచు) యీ దేశములో నివసించు నెల్లజనుల క్షేమమును గోరుచు, యీదేశవాసులకు మేలొనర్ప దలంచువారు "విజాతీయుల"న బడనేరరు. హిందూ మతావలంబకుడు కానంత మాత్రముచేత వాడు విజాతీయులని నే జెప్పను. భారతీయులక్షేమమును గోరువాడెట్టి వాడైనను మహమ్మదీయుడైనను ఆంగ్లేయు డైనను - విజాతీయుడు కానేరడు: విజాతీయత యనునది * అభిమానముతో సంబంధించినదేగాని నల్లతోలు, తెల్లతోలుతో సంబంధించినది కాదు; మతముతో సంబంధించినదికాదు; వృత్తితో సంబంధించినది కాదు. తాను జన్మించిన దేశము లోనే, తన సంతతివారందరును జన్మించి, వంశపారంపర్యముగ దీనినే జన్మ భూమిగజేసికొని, యీ దేశములోనే నివసింపుచు, (యిచ్చటనే పుట్టుచు, యీదేశపు బూడిదెలోనే కలియుచు) నుండవలయునని తలంపుచు, యీ దేశస్థు లెల్లప్పుడు నభి

*. ఇది నా దేశము, వీరు నా ప్రజలు, వీరు బాగుపడవలెను; వీరు అభి వృద్ధిలో నుండవలెను: అని ప్రజాక్షేమముగోరుచు, ప్రజలయందభిమాన ముంపనివాడు విజాతీయుడే.

వృద్ధిలో నుండవలయునని వారిక్షేమమును గోరుచు, తదనుగుణమైన కార్యములనెల్ల గావింపుచుండు వాఁడు విజాతీయుడు కాజాలడు. అట్టివాడు నేమ్రొక్కు దేవునకే మ్రొక్కపోవచ్చును, నే బోవు దేవాలయమునకే రాక పోవచ్చును; నే నాతనితో పంక్తి భోజనముచేయక పోవచ్చును; వివాహసంబంధ బాంధవ్యములు కలిగించుకొనక పోవచ్చును. (అంతమాత్రముచేత విజాతీయుడు కాజాలడు) ఇవన్నియు స్వల్పవిషయములు. భారతవర్షాభ్యుదయమునకై కృషిసలుపువాడు నిశ్చయముగ విజాతీయుడు కాజాలడు. రాజ్య మెవరు జేసినను మన కొకటే. పాలకులు మారినంతమాత్రముచేత మనకు వచ్చు నష్ట మేమియు నుండదని నే నిదివరకే చెప్పియుంటిని. పూర్వ మెన్ని రాజ్యములు మారిపోవలేదు? పీష్వాల ప్రభుత్వ మంతరించినది. అట్లే మహమ్మదీయ ప్రభుత్వమంతరించినది. వీరందరును ఆంగ్లేయాధికారమునకు లోబడిరి. తానేలు దేశ మభివృద్ధిలో నుండజూచుట రాజుయొక్క పరమధర్మమై యున్నది. దేశము దినదినాభివృద్ధినొంది, ప్రపంచములో తక్కిన నాగరికతాభివృద్ధి నొందిన దేశములతో బాటు సమానపదవియం దుండజూచుట రాజుయొక్క ధర్మమై యున్నది. ఇట్టి స్వధర్మము నెఱవేర్చు రాజు విజాతీయుడు కాడు. ఇట్టి స్వధర్మమును నెఱవేర్పక తన స్వాభివృద్ధికే, తన స్వసంఘాభివృద్ధికే జూచుకొను రాజు విజాతీయుడుగానే యెంచబడవలెను.

మన కిప్పుడు పరిష్కారము కావలసిన చిక్కులనేకము లున్నవి భూమిశిస్తు యెక్కువైనది. ఫారెస్టు (అడవుల) డిపార్టుమెంటు యేర్పాటు లన్నియు వింతగ నున్నవి. మనము 20,30 సంవత్సరములనుండి యీ యిబ్బందుల నన్నిటిని తొలగింపవలసినదని గవర్నమెంటువారికి మొఱలుబెట్టు కొనుచున్నాము. కాని మన మొఱ లన్నియు నట్లే నిలచియున్నవి. మనకు సంతృప్తికర మగు యేర్పాటు లేవియును జరుగలేదు. ఈ విషయములను గూర్చి గత 50 సంవత్సరములనుండియు చర్చ కావింపబడుచునే యున్నది. ఈ విషయముల నన్నిటిని గవర్నమెంటువారికి తెలియజెప్పుకొనినయెడల మన కష్టము లన్నియు తొలగిపోవునని మనము మొదటి దినములలో నభిప్రాయపడితిమి గవర్నమెంటువారు విదేశీయులు గనుక మన కోర్కెలు, కష్టనిష్ఠురములు పాపము! వారి కెట్లు తెలియగలవు? గనుక మన మందర మొకచోట సభగూడి, మన కోర్కెల నన్నిటిని తెలియజెప్పుకొనుచు, గవర్నమెంటువారికి విజ్ఞాపనచేసికొనిన యెడల, వారు శ్రద్ధతో విని, మన కోర్కెలను నెఱవేర్చుదురని మొదట మనము తలంచితిమి. ఈ యధికారవర్గమువా రందరును చాలామంచి యుదారభావములు గలవా రనియు, విశాలహృదయు లనియును, మంచి సుజ్ఞాను లనియును, గనుక మన కోర్కెలను వారికి తెలియజెప్పుకొనుటయే తడవుగ వారు మన యిక్కట్టుల నెల్ల తొలగింతురనియు నూహించితిమి. కాని గత 60 సంవత్సరములనుండియు, నీరాజ్యపాలనాధికారమును వహించిన, ఈయధికారవర్గమువారి ప్రవర్తనవలన మన యాశ లన్నియు నడుగంటినవి. మన మెంతబిగ్గరగ నరచి గోలకెత్తినను, మన మెంతపట్టుదలతో నాందోళనము గావించినను, మన మెన్నికారణములనుజూపి బలముగ వాదించి

నను, గవర్నమెంటువారు ప్రచురించిన రిపోర్టులు మొదలగు రికార్డులలోనుండి లెక్కల నెత్తిజూపి వారియెదుటబెట్టి యెడతెగక వాదించినను, ఇవేవియు నధికారిధూర్వహుల కండ్లకు గోచరముగానంత దృష్టిమాంద్యము తటస్థించెను. నిజస్థితి వారికి గోచరించుట లేదు. వారుచెప్పిన కారణములే, వారువేసిన లెక్కలే, వారిమనస్సునకు నచ్చుటలేదు. మన మేమైన చెప్పకొనినయెడల దానిని ప్రతిఘటించుటయెట్లా యని వారుయోచించు చుందురు. మనకు ప్రతికూలముగనుండు దానిని బట్టుకొనియే ప్రేలాడుచుదురు. మనలో కొందరి కీ యుద్దేశములు గలవు ఏమన.-"దీనిలో నాశ్చర్య మే మున్నది. పూర్వము మన దేశములో మహమ్మదీయు లేలినను, హిందువులేలినను, పీష్వాలురాజ్యము చేసినను, నగర చక్రవర్తులు రాజ్యము చేసినను, ఎవరేమి చేసినను అవి యన్నియు వెనుకటి దినములలోని మాటలు. ఆ రాజ్యములన్నియు పోయినవి. ఇప్పుడు ప్రస్తుతము ఆంగ్లేయులు మనకు ప్రభువులైనారు. కనుక వారి యిష్టము వచ్చినట్లు వారికి లాభముకలుగు నట్లుగనే రాజ్యమేలెదరు. మధ్యను మీరేల గోల పెట్టెదరు? మీరెంత గోలపెట్టినను వారి యిష్టప్రకారమే జరిగితీరును. అదిగాక మీకేకల వలన ప్రభుత్వమువారి మనస్సునకు కష్టముతోచి, వారి మనశ్శాంతికి భంగము కలుగునే గాని వేరులాభ మేమియు నుండదు. కనుక మీరీ కేకలు వేయకుండ నూరకొనుడు. వారు దయాధర్మ బిచ్చముగ నిచ్చుదానిని సంతోష పూర్వకముగ నందుకొని తృప్తి నొందుడు. వారు దయచేయు స్వల్పదానమును (రొట్టెముక్కను) వందన పూర్వకముగ గ్రహించి కృతజ్ఞులై యుండుడి" యని కొందరు మనకు హితము బోధింతురు. కాని నేనీ యభిప్రాయముతో నేకీభవింప జాలనని మనవి చేసికొను చున్నాను. నాయభిప్రాయ మేమన:—ఏప్రభుత్వమైనను, ఆంగ్లేయమైనను. తదితర మైనను, ప్రభుత్వమను పేరు పెట్టుకొనిన తరువాత నది నెరవేర్ప వలసిన ధర్మములు కొన్ని గలవు దైవనిర్ణీతమైన విధులు, ధర్మములు కొన్నిగలవు. కొంత జవాబుదారిని, కొంత భారమును తన నెత్తిమీద పెట్టుకొని తీరవలెను. ఈధర్మములనన్నిటి నుల్లంఘింప జూచు ప్రభుత్వము ప్రభుత్వము కాదనియే నే జెప్పవలసి వచ్చును. ప్రభుత్వము వారికి కొన్ని హక్కులుండును; కొంత యధికారముండును. ఈయధికార మనేక విధములై యుండవచ్చును. కేవలము కత్తికట్టి దేశమును వశపరచుకొనిన కారణముచేత లభించిన యధికారమై యుండవచ్చును: లేదా ప్రజలే తమంతటతాము ప్రభుత్వ సంఘమువారికి, పరిపాలనను క్రమముగ నడుపునిమిత్తమై యొసంగిన యధికారమై యుండవచ్చును. ఏది యెట్లున్నను, సామాన్యనరులు గమనింపవలసిన ధర్మము లెట్లుగలవో, అట్లే ప్రభుత్వమువారు కూడ నెరవేర్పవలసిన ధర్మములు కొన్నికలవు. నిజమే, మన ప్రభుత్వము వారిట్టి ధర్మముల కొన్నిటి నిదివరకు నెఱవేర్చియే యున్నారు. ఈప్రభుత్వమువారు రోడ్లువేయలేదా? పోష్టాఫీసు లేర్పరుపలేదా? టెల్లిగ్రాము లేర్పాటు చేయలేదా? ఈ కార్యములన్నియు నెరవేర్చినమాట వాస్తవమే. రేపెవరైన వచ్చి మీతో "ప్రభుత్వము వారు రోడ్లువేయకపోయిన నేమి? వారియిష్టము: వారియిష్టమైన వేయుదురు, లేకపోయిన లేదు" అని చెప్పినయెడల మీరేమని బదులు చెప్పుదురు? మీరేమని వానిని

చీవాట్లు పెట్టుదురు? "ఈపనులన్నియు ప్రభుత్వమువారు చేయనియెడల, మనమందఱ మేల పన్నులను జెల్లింపుచున్నాము?" మనమీదవేసిన పన్నుల నన్నిటిని సర్వజనోపయోగకరమైన పనుల గావింపుటకై ప్రభుత్వమువారు వినియోగపఱుపని యెడల, మన పద్దనుండి యే పన్నులను తీసికొనుటకును గవర్నమెంటువారి కేవిధమైన యధికారము లేదు. గవర్నమెంటువారు పన్నులను తీసికొనుట ప్రజల మేలుకొఱకే యని యెఱుంగునది. ఈ గవర్నమెంటు మంచిదని యెవరైన మీయెదుట చెప్పినప్పుడు వారేమి నిదర్శనములను జూపెదరు? "ఈగవర్నమెంటు రైళ్ళు వేసినది; రోడ్లువేసినది; పోష్టు టెల్లిగ్రాపు ఆఫీసులు పెట్టించినది. యివన్నియు మీ మేలుకొఱకుగాదా?" యని యీప్రశ్నలే యెల్లప్పుడడుగుచుందురు. "అట్లయిన యీ ప్రభుత్వమునుగూర్చి మీరేల గోలపెట్టెదరు" అని మనల నడుగుచుందురు. ఈపనుల నన్నిటిని గవర్నమెంటు వారు చేయలేదని నే జెప్పను. కాని చేసినవి చాలవని యనెదను. వారీపనుల నన్నిటిని చేసినమాటవాస్తవమే. వీనినన్నిటిని బహుభాగుగ నెరవేర్చిరి. పూర్వప్రభుత్వములలో కంటె యీ ప్రభుత్వములోనే యివన్నియు నెక్కువ బాగుగ నిర్వహింపబడినవి. ఇది యెంతయు వారికి గౌరవమే. కాని వీనియన్నిటికంటె నెక్కువ ముఖ్యమైన, అత్యంతావశ్యమైన, కార్యములనెల్ల గావింపవలసిన పనులు మిక్కుటముగ నున్నవి. కాని ఆ పనులను చేయుటమను తలంపే వారి కింతవఱకును గలిగియుండలేదు. ఒకవేళ మనము వానిని గూర్చి వారితో ముచ్చటించిన యెడల వారిని మనము నిందించు చున్నామని ఎవరు మనపైననే నిష్ఠురము వేయుదురు. ఇట్లు మన మెన్ని విధముల గోల పెట్టినను వారు మన కోర్కెలను నెరవేర్పకున్నారు అదిగాక వారితో వీనివిషయమై చెప్పనే కూడదట. ఇట్లు తలంచు ప్రభుత్వము నిజమైన ప్రభుత్వము కాజాలదు. ఇక నిజమైన ప్రభుత్వ మన నెట్టిది? దీనిని గూర్చి కొంచ మాలోచింపవలయును. ప్రస్తుత పద్ధతికిని, పూర్వపద్ధతికిని చాల భేదమున్నది. కలెక్టరుగాని లేక యే శివిల్ ఉద్యోగస్థుడుగాని గవర్నమెంటు కాజాలడు. గవర్నమెంటనగా పోలీసు బంట్రోతుకాదు. మన దేశము మీదనున్న ఆంగ్లపాలన నున్నట్లుంచి, దానికే విధమైన హానియు జరుగకుండ, దానిని బలహీనపరుపకుండ యేమైన చేయ వీలున్న యెడల చేయుడని కోరుట యెంత మాత్రమును రాజద్రోహము కానేరదు. ప్రస్తుతము మనమీదనున్న ఆంగ్లేయపాలన మనకుండవలెను. కాని నడుమనున్న యీ కొట్టు కాపలాదార్లు మాకక్కఱలేదు, (చప్పట్లు) కొట్టులోనున్న ధాన్యము యజమానునిది; సామాగ్రి యజమానునిది. కాని యీ ధాన్యము నెవరికైన దానము చేయుట యన యీకొట్టు కాపలాదార్లకు గిట్టదు. కనుక యీకడుపు మంటచే కొట్టుకొనుచుండు యీ కాపలాదార్లనుతొలగించి ఆ యధికారమును ప్రజలకే దయచేయండి. అట్లయిన మా ప్రజలు తమ యిష్టప్రకారము తమ దేశ వ్యవహారములను చక్కబెట్టుకొందురు. మన మిట్టి స్వరాజ్యమునే గోరుచున్నాము. స్వరాజ్యమనగ ఆంగ్లేయప్రభుత్వమును తీసివేసి, చక్రవర్తిపాలనను తీసివేసి, తత్స్థానమున మన స్వదేశ సంస్థానాధీశుల నొకరిని నెలకొల్పవలసినదని కాదు. స్వరాజ్యము

నకు మొన్న జిల్లాములో కపర్ది గారొక మంచి సామ్యమును జెప్పిరి. దేవాలయములో నున్న విగ్రహముల నటుల నేయుంచి, మధ్యనున్న నంబి పూజారులను తీసివేయవలసినది. ఇదియే స్వరాజ్యము. ఈ పూజారులను తీసివేసి, మాలో వారిని పూజారులనుగ యేర్పరుపవలసినదని మేము కోరుచున్నాము. ఈ పూజారులు మా కక్కరలేదు. మధ్యనున్న యీ కలెక్టరులు, కమిషనరులు, మొదలయిన వారు మా కక్కరలేదు. మనమీద నిప్పుడధికారము చలాయించుచున్న దెవరు? చక్రవర్తి వచ్చి యధికారము చేయుటలేదు; ఆయన సీమలో నున్నాడు. మన కష్టనిష్ఠురముల నన్నిటిని ఆయనకు తెలియజెప్పుకొని, ఆయనతో మొరపెట్టుకొనిన యెడల, పాపమాయన మనకు మేలు చేయవలయుననియే యెల్లప్పుడును కోరుచుండును. కాని ఆయన కోర్కె నెరవేరక పోవుటకు కారణమేమి? ఇదిగో! యీ మధ్యనున్న పూజారుల మూలముననే! గనుకనే యీ పూజారులు యీ యర్చకులు మా కక్కరలేదు. (చప్పట్లు) ఈ పూజారులు చాల తెలివిగలవారు. వీరిని తీసివేయవలసినదని మనము చెప్పగనే వారేమి బదులు చెప్పుచున్నారు? "ఆః! మేమనేక పరీక్షలనిచ్చినాము; మేమనేక పనులను చేయగలము." అని వాదింతురు. నిజమే ఇదంతయు సత్యమే. కాని యీ పూజారుల దృష్టియంతయు నెల్లప్పుడు వారికి వచ్చు "మామూళ్ళ"మీదనుండును; గనుక యీ పూజారిత్వము, యీ అర్చకత్వము, మా చేతులలోనే యుండవలెను. భండారిపుర దేవాలయములో నున్న అర్చకులును వీరును ఒక్కటియే. (చప్పట్లు) ఇప్పు డర్చకులు గనున్న యీ యధికారవర్గము వారిని తొలగించిన యెడల చక్రవర్తి కేమైన నష్టము వచ్చునా? అట్లెంత మాత్రమును రాదు. కాని యీ యింగ్లీషు శివిల్ ఉద్యోగస్థులందరును చక్రవర్తి జాతివారు కారాయని కొందరనవచ్చును. కాని మనమును వారితో సమానముగ చక్రవర్తి ప్రజలమే. అట్లయినప్పుడు, తెల్లవారు, నల్లవారు నను భేదమాయన యెంచడు. ఇట్లు భేదము దీయుటకాయన సమ్మతింపడు. "స్వరాజ్య" మనగా మ్యునిసిపల్, లోకల్ వ్యవహారములు మన చేతులలో నుండుటకాదా యని కొందరనెదరు. కాని యిది యెంతయు హాస్యాస్పదము. ప్రస్తుత స్థితి గతులను బట్టి మనకిది చాలదు. ఒక్క మ్యునిసిపల్, లోకల్ వ్యవహారములలో స్వాతంత్రముండిన చాలదు. ఈ మ్యునిసిపల్ లోకల్ వ్యవహారములలో నైనను మనకు పూర్ణస్వాతంత్ర్యములేదు. ఏలయన యీ విషయములలో మనము కలెక్టరునకు విధేయులమై యుండవలెను. కలెక్టరు ఆర్డరు ప్రకారమే వర్తింపవలెను. లోకల్ వ్యవహారములలో కలెక్టరునకు జోక్యము కలిగించుకొనుటకు అధికారము కలదు. మ్యునిసిపల్ చెయిరుమెన్‌ను పిలిపించి "నీ వీ ఫలాని పనిని చేయు"మని యతని కాజ్ఞాపించుటకు కలెక్టరునకు అధికారము కలదు. ఒకవేళ ఆ చెయిరుమెన్ అట్లు చేయని యెడల వెంటనే యీ చెయిర్‌మెన్‌ను (డిస్‌మిస్ చేసి) తొలగింప గల అధికారము కలెక్టరునకు గలదు. అట్లయిన యెడల మనకు స్వరాజ్య మెక్కడనున్నది? స్వరాజ్యశబ్దార్థభావమేమి? చక్రవర్తి యుండవలెను; ఆంగ్లేయ ప్రభుత్వముండవలెను. కాని మన దేశమునకు సంబంధించిన ఆంతరంగిక రాజ్యాంగవ్యవహారముల నన్నిటిని పరిష్కరించు కొనగల

యధికారము పూర్ణముగ మన ప్రజల చేతులలోనే యుండవలెను. స్వరాజ్యమను పదమునకు మనము చెప్పు అర్థమిది. మనము కోరునది ఆంగ్లేయాధికారమును తగ్గింపవలయునని కాదు. ఆంగ్లేయ ప్రభుత్వము వెళ్ళిపోవలసినదని కాదు. దాని స్థానమందు జర్మను ప్రభుత్వము రావలసినదని కాదు. అట్లుగాక 'జర్మను ప్రభుత్వ మిచ్చటికి రావలెన'ని మనము కోరుచుండుట లేదని యీ వర్తమాన మహాసంగ్రామమువలన తేటబడుచున్నది. యీ విషయమును ప్రపంచమంతయు చూచియేయున్నది. ఆహా ! ఆంగ్ల ప్రభుత్వ మిచ్చట చిరస్థాయిగనుండు గాక యని మన భారతీయులు సహస్రకొలది సంఖ్యలుగ దూరదేశములందు గడగడ వణకించు శీతల దేశములందు తమ ప్రాణములను ధారవోయుచున్నారు. (వినుడు, వినుడు, చప్పట్లు) ఇంక నేమికలదు ? ఈ ప్రభుత్వము స్థిరముగనుండుటకు యీ ప్రభుత్వము పోయి జర్మను ప్రభుత్వము రాకుండనుండుటకు మనము మన (ప్రాణములను) ధనమును ధారవోయుచున్నాము. మనము ఆంగ్ల ప్రజలంత ధనవంతులము గాక పోయినను మన శక్తికొలది ధనసహాయమును చేయుచున్నాము. మన శక్తివంచనలేక మన సిపాయిలను పరసీమలకు పంపితిమి వారు యుద్ధరంగమున సామ్రాజ్యరక్షణార్థము తమ ప్రాణముల నర్పించిరి. ఇంతకంటె నేమి కావలయును. జర్మనీ మొదలగు పరదేశములవారు కూడ మా భారతదేశ సైన్యములను చూచి విస్మితులయి వారిని వేనోళ్ళ బొగడిరి. (చప్పట్లు) స్వామిభక్తియన నిట్లుండవలయునని ప్రపంచమునకు జాటుటకోయన మనభారత వీరయోధులు తమ రక్తనాళములనుండి, తమ జీవరక్తమును ప్రేమను రణ భూమిపై ధారపోయుచున్నారు. (చప్పట్లు, వినండి, వినండి) ధర్మము, న్యాయము తన పక్షమునన్నదని చూపించుటకింతకంటె బలవత్తరమైన ప్రమాణ మింకెవడును జూపజాలడని నా నమ్మకము. ఇచ్చట మన కాంగ్లప్రభుత్వమే యుండవలెనని మనము కోరుచుండుట నిర్వివాదాంశము అందులకై మనము పాటుబడుచుంటిమి. కనుక నిట్టి సందర్భములో యీ నడుమనున్న పూజారుల నేల తీసివేయరాదు ? * బ్రిటిష్ సామ్రాజ్యాంతర్భాగములైన తక్కిన దేశములలోనున్న ప్రజలందరు ననుభవించు హక్కులే మాకుకూడ నేల యనుగ్రహింపరాదు ! బుద్ధి వైభవములోగాని, ధైర్యస్థైర్యాది వీరపురుషోచిత గుణసంపదలోగాని మే మితరులకు, అవంతయైనను తీసిపోము. వారికున్న శక్తిసామర్థ్యములే మాకు

* బ్రిటిషు సామ్రాజ్యమునకు లోబడిన దేశము మన దేశ మొకటేకాదు కనడా, ఆస్ట్రేలియా, యను దేశములుకూడ యీ రాజ్యముక్రిందనే నున్నవి. నిజమాలోచించిన యీబ్రిటిషు రాజ్యముక్రిందనున్న దేశములన్నిటికిని సమానహక్కులుండవలయును గద. కాని, అదియేమి కర్మమోగాని, ఆస్ట్రేలియా, కనడా, దేశములకున్న హక్కులు మన భారతదేశమునకు లేవు. ఈ దేశముల కిచ్చిన హక్కులే మాకుకూడ నివ్వవలయునని మనము కోరుచున్నాము. ఈ దేశములకు వలస దేశములని పేరు గనుక వలస దేశపరిపాలనా పద్ధతియే మాకును కలుగజేయుడు అని కోరుచున్నాము; ఇదియే స్వరాజ్యము.

నున్నవి. అట్లయినప్పుడు స్వరాజ్యపు హక్కులను వారికిచ్చి మాకేల నియ్యరు ? ఇట్టిబుద్ధిని వారు చక్రవర్తికేల పుట్టింపవలెను ? ఆంగ్లేయ ప్రభుత్వములో నొకవింత పద్ధతికలదు. మంత్రులసలహా ననుసరించియే చక్రవర్తి రాజ్యమేలును. అయినను చక్రవర్తికి మంత్రులిట్టి సలహా నేల చెప్పవలెను ? ప్రస్తుత మధికారమంతయు అధికార వర్గమువారి చేతులోనున్నది. వీరందరును తెల్లదొరలే. ఒకవేళ మనదేశీయున కెవనికైన అధికారపదవి వహించు భాగ్యము లభించినయెడల, వాడుకూడ వారితోబాటే యగుచున్నాడు. నేను కేవలము తెల్లవాండ్లను గూర్చియే మాట్లాడుచున్నానని యనుకొనవద్దు. నేను చెప్పునదేమనగ:—మనకీ పద్ధతియే యక్కరలేదు: ఈ పద్ధతియే బాగుండలేదు. ఎవడో మనవాడొకడు బోయి, వారితోబాటు కూర్చుండిన నేమి లాభమున్నది. అతడొక్కడుండి మనకేమి మేలుచేయగలడు ? గనుక మన కీపద్ధతియే పనికిరాదని చెప్పుచున్నాము; ఈ పద్ధతిని తీసివేయవలెను. ఒకరికో, యిద్దరికో, గొప్ప యుద్యోగము లిచ్చినంత మాత్రముచేత మాకు తృప్తికానేరదు. సరే! మొదట నీ పద్ధతి నెవరు యేర్పరచిరి ? నిజముగ, చక్రవర్తివచ్చి యేర్పరుపలేదు. 1858 సంవత్సరములో మన విక్టోరియారాణిగారు చేసిన "ప్రకటన" లోని వాగ్దానములకును, నేటి పరిపాలనా పద్ధతికిని యెంత భేదమున్నదో చూడుడు ! మనము నేడు మన స్వాభివృద్ధికై పాటుబడలేక అశక్తులమై యున్నాము. విదేశవస్తువులు మనదేశములోనికి రాకుండ జేయుటకై విదేశవస్తువుల దిగుమతులమీద పన్నులువేసి, మన స్వదేశపరిశ్రమల పెంపొందింప దలచిన యెడల అట్లుచేయుటకు తగిన యధికారము మనచేతులలో లేదు. గొప్ప గొప్ప జీతములిచ్చి పరదేశములనుండి, (పరిశ్రమ విద్యల నెల్ల నేర్పగల) ఉపాధ్యాయులను పిలిపింప దలచుకొనిన యెడల, మన మట్లు చేయుట కధికారము మన చేతులలోలేదు. ఒక విద్యావ్యాపన విషయమై విచారించి చూడుడు. ఇదెంతయు స్వల్పవిషయము. హిందువైనను, మహమ్మదీయుడైనను, మరి యెవడైనను కనీసము చదువను, వ్రాయనైన నేర్చుకొనియుండవలెను. చదువను వ్రాయను నేర్చుకొని నందువలన కొంతవరకు లాభముకలదని ప్రపంచములోనుండు ప్రతిమానవునకును తెలిసిన విషయమే. దీని విషయమై సందేహ మేమియును లేదు; క్రొత్తగ దీని నెవరికిని బోధింపవలసిన పనిలేదు. "ఈ దేశములో ప్రతివాడును చదువుకొని తీరవలయును." అని నిర్బంధశాసనమేల కావింపకూడదు ? ప్రతిదానికిని "ఫండులేదు" అని యెవరభ్యంతర పెట్టుచున్నారు ? ఇది అధికార వర్గమువారు చెప్పు వంక. ఏ యుద్యోగస్థుని కైనను 2 వేల 5 వందల రూపాయిల నుండి మూడువేల రూపాయిలకు జీతమెక్కువ చేయుటకు ఫండుకనిపించును. యూరపియన్ ఉద్యోగస్థులకు "మారకపు ముజరా" (Exchange Compensation) యివ్వవలసి వచ్చినపుడు కావలసినంత ఫండు కనపడును. ఈ మారకపు వ్యవహారమువలన, రూపాయిఖరీదు తగ్గినప్పుడు మన గవర్నమెంటువారు ఆరుకోట్ల రూపాయలను వ్యయపరచిరి. దీనికై యప్పుడు కావలసినంత "ఫండు" కనుపడినది. (ఈ విధముగ ఖర్చుపెట్టుటకు డబ్బువచ్చును

గాని, విద్య విషయము వచ్చినప్పుడు మాత్రము డబ్బు కనుపింపదు) మన చేతులలో నధికారముండిన గాని యీ వ్యవహారము చక్కబడ నేరదు.

ప్రజలకు చదువు చెప్పింపవలసివచ్చినప్పుడు డబ్బు కనిపింపదు గాని కలెక్టరు నకు నెలకు 2 వేల 5 వందల రూపాయీల పెద్దజీతము లివ్వవలసివచ్చినప్పుడు మాత్రము డబ్బు కనిపించును! ఏవిషయమునుగూర్చి యైనను మనమాలోచింపు విధమున ఈ యధికారివర్గమువా రాలోచింపరు. మొట్టమొదట విద్యావ్యాపనకై ధనమును వెచ్చింపవలెను. ప్రజ లందరును చదువను వ్రాయను నేర్చినయెడల ఇప్పుడు జరుగు చున్న నేరముల సంఖ్య వేలకువేలు తగ్గిపోవును. ఎవరి వ్యాపారములను వారు తెలివి తేటలతో చక్కగ నిర్వహించుకొనెదరు. ఏది లాభమో, ఏది నష్టమో వారు బాగుగ గ్రహింపగలుగుదురు. ప్రజ లీ విధముగ సమర్థులైనప్పుడు, వారిని పాలించు టకు 2500 రూపాయల ఉద్యోగస్థుడు అవసరము లేదు. 500 రూపాయల ఉద్యోగస్థుడు చాలును. తక్కిన 2 వేల రూపాయిలను విద్యావ్యాప్తికై వెచ్చించెదము. ప్రస్తుతము యే యితర దేశములోను యింతయెక్కువ జీతములు గల ఉద్యోగస్థులు లేరు. మన హిందూదేశమును పరిపాలించుటకువచ్చు వైస్రాయికి నెలకు 20 వేల రూపాయిల జీత మిచ్చుచున్నారు కాని సీమలో ముఖ్య మంత్రికి 5 వేలే. సీమలోనుండి బ్రిటిషుసామ్రాజ్య వ్యవహారముల నన్నిటిని జూచు వానికి 5 వేలును, యిచ్చట ఒక్క యీ హిందూదేశ వ్యవహారములను జూచు వానికి 20 వేలును జీత మిచ్చుచున్నారు! ఎందువలన? దీనికి జవాబు లేదు. ఎందు వలన ననగా, ఇచ్చట జరుగు పరిపాలనకు కావలసిన ధనమునంతను మనమే యిచ్చు కొనుచున్నాము. దీనికగు డబ్బంతయు మనమే పెట్టుకొనుచున్నాము గనుక (చప్పట్లు) అదిగో! అచ్చట హిందూదేశ మున్నది. మీ రంద రచ్చటికి బోయి మీ యిష్టము వచ్చినట్లు మెక్కితినండి అని అధికారిధూర్వహుల నిచ్చటికి పంపెదరు. పరుల దుకాణములో కొట్టు పెత్తనమంతయు నీ చేతులలో బెట్టిన నీవేమి చేయుదువు? కొట్టు గుమాస్తా నీ వాడైనయెడల వానికి నెలకు 100 రూపాయిలు జీత మిత్తువు. అదియే నీ సొంతకొట్టు అయినయెడల వానికి 50 రూపాయిలు జీత మే యిచ్చెదవు.

ప్రస్తుత వ్యవహార మంతయు నీ విధముగ జరుగుచున్నది. ఈ పద్ధతివలన మన కేమియు లాభము కలుగుట లేదు ఈ వ్యవహారము లన్నియు మొదట మన దృష్టి పథమున బడినది యిప్పుడు కాదు; 50 సం॥ల క్రిందటనే యివన్నియు మనకు తెలిసి నవి. 1906 వ సంవత్సరములో కలకత్తాలో దేశీయమహాసభ (కాంగ్రెసు) జరిగి నప్పుడు దాదాభాయి నౌరోజిగారు ఈ విషయమునే సుస్పష్టముగ తెలియజెప్పి యున్నారు. ఇప్పుడు జరుగుచున్న అక్రమమును తొలగించుటకును, మన హిందూ దేశములో జరుగు అన్యాయమును తొలగించుటకును అధికారము మన చేతులలోనికి వచ్చుటకంటె వేరొండు మందులేదని, ఆయన తన 50 సంవత్సరముల అనుభవము మీద చెప్పియున్నారు; దీనికే స్వరాజ్యమని పేరుపెట్టినారు. అది ప్రజలచేతులలో

నుండవలెను. మన యిండ్లలో నేమి జేసికొనవలెనో, మన గ్రామములో నేమి జేసికొనవలెనో, మన దేశములో నేమి జేసికొనవలెనో, మన రాజధానిలో నేమి జేసికొనవలెనో ఈ మొదలగు వివిధయేర్పాటులను గూర్చి మనమే స్వయముగ నిర్ణయించుకొనవలెను. ఇట్లుమనమే నిర్ణయించుకొనినయెడల ధనవ్యయము తక్కువగును, వచ్చిన డబ్బును పొదుపుగ వాడుకొందుము. అదిగాక కావలసిన కార్యములన్నియు చక్కగ నెఱవేఱును. ఏ పనులకు ధన మెక్కువ వ్యయపఱుపవలెనో, ఏ పనులకు తక్కువ ఖర్చు పెట్టవలెనో, మనమే నిర్ణయించుకొనినయెడల, మన కెక్కువ లాభకారిగ నుండును గదా. అధికారివర్గమువారు మనకు తెలివితేటలు లేవని శలవిచ్చుచున్నారు. మహాతెలివి! వారికే తప్ప యింకెవరికిని లేనట్లు! వారిజీతము వారికెట్లుముట్టునా యనునది వారి మొదటియాలోచన! "గవర్నమెంటు ట్రెజరీలోనికి డబ్బురాగనే, మొట్టమొదట వారిజీతములకైన ఖర్చు యిచ్చి తీరవలెను. మిలిటరీ ఖర్చు మొదట నిచ్చి తీరవలెను. మొట్టమొదట వారికగు ఖర్చు పూర్తిగ చెల్లింపవలెను. ఇదంతయు, పూర్తియైన పిమ్మట ఏమైన మిగిలిన యెడల విద్యకొరకు ఖర్చు పెట్టుదురు. విద్య అక్కరలేదని వారు చెప్పరు; వారికండ్లకు విద్య చెడ్డవస్తువుకాదు. వారికగు వ్యయమంతయు నిచ్చిన పిమ్మట, వీలుండిన యెడల, ప్రజలకు విద్య చెప్పింతురు: ఈఖర్చంతయు తీసికొనిన పిమ్మట ప్రజల కష్టసుఖములను గూర్చి యోచింతురు. కాని రాజ్యపాలనాధికారము మనచేతులలో నుండినయెడల మనమేమి చేయుదుము! ఈయుద్యోగస్తుల నందరకును యెక్కువజీతము లిచ్చుచున్నారని తోచినతోడనే, వారిజీతములన్నిటిని వెంటనే తగ్గించి "అయ్యలారా! మీరందరు దేశక్షేమమునకై యీ తక్కువ జీతములు పుచ్చుకొనియే పనిచేసితీరవలెను" అని వారికి తెలియజెప్పుదుము. ఈవ్యవహారముల నన్నిటిని మనమీవిధముగ నిర్వహించుకొనుచుండిననే గాని, మన మిప్పుడింతగా కావలయుననికోరు వ్యవహారము లన్నియు చక్కబడనేరవు. మనంతట మనము నిర్వహించుకొనుచున్నప్పుడే యీ వ్యవహారములు చక్కబడ గలవు. కాని నే నిప్పుడు చెప్పునవన్నియు వట్టినోటిమాటలే; మెట్ట వేదాంతములే. ఇవన్నియు నాచరణలో జరుగుట యెట్లు? దీనికిప్పుడు వచ్చినకష్టమేమి? మరాటీభాషలో నొక సామెతయున్నది. ఒకడు మూడుప్రశ్న లడిగెను. ఒకటి:— గుర్రమెందుకు పెంకెతనము (లేక హరాం) చేయుచున్నది? రెండు:— తమలపాకు లెందుకు కుళ్ళిపోవుచున్నవి? మూడు:— రొట్టెయెందుకు మాడిపోవుచున్నది? ఈ మూడు ప్రశ్నలకు నొకటే ప్రత్యుత్తరము. ఎందుకనగ "త్రిప్పలేదు గనుక". ఆ విధముననే, మన రాజధానిలో త్రాగుడెందుకు తగ్గలేదు? అడవులలో మన ప్రజలపైన నింత బలాత్కారాధికారి మేలయుండవలెను? ప్రజలకు చదువు చెప్పించుటకు డబ్బెందుకులేదు? వీని కన్నిటికి ఒకటే ప్రత్యుత్తరము. "రాజ్యపాలనాధికారము మనచేతులలో లేదు గనుక." ఎంతకాలమువఱకు మనచేతులలోనికి రాజ్యపాలనాధికారము రాకుండనుండునో, అంతవరకును మన భారతవర్షమునకు శుభోదయము కాజాలదు. చక్రవర్తి యెవరైనను మన మాయనజోలికిబోము. మనదేశమునకు సంబంధించిన

మత సాంఘిక వాణిజ్య వ్యాపారముల వ్యవహారములన్నియు మనమే నిర్వహించుకొనవలయును. ప్రస్తుతము వీనిలో కొన్నిటినైన నిర్వహించుకొనుట కధికారము మన చేతులలోనికి రానియెడల మన దేశమునకు శుభోదయము కాజాలదు; ప్రస్తుతము కొంతయధికారి మైనను మనకిచ్చి పిమ్మట పూర్ణాధికారమును తుదకు మన చేతులలోనే పెట్టితీరవలయును. ఇట్లు గావించిననే గాని మనదేశమునకు మంచి దినములు రానేరవు; ధనధాన్య సమృద్ధి కాజాలదు మంచినీళ్ళు త్రాగవలెనన్న యితరుల నోటితో త్రాగజాలము: మనంతట మనమే మననోటితోడనె త్రాగవలెను. కాని ప్రస్తుతము మనము యితరులనోటి తోడనే త్రాగుచున్నాము. మన నూతినీళ్ళు మనమే తోడుకొని, మనంతట మనమే త్రాగవలెను. ఒకవేళ ఆ నూయి గవర్నమెంటు వారిదైన యెడల, దాని కవుసరమైన యెడల సెలకొక రూపాయిపన్ను నివ్వవచ్చును గాని అసలు అధికారము మనకే యుండవలెను. మనకీ యధికారము లేనియెడల, వేరొక మోక్షమార్గము లేదు. ఈ రాజకీయతత్వ రహస్య మిదివరకే చరిత్రాత్మకముగను, న్యాయ, సాంఘిక శాస్త్రాత్మకముగను సిద్ధాంతీకరింపబడి యున్నది. అట్లయిన యెడల ఇన్నిదినముల నుండియు, యీ సంగతిని మీరేల మాకు తెలియజెప్పలేదని మీరడుగవచ్చును. దీనికి నే జెప్పు సమాధాన మేమనగ:—ప్రస్తుతము అధికారము మన చేతులలోనికి రాగల యవకాశము లనేకములు కన్పించుచున్నవి. బహుశః అధికారము మన చేతులలోనికి రావచ్చునని తోచుచున్నది; ఇది మంచి యనుకూల సమయముగ గన్పట్టుచున్నది. ఇంతవరకును సీమలోని ఆంగ్లప్రజలు మన భారతవర్షమనిన తమ మెరలోని పెద్దబంగరాయిగ నెంచుకొనుచుండిరి. ఈదేశ మనిన వారికెంతయో భారముగ దోచుచుండెడిది. "భారతీయు లందరును కలిసి 30 కోట్ల ప్రజలున్నారు. గనుక వీరెప్పుడో యొకప్పుడు సమయము కనిపెట్టి మనమీదపడి; మనరాజ్యమును ధ్వంసము చేయుదురు: వీరి చేతులలో ఆయుధము లుంచుట మన కెంతయు అపాయకరము. గనుక వీరిని నిరాయుధులనుగ చేయవలయును; ప్రజల నందరను సాధ్యమైనంతవరకు మన యధికారము క్రిందనే యణచియుంచుకొని, బానిసలవలె జూడవలెను" అని నిన్నమొన్నటివరకును, సీమలోని ఆంగ్లప్రజలు తలంచుచుండిరి. కాని యిప్పుడిట్టిస్థితి మారినది. ఈవర్తమాన మహాసంగ్రామమువలన (వారికిట్టి యూహలన్నియు మారిపోయినవి). సామ్రాజ్యాంతర్భాగము లగు దేశము లన్నియు కలిసి సంఘీభావముతో నుండిననేగాని, మన సామ్రాజ్యమునకు తగినంత బలమేర్పడదని యిప్పుడిప్పుడు వారు తలపోయ మొదలిడిచున్నారు. ఆస్ట్రేలియా, న్యూజిలాండు, కెనడా మొదలగు వలస దేశముల సహాయ ముండితీరవలయునని ఆంగ్లేయ రాజకీయవేత్తల కిప్పుడు జ్ఞానోదయమగుచున్నది; వారి కిప్పుడు కలిగినట్టి జ్ఞానోదయము నాధారము చేసికొని, ఈ యవకాశమును జూచుకొని, మన హక్కులకై మనము పాటుబడవలెను. ఇదియే మనకు మంచి యనుకూలమైన తరుణము. "కత్తిగట్టి వారిమీద తిరుగబడి మీ హక్కులను సంపాదించుకొనుడు" ని మీ కెవరును చెప్పుటలేదు. ఈవర్తమాన కాలమున భారత జాతీయుల మానసములు గొప్పపరిణామావస్థను జెందియున్నది. దేశముయొక్క దృష్టి

పక్ష మంతయు మారిపోయినది. భారతవర్ష మాంగ్లేయ దేశమునకు కొంత సహాయకారి కాగలదు. మన భారతవర్షము క్షేమముగనున్న యెడల సీమదేశమునకు కూడ కొంత వరకు ప్రఖ్యాతి, కీర్తి, బలము, ఔన్నత్యము కలుగగలదు. ఈవిషయముల నిప్పుడే ఆంగ్లప్రజలు గ్రహింపగలిగినారు. ఈ యవకాశమును మనము జారవిడువ కూడదు. ఇప్పుడిట్టి యవకాశమును జారవిడిచిన యెడల, ఇట్టి మంచియవకాశ మెన్నడును తిరిగి వచ్చుట దుర్లభము. అధికార ధూర్వహులీ యవకాశమును తమ కెంతయు నశుభ దాయకముగ జింతించెదరు. కాని దీనివలన వచ్చునష్ట మెవరికి? నిజముగ, చక్రవర్తి కెంత మాత్రమును నష్టములేదు, అధికార ధూర్వహులకే నష్టము వచ్చును; గాని వారు దీని నశుభముగ నెంచెదరు. మనము స్వరాజ్యమునకై పాటుపడుట వారి కెంతమాత్ర మును గిట్టదు. "మీరు స్వరాజ్యము చేసికొనలేరు. మీరు అసమర్థులు, మీచేత గాదు' గనుక మీపైన రాజ్యము చేయుటకు మే మిచ్చటికి వచ్చినాము" అని వారు బిగ్గరగ కేకలువేయ మొదలిడిరి. పాపము! వారిచ్చటికి రాకపూర్వము మన భారత దేశమునందు స్వరాజ్యములు లేవుకాబోలు! మన మందరము రాక్షసులము కాబోలు! ఒకరి నొకరము నరకుచు తెగనరికికొను చుండెడివారము కాబోలు! పాపము! పీష్వాల ప్రభుత్వకాలములో క్రమమైన రాజ్యపరిపాలనా పద్ధతియే లేదని వారి యూహ! మొగ లాయిల రాజ్యములో క్రమమైన పాలనాపద్ధతి లేదనియే వారియూహ, రాచకీయ వ్యవహారములను మనము నిర్వహింప లేమనియే వారియూహ. మనము రోడ్లువేయ లేముకాబోలు! ప్రజానురంజకముగ రాజ్యపరిపాలన చేయలేమట! వీరికండ్లకు నానా ఫడ్నవీసు శుద్ధమూర్ఖుడు; మాలిక్కాంబరున కేమియు రాచకార్యములు తెలియవు! అతడుశుద్ధమూర్ఖుడు! అక్బరుచక్రవర్తిమొదలగు మొగలాయి పాదుషాలు శుద్ధవిఘవలు! ప్రపంచ జ్ఞానమేమియు తెలియని శుద్ధమూర్ఖులు! అందువలననే పాప మీతెల్లవారు మనల నుద్ధరించుటకై, మన మేలుకోరి యిచ్చటికి వచ్చినారు. కాని మనమింకను కన్నులు తెరవని పసికూనలమట! కొంచెముసేపు మనమింకను పసికూనలమనియే యొప్పుకొందుము. కాని మనము పెరిగి పెద్దవారమగు టెన్నడు! (అని నే నడుగుచు న్నాను.) 'లా' ప్రకారము, న్యాయశాస్త్ర ప్రకారము 21 సంవత్సరముల వయస్సు రాగనే వానిని పెద్దవానిగ నెంచెదరు. కాని వీరు మనమీద 50 సంవత్సరములు రాజ్యముచేసి యుండినను మన మింకను పెరిగి పెద్దవారము కానేలేదు! వీరీ 50 సంవత్సరముల నుండియు చేసిన పనియేమి! భారతీయులు పసికూనలైన యెడల వారిని జ్ఞానవంతులనుజేయు భారమెవరిది ? ఆభారము పాలకులది. వారు మనపై రాజ్యము జేయుచున్న పాలకులు. కాని వారీ తమ పాలకధర్మము నెరవేర్పలేదని నే జెప్పు చున్నాను. కనుక దీనివలన నేమితేలుచున్నది ? పసిపిల్లలుగానున్నది మనముకాదు, వారే మనలను పాలింపలేక తమయసమర్థతను వెలిబుచ్చుకొనుచున్నారు. (చప్పట్లు) 50 సంవత్సరములు రాజ్యముచేసియు ప్రజలను మంచిస్థితిలోనికి తీసికొనిరాలేక పోయినారు. కనుక వీరు తమ రాజ్యాధికారమును తాము వదలుకొని, ప్రజలమైన మన చేతులలోనే రాజ్యపాలనాధికారము నుంచుట ఎంతయు మిక్కిలి శ్రేయస్క

రము. నీ దుకాణము మీద నొక గుమస్తాను యేర్పరచుకొందువనుకొనుము. ఆతను 50 సంవత్సరములు నీ కొట్టులో పనిచేసినా సనుకొనుము. కాని ప్రతిసంవత్సరమును నీ యంగడి మీద నష్టమే వచ్చుచున్నయెడల నీవేమి చెప్పుదువు? "అయ్యా! గుమాస్తాగారూ! నీ ఉద్యోగము వదలుకొని బయటికినడు, బాబు! మా పనిని మేమే జేసికొనెదములే!" అని చెప్పుదువుగద. మనమింకొక క్రొత్తగుమాస్తాను యేర్పరచుకొనిన యెడల వాడంత తెలివిగలవాడు కాకపోవచ్చును: అయినను తుదకు కొట్టు మీద నీకు నష్టము రాకుండనైన జూచువలయునుగదా యని జాగ్రత్తగ నుండును. వాని కింత మాత్రమైనను తెలిసియుండవలెను. మన మసమర్థులమని చెప్పువారు కేవలము స్వార్థపరులయిరే యుండవలెను, ఒకవేళ వారు చెప్పుమాటలు నిజమైనను, అదికూడా వారికే నష్టపాటు. దీనివలన, వారు మనపై రాజ్యముచేయుటకు ఎంత మాత్రము తగరని రుజువగుచున్నది. వారు చెప్పుమాటలు అసత్యములైనయెడల వారు స్వార్థపరులని తెల్లమగుచున్నది. వారు జెప్పుమాటలకు ఇంతకంటె ఎక్కువ అర్థములేదు. మనము "తగము" అనిన అర్థమేమి! మనకేమి తక్కువ? మనము మ్యునిసిపల్ వ్యవహారములను నిర్వహించుచున్నప్పుడు మనకు సమర్థతకలదనియే వారు ఒప్పుకొనుచున్నారు. మనలో నెవరైన సీమకుబోయి గొప్పపరీక్షల నిచ్చి ఇచ్చటికి కలెక్టరుగా వచ్చి పనిచేయుచున్నప్పుడు వానికి సమర్థతకలదనియే ఒప్పుకొనుచున్నారు. ఆతడు తన పనులను చక్కగ నిర్వహింపగలడని గవర్నమెంటువారు వానిని మెచ్చుకొనెదరు. కాని ఇచ్చట మనకు స్వరాజ్యపు హక్కులు యివ్వవలసి వచ్చినప్పుడు మాత్రము మన ప్రజలందరును, మన ముప్పదికోట్ల ప్రజలందరును "అక్షరాల తగరు, తగరు, అసమర్థులు అసమర్థులు" అని చెప్పుచున్నారు. వారిట్లుచేయుట కేవలము తమ యొక్క అసమర్థతనే వెల్లడిచేసికొనుట యగును గాని వేరేమియులేదు. మనకు స్వరాజ్యము నివ్వకుండ ఇంక అనేక అభ్యంతరములు చెప్పుచున్నారు. మనజాతి వారందరు తగరని యొక్క పెట్టుచు నుడువుట మొదటి యభ్యంతరము. పరీక్షలు పెట్టించి మా సమర్థతను కనుగొనుడని మనము కోరియుంటిమి. కానివారు పరీక్షలు పెట్టరు. ఊరక "అసమర్థులు అసమర్థులు" అననేమి? మీ ఆంగ్లేయులచేత ఏదైన నొకపనిని చేయించుడి, ఆ పనినే మా వారిచేతచేయించిచూడుడి. ఆపని నిర్వహింపగల సామర్థ్యములో నిద్దరికిని తారతమ్య మేమైన నున్నదేమో చూడుడి. ఏ పనినైన చేయుటకు మన కవకాశమివ్వరు; కాని మనల నెల్లప్పుడు "అసమర్థుల"ని పిలుచుట కెంత మాత్రమును వెనుదీయరు. ఇప్పుడు జరుగుచున్న నిజస్థితి యిది! "పోనీ? మీ క్రింద యుద్యోగములు చేసినవా రందరును అసమర్థులని మీరు చెప్పగలరా? వా రసమర్థులని మీరు రుజువు పర్చగలరా?" యని నే నడుగుచున్నాను. చట్టనిర్మాణసభలలో పని చేయు మా మెంబర్లందరును అసమర్థులని మీరు చెప్పగలరా? వీ రందరును "మే మసమర్థులము" అని యెన్నడైన ఒప్పుకొనియుండిరా? "మీరు పనికిరారు; మీ రసమర్థులు" అని మీ రెన్నడైన వారితో మందలించి యుండిరా? నిజముగ, అట్లెన్నడును జరిగియుండలేదు. కనుక మమ్ముల నూరక "అసమర్థుల"ని పిలచిన నేమి ప్రయోజనము?

ఆసలు మాకు స్వరాజ్యము నివ్వవలయునను ఉద్దేశము మీ మనస్సులలో లేనేలేదు. "మే మివ్వము" అని ఖండితముగ జెప్పక ఈ మాయోపాయ మెందుకు? మాకు మజ్జిగ (చల్ల) పోయవలయునను ఉద్దేశము మీ మనస్సులో లేదు. ఆ మాట పైకి ఖండితముగ చెప్పుట కింత మాయోపాయమేల? "ఈ దినము ఆదివారము గనుక మా యింటిలో మజ్జిగలేవు" అని యేలవంక జెప్పవలెను? వారిట్టి సాకులనే, యిట్టి వంకలనే జెప్పుచున్నారు. కనుక (భారతీయులైన) మీరందరును, ఇట్టి మాయోపాయములచే మోసపోక, "మాకు తప్పక స్వరాజ్యము నిచ్చి తీరవలయును, ఇది మానవులకందఱు సర్వసాధారణమైన ప్రకృతిధర్మము. ఇది ప్రతివానికి నుండు హక్కు" అని గట్టిగ ప్రభుత్వమువానిని కోరెదరా? లేదా? యని నేనడుగుచున్నాను. మీరీవిధమున గవర్నమెంటువారిని కోరుటకు సిద్ధముగ లేనియెడల, గవర్నమెంటువారికి ఒత్తిడి కలుగునట్లు గట్టిగ మీ కోర్కెలను వారికి తెలియజెప్పుకొనని యెడల, మీ రీ మంచి యవకాశమును జారవిడిచిన యెడల ఇట్టి మంచియనుకూలమైన తరుణము తిరిగి నూరు సంవత్సరములకైనను రాజాలదు. రాజాలదని నేను మరిమరి చెప్పుచున్నాను. కాబట్టి మీరు మీస్వధర్మము నాచరించుట కిప్పుడు సంసిద్ధులైయుండవలయునని తెల్లమగుచున్నది. మనము కొంచెము ధైర్యము వహించి, ఒత్తిడిగ మాట్లాడ సాహసించిన యెడల పోలీసు బంట్రోతు చూచి "ఏయి! ఎవరు నీవు?" అని భయపెట్టును. కాని మనము దానిని సహించి యూరకొనవలెను; మనమేమి చేయుటకును వీలులేదు. మనచేతులలో నధికారములేదు. "విధవా! నీ వెవరవు? పో! వెళ్ళిపో" అని వానిని అదలించి పంపుటకు వీలులేదు. పాపము! వాడు పోలీసు ఇన్‌స్పెక్టరుగారి యుత్తరువుప్రకారము వర్తింపుచున్నాడే గాని వేరుగాదు. అయినను, మీరందరును జాతిమతభేదము లేక యేకగ్రీవముగ మీకోర్కెలను యెడతెగక ప్రభుత్వమువారికి తెలియజెప్పుకొని "మాకోర్కెలను నెరవేర్చి తీరవలయు"నని గట్టిపట్టుబట్టిన యెడల, దీనికెంతసొమ్ము వ్యయమైనను మీరు దానిని భరించుటకు సిద్ధముగ నున్నయెడల, "మాకోర్కెలను నెరవేర్చిననేగాని మేము తృప్తినొందము, మేముశాంతులముగాము" అని గవర్నమెంటువారికిని, లోకములోనుండు సమస్త జాతులవారికిని గట్టిగ నొక్కి తెలియజెప్పుకొనినయెడల, మీకింతపట్టుదల శ్రద్ధాభక్తులున్నయెడల భగవదనుగ్రహమువలన మీకోర్కె లచిరకాలములోనే నెరవేరగలవని నాదృఢనమ్మకము; తప్పక మీకోర్కెలు సిద్ధించునని నా నమ్మకము. (చప్పట్లు.)

ఇదంతయు మీమనోనిబ్బరముమీదనే యాధారపడియున్నది. మతవిషయములోగాని, రాజకీయవిషయములోగాని, ఏవిషయములోనైనను మనోనిశ్చయమే ముఖ్యము. "మనమిట్లు చేసిన తుదకేమి సంభవించునో" యని మీరనిన ప్రయోజనము లేదు. ఏది యెట్లు తటస్థించినను యెట్టి యిక్కట్టులు సంభవించినను, "మా కిది యిచ్చితీరవలెను" అని మనము ధైర్యముతో చెప్పవలెను. మనకదే కావలయును. దానినే పదేపదే యడుగుచుందుము. ఎన్ని కష్టములువచ్చినను ఎంత ధనము వ్యయ

మైనను, మనము భరింతుముగాక. మనకోర్కెలు నెరవేరువరకును మనమీ యాందోళనను మానజాలము. "మన జీవితకాలములో మనమాగమ్యస్థానమును చేరలేకపోయినను, మన భవిష్యత్సంతతివారైనను దీనియందు పనిబూని శ్రద్ధవహించి, తప్పక ఎల్లకార్యముల నెరవేర్చి (భగీరథ ప్రయత్నముచే) ఆగమ్యస్థానమును చేరగలర"ను మనోధైర్యము మనకున్నయెడల మనము కోరు (ఈస్వరాజ్య) ఫలమును తప్పక బడయగలము. మనకు శ్రద్ధాభక్తులుండిననేగాని భగవంతుడు మన ప్రయత్నములను . ఫలవంతము చేయడు. ఆవిధముననె రాజుకూడ (మనయత్నముల నూరక ఫలింపజేయడు) ఇట్టిభక్తి లేనియెడల నీవిప్పుడు చేయుయత్నములన్నియు వృథయగును. అన్నిటికంటె భక్తియే యెక్కువగనుండవలెను. ధనవంతులకు, దరిద్రులకు నందరకును శ్రద్ధాభక్తులుండితీరవలెను. ధనవంతులు వారికి తగినట్లు వారు సహాయము చేయవలెను. బీదలు తమశక్తికి తగినట్లు తాము సహాయము చేయవలెను. బుద్ధిమంతులైనవారు, తెలివితేటలు గలవారు, తమ తెలివితేటల నుపయోగించి దీనికై సహాయము చేయవలెను. ప్రతిమనుష్యుడును, యీవిషయమై శ్రద్ధబూని యెల్లప్పుడును చింతింపుచునే యుండవలెను. ప్రతివానికిని, ప్రతినాళములోనికిని యీవిషయ మెక్కవలెను. మనమందరమును దీనివిషయమై శ్రద్ధవహింపక, దీనివిషయమై పాటుపడక, ఊరక కూర్చొని 'మాకేమియు నీయలేద'ని పరులను నిందించుట కేవలము శుద్ధమౌఢ్యము. ఈమాట మీకు కష్టముగతోపవచ్చును. ఆతురతచేత, మాటలవేడిమీద నేనిట్లంటిని కాని నిజముగ, మనము తగినంతశ్రద్ధతో, పట్టుదలతో, పాటుపడుట కిప్పటికిని ప్రారంభింపలేదని మాత్రము నే చెప్పకతప్పదు. తెల్లదొర ఎవడైన నిన్నుచూచి "రాజ్యాధికారమును మీ చేతులలో బెట్టినట్టయిన, దేశమంతయు నల్లకల్లోలము కాదా !" యని యడిగినట్టయిన "అయ్యా! అవునవును, నిజమే" యని నీవు (తలయూపుచు) ప్రత్యుత్తర మిచ్చెదవు; యేమి ? మనలో మగవాడెవడును లేడా ? రాజ్యపాలనాధి కారమును నిర్వహింపగల సమర్థులు లేరా ? మనలో నెవరును లేనట్లుగనే "అవునవును నిజమే" యని ప్రత్యుత్తరమిచ్చు చున్నావు. పిమ్మట నీవు యింటికి వచ్చిన తరువాత (నీ మాటలను ఆదొర నిజమని నమ్మినాడు గదా యని) వానిని జూచి నవ్వుదువు. (యింటికివచ్చి నీలోనీవు నవ్వుకొనిన నేమి లాభము ?) వానిదగ్గరనే, అప్పుడే, నవ్వవలెను. (చప్పట్లు, నవ్వు.) నీయింటిలో నవ్వుకొనిన ప్రయోజనములేదు; వాని ముఖముమీదనే నవ్వవలెను. మనము నిజమనినమ్మిన యభిప్రాయమును నిజమనియే వాదింపవలెను. "యిది సత్యము" అని ప్రజల కందరికిని తెలియజెప్పవలెను. యెట్టి యధికారితోనైనను, చక్రవర్తితోనైనను చెప్పుటకు సంసిద్ధులమై యుండవలెను. యేదినమున మనమిట్లు నిర్భయముగ జెప్పగలుగుదుమో, ఆ దినముననే, యీ ప్రస్తుతపాలనాపద్ధతి మారిపోయి తీరును; ప్రస్తుతము ప్రపంచము నందలి అన్ని దేశములకంటె మన యింగ్లాండు దేశమే పైచేయిగా నున్నది. యిట్టి యత్యున్నత పదవిని నిలుపుకొనవలయు ననిన యెడల, మనదేశపు ప్రస్తుత రాజ్యపాలనా పద్ధతిని తప్పక మార్చివేసి తీరవలెను. నిజమాలో

చించిన యెడల, సీమలోని ఆంగ్లప్రజలే "హిందూదేశ పరిపాలనా పద్ధతిని మార్చివేయవలసిన"దని మరి మరి కోరుచున్నారు; మన మంతగా కోరుచుండుటయే లేదు. ఎందువల్లననగా, ఒకవేళ మనమే కోరినట్లయిన దాని కనేక * యభ్యంతరములు బయలుదేరును. ఈదినమున నొక రోకవిధమునను, రేపటిదినమున మరియొకరింకొకవిధమునను, పలువురు పలుతెరంగుల జెప్పుచుందురు. "యిప్పటి రాజ్యపాలనా పద్ధతిని మార్చివేసిన మీ కేమియు లాభములేదు: ప్రస్తుత పద్ధతి చాల బాగుగ నున్నది. గవర్నమెంటువారు దయార్ద్రహృదయులు, అధికారవర్గము వారు చాల బుద్ధిమంతులు. కనుక వారియిష్టప్రకారమే మనముకూడ నడచుకొను చుండిన యెడల మన కెంతయు శ్రేయస్కరముగ నుండును." అని కొందరభ్యంతరము చెప్పవచ్చును. నే జెప్పు విషయము లందరికిని వర్తించును; కేవల మొక్క హిందువులకే గాదు; ఒక్క మహామ్మదీయులకేగాదు. నేజెప్పుమందు, ఔషధము, అందరికిని పనికివచ్చును. అందరికిని ఒకటేమందు. అదేదనగ "రాజ్యపరిపాలనాధి కారమును మీచేతులలోనికి తీసుకొనుడు." ఇదియే అందరికి ఉపకరించుమందు, మనకీ యధికారము వచ్చినప్పుడు, మనలో నుండు చిక్కుల నన్నిటిని మనమే తొలగించు కొందుము. మనకు కావలసినంత యవకాశముండును. మతసంబంధమైన చిక్కులేమైన నున్నయెడల, మనలో మనమే పరిష్కరించు కొందుము. కాని మనకోర్కెల నన్నిటిని దీర్చుకొనుటకు మన చేతులలో నధికారముండ వలెను. మనలోనున్న పోరాటములను మాపుకొను నిమిత్తమే మన కధికారము కావలెను. అధికారము వచ్చినందువలన ఈ పోరాటము లెక్కువ కాజాలవు. పోరాటములను పెంపుచేసుకొన వలయునను ఉద్దేశ్యముతో మేమధికారము నడుగుటలేదు. దేశాభ్యుదయమునకై యేయే పనులను జేయవలయునో మాకంటె విదేశీయుల కెక్కువగ తెలియజాలదు వారి చూపువేరు, మనచూపు వేరు. కనుక మనకిప్పుడేమి కావలెను? బ్రిటిషు రాజ్యాధికార మున్నది యున్నట్లే యుండవలెను. కాని సీమదేశములో నేవిధముగ మన చక్రవర్తి పరిపాలన చేయుచున్నాడో, ఆవిధముగనే మన భారతవర్షముకూడ పరిపాలింప వలసినది. కనడా, ఆస్ట్రేలియా మొదలగు వలస దేశములలో నెట్టి రాజ్యపాలనాపద్ధతి కలదో, అట్టిపద్ధతి ననుసరించియే మా భారతదేశమును కూడ పరిపాలింప వలసినది. తమ చట్టములను, తమ శాసనములను తమ ప్రజల యిష్టము వచ్చినట్లు నిర్మించుకొనుటకు యీ వలస రాజ్యములవారి కధికారము కలదు. ఆ దేశములలో నిట్టిపద్ధతి యున్నంత మాత్రముచేత చక్రవర్తిగారి ఆంగ్లేయ సింహాసనమునకెట్టి యిక్కట్టులును వాటిల్ల నేరవు. మనముచేయు ప్రయత్నమంతయు, ఇంగ్లీషు రాజ్యమును పడగొట్టవలయునని యెంతమాత్రమును కాదు;

---

* మనమాట నటుంచి, హిందూదేశ పాలనా పద్ధతిని మార్చివేయవలసినదని, యిప్పుడు ఆంగ్లప్రజలే కోరుచున్నారు. మనమే కోరినయెడల అందరును దాని కభ్యంతరము చెప్పుదురు; కాని యిప్పుడు వారే కోరుచున్నారు గనుక దీనికి అభ్యంతర ముండబోదు అని తాత్పర్యము.

ఆంగ్లేయాధికారమును చిరస్థాయిగ జేయవలెననియే మనము కోరుచున్నాము. మనము కోరునట్టి మార్పులవల్ల కొంతమందికి నష్టము వచ్చిన రావచ్చును. కొంతమందికి జీవనోపాధులు పోయిన పోవచ్చును. పోవని నేననను. కాని, మన చక్రవర్తిగారు మనదేశమును ప్రత్యేక మెవరి మేలుకొరకో దాచబెట్టి యుంచిరని తలంపజాలము. ఎట్లో ప్రస్తుత పరిపాలనా పద్ధతి యేర్పడినది. ఇకమీద, దాని నట్లుంచ గూడదు. దానిని మార్చివేసి తీరవలెను. రాజ్యపరిపాలనాధికారమునంతను చక్రవర్తిగారు మనచేతులలోనే పెట్టవలెను. వీ డాంగ్లేయుడు, వీడు భారతీయుడు-వీడు తెల్లవాడు. వీడునల్లవాడు అనుభేద మెంతమాత్రమును పాటింపకూడదు వారంద రేవిధముగ చక్రవర్తిగారి ప్రజలో, అట్లే మనముకూడ చక్రవర్తిగారి ప్రజలమే. వారెంత సౌఖ్యముగ నున్నారో మనముకూడ నంత సౌఖ్యముగ నుండుటకు మనకుహక్కు గలదు. మనమందరమును సౌఖ్యముగ నుండవలయునని, మనకు స్వరాజ్య మొక్కటియే దివ్యౌషధమని కుశాగ్రబుద్ధులైన పెద్దలు నిశ్చయించినారు. స్వరాజ్యమును భారతవర్షమున స్థాపింపవలసిన సమయము వచ్చినది. కాని ఏది ఎట్లున్నను, ఏది యెంతసిద్ధముగ నున్నను, మీదృఢసంకల్ప మొక్కటియే ప్రధానమైనది.

మన కిప్పుడు కావలసినది మీ యందర దృఢసంకల్ప మొక్కటియే. మీకది లేనియెడల నిప్పుడు వచ్చిన మంచికాలము మించిపోవును. మన యదృష్టవశమున స్వరాజ్యసంపాదనకై నేడు దేశమునందంతటను కొంత యాందోళన ప్రారంభమైనది. మొన్ననే, బెల్గాము పట్టణములో స్వరాజ్యవిషయమై పనిసాగించుటకొక "స్వరాజ్య సమితి" నేర్పరచితిమి. ఇట్టి సమితియే మరియొకటి చెన్నపురిని స్థాపింపబడినది. ఈవిషయమై కాంగ్రెసు (దేశీయమహాసభ) వారుకూడ నాలోచించు చున్నారు. వారు దీనిని తప్పక ఆమోదింతురు. కాన తక్కిన రాష్ట్రముల వారందరు నిదేవిధమున పాటుపడి, కాంగ్రెసునకు సహాయముగ వచ్చి నిలబడవలెను. కలెక్టరైనను, కమీషనరైనను వచ్చి "మీకేమి కావలె"నని యడిగినప్పుడు ప్రజలందరు నిర్భయముగ "రాజ్యపాలనాధికారము మాచేతిలో నుండవలెను. ఇదియే మాకు కావలసినది" అని చెప్పవలెను ప్రజల కింతమాత్రము ధైర్యమైన నుండవలెను. గవర్నమెంటు ఉద్యోగస్థుల నందరిని ప్రజాసేవకులుగ నెంచుకొన వలెను, మన చేతులలోనికి అధికారము వచ్చినప్పుడు, యూరపియనులకు ఉద్యోగము లివ్వకూడదను పిచ్చియభిప్రాయము మీకుండకూడదు. వారు బాగుగ పనిచేసినయెడల, మనము వారికి తప్పక యుద్యోగము లిచ్చెదము. మనకు న్యాయమని తోచినంత జీతము నిచ్చెదము, కాని దానిలో నొక్క ముఖ్యరహస్య మున్నది. ఏమనగ, వారు మనకు సేవకులై యుండవలెను. మనము వారి క్రింద సేవకులమై యుండజాలము. మీరందరీ యభిప్రాయమును బాగుగ గ్రహించి, దీనికై పాటుపడినయెడల, దీనిని సంపాదించుట యొకలెక్కకాదు. ఈస్వరాజ్య విషయమై మాట్లాడుము, మీవద్దకెవరైనవచ్చి మీసహాయమును గోరినయెడల, అట్టివారికి మీరందరును తప్పకసహాయము చేయవలసినదని మిమ్ముల నెల్లర ప్రార్థించుచున్నాను.

మీయహమ్మదునగరవాసు లొక్కరేగాక, భారతదేశమునం దెల్లెడలను, ప్రజలీవిధముగ సహాయము చేయుటకు సిద్ధపడియున్నయెడల మనకోర్కె తప్పక సఫలీకృతమై తీరు నని మీరందరు గట్టిగ నమ్ముడి కాబట్టి మీరందరిప్పుడే, తత్కార్యాచరణకై గడంగుడు. అట్లయిన మనకోర్కె త్వరలోనే నెరవేరగలదు. భారతవర్షము తానిప్పుడు గావించుచున్న కృషియొక్క సత్ఫలముల నందగల తరుణము త్వరలో నేతెంచునుగాక ! యని నే దైవమును ప్రార్థించుచున్నాను. మీ రందరును నాతప్పులనెల్ల మన్నించి, నేనుచ్చరించిన పరుషవాక్యములకెల్ల నన్ను క్షమింతురుగాక యని వేడికొనుచున్నాను. నే నిదే మీ కెల్లరకును హృదయపూర్వక వందనము లాచరించి, యింతటితో నాయుపన్యాసమును ముగించు చున్నాను.'' (చప్పట్లు. తిలక్ మహరాజ్‌కు జయ్ )

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 3, స్వ రా జ్య ము

(ఆన 1916 సం॥ జూన్ 1- వ తేదీని అహమ్మదునగరములో నిచ్చిన ఉ ప న్యా స ము)

ఆర్యులారా !

నిన్ననే నిచ్చట నిచ్చిన యుపన్యాసముగాక వేరొక యుపన్యాస మివ్వవలసి యుండునని నే ననుకొనలేదు. అప్పుడు స్వరాజ్యమును గూర్చి రెండు మూడు సాధారణ విషయములను మాత్రమే చెప్పియుంటిని. చెప్పవలసిన విషయములు చాల యున్నను ఒకగంటలో నంతకంటె యెక్కువ చెప్పుటకు వీలులేదు. విషయ మతి బాహుళ్యమగుటచే ఒకటి రెండు మాత్రమేగాక, పది యుపన్యాసము లిచ్చినను పూర్తికాజాలదు. కాబట్టి ప్రజ లీ విషయములను బాగుగ గ్రహించుటకును, వాని లోని యర్థము స్పష్టముగ వారిమనస్సులలో నాటుకొనుటకును, ఆ విషయములలో వారికున్న సుసందేహములన్నియు నివృత్తియగుటకును, స్వరాజ్యమును గూర్చి యిది వరకు చెప్పని రెండు మూడు క్రొత్త అంశములను తిరిగి ముచ్చటించెదను. నా ఉద్దేశ్యమేమనగ, మన కేమాద్యులు కావలసి యున్నను, అవియన్నియు స్వరాజ్యమునకే చెందినవై యుండవలెను. మనలో ముసలమ్మకథ యొకటియున్నది. అది మీకందరకును తెలిసియే యుండవచ్చును. ఒకముసలమ్మ దేవునికి ధూపదీపనైవేద్యము లర్పించి, దేవుని తృప్తినొందించిన తరువాత, భగవంతుని యేమివరము లడుగుదునాయని ఆలోచించుకొనెను. చివరకు యీవిధముగ అడిగెను. "నా మనుమలు, మునిమనుమలు, అందరు బంగారుగిన్నెలలో, పంచభక్ష్యపరమాన్నము లారగింపు చుండగ, నేను కన్నులారచూచి యానందించుభాగ్యము నాకు యీ దేవత లభింపజేయును గాక!" అనగా, తానంతకాలము జీవింపవలెననియు తనకుమాళ్ళు ధనసంపదలలో తులదూగు చుండవలెననియు, మొదలైనకోరికలన్నియు దానిలో నిమిడియున్నవి. స్వరాజ్య వాంఛకూడా నిట్టిదే. స్వరాజ్యములేని యెడల మనకు పారిశ్రామికాభివృద్ధి కలుగ జాలదు; స్వరాజ్యము లేనియెడల మనజాతీయౌన్నత్యమునకు దోడ్పడు ప్రారంభ విద్యగాని, ఉత్తమవిద్యగాని మనకు లభింపజాలదు. స్వరాజ్యము లేనియెడల మనమెంత స్త్రీ విద్యావ్యాపకము గావించినను, ఎన్నిపారిశ్రామికసంస్కారములు గావించినను, ఎన్నిసంఘసంస్కారములు గావించినను, అవంతయు ప్రయోజనములేదు. ఇవన్నియు

స్వరాజ్యములో నిమిడియున్నవి; స్వరాజ్యములో సంతర్భాగములు; మొట్టమొదట కావలసినది అధికారము. ఎచ్చట శక్తిసామర్థ్యములుండునో అచ్చటనే జ్ఞానముండును. జ్ఞానమునకును శక్తికిని భేదములేదు; అట్లుభేదముండిన దాని (జ్ఞానముయొక్క) ప్రయోజనములేదు. ఈ సూత్రము ప్రతిజాతియందును వ్యక్తీకరింపబడుచునేయున్నది. ప్రత్యేకముగ దీనిని యేజాతివారికిని బోధింపవలసిన పనిలేదు. కాని మనభారతీయులకు మాత్రము ఒక విధముగ యీ సూత్రమును విప్పిచెప్పవలసియున్నది. దీనికి కారణము మనదేశములో స్వరాజ్యము లేకపోవుటవలననే కొందరు మనకు వ్యతిరేకముగ నీ యాటంకములను పెట్టెదరు. "మీరెందుకు సంఘసంస్కరణము చేసికొనరు." (అనగా మీ సంఘములో నుండు అతిబాల్య వివాహము, వితంతువులకు పునర్వివాహము లేకపోవుట మొదలగు దురాచారముల నేల మీరు ఖండించి, మార్చుకొనరు? అట్లు చేసికొనిన మీకు స్వరాజ్యము సులభముగ లభింపగలదు. అని కొందరు అభ్యంతరము చెప్పెదరు) మన మెవరమును యీ మాటలనము. ఏ విధముచేతనైన, మనకు స్వరాజ్య మివ్వకుండ మనయాందోళన నంతను దీనినుండి యింకొకవైపునకు త్రిప్ప జూచువారు చెప్పుమాటలు గాని యివి మనము చెప్పుమాటలు గావు. తమలో సంఘ సంస్కారములు గావించుకొనినవారు చాలమంది యున్నారు. బర్మాదేశములో సంఘ సంస్కారము పూర్తిగ వ్యాపించినది. అందరిది ఒకటేమతము, అచ్చటి జనులు యేపని చేయుటకైనను సంసిద్ధులైయున్నారు: అచ్చటి పిల్లలు తమ యిష్టము వచ్చినవారితో వివాహము చేసికొందురు. అయినను, ఆ దేశమింకను పరాధీనమయియే యున్నది వారికేవిషయమునను ఏకజాతీయతాభావమింకను ఉదయింపలేదు. కాబట్టి యిప్పుడు కావలసినదేమి? మనమందరమును యేకజాతీయులము. మన మీప్రపంచములో నెఱవేర్పవలసిన గొప్పధర్మ మొకటిగలదు. మనుష్య ప్రకృతికి స్వతస్సిద్ధముగ జెందిన హక్కులను మనము సంపాదింపవలసి యున్నది. మనకు స్వాతంత్ర్యము కావలెను. మన స్వవిషయములను చక్కబెట్టుకొనగల స్వాతంత్ర్యము మన చేతులలోనే యుండవలెను. అట్లుకానియెడల, యెట్టి సంస్కారములును లాభకారి కానేరవు. ఇదియే సంస్కారముల కన్నిటికిని మూల బీజము. శక్తియెప్పుడులేదో, జ్ఞానముకూడ నప్పుడే లేదనుకొనవలెను. గ్రంథపాండిత్య మెంతయుండిన నేమిప్రయోజనము? మనపై రాజ్యముచేయవచ్చినవారు మనకంటె మేధావంతులనిగాని, పండితవర్యులనిగాని ఎవరైన చెప్పినట్లయిన నేనమ్మజాలను. పాండిత్యమునగాని, శౌర్యధైర్యాది వీరపురుషోచిత సుగుణ సంపదయందు గాని, మనము వారికి తీసిపోము. ప్రతివిషయములోను వారికున్న తెలివితేటలు మనకును గలవు. అవి ప్రస్తుతము పైకి అంతగా కనిపింపకపోవచ్చును. అయినను అవి మనలో నంతర్గతమై యున్నవి. జ్యోతిశ్శాస్త్రములో గ్రహకూటము లున్నటులే, దేశ చరిత్రలలో కూడ నట్టి కూటములున్నవి. మొగలాయి రాజ్యము క్షీణదశకు వచ్చుచున్న కాలములో, మహారాష్ట్ర విజృంభణ మప్పుడే పూర్తియయినది. తరువాత ఆంగ్లేయులు భారతవర్షములో కాలుబెట్టిన పిమ్మట రాజ్యాధికార మంతయు వారి వశమైనది. వారిలోనుండు యీశక్తిమూలము

నసే మనము వారిని మెచ్చుకొనుట ! వారి యీసామర్థ్యమునకే మనము వారిని జూచి (మనస్ఫూర్తిగనో, లేక పైకియో) గర్వపడుట! ఈరాజ్యాధికారములో కొంతను కొంతైనను మనచేతిలోనికి వచ్చినప్పుడు, మన జ్ఞానము, తెలివి తేటలు, పనికి వచ్చును. అప్పుడే మన ప్రతిభ రాణింపగలదు. అనేక కార్యములు ముందు కావలసి యున్నవి. మన పరిశ్రమ లభివృద్ధి కావలసియున్నవి. కాని ఆపని యెందువలన ఆగి పోయినది? దానిని యెవరు ఆపిరి? దీనికి కారణమేమని విచారించి నట్లయిన, దీనిని ఆపినది మనముకాదని స్పష్టపడుచున్నది. పారిశ్రామికాభివృద్ధిని మనమాపలేము. ఆర్థిక సంస్కారములను మనమాపలేము. ఏదేశములో ప్రజలు తమశక్తి సామర్థ్యము లనుజూపి, నిరాటంకముగ విజృంభింపగల స్వాతంత్ర్యము, దానికి తగిన సరళమైనఅభివృద్ధి మార్గములు గలవో, అచ్చటిజనుల శక్తులు, జ్ఞానము, బుద్ధివైభవము ప్రకాశించును: అవి రాణింపునకు వచ్చును ఆ అంతశ్శక్తులన్నియు క్రమముగ వికసించును. దేశము, జాతి, పరాధీనమై బానిసత్వములో (గులాంగిరిలో) పడియున్నప్పుడు ఏ సుగుణములు ప్రజ్వలింపగలవు? యజమాని యాజ్ఞ లేనిదే, ఏపనియు కాజాలదు. యజమానుడు మనల నెంతవరకు పోనిచ్చునో, అంతవరకే మన మభివృద్ధినొందగలము. నీ యధికారికి నీ తెలివితేటలవల్ల సహాయముగనుండి, ఆయనక్రింద సేవజేసినప్పుడు. ఆయన నిన్ను నీతెలివికి మెచ్చుకొనునప్పుడే ''నాలోశక్తి యున్నది సుమా!'' యని నీవు గ్రహింపగలుగుచున్నావు. ఇది యొకవిధమైన మనోదౌర్బల్యము, క్షుద్రమైన హృదయదౌర్బల్యము; సారహీనత్వము. ఇది దేశమునంతను అల్లుకొనినది. ప్రతివిషయములో, ''అమ్మో! నేనదిచేయలేను'' అనుచున్నావు నీవదియెప్పుడును చేసియుండలేదు. ఎవరును నీకు సన్నదు (లేక అధికారము) యిచ్చియుండలేదు. అయినను, ఆ పని నీకివ్వకపూర్వమే ''అమ్మో! ఆపని నే చేయలేను. నే చేయలేను'' అని గోలపెట్టుచున్నావు. ఇట్లు చెప్పుచు యీ మార్గమును వదలి వేరుమార్గములను బట్టుచున్నారు. మన మహారాష్ట్రదేశములోకూడ కొందరిట్టి సాకులనే చెప్పి స్వరాజ్యపు హక్కులకొరకు పని చేయుచున్న మన యీ యాందోళనకు వ్యతిరేకముగ, భంగము కలుగ జేయుచున్నారు. ఇదెంతయు అనర్థదాయకమని నానమ్మకము. ఈ పనులన్నియు మన మిదివరకు చేసియుండలేదా ? (రాజ్యము లేలలేదా ?) ఈ యొక్క విషయ మాలోచింపుడి. జాతీయవిజృంభణకు కావలసిన శక్తులన్నియు మహారాష్ట్రప్రజలలో కలవు. కాని ప్రస్తుతము ఆశక్తుల నుపయోగించుటకు మన కవకాశములేదు. మనమనోశక్తులు స్త్రీవిద్య మొదలగు విషయములలో ప్రసరింపకుండుటకు కారణమేమి ? అధికారము మనకు లేదుగనుకనే. దీనిలో నెవరైన అపాయమున్నదనిన అనుకొనవచ్చును. కాని నామనస్సునకు మాత్రము అపాయమున్నదని తోచదు. నా మనస్సునకు నచ్చదు. నచ్చిన ట్లెవరును నాకు చెప్పలేరు. నేను జీవించియుండగ నచ్చదు. ఇతరసంగతులను గూర్చి మాట్లాడుట నిష్ప్రయోజనము. ప్రస్తుతము మనప్రజలలో ధైర్యస్థైర్యాది గుణములు లేవు. పాండిత్యము లేదు. మన

స్త్రీలు విద్యావంతులైనయెడల వారి సంతతివారుకూడ విద్యావంతు లగుదురు. కాని ఆ సంతతి వారును మన బీజోత్పన్నులేకద ! - (దీనివలన నేమి ప్రయోజనముండును?) ఎవరికైన ఆ పిచ్చిభ్రమయుండిన అది తప్పు. స్త్రీవిద్య అక్కరలేదని నేచెప్పను. కాని స్వరాజ్యాందోళన నాపుటకుగాను మన కీ మాటలను చెప్పువారితో మన మేమి చెప్పవలెను? "మాజాతినంతను మాపుమాపుట కిదిమార్గము (గనుక మా కీ మాటలను చెప్పవద్దు)" అని చెప్పిపంపవలెను.

+ నీలో బలములేక, దేనిని సంపాదింపుటకును శక్తిలేకున్నప్పుడు, విద్యావతి,యైన భార్యను పెండ్లాడినయెడల సంతానమంతయు శక్తిసంపన్ను లగుదురని తలంచుట కేవలము జడత్వము మనము చేయవలసిన పనికిగాను (అనగా స్వరాజ్య సంపాదనమునకు గాను) మనసంతతివారు మనకొరకు కష్టపడి పనిచేయవలసి యుందురని తలంచుట కేవలము జడత్వము. (మనము పితృదేవతలము గనుక మనకొరకు మన సంతతివారు స్వరాజ్యమును సంపాదించి పెట్టుదురని చెప్పి యీ భారమును వారిమీద త్రోసివేయజూచుట కేవలము బుద్ధిహీనత్వము) "తాటిచెట్టు నెక్కువాని నెంతవరకు పైకి నెట్టగలము." మనకాళ్లమీద మనమే నిలువబడవలెను. ఎవరి శక్తిసామర్థ్యములవలన వారే నిలువబడవలెను.

ఈ పనులన్నియు మీరే చేయవలసి యున్నది. మొదట వానిలో ముఖ్యమైన పనులను నెఱవేర్పవలెను మనకు కావలసిన అన్నివిషయములకును, యీ స్వరాజ్య సంపాదనమే మూలమని, 50, 60 సంవత్సరమునుండి దీనికై పాటుపడుచున్న గొప్ప గొప్పవారు అనుభవముమీద దెల్పియున్నారు. ఈ మూలసూత్రము మనలో లేనియెడల లాభములేదు. ముందుగా స్వరాజ్యమునకు పనికివచ్చు చిన్నచిన్న సంస్కారములను గావించి, పిమ్మట యీ పెద్ద స్వరాజ్య సంపాదనమునకు పాటుబడవలెనను మాట వెట్టిమాట. ఇవేవియును దీనికిసహాయకారి కాజాలవు. నిన్న ముచ్చటించిన విషయములనే తిరిగి యీ దినమున ముచ్చటించెదను. స్వరాజ్య మనగ నేమియో నిన్న చెప్పియుంటిని. స్వరాజ్యమనగ యింగ్లీషువారిని యీ దేశమునుండి తోలివేయవలెనని కాదు. రా జెవరైన నేమి? రాజుతో మనకేమియు పనిలేదు. మనహక్కులు మనకు వచ్చిన చాలును. రాజెవరైనను ఆ హక్కులను మనము సంపాదింపగలము. సీమలో రాజున్నాడు. అంతమాత్రముచేత యింగ్లీషువారికి హక్కులు లేవా? సీమదేశపు రాజే మనకును చక్రవర్తి. సీమదేశములో రాజునకుగాని, రాజ్యపదవికిగానిహానిలేకుండ ప్రజలు స్వతంత్రహక్కులను సంపాదించియుండగ, ఇచ్చట మనభారత వర్షములో చక్రవర్తి పదవికి హానిలేకుండ మన ప్రజలు ఆంగ్లేయ పౌరసత్వపు హక్కులను సంపాదించుటయం దేమి కష్టమున్నది? ఏవిధమైన చిక్కును లేదు. స్వరాజ్యాం

* విద్యావతియైన భార్యను పెండ్లాడిన మంచిసంతానము కలుగుననియు ముందు రాబోవుదేశప్రజలందరును శక్తిసామర్థ్యము కలవారగుదురనియు, వారు మనకొరకు స్వరాజ్యమును సంపాదించిపెట్ట కలుగుదురనియు తలచుట కేవలము బుద్ధిహీనత.

దోషణము రాజద్రోహ జనకమని నిందారోపణ జేసినదెవరు ? దానికై శ్రీమతి బిసెంటమ్మవద్ద 2 వేల రూపాయల హామీపుచ్చుకొనినదెవరు ? ఈ నిందారోపణ, యీ యపనింద చక్రవర్తివద్దనుండి వచ్చినదా ? లేక ప్రజలవద్దనుండి వచ్చినదా ? వీరిద్దరినుండిగాదు. మధ్యస్థముగనున్న కొట్టు కాపలాదారులవద్దనుండి వచ్చినది. ఈ పరిపాలనను మార్చవలసిన విధి మీదైయున్నది. రాజు మారవలసిన అవుసరములేదు, ప్రస్తుతము మనదేశములో జరుగుచున్న పరిపాలనా విధానమంతయు మారినగాని, లేనియెడల, భారతీయులందరు అంతకంతకు దుర్బలు లగుదురు. (అబల లగుదురు.) మనము జేయవలసిన పనియిది. కానిససంఘము లిట్టులనే యుండును. "కానిసత్వముండిననేమి ?" అని కొందరందురు. కానిసలైన నేమి ? వారికిమాత్రము అన్నము పెట్టకుండ చంపరుగదా ? పశుపక్ష్యాదులు మాత్రము జీవించుట లేదా ? పొట్టనింపుకొని బ్రతుకుటయే మనుష్యుని ఆదర్శముకాదు కుటుంబపోషణమే మనుష్యుని గమ్యస్థానము కాదు. కాకులు పొట్టనింపుకొనుటలేదా ! కాకులు నాటు వేసి ధాన్యములు పండింపవు. అయినను అవి ప్రతిదినమును బాగుగ వండిన అన్నమును తినుచుండును. తనపొట్ట నింపుకొనుట మనుష్యునకు పౌరుషేయముకాదు. రాజుగారేర్పరచిన నియమానుసారముగ, వారు మనకు దయచేయ ననుగ్రహించిన యేవియో కొన్ని కొన్ని వుద్యోగపదవులను మాత్రమే సంపాదించుకొని వానికి లోబడి, తన 'ఉదరపోషణమే ప్రధానవిషయముగ జూచుకొనుట పౌరుషేయము కాదు. ఉదరపోషణ మనునది నరులకును మృగములకునుగూడ సామాన్య విషయమే. (శ్లో॥ ఆహారనిద్రా భయమైధునంచ సామాన్య మేతత్ పశుభిర్నరాణాం) మనుష్యులకుండవలసిన గుణములు, లక్షణములు మనలో నున్నవా యని మన మాలోచించుకొనవలెను; అందులో మొదట మనలోని జ్ఞానమును, శక్తిసామర్థ్యములును, శౌర్యధైర్యాది గుణములును యథేచ్ఛగ విజృంభించుటకు అవకాశము లేమైన కలవా ? లేవా యని మన మాలోచించుకొనవలెను. అట్టి అవకాశము లేవియును మన భారతవర్షమునకు లేవు. మనము నెలవేర్పవలసిన ధర్మము లేవైన నున్నయెడల వానిలో మొదటిది రాజ్యాధికార సంపాదనమే యని గ్రహించునది. ఏ మాత్రపు అధికారమైనను చాలును. మన దేశపు ధనమును మనమే ఖర్చుపెట్టుకొనుటకు మనకు స్వాతంత్ర్య ముండవలెను. మనము చెల్లించు పన్నుల నేవిధమున ఖర్చుపెట్టవలెనో మనంతట మనమే బహుజనాభిప్రాయము మూలమున నిర్ధారణపరచుకొన గల స్వాతంత్ర్యము మనకుండవలెను. ఇట్టి స్వేచ్ఛ మనకు లేనియెడల మనలోనుండు స్వాతంత్ర్యశక్తులన్నియు క్రమముగ క్షీణించును. మనకిట్టి కోర్కె లేనియెడల మనశక్తులన్నియు క్షీణించును. అంతకంతకు మనము మృగప్రాయుల మయ్యెదము. ఇది ప్రకృతిసిద్ధమైన అంశమని మన సభాధ్యక్షులు వచించియున్నారు. "స్వరాజ్యము" "స్వరాజ్య" మననేమి ? దానివలన కలుగులాభ మేమి ? స్వరాజ్యమనగ నొక కలెక్టరుపోయి తిరిగి మన కలెక్టరు వచ్చుటయా ! మన దేశీయకలెక్టరు లుండవలెను. వారితోబాటు యింగ్లీషు కలెక్టరులుకూడ నుండిన యెడల నుండవచ్చును; వారుకూడ

మనకు కావలసినదే. ఫలానిచోట ఫలాని మనుష్యుని తీసివేసి క్రొత్తవానిని నియమింపుమని మన మడుగవచ్చును; అడుగుట కభ్యంతర మేమియులేదు. జీతములిచ్చి తెల్లవాండ్లనుకూడ మనము నౌకర్లనుగ చేర్పరచుకొనవచ్చును. వాడు క్రమముగ పనిచేసిన యెడల వానిని మన ముంచుకొనవచ్చును. ఇప్పుడువచ్చిన అసందర్భము ప్రత్యేక మనుష్యులనుగూర్చిగాదు. ఇదంతయు ప్రత్యేకజాతికి సంబంధించిన సమస్య. ఒకజాతి నంతను ప్రత్యేకము బానిసలవలె (గులాములవలె) జూడవలెనా? లేక వారుకూడ మానవులేయనియు, వారికోరికలను, ఆదర్శములను, వారి స్వాతంత్ర్యాభిలాషలను కనిపెట్టి వారిని పైకితీసికొనివచ్చి ప్రపంచములోని తక్కిన జాతులతో సమానులనుగ జేయవలసియుండునా? యనునది గొప్పసమస్య. ఈవిధముగ నాలోచించి చూచినయెడల మనకు స్వరాజ్య సంపాదనముదక్క వేరొండు మార్గములేదు. అధికారము మన చేతిలోనికి వచ్చినట్లయిన, వేలకు వేల మార్గాలను క్షణములో గావింపవచ్చును. పునహా పట్టణములో 'గోడా' యనుచోటనున్న సారాదుకాణమును మూయించుటకుగాను యెంతయో ప్రయత్నముచేసి యుంటిమి; ఆదుకాణమువలన గవర్నమెంటువారికి ఒకటి, రెండు వేలరూపాయలు ఆదాయము వచ్చుచున్నది. కాని ఆ దుకాణమును మూయింపగల అధికారము మనలో లేదు. 'ఫలానిచోట సారాదుకాణముండవలెను; ఫలానిచోట అక్కరలేదు' అని నిర్ధారణ చేయుటకు యింత గ్రంథము జరుగనేల? సాలుకు ఆ దుకాణముమీద వచ్చు ఆదాయమంతయు యీ పై గ్రంథమునకైన కాగితముల ఖర్చుకు చాలునో చాలదో తెలియదు. ఇప్పుడు జరుగుచున్న యిట్టి పనులనన్నిటిని మనము ఆపింపవలసియుండును. ఈ పోగరుబోతుతనము (High-handed-ness) అణగవలెను. అధికారమంతయు మన చేతిలోనికి రావలెను. అధికారము మనచేతిలోనికి వచ్చినతోడనే మనలో వంశపరంపరానుగతముగనున్న అంతశ్శక్తులన్నియు, సుగుణములన్నియు విజృంభించును. ఆ సుగుణముల నుపయోగపరచుటకు మనము కొన్నిమార్గములను కనిపెట్టుదుము. ఇదియే స్వరాజ్యము. స్వరా-జ్యమనగ నింక నేమియునులేదు. కొంచమైననేమి? దానివలన కష్టమేమియులేదే; అంతగా కష్టమేమియులేదు; ఇంటిపట్టున హాయిగకూర్చుని ఏదోపని చేయుచు, ఏవిధముగనో కొంచెము డబ్బు సంపాదించుకొని తన కుటుంబమును పోషించుకొనుచుండిన చాలదా? ఈస్వరాజ్యాందోళన మెందుకు? అని కొందరనవచ్చును. దీనికి ప్రత్యుత్తర మొక్కటియే కలదు. ఈప్రపంచములో మనమే గాక యితర జనులున్నారు; మనకొరకేగాక యితరు లందరికిని సహాయము చేయవలసియున్నది. మన పచ్చ (మంచి) యే గాక, అన్యుల పచ్చ (మంచి) కూడ చూడవలసియున్నది. ఇదియే యేకజాతీయత. ఈసంగతులనన్నిటిని మనము మరచిపోవుచున్నాము. పూర్వము మన మహారాష్ట్రదేశములో గొప్పగొప్ప ఆదర్శ పురుషులుండిరి. ఆదర్శముల నన్నిటిని వారు గ్రహించిరి. కాలకర్మవశమున ఈ మానవశక్తులన్నియు నశించినవి. మనము చేయవలసిన పని నెవ్వరైనచేసి పెట్టుచుండిన మనకు సంతోషము! ఏదోవిధముగ పనిజరిగిన చాలునని మనము సంతోషించుచున్నాము! ఎప్పుడు సంతోషింప

వలెనో, ఎప్పుడు చింతిల్లవలెనో మనము మరచినాము. ఆంగ్లేయులు మన పరిపాలనను నడపుచున్నారు. మనము మెదలకుండ కూర్చున్నాము, మనపశువుల చావడిలో మురికియుండిన మ్యునిసిపాలిటీవారు తీసివేయించుదురు. పట్టణ పరిశుభ్రతవిషయమై వారే జాగ్రత్తపడెదరు వేళకు పశువుల కన్నిటికి మేతవేసి నీళ్ళుపెట్టుదురు. కాని ఆపశువులు ఆ అధికారమంతయు తమ చేతులలోనికి రావలెనని కోరినవా! మనుష్యులకును పశువులకును భేదమేమి? జిల్లాకలెక్టరు పట్టణ పారిశుభ్రత విషయమై జాగ్రత తీసికొనును. పట్టణములో జాడ్యములు ప్రబలిన దానిని నివారించుటకేయేమార్గముల నవలంబింపవలెనో కలెక్టరే నిర్ణయించును కరవులు వచ్చినయెడల దానికి తగిన ప్రతీకారమతడే చేయును. ప్రజలకేయపాయము రాకుండ కాపాడును. అనగా మనస్థితి యెంతవరకు వచ్చినదన్న మాట? పంజరములో పెట్టిన చిలుకలమైనారము. ఇట్టిస్థితి మనకక్కరలేదు. యిది వాంఛనీయము కాదు. (అనగా కోరదగినదికాదు) యేలనన, ప్రతికార్యమును దాని యిష్టము వచ్చినట్లు సాగిపోనిచ్చుచున్నామని మాత్రమేకాదు. ఈక్రొత్తపద్ధతి వలన మనలోనున్న సుగుణములన్నియు క్రమముగ క్షీణించుచున్నవి. అవి క్షీణింపకుండుటకుగాను మన అధికారులు చేయుపనులన్నియు మనమే చేయుగల స్వాతంత్ర్యము మనకుండవలెను. ఇప్పుడు వారు చేయని పనులేమియును లేవు. అనగా ప్రతిపనియు వారేచేయుచున్నారు. వారుచేయుచున్న పనులన్నియు-వారినే చేయనిచ్చుచు, మన యిష్టము వచ్చిన పనులను మనము చేయకూడదు. వారుచేయు పనులను మనముకూడ చేయవలెను. వారి చేతిలోనున్న అధికారమే మనకు కావలెను. దీనికొక్కటే ఆటంకమున్నది. మన యభివృద్ధిని ఆటంకపరచు నిట్టిగతి మనకు పట్టుటెంతయు మనదురదృష్టము "కేసరీ" పత్రికలో నొకచిన్నకథ ప్రచురింప బడినది. రవీంద్రనాథ ఠాకూరుగారు తమ స్వీయ చరిత్రలో "పంజరములో నుంచబడిన చిలుక"ను గూర్చి యిట్టికథనే వ్రాసియున్నారు. పంజరములో నుంచబడిన చిలుకకును, స్వేచ్ఛగ బయట వనములో విహరించు మరి యొక చిలుకకును జరిగిన సంభాషణము ఆకథలో వర్ణింపబడి యున్నది; వనపక్షి యిట్లని పలికెను—"బయట వనములో ఆనందముగ నుండును; మన యిష్టము వచ్చినట్లు బయట తిరుగవచ్చును; యిష్టము వచ్చినచోటికి పోవచ్చును; మనయిష్టము వచ్చినప్పుడు హాయిగపండ్లు ఫలముల నారగింప వచ్చును, నీకిచ్చట పంజరములో ఆనందముగ నున్నదా?" దానికి పంజరములోనున్న చిలుక యిట్లని బదులుచెప్పెను:—"నీవు చెప్పునదంతయు నిజమే: కాని బయటికి పోయిన యెడల, యీబంగారు కొమ్మ యెక్కడ దొరకును?" మనస్థితి యీ విధముగ మారినది! మనకు స్వరాజ్యము వచ్చిన మనము దానినెట్లు నిర్వహించు కొనగలము? ఇచ్చేవారూ లేరు! పుచ్చుకునే వారూ లేరు! ఆ స్వరాజ్యము వచ్చినట్లయిన దానినెట్లు నిర్వహింతుమాయనియు ,మనము దానికి తగమనియు, ముందుగనే ఆరాటపడుచున్నాము. పంజరములోపక్షి బయటికి పోయిన తనకాపంజరమేది? ఆ బంగారు కొమ్మలేవి? మనస్థితికూడ నిట్లేయున్నది. ఇది మనుజునకు సహజమైన స్థితికాదు. కేవలము కల్పితము, (కృత్రిమము Artificial)

చాలకాలము పంజరములో బట్టియుంపబడినందున, ఆచిలుకకు ఆ ఉద్దేశమెట్లు కలిగెనో, ఆ విధముగనే రాజ్యాధికారమంతయును మన చేతులలో నుండిపోవుట వలన, మన కావిపరీతాభిప్రాయములు కలిగినవి. ఇది మనప్రకృతి సిద్ధమైన, అనాదియైన, మానవప్రకృతి లక్షణముకాదు. ఆచిలుక కదియెట్లు స్వాభావికముగాదో, అట్లే ఈయభిప్రాయములు మన జాతికి స్వాభావికములు గావు ఈవిషయము మన మనస్సులలో బాగుగ, గాఢముగ, నాటుకొనవలెను. (అట్లయినను,) మనము చేయవలసిన పనులన్నిటికిని మనము తగియుందుము మన పూర్వులిట్టి పనులను జేయుటకు తగియుండిరి. మనము వారిసంతతి వారమేయైన యెడల, వారి సుగుణములే మనలో నుండినట్లయిన, దానికి తగిన సమయము వచ్చినప్పుడవి పైకిరావలసి యుండును. ఆసుగుణములు సకాలమున వికసించి విజృంభింపగలవను దృఢనిశ్చయముతో మనము పునఃప్రయత్నము చేయవలసియుండును. నే చెప్పున దిదియే. మనపూర్వ ప్రాభవోద్బోధము నందేమైన విలువయుండిన దానిని మీరు సత్వరంగ వలసిన సమయమిదియే; లేనియెడల ప్రఖ్యాతి గాంచిన మీవంశకర్తల సంతతివారమని గాని, ఆమహామహుల మనుమలము, మునిమనుమలము అనిగాని సగర్వముగ బలుకమానుడు. ప్రస్తుతము మన దేశములో గొప్పసర్దారులున్నారు. వారి పూర్వులుకూడ గొప్పసర్దారులే. ఆపూర్వపీఠుల రక్తనాళపటిమ తమలోగూడ వ్యాపించి యున్నదని వారు జెప్పుకొను చుందురు. పిత్రార్జితమైన తమ హోదాలను; పదవులను పోకుండ నిలుపుకొనుటకు గాను, వారు తెల్లదొరల వద్దవంగి యేసేవనైనను జేసెదరు. వారట్లెందుకు చేయుచున్నారు? వారు సర్దారులు కాబట్టి అట్లు చేయుచున్నారు. కాని ఏహోదాలు, ఏపదవులులేని, సామాన్య జనులమైన మనము ఆసేవ కాశించుట యెందుకు? ఇట్లు మన జాతియంతటిపైన ఒకవిధమైన మైకము కమ్మినది: (మబ్బువ్యాపించినది.) మనమా మబ్బును ఛేదించుకొనవలెను. ఇది ఒకవిధమైన గ్రహణము; చంద్రునకు గ్రహణము పట్టినప్పుడు రాహుకేతువులా చంద్రుని వదలును గాక యని మనము దానధర్మములు చేయుదుము. కాని మనకుపట్టిన యీ గ్రహణమునుండి విముక్తుల మగుటకు మన మొక్క దమ్మిడీయైనను దానము చేయుటకు సంసిద్ధులమై యుండలేదు; అట్లు చేయుదమను తలంపేలేదు. చంద్రగ్రహణ సమయమున ఆసుధాకరుని, ఆదుష్ట గ్రహద్వయమునుండి విముక్తుని జేయు తలంపుతో పూర్వ వేదవేదాంగ విదులైన విప్రులు జపహోమాదులు గావించెడివారు; వేదపఠనము గావించెడివారు (వాతావరణ మంతయు వేదపాఠగానముతో నిండి ప్రతిధ్వనింపుచు, ఆవేదఘోష చంద్రమండలమువరకు వ్యాపించు చుండెడిది.) మనమిప్పుడొక్క జపమైనను గావించుచున్నామా? దీనికై యత్నము చేయుచుంటిమా!? దీనికై యొకచిల్లిగవ్వయైనను దానము చేయు చుంటిమా? లేదు, లేదు, ముమ్మాటికిని లేదు.

అధికారవర్గమువారు చెప్పు అభ్యంతరమిది: "హిందువుల కధికారమిచ్చినట్లయిన మహమ్మదీయు లేమికావలెను? హిందువులకు స్వరాజ్యపు హక్కుల నిచ్చిన మహమ్మదీయులకు రాజాలవు" పాపము! మహమ్మదీయులును, మనమునుకలసి సిమ్లట

అన్యోన్యముగ నుండజాలమని కాబోలు వారియూహ ! మనహిందువుల చేతులలో నధికారమునుండినయెడల, మహమ్మదీయులమీద జులుము చేయుదురుట; మహమ్మదీయుల చేతులలో నధికారముండిన యెడల వారు హిందువులమీద "జులుము" చేయుదురట ! వీరండీ ! ప్రజాపక్షమున మాట్లాడవచ్చు వారు ! వీరెవరు ? వీ రీమాటలను మనతో నెందుకు చెప్పుచున్నారు ? మనను మోసపుచ్చుటకు. దీనిని మనము బాగుగ నాలోచింపవలెను. ఈ సివిల్ ఉద్యోగస్థులు మనకంటె చాల తెలివిగలవారు. అధికారమంతయు వారిచేతులలోనే యుంచుకొన జూచెదరు. ఇదంతయు చూడగ "ముగ్గురు దొంగల" కథలాగున్నది.

మన మెప్పుడైన రాజకీయహక్కులను గోరినప్పుడు "మీరనదలు, మీరబలలు, మహమ్మదీయులు దీనికి ఒప్పుకొనుటలేదు." అని మనకు ప్రత్యుత్తరమిచ్చుచుందురు. (వారు చెప్పుమాటలివి!) "మాకేమియు నభ్యంతరములేదని" మహమ్మదీయులని నట్టయిన వారప్పుడింకొక మూడవకారణము (సాకు) చూపించెదరు. ఇన్ని దినముల నుండియు నీ దొంగతనము (పుండాకోరుతనము, Roguery) జరుగుచున్నది. దీనివలన మనము మోసపోకుండ... (వాక్యము అసంపూర్తి.)

ఈ హక్కులను సంపాదించుటకు అన్యాయపుపనులుగాని, దుర్మార్గపుపనులుగాని చేయవలసినదని నేను చెప్పను. దీనికి న్యాయమైనత్రోవ యున్నది. ఇతరుల చెప్పెడుమాటలకు మనము చెవియొగ్గకూడదు. దీనికిదియే మూలసూత్రము. "మాకు ఫలానిహక్కులు కావలెను," అని దృఢముగ, నిర్భయముగ చెప్పుటకు జంకకూడదు. నీ కట్టి మనోనిశ్చయము లేనియెడల ప్రయోజనము లేదు. పోలీసుఉద్యోగస్థు డెవడైన నిన్ను చూచి "సరేగాని, నీవు తిలకుగారి యుపన్యాసములను వినుటకు వెళ్లియుంటివా?" యని యడిగిన "అవును, వెళ్ళానుగాని, నే వెళ్ళేవరకంతా ఆఖరయినది; నేను చిట్టచివర ఎక్కడనో యొకమూలకూర్చుని విన్నాను; సరిగా వినబడలేదు." అని ప్రత్యుత్తర మిత్తువు. పోలీసుబంట్రోతు నిన్ను కళ్ళారా చూచినాడు గనుక "నేను వెళ్ళలేద"ని చెప్పుటకు వీలు లేదు. నీకంతభయ ముండుటకు కారణమేమి? "స్వరాజ్యము" కావలెనని చెప్పిన నీకేమిభయము ? వచ్చిన చిక్కంతయు నిచ్చటనే యున్నది. తనతోకూడ ఉపన్యాసము వినినవా రెవరైన యీ సంగతినే తరువాత అడిగినట్టయిన, నిజమంతయు చెప్పుచున్నాడు, కాని పోలీసుబంట్రోతు అడిగినప్పుడు మాత్రము "నాకు సరిగ వినబడలేదు. ముగ్గురో, నలుగురో, మాట్లాడుచుండిరి. నాకేమియు వినబడలేదు; ఆ యుపన్యాసములోని విషయములు నాకేమియు నచ్చవు. (వానితో నే నేకీభవింపను.)" అని బదులు చెప్పుచున్నావు. ఈ విషయములో నీవిధముగ పైకొకమాటయును, లోపల మరియొక మాటయును చెప్పిన పనికిరాదు. ఈ పైపైమాటల కేదేవతయును తృప్తికాజాలదు. నీ మనస్సులో నేమి యున్నదియును ఆ దేవతకు తెలియును. దేవత లందరిలో నీ స్వాతంత్ర్యాధిష్ఠానదేవత ఆ విషయమును బాగుగ గుర్తెఱుంగును. ఆ దేవత నీ కోర్కె నీడేర్పసిద్ధముగ నున్నది నీ వడు

గుటయే యాలస్యము. వరములు కోరుకొనుము. వెంటనే నీకనుగ్రహింపబడును. “శ్రేయః”, “శ్రేయ” అని ఒకటి రెండు పర్యాయము లందురేమో గాని లేదని ఎన్ని పర్యాయము లందురు? మన మనుసదానిలో నేవిధమైన కృత్రిమము లేదని వారి మనస్సునకు బాగుగ నచ్చవలెను. మన కీగాఢ యత్నమార్గము తప్ప వేరొండుమార్గము లేదని వారి మనస్సులో నాటవలెను. (మన మెప్పుడును యత్నము చేయుచుండవలసి నదే.) దేవత లెప్పుడును తమభక్తుల మనఃపరిశోధన జేయనెంచి యెన్నోయిడుముల బెట్టుట పురాణప్రసిద్ధము. కాని మనము వానికి భయపడక ఆ పరిశోధనలకు నిలచి నప్పుడే ఆ దేవత మనపై కరుణించును. మన దృఢభక్తిచేత దేవతలను మనమే ప్రసన్నుల జేసుకొనవలెనని యోగశాస్త్రములలో కూడ జెప్పబడియున్నది. మొట్టమొదట ఆ దేవత నిన్ను భయపెట్టును. నీవు దానికి జంకని యెడల సరే; ఆశోధనకు నిలచి మన సన్మార్గముననే మనము పోవుచుండిన యెడల ఆ యోగమాత శాంతి నొందును. ఇది ప్రత్యక్ష ప్రమాణము. ఇదియే యోగసూత్రము. రాజకీయ విషయములలో కూడ నిదియే ప్రమాణసూత్రము. వేరొండులేదు. మనము స్వరాజ్యమును మనస్ఫూర్తిగ కోరుచున్నాము. మనకది కావలెను. తప్పక మనకు స్వరాజ్యము వచ్చి తీరును దానిని సంపాదించువరకును మనము మన ప్రయత్నములను మానజాలము. ఇట్టి మనోనిశ్చయము మనలో లేనియెడల మనము దానిని సంపాదింపనేలేము. మనకిట్టి మనోనిశ్చయముండిన యెడల మనకున్న భయము మాయమైపోవును; మనకు భయము వెనుకబట్టును. పోలీసుబంట్రోతు మనవెనుకనే బడియుండును. గూఢచారియు మనకు వెనుకనే బడియుండును. (వీరిని జూచిన మనకు భయముండదు.) ఇవి యిట్లుండగనే తుదకు మనకు స్వరాజ్యము వచ్చును. వారి అరపులకు, కేకలకు మనము భయపడకూడదు. మన ప్రయత్నముల కిట్టి ఆటంకము లుండితీరును. “చీకటిలో నుండి పోయిననే గాని వెలుతురు రాదట” సూర్యోదయమునకు పూర్వము సూర్యుడు అంధకారము నుండి వెలువడవలెనని సాధారణముగ జనులు తలంచెదరు. ఇది నిజముగ శాస్త్రసమ్మతమైన యంశము కాకపోయినను (దీనివలన మన మొకవిషయమును గ్రహింపవచ్చును.) అంధకారమునుండి పోనిది మనకువెలుతురు రాదు. అట్లే అనేక కష్టముల కోర్చి, ప్రజల అరపులు, కేకలు, అల్లకల్లోలములు, గంద్రగోళములు మొదలగు కృత్యముల కోర్చినగాని మనకు స్వాతంత్ర్యము లభింపజాలదు. మనో నిశ్చయమే మనకాధారము. స్వరాజ్య మనసేమో మీకు చెప్పియుంటిని. దానికి తగిన దృఢ ప్రయత్నము చేయవలసి యున్నది. భగవదనుగ్రహమువలన, వర్తమాన కాలమున, ప్రపంచమంతయు గొప్ప పరిణామావస్థ యందున్నది. (కాలచక్రము తిరుగుచున్నది. అనేకమార్పులు జరుగుచున్నవి) అనగా మనకు దైవము సాయపడుటకు సంసిద్ధుడై యున్నాడన్నమాట. దైవము సిద్ధముగనున్నను మనము సిద్ధముగలేము, (కలికాలము) భగవంతుడు కొంత స్వరూపుడు; ఆకాశమునుండి యూడిపడవలెనా మనకు వరములు? అట్లెవరును మనకు పంపరు, భగవంతుడుకూడా ఎవనికిని అట్లు వరములను ప్రసాదింపడు. అట్లొకవేళ ప్రసాదించినను మన కవి నిష్ప్రయోజనము

లగును. మనము భయపడినయెడల ఇదివరకు మనకున్నవికూడ పోవును. ఆ వరములను మనమెట్లు నుపయోగించుకొనగలము? భగవంతు డెక్కడ నున్నాడో మనకు తెలిసి నట్లయిన మనము తిరిగి వానిని అచ్చటికి పంపివేయవచ్చును. పోస్టుద్వారానైన పంప వచ్చును. ఇట్టి యూహాలు మనలో పుట్టినప్పుడు, మన స్వజాతీయహక్కులలో ప్రధా నాంగ మగు అధికారము మనచేతిలోనికి వచ్చినప్పుడు, ఏమిసంభవించును? మన జాతి యెట్లుగా మారును? ఈ విషయములను నేనిప్పుడు ముచ్చటించెదను. స్వరాజ్య మన నేమియో మీకు చెప్పియుంటిని. స్వరాజ్యమనగా ఆంగ్లేయులను తరిమివేసి యిచ్చట మన అధికార మేర్పఱుపవలెననికాదు. ఈ విషయ మిదివరకే మన స్నేహితులు, 'కెల్కారు'గారు చెప్పియున్నారు. కొందరిని తరిమివేయవలసియుండును. స్వరాజ్య మనగా రాజును తరిమివేసి, అధికారమును మన చేతులలోనికి తీసికొనవలెనని కాదు. ప్రజాపారసత్వపు హక్కులను మనచేతిలోనికి తీసికొనవలెనని దాని కర్థము. మన భారతజాతినంతను బానిసలుగ (గులాములుగ) నుంచినందువలన యింగ్లాండు దేశమున కేమైన లాభమువచ్చినదాయని యాలోచించినట్లయిన, అదియును లేదు. అట్టిలాభ మేమియు గనిపించదు. ప్రపంచముయొక్క ప్రస్తుత స్థితినిబట్టి ఆంగ్లేయసామ్రాజ్యము, యికముందు, యిప్పుడు కానియెడల మరొకప్పుడైనను, సామ్రాజ్యాంతర్భాగములై, తన యధికారము క్రిందనున్న వివిధ రాష్ట్రములకును, దేశములకును, స్వపరిపాలనా స్వాతంత్ర్య మిచ్చితీరవలెనని స్పష్టమగుచున్నది. ఎప్పుడో ఒకప్పుడు యీస్థితి రావ లసియున్నది—వచ్చితీరవలెను. కాని మన మేమియు తగినయత్నము చేయనియెడల నీటిస్థితి రాకపోవును. రాత్రి యంతయు మేలుకొని, పిమ్మట దొంగవచ్చువేళకు నిద్ర పోవువానివలె నుండును మాస్థితి! తగుసమయము సమీపించుచున్నది. దైవకృప వలన ప్రపంచములో నితరజాతులు పొందుచున్న పరిణామావస్థ మనకు శుభదాయకము కావచ్చును ఆ శుభముహూర్త మాసన్నమగు వేళకు మన మందరమును మేలుకొని యుంటిమా మనకది ప్రయోజనకారి యగును. అట్లుగాక నిద్రపోవుచుంటిమా మనగతి యెప్పుడును దీర్ఘనిద్ర పోవుటయే యగును. స్వరాజ్యాధికారము వచ్చినను మనకప్పు డేమియు లాభముండ జాలదు. అప్పుడేమి సంభవించునో మీకుచెప్పెదను వినండి. పీష్వాల ప్రభుత్వకాలములో మహారాష్ట్ర దేశపరిపాలన సక్రమముగ జరుగుచుండెను. ఈ మహారాష్ట్ర పరిపాలనను ధ్వంసముచేసినది "ఎలిఫిన్‌స్టన్" అను ఆంగ్లేయుడు. ఈతడే తిరిగి రాజ్యశిథిలానంతరము కంపెనీపక్షమున మహారాష్ట్ర దేశమునకు కమిష నరుగవచ్చి చేరెను. నేను చెప్పుదాని కితడే ప్రత్యక్ష ప్రమాణము. పీష్వాల ప్రభుత్వ కాలములో అప్పుడు, పునహా యనుపేటి గొప్పపట్టణములో సైతము, రాత్రులందొక దొంగతనమైనను జరిగియుండలేదు. మద్యపానము పూర్తిగ నిషేధింపబడినది; త్రాగు వన్నమాట లేదు. మొట్టమొదట జమాబందీపద్ధతి యేర్పరచినది "నానాఫడ్నవీసు" అను మహారాష్ట్ర ప్రభువే. దానినే పిమ్మట నందరును అవలంబించిరి. అంతదూరము పోనేల? రాజ్యపరిపాలనకు సంబంధించిన లెక్కలు, ఆదాయవ్యయ పట్టికలు, జమా ఖర్చు లెక్కలు వగైరాలైన వన్నియును సిద్ధముచేయు పద్ధతులు మొట్టమొదట పీష్వాల

కాలములోనే ప్రారంభమైనవి. ఆపద్ధతులే యిప్పటికిని కూడ నవలంబింపబడు చున్నవి. రాష్ట్రపరిపాలనా విధానములన్నియు మనకు కరతలామలకములే. నానాఫర్నవీసుచే నియోగింపబడిన గూఢచారి పోలీసుభటులు ఏపద్దారు, ఎప్పుడు, ఏమనుష్యునితో, ఏమి మాట్లాడినదియు తక్షణము తమప్రభువగు నానాఫర్నవీసునకు తెలియపరచు చుండెడివారు. పూర్వమొకప్పుడు యీక్రింది చిత్రమైన కథ జరిగినదని చెప్పుదురు. బొంబాయి గవర్నమెంటువారు కొంత మందుగుండు సామానును రహస్యముగ ఒక (మేనాలో) పెట్టి ఎవరికిని తెలియకుండ "ఖోపోలి" కనుమకుండ (పునహాలో నున్న) యింగ్లీషు రెసిడెంటుకు పంపించుమండిరి. ఈసంగతి పునహా దర్బారుకు తెలియరాగా "ఖోపోలి కనుమనుండి వచ్చు మేనాను ఆపివేయవలసినది" అని వెంటనే యుత్తరువు చేసెను. "మా మేనాను ఎందుకు ఆపుదల చేసినారు" అని ఆ రెసిడెంటు గోలపెట్టెను. అందుమీద నానాఫర్నవీసు యీ విధముగ నుత్తరువు పంపెను. "దాని నెందుకు ఆపినామో, నీవే ఆలోచించుకొనుము. ఆ మేనాను మేము ఆపినాము. మేము పోనివ్వము. ఎచ్చట నేమి జరుగుచున్నదియు రాజునకు తెలియపరచవలసియున్నది. మేము మాపనిని నెరవేర్చియుంటిమి" అని బదులు చెప్పెను. గనుక సి. ఐ. డి; గూఢచారులు అవసరమే. అవసరము లేదని నేననను. రాజున కెప్పటి సమాచారము లప్పుడు తెలియనియెడల పరిపాలన జరుగజాలదు. సి. ఐ. డి. గూఢచారులను గురించి యిప్పు డెవరును గోలపెట్టుటలేదు. మా మొరలన్నియు వారవలంబించు పద్ధతులను గూర్చియే గాని, వారినిగూర్చి కాదు. ఆపద్ధతులు మనచేతులలో లేవు. రాజ్యము నడపువానికి అన్ని రాజ్య శాఖలును కావలసినదే. పోలీసుశాఖ కావలసినదే గూఢచారులు కావలసినదే. రివిన్యూడిపార్టుమెంటు కావలసినదే, న్యాయాధికారశాఖ కావలసినదే. అన్నిశాఖలును కావలసినదే. ఇప్పుడు వచ్చిన చిక్కెక్కడ? ఒక్క విషయములోమాత్రము గొప్పచిక్కు వున్నది. అన్నిశాఖలు (డిపార్టుమెంటులు) కూడ ప్రజల చేతులలో నుండవలెను. ఉన్న చిక్కు అంతయును దీనిలోనే యున్నది. ఆంగ్లేయులు బహునాగరికులని చాలమంది యభిప్రాయము, మనముకూడ నాగరికితాభివృద్ధి గాంచవలెను. నాగరకత అక్కరలేని దెవరికి? సంస్కారములు (మార్పులు) అన్నియును కావలసినదే. నానాఫర్నవీసు కాలములో వార్తలు ఉత్తరములద్వారా పంపబడుచుండెడివి. ఇప్పుడు సి. ఐ. డి. గూఢచారులు తంతివార్తల (టెలిగ్రాఫుల) మూలమున పంపెదరు. సాధనములు సులభమైనవి. (యిప్పుడు తేలికయైనవి) వీని యన్నిటిద్వారా పరిపాలన జరుగవలసి యున్నది. కాని పీష్వాలకాలములో నీ పరిపాలనాపద్ధతి యంతయును నున్నదే. ఆ పీష్వాలప్రభుత్వము పోయినతరువాత నేమిజరిగినదో యోచింపుడు. పీష్వాల యనంతరము వారిక్రిందనున్న నగర్, సతారా, పునహా, రాష్ట్రములు ఆంగ్లేయుల వశమైనవి. పీష్వాలక్రింది రాజప్రతినిధు లందరు మహాయోధులు. గైక్వార్, హోల్కార్, సింధియా, మొదలగు జాగీరుదార్లు, సర్దార్లు, మహారాష్ట్రసైన్య నివహాధిపత్యము వహించిన మహాయోధవీరులలో నగ్రేసరులు. వారు మార్గమును ఆకాలమున

ఆంగ్లేయుల దరిజేరినందున నేటికిని నిలచియున్నారు. పేష్వాల ప్రభుత్వము శిధిలమై పోయినది. ఇది 1818 సంవత్సరములో జరిగిన కథ, ఈ దుర్గదస్థితియు నీరోజున నెట్లున్నది? బరోడాసర్కారుయొక్క స్థితియేమి? హోల్కారు స్థితియేమి? సింధియాసర్కార్ స్థితియేమి? పునహాప్రాంత రాష్ట్రముల స్థితియేమి? దీనిని బాగుగ యోచింపుడు. ఈ 3, 4, పునహాప్రాంతమండలములు ఆంగ్లేయుల పాలబడుట వలన పరిపాలనాధికారమంతయు ఆంగ్లాధికారధూర్వహుల చేతులలోనికి పోయినది. ఈ యధికార వర్గమువారి పద్ధతియేమి? వీరు ప్రజల మొఱలను ఎంతమాత్రమును వినరు. ప్రజల మొఱలను వినుట వీరిపద్ధతి కానేకాదు మొదట గవర్నరు, తరువాత కమిషనర్, తరువాత కలెక్టరు, అశిస్టాంటు కలెక్టరు, మమ్లతుదారు, అవల్దార్, పోలీసుబంట్రోతు యిది! మొదటినుండి చివరకును ఉన్న అధికార ప్రాబల్య క్రమము! ప్రజలకేమైన మేలుచేయవలెనన్న వీరు చేయవలెను. పై గవర్నమెంటు వారు ప్రజలకు మేలుకలుగునని యెంచియో, లేక కీడుకలుగునని యెంచియో కొన్ని కొన్ని యుత్తరువులను పంపెదరు. ఆయుత్తరువుల ప్రకారము క్రింది యుద్యోగస్థు లందరును పనులను నెరవేర్చుచుందురు. మొదట యీ పద్ధతి బాగుగ నున్నదని తలంచిరి. బాజీరావు పేష్వాల కాలములోనున్న గల్లంతులు అల్లరులు, అణగినవి. ప్రజలందరును సురక్షితముగ నున్నామనిరి. "ఎరనుజూచి నాయగాని, గాలపు కొక్కెమును జూడలేదు." క్రమక్రమముగ ఆ గాలపు కొక్కెము కూడ కనబడజొచ్చెను. అధికారమంతయు అధికారవర్గమువారి చేతులలోనికి పోయినది. ప్రజలకు చదువు చెప్పించిరి రైలుప్రయాణములు చాల యుపయోగముగ నుండెను! నేను యీదినమున ఫలాని నోటికి పోవుచున్నానని ఒకక్షణములో తంతివార్త నంపవచ్చును. విద్య వ్యాపించినది. ఈ మేళ్ళన్నియు మనకు చేకూరినవి. కాని అధికార మంతయు అధికారధూర్వహుల చేతులలోనికి పోయినది. కంపెనీవారి రాచరికములోనే కొంత యధికారము మనచేతులో నుండిపోయి వారి స్వాధీన మయ్యెను. తిరిగి 1858 సంవత్సరములో గవర్నమెంటువారు అమలులోనికి తెచ్చిన "ఇండియా ఆక్టు" వలన ఆ యధికారము పూర్తిగ మనచేతులలోనుండి పోయినది. అది అమలులోనికివచ్చి యిప్పటికి 58 సంవత్సరములైనది. ఈ 58 సంవత్సరములలో నేమి జరిగినది? ఉద్యోగస్థుని కధికార మెక్కువైనది; ప్రజల కధికారము తక్కువైనది. ఆస్థితి యెంతవరకు వచ్చినదనగా, మనకిప్పుడు "కుల్ కారిని" అక్కరలేదు. అందరకును నౌకర్లే కావలెను. మనకు పూర్వార్జితమై, వంశపరంపరానుగతములైన హక్కులేమైన నున్నయెడల నవికూడ పోయినవి. గవర్నమెంటువారు యీనాం కమిషనును యేర్పరచినప్పుడు యీసంగతులేమియు మనకు తెలియలేదు. (ఈ పూర్వార్జితములైన మన హక్కులు పోవుచున్నవను తలంపు మనకు కలుగలేదు) దానికి మన మిప్పుడేమియు చేయలేము. ఆదినములలో "విజాపుర్ కార్" అను గొప్ప జాగీరు దారు డుండెడివాడట. అతను సేన కంతటికిని అధిపతి. ఆ సేనలో పదివేలమంది కొక యధికారియు, 15 వేలమంది కొక యధికారియు నుండెడివారు. "మీ రంద

రను యింతఖర్చుపెట్టుకొని యింతసేనలను నిలువ జేయనేల? మా సేనల నన్నిటిని మాకు యిచ్చివేయుడు: మేము మీకు దానికి ప్రతిఫలముగ 15 లక్షల రూపాయిల నిచ్చెదము. ఆ మొత్తములో మీరు సేనకై 14 లక్షల ఖర్చుపెట్ట వలసియుండును. మిగిలిన లక్షరూపాయిలును మీరే తీసికొనుడు" అని గవర్నమెంటువారు వారిని ప్రోత్సాహపరచిరి. అందుకు మనవారు సమ్మతించిరి. "హాయిగ! ఇంటివద్ద కాలుమీద కాలువేసికొని కూర్చుండి యీ లక్షరూపాయిలను అనుభవింపవచ్చును! అంతకంటె నింకేమి కావలెను?" అని మనవారు తలంచిరి. ఇదియొక గొప్పసూత్రము. "అయ్యో! మా హక్కులు పోయినవే! రాజ్యసంరక్ష ణార్థము మేము స్వయముగ పోరాడగల హక్కులు పోయినవే! సైన్యాధిపత్యపు హక్కులు పోయినవే!" యని అప్పుడెవరును తలంచి యుండలేదు. "మన మింటిలో కూర్చుండగ హాయిగ! మనకింత అన్నవస్త్రము లిచ్చుచున్నారు. ప్రభుత్వమువారు బహు మంచివారని" మనవా రప్పుడు తలంచిరి. ఇంతకంటె నింకేమి కావలెను? ఈ కారణములవల్ల మన మీ స్థితికి వచ్చినాము. 50, 60 సంవత్సరముల కాలములో మన యధికారమంతయు యూరోపియను ఉద్యోగస్థుల హస్తగతమైనది. దీనిని బట్టి యూరపియను ఉద్యోగస్థులందరు చెడ్డవారని చెప్పుచున్నానని మీరను కొనవద్దు. వారు చాలచదువుకొనినవారు. సీమలో పెద్దపెద్ద పరీక్షలనిచ్చిన వారికే గవర్నమెంటు వారు ఉద్యోగము లిచ్చుచున్నారు. వారు మనకంటె సమర్థులే. ఇదంతయు నిజమే. కాని వారు మనకొరకు చాలకష్టపడవలసి వచ్చుచున్నది. సీమలో చల్లగానుండును. ఇచ్చట హిందూదేశములో ఉష్ణమతి తీవ్రముగ నుండును. ఇదంతయు యోచించి వారికి మనకంటె పెద్దపెద్ద జీతము లివ్వవలసినదే. మన మంచి కొరకు పాపము! వారు అంతదూరమునుండి వచ్చినప్పుడు "లేదు, లేదు" అనెదమా? ఇవన్నియు మనము ఒప్పుకొనుచునే యున్నాము. మనకంటెను కూడ వారే యెక్కువ పనిచేయుచుండ వచ్చును. చేయుచుండుట లేదని నే ననను. కాని, అది మనపనియైనప్పుడును, దానిని మనము చేయుటకు సంసిద్ధులమై యున్నప్పుడును, దానిని యితరుల కీయనేల? వారా పనులను చెడగొట్టుచున్నారని నే చెప్పను. మనము చేయుపనులన్నిటిమీదను నిర్బంధము లేర్పరచుట వలన మన తెలివితేటలన్నియు క్రమముగ మందగించి పోవుచున్నవి. ఇది మన యభివృద్ధి కెంతయు అనర్థదాయకము. మన యుత్సాహము, శక్తి క్షీణింప నారంభించినవి. దుర్బలత్వమా యెక్కువగు చున్నది. కాబట్టి యీ పద్ధతి మనకక్కర లేదు. తెలివిగలవారు కాదని నేను వద్దనుటలేదు. వారు మంచివారే. వారుపర్తక వ్యాపారములో ఆరితేరిన మంచి వణిక్శిఖామణులు. నీకేదైన షాపుగాని ఖాయిదా కొట్టుగాని యుండినట్లయిన నీకంటె తెలివిగల గుమాస్తాను ఏర్పరచుకొనవా? అట్టి గుమాస్తాలను ఏర్పరచుకొనవచ్చును. కాని, కొట్టుపెత్తన మంతయు గుమాస్తాచేతులలో నుంచివేసి, నీ వాప్రక్క నెక్కడనో చేతులుముడుచుకొని కూర్చుండి, ఆ గుమాస్తాయిచ్చు ఆ నాలుగురూపాయిలను నీవు చేతిలోవేసికొని ఊరకతృప్తి నొందెదవా? ఇది వ్యాపారమునకు సంబంధించిన విషయము. ప్రతివిషయములోనుకూడ

నిదియే పద్ధతి. ఈ రాష్ట్రపాలనకూడ నీ విధముగనే యున్నది. బరోడాసంగతి యెట్లున్నది? బరోడాచరిత్ర నొకసారి తిలకింపుడు. ఈ చరిత్రలో నిట్టిసంగతు లెన్నియో కనుపించును. అచ్చట జరుగు కార్యము లన్నియు నిచ్చట జరుగుట లేదు. బరోడా మహారాజావారి "గాడీ" (సింహాసనము) చిరస్మరణీయముగ, పోకుండ, కాపాడబడెను: ఇది పూర్వమునుండి తప్పకుండ క్రమముగ వచ్చుచుండెను. ఇది చరిత్రప్రసిద్ధము. పూర్వము బరోడాపై యజమాయిషీ (అధికారము) అంతయు పునహాలోనుండు పీష్వాలే చేయుచుండెడివారు; కాని తక్కిన పరిపాల నంతయు బరోడారాజులే చేయుచుండిరి. మన మిక్కడ బాగుగ చదువుకొని, బరోడాకుబోయి అచ్చట యుద్యోగములో ప్రవేశింపవచ్చును. ఇచ్చట పునహా, బొంబాయిలోకూడ చదువుకొనిన గొప్ప గొప్ప మునసబ్బులు, దివాన్‌లు మొదలైన వారందరున్నారు: నాయబ్ దివానులున్నారు. హైకోర్టు జడ్జీలున్నారు. వీరందరక్కడ బరోడాలో పనిచేయుచున్నారు. వీరందరు ప్రజల కేవిధమైన బాధలు లేకుండా రాజ్యపాలనము చేయుచున్నారు. అక్కడజరుగు విధముననే, యిక్కడకూడ జరుగుటకేమి యభ్యంతరమున్నది? వారందరును పునహా సతారాజిల్లాలనుండి బరోడా రాజ్యమునకుపోయి, అచ్చట రాజ్యపాలన చక్కగనిర్వహింపుచుండగ, అదే విధముగ మనవారందరు యిచ్చట రాజ్యపాలన గావించుట కేమి యభ్యంతరమున్నది? అభ్యంతర పెట్టిన చెవరు? మన జాతియంతయు రెండువిధములుగ విభజింపబడియున్నది. దానిలో నొకటి మహారాష్ట్రము; ఇది కొన్ని కొన్ని కారణముల వలన ఆంగ్లేయుల స్వాధీన మైనది. మరియొకటి స్వదేశసంస్థానాధీశుల చేతులలో నిలచి పోయినది. బరోడా వారు "మా జనులుసమర్థులు, రాజ్యపరిపాలన కర్తలు:" అని చెప్పుచున్నారు. కాని యిక్కడ మనమీద రాజ్యమేలు వారో "మా ప్రజలసమర్థులు, పరిపాలనకర్తలు కారు" అని చెప్పుచున్నారు. మన మందరమును కూడ పైదానికి "డిటో" అనుచు, వారు మాట్లాడునట్లే మాట్లాడుచున్నాము. ఈ విషయము ద్వంద్వముగ నున్నది. దీనిలో రెండు అంతరములు యేర్పడినవి. కాబట్టి స్వరాజ్య మన్నప్పుడు మనకేమి కావలెను? బరోడాలో నున్న ఆ రాజ్య పాలనా పద్ధతియే యిక్కడపునహా సతారావగైరా జిల్లాలలో నుండుట కేమియభ్యంతరమున్నది? ఆంగ్లేయుల అధికారముండియే తీరును, వారి యధికారము బరోడాలో కూడ నున్నది. బరోడాధిపతి స్వతంత్ర రాజుకాడు. పీష్వాల కాలములో బేసిక ఒడంబడికలో రూపాయిలో ఆరు అణాలు గవర్నమెంటువారి కిచ్చేటట్లు సంధిచేసికొన్నారు. ఇప్పుడా పునహా సంస్థానము కూడ నుండియున్నట్లయిన ఆ రాజ్యము కూడా యీబరోడా రాజ్యమువలెనే పరిపాలింపబడు చుండెడిదిగదా! ఈ విధముగనే నగరం, సతారా, రాజ్యములుకూడ నుండెడివిగద! ఈ పద్ధతులే యిప్పుడు నైజాములోకూడ నున్నవి. స్వరాజ్యమనగా నిదియే. పునహా సతారా జిల్లాల నన్నిటిని ఒక సెంట్రల్ డివిజనుగా నేర్పరచి, దానికి బరోడా మొదలగు స్వదేశ స్వతంత్ర సంస్థానములకున్న అధికారము లన్నియు నివ్వవలసినది. కాని

దీనిలో నొక్క భేదము మాత్రమున్నది. మాకు వంశపరంపరగాను గతముగ వచ్చు రాజు గాని, అధికారిగాని, మాకవుసరము లేదు. మా పాలకుని మేమే యెన్నుకొనెదము. ఇది యొక్కటియే భేదము. ఇదివఱకు పూర్వము మహారాష్ట్ర రాజ్యమున కంతకును రాజధానిగనున్న పూనహారాష్ట్రమునకు స్వతంత్రములేదు; కాని పూర్వము పూనహాకు లోబడియున్న బరోడా మొదలగు రాష్ట్రములకు స్వతంత్రమున్నది! ఇదెంతయు దేశ చరిత్రలో విసందర్భముగ నున్నది. దీని కేమియు కారణములేదు. వారివలె, బరోడా రాజ్యము మాదిరిగ, మన మెందుకు కాకూడదు? ప్రస్తుతము యూరపుఖండమున జరుగుచున్న యుద్ధమునకు మన గైక్వార్, సింధియా ప్రభువులు తమతమ సైన్యము నెల్ల గవర్నమెంటువారికి సహాయముగ పంపినారని చెప్పియుంటిని. మనకు కూడ అధికారమున్నట్టయిన మనము కూడ పంపియుండెడి వారమేగద! ఆంగ్లేయ ప్రభుత్వము ఉండునా పోవునా అను సంగతికిని దీనికిని యే విధమైన సంబంధమును లేదు. విదేశీయాధికార ప్రాబల్యము, అధికారపూర్వపుల ప్రాబల్యము, ఉండునా పోవునా అను నదే ప్రస్తుతము గొప్ప సమస్య. ఇదే స్వదేశసంస్థాన పాలనా పద్ధతికిని ఆంగ్లేయ రాజ్యపద్ధతికిని ఉన్న భేదము. కాని కన్నిటికిని మూలాధారమైన చక్రవర్తి పాలనలో నేవిధమైన భేదమును ఉండదు. ఇదివఱకే లారెన్సు అనువారు స్వరాజ్యాందోళనమును గూర్చి మాట్లాడుచు నీ విధముగ జెప్పియున్నాడు. "హిందూదేశమునంతయు స్వదేశ సంస్థానములుగ భాగించి, ఒక్కొక్క దానికైన కడుసమర్థుడైన పరిపాలకుని యేర్పరచవలసినది ఆంగ్లేయ ప్రభుత్వమున కేవిధమైన ఉపాయము లేకుండునట్లు, పరజాతులతో సంధివ్యవహారాలు చేసికొను విషయములోను, యుద్ధము ప్రకటించు విషయములోను, సైన్యనావికా దళములకు సంబంధించిన విషయములలోను, అధికారము మన ఆంగ్లేయుల చేతులలోనే యుంచుకొనవలెను" ఈ యధికారము ఆంగ్లేయుల కక్కరలేదని నే జెప్పను. యీ విషయములన్నియు బ్రిటిష్‌సామ్రాజ్య మంతటికిని జెందు రాజకీయ వ్యవహారములు అయియున్నవి ఈవిషయములు సామ్రాజ్యాంతర్భాగములకన్నిటికిని వర్తించు సామాన్యవిషయములు. మా భారతవర్షమున కొక్క దానికే గాక సామ్రాజ్యాంతర్భాగములైన అన్నిదేశములకును వర్తించును. స్వరాజ్యపు కేర్పాటును గావించు తరుణమున మనముకూడ యీ షరతులకు ఒప్పుకొందము. భారతవర్షమునకు యితరజాతులతో నెట్టి సంబంధముండవలెనో అక్కరలేదో, యితరజాతులతో పని కలిగినప్పుడు దాని నెట్లు నిర్వహింపవలెనో, మొదలగు నీవివిధ విషయములను పరిష్కరించు అధికారము ఇంగ్లాండు చేతులలోనే యుండవలయును. (దీనికి మనము ఒప్పుకొనుచునే యున్నాము) ఇప్పుడు స్వరాజ్యము కావలెనని కోరువా రందరును యీయధికారముతో జోక్యము కలిగించుకొనరు. ఈ రోజున స్వదేశ సంస్థానములలో పరిపాలన నెట్టి పద్ధతులమీద నడపించుచున్నారో అట్టి పద్ధతుల నవలంబించియే యిచ్చటి మాయధికారవర్గమువారు కూడ మమ్ములను పరిపాలింపవలసినదని మేము కోరుచున్నాము. రెవిన్యూవల్లను, తదితరపన్నులవల్లను, వసూలైన ధనమునంతయు యేయేవిధముగ ఖర్చుపెట్టవలెనో మేమే నిర్ణయించుకొందుము. విద్యాభి

వృద్ధి కెంత కర్చు పెట్టవలెనో మేమే నిర్ణయించుకొందుము. అబ్కారీ సారా దుకాణముల మీద వచ్చు రెవిన్యూ తగ్గిపోయినట్లయిన ఆ తరుగు పూర్తియగుటకుగాను ఏ క్రొత్త పన్నులు వేయవలసియుండునో ఆలోచించి, ఆ ప్రకారము మేమే పని కొనసాగించుకొందుము, వర్తకవ్యాపారమంతయు మేమే కొనసాగించుకొందుము. యితర వ్యాపారములన్నియు మేమే నెరవేర్చుకొనెదము. మీరు (అనగా గవర్నమెంటువారు) వానిజోలికి రావద్దు. భారతీయులు యేయితర జాతులతోను కలియరు. ఎందువలన? ఫ్రాంసు దేశముతోగాని జర్మనీదేశముతోగాని కలియుదురేమో చూడుడి! (అట్లెన్నడును కలియరు) ఇదివరకేమైన నట్టిసందేహమున్నట్టయిన ప్రస్తుత స్థితిగతులను బట్టి విచారించినయెడల, భారతవర్షము యితరజాతులతో సంబంధము కలుగజేసుకొన దలచినయెడల అట్టి దేశము ఇంగ్లాండు దప్ప మరియే యితరజాతియు కాదని బోధపడక మానదు. ఇంగ్లాండుపోయి జర్మనీవచ్చినట్టయిన మన కేమియు లాభములేదు అట్టిస్థితి మన కక్కరలేదు. . నిజ మాలోచించినయెడల యింగ్లాండు దేశము నూరుసంవత్సరములనుండి యిక్కడనే యున్నది, జర్మనీదేశము వచ్చిన యెడల నంతయును క్రొత్తనే గన్పించును, తననిత్తృష్ణచే దేశముమీదికి వచ్చిపడును. అది మనకు సరిపడదు ఇది పాత ఉన్నదేమో యున్నది, ఉన్నంతవరకు బాగుగనే యున్నది. మాకు క్రొత్తరా జక్కరలేదు. ఇదివరకు మా చేతిలో నుండిపోయిన హక్కులను తిరిగి మాకు ప్రసాదింపుడు. వానిని గోల్పోవుటవలన మా కనాథల గతిపట్టుచున్నది. ఈ మాటలను చెప్పునది నే నొక్కడనే కాదు. లారెన్సుదొర కూడ చెప్పియున్నాడు. "యుద్ధానంతరము భారతవర్షమును వృద్ధినొందింపదలచిన యెడల, ప్రజల మేలుకొరకై దొరతనమువారు క్రొత్తపరిపాలనాపద్ధతుల నవలంబింప నెంచినయెడల, భారతవర్షమునంతను కొన్నికొన్ని భాగములుగ విభజింపవలసినది." అని లారెన్సు దొర చెప్పియున్నాడు కాని దేశభాషల మాట ఆయనబుద్ధికి తోచలేదు. (దేశ భాషలను బట్టి భాష కొకరాష్ట్ర మేర్పరచుటయే భాషాప్రయుక్త రాష్ట్రవిభాగ మనబడును.) ఆయన చెప్పినదానికి మనము యీ దేశభాషల మాటకూడ కలిపిచెప్పెదము. మహారాష్ట్రులకు ఆంధ్రులకు, కన్నడులకు ప్రత్యేకప్రత్యేక రాష్ట్రము లేర్పరచవలసినది. ఈ స్వరాజ్య సమస్యలోనే, ఈ దేశభాషల సమస్య కూడ నిమిడియున్నది. స్వరాజ్యమునకు సంబంధించని విషయమే లేదు. (ప్రతివిషయమును యీ స్వరాజ్య మనుమాటలో నిమిడియున్నది.) ప్రజాస్వాతంత్ర్య ముండి యుండినయెడల, యిదివరకే ప్రత్యేక గుజరాతీవిశ్వవిద్యాలయము, ప్రత్యేకమహా రాష్ట్రవిద్యాలయము; ప్రత్యేక వ్యవసాయ విశ్వవిద్యాలయములు యేర్పడి యుండెడివి, కాని అట్లు గావింపగల అధికారము మన చేతులలో లేదు. దేశభాషల మూలమున విద్యావ్యాపనము గావింపవలయు ననునది అంత గొప్పకఠినమైన సమస్యయా? దీని విషయమై యింత అభిప్రాయ భేద మేల జనింపవలెను? (కాని యిక్కడ మన మాట వినువా రెవరు?) ఇంగ్లీషువా రందరు తమ పిల్లలకు ఫ్రెంచి భాషలో విద్యగరపుచున్నారా? జర్మనీ వారందరు ఇంగ్లీషు భాషలో విద్య నేర్పుచున్నారా? తురుష్కులు ఫ్రెంచిభాషలో విద్యగరపుచున్నారా?

ఇన్ని నిదర్శనములు మన కండ్లయెదుట బెట్టుకొని, దీనివిషయమై యింతరాద్ధాంత మేల? దీని విషయమై వార్తాపత్రికలలో దీర్ఘవ్యాసములు వ్రాయుచు చర్చింప నేల? ప్రజలు చెప్పినట్లుగ, ప్రజల యిష్టప్రకారము, యిచ్చట వ్యవహారములు జరుగక పోవుటకు కారణమేమి? మన కధికారము లేదు గనుక. మన పిల్లలకు యే యే విద్య నేర్పింపవలయునో మనమే స్వయముగ నిర్ణయించుకొనగల యధికారము మనకు లేదు. మనలో చాలమంది తమ పిల్లలను పాఠశాలలకు పంపుచున్నారే గాని వారిగతి యేమి కానున్నదో మన మాలోచించుటలేదు. ఇంతయేల, ఒక్కటే మాట; ప్రస్తుతము స్వరాజ్యమునకు సంబంధింపని విషయము లేనేలేదు. మనలో నుండు ప్రతిలోపమును మన కధికారము లేనందువలననే కలుగుచున్నది. శ్రీయుత న్యాయమూర్తి రెనడే వంటి దేశభక్తు లనేకులు ఫర్గూసనుకాలేజీశాలలవంటి (జాతీయ విద్యా) ప్రతిష్ఠాపనలకై యింతవర కనేకప్రయత్నముల గావించియుండిరి. కాని యివన్నియు నెరవేరుట కెవరి యధికారము కావలెను? గవర్నమెంటువారి యధికారము కావలెను. విద్యావ్యాపనకై వారి స్వదేశమగు నింగ్లాండులో నెట్టిపద్ధతు లున్నవో వారికి తెలియును. ఆ పద్ధతులే యిచ్చట కూడ నేలయుండరాదు? ఇంగ్లీషువిద్య నేర్చుటకుగాను ముందు 7, 8 సంవత్సరములు యింగ్లీషు భాష నేర్పవలసియున్నది! మన జీవితములో 8 సంవత్సరములు స్వల్పకాలము కాజాలదు. ఇట్టియవస్థ యేయితర దేశములోను లేదు నాగరికతాభివృద్ధిగాంచిన యే దేశములోను లేదు. ఈ విషయము లన్నియు కండ్లారగాంచుచుండియు, మన దృష్టి స్వరాజ్యము వైపునకు ప్రసరింపజాలని యెడల వా.. నిజముగ మన నేత్రములలో నేదియో గొప్పదోష మున్నదను మాట నిక్కము. మన మేమి చెప్పదలచుకొనినను, దొరతనమువారిని గూర్చి యెట్టిప్రార్థనలు సలిపినను, ఆ ప్రార్థన లన్నియు స్వరాజ్య ప్రసాదముకొరకే, అధికారప్రసాదము కొరకే, అయి యుండవలెను. మరి యే విషయమై యుండకూడదు. ఆ పరిపాలనలో నతిముఖ్యమైన హక్కులే మనకు కావలెను. మన మేప్రొద్దునబోయినను, తుదకు మన కన్నియు ఆటంకములే వచ్చుచున్నవని యిదివరకే చెప్పియుంటిని. విద్యావ్యాపనము సాధారణమైన విషయము. ప్రతిగ్రామములోను పాఠశాల లుండితీరవలెను. కాని మనకు ధన మెక్కడినుండి వచ్చును? మనము గవర్నమెంటువారికి పన్నులు చెల్లించుచున్నాము. మనము వారికి ఊరక దాన మిచ్చుచున్నామా? విద్యాభివృద్ధికై యింగ్లండులో నెట్టి పద్ధతు లున్నవో మనకును అట్టిపద్ధతులే కావలెను. గవర్నమెంటు వారి ఖజానాలో ధన మున్నది. ట్రెజరీలో డబ్బున్నది. దాని నేవియో యితర పనుల కుపయోగించు చున్నారట! కాని మనకత్యంతావశ్యకములగు పనులకుగాను అది వినియోగపడుటలేదు............................................భరతఖండ మెంతయో పెద్దదేశము. కావలసిన యెడల భాషలనుబట్టి దేశమును రాష్ట్రములుగ విభజింపుడు. మహారాష్ట్రులను గుజరాతీయులను విడదీయుడు. కాని యీ రాష్ట్రములలో హిందువులకును, మహమ్మదీయులకును, యే విధముగ విద్య నేర్పెదరు? దీని విషయమై కూడ కొంత చెప్పెదను. కనడాదేశములో ఫ్రెంచివారును, మహా

మ్మదీయులును కలిసియున్నారు. ఈ యింగ్లీషు గవర్నమెంటువారే అక్కడ కనడాదేశములో నీ చిక్కును సవరించియుండగ, అదేవిధముగ మన దేశములోకూడ నిచ్చట హిందూ మహమ్మదీయ సమస్యను పరిష్కరింపలేరా? ఇవన్నియు, మన మడుగు వానిని యే విధముగ నైన మన కివ్వకుండ యెగరగొట్టుటకు గాను చెప్పు మాటలు గాని వేరుకాదు. ఇది మీరు గట్టిగ నమ్మవలెను. భారతవర్షము నీ విధముగ విభజించినయెడల బంగాళారాష్ట్రము వేరగును; (అటులనే ప్రతిరాష్ట్రమును వేరగును) ఈ రాష్ట్రములకు మొట్టమొదటనే మన భారతీయు నొకనిని అధికారిగ నియమించుటకు బదులుగ, కొద్ది సంవత్సరములపాటు మొదట యూరపియను గవర్నరునే నియమింప వచ్చును. పూర్వము ఆస్ట్రేలియాలో ప్రజలు తమ రాష్ట్రాధ్యక్షుని యెన్నుకొను పర్యంతము యేమి జరుగుచుండెడిది? అప్పటివరకును ఇంగ్లాండునుండి ఒకగవర్నరును పంపుచుండెడివారు. ఆత డచ్చట శాసనసభలో ప్రజలు చెప్పినట్లు విని పని చేయుచుండెడివాడు. ఇప్పుడు మనదేశములో జరుగుచున్న వ్యవహార మేమి? పైదాని కంతయు వ్యతిరేకమే! మనకేదైన కావలసియున్న యెడల మన శాసనసభ్యులు తీర్మానము నుపపాదింపవలెను. దానికై ముందెంతయో ప్రయత్నము చేయవలెను. దానికి తగినలెక్కలు, దస్తావేజు కాగితములు, మొదలగునవన్నియు ప్రోగుచేయవలెను. ఇదంతయు నెరవేర్చు సభ్యులకు (మెంబర్లకు) ఒక పైసాయైనను జీతములేదు. శాసనసభలో నున్న యితర సభ్యుల కందరికిని గొప్ప జీతము లిచ్చుచున్నారు. కాని మన ప్రజల పక్షమున కష్టపడి పనిచేయు సభ్యులకు జీతము లేదు. ఆత డూరక పని చేయవలెను. ఇంత కష్టపడినను తుదకు ఆ తీర్మానమును త్రోసివేయుదురు. ఒకవేళ అది శాసనసభలో నామోదింపబడినను దానిని అమలులోనికి తీసికొని రావలసినదని గవర్నమెంటువారిని మనము బలవంతపెట్ట జాలము. ఇదంతయు చాలదర ఆటకోలుతనముగ నున్నది. ఈవిషయమును బాగుగ గుర్తెరుంగనివారు దేశభక్తియన నేమియో కూడ నెరుగరన్నమాట! వారు దేశభక్తులు కారని నేను నిర్భయముగ జెప్పగలను. నిజమైన యధికారమీయకుండ మాకిట్టి వట్టి శాసనసభలను గల్పించుటచూడ అన్నపు మెతుకులు విరజల్లి కుక్కలను ఉసుకొలిపి వానికి పోట్లాటబెట్టినట్లుగ నున్నది. ముందు మాకీ శాసనసభలో నధికారమిచ్చిననే గాని, లేనియెడల, నిట్టి యధికారశూన్యమైన యీ సభలవలన నే విధమైన ప్రయోజనము నుండజాలదు. (అధికారములేని వట్టిసభ లెందుకు?) ముందుశాసనసభలోనధికారమిచ్చినట్లయిన, యితరఅధికారములను త్వరలో సంపాదింపవచ్చును. ఇతర అధికారములను సంపాదించుటకు వీ లేర్పడుటకు గాను ముందు మాకీ శాసనసభలలో నధికారమిచ్చి తీరవలెను. అట్లయిననే యీ సభలవలన ప్రయోజనముండగలదు. లేని యెడల నావంతయు ప్రయోజనము లేదు. బాగుగ చదువుకొని గొప్ప గొప్ప పరీక్షలనిచ్చిన యేముగ్గురు నలుగురు పెద్దమనుష్యులో ఆ సభలో 3, 4 ఘడియల సేపు వాగ్వాదము గావించుట తప్ప వేరేమియు లాభములేదు. కనుక స్వరాజ్య మన నేమియో, మనమడుగు దానివలనఫలమేమియో మీరు బాగుగనాలోచింపుడు. స్వరాజ్యమడుగుచున్నామనగ నేమి? మనమడుగునదిఇది:-

భారతవర్షములోని రాష్ట్రముల కన్నిటికిని గవర్నరులు ప్రజలచేత నేయెన్నుకొనబడవలెను. ప్రజ లాతని యెన్నుకొనువరకును ఇంగ్లాండునుండి పంపబడిన ఇంగ్లీషుదొరలు ఆ పదవులలో నుండవచ్చును. మనభారతవర్షమున కంతటికిని సంబంధించు విషయముల నన్నిటిని పరిష్కరించుటకై ప్రత్యేక మొక సభ నేర్పరచవలెను. ఐరోపా అమెరికా సంయుక్తరాష్ట్రములలో వివిధములైన చిన్న చిన్న రాష్ట్రములున్నవి; వాని నన్నిటిని ఒకటిగాజేర్చి సంఘీభావము కలిగించు నిమిత్తమై యొక మహాసభ (లేక కాంగ్రెసు) గలదు. అదేవిధముగ మన పౌరాతనమువారు యిచ్చట కూడ నేర్పాటు గావింపవచ్చును. సామ్రాజ్యసభకు సంబంధించిన హక్కులను వారు తమ చేతులలో నుంచుకొనవచ్చును. ప్రస్తుతము మన దేశములో 7,8 తరగతుల రాష్ట్రములున్నవి. కావలసిన యెడల వానినే 20 రాష్ట్రములుగ భాగింపుడు. ప్రతిరాష్ట్రములోను వారివార యభివృద్ధికి అనుకూలముగ నుండునట్టియు వారికి సమ్మతముగ నున్నట్టియు పద్ధతుల నేర్పరచి వానిని పాలించు అధికారమంతయు వారికే వదలి వేయుడు. స్వరాజ్యము కావలెననగా దాని అర్థమిదియే. స్వరాజ్యమనగా చక్రవర్తిని తొలగింపవలసినదని కాదు. ఈపై పద్ధతిని మన మవలంబించు నెడల, కొన్ని కొన్ని పదవులకు ఇంగ్లీషు ఉద్యోగస్థులను తీసికొనిరావలసియుండును. దీనిని మనము ఒప్పుకొనవలసినదే. కాని అప్పుడా ఉద్యోగస్థులందరును మనవారేయగుదురు. ప్రజలకు జెందిన వారేయగుదురు, ప్రజలకందరికిని సేవకులయ్యెదరు. మనపై అధికారము చలాయించు యజమానులు కాజాలరు. మన భారతవర్షమునందు కావలసిన సంస్కారముల (మార్పుల) నన్నిటిని గావించుటకు మన ప్రజల తెలివితేటలు మాత్రమే చాలవు. దీనికై ఇంగ్లాండు, అమెరికాదేశములనుండి మనుష్యులను పిలిపించుకొనవలసియుండును. అయినను, అట్టివారు మనకులోంగి మనకు జవాబు చెప్పవలసినవారుగనే యుందురు. తమ యిష్టము వచ్చినట్లు చేయుటకు వీలుండదు. వారుచేయు ప్రతికార్యము విషయమై వారు ప్రజలకు సమాధానము చెప్పవలెను. కనుక నొకవిధముగ నాలోచించిన మన యీ యాందోళన యంతయు యూరపియనులకు ప్రతికూలముగ నున్నదని చెప్పుటకు వీలులేదు. ఉద్యోగస్థులెవరికి జవాబు చెప్పవలెను? వారు ప్రజలకు జవాబు చెప్పవలెను. వారు మనకు ఉత్తరవాదులు కానంతకాలమును, వారు మన యధికారము క్రిందికి రానంతకాలమును మనస్థితి యీ విధముగనే యుండును. అంతవరకును ఏమే విధముగ జేసినను మన ప్రయత్నములన్నియు నిష్ఫలములగును. అంతవరకును మన మే విషయములో జోక్యము కలుగజేసికొని, కదలిక బుట్టించినను, అదంతయు నిష్ప్రయోజనమగును. మనము కోరిన పని కానేరదు. ఏజాతియైనను తమమేలును తాము చూచుకొనగల స్వాతంత్ర్యము లేనంతకాలము, తాము కోరు కోర్కెలను నెరవేర్చ ప్రయత్నములు సల్పగల యధికారము తమకు లేనంతకాలము, ఆజాతి అభివృద్ధి నొందజాలదు. ఎవరో యితరులు వేళకు నీకింత పట్టెడన్నము పెట్టుచుండిన నీపొట్ట

నిందజాలదుగద ! నాయుద్దేశమిది :—నిరంకుశాధికారము వలన ప్రజలకు మేలుకలుగదని అందరికిని తెలిసినవిషయమే. చాలమందికి దృఢముగ యీవిషయము మనస్సులో నాటినది. కాబట్టి మీరు తప్పక ప్రయత్నము చేయవలసినదని చెప్పుటయే నాముఖ్యోద్దేశము. నాఉద్దేశమును బాగుగ నేను పైకి చెప్పలేకపోయినట్టయిన, అదినాతప్పు కాని, ఆవిషయములోనిలోపముకాదు. ఆవిషయములో దోషమేమియును లేదు. అది నిర్దుష్టమైనది. ఆవిషయముల నన్నిటిని, వాని వివిధ తత్వములనన్నిటిని ఒక్క ఉపన్యాసములో మీకు చెప్పుటకు వీలులేదు. ఇదివరకు నేను మాట్లాడిన రాష్ట్ర విభాగములను గూర్చిన సమస్యలు పెక్కులు గలవు. అచ్చట నేయే యేర్పాటులు చేయవలయును ? అచ్చట ప్రజల కే యే హక్కులుండవలెను ? 1858 సంవత్సరములో అమలులోనికి వచ్చిన "ఇండియా ఆక్టు"లో నేయే సవరణలు చేయవలెను ? వీనిని గూర్చి ఒకటి రెండుగాక పదియుపన్యాసము లిచ్చినను చాలదు. మనకు కావలసిన పద్ధతి యంతయు నొక్కటే. దానినిగూర్చి మాత్రమే యిప్పు డీయుపన్యాసములో చెప్పెదను. మీయొక్క బుద్ధిసూక్ష్మతవలన దీనిలోని బాగోగులను విచారించి చూచినట్లయిన, మనకిది తప్పక యుండితీరవలయునని మీరు గ్రహింపగలరు. మంచి చెడ్డలను విచారింపగలశక్తి, బుద్ధిసూక్ష్మత మీలో నున్నట్టయిన, మనకు స్వరాజ్యము తప్పక కావలయునని మీకు తోపకమానదు. "స్వరాజ్యము మనకు లభించునా ? మనకిది లభించునా" యని యడుగనేల ! లభించుట, లభింపకపోవుట యనునది వారిచేతులలో నున్నది. మీరడుగు యీప్రశ్నకర్థమేలేదు. దీనికై మీరింత ఘోరయత్నము గావింపుచున్నారు. అది మనకు లభింపకపోయిన మాత్రమేమి ? దానికై చింతిల్లవలసిన పనిలేదు. ప్రయత్నము చేయుటయనునది మనచేతిలో నున్నది. మనకది లభించునా లభింపదా యనువిషయమాలోచించవలసిన అవుసరము లేదు. పురుష ప్రయత్నము గావింపుడు. మీరు చేయు యత్నముల మూలమున కొంచెమో గొప్పయో మేలు చేకూరకమానదు. మీమనోనిశ్చలతయందే దృఢనమ్మకముంపుడు. ప్రపంచములో నిశ్లేపాటుబడి స్వాతంత్ర్యమును సంపాదించిన వారుండిరా లేరా ? ఇతర జాతులలో మాత్రము స్వాతంత్ర్యాధిష్టానదేవతలు పైనుండి యూడిపడినారాయేమి ? మీలో మనోధైర్యము లేనియెడల మీకది లభింపజాలదని మీకు స్పష్టముగ చెప్పుచున్నాను. మీలో అసలు మొదట ధైర్యమను నదొకటియుండిన యెడల నేడుకాకపోయిన రేపైనను మీకు స్వరాజ్యము లభించితీరును. 10, 20 సంవత్సరములలోనైన లభించితీరును. కాని దానికై పాటుపడ వలసినది మీరే. మన హిందూమత సారమంతయు "నిష్కామకర్మ" యను దానిలో నిమిడి యున్నది. "ఫలమపేక్షింపక, నీవు నీస్వధర్మము నాచరింపుము"

* శ్లో॥ యుక్తంకర్మఫలంత్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్"

♦ శ్లో॥ బ్రహ్మణ్యాధాయకర్మాణి సఙ్గంత్యక్త్వాకరోతియః । లిప్యతేనసపాపేన పద్మపత్ర మివాంభసా॥ భగవద్గీతలలో నీవాక్యముల నేలచెప్పిరి. పురాణ శ్రవణమను పేరు పెట్టుకొని 2, 3 శేర్ల బియ్యమును సంపాదించుటకా? ప్రపంచములో సర్వమతములవారును యీ వాక్యములనే చెప్పుచున్నారు. పాశ్చాత్య దేశచరిత్రలన్నియు నీమూలసూత్రమునే వ్యక్తీకరింపుచున్నవి. ఇవన్నియు కండ్లారగాంచు చుండియు నింక "మనగతి యేమియగునో? మన మెట్లు నిర్వహించుకొనగలము? మన కళేబరములు వట్టి మట్టిముద్దలే!" యని మనము చింతింపనేల? మృణ్మయ విగ్రహమును చేసి దానినే మనము విష్ణుమూర్తి యనుటలేదా? దానినే శివుడనుటలేదా? ఆ మృత్తికా స్వరూపమునందు అతీతమైన మహాత్మ్య మున్నదని మనమనుచున్నాము. జనులందరును ఆమట్టిబొమ్మను పూజింపు చున్నారు. అహో! చలనములేని మట్టిముద్దయే యది! పైకెగురవేసిన "దబుక్కున" క్రింద పడిపోవునే! అయినను ఆమట్టి వుండకు ఏదియో రూపకల్పనజేసి, దానికి దగిన కర్మకాండంతయు జేసి దానియందు మహాత్మ్యము నారోపించు చున్నాము. కాని మనదేహములన్ననో ఆమట్టి ముద్దవలెగాక ప్రాణచలనాదులతో గూడుకొని సజీవములై యున్నవి. ఈ మట్టిముద్దకేదియో రూపమును మనము కల్పింపని యెడల అది మనదోషమే. అట్టి రూపకల్పనను మనము గావింపవచ్చును; అదియొక దుస్సాధ్యమైన పనికాదు. ముందు తొందరపడవద్దు. అతితొందర వలన లాభములేదు. మనము శ్రద్ధవహించి పనిచేయ బూనినయెడల, ఆమట్టి ముద్దలో నేదియో యొక రూపమును మనము చిత్రింపవచ్చునని శాస్త్రములు పల్కుచున్నవి. ఈ విషయము నిర్ధారణ చేయబడియే యున్నది. బహుకాలానుభవమువలన నిర్ధారణ గాబడినది. లోకచారిత్రవలన నిర్ధారణ గావింపబడినది. దీనికి మహామహుల జీవితములే సాక్ష్యములు. ఇంతసాక్ష్యము మనకండ్లయెదుట గాన్పింపుచున్నను, మనము నమ్మకపోయినయెడల, మనమనస్సునకు తృప్తిలేక పోయినయెడల, దేశమిక అభివృద్ధిగాంచునను తలంపును పూర్తిగ మీ మానస వీధులనుండి పారద్రోలుడు. దీనికై మీతలలను కంటగింప జేసికొనకుడు. మనకు కావలసిన యీకార్యము లన్నియు నెరవేరగలవు నెరవేరి తీరవలెను. మనకిట్టి దృఢనమ్మక ముండవలెను నమ్మకమే కార్యసిద్ధికి మూలము. నమ్మకములేనియెడల — ఏమగును? వారు మనకేమియు నీయరు. ఊరక యిచ్చెదమని మాత్రము ఆశపెట్టెదరు. అట్టిస్థితి మనకక్కరలేదు. కాని వారు యిచ్చినది తీసికొనవద్దని నే జెప్పను. ఇచ్చినది పుచ్చుకొనుము. ఇంక యెక్కువ కావలెనని కోరుము. ఎడతెగక అడుగుట మాత్రము వదలిపెట్టవద్దు. మాకు వెయ్యిరూపాయిలు కావలెను. మాకీ వేయిరూపాయలన్నియు పూర్తిగవచ్చినప్పుడే మేము తృప్తినొందెదము. కాని

---

* కర్మసన్యాసయోగము; 12 వ శ్లో॥ ♦ కర్మసన్యాసయోగము, 10-వ శ్లో॥ అసలు ఉపన్యాసములో లేవు.

మీరు మాకు ప్రస్తుతము దానిలో పదియవవంతు, వందరూపాయ లిచ్చినను ప్రస్తుతము తృప్తినొందెదము. ఈ కొంచము కూడ మన కివ్వనియెడల మనము వారి నేమి చేయ గలము? గనుక మాకు ప్రస్తుతము వందరూపాయ లిచ్చినను చాలును. మీకు వెయ్యి నమస్కారములు; అంతటితో సంతోషింపుమనికాదు దానికర్థము. చేసిన మేలునకై కృతజ్ఞత కలిగియుండుట మానవ స్వభావము. నా చేతిలోనుండి క్రిందపడిపోయిన కాగితము నెవరైన పైకితీసి నాకిచ్చినప్పుడు "అయ్యా! చిత్తముచిత్తము" అని నేననుట స్వభావసిద్ధము. ఇదిమానవాంతఃకరణ లక్షణము. ఈలక్షణమునువిసర్జింప వలసినదని నేచెప్పను. మానవాంతఃకరణకు సంబంధించినదే యైన స్వాతంత్ర్యేచ్ఛనుసాధించుటయే మనుష్యున కుండవలసిన ముఖ్యలక్షణము. ఇదియే నరుని మానసికత్వము. తక్కిన చిత్తవికారము లన్నియు నీ ఘనాదర్శమునకు, నీపరమ లక్ష్యమునకు నీ అమోఘయత్నమునకు, లోబడి యుండవలసినదే. అట్లయిన మనకు స్వరాజ్యము లభించును. స్వరాజ్యమనగా ఆకాశమునుండి ఊడిపడు పండువంటిదికాదు. ఒకవేళ ఆ పండు అట్లుపడినను దానిని మన నోటికందిచ్చుట కింకొకడు కావలసివచ్చును. ఈ స్వరాజ్యస్థితి అటువంటిది. అందువలననే, అట్టి ప్రయత్నములను గావించుటకే స్వరాజ్యసమితి నొకదానిని స్థాపించినాము. నా మిత్రులు తాత్యాసాహెబుగారు నాకిప్పుడిచ్చిన కాగితములో దానిని గూర్చియే వ్రాయబడియున్నది. భారతవర్షమందీ పనికై మన మిప్పుడే పూనుకొనినాము శ్రీమతి ఆనిబిసెంటమ్మగారు చెన్నపురిలో స్వరాజ్యసమితి నొకదానిని యేర్పరచి యున్నారు. ఇచ్చట కూడ మన మొకసమితిని స్థాపించినాము, ఈ విధముగనే బంగాళా దేశములోను, యితర రాష్ట్రములలోను సమితులు బయలుదేర గలవు. జాతీయ మహాసభవారు కూడ నొక సమితిని యేర్పరచిన యెడల తక్కిన యీసమితు లన్నియు దానిలో నైక్యమయి పోవచ్చును. ఈ సమితులన్నియు చేయుపని ఒక్కటియే. తదేక దీక్షతో పనిచేయవలసినది మనమే. ఇది దేశమంతటికిని మేలొనగూర్చు మహత్కార్యము. మనకు స్వరాజ్యము కావలసియున్నది. మనకెట్టి స్వరాజ్యము కావలయునో నేనిదివరకే చెప్పియుంటిని, ప్రస్తుతస్థితి నెట్లు మార్చివేయవలెనో కూడ చెప్పియుంటిని ఇంగ్లాండులో, పార్లమెంటులో, ప్రభువులసభవారు దీనిని గూర్చి చాలదూర మాలోచింపుచున్నారు. వారిప్పుడు స్వప్నావస్థల జెందుచున్నారు. సివిల్ ఉద్యోగస్థులందరు మనకు చెందవలసిన హక్కుల నన్నిటిని మన చేతిలో పెట్టితీరవలసి వచ్చునని హార్డింజి ప్రభువు చెప్పియున్నాడు. మన ప్రతిపక్షులందరును దుస్స్వప్నావస్థల నొందుచున్నారు. కాని మనమే "మేము దీనికితగము, మేముదీనిని గ్రహింపము" అని చెప్పుచున్నాము. ఈ పెంకెతనము, యీ మొరటుతనము, యీమూర్ఖము, మన కెక్కడనుండి వచ్చినది? దీనికి కారణమేమి? మనవారందరు కలగను చున్నారు. ఏదో విధమైన యేర్పాటులు జరుగనే జరుగును గదాయని యాలోచించుచున్నారు. మనము మొట్టమొదట చేయవలసిన పని యేమి? ఈస్వరాజ్యము విషయమై భారతవర్షమునం దెల్లడల నాందోళనము గావింపవలెను. మనకు స్వరాజ్యము దక్క వేరే మోక్షము లేదని, వేరే కైవల్యములేదని, ఇంతకంటె వేరే గమ్యస్థానము లేదని, ప్రతి భారతీయుని

మనస్సున కెక్కునట్లు బోధించి ఒప్పింపవలెను. దీనికై మనము పాటుపడవలెను. మనకు కావలసినదేదియో, దానికి ముందుగ యే యే యేర్పాటులు చేయవలెనో, మనము నిర్ధారణచేసి కొనవలెను. మన మడుగుదానిని స్పష్టముగ, మనము నిర్ణయించు కొనవలెను, ఇంగ్లండుదేశమునకుపోయి అచ్చటి ప్రజలనుఒప్పింపవలెను. దీని విషయమై వారాలోచించు నప్పుడు మన మచ్చటికిపోయి మన కోర్కెలను పార్లమెంటు వారి యెదట సక్రమముగ సుస్పష్టముగ విప్పి చెప్పవలెను. 'సక్రమముగ' అన నేమి? "ఇండియాఆక్టు" లో కొన్ని సవరణలను గావింపుమని ప్రత్యేక మొకబిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టవలెను. మన కోరిక ఈవిధముగ నుండవలెను. ఈ యాక్టును మాకనుకూలముగ మార్పుడు. ఈస్టుయిండియా కంపెనీపోయి, అధికారమంతయు విక్టోరియా రాణిగారి చేతిలోనికి వచ్చినప్పుడు యీ ఆక్టులో కొద్ది సవరణలను జేసిరి. దాని నిప్పుడింకొక విధముగ మార్చవలసినదని మా కోరిక. ఇది మా కొక్కరికేగాక సామ్రాజ్యమంతటికిని మేలొనగూర్చును; మన ప్రయత్నములన్నిటిలో పార్లమెంటు వారిని యీ కోరికలు గోరుటకూడ చాలముఖ్యమైన విషయమై యున్నది, ఇది అందరి సహాయము వలనను, సంఘీభావము వలనను నెరవేరవలసిన పని. ఈ విషయములో అభిప్రాయ భేదముండకూడదు. అతివాదులకును, మితవాదులకును అందరికిని గమ్యస్థాన మొక్కటియే. అందరు కోరు కోర్కెలన్నియు నొక్కటియే. అందరకును కావలసిన దొక్కటే. ఈ కార్యమంతయు నిట్టి సహన భావముతోడనే నెరవేరవలసియున్నది. అట్లందరు కూడి పనిచేయుటకు "స్వరాజ్య సమితి" యను సంఘమొకటి యేర్పాటు చేయబడినది. మొన్న దేశీయ మహాసభలో నిది చర్చకు వచ్చినది. కాని ఆ సభ సంవత్సరమున కొకపర్యాయమే సమావేశమగును అందువలన, యీ సంవత్సరము గడచిపోయినందు వలన, రాబోవు సంవత్సరము దీనిని పూర్ణముగ అంగీకరించుటకు వీలు కలుగును. అయినను సంవత్సరమంతయు నీ పనిని చేయుచునే యుండవలెను. ఈ విషయము దేశీయమహాసభవారు ఒప్పుకొనిన విషయమే. ఈ ఉద్దేశముతోడనే యీ సమితి నొకదానిని యేర్పరచినాము. దీనిని స్థాపించుట సులభమే; కాని సదాగమ్యస్థానమును మన దృష్టి పథమున నుంచుకొనవలెను. ఈ గమ్యస్థానమును చేరవలయునని కోరుటకు మనకు హక్కుగలదు. దీనికై ద్రవ్యము విషయములో మేము మిమ్ములను (అనగా ప్రజలను) అడుగునది ఒక్కటియే. ఒకొక్క రొకొక్క రూపాయి యీ సమితికియ్యవలసి యుండును; ప్రవేశ రుసుము రెండు రూపాయిలు; ఈ ప్రవేశరుసుము చెల్లింప లేకపోయినను తుదకు ఒక్కరూపాయి అయినను చెల్లింపవలెను. భారతవర్షములోనున్న ముప్పదికోట్ల జనులలో ఒక్క లక్షమంది యైనను యీ చందాను చెల్లింపని యెడల "మా భారతవర్షము మా భారతవర్షమ"ని చెవులు చిల్లులుబడునట్లు ఊరక కేకలు వేయుట మానుడు. మా చెవులు తడకలు కట్టునట్లు కేకలు వేయకుడు. ఈ కార్యము సఫలమగుట కొక్క సంవత్సరముకంటె నెక్కువ కాలము పట్టదు. సంవత్సరమునకు చందా ఒక్క రూపాయి. ఈ యాందోళనకు 10, 20, సంవత్సరము లక్కరలేదు. అట్టిసమయ మిప్పుడాసన్న

మైనది. మీరింత మాత్రము స్వార్థత్యాగము చూపి, మీచేతి మీదుగ ఒక్కరూపాయి చందా యివ్వజాలని యెడల, మీ రీ యుపన్యాసములను వినుటకు కూడ రాకుండ నుండిన బాగుండును. ఇచ్చట నుపన్యాస మిచ్చువారికి కంఠశోషతగ్గును. మాబోటి వారు బిగ్గరగ అరవవలసిన పనియుండదు. మీరెమైన చేయదలచు కొనినయెడల యింత కంటె వేరులేదు. తక్కిన యేర్పాటు లన్నియు యీ సమితి సభ్యులే చేయుదురు. ఇందుకై దేశములో వివిధప్రదేశము లందిట్టి యుపన్యాసము లిచ్చుచుండవలెను. ప్రజల నందరిని ఒకచోట చేర్చవలెను. వారికి యీ స్వరాజ్యమును గూర్చి బాగుగ బోధింపవలెను. సభ నాపుటకు పోలీసులు వచ్చినట్లయిన, అచ్చటనుండి పోయి మరింకొక చోట సభకూడవలెను. పోలీసులు వెళ్ళకపూర్వమే ముందుగ మనమే పోయి సభచేయవలెను. మన ప్రయత్నములను వదలక పట్టుదలతో పని కొనసాగింప వలెను. ఈ పనియంతయు తేలికగ, హాయిగ నెరవేరునని తలంపవద్దు. ఒక రూపాయి యిచ్చుట ఒకలెక్కయా? మనోనిశ్చయమే కావలసినది. ఎవరైన వచ్చి మనలను ప్రశ్నించిన యెడల "మేము కోరుకోర్కెలన్నియు న్యాయమైనవి, సక్రమమైనవి" అని తెలియజెప్పవలెను. మేమంతరమును స్వరాజ్యసమితిలో చేరి రూపాయి చందా నిచ్చియున్నాము. మాకది అత్యవుసరము, అని నిర్భయముగ చెప్పవలెను. మీకట్లు చెప్పుటకు ధైర్యము లేనియెడల, నేనింక చెప్పవలసినదేమియును లేదు మన దేశజను లందరును ఈ విషయమును మంచిదిగనే భావింపుచున్నారని నే విశ్వసింపుచున్నాను. ఇప్పటివారు కాకపోయినను భవిష్యత్సంతతివారైనను దీనిని మంచిదిగ భావింతురని నానమ్మకము. మీ కట్టి మనోనిశ్చయము లేకపోయినను యీ కార్యము జరిగియే తీర వలెను మీరు గాకపోయినను, మీ సంతతి వారైనను తత్ఫలప్రాప్తికై పాటుబడి తీరుదురు. మిమ్ములను "గాడిదెల"ని తిట్టుదురు. ఆ తిట్లు తినుటకు మీరు ఒప్పుకొని నట్లయిన సరే! నా అభ్యంతరమేమియును లేదు. స్వరాజ్యము మనకు వచ్చితీరునని నాకు దృఢనిశ్చయము కలదు. మీరు చేయవలసిన కార్యమేమో, అందులకుగాను మీరు చేయవలసిన సహాయమేమో మీరు బాగుగ గుర్తెరుగుడు. పోలీసువారు మనను బాధ పెట్టెదరేమో? నిజమే! బాధపెట్టవచ్చును. పోలీసు లెవరైనవచ్చి "సరే; మీరు స్వరాజ్యసమితిలో చేరినారా? మీరుదానికి చందాలిచ్చి సభికులై నారా" అని అడిగినట్లయిన మీరందరు నిర్భయముగ, "అవును మేము సభికులమై నాము. నిస్సందేహముగ మేము చందాదారులమైనాము. అందుకు సందేహమేమి" యని బదులు చెప్పవలెను. న్యాయక్రమమిదియే. ఇంతకంటె వేరు హాని యేమియు జరుగదు. (భయపడవద్దు) మీ మీదకేసు వచ్చిన యెడల మీవద్ద ఫీజు పుచ్చుకొన కుండ ఉచితముగ యీ సమితిలో ప్లీడర్లందరును మీ పక్షమున వాదింపగలరు. ఈ కార్యమునకై మీ రొక రూపాయి యిచ్చినంత మాత్రముచేత నది రాజ ద్రోహము కాజాలదు. ఈ రూపాయి యిచ్చుటకంటె మీరేమియు నిక కష్టపడ వలసిన పనిలేదు. తక్కిన పనినంతను యీ సమితివారే చేయుదురు. ఇట్టి సమ యములో మహారాష్ట్ర ప్రజలూరక కూర్చుండుట చూడ ఆశ్చర్యముగ నున్నది.

ఈ పనిచేయుటకై అందరును కావలసినదే. మహమ్మదీయులైనను, హిందువులైనను, మార్వాడీలైనను అందరును కావలసినదే. వీరిలో నక్కరలేనివారెవరును లేరు. దీనిలో జాతిమత భేదము లేదు. ఈ కార్యము అఖిలభారత వర్షము కొరకై చేయబడుచున్నది. మీ వర్తకు లందరిలో నొక మామూలు వున్నది గద. గోరక్షణార్థము మీరందరు మీలాభములో రూపాయికి ఒక అణా వంతున వేరుగాతీసి ఒక మూలధనముగ నుంచెదరుగద. నేనిప్పుడు చెప్పునదేమనగ:— ఈవర్తకుల లందరు మాకుకూడ యీ స్వరాజ్య సంపాదనార్థమై అణాకు ఒక దమ్మిడీయైనను యివ్వకూడదా? భరతఖండంబు చక్కని పాడియావు. ఇది పెద్దయావు, చిన్నదికాదు. ఈ గోవు నీమాత. నీజననమునకు కారణభూతమైనది, నీజీవనమంతయు నాగోవుపై నాధారపడియున్నది. ఆగోవు కృషివలననే మన మందరమును జీవింపు చున్నాము. గోక్షీరములను త్రాగి జీవించుచున్నాము. కాని మనకిట్టిగోవు ఒకటి యున్నదను మాటయే పూర్తిగ మరచినాము లెక్కచూచుకొను నప్పుడు మాత్రము ఒకఅణా ఈయావునకై ఖర్చుపెట్టితిమని మాత్రము లెక్కవేసికొను చున్నాము. గోరక్షణార్థమీ యణాయెంత? అణాయెందుకు ఖర్చుపెట్టుచున్నాము? గోవునకు గడ్డికొనివేయుటకును, కటికవానిబారి బడకుండ కాపాడుటకును మనము వ్యయపరచు చున్నాము. మనకేమియు పనిపాటులులేక పాడగుచున్నాము కాని ఈభరతఖండము, యీదేశము, మన గోమాతయని యెవరికైనను ఉద్రేకము గలిగినదా? (ఇట్టియూహ మనకెవరికిని కలుగదు) ఇది గోరక్షణార్థము, స్వమతరక్షణార్థము, గావింపబడు మహత్కార్యము. ఇది భారతజాతియంతటి మేలుకొరకై, భారతవర్ష రాజకీయాభ్యుదయమునకై, గావింపబడు మహత్కార్యము. స్వమతముకొరకు, స్వవృద్ధికొరకు గావించు మహత్కార్యము. ఈ విషయములన్నిటిని మీరంద రాలోచించి మీచేతనైన లేవరకు, మీమీ శక్త్యానుసారము దీనికై సహాయము చేయవలసినదని నాకోరిక. ఒక్కరూపాయికంటె యెక్కువక్కరలేదని యిదివరకే చెప్పియుంటిని. శక్తియున్నవారు కనీసము ఒక్కసారియైనను యీ సమితి కొక్కరూపాయి యిచ్చి గోరక్ష గావించితిమను ఖ్యాతిని బడయుడని ప్రార్థింపుచున్నాను. కార్యము మహోత్కృష్టమైనది! భరతఖండమను యీ గోమాత పుత్రులమైన మనము యీగోరక్షణార్థము శ్రద్ధవహింపని యెడల మనము నిజముగ గోపుత్రులమే (అనగా ఎద్దుమొద్దులమే యగుదుము.) మీ కాపేరు పెట్టవలసివచ్చును. మీకీసంగతులన్నియు తిరిగి చెప్పుచున్నాను. ఈస్వరాజ్యసమితి యేర్పరుపబడినది. పని ప్రారంభమైనది. కష్టములొచ్చినను, నిష్ఠురములొచ్చినను వానినన్నిటిని సహించుటకు సిద్ధముగనున్నాము. కష్టములకోర్చి తీరవలెను. సోమరితనముగ కూర్చుండుటకు వీలులేదు. అప్పుడే మనను మనము పోషించుకొనుటకు శక్తివంతులగుదుము. కాబట్టి మీరంద రీమహత్కార్యమునకు నేచెప్పినట్లుగ దోడ్పడుడు. అట్లయిన యీశ్వరుడు మిమ్ములను విడనాడడు. ఇది నాదృఢనమ్మకము. భగవదనుగ్రహమువలన మనమీవరములను బడయగలము. కాని మనము దానికి తగిన పురుషప్రయత్నము గావింపవలెను "తనకుతాను సహా

యము చేసికొనువానికే దైవము తోడ్పడు''నని ఒక న్యాయముకలదు. ఈన్యాయ మును ఋగ్వేదములో చెప్పియున్నారు. దేవుడు ప్రత్యక్షమగును; ఎప్పుడు ప్రత్యక్ష మగును ? ఆయననుగూర్చి మొఱపెట్టుకొని ఘోరతపస్సు గావించినప్పుడే ప్రత్యక్ష మగును. నిష్కారణముగ దేవుడు ఊరక ప్రత్యక్షముగాడు. సోమరిపోతులకు ప్రత్య క్షముకాడు. కర్మానుష్ఠానపరులకే ప్రత్యక్షమగును. కాన కర్మాచరణమునకు గడం గుడు. పరిపాలనా విధానములలోనే యే యేర్పాటులు చేయవలెనో, యీదినమున ప్రజలకందరికిని బోధించుట కిది సమయముకాదు. ప్రతివివరమునుగూర్చి చర్చించుట యీమహాజన సమూహములో బహుకష్టము. నే నీదినమునను, నిన్నటి దినమునను చెప్పిన యీకొద్ది సామాన్యవిషయముల నన్నిటినికలిపి బాగుగ యోచించి స్వధర్మాను ష్ఠానమునకై గడంగుడు. మీ ప్రయత్నముల నన్నిటిని సఫలీకృతము గావించుటకై దైవమును ప్రార్థింపుచు నేనింతటితో విరమించుచున్నాను. (చప్పట్లు, తిలక్ మహా రాజ్ కు జయ్ అని కేకలు)

---

# 4. స్వరాజ్యము

## (1916 సం॥ డిశంబరు 26 తేదీన లక్ష్మణపురి కాంగ్రెసులో నిచ్చిన ఉపన్యాసము)

[ఇదివరకు 1907 సంవత్సరమందు దేశీయమహాజనసభ ''సూరతు'' పట్టణమున సమావేశమైనప్పుడు నాయకులలో అతివాదులు మితవాదులు అను భేదమేర్పడి చీలి పోయిరి. అప్పటినుండియు అతివాదులకు నాయకుడగు తిలకు మహాశయుడు దేశీయ మహాసభకు వచ్చియుండలేదు. మనలో నిట్టి భేదములుండుట అనర్థదాయకమని గ్రహించి తిరిగి 1916 సంవత్సరమున జాతీయ మహాసభ లక్ష్మణపురమున సమావేశ మైనప్పుడు నాయకులందరును కలసికొని భారతవర్షమునకు స్వరాజ్యము కావలయు నను సందేశము ఏకీభావముతో ప్రకటించిరి. అప్పుడే, ఇదివరకు ప్రత్యేకముగానున్న మస్లెములీగువారును దేశీయమహాజనసభాభిప్రాయముతో నేకీభవించి స్వరాజ్యాదర్శము నంగీకరించిరి. లక్ష్మణపురము హిందూమహమ్మదీయ సమ్మేళనమునకు స్థానమైనది. 1916 సం॥ డిశంబరునెల 26 వ తేదీన దేశీయమహాజనసభలో స్వరాజ్య తీర్మాన మునుగూర్చి తిలకుమహాశయుండిట్లు మాట్లాడెను—]

సభాధ్యక్షా ! సోదర సోదరీ ప్రతినిధులారా ! ఆర్యులారా !

నేను నేడు అఖిలభారత జాతీయ మహాసభా వేదికమీద నాకొసంగిన ఈ ఆహ్వానమునకు నేను మీ కెంతయు హృదయపూర్వకముగ వందనశతము లాచరించుచున్నాను. కాని మీ రొసంగిన ఈయాతిథ్యము నాస్థూలదేహమునకుగాను

మీరిచ్చితిరని నేతలంచునంతటి వెర్రినిగాను. మనమందరము ఇంతకాలమునుండియు, ఏ ధర్మసూత్రములకై పోరాడుచున్నామో, అట్టివానికై మీ రీయాతిథ్య మొసంగిరని నేననుకొనుచున్నాను. నేను బలపరుపబోవు ఈ తీర్మానమునం దిట్టి ధర్మసూత్రము లన్నియు నిమిడియున్నవి. ఇది స్వరాజ్య విషయమైన తీర్మానము. దీనివిషయ మయియే, మనమందర మింతకాలమునుండియు పోరాడుచున్నారము. దీనికొరకే, జాతీయమహాసభ ముప్పదిసంవత్సరము లయుండియు పోరాడుచున్నది. ఈ స్వరాజ్య నినాదము మొట్టమొదట 10 సంవత్సరముల క్రిందట హుగ్లీనదీ తటమున వినవచ్చెను. దీనిని ప్రయోగించిన మహామహుడు అఖిలభారత పితామహుడై, బొంబాయిపట్టణ వాసియై, పారసీ వంశస్థుడైన దేశభక్త దాదాబాయి నౌరోజీ మహనీయుడు. ఆ నినాదము వినవచ్చినప్పటినుండియు, మనలో భేదాభిప్రాయములు పుట్టెను. ఆ నినాదము ననుసరింపవలయుననియు, అదికార్యరూపము దాల్చగలవిశేష విధానమును తక్షణ మేర్పాటు గావింపవలయుననియును, ఆ నినాదమును సాధ్యమైనంత త్వరలో భారత వర్షమంతటను మారుమ్రోగునట్లు చేయవలయుననియు కొందరభిప్రాయపడిరి. మరి కొందరు అట్లుచేయుట పనికిరాదనియు, ఆ నినాదముయొక్క స్వరమును కొంచెము తగ్గించవలయుననియు అభిప్రాయపడిరి. పది సంవత్సరముల క్రింద మనలో గలిగిన భేదమున కిదియే కారణము అయినను మనమందరమును తిరిగి ఈ సభలో కలిసికొన గలిగినంతవరకును, ఈ పది సంవత్సరముల కాలము, నే జీవించియున్నందులకు నే నెంతయు సంతసించుచున్నాడను. మనమందరమును ఏకగ్రీవముగ పాటుపడి, మన ఈ స్వరాజ్యాదర్శమును ముందుకు నడపగలిగి నంతవరకు నే జీవించియున్నందులకు సంతసించుచున్నాడను. మనలోనుండు భేదములు తొలగిపోవుటయేగాక హిందువులకును మహమ్మదీయులకును గల భేదములు గూడ ఇంతటితో మానిపోయినవి. దీని నంతయును జూచుటకు జీవించియున్న మనముకృతార్థులము. మన మిప్పుడే సంయుక్త పరగణాలలో సంయుక్తాభిప్రాయులమైతిమి. నే డీ లక్ష్మణపురమున లక్షణవంతుల మైతిమి. (నవ్వు) కనుక ఈ 31-వ భారత జాతీయమహాసభ శుభలగ్నమున సమావేశ మైనదని నే నెంచెదను.

నేను మీ కిప్పుడు ఒకటి రెండు విషయములనుగూర్చి మాత్రమే చెప్పదలచుకొన్నాను.

ఆర్యులారా ! మన భారతీయు లిప్పుడు ఎక్కువగా మహమ్మదీయ సోదరుల అభిప్రాయములకే లోబడి పోయినారని కొందరు చెప్పుచున్నారు. స్వరాజ్యపు హక్కులు ఒక్క మహమ్మదీయులకు మాత్రమే ప్రసాదించియుండినప్పటికిని మనకే మాత్రమును చింతలేదు. (వినండి, వినండి) ఒక్క రాజపుత్రులకు మాత్రమే ఇచ్చినను మనకు భయములేదు. మన అంత్యజాతులవారే పరిపాలింప సమర్థులనియెంచి ఈహక్కు లన్నియు వారికే ప్రసాదించినను మరేమియు చింతలేదు. భారతీయులయం దేజాతి వారికిచ్చినను చాలును. అప్పుడు ఆ అధికారము వచ్చిన జాతివారికిని ఇతరుల

కును మాత్రమే పోరాటముండును, కాని ఇప్పటివలె ముక్కోణాకారముగా పోరాడవలసిన యవుసరముండదు. మనమీహక్కులను బలవంతులైన అధికార వర్గము వారినుండి లాగికొనవలయును. ఈసంగతిని మాత్రము మనము మరువకూడదు. ఈ హక్కులను వదలుటకు వారికిష్టములేదు, అది స్వభావసిద్ధము. ఎందుకనగా వారీ హక్కులను వదలుకొనిన యెడల వారికుండు ఈ యధికారము, ఈ పలుకుబడి, ఈ స్వతంత్రము యావత్తు వెంటనేపోవును. నిజముగా నేను ఆస్థితిలో నున్నట్లయిన నేనుకూడ అట్లే తలచెడి వాడను. వారికి స్వభావసిద్ధముగానున్న ఇట్టి విషయమై నేను వారిని నిందింపబోను. అట్టియూహలుండుట వారికి స్వభావసిద్ధమేయై యున్నను వానికి వ్యతిరేకముగ మనము పోరాడుట, మనవిధియై యున్నది. అట్టియూహ వారి కున్నంతకాలము ఈ దేశములో స్వరాజ్యము తలయెత్త జాలదు. మన మీయభిప్రాయమునకు వ్యతిరేకముగా పోరాడవలసి యున్నది. మూడవవానితో పోరాడవలసి వచ్చినప్పుడు మన మందరమును కలిసియుండుట, కలసి ఈ సభాపీఠమున నిలువబడుట అత్యవుసరమైనపని. జాతి మతాభిప్రాయముల యందును, రాజకీయాభిప్రాయముల యందును, అన్ని విషయముల యందును, మన మందర మేకమైయుండుట ముఖ్యావసరము. ఇప్పుడీ దినమున జరిగినది ఈ గొప్ప సమావేశమే.

నేను చెప్పినట్లుగ, పదిసంవత్సరముల నాటిమాట చూడుడు. మన అందరియొక్క ఆదర్శము స్వరాజ్యమై యుండవలెనని దాదాభాయి నౌరోజీగారు శెలవిచ్చియున్నప్పుడు దానికి స్వరాజ్యమని ఒక్కటేపేరు. తరువాత తరువాత దానికి అనేక పేరులు వచ్చినవి. స్వపరిపాలన అనియు, శాస్త్రసమ్మతమైన సంస్కరణ లనియు, అనేక పేర్లు బయలుదేరినవి, జాతీయవాదులమైన మేము దీనినే స్వరాజ్యము (హోంరూల్) అని పిలుచుచున్నాము. ఇదంతయు ఒక్కటే. ఒక్కదానికే మూడు పేర్లు. భారతవర్షమందు స్వరాజ్యమనిన దాని యందేదో చెడుగున్నదనియు, "హోంరూల్" అని పిలచిన "ఇది బాగుగలేదు, ఇంగ్లాండునందీ మాటకు చెడ్డపేరు గలద"నియు, కనుక దీనికి "శాస్త్రసమ్మతమైన సంస్కరణము" అని పేరుపెట్టిన బాగుండునని కొందరు తలంచిరి. దానిని నేను ఏపేరును బెట్టి పిలువను. పేర్లతో నాకు పనిలేదు. దానిని "క" "నా" "మ" అని పేరు బెట్టినా సరే. లేక "క" "చ" "ట" "త" "ప" అని పేరు బెట్టినాసరే. నా కేదైనను ఇష్టమే, మన మేర్పరచిన స్వరాజ్య సంస్కరణ విధానముయొక్క లక్షణమును గాని, ప్రాముఖ్యమును గాని మీరు గ్రహించినట్లు కనుపించదు. దానిలోని లాభము లన్నిటిని బాగుగ విచారించి చూచిన యెడల, అది బిరిషు "హోంరూలు" బిల్లునకంటె ఎక్కువ ఉదారమైనదని చెప్పగలను. అది సంపూర్ణమైన స్వరాజ్యము కాకపోవచ్చును. అయినను దానికిది ప్రథమ సోపానమని మాత్రము నిశ్చయముగా జెప్పనగును. ప్రథమ సోపానముకంటె ఎక్కువైనదనికూడ చెప్పవచ్చును. అది సంపూర్ణమైన స్వపరిపాలన కాకపోయినను, (గవర్నమెంటు వారేర్పరచిన) స్థానిక స్వపరిపాలనకంటె ఎక్కువ మంచిదని మాత్రము

చెప్పవచ్చును. ఇది అసలు సంపూర్ణమైన అర్థముగల స్వరాజ్యము గాక పోవచ్చును. అయినను ఇదవరకు మన మేర్పరచుకొనిన బహిష్కారము, స్వదేశవస్తు ప్రోత్సాహము అను ఏర్పాట్లకంటె ఎక్కువైన దనియే చెప్పవచ్చును. గత 30 సంవత్సరముల నుండియు కాంగ్రెసుసభ వారిచే నామోదింప బడుచున్న ఎల్లతీర్మానముల సారాంశ మిదియేయైయున్నది. ఇక మనము ముందు చక్కని మార్గ మేర్పరచుకొని జాగ్రతతో మన పనిని కొనసాగించుటకు ఈ సారాంశమే సాధనమై యున్నది. దీని ననుసరించియే మనము ముందుకు సాగవలెను. ఇక ఆయుధశాసనము, ముద్రణాశాసనము మొదలగు చిల్లర తీర్మానములమీద మన శక్తిని వ్యయపరుపజాలము. ఇవి యన్నియు ఈఒక్క తీర్మానములోనే ఇమిడియున్నవి. ఈఒక్క తీర్మానమును ఆమోదించునట్లు చేయుటకు మీరు సర్వవిధముల ప్రయత్నింపవలెను. మీ ధనమును, మీ శక్తిని మీ తెలివితేటలను మీకార్యోత్సాహమును శక్తివంచనలేక మీ సర్వస్వమను దీనికై ధార పోయ వలసినదని మిమ్ములనందరిని కోరుచున్నాడను. ఈకార్య మల్పమని మన మనుకొనగూడదు.

ఈసభలో నట్టి తీర్మానములు చేసికొన్నందువలన ఏమియు లాభములేదు: హిందువులు మహమ్మదీయులు కలిసినారనిగాని, అతివాదులు మితవాదులు కలిసినారనిగాని, ఊరక చప్పట్లుగొట్టిన లాభములేదు. మనయొక్క ఈకలయికవలన మనలో నొక విధమైన శక్తి ఉద్భవింపవలసి యున్నది. అట్టిశక్తుల నుద్భవింప జేసికొని వానిని శక్తివంచనలేక ఉపయోగపరచుకొనిననేగాని మనము జయము గాంచ నేరము. మన మార్గములోనుండు చిక్కులంత కఠినమైనవిగా నున్నవి. ఇప్పుడు మన మందరమును ఈసంస్కరణ విధానమును తరచి చూడవలసి యున్నది. ఇకమీదట కాంగ్రెసుసభలు జరుగక పోయినను నాకు సమ్మతమే. కావలసిన ఆలోచనభాగము ఈసభ నెరవేర్చినది. ఇకముందు జరుగవలసినది కార్యభాగము. ఆకార్యభాగమును మీరే నెరవేర్చవలయును. మీరు చేయవలసిన పని ఏమియో బాగుగ జ్ఞాపక ముంచుకొనవలయును. ఊరక మాట్లాడవలసిన సమయమిదిగాదు. మన అందరియొక్క వాంఛ స్వరాజ్యమై యున్నదని మనము ప్రకటించినప్పుడు, అట్టికోరిక చట్టసమ్మతమేనాయను ప్రశ్న బయలుదేరెను. ఒకసంవత్సరకాలము గడచిన పిమ్మట ఇది న్యాయమైన కోర్కెయే యని కలకత్తా హైకోర్టువారు తీర్మానించిరి. పిమ్మట ఇది న్యాయసమ్మతమైన యెడల, అప్పటి యధికారులకు చెడ్డపేరు రాకుండ దానిని సాధించుటకు మన మెట్టి సాధనముల నుపయోగింపవలయునను రెండవప్రశ్న బయలుదేరెను. అప్పుడు దీని నీవిధముగ తీర్మానించిరి, "మీ ఉద్దేశములు కొనసాగించుకొనుటకును, మీ మీ కోర్కెలు సరియైనవని తెలియజెప్పుకొనుటకును, దానికనువగు విధమున రాజ్యాంగ చర్యల మీద విమర్శనము గావింపవచ్చును. అట్టి విమర్శనము చట్టసమ్మతమే" నని హైకోర్టువారిచే తీర్మానింపబడినది. కనుక స్వరాజ్యాదర్శమును, దానిని ప్రజలకు బోధించు మార్గమును చట్టసమ్మతమేనని గవర్నమెంటువారిచేత ప్రకటింపబడియున్నది. ఇదిగో!

ఇచ్చట హిందూ మహమ్మదీయ సభలవారిచేత నామోదింపబడిన సంస్కరణ విధానము మీ యెదుటనున్నది. మీ త్రోవలోనుండు ముండ్లన్నియు తీసివేయబడి యున్నవి. ఈ సంస్కరణ విధానములో చెప్పబడిన వానిని మీరు సంపాదించుకొనలేనియెడల అది మీతప్పేను. ఇది మీ యందున్న గొప్ప బాధ్యత. మీరు దానిని త్రోసిపుచ్చక దానికై పాటుపడవలయును. ఏసుక్రీస్తుదినములలో చేసినట్లుగ ఇప్పుడు ఒక చిన్న రొట్టెముక్కతో లక్షమందికి సంతర్పణ చేయజాలము. మనకోర్కెలు ఊరక ఆకాశమునుండి ఊడిపడవు. మనంతట మనమే వానికై ఒడలు వంచి పాటుపడవలయును. ఇవి కష్టపడి పనిచేయవలసిన దినములు, ఇక రెండు సంవత్సరములలో మన విధాన మామోదింపబడగలుగుటకు సర్వేశ్వరుడు మనకు తగిన శక్తిని, సామర్థ్యమును, కార్యసాఫల్యమునకు గావలసిన సాధన సామగ్రిని, అనుగ్రహించునుగాకయని కోరుచున్నాను. 1917 సంవత్సరాంతమునకే మనకు లభించిన యెడల మరింతమంచిది. బహుశహా అప్పటికి ఈ యుద్ధము ముగియునని తలంచెదను. అప్పటికి మన మందరము ఈ హిందూదేశములో నెచ్చటనైనను ఒకచోట సమావేశమై స్వరాజ్యపతాకము నెత్తెదముగాక. (చప్పట్లు)

---

# 5. గాఢమైన స్వరాజ్యమాత్ర

(ఆన 1916 సం॥ మేనెలలో నాశికపట్టణములో నిచ్చిన ఉపన్యాసము)

[గా॥ శ్రీనివాసశాస్త్రిగారి ఆధిపత్యము క్రింద జరిగిన సంయుక్తరాష్ట్రీయసభలో స్వరాజ్యతీర్మానమును బలపరుపుచు తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను.]

సభాధ్యక్షా! ప్రతినిధులారా!

ఈ తీర్మానము విషయమై యుపన్యసింపు వారిలో, వారి వారి వయస్సునుబట్టి వరుసక్రమముగ యుపన్యాసకులను చిత్రముగ యేర్పాటు గావించియుండిరని, యీ తీర్మానము నుపపాదింపుచు నా స్నేహితులైన 'జయకర్' గారు చెప్పియున్నారు అందరికంటెను తాను చిన్నవాడు గనుక, తనను ముందు ఉపన్యసింపవలసినదని యేర్పరచిరట! నేను అందరికంటె పెద్దవాడను గనుక నన్ను అందరికంటె చిట్టచివర ఉపన్యసింపవలసినదని యేర్పరచిరట! జయకర్ గారు చెప్పిన కారణము పూర్తిగ సరియైనది కాదని తోచుచున్నది. ఎందుకనగా, నాకు ముందు మాట్లాడిన అబ్బాస్ తయాబ్జీగారు వయస్సున నాకంటె పెద్దవారే! (చప్పట్లు) ఉపన్యాసకుల వరుసక్రమమును 'జయకర్' గారెట్టులనో తనకు తోచినవిధమున సమర్థింపజూచిరి. కాని వేరొక

కారణముచేత నేను వారి వాదమును ఒప్పుకొనజాలను. ఇచ్చటనున్నవారిలో చాల మందికంటె నేనే యెక్కువ కాలము గడచినవాడనని ఒప్పుకొనుచున్నాను. వయస్సున నేను ముసలివాడనని కూడ ఒప్పుకొనుచున్నాను. కాని ఉత్సాహశక్తి విషయములో మాత్రము నేను ముసలివాడనై పోయినానని ఒప్పుకొనను. మీ యుత్సాహశక్తు లెంత యౌవనములోను, ఎంత రసోద్రేకముగను, ఉన్నవో, నావికూడ అంత యౌవనములోను, అంత రసోద్రేకముతోడను వున్నవి. (చప్పట్లు) నే వ్యాపింపజేయ బూనుకొనిన ఘనాదర్శము నెడ నాకుండు పట్టుదలయు, ఉత్సాహమును జారిపోలేదు. ఒక మనుష్యునకుండు ఉత్సాహాధిక్యతనుబట్టి వాడు యౌవనుడనియు, నిరుత్సాహమును బట్టి వాడు ముసలియనియు మీరు సిద్ధాంతీకరించినయెడల, నాతలవెండ్రుకలన్నియు నెరసిపోయినను, నేనింకను యౌవనుడనని చెప్పుకొనుటకు నాకు హక్కుగలదని నే ధైర్యముతో చెప్పగలను. (నవ్వు, చప్పట్లు) మేధాశక్తియందును, ఉత్సాహశక్తియందును, మీతోపాటు నేనును యౌవనుడననియే చెప్పగలను (చప్పట్లు) ఈ యమూల్యమైన యౌవనోత్సాహమును నే నెప్పుడును వదలిపెట్ట జాలను. నాకు యోచనాశక్తి పోయినదనియు, వర్తమాన స్థితిగతులను మించి పైకి పోవుచున్నాననియు ఒప్పుకొనినట్టయిన, నేనిప్పుడు బలపరుపబోవు అత్యంతముఖ్యమైన యీ తీర్మానమును నే నెట్లు బలపరుపగలను ? ఇప్పుడు నా చేతులలోనున్న యీ తీర్మానమును బలపరుపగల భాగ్యమునకు నే నెట్లు పాత్రుడనగుదును ? అట్లు ఒప్పుకొనుట యీ భాగ్యమును వదలుకొనుటయే యగునుగద. నే నిప్పుడేమి మాట్లాడబోవుచున్నను, నేను మీకిప్పు డెట్టి సలహా నివ్వబోవుచున్నను, నేను మిమ్ముల నిప్పుడేమి ప్రార్థింపబోవుచున్నను, నేను చెప్పబోవు యుపన్యాసములోని విషయ మెప్పుడును యౌవనోత్సాహపూరితమేయని యెరుంగునది. ఇది జరావస్థ రహితమని యెరుంగవలెను. (దానికి ముసలితనము లేదు, చావులేదు) (చప్పట్లు) ఈ తీర్మానములో నిమిడియున్న సూత్రములు, (నేనిప్పుడు క్లుప్తముగ నిచ్చట చెప్పబోవు యీ సూత్రములు) నాశన రహితములు; వానికి మార్పులేదు. వానికి చలనములేదు, అవి శాశ్వతములు. అవి ఎప్పుడును యౌవనముతోడనే నిండియుండును. ఈ స్థూలశరీరము పెరిగి పెరిగి చివరకు నిలువలేక నశించిపోవును. కాని లోపలనుండు సూక్ష్మశరీరము, అనగా ఆత్మ పైకప్పుగానుండు యీ స్థూలశరీరమును మోసికొని పోవుచుండును. ఈ ఆత్మకు ఎప్పుడును బంధనములేదు; దానికి పూర్ణస్వాతంత్ర్యముకలదు. ఈ యిహలోక సంబంధమైన సంకెల లేమియును ఆత్మకులేవు. ఆత్మకు బంధములులేవు; ఆత్మకు సర్వస్వాతంత్ర్యము కలదు. స్వాతంత్ర్యమునకు ముసలితనములేదు. (చప్పట్లు) ఈ శరీరము నశించును; కాని ఆత్మకు చావులేదు. ఆ విధముగనే, మన ప్రయత్నముల కన్నిటికి జీవన బలమునిచ్చు ఆ స్వాతంత్ర్యశక్తికి, మన ప్రతికార్యమును నడపించు ఆస్వాతంత్ర్యశక్తికి ముసలితనము రాజాలదు. మన ప్రయత్నములలో ఒకప్పుడు మందగతి తటస్థింపవచ్చును; కాని అంతమాత్రముచేత దానిలోని యుత్సాహశక్తికూడ వాడిపోయినదని యెన్నటికిని తలంపకూడదు. స్వాతంత్ర్యశక్తి యెప్పుడును నవకోమలముగను, యౌవన

పూరితేముగనే యుండును. దానిలోనుండు యుత్సాహమును గ్రహించినవారును, ఎన్ని కష్టనిష్టురములు సంభవించినను అది లభించువరకు పాటుబడబూనినవారును, తప్పక యెప్పటికైనను తమ కష్టముయొక్క సత్ఫలమును పొంది తీరుదురు. తమ స్వాతంత్ర్యముకొరకు మనస్ఫూర్తిగ పాటుబడువారు నేడు గాకపోయిన రేపైనను, స్వాతంత్ర్యయుతులయి తీరెదరు. (బిగ్గరగ చాలసేపువరకు చప్పట్లు) 'ఆత్మ' యని పిలువబడున దేమి? అది ఆ భగవంతునిలోని సారమే. మనుష్యుడు తానే భగవం డనిన యనుకొనిననేగాని అతనికి పూర్ణమైన మనశ్శాంతి లేదు. ఈ స్థూలశరీరము ప్రాతవడి ముసలిదైపోయినప్పుడు లోపలనుండు వేరొక బొందిలో (శరీరములో) ప్రవేశించునని భగవద్గీతలలో చెప్పబడియున్నది. * ఎట్లనగా మనుష్యుడు తాను ధరించు వస్త్రములు మాసిపోయి, ప్రాతవడి, పనికిరానప్పుడు వానిని పారవైచి క్రొత్తవస్త్రములనెట్లు ధరించునో (అట్లే యీ యాత్మప్రాతవడినయీ శరీమునువిడిచి, క్రొత్తశరీరమును ధరించునట) ఇది క్రొత్తసంగతికాదు. ఇది మన పురాతనమునుంచి వచ్చుచున్న వేదాంతములో నొకభాగమే. ఎన్ని యుగములు గడచినను దీనిని కాదనినవారులేరు. ఈ సూత్రములోని సత్యమును మీరు ఒప్పుకొనినట్లయిన, "ఇక స్వాతంత్ర్య మనునది ప్రతి మనుష్యునియొక్కయు జన్మహక్కు" అని మీరు ఒప్పుకొని తీరవలెను. (చాలసేపువరకు చప్పట్లు) ఎవరోవచ్చి "నీవు స్వతంత్రముగ నుండుమని" యీ స్వాతంత్ర్యహక్కులను ప్రసాదింప నక్కరలేదు. జన్మమెత్తి యీ లోకమునకు వచ్చిన ప్రతివాడును, మొదట అతి సూక్ష్మమై, మూలహేతువైన యీ హక్కు తోడనే పుట్టును. స్వతంత్రముగ నుండమను యీ మన హృదయాంతరాళములోని లాపత్రియమే, స్వేచ్ఛాసంపాదనమునకై ప్రతివానికినుండు యీగాఢమైన కోర్కయే మనుష్యప్రకృతి యొక్కసారము. నేను ముసలివాడనైనా నని ఒప్పుకొనను. నన్ను ముసలి వాడనని పిలువవద్దు! (చాలసేపు నవ్వు. చాలసేపువరకు ఎడతెగనుండచప్పట్లు) ఈ నాశనరహితమైన ఆత్మ అస్త్రశస్త్రములవలన నశింపజేయబడ నేరదు, అగ్నివలన కాల్పబడనేరదు అని ♦ భగవద్గీతలలో చెప్పబడియున్నది. దానికి యింకొకమాట కూడచేర్చి పఠింపవలసినదని నేను మిమ్ములను కోరుచున్నాను. ఏమాట యనగా, "యీ యాత్మ పోలీసు సి. ఐ. డి. గూఢచారులవలన కూడా దహింపబడనేరదు" అని పఠించుడి. (బ్రహ్మాండము పగిలిపోవునట్లుగ చప్పట్లు) అచ్చట నిడిగో! గవర్నమెంటు రిపోర్టరు బల్లముందర నొకపోలీసు డిప్యూటిసూపరింటెండెంటు కూర్చొని యున్నాడు. ఇచ్చట యీనాటి సభలో మన జిల్లా కలెక్టరుగారుకూడ నుండెన

---

* శ్లో॥ వాసాంసిజీర్ణాని యథావిహాయ । నవానిగృహ్ణాతినరోపరాణి ।
తథాశరీరాణి విహాయజీర్ణా । న్యన్యానిసంయాతినవానిదేహీ॥

2-వ అధ్యాయము 22-వ శ్లోకము.

♦ శ్లో॥ నైనంఛిన్దన్తిశస్త్రాణి । నైనందహతిపావకః । నచైనంక్లేదయంత్యాపో నశోషయతిమారుతః॥ 2-వ అధ్యాయం 23 వ శ్లోకము.

బాగుండెడిది వారిని యీసభకు రావలసినదని ఆహ్వానము చేసినాము. కాని వారు రాలేదు. అందులకు నాకు చాల విచారముగ నున్నది. ఇప్పుడు నిదిగో చూడండి! గవర్నమెంటువారికొరకు యీ యుపన్యాసముల రిపోర్టుల నన్నిటిని వ్రాసికొనుచు మాన్కర్ గారు చాలపని తొందరమీద నున్నారు. గవర్నమెంటువారి పక్షమున నున్న యీ యిందరి ప్రతినిధులయెదుట నేను తిరిగి యీ సత్యమునే ప్రకటించు చున్నాను. (చాలసేపువరకు చప్పట్లు) ఎంత బలవంతమైన గవర్నమెంటైనను యీ స్వాతంత్ర్యశక్తిని అణచివేయజాలదని మాత్రము మీరు జ్ఞప్తియందుంచు కొనుడు. (చప్పట్లు) మనము స్వరాజ్యమును కోరుచున్నాము. దానిని సంపాదించు టకు మనము కృతనిశ్చయులమై యున్నాము. (చప్పట్లు) రాజ్యాంగ శాస్త్రము యొక్క పరమావధి స్వరాజ్యస్థాపనయై యున్నది. ప్రపంచమున బానిసత్వమును స్థాపింప జూచునట్టిగాని, యిదివరకున్న బానిసత్వమును శాశ్వతప్రదముగ జేయ జూచునట్టిగాని శాస్త్రము రాజ్యాంగ శాస్త్రము కానేకాదు. (ఇట్టి బానిసత్వ స్థాపనము పరమావధిగగల శాస్త్రము రాజ్యాంగశాస్త్రము కానేకాదు) రాజ్యాంగ శాస్త్రమనగా జాతీయ (సౌధ) నిర్మాణ శాస్త్రమే యని యెరుంగవలెను. మన వేదాంతమతములో "ఆత్మ" యని చెప్పబడినదే, రాజ్యాంగ శాస్త్రములో "స్వాతంత్ర్యము" అని పిలిచెదము. 'ఆత్మ' యనునది అంతటను వ్యాపించియున్నది. అది తిరిగి జన్మయెత్తవలసిన పనిలేదు. ఆవిధముగనే, స్వాతంత్ర్యము నెడనుండు యీగాఢప్రేమ ప్రతిప్రాణిహృదయము నందునను గలదు. ఇట్టి స్వాతంత్ర్యప్రేమ మీ హృదయములలో కలదు సుమా యని మీకు తెలియజేసి, మిమ్ములను మేల్కొలు పుచు (నేనిప్పుడు ఉపన్యసించుచున్నాను) కొంతమంది తమలో యీ "ఆత్మ" యీ స్వాతంత్ర్యప్రేమ' యున్నదను విషయమునే మరచిపోవుదురు. దీనికి కారణము వారి యజ్ఞానమే. మరికొందరు, యెవరో స్వార్థపరులు చెప్పు టక్కరిమాటలను విని మోసపోయి, తమలో నిట్టి యాత్మలేదనియే నమ్ముచున్నారు. దుష్ప్రేరణాయా రంభులై, స్వార్థపరులైన, మన ప్రతిపక్షులు ఎల్లప్పుడును మనమనస్సులలో అసత్యాభి ప్రాయములను పాదుగొల్ప ప్రయత్నించుచుందురు. వీరి దుష్ప్రయత్నములలోబడి మోసపోవువారు మనలో కొందరు గలరు. ఇట్టి అసత్యాభిప్రాయములను తొలగించు టయే నాయొక్క ముఖ్యప్రయత్నమై యున్నది. మీలోనుండు ఆత్మహత్యాకారక మైన యీ దురభిప్రాయములను పారదోలిననేగాని, మన దేశము అభివృద్ధిగాంచ నేరదు * దైవీగుణములనియు ఆసురీగుణములనియు వేదాంతమతములో నెట్లు రెండు విధములుగ గుణములను విభజించి యున్నారో, అట్లే రాజకీయవిషయము లలో కూడ స్వాతంత్ర్యస్థాపనమునకు తోడ్పడు గుణములను దైవీగుణములనియు,

* భగవద్గీత: 16-వ అధ్యాయం దైవాసుర సంపద్విభాగయోగము. 5-వ శ్లోకము. శ్లో॥ దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా (మాశుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ)

బానిసత్వ స్థాపనమునకు తోడ్పడు గుణములను "ఆసురీ" గుణములనియు రెండు విధములుగ విభజించి యున్నారు.

బానిసత్వమును చిరస్థాయిగ జేయుటయే పరమలక్ష్యముగ గల రాజకీయ శాస్త్రము "ఆసురరాజకీయశాస్త్రము" క్రిందకు వచ్చును. ఒకజాతివారు మరియొక జాతివారిని శాశ్వతముగ తమ వశములో నుంచుకొనుటకు సాధ్యముకాదని జయకర్ గారిప్పుడు చెప్పినమాటలను మీరువినియే యున్నారు. "జాన్‌స్టూ్యఆర్టుమిల్లు" గారు యీవిషయమై స్పష్టముగ నొక్కి చెప్పియున్నారు. "ఒకజాతివారిని తమక్రింద బాని సత్వములో నణచిపెట్టియుంచుకొనుటకు యేజాతికిని యెట్టి నీతియుతమైన హక్కును లేదు" అని మిల్లుగారు చెప్పియున్నారు. నీతికి నిలువబడినట్టయిన, యిట్టి ఆసుర కృత్యమును మనము సమర్థింపనేరము. "బానిసత్వమును చిరస్థాయిగ జేయజూచు జాతివారు ఆసర్వేశ్వరుని యెదుట, ఆ సమస్తలోక న్యాయమూర్తి యెదుట, నిలువ బడి తమ ప్రవర్తనను సమర్థించుకొనవలసి యుండును." అని "మిల్లు" గారు శల విచ్చి యున్నారు. తాము సత్యమని దృఢముగనమ్మిదానిని బహిరంగముగ చెప్పుటకు కొందరు భయపడెదరు. కనుక సత్యమునందు ప్రేమ పుట్టునట్టుగజేయ జూచుట రాజ కీయ, మతవిద్యలలో నొకభాగముగ నెంచబడుచున్నది. రాజకీయ, మత విద్యలకు రెంటికిని భేదమిదియని స్పష్టముగ రెంటిమధ్య సరిహద్దు గీతగీయుటకు వీలులేదు. కొన్ని విషయములలో రెండునుకలిసిపోయి ఒకటిగనే పరిణమించును. మన ప్రస్తుత స్థితిగతులనుబట్టి మనము ఆరెంటిని విడదీయ జూచుచున్నామే కాని (వేరుకాదు,) విదేశపరిపాలన క్రిందబడి మన మేధాశక్తి, మన బుద్ధియంతయు పూర్ణముగ లోబడి పోయి, మలినావృతమగుటచేత మనమిట్టిభేదముకలదని ఎంచుచున్నామేగాని (నిజముగ రెంటికినిభేదములేదు.) సమస్తరాజకీయ సిద్ధాంతములకును మూలధర్మమిదియే. న్యాయ శీలయుతమైన యిట్టిసత్యమే సమస్తరాజకీయ సిద్ధాంతములకును పునాది. మనమీ సంగతిని మరచిపోయినాము. మనలను మనము పరిపాలించుకొనుట యనునది మన సాధారణ ధర్మము. ఇది మనకుగల సాధారణహక్కు. దీనిని మనము క్రమముగ మరచి పోయినాము. మనయెడ మనము నెరవేర్చు కొనవలసిన యీసాధారణ ధర్మమును మీరు త్వరితముగ గ్రహించునట్లు చేయుటకే నేనిప్పుడుపన్యసించుచున్నాను.

ఆర్యులారా! స్వరాజ్యమన నేమియో యెరుంగనివాడు మీలో నెవడైన కలడా? స్వరాజ్యమక్కరలేదని చెప్పువాడెవడైన కలడేమో నాకు వ్రేలుబెట్టి చూపుడు. నేను నీవంట యింటిలోనికివచ్చి, నీకు యిష్టమగునట్లుగాక, నీరుచికి సరిపడు నట్లుగాక, నాయిష్టము వచ్చినట్లు వంటజేసి, నాయిష్ట ప్రకారము నీవు భోజనము చేయవలసినదని నే చెప్పినట్లయిన, నీవిష్టపడెదవా? నేచేసిన పనికి హర్షించెదవా? అట్లెప్పుడును హర్షింపవుగదా. మన స్వగృహపరిపాలన విషయమైకూడ నట్లేయుండును. మన ఆచారములు, మన రుచులు, మన యిష్టాయిష్టములు యెరుగని యితరులెవరో మన యింటిలో ప్రవేశించి, మన గృహకృత్యములకేల యడ్డమురావలెను? ఎంత బుద్ధి

హీనునకైనను యిది గ్రాహ్యమగునుగద. కాని అనేక సంవత్సరములనుండి మనమీద నెక్కి కూర్చొనియున్న యధికారవర్గము వారికి లోబడి మనమణగి యున్నందున, మనుష్యమాత్రుడై పుట్టిన ప్రతివానికి నిట్టి సాధారణహక్కులు గలవను సంగతినే మనము మరచిపోయినాము. మనకండ్లు అంధప్రాయములై పోయినవి. ఇప్పుడు నాపని యేమనగా, మన నిజస్థితి యిదియని తెలియజెప్పి మీ కండ్లను తెరచుటయే నాపనియై యున్నది. మూడుమాటలలో, క్లుప్తముగ, స్వరాజ్యమన నేమియో చెప్పెదను. ప్రతి వాడును, తన గృహకృత్యములను తానే చూచుకొని, తానే నెరవేర్చుకొను అధికారమును, హక్కును, గలిగియుండుట. స్వరాజ్యమనగా ఇంతే; ఇంతకంటె ఎక్కువ లేదు, ఇంతకంటె తక్కువలేదు. (చప్పట్లు) ఈ విషయము తెలిసికొనలేని మందబుద్ధి యెవడైన గలడా? ఆ! ఉండవచ్చును. ఇంతమాత్రము తెలిసికొనలేనివారు రెండు తెగల వారు మాత్రము కలరు. వారెవరన, పిన్నవయస్కులై, బాలురైన మైనరులును, పిచ్చివాండ్రును. ఈరెండురకముల క్రిందికి వచ్చువారెవరైన యిచ్చటకూర్చొని యున్నవారిలో కలరా? ఈ సభ పిచ్చివాండ్లసుంపా? (నవ్వు) ఇచ్చట కూర్చొని యున్నవారందరును పరిశుభ్రమైన మెదడు గలవారే, తెలివిగలవారే, వీ రందరును తమయొక్క మంచిచెడ్డలను బాగుగ విచారించుకొని, తమ యభివృద్ధికై యనేక విధముల పాటుబడు కొనశక్తిగలవారే. ఈసభలో నందరును అట్టి తెలివిగలవారే నాకు గాన్పించుచున్నారు. అదిగాక 21 సంవత్సరములకు లోపలనుండు మొగము లేవియు నాకు గాన్పించుట లేదు. 21 సంవత్సరములకు లోపలనుండు వారెవరును యీసభకు రాకూడదనియే యీసభవారు చట్టమేర్పరచి యున్నారు. మన యీ సభలో మైనరులు గాని, పిచ్చివాండ్లు గాని, లేనప్పుడు, మన హక్కులు మనకువచ్చి తీరవలెనని మీరు కోరరా? మీరు మైనర్లుగాని, పిచ్చివాండ్రుగాని కారు. కనుక మీమీ హక్కులను, మీ మీ బాధ్యతలను మీరు బాగుగ యెఱింగియే యుందురని నే నెంచెదను. కనుక స్వరాజ్యమన నేమియో మీకు తెలియును. (బిగ్గరగ చప్పట్లు.)

ఎవరైనను మిమ్ములను పిచ్చివాండ్రని పిలిచినట్లయిన అట్టివారు తప్పక స్వార్థపరులనియే యెరుంగునది. మీహక్కులు ఫలానాయని మీకు తెలియును. మనకవి యిచ్చితీరవలెనని మీరు గట్టిపట్టు పట్టవలెను. స్వతస్సిద్ధముగ నున్న మీ హక్కులను అడుగుటకు మీరు భయపడ నేల? మీత్రోవలోనున్న చిక్కులన్నియు పోయినవి. హిందూ మహమ్మదీయు లిరువురకును సంతోషదాయకమైన సమాధాన మేర్పడినది. జాతీయవాదులును, మితవాదులును, చేదోడు వాదోడుగ జరించుచున్నారు......... స్వార్థపరులై కుతంత్రములు పన్నువారి కువాదములకు మోసపోవుట, మనమిప్పుడు ఆత్మహత్య గావించుకొనుటయే యగును. వారి కువాదములకు మనము లొంగిపోవుట యెంతయు మన దురదృష్టమగును. మన కదియెంతయు దౌర్భాగ్య దశయగును. "మిమ్ములను మీరు పాలించుకొనలేరు. మీరు తగరు, మీరు అసమర్థులు" అని మన ప్రతిపక్షులు వాకొనుచున్నారు. కాని మనమేమి త్రిప్పికొట్టవలెను? "మీరు

పాలించిన యీనూరు సంవత్సరముల నుండియు మమ్ములను మేము పాలించుకొనునట్లు మీరు చేయలేక పోతిరి; ఇదిగో! చూడండి; మేమిప్పుడాపని జేయుటకు సిద్ధముగనుండి నడుములను బిగించుచున్నాము. మేమీ పనిలో జయముగాంచి తీరుదుము.'' అని చెప్పవలెను. (ఆకాశము చిల్లిపడునట్లు చప్పట్లు) మాటుపెట్టి మమ్ములను మోసపుచ్చ జూచుటయు, న్యాయపథమునుండి మమ్ము తప్పింప జూచుటయు, న్యాయమైన మాహక్కులను మమ్ములను అనుభవింపకుండ జేయజూచుటయు, మమ్ములను భయపెట్టుటయు, రాజకీయాధికారము నంతను తమ వశముననే యుంచుకొని, యెట్టిబాధలేకుండ యీయధికార వర్గమువారు హాయిగ నుండ వచ్చునను యుద్దేశముతో మా భారతీయులు అసమర్థులని మా మనస్సులలో తప్పుడు అభిప్రాయములను గల్పింప జూచుటయు,—యివన్నియు ఆంగ్లేయ రాజనీతిజ్ఞుల కెంతయు సిగ్గుచేటులు, అగౌరవమును తెచ్చిపెట్టును (చప్పట్లు). ఇట్టి నీచమైన పన్నుగడలన్నియు ఆంగ్లేయ జాతివారి శీలవృత్తమున కెంతయు కళంకము నాపాదించును. వారిన్యాయ, స్వాతంత్ర్య సూత్రముల కెంతయు భంగము వాటిల్ల జేయును. ఆంగ్లేయ దేశము యీ యుద్ధములో నెందుకు దిగినది? కేవలము బెల్జియనుల స్వాతంత్ర్య రక్షణార్థము కాదా? ప్రతిచిన్న రాష్ట్రమునకును స్వాతంత్ర్య ముండితీరవలయునను సిద్ధాంతమును నిలువబెట్టుటకు గాదా? బెల్జియము దేశముయొక్క స్వాతంత్ర్యమును నిలువబెట్టుటకు ఆంగ్లేయదేశము కత్తిమాసినమాట వాస్తవమైనప్పుడు, స్వాతంత్ర్య సూత్రములకై నిలువబడి పోరాడుచు, వానిని రక్షించు నిమిత్తమెన్ని కష్టనష్టములు వచ్చినను భరించుటకు సిద్ధముగనున్న ఆ ఆంగ్లేయదేశమే మన భారతీయుల హక్కులను నిరాకరించునని తలంచుటకు వీలగునా? స్వాతంత్ర్యరక్షణార్థమై పోరాడు నీసంగ్రామములో ఆంగ్లదేశమునకు మన భారతవర్షము సహాయము చేయుచున్నది. కనుక యీ సూత్రములనే భారతవర్షము సహాయము చేయుచున్నది. కనుక యీ సూత్రములనే మన (భారతవర్షమున) ఆంతరంగిక రాజ్యాంగ వ్యవహారముల పరిపాలనలో జొనుపవలసినదని మనము బెట్టు మొరలను వారు పెడచెవిని బెట్టెదరా? ''బెల్జియమునకు స్వాతంత్ర్యము రావలెను. కాని మీ భారతవర్ష మెప్పుడును అధోగతిలోనేయుండి మాక్రిందనే లొంగియుండవలెను.'' అని వారు చెప్పెదరా? మనము కోరు హక్కులను జూచి పరిహసించువారు తప్పక స్వార్థపరులని గ్రహించునది. దుర్మార్గవృత్తి గలవారు యీలోకమున ప్రతివానికిని పేర్లు పెట్టుటకు జంకరు. ఆసర్వేశ్వరుడు సైతము వారి పరిహాసమునకు పాత్రుడు గాకుండ తప్పించుకొనలేడు. కనుక మీజన్మ హక్కులను మీరు కోరుచున్నప్పుడు వారు పరిహసించిరన నందులో ఆశ్చర్యమేమున్నది? కాబట్టి మనము దేనికిని భయపడక, మనముమన కోర్కెలను నెరవేర్చుకొనుటయందే, మన సంకల్ప సిద్ధియందే, మన హృదయములను జొనిపి నిరంతరము కృషిచేయవలెను. మనకుండు జన్మహక్కులను సంపాదించు నిమిత్తమే మన మీ యధికారవర్గము వారితో బోరాడుచున్నాము. అంతకు ఏ మాత్రము తక్కువయైనను మనకు మనశ్శాంతి యుండనేరదు; మనకు శ్రేయస్సులేదు. (చప్పట్లు)

క్రిందటి సంవత్సరము జాతీయ మహాసభలో నంగీకృతమైన స్వరాజ్య తీర్మానములోని యంశములనే మన యీ రాష్ట్రీయ సభవారు తిరిగి "నొక్కి చెప్పుచున్నారు." నేనిప్పుడు బలపరుప బోవు తీర్మానములో నీమాటలే యున్నవి. అనగా ("నొక్కి చెప్పుచున్నారు" అనుమాటలే యున్నవి.) కాని యీ తీర్మానములో నుండవలసిన మాటలివియేనా? యీ మాటలు సరిగనున్నవా' యని నేను ప్రశ్నించుచున్నాను ఈ తీర్మానములో నుండవలసిన మాటల క్రమమిదిగాదని నాయభిప్రాయము. రాష్ట్రీయ సభలన్నిటికిని యీ భారత జాతీయమహాసభ తండ్రివంటిది. (ఈ జాతీయ మహాసభను మన యీ రాష్ట్రీయసభలు పితృసమానముగ జూచుకొనవలెను.) గనుక మహాసభయొక్క యాజ్ఞలను చెల్లించుట మన యీరాష్ట్రీయసభల విధియైయున్నది. కుమారుడు తండ్రికి విధేయుడై ఆయన యాజ్ఞలను చెల్లింపవలెనే గాని, ఊరక ఆయన చెప్పిన దానినే తిరిగి "నొక్కిచెప్పు" కూడదుగద. అవిధముననే జాతీయమహాసభ చెప్పినదానిని, మనరాష్ట్రీయసభలు తిరిగి "నొక్కిచెప్పు"టకేమి హక్కుగలదు! జాతీయ మహాసభయొక్క కోర్కెల ప్రకారము కార్యముల నెరవేర్చుటయే మన యీ రాష్ట్రీయ సభలయొక్క విధియైయున్నది. ఇట్లు చేయుటకు మారు, జాతీయ మహాసభ చెప్పినదానినే మన యీ సభవారు "నొక్కిచెప్పు" చున్నారు. మన యీరాష్ట్రీయ సభకు, జాతీయమహాసభయెడ పితృధర్మము నెరవేర్చవలసిన విధియైయున్నది. తండ్రియెడ కుమారునకుండవలసిన ధర్మము, (విధి) ఎంత పవిత్రవంతమైనదో, నేనీ నాశికా పట్టణవాసులకు వేరుగ చెప్పనక్కరలేదు. పితృవాక్య పరిపాలన గావింపు ధర్మోద్దేశముతో పండ్రెండు సంవత్సరము లరణ్యవాసము జేయ బూనుకొని - వచ్చిన ఆ శ్రీరామచంద్రులచేత మీ యీనాశికాపట్టణము పావనము చేయబడెను. శ్రీరామునకు తన తండ్రియందంత భక్తివాత్సల్యము లుండెను. ఆవిధముననే, యీ రాష్ట్రీయసభ వారికి జాతీయమహాసభ యందంత భక్తివాత్సల్యము లుండవలదా? జాతీయమహాసభవారు యీ స్వరాజ్య తీర్మానమును శాశ్వతముగ ఆమోదించి యున్నారు. కనుక దానిక్రింద నుండు సభల వారందరును అట్లే ఆమోదించి తీరవలెను. అది వారివిధి. మహాసభవారు ఒక్కసారియే మాటయిచ్చియున్నారు. (వాగ్దత్తము చేసియున్నారు.) కనుక నిక వెనుకకు బోవుటకు వీలులేదు. మనతండ్రి, అనగా యీ మహాసభ (కాంగ్రెసు) మనకు ఆజ్ఞనిచ్చియున్నారు. వినయ విధేయతగల నమ్మకమైన కుమారులమైన మనము దానిప్రకారము నెరవేర్చుటయే మన విధియైయున్నది. దానిలో ననేకకష్టము లుండవచ్చును. చెప్పనలవిగాని కష్టనిష్ఠురములు మనము పడవలసి వచ్చిన రావచ్చును. మన మరణ్యముల పాలు గావలసి వచ్చిన గావచ్చును. చెరసాలలలో నిర్బంధింప బడవలసిన హీనస్థితి వచ్చిన రావచ్చును. అయినను మనవిధిని, మన ధర్మమును, నెరవేర్చుటకు మనము వజ్రసంకల్పులమై యుండవలెను. (చప్పట్లు) ఈధర్మ కార్యాచరణమునకు ఎంతలెంతలు కష్టములు సంభవించినను అవి కష్టములుగ గాన్పింపకూడదు. శ్రీరాములవారు పండ్రెండు సంవత్సరములు వనవాసక్లేశము లనుభవింపవలసి వచ్చెను. మన కష్టములన్ననో ఒకటి రెండు సంవత్స

రములలో బహుశః అంతమొందవచ్చును. (చప్పట్లు) అది కేవలము మీ ప్రయత్నములను బట్టియే యుండును.

ఆర్యులారా! ఆపని పైకి మాత్రము తేలికగ గనుపింపవచ్చును. కాని అది అంత తేలికయైనది కాదు. ఈ తీర్మానమును మీరామోదించు నప్పుడూరక చప్పట్లుకొట్టి, యిచ్చట యీ యుపన్యాసముల నిచ్చువారిని సంతోషపెట్ట చూచిన చాలదు మీపని యంతటితో ముగియనేరదు. మీ రీ తీర్మానమును నిజముగ ఆమోదింపదలచినట్టయిన దీనిని తప్పక నెరవేర్తుమని మీ మనస్సులలో ప్రమాణపూర్వకముగ సంకల్పించుకొనవలయును. మీకు దీనిమూలమున రాగల కష్టములన్నిటిని భరించుటకు సంసిద్ధులమై యుండదమని మీరు మీ మనస్సులను దృఢపరుచుకొనుడి. ఈ వజ్రసంకల్పమను దృఢకవచమును మీరు ధరించినట్టయిన, యీ లోకములోగాని, పరలోకములోగాని ఎట్టిశక్తియు మీ కడ్డము రానేరదు. మీ కార్యమునకు అడ్డము రానేరదని నాకు దృఢనమ్మకము గలదు. (బ్రహ్మాండము పగులునట్లు చప్పట్లు)

నేను ముఖ్యముగ మనలో నుండు యావనులను ప్రోత్సహించుచున్నాను. యువకులకు మనవిజేయుచున్నాను. వారే యీ జాతీయసౌధమునకు మూలస్తంభములు. వారి ప్రయత్నముల మీదనే జాతీయాభ్యుదయముగాని, జాతీయదౌర్భాగ్యదశగాని యాధారపడియున్నది. మాబోటి ముదుసలుల మంధరమును కాటికి కాళ్ళు చాచుకొని కూర్చున్నాము. మేమెప్పుడో ఒకప్పుడు కండ్లు మూసెదము. మా ప్రయత్న ఫలితములను మేము చూచుటకు బ్రతికెదమో లేదో చెప్పజాలము. కాని మీరు నిజముగ యీ ప్రయత్న ఫలితములను బొందితీరెదరు. కష్టములకు మనముజంకని యెడల మనకు స్వరాజ్యము వచ్చితీరును. అచిరకాలములోనే మన ప్రయత్నములు సఫలీకృతములు కావలెను. మిక్కిలి శ్రద్ధతో, ఎడతెగని భల్లూకపు పట్టుతో మీరు మీహృదయపూర్వకముగ ప్రయత్నించినట్లయిన, మన ప్రయత్నముల చిరకాలమున సఫలతగాంచగలవు. మీ మంత్రము ఫలవంతము కావలయుననిన యెడల, మీరు ఆ మంత్రమును పునశ్చరణచేయుచు, కొంత జపము చేయవలెను. కొన్ని నియామకముల ననుష్టింపవలెనుగద. మంత్రమును ఊరక తిరిగితిరిగి నోటివెంట చిలుకపలుకులుగ పలికిన నేమియు ప్రయోజనముండదు. ప్రతిదినమును ఊరక గాయత్రి మంత్రమును వేయి పర్యాయములు ఉచ్చరించినంత మాత్రముచేత మనకది మేలుచేయునా ? మనల నది యాశీర్వదించునా? మన మీ స్వరాజ్యమంత్రమును అనేకసారులు ఉచ్చరించినాము. కాని మనము దాని యర్థమును పూర్ణముగ గ్రహింప కుండ నుచ్చరించినాము. మీరు చెప్పునట్టియు, చేయునట్టియు క్రియయొక్క నిజార్థమును మీరు బాగుగ గ్రహింపవలయును. క్రియలయొక్క నిజార్థమును మీరు బాగుగ గ్రహింపవలయునని నే కోరుచున్నాను. అదృష్టవశమున, మన కిప్పుడు మంచిదినములు వచ్చినవి. కాలములు మన కిప్పుడు అనుకూలముగనున్నవి. ఈ తరుణమును వృథపుచ్చక, మనము శక్తికొలది పాటుబడి, దీనివలన అత్యంతమైన ప్రయోజనమును బడయ జూడవలెను. సర్వేశ్వరుడు మన కనుకూలమైన పరిస్థితులను గల్పించినాడు. వానిని మీరు ఉపయోగించుకొనలేక

పోయిన యెడల లోపమెవరిది? ఎవరిని నిందింపవలెను? భగవంతుని నిందింపవలెనా లేక మిమ్ములను మీరే నిందించుకొనవలెనా? వట్టి ఆడంబరము కొరకు మీ రీ సభలనుచేసి, వినోదముగా కాలముగడపుచు, ఉపన్యాసము లిచ్చుచు, తర్కవాద ప్రతివాదములతో మీ మేధాశక్తిని ప్రదర్శింపుచు, ఆనందముగ కాలక్షేపము చేయ జూచి నట్లయిన, ఇట్టి సభలతో, ఇట్టి శుష్క ఆడంబరప్రదర్శనములతో నే నేమియు జోక్యముకలిగించుకొనను. వీనితో నా కవసరములేదు. మీ యుద్దేశ మటువంటిదైన యెడల మీ రీ తీర్మానమును ఆమోదింపనక్కరలేదు. కాని మీ రీ తీర్మానమును అంత తేలికగ జూచెదరని నే నెంచను. మన ప్రయత్నములయొక్క ఫలితములను మన మనుభవింపక పోయినను, మన సంతతివారైనను గాని ఫలితములను తప్పక పొందెదరను విషయమును మాత్రము మీరు జ్ఞాపకముంచుకొనుడు. మన జాతివారి కిప్పుడు మంచిపుష్టి చేయగలఘాటైనమందు అత్యంతావశ్యమై యున్నదని 'సమారతు'గారు శలవిచ్చి యున్నారు. ఈ విషయమునే 'జయకర్'గారు ఆమోదించియున్నారు. కాని ఆ ఔషధము "సారా"తో మిశ్రమము కాకూడదని కూడ వారు చెప్పియున్నారు. కాని "సారా"యనుమాట యీ సభవారికి చాల కర్ణకఠోరముగ నుండవచ్చును. దానిని సమర్థించుటకు వీలులేదు. బహుశః ఆయుర్వేద వైద్యశాస్త్రమందు వారికి విశేష పరిచయము లేనందువలన 'సమారతు' గారు ఆ మాటను ప్రయోగించి యుండవచ్చును మీ కిష్టము లే నట్టయిన "సారా"యను అసహ్యాకరమైన మాటను తీసిపారవేయుడు. కాని మన జాతి కంతకును గాఢమైన ఔషధము అత్యావశ్యకమై యున్నదను సంగతిని మీ రందరును ఒప్పుకొందురు మంచి గాఢమైన మాత్రతో, ఒక ఘాటైన మొహతాదు మందు పడవలెను. గాఢమైన మాత్ర పడిననేగాని, దేశమునకు ఆరోగ్యస్థితి గలుగ నేరదు. ఆ మాత్రను పుచ్చుకొనుటకు కొంతమంది కిష్టములేక పోయినను, ఆ మాత్రను వేసితీరవలెను. (నవ్వు) మందు పుచ్చుకొనుటకు రోగికి యిష్టములేక పోయినను, నోరు పగులదీసి యైనను ఔషధమును ఒకప్పుడు లోపలికి యివ్వవలసియుండును. (వాతము చేసి) పండ్లు బిగుసుకుపోయి నప్పుడు, నోరు పగులదీసి, మందు లోపలికి పోయవలసి వచ్చును. (చప్పట్లు) ఏ మందు యివ్వవలెనో, ఎంతెంత మొహతాదుమందు యివ్వవలెనో, వీనితో రోగికి పనిలేదు. ఇవి రోగి యిష్టాయిష్టములను బట్టి యుండవు. "సారా"తో మిశ్రమమైన మందును యివ్వకూడదని "సమారతు"గారు శలవిచ్చి యున్నారు, సరే, నిజమే; కాని శరీరములో పటుత్వము తప్పిపోయి, రోగికి కాళ్ళు చేతులు చల్లబడి, చలువగమ్మి నప్పుడు, మంచి ఉష్ణముచేసి, పుష్టిచేసి, తెలివి పుట్టింపగల గాఢమైన గరళ మాత్ర యివ్వక తప్పదు. (నవ్వు) మన మెన్ని మొత్తుకొన్నను, వైద్యుడు మన కేకలను లక్ష్యము చేయడు.

## కేవలభ్రమ

దేశస్థితి నొకసారి తిలకింపుడి. కొద్ది విషయములలో నైతము దేశమెంత అసహాయస్థితిలో నున్నదో చూడుడి. (ఎంత దిక్కుమాలిన స్థితిలో నున్నదో చూడుడి.)

అధికారుల యనుజ్ఞ లేనిదే నీ పొలములోని చెట్టుకొమ్మను నీవు కొట్టుకొనుటకు నీకు హక్కు లేదు. ఈ స్థితిలో గాఢమైన మాత్రవేయుట యత్యావసరము కాదా? "మీరిక మా దేశమును ఏ విధముగ పరిపాలింప దలచితిరో, మీ యొక్క నిజమైన సంకల్పమేమిటో, మా కొక్కసారే ఖండితముగ, ప్రకటన మూలముగ, తెలియ జెప్పవలసిన" దని మనము గవర్నమెంటువారిని కోరుచున్నాము. కాని వారు వట్టి వాగ్దానములను చేసినంతమాత్రముచేత నాకు తృప్తిలేదు. ఆన 1857 సంవత్సరములో వారు మనకు ప్రకటన పూర్వకముగ గొప్ప వాగ్దానమును గావించియుండిరి. కాని ఆ ప్రకటనలోని వాగ్దానముల నన్నిటిని క్రియారూపమున వారు అమలు జరిపి యున్నారా? ముప్పది సంవత్సరములనుండి, మా కష్టములను తొలగించవలసినదని మనము మొరపెట్టుకొనుచున్నాము. మనము నొక్కి చెప్పుచున్నాము. దున్నపోతును పాలు పిదుక బూనుకొనిన వాని ప్రయత్నము లెంతవరకు సఫలతగాంచుచున్నవో మన ప్రయత్నములు కూడ నంతియే సఫలత నొందుచున్నవి. (నవ్వు, చప్పట్లు) ఒక్క పాలచుక్కయైనను మన చెంబులో పడలేదు కాని కాలములు మారినవి. పూర్వమున కంటె యిప్పుడు మేలు దినములు వచ్చినవి. మనకు ముందు మేలు గలుగ గలదను సూచనలు గనుపించుచున్నవి. ముందు మేలు గలుగ గలదను యాశగలదు. ఆంగ్లేయ రాజనీతిజ్ఞుల దృక్కోణము మారిపోయినది. మన ప్రయత్నములు జయము గాంచి తీరవలెనని మనము సర్వేశ్వరునకు వేయి మొక్కులు మ్రొక్కవలెను.

ఇంతవరకును ఆంగ్లసామ్రాజ్యమునంతను యితరుల సాయములేకుండ తానొక్క దేశము మాత్రమే రక్షించుకొన గలనని ఇంగ్లాండు అభిప్రాయపడియుండెను. కాని ఈ యుద్ధమువచ్చి, పై చెప్పినదంతయు వట్టి డంబమేయనియు, కేవల భ్రమ యనియు తెలియజేసినది. భారతవర్ష సహాయము లేనిదే తాను జయమొందలేనని ఈ యుద్ధమువలన యింగ్లాండున కిప్పుడు స్పష్టమైనది. యుద్ధమువచ్చి వారి కండ్లను తెరచి, యీనిజస్థితిని వారికి గోచరింప జేసినది. కాని దీనిలో మన ప్రయోజకత్వ మేమియు లేదు. అంతయు ఆసర్వేశ్వరుడు కల్పించిన కల్పనయే. ఆంగ్లేయ సామ్రాజ్యమునందంతటను మూలసూత్రములనే కేవలము మార్చి, నూతననిర్మాణము చేయుట తప్పదని ఆంగ్లదేశమిప్పుడు యోచించుచున్నది. వారి యభిప్రాయములో నిట్టి క్షేమము కలుగుటకు మన మేమియు కారకులము కాము. దీనిలో మన ప్రయోజకత్వమేమియు లేదు. ఇది యీశ్వర సంకల్పమేగాని మన దేమియు లేదు. మన భవిష్యత్ స్థితిగతులను గూర్చి, ఆ సర్వేశ్వరుడే పరిష్కరించి, మూడు పంక్తుల వ్రాయబూనుకొని యున్నాడు కనుక యీ లోకములోనుండు నెట్టి యధికారమును, నెట్టి శక్తియు ఆ యీశ్వర సంకల్పమును ప్రతిఘటింప నేరవు. (చప్పట్లు) మీ రెందుకు చప్పట్లు కొట్టుచున్నారు! నేడీ ప్రపంచమున జరుగుచున్న సమస్త విషయములను, మీ ప్రయోజకత్వమువలననే జరుగుచున్న వని యూహించుచున్నారా? దీనిలో నిశ్చయముగ మీ ప్రయోజకత్వ మేమియులేదు. పెద్ద పెద్ద సామ్రాజ్యములను స్థాపింప వలయునను పూర్వపు టూహలన్నియు నడుగంటినవి. సామ్రాజ్యాంతర్భాగములైన

ఎల్లదేశములవారి సహాయములేనిదే, తాము యీ విశాల సామ్రాజ్యమును జయప్రదముగ రక్షించుకొనలేమని ఆంగ్లేయ రాజనీతిజ్ఞులు యిప్పుడు గ్రహించినారు. వారికిప్పుడిది బాగుగ మనస్సునకు నాటినది. "ఈ సామ్రాజ్యమును రక్షించుకొనుట యెట్లు?" అను సమస్యను సామ్రాజ్యాంతర్గతమైన యెల్లదేశములవారి సహాయము లేనిదే తామొక్కరే పరిష్కరించుకొనలేమని వారి మనస్సున కిప్పుడు నాటినది. ఈ సామ్రాజ్య సౌధమును రక్షించు భారమును మనముకూడ కొంతవహింపవలెనని సర్వేశ్వరుడు సంకల్పించియున్నాడు (బ్రహ్మ మా నుదుట వ్రాసియున్నాడు). మన మీ భారమును వహించుటకు సిద్ధముగ నున్నామని మనము ఆంగ్లదేశము వారికి నొక్కిచెప్పవలెను. సామ్రాజ్యగౌరవమును నిలువబెట్టుటకుగాను కోట్లకొలదిగ మా భారతీయులు తమ రక్తమును ధారబోయుటకు సిద్ధముగనున్నారని వారికి జెప్పవలెను. (ప్రేక్షకుల చాలసేపువరకు చప్పట్లు) ఈ విషయమును ఆంగ్లదేశములో, ఆంగ్ల ప్రజాపాలకుల దృష్టిపథమునబెట్టి వారు దీనియందు ఏకదీక్షవహించి యోచించునట్లు జేయ జూచుటకై మనము గట్టిగ ప్రయత్నింపవలెను. మన ప్రయత్నములన్నిటిని దీనియందే నిలుపవలెను. మనమట్లు చేసినట్లయిన, ఆంగ్లేయులు మన ప్రార్థనలను పెడచెవిని బెట్టరని నాకు నమ్మకముగలదు. మన భారతీయ సైనికులు ఆంగ్లేయ సైనికులతో బాటు ఫ్రాంసు రణరంగములలో వీరోత్సాహముతో బోరాడిరి. ఇంతవరకును భారతీయు లందరును అస్వతంత్రులనియు, ఇతరులమీద ఆధారపడియుండువారనియు వారు మనల నెంచుచుండిరి. కాని, మనవారిప్పుడు, ఈ యుద్ధములో వీరోత్సాహముతో బోరాడగలిగిన కారణముచేత 'మనలను కూడ వారు తమతో బాటు' తమ సోదరులవలె సంతోషపూర్వకముగ గౌరవించుటకు కారణమైనది. ఈ స్నేహభావమును వారు ముందు మరచిపోవచ్చును, కనుక వారీ స్నేహభావమును మరచిపోవక పూర్వమే మన కోర్కెలను గట్టిగ వారికి తెలియజెప్పి, వారికి దీనియందు శ్రద్ధ పుట్టునట్లు చేయుట మన విధియైయున్నది. "మేము మీకు సహాయముగవచ్చి నిలువబడినట్లయిన మన సామ్రాజ్యమువంక తేరి జూడ నెట్టి వానికైనను ధైర్యము గలదా? ఈ ప్రపంచమున నెట్టి వానికిని సాధ్యముకాదని" మనము ఆంగ్లేయులకు నిశ్చయముగ నమ్మకము బుట్టునట్లు గట్టిగ చెప్పగలము. ఆంగ్లేయ ప్రజాపాలకులను ఒప్పించు నిమిత్తమే మనము ఆంగ్లదేశమునకు రాయబార మంపవలయునని తీర్మానించినాము.

## అటునిటు తారుమారులాడిన ప్రయోజనము లేదు

మన మీ రాయబారమంపు విషయమై ఎంతయో కాలమును వ్యయపరచితిమి; కాని ఆ రాయబార మింకను బయలుదేరలేదు. ఇది ఎంతయు మన దురదృష్టము. ఏమనగా ప్రతిదినమును, ప్రతిమాసమును మనకు చాల ముఖ్యమైనదే. ఏ దినము వృథగ బోయిన, యేమాసము వృథగ బోయిన మనకు నష్టమే. ఇక మనము అటునిటు తారట్లాడుచుండిన ప్రయోజనములేదు. రాయబారమును పంపుట అత్యంతావ

శ్యకమే యైన యెడల మీరింతకాలమునుండియు యేల పడయక యున్నారని మీరు సాధారణముగ అడుగవచ్చును. మీరిట్లు ప్రశ్నించుట నిశ్చయముగ న్యాయమే? ఒక విషయము మన బుద్ధికి తోచవచ్చును. కాని, దానిని క్రియారూపముగ నెరవేర్చుట బహుకష్టసాధ్యము. దానిని క్రియారూపమున నెరవేర్చుట కష్టమేగాని బుద్ధికి తోచుట యంతకష్టము కాదు "మేమీవిధముగ తీర్మానించుచున్నాము" అని జాతీయ మహాసభవారు చెప్పెదరు, "జాతీయ మహాసభవారు చెప్పిన దానినే మేము తిరిగి చెప్పుచున్నాము" అని రాష్ట్రీయసభలవారు చెప్పెదరు. అర్థము లేని యీ మాటల వలన మనకు వచ్చు ఫలితమేమి? "మేము మీ తీర్మానములను విన్నాము." అని గవర్నమెంటువారు ప్రత్యుత్తరము చెప్పెదరు. (నవ్వు చప్పట్లు) ఇక మీదట యిట్టిది పనికిరాదు. మీరు దానిని "హోంరూలని" పిలువుడి, లేక "స్వరాజ్య" మని పిలువుడి. లేక "రాజకీయసంస్కరణము" అని అస్పష్టమైన పేరుతో పిలువుడి. మీకిష్టమువచ్చిన పేరుపెట్టి పిలువుడి; కాని దానిని క్రియారూపమున నెరవేర్చ గలుగుటకు మీరందరును దృఢసంకల్పముతో సహాయము చేయవలెను. మీరు చెప్పు మాటలను క్రియారూపమున నెరవేర్చుటకై పాటుపడయత్నింప వలయునని నేను మిమ్ములను ప్రార్థించుచున్నాను. మీరాపనికి తక్షణము గడంగుడు. ఈ స్వరాజ్య తీర్మానమును జాతీయమహాసభవారు, ముస్లిములీగువారును ఆమోదించి యున్నారు. ఈ తీర్మానములోని మాటలవిషయమై యిక వివాదములేదు. ఈ యాదర్శము సఫలత నొందుటకై శక్తివంచనలేక పాటుబడవలసిన సమయమిదే. స్వరాజ్యాదర్శము న్యాయ శాస్త్రసమ్మతమని లోకోత్తరులన్నియు ప్రకటించియున్నవి. భగవంతుడు మీకొరకై అనుకూలమైన పరిస్థితులను కల్పించి యున్నాడు. మన బ్రతుకంతయు నెవరిపాల బడెనో యట్టి యాంగ్లేయుల దృష్టిపథమునందు మార్పు కలిగినది. ఆ మార్పు చాల వరకు మన కనుకూలముగనే యున్నది. మీ త్రోవలో యేమాత్రము కష్టములేదు. మీరీతరుణమును ఉపయోగించుకొన లేకపోయినయెడల 'యావజ్జీవమును జేసినకృషి యంతయు' (బూడిదను బోసిన పన్నీరువలె) వ్యర్థమని నేను నిర్మొగమాటముగ చెప్పుచున్నాను. మీ యొక్కయు, మీ జాతియొక్కయు గతి శాశ్వతముగ అధోగతియే యని యెరుంగవలెను. ఈ విషయమును మాత్రము మీరు బాగుగా యోచించుకొనుడి.

స్వరాజ్యములో మనకు రాజకర్తలేదని మనము చెప్పము; మనకు ఉద్యోగస్థులు కూడ కావలసినదే; ఇవిగాక మనకింకను కావలసినదేమనగా:- రాజ్యపరిపాలనను నడపించు కళ్ళెపుపగ్గములు మన చేతులలోనే యుండవలెను. సేవకులుగ నుండవలసిన అధికారవర్గము వారిచేతులలో నుండకూడదు. మన కోర్కెలను నెరవేర్చుట వారి విధియై యున్నది. వారుచేయు పనికై వారికి మనము జీతముల నిచ్చెదము. సేవ కులుగా నుండవలసిన యీ సేవకులు సేవకులుగ నుండవలెను గాని యజమానులుగా నుండకూడదు (చప్పట్లు). మాయిష్టప్రకారము మాయింటిలోని వ్యవహారములను

మేము నిర్దుకొని, మాగృహకార్యనిర్వాహణను మేమే చేసుకొను అధికారమును గవర్నమెంటువారు మా కియ్యవలెను. ప్రజాసేవకులైన యీ యుద్యోగస్థులు ప్రతికార్యములోను మా ప్రజలకు ఉత్తరవాదులై, (బాధ్యులై) యుండవలెను. (ప్రజలకు జవాబుదారులై యుండవలెను.) మామాటలలో స్పష్టముగ మేము కోరు వినయపూర్వకమైన విజ్ఞప్తి యిదియే మేము కోరు "స్వరాజ్యము" ఇంతకు తక్కువకాదు. మేము ముప్పదిసంవత్సరముల నుండియు, అనేక కోరికలను పెట్టుకొనుచున్నాము. మాకష్టములను తొలగించవలసినదని మొరపెట్టుకొనుచున్నాము. మాకనేక హక్కులను యివ్వవలెనని కోరుచున్నాము. వీని నన్నిటిని ఒకచిన్న, సూక్ష్మమైన తియ్యని "స్వరాజ్య" మను మాటలో నిమిడ్చవచ్చును. (చప్పట్లు.) ఏమియు తెలియని మూఢునకైనను, వీధిలో బోవు ప్రతివానికిని ఈ విషయమై తెలియును. మనము కోరు కోర్కెలన్నిటియొక్క సారాంశ మిందులోనే యున్నది. మనము నిర్మింపబోవు రాజకీయసౌధ నిర్మాణమునకిది మూలస్తంభము వంటిది. ఆంగ్లేయ సామ్రాజ్యాంతర్గతమైన స్వరాజ్యము మన పరమ లక్ష్యము. దీనిలో సత్వరసిద్ధము గాని, స్వభావసిద్ధము గాని లేదని జ్ఞాపక ముంచుకొనుడు: ఏలననగా, యిది మనకు జన్మతో బుట్టినహక్కు. ఇది స్వభావసిద్ధమైనది. దీనిలో శాసనోల్లంఘన మేమియు లేదు; దీనికేవిధమైన అభ్యంతరమును లేదు; అశాస్త్రీయ మేమియు లేదు. దీనినంతను మీమనస్సులలో నుంచుకొని, మీయాత్మశక్తినంతను వినియోగపరచి, తప్పక స్వరాజ్యమును గెల్చితీరవలయునని ప్రమాణపూర్వకముగ మీరు సంకల్పించు కొనవలెను. మీరిట్లు చేయుటకు సిద్ధముగనుండి నట్టయిననే, మీరీ తీర్మానమును ఆమోదింప వలయును గాని, లేనియెడల నామోదింప నక్కరలేదు. ఇట్టి దృఢసంకల్పము గలవారు ఒక్క అయిదుగురు మాత్రమే దొరికినను నాకు చాలును. దృఢప్రమాణము చేసికొనుము. నీ స్వధర్మమును నెరవేర్చుటకై వజ్రసంకల్పము గలవారు ఒక్క అయిదుగురు మాత్రమే దొరికినను నాకు చాలును. దృఢప్రమాణము చేసికొనుము. నీ స్వధర్మమును నెరవేర్చుటకై వజ్రసంకల్పమను కవచమును ధరింపుము. నీప్రయత్నములపుడెట్లు అద్భుతముగ జయప్రదమగునో జూచుకొనుము! (చప్పట్లు.) మీరిప్పుడీ తీర్మానమును ఆమోదించినట్లయిన, నే చెప్పినట్లుగ, ప్రమాణపూర్వకముగ, నామోదించి నారనియే నే నెంచెదను. (చప్పట్లు) ఆ ప్రమాణ ప్రకారము మీరు మీశక్తి కొలది పాటుపడెదరని నేను నిశ్చయముగ నమ్ముచున్నాను. ఇంతటితో, నే నీతీర్మానమును మీ యామోదము కొరకై మీ యెదుట నుంచుచున్నాను. (బ్రహ్మాండము పగిలి పోవునట్లు చప్పట్లు; "లోకమాన్యతిలక్ మహారాజునకు చిరంజీవియగు గాక," "తిలక్ మహారాజుకుజెయ్" యను కేకలు మిన్నుముట్టెను.)



# లోకమాన్యుని ఉపన్యాసములు

## 6. స్వరాజ్యము (హోం రూల్)

(1917 సం॥ అక్టోబరు 7 తేదీన ప్రయాగలో నిచ్చిన ఉపన్యాసము)

[1917-వ సంవత్సరము భారతవర్ష చరిత్రయందు మిగుల ముఖ్యమైనది. దేశ మంతయును స్వరాజ్యవాంఛతో నుఱ్ఱూత లూగుచుండెను. ఈ యాందోళన నడచుచుండగాను మద్రాసు గవర్నరుగారగు "పెంట్లండు" ప్రభువు శ్రీమతి బిసెంటమ్మను నిర్బంధావాసమున కంపెను. ఈ విపరీతచర్య ఈ యాందోళనకు మరింత చేయూత నొసగనేగాని, దాని నాపజాలక పోయెను. ఇట్టి తరుణమున "మాంటేగు" గారు మంత్రిత్వపదవికి వచ్చి భారతవర్షమునకు స్వపరిపాలన నిచ్చుటయే ఆంగ్లేయ పరిపాలన యొక్క పరమావధియని "పార్లమెంటు" మహాసభయందు ప్రకటించి, ఆవిషయమై విచారించుటకు తానే స్వయముగా భారతవర్షమునకు వచ్చెదనని సందేశమంపెను; పిమ్మట బిసెంటమ్మను విడుదలచేయగా, దేశజులకు ఉత్సాహము గలిగి, మన మొరలను వినుటకు వచ్చుచున్న "మాంటేగు" గారిని ఆహ్వానించుటకు దేశములో శాంతి వాతావరణ మేర్పడుటకు కారణమైనది. పిమ్మట దేశనాయకులందరును "ప్రయాగ" యందు 7-10-17 తేదీన సమావేశమై స్వరాజ్యాదర్శమును ప్రకటించుపట్ల శ్రీయుత లోకమాన్య తిలకు మహాశయుడు ఇట్లు ఉపన్యసించెను.]

"హోంరూల్" అనగా ప్రతివానికిని తెలియును. ("హోం" అనగా యిల్లు. "రూల్" అనగా పరిపాలన) "హోంరూల్" అనగా మన యిల్లును మనము చక్కబెట్టుకొను అధికారము మనకేయుండుట; ఇంతకంటె మరేమియు లేదు, ఆమాటకు అంతకంటె సూక్ష్మమైన యర్థము లేదు. "హోంరూల్" మనకెందుకు కావలెనని వేరే ప్రశ్నించుట కేమియు పనిలేదు. అది మనకు జన్మతో పుట్టినహక్కు. ఇంతవరకు మన వ్యవహారములను ఇతరు లెవరో చూచుచున్నారు. ఇప్పుడు మన వ్యవహారములను మనకే వప్పజెప్పవలసినదని కోరుచున్నాము. అట్లు వప్పగించుకొనుటకు మనకు పూర్ణమైన హక్కు గలదు. ఇట్టి హక్కు మనకు లేదని రుజువు పరచవలసిన భారము యితరులయందు గలదు. స్వరాజ్యము (హోంరూల్) అనునది క్రొత్తమాట గాదు. దీని అర్థము ఫలానాయని నిర్ధారణగ చెప్పగలము. తప్పర్థము చేసికొనుటకు వీలులేదు. కాని కొందరు దీనికి విపరీతార్థమును లాగి తనకేదో మేలుగలుగజేసికొన నెంచెదరు. మేము కోరినది ఉద్యోగస్థులు మారవలెననియే గాని కేవలము పరిపాలకులు (Rulers) మారిపోవలెనని గాదు. పరిపాలకులకును, ఉద్యోగస్థులకును భేదము గలదు. కాని "గవర్నమెంటు ఆఫ్ ఇండియా యాక్టు" వలన నియమింపబడిన ఈ ఉద్యోగస్థులే

మనమీద నిజమైన పరిపాలకులను సిద్ధాంతమును వారు చెప్పుచున్నారు. అయినను నాయభిప్రాయ మదికాదు. ఈ ఉద్యోగస్థులు ఎంతమాత్రమును మన పరిపాలకులు గారు. వారిక్కడ రాజునకు ప్రతినిధులుగ నున్నారేగాని వారే రాజుకాదు. మనము కూడ రాజునకు ప్రతినిధులమే! ఎందుకనగా, వారందరును మనరాజు క్రింది ప్రజలు; వారివలెనే మనము కూడ ఆ రాజుయొక్క ప్రజలమే. కనుక రాజునకు ప్రతినిధులుగా నుండు విషయమై మనమును ఆ ఉద్యోగస్థులును సమానపదవియందే యున్నాము; ఎక్కువ తక్కువలు లేవు, అట్లయినప్పుడు ఈ ఉద్యోగస్థులు తామే నిజమైన పరిపాలకులమని చెప్పుకొనుటకు తమ పదవియందేమి అధికృత కలదు? ఏమనగా, పార్లమెంటువారు చేర్పరచిన చట్టముల ననుసరించి వారికి కొన్ని అధికారము లివ్వబడినవి. అవియైనను వారు బలాత్కారముగా లాగికొనినవి గావుగదా ఇప్పుడా చట్టములను సవరించి భారతీయులకే ఆ యధికారములను ఇచ్చునట్లు తిరిగి చట్టమేర్పాటు చేసినయెడల, ఇప్పుడీ యధికారులున్న పదవులకే మన భారతీయు లందరును రాగలరు, ఇదియే స్వరాజ్యము (హోంరూల్): ఇంతకంటె వేరేమియు లేదు. చక్రవర్తి మారడు. భారతవర్షమునకును, సామ్రాజ్యమునకును గల సంబంధము దీనిలో ఏమున్నది? దీనినిగూర్చి ఇంత గందరగోళమెందుకు? కాకపోయిన, కొంతమందికి వారి ఉద్యోగములు పోవచ్చును. ఒకని అధికారమును తీసివేసి, మరియొకని కిచ్చినప్పుడు ఆ యధికారము వచ్చిన వానికి లాభమును, పోయినవానికి నష్టమును వచ్చును. ఆ నష్టము పొందినవానికి కోపమువచ్చినట్లయిన అది సహజము. నిజమే, కోపము వచ్చును. అట్లని, ఏ ఆంగ్లేయ రాజ్యాంగవేత్తయును, ఎప్పుడుగాని, తన ధర్మమును * నెరవేర్పకుండ ఉండగలరని నేను తలంచను. పది పదునైదు సంవత్సరముల క్రిందట స్వరాజ్యమును (హోం-రూల్ ను) గూర్చి మాట్లాడుటయే తప్పుగ నుండెను. ప్రజలందరును భయపడిరి. నేనుకూడ స్వరాజ్యమును గూర్చి మాట్లాడుటకు భయపడితిని. ఇప్పుడన్ననో, (భారతవర్షమువంటి) అస్వతంత్రరాజ్యము స్వరాజ్యము కావలెనని యాశించుట న్యాయసమ్మతమైన యాశయే యని అధికారవర్గము వారును న్యాయశాస్త్రవేత్తలును అనుగ్రహించియున్నారు. ఇదివరకు స్వరాజ్యమునకు వ్యతిరేకముగానుండు అదృష్టమును పోగొట్టుటకు మనకు పది సంవత్సరముల పోరాటము పట్టినది. ఇప్పుడది న్యాయమైన కోరికయని మనము మాట్లాడుకొనవచ్చును. వైస్రాయిగారును, మంత్రిగారును, ఆంగ్లేయ ప్రజలును మన ఇచ్చటి ఉద్యోగస్థులునుగూడ మనతో నేకీభవించియున్నారు. సరే ఇప్పుడు కావలసిన పని యేమిటి? దానిని మనము కోరుట మంచిదేయని అందరును అన్నారు. కాని దానికి కాలపరిమితి యుండవలెను. కొన్నివందలయేండ్లు గడచినగాని మనకు స్వరాజ్యము

* మనకు స్వరాజ్యము నొసంగుటయే అతని ధర్మము.

లభింపదని చెప్పుచున్నారు. ♦ వలసరాజ్యములకు స్వరాజ్యము 50 లేక 60 సంవత్సరములలోగాని రాలేదనికూడ చెప్పుచున్నారు. నేను జెప్పు ప్రత్యుత్తర మేమనగా:— నిజమే వలసరాజ్యములు 50, 60 సంవత్సరములలో స్వారాజ్యమును పొందినవి. కాని భారతీయులు 100 సంవత్సరములనుండియు ఆంగ్లేయులచే పరిపాలింప బడుచున్నారు. ఐనను వారి శిక్షితపడినను స్వరాజ్యము రాలేదు. అధికారవర్గమువారు (ఏదియో యొక) కాలపరిమితిని ఏర్పాటు చేయవలెను. ప్రస్తుతము కనుచూపుమేరలో ఎచ్చటను లేదని వారు తెలవిచ్చుచున్నారు. ఇది కేవలము స్వార్థపరత్వమువలన చేయువాదమని నాయుక్తిప్రాయము. యుద్ధము పూర్తికాగానే, కొద్ది సంవత్సరములలో, సామ్రాజ్యమునందంతటను క్రొత్తఏర్పాటులు జరుగుతరుణమున మనదేశముయొక్క వాంఛకూడ సిద్ధించుటకేమి యభ్యంతరమున్నది? ప్రస్తుతము హిందూదేశము సామ్రాజ్యముయొక్క మెడలో పెద్దబండిరాయిగా నున్నదిగాన మరేమియు లేదు. ఈ నూరు సంవత్సరముల నుండియు ఈ యధికార వర్గము వారు భారతవర్షమును ఏవిధముగా పాలించిరో మనమెరుగుదుము. అంతఃకలహపూర్ణము మనము స్వతంత్రపరిపాలన గల జాతివారము. సైన్యములనెట్లేర్పరచుకొనవలెనో మనకు తెలియదు. న్యాయాన్యాయ విచారణ తెలియదు. మనకును శాసనములు, చట్టములు మొదలగునవి కలవు. ఇప్పుడవి యన్నియును ఊడ్చిపెట్టుకొని పోయినవి. పైగా దానిని గురించి మన కేమియు తెలియదని అధికారవర్గము వారు మనల ననుచున్నారు. దీని కెవరు కారకులు? భారతీయులు కారు. ఆంగ్లేయులు ఇచ్చటికి వచ్చినప్పుడు ఇక్కడ అప్పుడున్న అల్లరులను అణచిరి. ఇది వారు మొదట తీసుకొన్న జాగ్రత. దీనికి వారిని కొనియాడవలసినదే. ఈపనిని వారెట్లు జేసిరి? మొట్టమొదట మనలను నిరాయుధులను జేసిరి. తరువాత ప్రభుత్వములో నుండు గొప్ప గొప్ప ఉద్యోగముల నన్నిటిని వారే ఇజారా పాడిరి. (ఇజారా అనగా ఇతరుల కెవరికిని పాలు లేకుండ తామే యాక్రమించుకొనుట.) పిమ్మట శాస్త్రసంబంధమైన (Scientific) విద్యకు విఘ్నములను గల్పించిరి. తోడనే పరిశ్రమలు (చేతిపనులు) మూలకూలినవి. కాని దేశములో శాంతిస్థాపన చేసినామని మాత్రము చెప్పుచున్నారు. అది నిజమే. కాని మనకు కావలసినది దేశశాంతియొక్కటి మాత్రమే గాదు, ముందు కావలసిన దేశాభివృద్ధి కది ప్రథమ సోపానము. దేశములో శాంతిని స్థాపించిరి. తంత్రీవార్తలు తపాలాఫీసులు మొదలగువానిని ఏర్పాటుచేసిరి. వీని కన్నిటికిని అధికారవర్గమువారు మన మెప్పునకు పాత్రులే. కాని మన జాతియందు స్వభావసిద్ధమైన అభిమానము మనకు కలుగునటుల చేయక పోయినందులకు మాత్రము మనము వారిని మెచ్చుకొనజాలము. మనకాళ్ళమీద

---

♦ ఇవి ఆస్ట్రేలియా కనడా మొదలగు ఆంగ్లేయులకు లోబడియున్న దేశములు. ఈ దేశములకు మొదట ఆంగ్లేయులు వలసపోయిరి; అనగా తమ దేశములో చోటు లేక కాపురముండుటకు అచటకు బోయిరి. ఈ దేశములకు ఆంగ్లేయ సామ్రాజ్యమునకు లోబడిన స్వరాజ్యము గలదు. మనము గోరునదియు నట్టిదే.

చాంబేలు మంత్రిగారిచ్చటికి వచ్చినప్పుడు మన వాంఛలనుగూర్చి ఆయన పెద్ద పెద్ద నాయకులందరిని ప్రశ్నించెను. అప్పుడు నాయకులందరును ఏకీభావమైన ప్రజల యూహాపోహమును బహిరంగపరచవలెను. (అనగా ప్రజల యభిప్రాయమును స్పష్టముగా తెలియ బలుకవలెను.) ఇట్లు జేసినయెడల చాంబేలుమంత్రి మన సందేశమును బ్రిటిషు ప్రజల యొద్దకు తీసికొనివెళ్ళి, తన యధికార పదవియొక్క పలుకుబడిచేత దానిని నిలువబెట్ట గలడు.



# లోకమాన్యుని ఉపన్యాసములు

## 7. స్వరాజ్యము (హోంరూల్)

(1917 సం॥ అక్టోబరు 8 తేదీన ప్రయాగలో నిచ్చిన ఉపన్యాసము)

[పండిత మదనమోహనమాలవ్యగారి అధ్యక్షత క్రింద "హోంరూల్-లీగ్" ఆవరణలో ఇచ్చిన యుపన్యాసము]

స్వరాజ్యము ఇవ్వకూడదని చెప్పు అభ్యంతరములలో నొకటి యేమనగ:— స్వరాజ్య మిచ్చినయెడల భారతవర్షమునుండి ఆంగ్లేయులను వెళ్ళగొట్టుదురట. భారతీయులకు ఆంగ్లేయులు గావలెను. ఆంగ్లేయుల స్వాతంత్ర్యము గావలెను. ఆంగ్లేయుల సంస్థలు (ఏర్పాటులు) గావలెను. ఆంగ్లేయుల సామ్రాజ్యము కావలెను. కాని మనము చెప్పున దేమనగ, భారతవర్షమందలి అంతరంగిక రాజ్యాంగ వ్యవహారముల పాలన యావత్తును భారతీయుల చేతిలోనే యుండవలయును. ఈ పద్ధతి ఆంగ్లదేశమునందు ఆంగ్లేయులకున్నది. వలసరాజ్యములవారికున్నది ఎచ్చట జూచిననచ్చటి వారే గోరుచుందురు. దానిని వారి కివ్వక పోయినయెడల దానికొరకై పోరాడెదరు. అయినను కొంతమంది దానిని భారతీయులకు మాత్ర మివ్వకూడదని వాదించుచున్నారు. ఆంగ్లేయులను భారతవర్షమునుండి వెళ్ళగొట్టుదురను పిచ్చియూహ నెవ్వరు పుట్టించిరి? ఎందుకు పుట్టించిరి? ముందు ఈ సంగతిని బాగుగ అర్థము చేసికొనవలయును. దీనియర్థమును మన దేశస్థులు తెలిసికొన్నారు. కాని ఆంగ్లేయులుకూడ ఈ సంగతిని సరిగ తెలిసికొనునట్లు చేయ జూచుట పనియై యున్నది. భారతీయులు స్వపరిపాలన కర్హులు కారనియు, స్వరాజ్యము (హోంరూల్) అను మాటయందిమిడియున్నంత ఎక్కువ సమర్థతతో తమ్మును తాము పరిపాలించుకొన లేరనియు, ప్రస్తుతాధికార పదవులయందున్న వారు తలంచుచున్నారు. మనలను మనము ఎప్పుడు పరిపాలించుకొన గలుగుదుమో వారు మనకు చెప్పియుండలేదు. కాలపరిమితి ఏర్పరచి యుండలేదు. ఆసియాఖండ దేశస్థులు స్వపరిపాలన కెంతమాత్రమును అర్హులు కారనియే ఇదివరకు వాదుకగా చెప్పుచుండిరి! * కాని ఇప్పుడా సంగతిని మానివేసినారు. ప్రస్తుతము హిందూదేశము సమర్థత గలది కాదనిమాత్రము ఇప్పుడు చెప్పుచున్నారు. మేమెందుకు సమర్థులము కాము? అని మన మడిగిన యెడల, "స్వరాజ్యమన

* ఎందుకనగా ఆసియాఖండ దేశస్థులే యైన జపానువారు యూరపుఖండ దేశస్థులైన రష్యావారిని ౧౯౦౫-వ సంవత్సరమున ఓడించి ప్రసిద్ధి కెక్కి, ఆసియాఖండస్థులు గూడ స్వరాజ్యమున కర్హులని ప్రపంచమునకు జాటిరి.

నేమో ఇదివరకు మీ రెప్పుడును ఎరుగరు. మీలో చదువులేదు. అనేక జాతిమత భేదములుండి మీలో మీరు పోట్లాడుకొనుచున్నారు. కనుక ఆంగ్లేయ పాలకు లుండినచో మీ యందరి మధ్యను తగవులను తీర్చి పాలింప సమర్థులు" అని ప్రత్యుత్తరము జెప్పుచున్నారు. మన సమర్థతను గూర్చి నిన్నటిదినము కొంత చెప్పియున్నాను. దానినే యిప్పుడు వివరించి చెప్పవలసియున్నది. అసమర్థత యన నేమి? ఆంగ్లేయులు రాక పూర్వము మన దేశములో నెచ్చటను శాంతికరమైన పరిపాలన లేదనియా వారి యభిప్రాయము? అశోక చక్రవర్తి యెవరు? అతను చేతగానివాడా? ఏ ఆంగ్లేయుడును ఆ మాట యనలేదు. హిందువులు పరిపాలించినప్పుడు విచారించండి. అశోకుడు, గుప్తవంశపు చక్రవర్తులు, రాజపుత్రులు, ఆంధ్రులు మొదలైన వారియొక్క గొప్ప గొప్ప సామ్రాజ్యములు లేవా? ఇవన్నియు ఏ విధమైన పరిపాలనా పద్ధతియు లేకనే పాలింపబడినవని చరిత్రలో నెచ్చటను చెప్పబడియుండలేదు. జర్మనీ ఇటలీ సామ్రాజ్యములవంటి సామ్రాజ్యము లనేకములు పూర్వము మన భరతవర్షమునం దుండెడివి. అవి యన్నియు శాంతికరముగనే పరిపాలింపబడినవి. పూర్వ మీ దేశమున హిందూ మహమ్మదీయ బౌద్ధపాలకుల యేలుబడిక్రింద దేశము శాంతియుతముగ పరిపాలింపబడి యుండగా, ఆ సామ్రాజ్యములను పాలించిన ఆ ప్రజల సంతతివారమేయైన మనము ఈ దినము అట్టి యధికారములనే వహించుటకు (అట్టి హక్కులనే అనుభవించుటకు) అసమర్థులని చెప్పుటకేమి హేతువుగలదు? తెలివి తేటలయందు గాని, దేహబలమునందు గాని, ఏవిధమైన లోపమును లేదు. ఎట్టి సామ్రాజ్యపాలన యందైనను పాల్గొనుటకు మనము అసమర్థులము గాము. మనకు సమర్థత గలదని పూర్వకాలము నందు చూపియుంటిమి. అవకాశములను ప్రసాదించిన యెడల ఇప్పుడుకూడ చూపగలము. మనము అసమర్థులమని చెప్పునది కేవలము అధికారము నంతను ఇజారాపాడి తమచేతులలో నుంచుకొనిన అధికారవర్గము వారే! ('ఇజర పాడుట యనగ, యితరుల కెవరికిని హక్కు లేకుండ, సమస్తము తమ చేతులలోనే యుంచుకొనుట) ఈ సమర్థత మనకు ప్రతివిషయములోను కలదని వారు చాటిరి. "ఈస్టిండియా కంపెనీ" వారుకూడ మన అసమర్థతనే చాటుచుండిరి. పూర్వము పెద్ద రాజ్యములను స్థాపించి పరిపాలించిన వారి సంతతివారై, ఇప్పుడిచ్చట కూర్చునియున్న వారిలో నెవ్వరును, హిందూదేశస్థులందరును-(హిందువులైనను, మహమ్మదీయులైనను)- తమ్ముతాము పరిపాలించుకొన సమర్థులు కారను వాదముతో ఏకీభవింప జాలరు. మనము అసమర్థులమని చెప్పునది తమ స్వలాభమును చూచుకొనువారే. ఏందుకనగ, ఏదో వాదమును వాదించిన గాని వారికి లాభము గలుగదు. మన సమర్థతను జూపుటకు మనకు పెద్ద పెద్ద ఉద్యోగము లివ్వరు. ఏవియో చిన్నచిన్నవి మాత్రము యిచ్చెదరు. ఈ చిన్న యుద్యోగములను సైతము మన దేశస్థుల కివ్వక పోయిన యెడల మన దేశమును పరిపాలించుటకు వారికి సాధ్యము కానేరదు. మన కేవో చిన్న యుద్యోగములను మాత్ర మిచ్చుచున్నారు. కాంగ్రెసు సభ నేర్పరచి నప్పటినుండియు పెద్ద ఉద్యోగములకున్న ఈ ఇజరాను తీసివేయు నిమిత్తము మనము

పోరాడుచున్నాము. కొంతవరకేదో లాభములేక పోలేదు. "సివిలు" ఉద్యోగములలో ఏవో కొన్ని మన కిచ్చినారు. "హైకోర్టుజడ్జి" మొదలైన న్యాయపరిపాలనకు చెందిన ఉద్యోగము లిచ్చినారు. దీని ఫలితమేమి? భారతీయులకు జవాబుదారీ (బాధ్యత) గల పెద్ద ఉద్యోగముల నిచ్చినప్పుడు వారు వానిని నిష్ప్రయోజన పరచుకొనిరని గాని, కావలసినంత సమర్థతతో పరిపాలింపలేక పోయిరని గాని, గవర్నమెంటువా రెప్పుడును తీర్మానించినట్లు నేను చూచి యుండలేదు. ఇట్టివిలేవు సరిగదా, గవర్నమెంటు మెంబర్లుగానున్న గొప్ప భారతీయు లందరును మిక్కిలి సమర్థతతో తమ కార్యములను నిర్వహించినట్లు గవర్నమెంటువారి తీర్మానములే పెక్కులు గలవు. మన స్వదేశ సంస్థానములకు పోయి చూచినయెడల అచ్చటి గొప్పపదవులన్నియు భారతీయుల చేతులలోనే కలవు. ఈ సంస్థానములను గూర్చి గవర్నమెంటువారి రిపోర్టులలో ఏమియున్నది? అవి మిక్కిలి బాగుగ పరిపాలింపబడుచున్నవని గవర్నమెంటువారి రిపోర్టులే చాటుచున్నవి. ఈ సంగతులన్నియు కూడ మన కనుకూలముగనే యున్నవి. మనకు పెద్దయుద్యోగము లియ్యకుండచేసి, మనము సమర్థులము గామని చెప్పుట కేవలము అన్యాయము. అన్యాయముచేసి పైగా చేతగాదని చీవాట్లా! ఈ మాయవేషము పనికిరాదు. సీమలోనుండు ఆంగ్లేయ ప్రజాపాలకులు దీనిని సహింపజాలరు. నిజమైన స్థితిగతులను వారికి నచ్చచెప్పిన యెడల వారు శ్రద్ధతో వినెదరు. వినుటకు సిద్ధముగనున్నారు. ఇదియే సమయము. న్యాయము మన పక్షమున నున్నది. ఒక్క న్యాయము మనపక్షమున నున్నదనిన చాలదు. దీని ననుసరించి నిరంతరము ఎడతెగని ఆందోళనమును, మన సత్యము నెరవేరువరకు దృఢమైన పట్టుదలయును, తోడైయుండిననే గాని ప్రయోజనములేదు. సత్యమే జయము గాంచునట్లు చేయుటకు మనము కృతనిశ్చయులమై యుండవలయును. ఈ జయమునే మనము కాంక్షించునది. ఈ స్వరాజ్యాందోళనము దీని కొరకే ఉద్దేశింపబడినది.

స్వరాజ్యమివ్వకూడదని చెప్పువాదములలో రెండవది యేమనగ:—స్వరాజ్యమిచ్చినయెడల ఇచ్చటగల కొంతమంది ఆంగ్లేయులకు లాభములు వచ్చు * ఏర్పాటులకు నష్టము వాటిల్లునట! అట్టి యేర్పాటులు మనఒక్క ఈ భారత వర్షమునందే గాక ప్రపంచమంతటను గూడ గలవని ♦ "జిన్నా" గారు ఇదివరకే చెప్పి

* కొంతమంది దొరలీ దేశములో తమ డబ్బును వర్తకపు కంపెనీల మీదను, రైళ్ళమీదను, అభ్రపుగనులు, బొగ్గుగనులు మొదలగు వాని మీదను మరియింక ననేక వ్యాపారముల మీదను పెట్టుబడి పెట్టియున్నారు. తన్మూలమున విశేషలాభమును తీయుచున్నారు. మనకు స్వరాజ్యమిచ్చిన యెడల వీరి పెట్టుబడికి, వీరి లాభములకు నష్టము వచ్చునని వీరి భయము.

♦ "జిన్నా"గారు మహమ్మదీయ నాయకులలో అగ్రగణ్యులు. సామ్రాజ్య శాసన నిర్మాణసభయందు ప్రతినిధులు. కాంగ్రెసు-మాస్లెము లీగుల సమ్మేళనమునకును, తద్వారా హిందూ మహమ్మదీయ ఐక్యమునకును ముఖ్య కారకులు,

యున్నారు. నిజము మాట్లాడిన యెడల, అట్టియేర్పాటులను వారు మన భారతీయుల అనుమతి లేనిదే మొదట నిచ్చట ఏర్పాటు చేసికొనిరి. వానిని చేసికొనినప్పుడు వారు మనతో చెప్పియుండలేదు. మన ఆందోళన నాపుటకు ఎవరికిని హక్కు లేదు. న్యాయమైనంతవరకు అట్టి ఆంగ్లేయుల ఏర్పాటులకు భంగము కలుగకుండ కాపాడెదము. దేశములోని న్యాయ చట్టములట్లే నిలచియుండును. కచ్చేరీలన్నియు అట్లేయుండును. కొన్ని మార్పులుమాత్ర ముండును. కాని ఆమార్పులు అధికారములో నుండునుగాని, తక్కినవన్నియు అట్లేయుండును. మనకును న్యాయచట్టములు గావలెను, చట్టములు లేనిది మన మేమియు చేయజాలము. స్వరాజ్య మిచ్చిన యెడల దేశము అరాచకమగునని తలంచుట శుద్ధవెఱ్ఱిమాట. మనకును న్యాయచట్టములు గావలెను. గవర్నమెంటువారి డిపార్టుమెంటు లన్నియు కావలసినదే. సి. ఐ. డి. గూఢచారులును, పోలీసు ఉద్యోగులును రాజ్యాంగమునకు అవుసరమేను. ఇప్పుడెంతమంచిపాలన అగత్యమో, అప్పుడును అవుసరమే. అరాచకములోనికి పోవలెననిమాకులేదు. మనముకోరునదేమనగ:-ఆచట్టములును, ఆశాసనములును మనచేతిలోనే ఉండవలయును. వీనినిఅమలులోపెట్టి రాజ్యాంగముల నన్నిటిని నడుపు అధికారము యావత్తును కూడ మన చేతులలోనే యుండవలయును. నేను నిన్నటిదినమే "ఆగ్రా" జిల్లాలోని అల్లరులనుగూర్చి "పయనీరు" పత్రికయందు చదివియుంటిని. గవర్నమెంటువారు ప్రజలను చక్కగా పరిపాలింపుచు, తమ విధులను క్రమక్రమముగ నెరవేర్చుటకు తగు జాగ్రత పుచ్చుకొని, పిమ్మట అట్టి యల్లరుల నణచవలయునని గవర్నమెంటువారిని ప్రజలు ప్రార్థించినట్లు ఆ పత్రికలో వ్రాయబడియున్నది. దానిని బట్టి, మన మందరమును స్వరాజ్యపాలన క్రింద ఇట్టి అల్లరులను సహింతుమనియా అర్థము ? ఎన్నటికినిగాదు. మనకును దేశములో నెమ్మది కావలయును. కాని అప్పుడు ఇట్టి యల్లరులు జరుగకుండ చేయుటకు తగిన శాసనములను ప్రజానుమతిమీద మనమే నిర్మించుకొనెదము. కాని ప్రజలందరి అనుమతి లేనిది మాత్రము అట్లెప్పుడును శాసనములు పుట్టజాలవు. ఇక ఉద్యోగములను గూర్చి చెప్పెదను. మనకు స్వరాజ్యము వచ్చినను యూరపియనులకు గూడ ఉద్యోగములనిచ్చెదము. వారా పనిచేయుటకు సమర్థులై యుండి, మన మిచ్చు జీతములతో తృప్తిజెంది, మన కొలువులో నుండుటకు ఇష్టపడి, అందులకు సంసిద్ధులైయున్న యెడల వారిని కూడ మనము ఉద్యోగస్థులనుగ ఏర్పరచుకొందుము. భారతవర్షమునుండి ఎవరినిగాని వెళ్ళి పొమ్మని మనము చెప్పము. ఇచ్చట ఆంగ్లేయులు కొంతమంది తమ ధనమును రైళ్ళ వగైరాలమీద పెట్టుబడి పెట్టియున్నారు. కాని మనమా రైలుపట్టాలను పీకి పారవేసి, మీరు మీ దేశమునకు వెళ్ళిపోవలసినదని వారిని తరిమివేయము. మనకును రైళ్ళు గావలయును. కాని రైళ్ళ డిపార్టుమెంటులోని ఉద్యోగము లెక్కువగా మన దేశీయుల కిచ్చిన యెడల మనము వానిని ఎక్కువ బాగుగా నడుపగలము, స్వరాజ్యము వచ్చిన యెడల కొన్ని మార్పులు కలుగగలవు. కాని ఆ మార్పుల వల్ల దేశమున కింతకంటె చెరుపు గలుగదు. అదిగాక దేశమును ఇంతకంటె ఎక్కువ సమర్థత తోడను,

ఎక్కువ పొదుపుగాను, జాగ్రతగను పరిపాలింప గలుగుటకు వీలుకలుగును. మన కోరిక వివేకవంతమును న్యాయసమ్మతమును నైయున్నది. కాని బ్రిటిషు ప్రజాపరిపాలకులు మన మడుగువానిని ప్రసాదించెదరో, లేదో, చూడవలసియున్నది. బ్రిటిషు ప్రజలిప్పుడు సామ్రాజ్యమునం దంతటను క్రొత్తమార్పులు జేయుటకు కుతూహలు అయియున్నారు. కనుక మన మొరలను వారికి ఇదివఱకు కంటె ఎక్కువగా దెలియునటుల గట్టిగా మనము ఇప్పుడు చెప్పుకొనవలసి యున్నది. ఇదియే సమయము. కొందరు స్వార్థపరులు మన సంగతిని వారికి తెలియకుండ చేసి, మన నిజ స్థితిగతులను గూర్చి వారికి దురూహలు పుట్టునటుల, మనకు వ్యతిరేకముగ మనయందు వారికి తప్పు డభిప్రాయములను పుట్టించుచున్నారు. మనము వారి నట్లుచేయ నీయగూడదు. ఈ విషయమై కాంగ్రెసు కమిటీలకంటె స్వరాజ్యసమితులే ఎక్కువ పని జేసినవి. మన దేశములో కాంగ్రెసు సభ ఉన్నప్పటికిని, మన మందరమును ఈ కాంగ్రెసు సభకువ్యతిరేకముగ స్వరాజ్యసమితులలో జేరి పనిజేయుచున్నామని కొందరనుచున్నారు. ఇట్లెంత మాత్రమును గాదు. కాంగ్రెసు కోరుకోర్కెలను ఆశలను ఈ స్వరాజ్యసమితుల కోర్కెలును ఆశలును-అన్నియును ఒక్కటియే. ఈ సంగతియే స్వరాజ్యసమితుల పీఠమునుండి అనేక సారులు ఉద్ఘోషింపబడి యున్నది. కాంగ్రెసు ఆదర్శములకంటె వీరు ఎక్కువ కోరియుండలేదు. కాంగ్రెసువారిచే క్రిందటి సంవత్సరము ఆమోదింపబడిన స్వరాజ్య తీర్మానము అసలు ఈ స్వరాజ్యసమితుల ప్రోత్సాహము వలననే ఆమోదింపబడుటకు కారణమైనదని నేనుగట్టిగ చెప్పగలను. కనుక కాంగ్రెసునకును, ఈస్వరాజ్యసమితులకును అభిప్రాయ భేదమే మాత్రమును లేదు. అట్లయిన యెడల, స్వరాజ్యసమితులుండుట కవుసర మేమని కొందరడుగవచ్చును. దీనికి ప్రత్యుత్తరము ఆ సమితులు చేసిన పనియే చెప్పక చెప్పుచున్నది. జనులలో విద్య వ్యాపింప జేయుటకును, మన ఆదర్శము లిట్లుండవలయు నని వారికి తెలియజెప్పుటకును ఈసమితు లేర్పరుప బడినవి. కాంగ్రెసువారే ఈ పనిని నెరవేర్చి యుండిన యెడల నేనిప్పుడు తక్షణము ఈ స్వరాజ్యసమితితో సంబంధము వదులుకొనుటకు సంసిద్ధుడనై యున్నాను. వారికంటె ఎక్కువ ఉత్సాహముతో పనిచేయవలయునని కొందరికి కోర్కెగలదు. ఈపనిని ఎవరికిష్టమైన వారే చేయవలయునని కొందరికి కోర్కె గలదు. ఈ పనిని ఎవరి కిష్టమైన పేరుతో వారు చిన్నచిన్న సమితుల నేర్పచుకొన వచ్చును. అందరియొక్క ఆదర్శము ఒక్కటియే. సమితుల మూలమున గాని, సంఘముల మూలమున గాని, లేక స్వంతముగ గాని, ఎవరియిష్టము వచ్చిన పేర్లతో వారే ఎవరి మార్గమున వారే, స్వరాజ్యమునకై పాటుపడవలయుననియే కోరుచున్నాడను. ఎల్లర అభిప్రాయ మొక్కటియే యైనప్పుడు పేర్లతో పనిలేదు. ప్రతిరాష్ట్రములోను ఆయారాష్ట్ర భాషలలో పని జేసిన గాని ప్రజలకీ విషయమై తెలియజాలదు. ఇదివరకొకప్పుడు స్వరాజ్యము

(హోంరూల్) అనుపేరు జెప్పగనే మనము "ఐరిషు" *ప్రజల పద్ధతుల నవలంబించుచున్నామని గవర్న్మెంటువారు అనుమానపడిరి. ఆపేరుతో సంబంధించిన 'ఐరిషు' ప్రజల తిరుగబాటులు జరుగునేమోయను భీతితోడను అనుమానముతోడను మన ప్రయత్నముల నన్నిటిని ప్రభుత్వమువారు (ఓరకంట) కనిపెట్టి చూచుచుండిరి. మనము చేయు నేపనిని జూచినను వారికి ఏవో "ఐర్లండు" దేశములో జరిగిన సంగతులు జ్ఞాపకము వచ్చుచుండును. పైపై మాటలనుబట్టి అర్థము తీయుగూడదు. మన కొరకు మాటలు పుట్టినవిగాని, మాటల కొరకు మనము పుట్టలేదు. స్వరాజ్యము (హోంరూల్) అనగా ఫలాని అర్థమని మొదట జెప్పుకొని, ఆపేరును మన ముపయోగించిన యెడల దాని కభ్యంతర మేమున్నది? కనుక దాని విషయమై తగాదాలేదు. ఇప్పుడు నిజమైన తగాదా మాటల విషయమైకాదు. ఇప్పుడు కావలసినది ప్రజలను విద్యావంతులను జేయుట. మనమాపనికి పూనుకొన్నందున అధికారుల కది కంటకముగా నుండవచ్చును. ఎందుకనగా, ప్రజలు కన్నిసంగతులును తెలిసి, విద్యావంతులైన యెడల మాకు స్వరాజ్యము కావలయునని ప్రజలందరు కలసి తమకు వత్తిడికలిగింతు రను భయము వారికిగలదు. ఈ సంగతి నాకు తెలియును. అయినను మన మది అత్యము చేయగూడదు. మనము చేయు పనినంతయును ఉద్యోగస్థుల సానుభూతిని, సహాయమును, పొంది చేసిన యెడల బాగుండునని మన మందర మొకప్పుడు తలంచియుంటిమి. నిజమే, వారి సహాయముకూడ మనకు కావలయునని మన మిదివరకు కోరినాము. కాని వారి సహాయము కొరకు ఆశపడినప్పుడు, మనపనిని తగ్గించుకొనవలసివచ్చిన యెడల, విద్యావ్యాపక విషయమైన మన ప్రయత్నములను తగ్గించుకొనవలసి వచ్చిన యెడల, అట్టి సహాయము మన కక్కరలేదు. మనయందరియొక్క గమ్యస్థానము స్వరాజ్యమేయని మందర మేకాభిప్రాయులమై యున్నారము. దానికై మన మందరమును పాటుపడవలయును. పాటుపడుట ఎట్లని మీ రడుగవచ్చును. కొందరు త్వరత్వరగాపోవలెననిరి; మఱి కొందరు నెమ్మది నెమ్మదిగా పోవలెననిరి. ఇది యొక పెద్దకారణముగా బెట్టుకొని మనలో మనము తగవులాడి, ఇతరులకు తావిచ్చుట, ఇతరులచేత మనలో నిట్టి భేదములున్నవని వ్రేలుపెట్టి చూపించుకొనుట, తగదని నా యభిప్రాయము. ఈ భేదమునే మనకు వ్యతిరేకముగ ఇతరులు ఉపయోగపరచుకొనునట్లు మనము వారికి తావిచ్చుట తగదు. త్వరలోనైన నేమి? నెమ్మదిగా నైననేమి? ఈ పద్ధతి, ఆపద్ధతి అను మాటలతో పనిలేదు. శాసన సమ్మతముగ నున్నంతవరకు ఏదియైన నొక్కటియే. ప్రతివాడును శాస్త్రసమ్మతమైన శాసనమునకు లోబడి యుండవలెనని కోరుచున్నాను. రాజ్యాంగనిర్మాణశాస్త్రము (Constitution) వేరు-చట్టములు (Laws) వేరు-చట్టములను నిర్మించు అధికారము మనకు లేనంతవరకు న్యాయ శీలములకు విరుద్ధములై,

---

*ఐర్లాండు దేశములోని ఐరిషు ప్రజలు అనేకవందల సంవత్సరముల నుండియు మనవలెనే స్వరాజ్యమునకై ఆందోళన జేయుచున్నారు. వారు అనేకసార్లు గవర్న్మెంటువారి మీద తిరుగబడిరి.

నీతి మారమూలైన చట్టములు అప్పుడప్పుడు గావింపబడుచునే యుండును. (ఉదాహరణ, ఇప్పుడు నూతనముగ గావింపబడిన "రౌలత్తు శాసనము") అట్టి చట్టములకు మనము విధేయులమై యుండజాలము. అట్టి చట్టములను సాత్వికముగ నిరోధించుటయే మనకు ముఖ్యసాధనము. (ఇదియే గాంధిగారుపదేశించిన సత్యాగ్రహవ్రతము) ఈ సాత్విక నిరోధమనునది మన ఆదర్శమును పొందగలుగుట కొకసాధనమే గాని, ఇదియే మనకు పరమావధి గాదు- (సత్యాగ్రహము) లేక సాత్విక నిరోధమనగానేమి?- ఒక చట్టమునకు మనము బద్ధులమైయున్న యెడల మనకు దానివలన కలుగగల లాభనష్టములను బాగుగ విచారించి చూచి దానికి బద్ధులము గాకుండుటయే యని యెరుగవలెను. బాగుగ విచారించిన మీదట కొన్ని సందర్భములలో చట్టమునకు అవిధేయులమై యున్న యెడల మన కెక్కువ లాభము కలుగగలదని దృఢనమ్మకము మన మనస్సునకు గట్టిగ తోచి నట్టయిన మన మట్లు అవిధేయులమై యుండుట న్యాయమని మనశీల వృత్తము మనకు బోధించును. ఇది మిక్కిలి కష్టమైన సమస్య. ఇది ఇప్పుడిట్టి పెద్ద సభలో తేలజాలదు. దీని పర్యవసానమును దేల్చుటకు మన నాయకులకే వదలి వేయుట ఉత్తమము. సాత్విక నిరోధమన నేమియో మనము బాగుగ తెలిసికొనవలెను. సాత్విక నిరోధమనగా మన మేర్పరచుకొనిన ఆదర్శము నెరవేర్చుకొనుటకు నిశ్చితాభిప్రాయులమై యుండుట. ఇట్టి పనికి ఇతరులు అడ్డమువచ్చి, అన్యాయమైన చట్టములచేతను, ఇతర చిక్కులచేతను, మరి ఇతర కల్పనలచేతను, మనల నభ్యంతర పరచిన యెడల, అట్టివానితో పోరాడి వాని నవలకు ద్రోసి జయము గాంచుటయే సాత్విక నిరోధముయొక్క సారము. ఇది మన ధర్మమైయున్నది. స్వరాజ్య సమితులు చెప్పు సంగతి ఇదియే. సాత్వికనిరోధమను పదము ఉపయోగించుట కిష్టము లేనియెడల, "ఎన్ని కష్టముల కోర్చియైనను" అనుపదముల నుపయోగింపవచ్చును. ఏ మాటల నుపయోగించినను యీ రెంటి యర్థ మొక్కటియే. అట్లని న్యాయవిరుద్ధముగ గాని, తిరుగుబాటు తనముగ గాని సంచరించవలయునని నేచెప్పుటలేదు, మన మనోవాంఛాఫలసిద్ధికై ఎన్నికష్టములు వచ్చినను, పాటుపడి జయము గాంచుటకు తగిన * ఆత్మశక్తి మనలో నుండవలెనని మాత్రము చెప్పుచున్నాను. సత్యాగ్రహము కేవలము శాస్త్ర సమ్మతము. చట్టములు (Rules) వేరు, రాజ్యాంగ నిర్మాణశాస్త్రము (Constitution) వేరు. ఈ విషయమునే చరిత్ర చాటుచున్నది. ఒక చట్టము ఎంతకాలము న్యాయవిరుద్ధమును, ధర్మవిరుద్ధమును, ఈ 20-వ శతాబ్దములో బహుజనాభిప్రాయమునకు విరుద్ధమును, అయియుండునో, ఎంతకాల మది ఇట్టి మూలసూత్రములకు విరుద్ధమైయుండునో, ఎంతకాల మీ యుగ నీతికి విరుద్ధమై యుండునో—అంతకాలమును అది పాలకుల చట్టనిర్మాణమును అనుసరించియున్నను శాస్త్రసమ్మతము కానేరదు. ఈ భేదమునే మన మందరము తేట తెల్లముగా గ్రహింపవలెను. శాస్త్రసమ్మతము (Constitution)

---

* ఇదియే సత్యాగ్రహవ్రతము అనగ "సత్యదీక్ష"

వేరు చట్టసమ్మతము (Rules) వేరు. రెంటిని గూర్చి గల్లంతుపడకూడదు. కనుక మన మందరము శాస్త్రసమ్మతమైన త్రోవలనే పోవలెను. నిజమూరసిన యెడల * గవర్నమెంటువారిచే ఏర్పాటు చేయబడిన ప్రతిచట్టమును శాస్త్రసమ్మతము గానేరదు — మీరు బాగుగా గ్రహించవలయునని నే జెప్పున దీవిషయమే. ముందు ప్రజలను విద్యావంతులుగ జేయవలెను. పిమ్మట నిష్కళంకమైన రాజకీయాదర్శమును వారియెదుట నుంచవలెను. న్యాయాన్యాయములను తేటతెల్లముగ విమర్శించి తెలిసికొనునట్లు చేయవలయును. న్యాయబుద్ధి కలిగినపుడె వారే జను యాదర్శ ప్రాప్తికై తమ శక్తినంతను ధారపోసి, పాటుపడి ఎట్టి కష్టములు వచ్చినను చలింపక దృఢసంకల్పముతో న్యాయపథమును వీడక, జయము గాంచగలుగుదురు.

మీ రందరును ఎక్కువగా స్వరాజ్యసమితులలో చేరి, ఈ విద్యావ్యాపనకై పాటుపడవలయును. నిద్రనుండి మేల్కొని అత్యుత్సాహముతో పనిచేయ వలయును. మనమట్లు చేయని యెడల దేశమున కరిష్టము కలుగగలదు. మన మందరమును పాడగుటయే గాక, ముందు రాబోవు మన సంతతి వారిని గూడ నాశనము జేసిన వారమగుదుము. స్వరాజ్యప్రాప్తికై మన మిప్పుడు పాటుపడని యెడల భవిష్యత్సంతతి వారు మనలను నిందించెదరు. మనము నెరవేర్పవలసిన ఈ విధి మన ఒక్క భవిష్యత్సంతతి వారి కొరకే గాక, మన దేశము కొరకును, వీనియన్నిటికంటె ఎక్కువగా భగవత్ప్రీతి కొరకును మనము చేయవలసియున్నది. ఈ ప్రపంచమున నుండు అన్ని జాతులవారిని అన్ని సామ్రాజ్యముల వారిని పరిపాలించు ఆ సర్వేశ్వరుని ప్రీత్యర్థము మన మీస్వధర్మమును నెరవేర్పవలసి యున్నది. ఆ సర్వేశ్వరు డిప్పుడు మనయందు అనుగ్రహించిన ఇట్టి యవకాశమును మనము జారవిడువరాదు. 'ప్రస్తుత కాలమున మన మందరమును జాతి మత భేదముల నవల ద్రోసిపుచ్చి సంఘీభావము గలిగి ధైర్యముతో ముందుకు నడువవలసిన అవసర మాసన్నమైనదని నేను మీ కందరకును నొక్కి చెప్పు చున్నాడను. మనమిట్లు జేసినయెడల సర్వేశ్వరునికృపవలన కొద్దిసంవత్సరములలో మన ప్రయత్నములన్నియు జయముగాంచ గలవని నాకు గట్టి నమ్మకము గలదు. (చప్పట్లు,)

---

* దీనికి ఉదాహరము ప్రస్తుతము గవర్నమెంటువారు బహుజనాభిప్రాయమును తృణీకరించి యేర్పాటు గావించిన "రౌలతుచట్టమే."



# లోకమాన్యుని ఉపన్యాసములు

## 8. స్వరాజ్యము (హోం రూల్)

(ఆన 1917 సం॥ మార్చి 17 తేదీన నాశికపట్టణములో నిచ్చిన ఉపన్యాసము)

క్రిందటి సంవత్సరము లక్ష్మణపురిలో సమావేశమైన జాతీయ మహాసభవారు స్వరాజ్యతీర్మానమును ఆమోదించుటకు పూర్వమే మన యీ స్వరాజ్య సమితిని స్థాపించియున్నామను సంగతి మీ కందరకును తెలిసియేయున్నది. పూనా, చెన్నపురి స్వరాజ్యసమితులవారు గావించిన కృషియొక్క ఫలితమే క్రిందటి సంవత్సరము లక్ష్మణపుర జాతీయమహాసభ వారిచే నామోదింపబడిన స్వరాజ్య తీర్మానముగ పరిణమించినదని చెప్పిన అతిశయోక్తి కానేరదు (చప్పట్లు) ముఖ్యముగ ఈస్వరాజ్య సమితులవారు గావించిన తీవ్రాందోళనమే జాతీయమహాసభలో నామోదింపబడిన స్వరాజ్య తీర్మానములోని పదజాలమునకు కారణభూతమైనది. (అనగా స్వరాజ్యాందోళన మతితీవ్రముగ దేశమున ప్రబలుటచేతనే, జాతీయ మహాసభవారుకూడ తమ స్వరాజ్య తీర్మానమును తీవ్రమైన పదములతో వ్రాసి దాని నామోదించిరి) మన సమితివారు గావింప సమకట్టిన కార్యక్రమ మెంతమాత్రమును జాతీయ మహాసభ వారి పనుల కడ్డము రానేరదు. కాంగ్రెస్ అనగా జాతీయ మహాసభవారు చేయుపనుల నది అభ్యంతర పరుపజాలదు, అట్లభ్యంతరపరుపకపోగా, జాతీయ మహాసభ వారి కిదియెంతయును జేయూతగా నుండును. వారు తీర్మానరూపమున సూచించు పనులనెల్ల కార్యరూపమున (ఆచరణలో) నెరవేర్పగలుగుటకు వారి కిది యెంతయు సాయపడును. జాతీయమహాసభలో వట్టిచర్చలు మాత్రమే జరుగును. వివిధప్రదేశములలో నుండు ధీమంతులందరక్కడ జేరి, తమతమ యభిప్రాయములనెల్ల క్రోడీకరించుకొని, భేదాభిప్రాయములనెల్ల సమాధానపరచుకొని, దేశాభ్యుదయమున కత్యంతావశ్యకములగు కార్యము లేవియో, వానిని యేర్పాటు గావింతురు. ఇదికేవలము ఆలోచనభాగము. అది కేవలము మేధాశక్తిచేతను, బుద్ధిసూక్ష్మతచేతను గావించు పని. కాంగ్రెసువారు గావించునది యీ ఆలోచనా భాగమే గాని క్రియారూపమున వారు దేశములో గావించుపనులేవియును లేవు. అంతమాత్రముచేత వారు గావించు కృషి యత్యల్పమని నేజెప్పజాలను. వీరు గావించుపని అంతముఖ్యమైనది కాదని నేనన జాలను. ఈ యాలోచనా భాగమే మనము గావించు కృషిలోనెల్ల నతి ముఖ్యమైనది. దేశములోని వివిధ భిన్నాభిప్రాయములను కేంద్రీకరింపజేయుట సులభసాధ్యము కాదు. ఏయితర సభవారును యీకార్యము నింత యొక్కువ సమర్థతతో నెరవేర్చ

మన సమితివారు మంచి పనులను జేయుచున్నారని ప్రజలందరిలోను మంచి అభిప్రాయము పుట్టి, మనయందు సానుభూతి ప్రబలినకొలదిని ప్రజలంతయెంత యెక్కువగ మనలో వచ్చి చేరుదురు. ఏమాత్రము జ్ఞానమున్నవాడైనను తప్పక వచ్చి మనలో చేరవలెను. మనసమితివారు గావించు కార్యము మిక్కిలి పవిత్రమైనది. కనుక దీనిలోనికి సభ్యులెక్కువగ వచ్చి చేరునట్లు జూచుట మన ధర్మమైయున్నది. ప్రజల కందరకును దీనియం దెక్కువ అభిమానముపుట్టునట్లు చేయుట మనధర్మము.

ఈసమితిలోని సభ్యులసంఖ్య 15 వేలకు పైగా దాటినదని యిప్పుడే మన సెక్రటరీగారు చెప్పియున్నారు. కాని యిప్పటికి 50 వేలు దాటియుండవలసినదని నా యుద్దేశము. (చప్పట్లు) వేలకొలది సభ్యులున్న చాలదు. లక్షలకొలది సభ్యులుండవలయునని నాకోరిక (బిగ్గరగ చప్పట్లు) మనము పల్లెటూళ్ళలోని ప్రజాసామాన్యమువద్దకు బోయి, వారితో కలిసిమెలసి తిరుగవలెను. స్వరాజ్య మననేమియో ప్రతివానికిని తెలియజెప్పి, వారికి దానియం దభిమానము పుట్టునట్లు చేయవలెను. మనము కోరు స్వరాజ్య మెట్టిదో, దానిలోని ముఖ్యలక్షణము లేవియో వారికి తెలియజెప్పి, వారిని మనపక్షమునకు జేర్చుకొనవలెను. ఇదియే మనకు మంచి యనుకూలమైన తరుణము. ఈ సమయమును, యీ యవకాశమును, మనము జారిపోనివ్వకూడదు. మనము గావింపబూనుకొనిన యీ కార్యమునకై మీ శక్తినంతను ధారపోయవలెను. ఇదియే మంచిసమయము. స్వరాజ్యసమితి సభ్యుడననిపించుకొనుట కెంతమాత్రమును జంకకూడదు; (భయపడకూడదు). మీ మీ గ్రామాంతరములలో నుండువారి నందరిని మీ ప్రకారముగనే సమితులలో చేరవలసినదని బోధింపుడి. గవర్నమెంటు వుద్యోగస్థుడుగాని, పోలీసు బంట్రోతుగాని "నీవు స్వరాజ్యసమితిలో చేరినావా" యని యడిగినప్పుడు, గొంతు జంకు లేక "అవును నేను స్వరాజ్యసమితిలో సభ్యుడనుగ జేరినాను" అని ప్రత్యుత్తరము చెప్పవలెను. స్వరాజ్యసమితిలో చేరినందువల్ల మనము భయపడవలసిన పని ఆవంతయును లేదు, ప్రజల కందరకును యీ స్వరాజ్యము విషయమై తెలియజెప్పుటచే, అంతటితో తృప్తిజెందియూరుకొనక, మాలోని గొప్ప సామర్థ్యము గలవారిని ఇంగ్లాండుదేశమునకు పంపించి మాయొక్క నిజస్థితిని వారికి తెలియజెప్పి, మాయందు వారికుండు కొన్ని అపత్యాభిప్రాయములను తొలగింప యత్నించవలెను. స్వరాజ్యము విషయమై వారికి తెలియజెప్పవలెను. ఈవిషయములో మీకందరకును ♦ కర్టిసుగారి

♦ ఈయన ఒక తెల్లవాడు. ఈయన ప్రపంచములోని దేశము లన్నియు తిరిగి ఆయాదేశములయొక్క స్థితిగతులను బాగుగ పరిశీలించి అనేకవిధముల పాటుబడుచున్నాడు. ఈయన మనదేశమునకుకూడ వచ్చి, మన దేశస్థితికూడ శ్రమపడి విచారించెను. కాని ప్రస్తుతము మనకు స్వరాజ్యమిచ్చుట కూడదని చెప్పెను. మనముకూడ ఆయనవలెనే పాటుబడవలె గాని స్వరాజ్యము మన కిప్పుడీయకూడదని ఆయన చెప్పుమాటను మనము సమ్మతింపకూడదు.

పద్ధతుల నవలంబింపవలయును. అంతియేగాక అసలు వారి యభిప్రాయముల ననుసరింపవలయునని నేచెప్పను. (నవ్వు) ప్రతివిషయమై మనము ఆయనవలె బాగుగ చూచి, విచారించి, శ్రమపడి, చదివి, కృషిసలుపవలెను. వర్తమానపరిస్థితులను బాగుగ గ్రహించి, మనము గావింపవలసిన పని ఎంత కష్టతరమైనదియో విచారించి, దేశాభివృద్ధికి అత్యవసరము అగు కార్యముల యందు తక్కినపనుల నన్నిటిని తృణప్రాయముగ నెంచి, మీరు కృషి సల్పినయెడల సర్వేశ్వరుడు మీకు తప్పక సాయపడగలడని నా నిశ్చితాభిప్రాయము. మీరు గావింపబూనిన యీ కార్య మెంత అవుసరమో మీరు బాగుగ గ్రహించినట్లయిన, మీ కేదియును అడ్డము రాజాలదు, ఎట్టి కష్టములను నష్టములుగ గన్పింపవు. ("వందేమాతరం" "తిలకు మహారాజ్ కు జయ్" అని కేకలు, చప్పట్లు)



# 9. బాధ్యతాయుత పరిపాలన

## (1917 సం॥ డిశంబరు నెలలో కలకత్తా కాంగ్రెసు సభలో నిచ్చిన ఉపన్యాసము)

[1917-వ సం॥ డిశంబరు నెలయందు కలకత్తా నగరమున జరిగిన జాతీయ మహాసభయందు బాధ్యతాయుత పరిపాలనా తీర్మానమును గూర్చి తిలకు మహాశయుడీ విధముగా ఉపన్యసించియున్నాడు.]

నా మిత్రులగు "బెనర్జీ" గారికిని "జిన్నా" గారికిని ఉన్న వాగ్ధాటిగాని, బిపిన చంద్రపాలు గారి కున్న మేఘ గంభీర నినాదము గాని నాకు లేవు. అయినను నావిధిని నేను నెరవేర్పవలసి యున్నది. ఇప్పుడిచ్చట "బెనర్జీ" గారిచే మిక్కిలి సమర్థతతో సంపాదింపబడిన తీర్మానమును బలపరచునిమిత్తము, విశేష కాలయాపన లేకుండ, మీయెదుట కొన్ని సంగతులను చెప్పదలచుకొన్నాడను. ఈ తీర్మానమును ఇదివరకే గొప్పవక్తయగు జిన్నాగారు బలపరచియున్నారు. అదిగాక, చంద్రపాలుగారు ఈ తీర్మానమును సవరింపగోరిరి. కాని వారట్లు చేసియుండలేదు. ఈ తీర్మానము స్వపరిపాలన లేక "హోం రూల్" అను విషయమును గూర్చినదైయున్న సంగతి మీకెల్లరకును తెలియును. యీ తీర్మానములోని మొదటిభాగ మీ విధముగ నున్నది:—"హిందూదేశమందు బాధ్యతాయుత పరిపాలన నెలకొల్పుటయే సామ్రాజ్యప్రభుత్వమువారి ముఖ్యోద్దేశ మని సామ్రాజ్య పక్షమున హిందూదేశమంత్రి చేసిన ప్రకటన కెంతయు ఈ సభవారు తమ

కృతజ్ఞతాపూర్వక సంతృప్తిని వెలిబుచ్చుచున్నారు" నాకు ముందిప్పుడు మాట్లాడిన చంద్రపాలుగారు ప్రభుత్వమువారి ముఖ్యోద్దేశ ప్రకటనను మనము కృతజ్ఞత చూపవలసిన కాల మింకను రాలేదని తెలిపియున్నారు. నేనుకూడ ఆ యభిప్రాయముతో కొంతవరకు ఏకీభవించుచున్నాను. అయినను, ఈ తీర్మానములోని పదజాలము అంత అసందర్భముగా నున్నదని నేను చెప్పజాలను. కృతజ్ఞత యనగా (ఒక ఆంగ్లేయ నీతిశాస్త్రజ్ఞుడు నిరూపించియున్నట్లుగా,) ముందు అనుగ్రహింపబడబోవు దానికై ఆశతో నుండుట ఇది మీకందరికిని తెలిసియేయున్నది. కనుక పైన ఉదహరించిన దానినిబట్టి 'కృతజ్ఞతాపూర్వక సంతృప్తి' యనగా:—ప్రభుత్వము వారిచే గావింపబడిన యట్టి ప్రకటనకు సంతృప్తియును, ఆ ప్రకటనలోని యంశములు క్రమక్రమముగా సాధ్యమైనంత త్వరలో మన కనుగ్రహింపబడగలవను ముందు ఆశయును—ఈ రెంటియొక్క కలయికయును కృతజ్ఞతాపూర్వక సంతృప్తి యని యర్థమిచ్చుచున్నది. దీనికి నేను చెప్పు అర్థమిది. ఇదివరకు లేని సంగతి ఇప్పుడొకటి క్రొత్తగా ప్రకటింపబడినందులకు నాకు ప్రస్తుతము కొంతవరకు తృప్తిగా నున్నది. మఱియు నికముందు దానిలోని యభివృద్ధి సూచకములగు సోపానపరంపరలు క్రమక్రమముగా కాలానుసారముగా, మనకు ప్రసాదింపబడునని నే నెంచుచున్నాను. ఎంచుట మాత్రమే గాక తప్పక వచ్చును గాక యని కోరుచున్నాను ప్రస్తుతము ఆ సోపాన పరంపరలనుగూర్చి విచారింపవలసిన పనిలేదు. ఇప్పుడు కావలసిన ప్రథమసోపాన మేదియై యుండవలయునో మీ కెఱుంగవలెనని కోరుచున్నాను స్వరాజ్య మను పదమునకు అందరకును—(పొలములో పాటుపడు ప్రతివానికిని) తెలియగల సూక్ష్మమైన యర్థమేమనగా:—ఆంగ్లేయుడు తన ఇంగ్లండుదేశములోను, తన వలసరాజ్యములలోను ఎట్లు స్వేచ్ఛగానుండునో, అట్లే నేనును నా దేశములో అంతస్వేచ్ఛగ నుండవలయును. ఇదియే దీనికి సూక్ష్మమైన యర్థము. అంతయు దీనిలోనే ఇమిడియున్నది. "సామ్రాజ్యములో పాల్గొనుట", "సర్వసమత్వభావము" ఈ మొదలైన పెద్ద పెద్ద పదజాలమున కంతయు అర్థమిదియే. ఆంగ్లేయుడు తనదేశములోను, వలసదేశములలోను తనకుతానే ఎట్లు యజమానుడుగా నున్నాడో, అట్లే నేనును నాదేశములో పరదేశివలెగాక నాకు నేనే యజమానునిగా నుండ గోరుచున్నాను. ఇదియే సంపూర్ణమైన స్వరాజ్యము. రేపే దీని నెవరైన ఇచ్చినట్లయిన దానిని తక్షణము దేశములో ప్రవేశపెట్టుట నాకు మిక్కిలి సంతోషము. ఏలనన, ఇది ఒకమారుగా ప్రసాదింపబడిన భారతీయ స్వరాజ్యమైయుండును కాని, వారు అట్లొక్కసారిగ దానిని ప్రసాదింపరని నాకు తెలియును. మన స్నేహితులతోడను, మన అభిప్రాయములతో నేకీభవింపని వారితోడను, కొంత సమాధానపడవలసి యుండును. మొట్టమొదట ఆంగ్లేయ ప్రభుత్వ మీ దేశములో నిట్టి యొడంబడిక (చార్టరు) మూలముననే నెలకొల్పబడినది. నిజముగా పరరాష్ట్రములలో ప్రవేశింపదలచిన యెడల, మొదట నిట్టి మంచి ఒప్పందపు మాటలతోడనే ప్రవేశింపవలసి యుండును. మనము ఎక్కవలసిన ఈ మొదటి

పద్ధతుల నవలంబింపవలయును. అంతియేగాని అసలు వారి యభిప్రాయముల ననుసరింపవలయునని నేచెప్పను. (నవ్వు) ప్రతివిషయమై మనము ఆయనవలె బాగుగ చూచి, విచారించి, శ్రమపడి, చదివి, కృషిసలుపవలెను. వర్తమానపరిస్థితులను బాగుగ గ్రహించి, మనము గావింపవలసిన పని ఎంత కష్టతరమైనదియో విచారించి, దేశాభివృద్ధికి అత్యవసరము అగు కార్యముల ముందు తక్కినవనుల నన్నిటిని తృణప్రాయముగ నెంచి, మీరు కృషి సల్పినయెడల సర్వేశ్వరుడు మీకు తప్పక సాయపడ గలడని నా నిశ్చితాభిప్రాయము. మీరు గావింపబూనిన యీ కార్యమెంత అవుసరమో మీరు బాగుగ గ్రహించినట్లయిన, మీ కేదియును అడ్డము రాజాలదు. ఎట్టి కష్టములును నష్టములుగ గన్పింపవు. ("వందేమాతరం" "తిలకు మహారాజ్‌కు జయ్" అని కేకలు, చప్పట్లు)



# 9. బాధ్యతాయుత పరిపాలన

## (1917 సం॥ డిశంబరు నెలలో కలకత్తా కాంగ్రెసు సభలో నిచ్చిన ఉపన్యాసము)

[1917-వ సం॥ డిశంబరు నెలయందు కలకత్తా నగరమున జరిగిన జాతీయ మహాసభయందు బాధ్యతాయుత పరిపాలనా తీర్మానమును గూర్చి తిలక మహాశయుడీ విధముగా ఉపన్యసించియున్నాడు.]

నా మిత్రులగు "బెనర్జీ" గారికిని "జిన్నా" గారికిని ఉన్న వాగ్ధాటిగాని, బిపినచంద్రపాలు గారి కున్న మేఘగంభీర నినాదము గాని నాకు లేవు. అయినను నావిధిని నేను నెరవేర్పవలసి యున్నది. ఇప్పుడిచ్చట "బెనర్జీ" గారిచే మిక్కిలి సమర్థతతో సంపాదింపబడిన తీర్మానమును బలపరచునిమిత్తము, విశేష కాలయాపన లేకుండ, మీయెదుట కొన్ని సంగతులను చెప్పదలచుకొన్నాడను. ఈ తీర్మానమును ఇదివరకే గౌరవనీయులగు జిన్నాగారు బలపరచియున్నారు. అదిగాక, చంద్రపాలుగారు ఈ తీర్మానమును సవరింపగోరిరి. కాని వారట్లు చేసియుండలేదు. ఈ తీర్మానము స్వపరిపాలన లేక "హోం రూల్" అను విషయమును గూర్చినదైయున్న సంగతి మీకెల్లరకును తెలియును. యీ తీర్మానములోని మొదటిభాగ మీ విధముగ నున్నది:—"హిందూదేశమందు బాధ్యతాయుత పరిపాలన నెలకొల్పుటయే సామ్రాజ్యప్రభుత్వమువారి ముఖ్యోద్దేశ మని సామ్రాజ్య [illegible]న హిందూదేశమంత్రి చేసిన ప్రకటన కెంతయు ఈ సభవారు తమ

కృతజ్ఞతాపూర్వక సంతృప్తిని వెలువరుస్తున్నారు" నాకు ముందిప్పుడు మాట్లాడిన చంద్రపాలుగారు ప్రభుత్వమువారి ముఖ్యోద్దేశ ప్రకటనకు మనము కృతజ్ఞత చూపవలసిన కాలమింకను రాలేదని తెలిపియున్నారు. నేనుకూడ ఆ యభిప్రాయముతో కొంతవఱకు ఏకీభవించుచున్నాను. అయినను, ఈ తీర్మానములోని పదజాలము అంత అసందర్భముగా నున్నదని నేను చెప్పజాలను. కృతజ్ఞత యనగా (ఒక ఆంగ్లేయ నీతిశాస్త్రజ్ఞుడు నిరూపించియున్నట్లుగా,) ముందు అనుగ్రహింపబడబోవు దానికై ఆశతో నుండుట ఇది మీకందఱకిని తెలిసియేయున్నది. కనుక పైన ఉదహరించిన దానినిబట్టి 'కృతజ్ఞతాపూర్వక సంతృప్తి' యనగా:—ప్రభుత్వము వారిచే గావింపబడిన అట్టి ప్రకటనకు సంతృప్తియును, ఆ ప్రకటనలోని యంశములు క్రమక్రమముగా సాధ్యమైనంత త్వరలో మనకనుగ్రహింపబడగలవను ముందు ఆశయును—ఈ రెంటియొక్క కలయికయును కృతజ్ఞతాపూర్వక సంతృప్తి యని యర్థమిచ్చుచున్నది. దీనికి నేను చెప్పు అర్థమిది. ఇదివరకు లేని సంగతి ఇప్పుడొకటి క్రొత్తగా ప్రకటింపబడినందులకు నాకు ప్రస్తుతము కొంతవఱకు తృప్తిగా నున్నది. మఱియు నికముందు దానిలోని యభివృద్ధి సూచకములగు సోపానపరంపరలు క్రమక్రమముగా కాలానుసారముగా, మనకు ప్రసాదింపబడునని నేనెంచుచున్నాను ఎంచుట మాత్రమే గాక తప్పక వచ్చును గాక యని కోరుచున్నాను ప్రస్తుతము ఆ సోపాన పరంపరలనుగూర్చి విచారింపవలసిన పనిలేదు. ఇప్పుడు కావలసిన ప్రథమసోపాన మేదియై యుండవలయునో మీ రెఱుంగవలెనని కోరుచున్నాను స్వరాజ్య మను పదమునకు అందరకును—(పొలములో పాటుపడు ప్రతివారికిని) తెలియఁగల సూక్ష్మమైన యర్థమేమనగా:—ఆంగ్లేయుడు తన ఇంగ్లండుదేశములోను, తన వలసరాజ్యములలోను ఎట్లు స్వేచ్ఛగానుండునో, అట్లే నేనును నా దేశములో అంతస్వేచ్ఛగ నుండవలయును. ఇదియే దీనికి సూక్ష్మమైన యర్థము. అంతయు దీనిలోనే ఇమిడియున్నది. "సామ్రాజ్యములో పాల్గొనుట", "సర్వసమత్వభావము" ఈ మొదలైన పెద్ద పెద్ద పదజాలమున కంతయు అర్థమిదియే. ఆంగ్లేయుడు తనదేశములోను, వలసదేశములలోను తనకుతానే ఎట్లు యజమానుడుగా నున్నాడో, అట్లే నేనును నాదేశములో పరదేశివలెగాక నాకు నేనే యజమానునిగా నుండ గోరుచున్నాను. ఇదియే సంపూర్ణమైన స్వరాజ్యము. రేపే దీనినెవరైన ఇచ్చినట్లయిన దానిని తక్షణము దేశములో ప్రవేశపెట్టుట నాకు మిక్కిలి సంతోషము. ఏలనన, ఇది ఒకమారుగా ప్రసాదింపబడిన భారతీయ స్వరాజ్యమైయుండును కాని, వారు అట్లొక్కసారిగ దానిని ప్రసాదింపరని నాకు తెలియును. మన స్నేహితులతోడను, మన అభిప్రాయములతో నేకీభవింపని వారితోడను, కొంత సమాధానపడవలసి యుండును. మొట్టమొదట ఆంగ్లేయ ప్రభుత్వ మీ దేశములో నిట్టి యొడంబడిక (చార్టరు) మూలముననే నెలకొల్పబడినది. నిజముగా పరరాష్ట్రములలో ప్రవేశింపదలచిన యెడల, మొదట నిట్టి మంచి ఒప్పందపు మాటలతోడనే ప్రవేశింపవలసి యుండును, మనము ఎక్కవలసిన ఈ మొదటి

మెట్టు ఏదియో ఈ తీర్మానములో చెప్పబడి యున్నది. భవిష్యదభివృద్ధిని గూర్చియు, చిన్నరాష్ట్రీయములలోను, ఇండియా ప్రభుత్వపు కేంద్రస్థానములోను బాధ్యతాయుత పరిపాలన కావలయునని చెప్పుసంగతులన్నియు బాగుగ నేయున్నవి. వారితో నేనును సానుభూతితో నేకీభవించు చున్నాను. కాని భారతవర్షమునకు కావలసిన స్వరాజ్య ప్రాప్తికై ఇవన్నియు మొదటి మెట్టుకాజాలవు. ఇదియే నాకును బిపినచంద్రపాలు గారికిని గల అభిప్రాయభేదము. ఆయన యాకత్తు ఒక్కసారియే కావలెనను చున్నాడు. మనకు క్రమక్రమముగా ఇవ్వవలెనని నే జెప్పుచున్నాను. మొదటి మెట్టు కావలెనని కోరండి, వెంటనే రెండవ మెట్టు యిప్పటికంటె ఎక్కువతేలికగా లభించును. ప్రభుత్వము వారి ప్రకటనలో "బాధ్యతాయుత పరిపాలన" అని వాడిరి గాని, "హోంరూలు" అనిగాని "స్వపరిపాలన" యనిగాని వాడియుండలేదు. మాంటేగ్యు గారును మన ఇండియా గవర్నమెంటువారునుగూడ ప్రత్యేకముగా కావలయునని "బాధ్యతాయుత పరిపాలన" అనియే వాడియుండిరి. కాని మనదురదృష్టవశమున బాధ్యతాయుత పరిపాలన యనగా నేమియో స్పష్టముగా ఫలానా యని నిరూపించి యుండలేదు. ఎందుకనగా, బాధ్యతాయుత పరిపాలన యనగ కార్యనిర్వాహక వర్గము వారు చట్టనిర్మాణ వర్గమువారికి బాధ్యులై యుండుటయని సాధారణ అర్థమై యున్నది. కాని "కర్టిసు" గారు వ్రాసిన పత్రికలో నొకచోట బాధ్యతాయుత పరిపాలన యనగా చట్ట నిర్మాణవర్గము కార్యనిర్వాహక వర్గమునకు బాధ్యులై యుండుట యని వివరించియున్నారు! కనుక బాధ్యతాయుతపరిపాలన యన నేమియో స్పష్టముగా నిరూపించుట అత్యవసరమై యున్నది. లేనియెడల మననిజాభిప్రాయమునకు కేవలము వ్యతిరేకముగా అర్థముతీసి, "మీకు బాధ్యతాయుత పరిపాలన ఇచ్చెదము, కాని అట్టి పాలనలో చట్టనిర్మాణవర్గము కార్యనిర్వాహకవర్గమునకు బాధ్యులై యుందురు"ని మనకు జెప్పవచ్చును. కనుక దీనిప్రకారము చట్టనిర్మాణవర్గమును ఎంత యెక్కువగా కార్యనిర్వాహక వర్గమునకు లోబడియుండునో, అంత యెక్కువగా మనపరిపాలన బాధ్యతాయుత మగునని అర్థమిచ్చుచున్నది! (నవ్వు) మనకు కావలసినది ఇటువంటి బాధ్యతాయుత పరిపాలన కాదని మనము బహిరంగముగా, నిర్భయముగా చెప్పవలయును. బాధ్యతాయుత పరిపాలనయన మనయర్థమేమనగ:—చట్టనిర్మాణ వర్గమునకు కార్యనిర్వాహకవర్గము కేవలము బాధ్యులై లోబడి యుండుట. మీరు ఇక దానిని "పార్లమెంటు" అనిగాని, మరి యే యితరనామముతో గాని పిలువవచ్చును. మరియు ఇట్టిపాలనలో చట్టనిర్మాణవర్గము కేవలము ప్రజలచే నెన్నుకొనబడినదై యుండవలెను. ఇదియే మనకు కావలసిన పూర్ణమైన బాధ్యతాయుత పరిపాలన. కార్యనిర్వాహకవర్గము చట్టనిర్మాతలకు లోబడి యుండవలెనని చెప్పినపుడు, యిక గవర్నరులు, లెప్టినెంటు గవర్నరులు కూడ ఈ చట్టనిర్మాతలచేతనే ఎన్నుకొనబడవలయును. నేనింతవరకు కూడ జెప్పుచున్నాను. ఇది ఎట్లయినను చిట్టచివరి మెట్టని చెప్పవచ్చును. అయినను ప్రస్తుత సందర్భములనుబట్టి, మనము కోరుచున్నట్టి ఈ

మొదటిమెట్టుగ మనకు తక్షణము ప్రసాదించవి, సంపూర్ణ స్వపరిపాలనను కొలదికాలంలో ప్రసాదించినయెడల నాతోబాటు మీరందరుకూడా తృప్తిచెందెదరని తలంచుచున్నాను. కొలదికాలమనగా 50 సం||లలో రాగల సంగతియని ఎవరును తలంపరు. ఎందుకనగ, 50 సంవత్సరముల కాలము కొలదికాలము కాజాలదు. ఒక పురుషాంతరమును మించిన కాలము కొలదికాలము కానేరదు. సాధారణముగా పది, పదునైదు సంవత్సరముల కాలము కొలదికాలమని చెప్పవచ్చును. ఈ తీర్మానమందు "ఇన్నిసంవత్సరముల కాలములో మాకు స్వరాజ్యమిచ్చితీరవలయును" అని చేర్చియుండిన బాగుండి యుండునని నా కోరిక. అయినను మనకు ఇప్పుడు వచ్చిన నష్టములేదు. ఏమాత్రము తెలివిగల వాడైనను కొలదికాలమనగా పది, పదునైదు సంవత్సరములకు మించిన కాలమని తలంచడు. పది, పదునైదు సంవత్సరములలో బాధ్యతాయుత పరిపాలనగాని స్వరాజ్యము గాని రావలయునని కోరుట మిక్కిలి విపరీతమని కొందరు తలంచిరి, కనుక దానిని వెంటనే తీసివేసిరి. అయినను నష్టములేదు. అసలు ఉద్దేశము మాత్రము కేవలము త్రోసివేయలేదు. ప్రభుత్వమువారు చేసిన ప్రకటనను బాగుగా గుర్తించుడి. అది యేమి? బాధ్యతాయుతపరిపాలన యనగా ఇట్టిట్టిది వర్ణింపరాని నిర్దుష్టమైన బాధ్యతాయుత పరిపాలనను మనకు పది, పదునైదు సంవత్సరములలో ప్రసాదించెదరట. మాంటేగ్యూ మంత్రిగారిచ్చిన ఈ ప్రత్యుత్తరమునకు మనము (నేచెప్పిన యర్థముతో గూడిన) "కృతజ్ఞతాపూర్వక సంతృప్తి"ని దెల్పుచున్నారము. కాని ఇంకను ఇతర షరతులున్నవి. ఆ ప్రకటనలో, మనకు దానిని క్రమక్రమముగా, మెట్టుతరువాత మెట్టుగా ఇచ్చెదరని వున్నది. దీనికికూడా అంగీకరించెదము. ఇక మూడవ భాగమందు యెప్పుడే మెట్టును మనకు యివ్వవలెనో ప్రభుత్వమువారే నిర్ణయించెదరట! దీనికి మనము ఒప్పుకొనజాలము. ఈ మెట్లను మనమే నిర్ణయించుకొనవలెనుగాని అధికారవర్గము వారి దయాధర్మబిచ్చమునకు వదలివేయుట సరిపడదు. దీని విషయమై మనకు రాజీ కూడాపనికిరాదు. ప్రతిమెట్టును, ఏమెట్టును ఎప్పుడు ఇవ్వవలయునో, ఈ కాలనియామకమును ముందు రాబోవు "ఆక్టు"లో స్పష్టముగా ఉదహరింపవలయునని మనమందరము గట్టిగా పట్టుపట్టవలయును. ఇట్లొకసారియే ఉదహరించి యుంచిన యెడల యావత్తు "స్కీము"ను దాని యంతట అదియే క్రమముగా నడువగలదు. ఆ ప్రకటనలోని మాటలకును మనకును ఇచ్చటనే భేదమున్నది. అయినను మన ఈ తీర్మానములో ఈ సంగతులన్నియు ఇంతవివరముగా వివరింపబడి యుండలేదు. కాని ఈ తీర్మానపు రెండవ భాగములో దీనిని మనము కోరియే యున్నాము. మనకు పూర్ణాదర్శప్రాప్తి నెప్పుడు కలుగజేయుదురో ఆవిషయమును ఇండియా గవర్నమెంటువారికి వదలివేయక, పార్లమెంటు వారే తక్షణము చట్ట మేర్పాటుజేసి, మన కెప్పుడు, ఏ సందర్భములలో, ఏప్రకారముగా పూర్ణమైన బాధ్యతాయుత పరిపాలన ప్రసాదించెదరో, ఆ చట్టము మూలముననే తెలియ జేయవలయునని కోరుచున్నాము. తక్షణ మిప్పుడు నిర్మింపబోవు ఈ పార్లమెంటు చట్టములో స్థిరమైన కాలపరిమితి నేర్పాటు జేయ

వలయును. ఈ తీర్మానముయొక్క మొదటిభాగములో ప్రభుత్వమువారు జేసిన ప్రకటనకు మన మందరమును కృతజ్ఞతా పూర్వక సంతృప్తిని తెలియబరచి యున్నాము. రెండవ భాగములో ఈ ప్రకటనయందు మన కపుపడుచున్న తోచిన సపరణను తెలియబరచియున్నాము. ఇక మూడవ భాగములో క్రిందటి సంవత్సరము లక్ష్మణపురమున కాంగ్రెసు మస్లెంలీగు సభలవారిచేత ఏకగ్రీవముగా నామోదింపబడిన ప్రణాళికనే (Scheme) తిరిగి చెప్పియున్నాము. నిజానికి ప్రణాళికకుకొన్ని ఆక్షేపణలున్నవట. కనుక ఒక సంవత్సరపు అనుభవము మీదనైనను మనము ఈ యేటి సభలో దానిని మార్పుదల చేయవలసినదని కొందరనిరి. కాని నా యభిప్రాయ మదిగాదు. మన అందరి అభిప్రాయమును ఒక్కటియే యని నాకు సంతసముగ నున్నది. (కాదు. కాదు అని కేకలు) అట్లయిన ఈపంక్తి మన మందరమును కలిసిఓట్లు వేసినప్పుడు తేలగలదు. మన మందర మేకగ్రీవముగ, భేదాభిప్రాయము లేక, ఈ తీర్మానమును ఆమోదించి నప్పుడే, మీ యందరి యభిప్రాయ ప్రకారమే నేను మాటాడు చున్నానని మీకు తెలియగలదు. మనము కోరదగిన దానిలో ఈకాంగ్రెసులీగు ప్రణాళిక అత్యంత అల్పము. దాని నిక తగ్గించుటకు వీలులేదు. ప్రస్తుతము మన కోర్కెలను దీర్చుటకును, హిందూదేశములో స్వరాజ్యముయొక్క మొదటి మెట్టును చక్కగ ప్రారంభించుటకును దీని ననుగ్రహించుట ఆత్యవసరమని నాయభిప్రాయము. దీనికి కారణ మేమో చెప్పెదను, వినుడు. దేశమందు కాంగ్రెసు నాయకులైన వారిచేతను, కాని వారిచేతను, మస్లెంలీగు సభ్యులైన వారి చేతను, కాని వారి చేతను, గొప్పసంఘములవారిచేతను కొద్ది సంఘముల వారిచేతను, అనేకమందిచేత అనేకచోట్ల అనేక విధానములు అనేక స్కీములు సృష్టింపబడినవి. ఇవి యన్నియును ముఖ్యమంత్రి గారికి సమర్పింపబడినవి. వీని నన్నిటిని తరచిజూచిన నేమి తేలును ! వానిలో నధిక సంఖ్యాకములు ఈ కాంగ్రెస్ లీగు వారి ప్రణాళికనే యామోదించినవి. కొందరు దీనికంటె ఇంకను ఎక్కువ కావలయునని యే కోరియున్నారు. "ఓట్లు" వేసినట్లయిన అవోట్లన్నియు, ఈ కాంగ్రెస్‌లీగు ప్రణాళికకే వచ్చును. మిగిలిన వానిలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క "ఓటు" మాత్రమే వచ్చును. దీనిని బట్టియే దేశమంతయు మన స్కీమునే ఆమోదించినట్లు తేలుచున్నది. ఇక మనము దానినుండి ఒక అంగుళమైన ఈవలికి జరుగుటకు వీలులేదు. "మీరు కాంగ్రెసు లీగు స్కీములో చట్టనిర్మాణ వర్గమువారికి తమ యిష్టమువచ్చి నప్పుడు కార్యనిర్వాహక వర్గమువారిని తొలగించు అధికారముండవలయునని కోరియుండలేదు. అందువలన అది నిజమైన బాధ్యతాయుత పరిపాలన కాజాలదు. దీనినిబట్టి మీరు బాధ్యతాయుత పరిపాలనను అడుగుచుండుట లేదని తేలుచున్నది. ప్రభుత్వమువారు బాధ్యతాయుత పరిపాలనను మీ కిచ్చుటకు సంసిద్ధులై యున్నను, దానిని మీరు కోరుచుండుటలేదు!" అని కొందరు విపరీతముగా జెప్పుచున్నారు. "బాధ్యతాయుత పరిపాలనను మీకు క్రమక్రమముగా మెట్టు తరువాత మెట్టుగా ఇచ్చెదము. అందులో మొదటి మెట్టులోకూడా కొంత

పరిపాలించిన అనుభవము మనకు కావలసినంత గలదు. (చప్పట్లు) ఆవిద్య యంతయు మనకు పూర్తిగా తెలియును. దీనికి తోడు రాజ్యపాలనకు సంబంధించిన కొన్ని మూలసూత్రములను మనము ఆంగ్లేయ విద్యాభ్యాసమువలన గడించినాము. నాగరికత జెందిన రాజ్యములవారి పరిపాలనను జూచి మరికొన్నింటిని నేర్చుకొన్నాము. ఆ సూత్రములను ప్రయోగించు పద్ధతులను గూడ మనము నేర్చుకొనియున్నాము. పరిపాలనను మన చేతులలో బెట్టిన యెడల రేపటినుండియు మనము దానిని నడుపజాలమా ? (బిగ్గరగా చప్పట్లు) మొదట మునిసిపలు వ్యవహారములలోను, తరువాత జిల్లాబోర్డులలోను, తరువాత రాష్ట్రసభలలోను, ఆటుపిమ్మట క్రమముగ సామ్రాజ్యసభలలోను ఈ విధముగ మెట్టుమెట్టుగా మనము తరిఫీదు కావలయునని మనయుద్దేశముగాదు. రెంటికిని యేవిధమైన సామ్యమును లేదు. మన భారతవర్షము ప్రస్తుతము నరముల పటుత్వము తప్పిన మనుష్యునివలెనున్నది, వారు మనల నీగతికి తెచ్చిరి. ఇట్టి దుర్గతి కలవానికి దేహమంతయు శుష్కించియుండును. కనుక వానికి చికిత్స మొట్టమొదట మెదడునకు ప్రారంభింపవలయునుగాని, కాలి బొటనవ్రేలివద్ద ప్రారంభించిన నేమి లాభము ? అట్టివానికి తక్షణము ఆరోగ్యము కలుగవలయుననిన సర్వనాళములకు కేంద్రస్థానమైన మెదడునకే మంచిపుష్టి చేయగల ఔషధము ఇయ్యవలసియుండును. ఈస్థితియే హిందూదేశమునకుగూడ సంభవించినది. సామ్రాజ్యమునకు దీనివలన మంచి మేలుకలుగునట్లు భారతవర్షమును పరిపాలింపగల శక్తి ఈ ప్రస్తుత ప్రభుత్వపద్ధతికి చేతకాని యెడల ఈ ప్రభుత్వమునకు మెదడుగానున్న 'ఢిల్లీ' 'సిమ్లా' స్థానములకే మొదట చికిత్స చేయవలసియుండును. ఆముఖ్యస్థానమును ముందు బాగుపరచిననేగాని, తక్కినకాలికిగాని వేలికిగానిమరియితర అవయవములకుగానిఎంతచికిత్సజేసినను అవంతయైనను లాభముండబోదు కనుక కాంగ్రెసు లీగు స్కీమునందు ఆ కేంద్రస్థానమున మనకు కొన్నిహక్కులు కావలయునని కోరియున్నాము. దానిని పూర్తిగా తొలగించుటకు మనకు అధికారము లేకపోయినను చివరకు దానితో సమానముగానైనను మనకు అధికారముండి తీరవలయును అచ్చటి కార్యనిర్వాహక సభ్యులలో కనీసము సగము మందియైనను మన ప్రజాప్రతినిధులై (అనగా మన ప్రజలచేత ఎన్నుకోబడిన వారై) యుండవలయును. ఈవిధముగా పైనుండి మనము నిర్మించుకొని రావలసియుండును. ఈ దేశములోని రాజకీయప్రభుత్వమును అడ్డముగగాని నిలువుగగాని రెండుగా భాగింపవలయునని మనము కోరుచుండుటలేదు. మనము ఈ మనుష్యుని శరీరమునంతను బాగుపరచవలయును. అట్లు చేయుటలో మొదట అతని మెదడును బాగుపరచినయెడల తక్కిన యవయవములన్నియు క్రమముగ వానియంతట యవియే నతనికి స్వాధీనమగును. అట్టిమందునే మనము వాడవలయును. మన "స్కీము" లో చెప్పబడిన మందు ఇట్టిదియే. సామ్రాజ్యస్వాతంత్ర్యమును గూర్చి మాట్లాడుచుండగా రాష్ట్రపాలనమును గూర్చి మాట్లాడుట మిక్కిలి యసందర్భము. కేంద్రస్థానపు అధికారములో మనకుకూడ కొంతభాగముండి తీరవలయును. మునిసిపల్ బోర్డులమీద

పూర్ణమైన యధికారము ఇండియా గవర్నమెంటువారికే గలదు. ఆ యధికారమును వారెట్లు వినియోగించుచున్నారో, నిజముగ మ్యునిసిపలు బోర్డువారికి ఎంత స్వతంత్ర మున్నదో మనకు బాగుగ తెలియును. మనము స్థానిక స్వపరిపాలన కావలయునని కోరినయెడల ప్రతివిషయములోను, పైనుండి క్రిందివరకు, మనకు అధికారముండవలయును. బాధ్యతగల పరిపాలన యావత్తును మన చేతులలోనే యుండవలయును. లేనియెడల లాభములేదు. కనుకనే సామ్రాజ్య చట్టనిర్మాణ వర్గములో అయిదింట నాలుగువంతు ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులును, మిగిలిన అయిదింట ఒక్కరు మాత్రమే ప్రభుత్వమువారిచేత నియమింపబడిన ప్రతినిధులును అయియుండవలెను. ఈచట్టనిర్మాతలకు కార్యనిర్వాహకులు లోబడియుండవలెనని మన కాంగ్రెసులీగు ప్రణాళికలో యేర్పాటు చేయబడియున్నది. ఇది నిజమైన బాధ్యతాయుత పరిపాలన గాదని నేను ఒప్పుకొనుచున్నాను. అయినను అట్టివానికిది నిశ్చయముగా మొదటి మెట్టని నేను చెప్పగలను. జమీయంతయు "కోర్టు ఆఫ్ వార్డ్సు" వారి చేతులలో నున్న ఒక మైనరు జమీందారుడు ఉన్నాడనుకొనుడు. ఆతనికి మెజారిటీ వచ్చినపిమ్మట "నాజమీని నాకు వప్పగించవలసినది"అని కోర్టు ఆవ్ వార్డ్సువారిని కోరును. అప్పుడు వారు నీ జమీనిభాగములు భాగములుగ విడదీసి మొదట కోటకు పైటనున్న గుర్రపుశాలను, పిమ్మట యేనుగుశాలను ఈ విధముగ క్రమముగ నీకు వప్పగించెదమని చెప్పుదురనుకొనుడు చివర కేమగును! అట్లు వప్పజెప్పినతర్వాత ఇకముందెప్పుడో నీ కోటను యావత్తును నీకు వప్పజెప్పు విషయమై ఆలోచించెదములేయని ప్రత్యుత్తరము చెప్పెదరు గదా! ఈవిధముగనే కోర్టు ఆవ్ వార్డ్సువారు న్యాయసభలో వాదించినయెడల ఆవాదన నిలుచునా? అదెన్నడును నిలువదు. ఏ జడ్జియైనను దానిని త్రోసివేయును గదా! మన జాతి వారికిని అధికారవర్గము వారికినిగల రాజకీయ పోరాట మీవిధముగనే యున్నది. అధికార వర్గము వారు మనకు 'ట్రస్టీలు' (సంరక్షకులు)గ నున్నారు. మనకు మెజారిటీ వచ్చినది. కనుక మన జమీని మనకు వప్పగించవలసినదని కోరుచున్నాము కాని కర్టిసు మొదలైనవారు "సరే! నిజమే! అధికారమంతయును మీకు వప్పచెప్పవలెనని మాకు తెలియును. కాని ప్రజలలో తమ ప్రతినిధుల నెన్నుకొనగల తెలివితేటలుపుట్టి దానికి కావలసిన * నియోజకవర్గములు యేర్పాటు అయిన పిమ్మట క్రమక్రమముగ నధికారమును మీకు వప్పగించెదము. ఒకటిరెండు వందల యేండ్లలో యీ యేర్పాటులన్నియు పూర్తియైనప్పుడు లేక (హిందువుల కాలమాన ప్రకారము) యీ కలియుగము అంతమగులోపల ఎప్పుడో ఒకప్పుడు మీ యధికారమును మీ వశము చేసెద"మని శెలవిచ్చుచున్నారు. ఇట్టివాదములను మన మొకక్షణ

---

* ప్రజలను చిన్నచిన్న సంఘములుగ భాగింపవలెను. ఒక్కొక్క సంఘము వారు, వారివారి ప్రాముఖ్యమునుబట్టి తమ సంఘపక్షమున కొంతమంది ప్రతినిధులను ఎన్నుకొని ప్రభుత్వసభలకు పంపుచుండవలెను. ఎన్నికలకొరకై యేర్పాటు చేయబడిన ఇట్టి చిన్నచిన్న సంఘములకే నియోజకవర్గము లని పేరు.

ఈ స్కీములోనున్న రెండవ సుగుణ మేమనగా:— ఇదివరకున్న పునాదులమీద నుండియే కట్టుటకు ఏర్పాటు గావింపబడియున్నది. పరిపాలనా యంత్రమును కేవలము మార్చివేయవలయునని ఐన స్కీములో మనము ప్రభుత్వము వారిని కోరియుండలేదు. ఇది క్రొత్తపద్ధతి కాదు. ఈ పద్ధతి నూరుసంవత్సరములకు పైగా యీ దేశములో అమలులో నున్నది. మాకు ముఖ్యమంత్రి కావలెను; స్వరాజ్య ప్రభుత్వము కావలెను, స్థానిక పాలనము కావలెను, జిల్లాబోర్డు కావలెను, ఇంగ్లీషు అధికారులు కావలెను. వారిని యీ దేశమునుండి వెళ్ళిపొమ్మని చెప్పము. వారీదేశములోనే యుండవచ్చును. మాకు యివన్నియు కావలెను. కాని కొంతవరకు అధికారము మా చేతులలోనికి రావలెను; ఈ డిపార్టుమెంటు లన్నిటిలోనుండు వారికందరికి అధికారమును పంచి పెట్టవలయును. (ఒక్క ఇండియా గవర్నమెంటువారే యధికారమునంతను తమ చేతులలో పెట్టుకొని కూర్చుండిన లాభములేదు) ఈ ఏర్పాటులన్నిటిని మార్చవలయునని మాకు ఉద్దేశములేదు సీమనుండి చక్రవర్తిగారి కొడుకు వచ్చిగాని, లేక మా స్వదేశ సంస్థానాధీశ్వరు లెవరైన వచ్చిగాని మా హిందూదేశమును పాలించవలయునని మేము చెప్పము "పరిపాలనా యంత్రమును యిదివరకున్నట్లే యుంచుకొనుడ"ని చెప్పుచున్నాము. మాకు అధికారము తోడనే గాని యంత్రముతో పని లేదు. హిందూ దేశ ప్రభుత్వమంతయు "చట్టనిర్మాణవర్గము"నియు "కార్యనిర్వాహక వర్గ"మనియు రెండు వర్గములుగా విభజింపబడియున్నది. గవర్నరులలో గాని, గవర్నర్ జనరలులలోగాని, కార్యనిర్వాహక వర్గములోగాని మార్పు అక్కరలేదు కాని "కార్యనిర్వాహకవర్గము" వారి చేతులలోనున్న అధికారమును "చట్టనిర్మాతలకు" వదలివేయవలయు నని మేము కోరుచున్నాము. అసలు యంత్రమును కదలించవలయునని మాకులేదు. క్రొత్తయంత్రమును తెచ్చి పెట్టుకొనవలయునని కూడ మాకులేదు. ఇదివరకు ఆయంత్రమును నడపు అధికారము నంతను కొన్ని చక్రములు మాత్రమే తమవశము చేసికొని కూర్చున్నవి. కనుక యిప్పుడు అట్టి అధికారమును వానినుండి తప్పించి మరికొన్ని యితర చక్రములయం దుంచవలయునని మేము కోరుచున్నాము ఇది క్రొత్తస్కీము కాదు. బాగుగ తరచి పరీక్షింప బడిన యంత్రమే. ఇప్పుడు కావలసినదంతయు ఒకభాగమునుండి మరియొక భాగమునకు అధికారమును మార్చుటయే గాని, వేరేమియు లేదు. ఎట్లనగా, హిందూదేశ ప్రభుత్వముపై అధికారమును ముఖ్యమంత్రివద్దనుండి తొలగించవలయును. నిజమైన హిందూదేశ ప్రభుత్వము నిజముగా హిందూదేశములోనే యుండవలెను. (గాని సీమలోనుండకూడదు.) తరువాత నేమి కావలెను? మంత్రి చేతులలో నున్న అధికారమును తీసివేసి దానిని హిందూదేశ ప్రభుత్వమువారికే యివ్వవలయునని మన యిప్పటి అధికారవర్గము వారు కూడా ఒప్పుకొనుచున్నారు. ఈమార్పును గావించిన పిమ్మట "కార్యనిర్వాహకవర్గమును" "చట్టనిర్మాతల" యధీనము నందుంచవలెను. ప్రస్తుతము చట్టనిర్మాతలలో షుమారు సగ [illegible]

మాత్రమే ప్రజలచే నెన్నుకొనబడు చున్నారు. ప్రజలు మరి యింక కొంతమందిని ఎన్నుకొనిన నేమి యభ్యంతరము? ఎట్టి యభ్యంతర ముండఁబోదు. ఎందు కనగా యిదివరకు సామ్రాజ్యసభకు ఎన్నుకొనఁబడిన ప్రజాప్రతినిధులు తెలివిగను గవర్నమెంటువారికి (అనుకూలముగనే) తృప్తికరముగనే పనిచేయుచున్న సంగతి మనకు జ్ఞాపకమున్నదిగదా. ఇక నిప్పుడు మన స్కీములో నడుగబోవునదేమనగా;—అటువంటి ప్రతినిధులనే మరి కొంతమందిని చేర్చుకొని, వారికి కార్యనిర్వాహకులమీద అధికార మివ్వవలయుననియేకద. దీనిలో నేమి యున్నది? కనుక దీనికి అభ్యంతరముండబోదు. ఇదివరకు వేసిన పునాదులమీదనుండియే మనమిక కట్టుకొనవలెను. మన స్కీము సరిగ పనిచేయజాలదనియు, యిదివర కిట్టిది లేదనియు, ఎక్కడను ఏదేశములోను, ఎప్పుడును యిట్టిస్కీమును అమలులో పెట్టలేదనియును, యీమొదలైన అభ్యంతరములు కేవలము నిష్ప్రయోజనములు. ఈ అభ్యంతరములనే అజ్ఞానులను మోసపుచ్చునట్టి మాటలతో చెప్పినట్టయిన, ముందు మనయందరి దేశక్షేమమునకును భంగము వాటిల్లగలదు. ఇకవారు చెప్పు రెండవ యభ్యంతర మేమనగా:—కార్యనిర్వాహక వర్గములో సగము ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధులును, సగము ప్రభుత్వమువారిచే నియమింపబడిన వారును వున్నయెడల, వీరి యుభయులకును నిరంతరము ఎడతెగని పోరాట ముండునట! ఈ పక్షమువారు అపక్షముతో నెప్పుడును పోరాడు చుందురట, అందువలన ప్రభుత్వము నడువజాలదట. ఇట్లెంతమాత్రమును కాజాలదని నేనట్టిగ చెప్పగలను. (అట్లెప్పుడైన సంభవించిన యెడల) దీనికి తగిన యేర్పాటు మన స్కీములోనే గావింపబడియున్నది. ఎట్లనగా, ఉభయపక్షముల వాదములను బాగుగ విచారించి, ఏపక్షము న్యాయమో నిర్ధారణపరుపగల వీటో అధికారము గవర్నరున కివ్వబడినది. అందువలన పరిపాలన కెంతమాత్రమును భంగము వాటిల్లనేరదు. ఇట్టి చిక్కును నివారింపగల ఏర్పాటును, ముందేమనము చేసియున్నాము. కాని యిప్పు డధికారము చేత పట్టుకొని కూర్చున్న వారికిది యిష్టముగలేదు. ఎందుకనగ, అధికారమును యీవిధముగ పంచినయెడల ప్రజాభిప్రాయమునువారు ఎక్కువగ గౌరవింపవలసిన(బాధ్యత) వారియందు కలుగవలెను. తదనుగుణముగనే వారు సంచరింపవలెను. (ఇది ఎంతయు వారికి కంటకముగ నున్నది,) వేయేల, చివరకు మనస్కీము అన్నిటికంటె మంచిదని చెప్పుటకు మరొక ప్రబలకారణము గలదు. ఎందుకనగా, ఇంగ్లీషు పార్లమెంటువారి కోర్కెలకును, ఉద్దేశములకును, అనుకూలముగనుండి, వాని ననుసరించియున్న స్కీము మన దొక్కటియే యైయున్నది. (తక్కిన వేవియు కావని యర్థము.) గవర్నమెంటువారు చేసిన ప్రకటననే పునాదిగా చేసికొని యికముందు కార్యక్రమమును నడుపవలసి యుండునని "కర్టిసు" * 'సర్ వాలెంటైన్ షీరోలు'

* హిందూదేశములో అరాచకము ప్రబలుటకు తిలకే కారకు డను నిందా [illegible]ములను వ్రాసినవాడీ వాలెంటైను షిరోలు అను నాతడే.

మొదలగువారు-పాపము ! - ఒప్పుకొని తీరవలసి వచ్చినది. కాని దానిని వారు తమ మనస్ఫూర్తిగ ఒప్పుకొనినారని నేతలంచను. గవర్నమెంటువారా ప్రకటనను గావించియుండని పక్షమున వారికి మిగుల సంతోషముగ నుండెడిది. కాని యిక ప్రభుత్వము వారా ప్రకటనను గావించి యున్నందున, ఆపెద్దమనుష్యులు కూడా ఒప్పుకొనక తీరినదికాదు. ఒప్పుకొన్నారు. అయినను దాని నిప్పుడు వారేమి చేయ జూచుచున్నారు ? "ఆప్రకటనను బట్టి అందులో ఎంతవరకు—ఎంతతక్కువగ—నివ్వవచ్చును?" అని వారు ఆలోచించుచున్నారు. ఆప్రకటనలో వీలైనంత తక్కువగ యివ్వవలెనని, వారు చూచుచున్నారు. ఇప్పుడా పెద్దమనుష్యులు చేయబూనికొనిన ఘనకార్యమిది ! కాని మనము చేయవలసిన పనియేమి ! ఆ ప్రకటనలో ఎంత ఎక్కువగా లాగికొనుటకు వీలున్నదో అంత ఎక్కువగా తీసికొనుటకు మనము ప్రయత్నింపవలెను. మన మెవరమును యేయితర స్కీమును వప్పుకొనకుండ జాగ్రత్తగ నుండవలెను. ఎవరో (గొప్పవాడు) వచ్చి మనస్కీము బాగుగ లేదని (యాక్షేపించిన) తోడనే మనము తెల్లబోయి, (మనస్కీమును వదలివేసి) ఆయనవెంట పరుగెత్తరాదు. కనుక మన యీస్కీమును మీరందరు యేకగ్రీవముగ ఆమోదించెదరనుకొనియు కోరుచు దీనిని మీ యెదుట నుంచుచున్నాను. (బిగ్గరగ, చాలసేపువరకు చప్పట్లు)

---

# 10. రాజీ (Compromise)

## (1916 సంవత్సరము బెల్గాములో నిచ్చిన ఉపన్యాసము)

[అతివాదులును మితవాదులును, సూరత్ పట్టణమున 1907-వ సంవత్సరములో చీలిపోయిన విషయ మందరికిని తెలియును. మనలో నిట్టి భేదముండ కూడదని గ్రహించి తిరిగి యుభయులు రాజీపడదలంచిరి. ఆన 1916-వ సంవత్సరము ఏప్రిలు నెలలో, బెల్గాములో సమావేశమైన బొంబాయి రాష్ట్రీయ సభలో ఈ రాజీ విషయమై తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను.]

సభాధ్యక్షా, ప్రతినిధులారా !

నేనిప్పు డొక తీర్మానమును ప్రతిపాదింపబోవుచున్నాను. ఈ సభాకార్యక్రమ మంతటిలోను యీ తీర్మానమే ముఖ్యతమమైనదని చెప్పవచ్చును. దీని విషయమై మాట్లాడుట చాలకష్టమని నాకు తెలియును. ఏలననగ, నా నోటివెంటవచ్చు ప్రతిమాటను, "ఈకకు యీక, తోకకు తోక లాగి," బహుక్రూరముగ, బహుసూక్ష్మముగ, దేశజను లెల్లరును విమర్శించెదరు. నేనొక యభిప్రాయముగను చెప్పదలిచికొని మాట్లాడిన మీరు వేరొక యభిప్రాయముగ అర్థము చేసికొనుట సంభ

వింపవచ్చును. కనుక మీరెట్టి విపరీతార్థములు చేసికొనకుందురనట్లు సాధ్యమైనంత వరకు నా యభిప్రాయములను క్లుప్తముగను స్పష్టముగను వ్యక్తపరచెదను. అన్నలారా! మన మీ దినమున పరిష్కరింపవలసిన ముఖ్యమైన విషయ మేమనగా:- దేశాభ్యుదయమునకును, దేశము నెడ మనము నెరవేర్పవలసిన ధర్మములను మనము సక్రమముగ నెరవేర్పగలుగుటకును, మనలోనుండు భేదములను మరచిపోయి, అందరము కలసి, ఏకముగా పాటుబడుట ఎట్లు? ఈ విషయమును మనము పరిష్కరింపవలెను. క్రియాకూతమునకు పనులు నెరవేర్పవలసివచ్చినప్పుడు జాతీయవాదియనియు మితవాదియనియు భేదముంచకూడదు. ముందు మనము చేయవలసినకార్యము బహుగొప్పది. కనుక మనలో నుండు నీక్షుద్రభేదములను మరచిపోవలెను. మన మాతృదేశాభ్యుదయమునకై, ఈ ప్రస్తుత సందర్భమున, మన మందర మేకమై యొకరికొకరు చేయూతగ పనిచేయుట అత్యంతావశ్యకమైయున్నది. ఈ విషయమును మాత్రము మీరందరు జ్ఞప్తియందుంచుకొనుడు. ప్రస్తుత వర్తమానస్థితిగతులను బట్టి మన మందర మేకమై, గట్టిగోడ పెట్టినట్లు, ఏకగ్రీవముగ మన కోర్కెలను గవర్నమెంటువారికి తెలియచెప్పుకొనుట అత్యవసరమైయున్నది. కనుక యిప్పుడు తేలవలసిన విషయ మేమి? దేశసేవ జేయుటకై మన మందరము యేకమయ్యెదమా? లేక యేకము కాకుండ యుందుమా? ఇది చాల ముఖ్యమైన విషయము. దేశమున కత్యంతావశ్యములైన విషయములను చర్చించు నిమిత్తము ఏక సభలో మన మందరమును కలసి సంప్రతించుకొని నంతమాత్రముచేత, మన మూలసూత్రములను, మన పద్ధతులను మనము వదలుకొనినట్లు ఎంతమాత్రమును కాదని గట్టిగ నమ్ముడి. మన జాతీయ ప్రతిభకు దోహదముచేయుట కత్యంతావశ్యములైన పద్ధతుల నేర్పాటు గావించుటయే మన ముఖ్యవిధియై యున్నది. మనలో నెంతెంత భేదము లున్నను వాని నన్నిటిని మరచిపోవలెను. మన దేశప్రజల కందరకును స్వాతంత్ర్యహక్కులను సంపాదించు నిమిత్తము మన సోదరులతో కలిసి పనిచేయుట శ్రేయోదాయకము. ఈ తరుణమున మన మింకను మనలో మనము పోరాడుకొనుచునే యుండినయెడల, మన (రాజకీయ) శత్రువుల చేతికి కత్తినిచ్చి మన మూరకున్నట్లే యగును. ఇదివరకే చాలకాలమునుండి ప్రభుత్వమువారు మనలో నొకకక్షవారిని తమ వైపునకు లాగికొని, రెండవ కక్షవారిని అణచివేయుచుండిరి. ఇంతకాలము నుండియు ప్రభుత్వమువారి పద్ధతి యిదియే. ఈదినము లన్నియు మన కెంతయు దురదృష్ట దినములు. కాని యికమీద ప్రభుత్వమువా రవలంబించు యిట్టి పద్ధతి తిరిగి జరుగు గాంచకుండునట్లు మనము జాగ్రత్తగ నుండుటకై గట్టిగ ప్రయత్నము చేయవలెను. మన మందరమును కలిసి యేకమై, మనకోర్కెలన్నిటిని, ఒక్క మాటగనే చెప్పుకొనిననేగాని, లేనియెడల దేశమునకు లాభముకల్గ జాలదు. దేశమంతయు నిప్పుడు చాలశాంతముగను క్షేమముగను ఉన్నదని కొందరనుచున్నారు కాని మనకు కావలసినది ఒక్కశాంతము గాదు. దేశములో శాంతియుండవలసినదే కాని దేశములో నభివృద్ధికూడ నుండవలెను. దేశాభివృద్ధినొందవలయు ననుతలంపు

నిజముగ మీకున్నయెడల, తదభివృద్ధికై రెండవ కక్షవారైన మన దేశ సోదరులతో కలసి యొకరికొకరు చేయూతగ పనిచేయుటకు మీరు సిద్ధపడెదరా లేదా? ఇది మిమ్ముల నడుగుచున్నాను. నేను మిమ్ముల నిట్లేల నడుగుచున్నానో నా యభిప్రాయమును మీరు గ్రహించినట్లయిన తప్పక మీరు నా ప్రశ్నకు అనుకూలమైన ప్రత్యుత్తర మొసంగెద రని నే నమ్ముచున్నాను. మీరు తప్పక నే జెప్పిన దానిని చేయుటకై సిద్ధపడెద రని తలంచెదను. మన జాతీయవాదుల పక్షములో మాత్రము, సర్వవిధముల ముఖ్యమైన యీ రాజీవిషయమై అందరు పూర్ణముగ, నేకాభిప్రాయులై యున్నారని నే చెప్పగలను. దీని విషయమై రెండవ యభిప్రాయ మెంతమాత్ర మసంభవము. దేశక్షేమమునకై కాంగ్రెసు సభను అందరితోడను చేయి కలుపుకొనుటకు మనము సిద్ధముగ నున్నాము. అంతియేగాక, దేశాభ్యుదయమున కుపకర మని తోచినయెడల, యెట్టివారితో నైనను కలసి పనిచేయుటకు మనము సిద్ధముగ నున్నాము. (అంతదూరము పోనేల) దేశక్షేమము నభివృద్ధి పరచు సీమను నొకదానిని స్థిరపరచి, మాకిచ్చెదమని ముందుకువచ్చి నిలువబడి సాయము గోరిన యెడల అధికారవర్గము వారికైనను నే చేయూత యొసంగెదను. నా చేతిని వెనుకకు లాగికొనను. నా దేశమున కధిక లాభకారి కాగలదని తోచిన యెడల నేను ఉద్యోగస్థులతో కూడ కలసి పనిచేయుటకు సిద్ధముగ నున్నాను. ఎవ రెన్నికువాదముల వాదించిన నేమి? మన విరోధులు మనల నెంత పరిహసించిన నేమి? మన ప్రతిపక్షులు మనల నెంత క్రీగంట చూచిన నేమి? మనదేశక్షేమము కొరకై మనము సమస్తభేదములను మరచి పోవుటకు సిద్ధముగ నున్నాము. మన దేశచరిత్రలో వర్తమాన సందిగ్ధస్థితిగతులను బట్టి మనలో నిక నెట్టి భేదభావములను లేకుండజేసికొన చూచుటకై మనము నిశ్చయాభిప్రాయులై యున్నాము! అసలు జాతీయవాదముయొక్క మూలసూత్ర మిదియే. నిజమైన స్వజాతీయవాది యెప్పుడును కక్షయందు పట్టుదల బుద్ధితో వర్తింపడు. (కక్షయే ప్రధానముగ జేసికొని తదితరవిషయములను నాశనపరుపడు) కక్షలను వదలుకొని, మన సోదరు లందరితోడను చేదోడు వాదోడుగా జరించుటకు మనము కృతనిశ్చయులమై యున్నాము. ఇట్లు చేయుటకు మనలో నెవరైన యిష్టపడనియెడల, అట్టివారు నిజమైన జాతీయవాదు లని పిలిపించుకొనుట కర్హులు కారని నే చెప్పుచున్నాను అభిప్రాయభేదము కలిగినందున, మనము మొదట మితవాదులయందు కోప వహించి, పోట్లాడి, వారినుండి చీలిపోయిన మాట వాస్తవము. అప్పుడు మనము పోట్లాడుకొనుటకు కారణము వేరు. ఏమనగా:—దేశములో నుండు వివిధసంఘములవారును, వివిధతరగతులవారును, సమస్త అభిప్రాయభేదములు కలవారును వచ్చి కాంగ్రెసు సభాకార్యమునందు పాల్గొనుటకు హక్కుగల. జాతీయవాదులమైన మనము పట్టుపట్టినాము కాని, మన మితవాదసోదరులు కాంగ్రెసు సభను, శుష్కవాగ్వాదము గావించు సభగా మార్చివేయవలె నని ప్రయత్నించిరి,

ఇదివరకు మీరు కాంగ్రెసుసభలోనికి అసలు అడుగిడుటకే వీలులేకుండ, సభాద్వారములను మూసివేసిన సంగతిని జ్ఞాపక ముంచుకొనుడు. ఇప్పుడన్ననో, (మిమ్ములను లోనికి రానిచ్చుటకు) సభాద్వారములను కొద్దిగ తెరచియుంచుటకు వారు తమ యంగీకారమును వెలిబుచ్చుచున్నారు. దీనినిబట్టి వారు మనతో కలసిమెలసి పనిచేయుటకు యిష్టులైయున్నారను సూచన మీకు గాన్పించుట లేదా? రాజీ యనుదానికి అర్థమేమి? ఇదివరలో పోరాడుకొనుచుండిన యుభయ పక్షములవారును, మధ్య నెచ్చటనో కలిసికొనుటకై, ఒకరికొకరు అభిముఖముగ కొన్ని యడుగులు ముందునకు నడువవలెను. మన మితవాద సోదరులు రాజీ మార్గమునకు వచ్చుటకు సిద్ధముగ నున్నట్లు అనేక సూచనలు గలవు. ఇది ఎంతయు నిస్సంశయముగ సత్యము. వారి కోర్కెల ప్రకారము మీరు కూడ, తదనుగుణముగ, ప్రవర్తించెదరా? లేదా? మీ రిప్పుడు పరిష్కరించుకొనవలసిన విషయ మిది. మీ రిప్పుడున్న స్థానమునుండి కదలి, వారి కెదురుగ బోవుట మీ కిష్ట మగునా కాదా? అట్లు వారి నెదుర్కొనబోవుట మీ కిష్టమైనయెడల, యిక "వారు 15 అడుగులు మాత్రమే దిగి వచ్చినారే, మనము 100 అడుగులు ముందునకు సాగి పోవలసివచ్చుచున్నదే" యని మీరు సణుగుకొన నక్కరలేదు. "మీ రెన్ని అడుగులు ముందునకు బోవలెను? లేక వా రెన్ని అడుగులు ముందునకు రావలెను!" అనుదానితో నిప్పుడు పనిలేదు. అసలు విషయ మదికాదు మీకు అసలు మొదట మీ స్థానమునుండి కదలుట కిష్టమున్నదా? లేదా?—యను నదియే ముఖ్యవిషయము. ఇప్పుడు మీరు పరిష్కరింపవలసిన సమస్యయిది. మీరు రాజీ మార్గమునకు రాదలచుకొనినప్పుడు, మీ ప్రతివాదిపక్షమువారు వచ్చి సరిగ యిద్దరకును మధ్య నిలువబడవలెనని మీరు పట్టుబట్టిన ప్రయోజనములేదు. మనము మార్గ మధ్యమున నెచ్చట కలసుకొనినను ఒక్కటియే. (సరిగ చెరి సగములోనే కలసుకొనవలె నను పట్టుదలతో పనిలేదు.) ఎచ్చటనో, ఒకచోట మనము కలసుకొని తీరవలెను. అందులో ముఖ్యముగ, మన మితవాద సోదరులు మనతో రాజీచేసికొనెద మని తమ నిర్దుష్టమైన కోర్కెను సుస్పష్టముగ వెలిబుచ్చినప్పుడు, మనము తప్పక కలసుకొని తీరవలెను. నిజముగ నిప్పుడు తేలవలసిన విషయమిది. నేనిప్పుడుచూపిన కారణములు మీ మనస్సునకు గట్టిగ నచ్చినవని నే తలంచెదను.

## నిర్హేతుకమైన భయము

మన మందరమును కాంగ్రెసులో తప్పకచేరవలెనని యిప్పుడు మీ కందరకును స్పష్టమైనది. మనకొరకు వా రిప్పుడు కొద్దిగ తెరచియుంచిన ద్వారముగుండ లోనికి ప్రవేశించి, దీని సాధారము చేసికొని, యికముందు, ద్వారమునంతను పూర్తిగ తెరచివేయుటకై మనము గట్టిగ ప్రయత్నింపవలెను. ఒక్కపర్యాయము గనుక, జాతీయవాదులను కాంగ్రెసుసభలోనికి రానిచ్చినట్లయిన, మనసంఖ్య యెక్కువయై, మన యత్యధికసంఖ్యాబాహుళ్య బలముచేత వారిని ముంచి వేసెదమని మన

మితవాద సోదరులు భయపడుచున్నారు. కాని వారట్లు భయపడుటకు కారణమేమియును గాన్పించదు. కేవలము ఒక్కరాష్ట్రములోనే మాత్రము జాతీయవాదులసంఖ్య యెక్కువగ నుండిన నేమి ప్రయోజనము? ఈ ఒక్క ఎక్కువ సంఖ్య యున్నంతమాత్రముచేత కాంగ్రెసులో వారిపదవికి యేవిధమైన లోపమును జరుగనేరదు. అన్నిరాష్ట్రములవారును జాతీయవాద ప్రతినిధులను ఎక్కువగ సభకు పంపినట్లయిననే మితవాదపక్షము మునిగిపోగలదు. (కాని లేనియెడల మునిగిపోనేరదు). ఈ విషయమును కాంగ్రెసు సభయొక్క విషయనిర్ణయసంఘములో యోచించలేదు. అందువలననే ప్రతిరాష్ట్రమునుండియు 15 గురుకంటె యెక్కువసంఖ్య జాతీయవాద ప్రతినిధులు రాగూడదను నిర్బంధమును వారేర్పరచిరి. ఈ "15 గురు" అను షరతునకు మనము ఒప్పుకొని, సభలో ప్రవేశించి నట్లయిన మన మీనిర్బంధమును వెంటనే తొలగింపవచ్చు నని నేనిశ్చయముగ చెప్పగలను. 15 గురు జాతీయవాదులను వారిలోపలికి రానిచ్చుటకు సమ్మతించిరి గనుక, మనతో కలసిమెలసి పనిచేయుటకై వారికి మనస్సులలో నిష్కళంకమైన కోర్కెగల దని స్పష్టమగుచున్నది. మితవాదులు తమ యీ కోర్కెను వెలిబుచ్చియుండని పక్షమున, నేను మిమ్ముల నందరను యీ "15 గురు" అను షరతునకు ఒప్పుకొనవలసిన దని యింత బలవంతబెట్టి యుండను? ఈ సంగతిని మాత్రము మీరు జ్ఞప్తియం దుంచుకొనుడు. ఈ షరతునకు ఒప్పుకొని మనము తిరిగి కాంగ్రెసులో ప్రవేశించుచున్నామనగా నేమియర్థము? కాంగ్రెసు నిర్మాణపద్ధతిని మార్చివేయుటకు మన కుండు హక్కును వదలి వేయుచున్నామనియా? అట్లెన్నటికిని అర్థము కాదు. (కాంగ్రెసునిర్మాణపద్ధతిని మార్చుటకు మనహక్కు ఎప్పటికిని ఉండియే తీరును) ఈ పద్ధతికి మనమిప్పుడు ఒప్పుకొనినంత మాత్రముచేత, మన యీ హక్కును వదలుకొని నామని యెన్నటికిని అర్థము కాదు) ఈ షరతును తీసివేయుటకై మనము కృతనిశ్చయులమై యున్నాము; కాని మనము కాంగ్రెసునకు బయట నిలుచున్నంత వరకు మన మేకార్యమును నెరవేర్పజాలము. లోపల ప్రవేశించిన పిమ్మటనే మన మీ పనినిచేయుటకు సాధ్యమగును. కనుక ముందు, లోనికి ప్రవేశించు నిమిత్తము, మన మీ "15 గురు" అను షరతునకు ఒప్పుకొనితీరవలెను. "బాప్టిస్టాగారు" చమత్కారముగ శెలవిచ్చినట్లు, కాంగ్రెసు సభలోనికి బోవుటకు మనకు సన్నని చిన్న యిరుకు త్రోవయొకటి దొరికినమాట స్పష్టము. మీ మనుష్యులను దానిగుండ లోనికిపంపుటకు మీరు సిద్ధముగ నున్నారా? లేరా? కాంగ్రెసు నిర్మాణపద్ధతిని మార్చుటకు మీకు హక్కుగలదని కాంగ్రెసు నిబంధనలే మీకు అధికారము నిచ్చియున్నవి. మీరీ యధికారమును ఉపయోగపరుపదలచుకొని నట్లయిన, వారు మీ మీదనెన్ని నిర్బంధములను పెట్టినను మీరు వాని కన్నిటికిని ఒప్పుకొని కాంగ్రెసులో ప్రవేశించియే తీరవలెను. గత్యంతరము లేదు. (ఈ పనిని నెరవేర్చుటకు వేరు మార్గము లేదు.) మన మితవాద సోదరులతో కలియుటకు మనము కృతనిశ్చయులమై

యున్నాము. కాంగ్రెసులోచేరి, పోరాటములు పెట్టవలయునను ఉద్దేశముతో మనము చేరుటలేదు. దేశాభ్యుదయమునకై మన మట్లుచేరుట అత్యంతావశ్యకమై యున్నది గనుక మనము చేరుచున్నాము. మన "కేల్కారు"గారు భారతవర్షమునం దంతటను సంచారము చేసివచ్చినారు. దేశమంతయు నీ రాజీకి సిద్ధముగ నున్నదని వారు శెల విచ్చుచున్నారు. మన మందరమును యీ "15 సూత్ర" అను షరతునకు ఒప్పుకొని, కాంగ్రెసులో ప్రవేశించుటకు నిస్సందేహముగ తీర్మానించు కొనవలసిన దని ఆయన తన యనుభవమును బట్టి చెప్పుచున్నారు. మన దేశాభ్యుదయమునకే మన మీ కాంగ్రెసులో ప్రవేశించుచున్నాము గాని, మన పక్షమున కేదియో మేలు గలుగ గలదను ఉద్దేశ్యముతో మన మెన్నడును అట్లు ప్రవేశించుట లేదని మాత్రము మన మందరమును జ్ఞప్తియం దుంచుకొనవలెను. (చప్పట్లు.)

---

# 11. తిలక్‌గారికి వాగ్బంధము (గవర్నమెంటు ఉత్తరువు)

## (1918 సం॥ జూన్ నెలలో పూనహా కిర్లోస్కరు నాటకశాలలో నిచ్చిన ఉపన్యాసము)

## హిందూదేశ రక్షణశాసనమును దుర్వినియోగముపరచుట బొంబాయి ప్రభుత్వమువారి ఉత్తరువు

బాలగంగాధరతిలక్ అను వానికి—సాకిన్, పూనహా.

1. "ఈజిప్టు, పాలస్తీనా, మెసపొటేమియా ప్రాంత యుద్ధరంగములలో పోరాడుచున్న మనవారి సైన్యవ్యూహములకు దోడ్పాటుగా హిందూదేశము నుండి నిరంతరము విశేషసేనలను పంపుట అత్యంతావశ్యకమై యున్నదని భారతవర్ష సామ్రాజ్యపాలనా ధురంధరుడైన జార్జిసార్వభౌముడు మనకు పంపిన దయాదరపరిపూర్ణమైన సందేశములలో ప్రకటింపబడియున్నది. గనుకను"

2. "దీనినిబట్టియు, ప్రభుత్వమువారును వైస్రాయిగారును గావించిన ప్రకటనలను బట్టియు, మరి యితర మార్గముల మూలమునను, యుద్ధము కొనసాగించు కొనుటకును, భారతవర్షమును రక్షించుకొనుటకును భారతవర్ష సైన్యములలో అసంఖ్యాకులగు సైనికులు ఎక్కువగావచ్చి చేరుట అత్యంతావశ్య మని ప్రతివానికిని తెలియును గనుకను"

3. "ఈ విషయము లిట్లుండగా, ఆన 1918 సంవత్సరం జూన్ 22 వ తేదీన పూనహా పట్టణములో 'కిర్లోస్కర్' నాటకశాలలో ఈ క్రింద నుదహరించిన మాటలను,

లేక ఈయర్థమునే యిచ్చుమాటలను అచ్చట నిచ్చిన యుపన్యాసములో బాలగంగాధర తిలక్ అను నీవు చెప్పియున్నావు గనుకను''

4. ''ఈ చెప్పిన మాటలును వానిలోని సారాంశమును భారతవర్ష సైన్యములోనికి యోద్ధభటులుగా మనుష్యులు వచ్చి చేరకుండునట్లు ప్రజలను నిరుత్సాహపరచుచున్నవి. గనుకను''

5. ''దేశక్షేమమునకును, భారతవర్ష సంరక్షణమునకును ప్రతికూలముగ నీవు ప్రవర్తించినట్లు విశ్వసించుటకు సహేతుకమైన కారణములుగలవని బొంబాయి ప్రభుత్వమువారు అభిప్రాయ పడియున్నారు గనుకను''

6. "ఇకముందు నీవెచ్చటనైన నుపన్యసింప దలచుకొనినయెడల, ముందుగా ఆ జిల్లా మేజస్ట్రీటుగారి వ్రాతమూలకమైన యనుజ్ఞనిదేగాని, బొంబాయిపట్టణములో నుపన్యసింప దలచుకొనిన యెడల, పోలీసు కమీషనరుగారి యనుజ్ఞలేనిదే గాని, ఎచ్చటను బహిరంగముగ నుపన్యసింపకూడ దని, ఆను 1915 సం॥ డిశంబరు 9 వ తేదీని చట్టనిర్మాణ సభలోని 86 వ నెంబరుగల ఇండియా ప్రభుత్వమువారి ప్రకటనలో ప్రచురించిన, 1915 సంవత్సరపు 'హిందూదేశ రక్షణ చట్టము'లోని 3 వ చట్టము ననుసరించి తమ కొసంగబడిన యధికారమును బట్టి (బహిరంగముగ నుపన్యసింప కూడదని) నిజమంత్రివర్గముచే పరివేష్టితుండైన బొంబాయి గవర్నర్ గారు నీ కాజ్ఞాపించుట కెంతయు చిత్తగించి యున్నారు. ఇకముందు జారీచేయబడు నుత్తరువులు గాక, ప్రస్తుత మీయుత్తరువు మాత్రమే యొసంగబడిన దని యెరుంగవలెను.''

7. ''ఈ ఉత్తరువు యే బహిరంగసభకైనను వర్తించును. ఈ యుత్తరువులోని "బహిరంగోపన్యాసము''నకు అర్థ మేమనగా;—ప్రజాసమూహమునకుగాని, ఒక జాతివారికిగాని, జాతిలోను, ప్రజలలోను యే భాగమున కైనగాని, ప్రైవేటు స్థలములోగాని, టిక్కెట్లు వగైరాలు పెట్టిగాని చెప్పునే యుపన్యాసమునకైనను అర్థమిచ్చును.''

8. "కాని మాంటేగ్యూ స్కీమును చర్చించుటకుగాను, సమకూడు ప్రత్యేక జాతీయ మహాసభలో మాత్రము శాస్త్రసమ్మత సంస్కారణములను గూర్చి గావింపు ఉపన్యాసమునకు యీ నిర్బంధము వర్తింపదు''

నిజమంత్రివర్గముచే బరివేష్టితుండైన
బొంబాయి గవర్నర్ గారి యాజ్ఞకు బద్ధుడనై వర్తించు,
జె. క్రెరార్ (అనియున్నది)
గవర్నమెంటు ఆక్టింగు సెక్రటరీ.
న్యాయశాఖ; పునహా ఆను 1918 సం॥ ఆగష్టు 31 తేదీ.

ఉపన్యాసభాగము:—(3 వ పేరాలో సూచించిన మాటలు.)

9. "భారతవర్షమునకు కీడుమూడనున్నది. మూడిన మనకేమి? మన కీదేశములో హక్కులు, స్వాతంత్ర్యము లేనప్పటికిని, మనము బానిసలుగ (గులాములుగ) నెంచబడు చున్నప్పటికిని, మనమేల ముందుకువచ్చి యీదేశమును రక్షించవలెను? ప్రభుత్వమువారి కీ సమయములో జీతములు పుచ్చుకొని పనిచేయు సైనికులు కావలెను. డబ్బుపుచ్చుకొని పోరాడువారు కావలెనట. తమయధికారమునకు భంగము కలుగకుండ కాపాడుకొనుటకై ధనాశగలవారు వచ్చి పోరాడవలయునని కోరుచున్నారు."

"అట్లు పోరాడువాని దృష్టి యెప్పుడును రూపాయలమీద నుండును గాని, దేశక్షేమము మీద నుండదు. బొంబాయి రాజధానిలో నింతవరకును సైన్యములో చేరినవా రందరును యిట్టివారే. వీ రందరును కడజాతులలో నుంచి చేరినవారే. దొంగతనములు, దోపిడీలు చేసికొని బ్రతుకుటయే వీ రందరికిని యిప్పటి వరకును జీవనాధారము. (వీరి వృత్తియిది)"

"అధికారవర్గము వారందరును దేశమును పాడుచేసిరి. తిరిగి వీరి యధికారము నింకను బలపరుచుటకు మనమేల సైన్యములో చేరి పోరాడవలెను?"

"మా భారతీయునకు, మిలిటరీ డిపార్టుమెంటు యుద్యోగములన్నియు నిచ్చెదమని ప్రకటించుడి యూరోపియనులతో సమానమైన హక్కుల నిచ్చెదమని ప్రకటించుడి. తక్షణము యీ దినమున, ఒకటి రెండు లక్షలే కాదు, పదిలక్షల జనమైనను యుద్ధరంగమున ప్రాణములు విడుచుటకు బయలుదేరెదరు. మేము చెప్పు యీ మాటలకు వారు సమ్మతించరు. సైన్యములోనికి మనుష్యులను చేరనీయకుండ మనము చెప్పుచున్నామని ప్రభుత్వమువారు మనలను నిందించెదరు. మన మట్లెంత మాత్రము చేయుటలేదు. వందరూపాయలకు ఆశపడి, సైన్యములోనికి బోవుచున్న వానికి, మనమెంత వద్దని చెప్పినను ఆగడుగదా. ఆవంద రూపాయ లిచ్చినను సైన్యములోనికి పోకుండ నుండువారుకూడ వేలకొలదిగలరు. అట్టివారికి వెళ్ళవలసినదని మన మెంతచెప్పినను, వారు వెళ్ళరు. అట్టివారికి మనమిక నేమని చెప్పవలెను? "ఈ యింగ్లీషువారు మనమీద 'జులుము' యెక్కువ బలముగ జేయుటకుగాను, మీరందరును సైన్యములో చేరుడి" యని చెప్పవలెను. దేశములో మనకు స్వరాజ్యము లేనప్పుడు, దేశములో మనకు క్షేమము లేనప్పుడు, ఒకవేళ యీ దేశమునకు జర్మనీ టర్కీవారు దండెత్తి వచ్చినప్పటికిని. యీ దేశమును రక్షించుకొనక పోయిననూ క్షేమమే! మనకు స్వరాజ్యము లేని దేశము టర్కీవారి స్వాధీనమైన నేమి, లేక యింగ్లీషువారి స్వాధీనములో నున్న నేమి! మనుష్యుల నందర నీ సమయమున నీ విధముగనే చూచినయెడల, యీ యుద్ధ విషయమై ప్రజలమైన మన మేమియు సహాయము చేయజాలమనియు, సహాయము వచ్చునని ఆశపెట్టుకొనవద్దనియు మనమందరము గట్టిగ గవర్నమెంటువారికి చెప్పవలెను." "ఇప్పుడు సైన్యములో చేరువారి నందరిని యీవిధముగనే, డబ్బు ఆశపెట్టియే, సైన్యము లోనికి తీసికొనుచున్నారు. మావాళ్ళ

పటాలమొకటియా ! మాదిగ పటాలమొకటియా ? వీళ్ళందరు దేశము నెట్లు కాపాడగలరు : వీళ్ళు చేసే రక్షణయేమి? యుద్ధములోనుంచి వీళ్ళను వదలిపెట్టగనే, వీళ్ళందరు తిరిగి దొంగతనములకును, దోపిడికిని బయలు దేరెదరు" "మాలవాళ్ళను పచ్చివవాళ్ళను దేశములో చాలమంది యున్నారు. పచ్చిపవాళ్ళెప్పుడైనను సేనలలో చేరి యుద్ధము చేసినారా? దొంగతనము వాళ్ళ వృత్తి. దెబ్బలు తినడము వాళ్ళ వృత్తి. సైన్యశిక్షణలోనుండు తీవ్రమైన రణశాసనమును వాండ్లు తాళజాలరు. వాళ్ళను తిరిగి వెనుకకు పంపివేయవలసినదే. అట్టి పచ్చిపవాళ్ళను, మాల మాదిగలను సైన్యములోనికి పనికివచ్చెదరట గాని స్వచ్ఛమైన (మహారాష్ట్ర) బ్రాహ్మణులు పనికిరారా? వారిసహాయ మక్కరలేదట. ఇట్లు చేయుటెంతయు అన్యాయము. న్యాయవిరుద్ధము." ('మరాటా' పత్రికనుంచి)

(తా నీవిధముగ చెప్పి ప్రజలను నిరుత్సాహపరుపలేదనియు, పైగవర్నమెంటు వారి యుత్తరువులో నుదహరించిన మాటలు సరిగలేవనియు, పూర్వోత్తర సందర్భములను విచారించకుండ యిదియెచ్చటనుంచియో వ్రాసినమాటలనియు, తిలక్ గారు చెప్పియున్నారు. తిలక్ గారు మొదట మహారాష్ట్ర భాషలో చెప్పిన యీ యుపన్యాస సారాంశమును మరాటా పత్రికలోనుంచి యెత్తి వ్రాయుచున్నాము.)

## అసలు ఉపన్యాససారాంశము

సైన్యములకు మనుష్యులను పోగుచేయు విషయమునకును, శివాజీ యుత్సవమునకును చాల దగ్గర సంబంధమున్నది. ఔరంగజేబు మహారాష్ట్ర దేశము మీదికి దండెత్తి వచ్చినప్పుడు మనము డబ్బిచ్చి పోగుచేసిన మనుష్యుల సైన్యబలముతో మన మహారాష్ట్ర దేశమును రక్షించుకొనలేదు. పండరపుర సంతలలోనికిని, బజారుల లోనికినిబోయి మనుష్యులను బలాత్కారముగ లాగికొనివచ్చి సైన్యములో జేర్చుకొని ఆ సైన్యముతో మనము ఔరంగజేబును యెదిరింపలేదు. బీజపూరు గోల్కొండ నవాబులకును, ఔరంగజేబు చక్రవర్తికిని జీతములనిచ్చి పెట్టుకొనిన సైన్యము లనేకము లుండెను. కాని మహారాష్ట్రవీరులు శివాజీచేత ప్రోత్సహింపబడి, దేశభక్తిపూరితులై తమ్ము నెదుర్కొనిన ఔరంగజేబు యొక్క కూలీల సైన్యమును ధైర్యముతో నెదిరించి పోరాడిరి. మహారాష్ట్ర [illegible] 50, 60 వేల దండిమగలుగల సైన్యప్రవాహంబు మహారాష్ట్రుల కుండెను. వీరందరును దేశభక్తిపూరితులైన వీరాగ్రేసరులే. వీరందరు తమ మాతృదేశరక్షణార్థము తమ సొంత గుర్రములతో గొప్ప గుర్రపుదళములను సమకూర్చుకొని యుద్ధరంగమునకు నురుకుటకు తమంతటతామే సంసిద్ధులై వచ్చి యొక్కటై నిలువబడి రాజారామును జింజీకోటకు పంపిన తరువాత యిట్టి యీ సైన్యముతోడనే మన ధనాజీ సంతాజీ గార్లు మహారాష్ట్రరాజ్యమును సంరక్షింపగలిగిరి. కాని పీష్వాల కడపటిదినములలో పాత సైన్యమును నెలకొల్పు నిట్టి పద్ధతిని క్రమముగ మానివేసిరి. జీతముల నిచ్చి అరబ్బులను సైన్యములో చేర్చుకొన ప్రారంభించిరి.

పీష్వాల ప్రభుత్వ మంత మొందుట కిది కొంత కారణ మయ్యెను. తుదకు బాజీరావు తనప్రభుత్వమును వదలుకొని మహారాష్ట్రదేశమునంతను ఇంగ్లీషువారి వశము చేసెనని మహారాష్ట్రప్రజ లెంచి (యూరకొనిరి.) కాని పూర్వము శివాజీ యేర్పాటు గావించిన పౌరసైన్య పద్ధతియే యుండియుండిన యెడల మహారాష్ట్ర రాజ్యమునంతను తీసికొనిపోయి ఇంగ్లీషువారిచేతిలో పెట్టుటకు బాజీరావున కేమి హక్కు గలద''ని (యుక్త్యుక్తులై పోరాడి ప్రతిమహారాష్ట్రుడును మహారాష్ట్ర ప్రభుత్వాధికారమును నిలబెట్టెడివారు. పీష్వాలప్రభుత్వ మంత మొందిన పిమ్మట పూర్వపు మహారాష్ట్ర సర్దారుల కందరికిని పింఛనుల నిచ్చి పంపివేసి, జీతముల నిచ్చి సైన్యములో మనుష్యులను చేర్చుకొనిరి; హిందూదేశపు సరిహద్దులలో నుండు అడవిజాతులవారిని మన ప్రభుత్వమువారు సైన్యములోనికి తీసికొనిరి. సైన్యభటులు అడవిజాతివారు! సర్దారులును హవల్దారులును, కమాండరులును ఇంగ్లాండునుంచి తీసికొని వచ్చిన తెల్లదొరలు! ఇట్టి కూలీ సైన్యముతో మన భారతవర్షమును గాపాడ జూచుట మన యధికారవర్గమువారి పద్ధతియై యున్నది. మారుమాట లేని విధేయతయు, నిజదేశమునెడ భక్తికృతజ్ఞతలును శిపాయిల కుండవలసిన లక్షణములు. ఈ రెండు నుండిన చాలును. కాని ఇట్టి కూలీల సైన్యము నిజముగ యుద్ధరంగమున నిలిచి పోరాడుటకు యెంతమాత్రమును పనికి రాదని జగత్తున కంతకును తెలిసిన విషయమే. ఐనను మన యధికారవర్గము వారు మాత్రము దీనినే యాధారము జేసికొనిరి. యెందుకనగా, ప్రజా పౌరసైన్యమును నెలకొల్పిన యెడల తమ యధికార మంతయు పోవునను భయముచేత వారింకను ఈ కూలీల సైన్యమునే ప్రోగుచేయు చున్నారు, ''మాకు డబ్బివ్వండి, సైన్యములోనికి మనుష్యులను సప్లయిచేయండి. అంతియేగాని కమాండరులు మొదలగు గొప్ప ఉద్యోగములు, కమిషనులువచ్చు నని యాశ మాత్రము పెట్టుకొనవద్దు' అని మనకు తెలవిచ్చుచున్నారు. సైన్యములో తెలివిగల వారుండుట అధికారవర్గమువారి కిష్టములేదు. కోట్లకొలది మూఢులచేత గానిపనిని ధీమంతులైనవారు సాధించగలరు''అని మనువు చెప్పియున్నాడు.

సైన్యములోనికి మనుష్యులు కావలెనని మనల నడుగుచున్నారేకాని, ప్రజలకు హక్కులనుమాత్ర మిచ్చుటకు వారు సిద్ధముగ లేరట. పటాలములలో యూరపియనులతో సమానముగ మన హిందూదేశస్థులను కూడ అధికారపదవుల నిచ్చుటకు వారికి యిష్టము లేదు. మనము వారితో సమానముగ నుండుట వారికి యిష్టములేదు. కనుక సైన్యములో చేరవలసినదని ప్రజలకు మన మెంతచెప్పినను సైన్యములో చేరువాడెవడు? అట్లు చేరినయెడల మనమీద వారియధికారము యెక్కువయగును గనుక ఎవడును చేరుటలేదు. ఎంత ధనమడిగిన నంతధనమిచ్చి ప్రోత్సహించి సైన్యములో చేర్చుకొనిన కూలీభటుల సైన్యదళముతో దేశమును రక్షించుట సాధ్యము కాదని

యొకల, నేను జవాబుదారీ పడజాలను. నేనీసంగతిని గూడ తెలియజేయుచుంటి యున్నది. పై చెప్పిన వాయిదా లోపుగా గవర్నమెంటువారు ఈ ప్రశ్నకు సమాధానము చెప్పనియెడల నా డిపాజిట్లు కోర్టువారు నాకు పంపివేయవలసినది.

ఇట్లు మీ విశ్వాసి

బాలగంగాధర తిలక్ (అని వ్రాసినది.)

(ఆగష్టు 4. 1918 మరాఠాపత్రిక నుంచి)

---

# 12. సీమకు రాయబారము

## (1918 సంవత్సరము ఏప్రిల్ నెలలో చెన్నపట్టణములో నిచ్చిన ఉపన్యాసము)

[హిందూదేశమునకు స్వరాజ్యము కావలెనని యింగ్లీషు ప్రజలకు తెలియ జెప్పుటకుగాను మనదేశమునుండి బాలగంగాధర్ తిలక్, కర్క్రే, చంద్రపాలు మొదలగు వారందరును రాయబారము నడుప బయలుదేరిరి. ఇంగ్లాండు వెళ్ళుటకు తిలక్కొక్కపూర్వము చెన్నపురిలో 2, 3, దినములుండిరి. వీరందరికిని శ్రీమతి బిసెంటమ్మగారు అడయారులో నొక గొప్పవిందు చేసెను. ఆ విందు సమయమున బాలగంగాధరు డిట్లుపన్యసించెను.]

అమ్మల నాదరము గౌరవించి మమ్ములను దీవించినందులకు నేనెంతయు శ్రీమతి బిసెంటమ్మగారికి వందనము లాచరించెదను. భారతవర్షపక్షమున వాదించు నిమిత్తము మేమందరమును యింగ్లాండుదేశమునకు బోవుచున్నామని యందరికిని తెలియును. మేమీ తరుణమున భారతవర్షమునుండి బయటిదేశములకు బోవుట అనేక కారణాంతరములచేత అవసరమైనది. ఇప్పుడు దేశమును విడచి బయటికి వెళ్ళవలసిన అవసర మేమియని కొందరడిగిరి. మనమీ హిందూదేశములోనుండి యాందోళనము చేయుటకంటె, బయటికిబోయి భారతవర్షపక్షమున వాదించుటవలన యెక్కువపని చేయజాలమని నేనొకప్పుడు, 10 సంవత్సరముల క్రిందట, తలంచి యుంటిని. నిజముగ నట్లు తలంచినవారిలో నేనొకడను. పూర్వమొకప్పుడు నాయభిప్రాయ మట్లుండెను. "నీవొకప్పు డట్లు చెప్పియుంటి వేమ"ని జ్ఞాపకశక్తి బాగగనున్నవారు నాకిప్పుడు వ్యతిరేకముగ వాదింపవచ్చును. కాని యిప్పుడు కాలములు మారిపోయినవి. కాలానుసారముగ తన యభిప్రాయములను మార్చుకొనని మనుజుండు వంచనకు పాలగును. పూర్వమొకప్పుడు రాజద్రోహ ప్రసంగములుగ నెంచబడు యంశము లిప్పుడు రాజద్రోహములుగ నెంచబడుటలేదు. పార్లమెంటువారును ఆంగ్లేయసామ్రాజ్యమువారును

హిందూదేశము యొక్క విలువ నిప్పుడు గ్రహింపగలిగిరి. ఆంగ్లేయాధికారవర్గమువారి పరిపాలన కొంతవరకు యొకప్పుడు బహుబాగుగ నున్నట్లును, ప్రకాశమానముగ వెలిగి పోవుచున్నట్లును గన్పించెను. కాని మెరయు ప్రతివస్తువును బంగారము కాజాలదు గద. వీరి పరిపాలన పైకి యెంత మెరయుచున్నను లోపల క్షీణదశాసూచకమగు 'క్రిమి సముదాయ సంకులము'గ నుండెను. కీరిపాలన మొదట బాగుండెను. రైళ్ళు వేసిరి. పోస్టు టెలిగ్రాముల నేర్పాటుచేసిరి. మరి యిక యెన్నియో పనుల గావించిరి. ఎగుమతులు దిగుమతులు యెక్కువగ సాగుచుండెను. కాని దీనికంతెయు ఫలితముగ దేశము నిర్వీర్యమయ్యెను. నిస్తేజమయ్యెను. ఈ సంగతిమాత్రము యింగ్లండులోని యింగ్లీషుప్రజలకు యిదివరలో తెలియలేదు. (యీ సంగతి వారి నోటీసులోనికి వెళ్ళలేదు) ఇప్పుడిప్పుడే వారికిది తెలియవచ్చినది. ఎందుకనగా, యిప్పుడు యుద్ధము తటస్థించినది. సామ్రాజ్యపక్షమున యుద్ధములో బోరాడుటకు మనుష్యులు కావలసివచ్చిరి. హిందూదేశ మేమైన సహాయము చేయగలదని మనవైపునకు వారు తిరిగిచూచిరి. కాని యిచ్చటి యిండియా గవర్నమెంటువారు అందులకు సిద్ధముగ లేకపోయిరి. ఇచ్చట ముప్పదికోట్ల ప్రజలున్నను సామ్రాజ్యమునకు కావలసినంతమందిని యిండియా గవర్నమెంటువారు సప్లయిచేయలేక బోయిరి. యుద్ధములో పనిచేయుటకును, సామ్రాజ్యపక్షమున పోరాడుటకును ప్రజలు కుతూహలులయియే యున్నారు. మన కింత కుతూహల మున్నప్పటికిని, మన మింతమంది ప్రజల మున్నప్పటికిని తమ సామ్రాజ్యమును రక్షించుకొనుటకై పరరాష్ట్రములవారిని, పరజాతులవారిని, సహాయమునకై రావలసిన దని వీరు ప్రార్థింపవలసి వచ్చెను. ఎందువల్ల వారికీస్థితి సంభవించెను? దీని కంతటికిని కారణము కేవలము అధికారవర్గము వారవలంబించిన పాలనాపద్ధతియే యని నిగట్టిగ చెప్పగలను. దేశమునంతను నిర్వీర్యముజేసిన యెడల బహుకొద్దిమంది (వేల, నూర్ల) సంఖ్యగల సైనికులతోడనే దేశమును తేలికగ పాలించవచ్చును గదా యని గవర్నమెంటువారు మన దేశజనులను దుర్బలులను జేసియుంచిరి. బ్రిటిషువారి సైన్య, నావికాదళసహాయముచేతనే యీ హిందూదేశమును తమ కత్తిబలముక్రింద అణచియుంచగలము యని వీరి యుద్దేశము. ఈ నూరు, 150 సంవత్సరముల నుండి మన హిందూదేశమును యీ అధికారవర్గమువారి పాలనక్రింద యణచియుండని యెడల, యిప్పటికంటె బహు యెక్కువమంది ప్రజలు యుద్ధములోనికి వచ్చి చేరి యుండెడివారనియు, మన హిందూదేశ మనుష్యబలముమీద నాధారపడి యుండుటకు వీలుగనుండి యుండెడిది గదా యనియు యింగ్లీషు ప్రజలును, పార్లమెంటువారును యిప్పుడు తెలిసికొనిరి. ఎంతకాలమువరకు వారీ సంగతిని (మరచిపోకుండ) తెలిసికొని యుండెదరో, ఎంతకాలమువరకు మన దేశము వారికి చాలముఖ్యమైన దనియు, అవుసరమైన దనియు వారు గ్రహించెదరో, అంతకాలమును మనకు మంచికాలమే. ఇదియే మనకు మంచి సమయము. మన హక్కులకొరకు పాటుబడి

సంపాదించుకొనుట కిదియే మంచిసమయము. ఇదియే మంచి అవకాశము. ఈ విషయమును మన భారతీయులు కూడ బాగుగ గ్రహించవలెను. ఇక ఆంగ్లో-హైందవ పత్రికల విషయమై చెప్పనక్కరలేదు. ఏలనన, ఈ విషయమును గ్రహించుట వారి పనికాదు. ఏది యెట్లున్నను, అసలు ఉన్ననిజస్థితి యిది. మన స్వలాభము కొరకుగాక, సామ్రాజ్యక్షేమమునకై మన కోర్కెల ననుగ్రహించి తీరవలెనని మనము గట్టిగకోరుట కిదియే సమయము. మనము చెప్పు దానిని వారు వినెదరు. వారు తప్పక వినెదరు నాకు గట్టినమ్మకముగలదు (వినండి, వినండి) మన కేసు సిద్ధముగ నున్నది. సందర్భము లన్నియు నట్లున్నవి. ఈ సంగతి సందర్భము లన్నియు పదిసంవత్సరముల క్రింద (యింత అనుకూలముగ) లేవు. ఇదియే సమయము, దీప ముండగనే యిల్లు చక్కబెట్టుకొనవలెను. (జయము గాంతుమని) మనకు గట్టి నమ్మకము గలదు. మే మచ్చటికి బోయినయెడల తప్పక జయముగాంతు మని నే నెంచెదను. మన పక్షమును గట్టిగ నెగ్గించుకొనుట కిదియే ఉత్తమమైన తరుణము. (మన మచ్చటికి బోయినయెడల వారి యెదుట ననేకవిధముల ప్రయత్నింప వచ్చును.) "ప్రపంచమున యెల్లజాతులవారికిని స్వాతంత్ర్య మొసంగితీరవలయు" నను సిద్ధాంతము నాధారముచేసికొని మనకుస్వరాజ్యమిచ్చి తీరవలెనని వాదించవచ్చును. కాని యిది యొక్కటిమాత్రమే చాలదు. "స్వరాజ్యము మా (జన్మ) హక్కు అయి యున్నది" గనుక మాకు దానిని ప్రసాదించి తీరవలెనని వాదించవచ్చును. కాని యిదికూడ చాలదు. (ఈ విధమైన వాదముల మూలముననే గాక, యింక నితరములగు ననేకమార్గముల మూలమున, మన కోర్కెలను సిద్ధిబొందించుకొనుట కిదియే యత్యుత్తమమైన తరుణము.) నిజమే. స్వరాజ్యము మన జన్మహక్కని చెప్పియుంటిని; కాని జన్మహక్కులను సాధారణముగ యితరులు ఒప్పుకొనరు. అట్లితరులచేత ఒప్పించుటకై మనము గట్టిగ ప్రయత్నింపవలెను. మనము ప్రయత్నించుట కిదియే సమయము. ఇప్పుడు ప్రయత్నించిననే మన కెక్కువ ఫలలాభము గలుగగలదు. మన మంపబోవు వారుకూడ దానియొక్క అవసరమును వారంతట వారే ముందు గ్రహించవలెను. అట్లు వారు దాని యవసరమును బాగుగ గ్రహించిన పిమ్మట మనము వెళ్ళి గట్టిగ అడిగినట్లయిన విశేష ప్రయోజన ముండును. అప్పుడే వారు మనము చెప్పుదానిని వినుటకును మన ప్రార్థనలను మనకోర్కెలను శ్రద్ధతో విని (తీర్చుటకును) ఎక్కువ అవకాశ ముండును. అందువలననే మన స్వరాజ్యసమితివారు కూడ యిప్పుడు సీమకు రాయబార మంపుచున్నారు. ఈ దినములలో సీమకు ప్రయాణము చేయుట చాల అపాయకరమని చాలమంది చెప్పిరి. సముద్రముపైనను సముద్రము లోపలను కూడ ననేక అపాయములు సంభవించునని చాలమంది భయమొందుచుండిరి కాని కష్టపడి పనిచేయవలసిన సమయము వచ్చినప్పుడు ఆకార్యమునందే మనము విడువక దీక్షగలిగి యుండవలెనుగాని అపాయములు సంభవించునేమోయని భయపడి యాపనినివదలివేయకూడదు. అపాయమునకు

ప్రతిచోటను గలదు. అపాయములేనిచో టెచ్చటఁగలదు! నేనిప్పుడు నిలుచున్న యీ చోట అపాయములేదని మీరు చెప్పఁగలరా? కాని మీ యందరి యాశీర్వచన బలము వలనను, భగవదనుగ్రహము వలనను మేమీకార్యమున జయము గాంచగలమని నే నెంచెదను. మనము జయముగాంచి తీరవలెను. ఇది మా దృఢవిశ్వాసము: ఇది మావ్యజసంకల్పము మేము బోవునది మా స్వాభ్యుదయము కొరకు గాదు; అఖిల భారతవర్షాభ్యుదయప్రాప్తికై మేమేగుచున్నాము. (చప్పట్లు) దేశాభ్యుదయమునకై మన మేగుచున్నప్పుడు మన పక్షము ధర్మపక్షమను గట్టినమ్మకము మన కుండవలెను. మన పక్షము తప్పక నెగ్గగలదు; యిది తప్పదు. బ్రహ్మ మాదుపంక్తుల వ్రాసియే యున్నాడు. కనుక మన పక్ష వాదము బలయుతమే. యీ విశ్వాసము మన కుండవలెను. మనకెన్ని స్వాంతకష్టములున్నప్పటికిని, మార్గమధ్యమం దెన్ని కష్టములు సంభవించినను భగవంతుడు మన పక్షముననున్నాడు. మనము జయము గాంచితీరుదుము; "యతో ధర్మస్తతో జయః" యను ఆత్మవిశ్వాసముండవలెను. జయ మొందుటకు, జయము గాంచగలుగుటకు, శక్తివంచన లేక పాటుపడెదము. మే మచ్చట తుదకు జయమొందిన యెడల నది మీ యాశీర్వచన బలముననే యెంచెదము. మీరిచ్చట చేయు కృషివలననే, మీ యందరి సానుభూతి వలననే, మీరు నిరంతర మొనర్చు కొరకెని సహాయము వలననే మే మచ్చట జయమొందగలము. మీ పక్షమున మేము వాదింపఁబోవు చున్నాము. మా కొరకై మేము బోవుటలేదు. దేశక్షేమముకొరకై మే మేగుచు న్నాము. మార్గమధ్యమునం దపాయములున్నవని మాకు తెలియును. అయినను మేము తప్పక వెళ్ళితీరవలయునని మాకు పైనుండి భగవదాజ్ఞ యిచ్చినట్లు మా మనస్సునకు గట్టిగ దోచుచున్నది. మేము దైవాజ్ఞకు బద్ధులము గాకుండ నుండజాలము (దాని నుల్లంఘింపజాలము). నే నాయాజ్ఞను తిరస్కరింపలేను. నేను వెళ్ళియే తీరవలెనని నాకు తోచుచున్నది. నాతోవచ్చు నాస్నేహితులకు కూడ నట్లే తోచుచున్నది. మేము ధర్మకార్యమునకై బోవుచున్నాము. ఈ కార్యమునందు భారతవర్షాభ్యుదయ మంతయు నిమిడియున్నది. దీనివిషయమై జంకు ఉండ కూడదు. పూర్వమొకప్పుడు సీజరు చక్రవర్తి (మారువేషముతో) నోడయెక్కి ఇటలీ దేశముగుండ గ్రీసుదేశమునకు బోవుచుండెను. మార్గమధ్యమున తుపాను వచ్చెను. నావికులందరును ఓడ మునుగునని మానివేసిరి. వెంటనే సీజరు తనవేషమును తీసివేసి వారియెదుట నిలువబడి యిట్లు చెప్పెను "మీ కొరకై మీరు సముద్రముమీద ప్రయాణము చేయుటలేదు. మీరు * సీజరు చక్రవర్తి, ఆయన యభ్యుదయమును మీరు వెంటగొని పోవుచున్నారు." ఈ మాటలు చెప్పగనే, నావికులు వెంటనే ఆయనను గ్రీసుదేశమునకు తీసికొనివెళ్ళిరి. ఆయన అచ్చట జయమొందెను. మన ప్రస్తుతస్థితి కూడ నిట్టులనే యున్నది. మా మనస్సులలో నున్న విషయముల నన్నిటిని వివరించి

---

* సీజరుచక్రవర్తి రోమసామ్రాజ్యమును స్థాపించిన చక్రవర్తి. ఈతడు దిగ్విజయముచేసి ప్రఖ్యాతివడసెను.

చెప్పుటకిది సమయము కాదు. కాని మేము జయమును గాంచు టెంతయు మీయందరి సహాయము మీదనే యున్నది. మీయందరి సానుభూతిపైననే యాధారపడి యున్నది. కనుక మన మిందరమింత కాలమునుండి యేమి కావలయునని కోరుచున్నామో దానిని మా కిమ్మని వాదించుచున్నాము. దాని నేపట్టుకొని యుందుము. మీరిచ్చు సహాయమే దేశములో నట్లు చేయనియెడల మన మచ్చట నేమియును చేయజాలము. మీశక్తివలన మాకెంతయో సహాయము, బలము, ఉత్సాహము, కలుగగలదు. మీరిదివరకు చేయుచున్నట్లు గనే, యికమీదకూడ సాయము చేయవలసినదని కోరుచున్నాను. మీరు మమ్ముల నాశీర్వదించినందుల కెంతయు మీకు వందనము లాచరించుచున్నాను. సర్వవ్యాపకుడైన యా సర్వేశ్వరుడు మమ్ముల భగ్నమనోరథుల చేయకుండునుగాక యని వేడుకొనుచున్నాను. తగిన ధైర్యమును, మనోనిశ్చలత్వమును, చూపినయెడల భగవదను గ్రహమువలన మనము జయమొందితీరుదుము. (చప్పట్లు)

---

# 13. ఆంధ్రులు - మహారాష్ట్రులు

(ఆన 1918 సం॥లో మదరాసులో నిచ్చిన ఉపన్యాసము)

[31-3-18 తేదీన గోఖ్లే భవనమున మహారాష్ట్రులును, ఆంధ్రులును ప్రత్యేక విన్నప పత్రము అర్పించినప్పుడు తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను]

ఆంధ్రమహారాష్ట్ర సోదరులారా!

నేనిప్పుడు ఆంధ్రులను మహారాష్ట్రులను కలిపి మాట్లాడుచున్నాను. కారణ మేమనగా, పూర్వము విద్యానగర (విజయనగర) సామ్రాజ్య పాలకులైన ఆంధ్ర ప్రభువు లనుష్ఠించిన పరిపాలనా సూత్రములనే పిమ్మట మహారాష్ట్ర పాలకులు తమ ప్రభుత్వములలో నవలంబించిరి. ఈ విషయమందరికిని తెలియును. కనుక మహారాష్ట్రులమైన మేము మీ యాంధ్రుల కెంతయు కృతజ్ఞత చూపవలసి యున్నది. అటుతరువాత నీ పద్ధతులనే శివాజీయును, పిక్కట పాలకులు తమ ప్రభుత్వ కాలములలో నవలంబించి పాలించిరి. గనుక మన పూర్వులకును యిట్టి సంబంధమున్నది. అది యిప్పటివరకును కూడ పరంపరగా వచ్చుచునే యున్నది. మీ యాంధ్రులును సమర్పించిన విజ్ఞాపన పత్రములలోకూడ నిట్టి సంబంధమే యున్నదని నాకు గోచరమగుచున్నది. నేటివరకును కూడ అట్టి అన్యోన్యమైత్రి వచ్చుచునే యున్నది. అది యింకను పనిచేయుచున్నదనియే నేచెప్పదలచెను. మన భాషలు వేరైనను—ఒకటి ద్రావిడము, రెండవది మహారాష్ట్ర మైనప్పటికిని—

మన హృదయము లొక్కటియే. అఖిల భారతవర్ష మహాజాతికి అంగములై యుండి, యిప్పుడు యేమాత్రమును పేరులేక యిచ్చటనో బడియున్న మన స్వజాతుల దైన్యస్థితులను గూర్చి మనయుభయుల హృదయములును సమానముగనే చలించు చున్నవి. మనల నుభయులను ప్రేరేపించు భావము లొక్కటియే యని నానమ్మకము. మన స్వదేశభాషల నభివృద్ధి నొందించి, ఆయాభాషల ననుసరించి, రాష్ట్రవిభాగము లేర్పాటు గావించినట్లయిన భారతవర్షాభ్యుదయమున కిదియెంతయో మిక్కిలి సహకారి కాగలదని గట్టిగ నమ్మువాఁడను నేనొకఁడను. ఈ యభిప్రాయమునే చాలకాలము క్రిందట, ఆంధ్రోద్యమము బయలుదేరక పూర్వమే, చాలకాలము క్రిందటనే నేను వెలిబుచ్చియుంటిని. ఇంగ్లీషులో చెప్పిన దానికంటె మనస్వభాషలో చెప్పినయెడల, మన ప్రజాసమూహమున కెక్కువ బాగుగ తెలియును. ఇంగ్లీషుభాష యెప్పుడును, ప్రజల కందరకును, సామాన్యభాష కాజాలదు. దేశభాషలలోనే, ప్రజల కందరకు విషయములు బాగుగ తెలియఁజెప్పి, వారిని ప్రోత్సహించవలెను. నాజీవిత కాలములో, నే జేయఁదలచుకొనిన గొప్ప కార్యములలో నిదియొకటి. తక్కిన యింగ్లీషుపత్రికల కన్నిటికంటె నేను నా (మహారాష్ట్రపత్రికయైన) 'కేసరి' పత్రికయందే, అత్యంత శ్రద్ధవహించి యుండుటకు ఇదియేకారణమని నేగట్టిగ చెప్పుచున్నాను. దీనివలన ప్రజల కందరకును విషయములు బాగుగా గ్రాహ్యమగును. ఎన్నటికైనను విదేశభాష మనస్వదేశభాష కాజాలదు. భరతఖండమునందు వృద్ధిఁబొందుచున్న, ఆయారాష్ట్రముల వారికిమధ్య జరుగువ్యవహారములలో నది, సామాన్యముగ నుపయోగింపబడు భాష కావచ్చునేమో కాని అందరికిని సామాన్యభాషకాజాలదు. ఇది నాఅభిప్రాయము ఈ అభిప్రాయమునే, నే నెల్లప్పుడును నా యుపన్యాసములలోను, పత్రికలలోను వెలిబుచ్చి యుంటిని. కనుక నేనిచ్చట చెప్పిన యీ యభిప్రాయ విషయమై మీ రేమియు సందేహము నుంచుకొన వలసిన పనిలేదు. మన భారతవర్ష మెప్పటికైనను (అమెరికా) సంయుక్త రాష్ట్రముల వలెనే యుండి తీరవలెను. దేశము నందంతటను చిన్నచిన్న రాష్ట్రములుండవలెను. ప్రతిరాష్ట్రమునకును ఆ రాష్ట్రముయొక్క స్వభాష యుండవలెను. ఈ రాష్ట్రము లన్నిటిని కలిపి వ్యవహరించుటకు సర్వ సామాన్య భాషయొకటి యుండవలెను. (అసలు ఉండవలసినపద్ధతి యిది) కనుక మన స్వభాషలను వదలివేయుటకు వీలులేదు. దేశభాషలను కేవలము తుడిచివేసి, వానిస్థానమున క్రొత్తవానిని తెచ్చిపెట్టుట యసంభవము. మనకు స్వరాజ్యము వచ్చినప్పుడు యీ రాష్ట్రముల నన్నిటిని బహుశః భాగించ వలసియుండును. కాని మన మిప్పుడు విచారించ వలసిన ముఖ్యవిషయ మొక్కటి గలదు. భాషా ప్రయుక్త రాష్ట్ర విభాగము కావలయునని మనము కోరవలెనా ? లేక ముందు మనకు స్వరాజ్య మివ్వవలయునని కోరవలెనా ? ముందు మనకు స్వరాజ్య మివ్వవలయుననియే కోరవలెనని నాయుద్దేశము. అధికారవర్గమువారివద్దకు వెళ్ళి వారిని సలహా యడిగిన వారేమిచెప్పెదరో

విచారించుడి. "సరే! మీ యిష్టము వచ్చినట్లు రాష్ట్రములను విభజించి యిచ్చెదము, కాని స్వరాజ్యమును మాత్రము ఇవ్వము" అని ప్రత్యుత్తరము చెప్పెదరు. ఎందుకనగా, ఎక్కువ రాష్ట్రముల జేసినయెడల ఎక్కువ గవర్నరు లెఫ్టినెంటు గవర్నరు ఉద్యోగములు వచ్చును గద! కాని మన మేమి చెప్పవలెను? "ముందు మాకు స్వరాజ్య మివ్వండి తక్కిన యీ విషయము లన్నియు మేమే చూచుకొనెదము" అని చెప్పవలెను. ఈ రాష్ట్ర విభాగవిషయమును నేను కేవలము వెనుకకు త్రోసివేయను. అయినను సమస్తమును స్వరాజ్యమునం దిమిడియున్నందున ముందు మాకు స్వరాజ్యమే యనుగ్రహింపవలె ననుట యెక్కువ శ్రేయోదాయక మని నానమ్మకము. రాష్ట్రవిభాగము కావలయునని యిప్పుడే కోరవద్దు. రావలసిన సమయమున కది వచ్చితీరును. దేశభాషలు కూడ అభివృద్ధి నొందవలసిన సమయమున కవియే యభివృద్ధినొందును. మనకు స్వరాజ్య మిచ్చిన వెంటనే తక్కిన వన్నియును వచ్చితీరును. కనుక మన యాందోళన మంతయు, మన ప్రయత్నములన్నియు ప్రస్తుతము మన హిందూదేశమునకు స్వపరిపాలనను సంపాదించుట కొరకే వినియోగపడవలెను. (1-4 18 న్యూయిండియా పత్రికనుంచి కొంతభాగము)

---

# 14. మాంటేగ్యుస్కీము

(1918 సం॥ బొంబాయి ప్రత్యేకజాతీయసభలో నిచ్చిన ఉపన్యాసము)

[మాంటేగ్యుస్కీమును చర్చింపుచు తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను]

నేడీ జాతీయమహాసభా పీఠమున నన్ను * నోరు తెరువనిచ్చి నందులకుగాను నేను బొంబాయి ప్రభుత్వమువారికి వందనము లాచరించుట నా మొదటి విధియైయున్నది. కాని బొంబాయి ప్రభుత్వమువారు చూపినంత దయను ఈసభాధ్యక్షులు నాయెడ చూపలేదు. ఏలనన నేనిచ్చట 5 నిమిషములకంటె యెక్కువకాలము మాట్లాడ కూడదని అధ్యక్షులు సెలవిచ్చియున్నారు. (లేదు లేదు అని కేకలు) నేను వారి యాజ్ఞకు బద్ధుడనై యుండెదనని యొప్పుకున్నాను. ఇప్పుడు షుమారు 1½ గంట లైనది. ఇంకను ముందుచేయవలసిన పని చాలాయున్నది. 11 గంటలగు నప్పటికి అనేక తీర్మానములను గావింపవలసియున్నది. కనుక నాకింతకంటె ఎక్కువకాల మక్కరలేదు. నా స్నేహితుడైన గౌ॥ మదనమోహనమాలవ్యగారు సమర్థతతో ప్రతిపాదించిన తీర్మానము విషయమై ఇప్పటికి కొద్దిగ 2, 3 మాటలనే చెప్పి

---

* ఈ సభలో తప్ప మరియెచ్చటను బహిరంగముగ నుపన్యసింపకూడదని గవర్నమెంటువారు తిలక్ మహాశయుని 31-3-1918 తేదీన నిర్బంధించిరి.

మాగించెదను. ఇందులకు మీరు నన్ను మన్నింపవేడుచున్నాను, మన మిప్పుడు దేశములోనుండు వివిధాభిప్రాయములనన్నిటిని ఒకచోటచేర్చి బట్టిబెట్టి (కషాయము దించు) ప్రయత్నము చేయుచున్నాము. విషయనిర్ధారణ సభయే మన బట్టి. ఇది చాలపెద్దబట్టి ఈ పనిని చేయుట బహుదుష్కరమనియు, సాధ్యము గాని కార్యమును మనము తల పెట్టితిమనియు మన ప్రతిపక్షులు తలంచి యుండిరి. కాని ఎట్లయినను మన మీకష్టములనెల్ల గడచి జయము గాంచ గలిగితిమి. మన ప్రతికక్షులు పలికిన పలుకులన్నియు కల్లలాయెను. మనలో సమానభావమున్నంత వరకు, కాంగ్రెసు సభలలో నిచ్చిపుచ్చుకొను పరస్పరసాంత్వన భావము ప్రబలుచున్నంత వరకు, యికముందు కూడ మనకెట్టి దుస్థితియు సంభవింపదని నా నిశ్చితాభిప్రాయము. మాంటేగ్యుస్కీమును చర్చించ మొదలిడిన మొదటి దినముల వేడిలో దేశములో నచ్చటచ్చట యెవరో చెప్పిన మాటలను బట్టి, మన కాంగ్రెసు వారు మాంటేగ్యు స్కీమును కేవలము త్రోసివేయబోవు చున్నారని మన ప్రతికక్షులు శలవిచ్చిరి. కేవలముత్రోసివేయుట యన నేమో నాకు అర్థము కాలేదు. స్కీమును కేవలము త్రోసి వేసి యిక దాని ప్రశంసనే వదలు కొనుట (కాంగ్రెసు యొక్క) అభిప్రాయమైన యెడల, మనమందరము కలిసి యిచ్చటినుండి సీమకు రాయబారమంపనేల ? మన యభిప్రాయముల నన్నిటిని యీ రాయబారుల ద్వారా బ్రిటిష్ ప్రజలకు తెలియజెప్పుకొనుటకై మన మింత శ్రమపడనేల ? అసలు రాయబారమంపవలసిన అవుసర మేమి? అట్లయిన యెడల మనమంపిన యీ రాయబారులకు అచ్చట బ్రిటిష్ ప్రజలేమి ప్రత్యుత్తరము జెప్పెదరు ? స్కీమునుత్రోసి వేసినామని మాతో చెప్పుటకై మీరింతదూరము శ్రమపడి రానేల? యీసంగతిని మాకు పోస్టుద్వారా తెలియజేసి యుండిన బహుబాగుగా యుండెడిదే; యని మనరాయబారులకు వెంటనే బ్రిటిష్ప్రజలు ప్రత్యుత్తరము చెప్పిపంపివేయుదురు. మనము 150 సంవత్సరములనుండి మనపాలకులవద్ద కావలసినంత రాజ్యాంగనీతి నేర్చుకున్నాము. మనమట్లు స్కీమును త్రోసివేయుట నిష్ప్రయోజనమని మనము నేర్చుకున్న యీ రాజనీతినిబట్టి గ్రహించగలము. మన మెట్లయినను యీ కష్టమును జయించ గలిగితిమి. మనమందర మొకచోటచేరి. వివిధాభిప్రాయములను క్రోడీకరించుకుని, సమాధాన భావముతో నేకాభిప్రాయమునకు రాగలిగితిమి. మనమందరమును కలసి యొకప్రణాళికను (స్కీమును) సిద్ధముచేసి దేశమునకు ప్రసాదింప గలిగితిమి. ఈ స్కీములో వివిధాభిప్రాయము లన్నియు లగ్నమయియున్నవి. ఒక ప్రక్కను శాంతభావములును, మరొకవంక రౌద్ర, తీవ్రభావములును యివన్నియును యీ ప్రణాళికలో లీనమై యున్నవి. వివిధకక్షలవారి భిన్నాభిప్రాయము లన్నియు దీనిలో లయమై యున్నవి. మాంటేగ్యుగారు దేశమునకు ప్రసాదించిన స్కీమును అందరును చదివియే యుందురు. ఈ స్కీము మాంటేగ్యుగారిమంత్రితంత్రశక్తిని,నిపుణత్వమును,రాజనీతిజ్ఞతను వేనోళ్ళచాటుచున్నది.

## ఒక అణా బాధ్యతాపాలన

మనము 8 అణాల బాధ్యతాపాలన కావలెనని కోరినాము. వారు ఒక అణాది మాత్రమే యిచ్చెదము, తీసికొనుడని చెప్పిరి. కాని మాంటేగ్యూగారి రచనా చమత్కృతి నేమన వచ్చును? యేలయనగ:—మనము కోరిన 8 అణాల బాధ్యతాపాలన కంటె వా రిచ్చు ఒక అణాపాలనయే యెన్నియో మడంగు లెక్కువయని మనకు గట్టి నమ్మకము పుట్టునట్లుగ, బహురచనా నైపుణ్యముతో వారీ స్కీమును సిద్ధము చేసి మన యెదుట బెట్టిరి.

ఆ స్కీమును చదివినకొలది మన కేమి కాన్పించును? దానిలోని రాజనీతిజ్ఞత, రచనా నైపుణ్యములటుండ, దానియొక్క ముఖ్యోద్దేశ మేమిగా గన్పట్టును? మన కోరిక లీడేరుటకు, మనకు బాధ్యతాయుతపరిపాలనను (అనగా స్వరాజ్యమును) కొంచెము కొంచెముగ, చిన్నచిన్న ముద్దలుగ, అనుగ్రహించిన చాలునట! అక్కడికే బహుయెక్కువయగునట! ఇట్టినమ్మకము మనకు పుట్టునట్లు చేయుటయే ఈ స్కీముయొక్క పరమలక్ష్యము, అనగా ముఖ్య ఉద్దేశ్యము. ఇదిగాక యింకొక యుద్దేశ్య మే మనగా:— మనకు స్వరాజ్యమనే యాకలిని తీర్చుటకు స్వరాజ్యమును చిన్నచిన్న ముద్దలుచేసి పెట్టిననే గాని మన యాకలి తీరదట! మన యాకలితీరుటకిదియే మార్గ మని మన మనస్సులలో గట్టి నమ్మకము పుట్టునట్లు చేయుటకై వారీ స్కీములో నెంతయో ప్రయత్నించిరి. మాంటేగ్యూ స్కీములో మనకు గోచరమైన ముఖ్యాంశము లివి. మాంటేగ్యూ స్కీములో మనకు వా రిచ్చెద మని చెప్పిన ఒక అణా పరిపాలనకు బదులుగ మన మిదివరలో కోరిన యావత్తుపరిపాలనను మన కిచ్చి తీరవలెననియే మన మిప్పుడు సిద్ధముచేయబోవు యీ స్కీములో నిమిడ్చివలయును. మన మిప్పుడు కోరున దిది. అన్ని కక్షలవారిని సమాధానపరచుట మన ఈ కాంగ్రెసు యొక్క కోరిక. ఇది చాల కష్టమైన పని. ఇంగ్లాండులో పార్లమెంటులో నున్న అన్నికక్షలవారిని సమాధానపరచుటకై లాయిడు జార్జి మంత్రిగా రెంతకష్టపడి ప్రయత్నములు చేయుచున్నారో, ఆ విధముననే మనము చేయబోవు కార్యముకూడ అంతకష్ట సాధ్యమైనది. ఒక కక్షవారు "యుద్ధ మక్కర లేదు, ఆపివేయవలసినది" యని తొందరచేయుదురు. ఇంకొక కక్షవారు "యుద్ధము ఆపకూడదు. యుద్ధమును సాగించవలసినదే" యని తొందర పెట్టుదురు. వీరి నందరిని సమాధానపరచుట లాయిడుజార్జి మంత్రిగారి కెంతకష్టముగ నున్నదో, మనలో వారిని సమాధానపరచుట కూడ అంతకష్టముగనే యున్నది. ఈ స్కీము విషయమై ప్రజాభిప్రాయములను కనుగొని, వివిధాభిప్రాయముల నొకచోట గుదిగూర్చితిమి. ఒకచోట కేంద్రీకరింపజేయుటకై యత్నించితిమి. ఎచ్చటనో, బహుకొద్ది అభిప్రాయములు తప్ప, తక్కిన యభిప్రాయములు అన్నియును ఈ కాంగ్రెసులో తేలిన అభిప్రాయముతో నేకీభవించుచున్నవి. ఈ కాంగ్రెసు అభిప్రాయమే దేశప్రజల యభిప్రాయ మని చెప్పవచ్చును. "మా దేశ ప్రజల యభిప్రాయ మిది" యని మనము

బ్రిటిషుప్రజలతో చెప్పవచ్చును. వరకు అభిప్రాయమేమి? "ఇది మిక్కిలి నిపుణాస్వభావముతోడను, రాజనీతిజ్ఞతతోడను రచింపబడిన స్కీమే; కాని యిది మా దేశప్రజలకసంతృప్తికరముగను, నిరుత్సాహజనకముగను ఉన్నద"ని వారికి మనము చెప్పకతప్పదు. "మాకు 15 సంవత్సరములలో పూర్ణమైన స్వపరిపాలన యిచ్చితీరవలెన"ని మన మందరము మా కాంగ్రెసుసభలో కాలనిర్ణయ మేర్పాటు చేయవచ్చును. ఈ కాలపరిమితి, బహుకొద్దిగ నున్నది. యిది చాలదని మనవారు కొందరనవచ్చును. అట్లయిన యింకొక విశేషము గలదు. "వలసరాజ్యములతోబాటు మన దేశము కూడ సామ్రాజ్యములో సమానపదవికి రాజాలనియెడల, (రాకుండ దాని నడ్డెయుంచినయెడల), బ్రిటిషుసామ్రాజ్యమున కెంతయు బహునష్టము కలుగగలదు కనుక ముందువిషయమై జాగ్రతగ యోచించుకొను డని" నేనట్టి వారికి ప్రత్యుత్తరము చెప్పెదను. భారతవర్షమునకు స్వరాజ్యము కావలయు నని కోరుటలో మనకు స్వార్థాభిలాషకూడ గలదు. లేదని నే చెప్పను. కాని, స్వార్థాభిలాష యున్నను, ముఖ్యముగ బ్రిటిషు సామ్రాజ్య మంతటిక్షేమముకొరకై మనము స్వరాజ్యమును కోరుచున్నామే గాని కేవలము ఒక్కమనకొరకే గాదు. మన మీ పదవికి 15 సంవత్సరములలో రావలెనని కోరుచున్నాము. అప్పుడు మాత్రమే మనము సామ్రాజ్యమునకు సహాయము చేయగలము. అంతవరకును మన మేమియు సహాయము చేయజాలము. మనకు వారిచ్చు మొదటి మెట్టు స్వరాజ్యప్రాప్తికి అనుకూలముగ నుండకూడదని వాదించువారు సామ్రాజ్యమునకు కేవలముశత్రువులు. మనకిది 10, 15 సంవత్సరములలో లభించితీరవలెను. అప్పుడు మాత్రమే భారతవర్షము సామ్రాజ్యమునకు సహాయముచేయుటకు సిద్ధపడగలదు. సామ్రాజ్యమునం దంతటను నూతననిర్మాణములు గావింపబోవు తరుణమున, మనము చెప్పు ఈ పద్ధతిని మన దేశము విషయమై తప్పక అనుసరించి తీరవలె నని మన మందరమును ఆంగ్లేయ రాజకీయవేత్తలతో చెప్పవలెను. ఈ తీర్మానములో నీపద్ధతియే యిమిడియున్నది. గనుక మీ రందరును ఈ తీర్మానమును ఏకగ్రీవముగ నంగీకరించవలసిన దని కోరుచున్నాను. (చప్పట్లు)—మరాటాపత్రిక ననుసరించి వ్రాయబడినది.

# 15. సంధిసభకు వ్రాసిన ఉత్తరము

[ఆన 1919-వ సంవత్సరము మార్చినెల 11-వ తేదీన లండనుపట్టణమునుండి శ్రీతిలక్ మహరాజ్ గారు ప్యారిసుపట్టణములో గూడిన, సంధిసభాధ్యక్షునకు హిందూదేశపక్షమున వ్రాసిన లేఖ]

లండను.

మార్చి 11-వ తేది 1919 సం||

హిందూదేశ ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధి యగు బాల గంగాధర తిలక్ వద్ద నుండి—ప్యారిస్ సంధిసభాధ్యక్షు లగు (సెనెటర్) మాన్సియర్ జార్జియస్ క్లెమెంకోగారికి:—

అయ్యా!

ఈ నా విజ్ఞాపనము సంధిసభవారి దివ్యచిత్తమున కెక్కునట్లుగ, దయచేసి తమరు దీనిని తత్సభవారియెదుట సమర్పింపవలసినదని నేను మిమ్ములను ప్రార్థింపుచున్నాను. నేను మీతో నిట్లు మనవిచేసికొనగల గౌరవము నాకు సదరు సభచేత ప్రచురింపబడిన ౧౧-వ నిబంధన ననుసరించియు, ఈ క్రింద ఉదహరింపబోవు భారతజాతీయ సభా తీర్మానము ననుసరించియు, లభించినది

౨. హిందూదేశము కూడ సంగ్రామరంగమున కూడ యుద్ధ మొనర్చిన ప్రత్యేకజాతీయవ్యక్తి యగుటయే, దానికి కూడా ప్రత్యేకమైన ఆశయములు గలవగుటయు, కనుక బ్రిటిషుసామ్రాజ్యపక్షమునవచ్చు ప్రతినిధులు మాత్రమే గాక యీ హిందూ దేశపక్షమున గూడ ప్రత్యేక మిద్దరుప్రతినిధులు వచ్చి సభలో మాట్లాడుటకు హక్కుగల దనియు.— (సంధినిబంధనల నిర్ణయించుటకై సమావేశమైన) సదరు సంధి సభవారు తీర్మానించి రనువార్త భారతీయుల కెల్లరకు నవ్యాశాపూర్ణ సానందమును గలిగించె నని తమతో మనవిచేసికొనుచున్నాను. కాని, దురదృష్టవశమున, భారతవర్షము ప్రస్తుతము నిరంకుశపద్ధతిని పరిపాలింపబడుచుండుటచే ప్రజలకు ఉత్తరవాదియై, సంధిసభలో ప్రజాపక్షము వహించి వాదింపగల మంత్రు లెవరును ప్రస్తుతము మా దేశమునకు లేరు. రాజకీయవిషయములలో హిందూదేశమును రెండుపక్షములుగ విభజింపవచ్చును. ఒకభాగము బ్రిటిషువారి స్వాధీనములో నున్నది. రెండవభాగము స్వదేశసంస్థానాధిపతుల చేతులలో నున్నది. సంధిసభలో నీ స్వదేశసంస్థానముల పక్షమున మాట్లాడుటకు బికనీరు మహారాజావారిని యిండియా గవర్నమెంటువారు ప్రత్యేకించి నియమించి యున్నారు. ఇక బ్రిటిషు పరిపాలనలో నున్న హిందూదేశపక్షమున సంధిసభలో మాట్లాడుటకై సింహా ప్రభువుగారిని యిండియా గవర్నమెంటువారు ప్రత్యేకించి నియమించి యున్నారు, కాని వీరిని నియమించునప్పుడు గవర్నమెంటువారు ప్రజలతో సంప్రతింపలేదు;

ప్రజల యామోదమును బడయలేదు. ప్రజలతో సంప్రతింపకుండ గవర్నమెంటు వారీపని జేసిరి. దీని విషయమై యశేషభారతప్రజల సమగ్రమనోభావము లెట్లుండెనో, మొన్నడిశెంబరునెలలో ఢిల్లీపురమున సమావేశమైన జాతీయసభాధ్యక్షులు నిజముగ వక్కాణించి యున్నారు:—

"హిందూదేశపక్షమున సంధిసభలో వాదించుటకై ప్రజాప్రతినిధుల యామోదమును బడసినవారిని గవర్నమెంటువారు పంపియుండనందున మన కది సదా విచారకరముగ నుండితీరును"

* * * *

హిందూదేశపక్షమున కూడ ప్రత్యేకముగ ప్రతినిధులు వచ్చి సంధిసభలో మాట్లాడవచ్చునని, సదరు సభవారు తీర్మానించిన పిమ్మట, ఆ తీర్మాన ప్రకారము కార్యమునకు గడంగవలసిన దని సూచింపుచు నేనొక యుత్తరమును ఇంగ్లాండు ముఖ్యమంత్రిగారికి వ్రాసితిని. భారతప్రజాప్రతినిధి సంఘములవారిచే, నియమింపబడిన వారిని, 12 గురి పేర్లను, ఒకజాబితా వ్రాసి సిద్ధముచేయించవలసిన దని నేను యింగ్లాండు ప్రధానిగారికి వ్రాసితిని. ఇట్లయినయెడల ప్రజల కోర్కెలును, సంధిసభవారి యుద్దేశములను నెరవేరగలవని వ్రాసితిని. కాని, నా ప్రార్థనను అంగీకరించుటకు వీలులేదని యిండియా మంత్రిగారు నాకు ప్రత్యుత్తర మొసంగిరి. ప్రజలు కోరిన రాజకీయాధికారములకును, గవర్నమెంటు వారిచ్చెద మని సూచించిన రాజకీయాధికారములకును విశేషతారతమ్య మున్నందున, పాలక పాలితు లుభయులును యిప్పుడు భిన్నాభిప్రాయులై యున్నారు. ప్రజలును, గవర్నమెంటువారును భిన్నాభిప్రాయులై యున్న యిట్టి తరుణములో, మేము కోరిన యీ కోర్కెను గవర్నమెంటువారు నిరాకరించుట కడుంగడు శోచనీయము. ఇట్టి పరిస్థితులలో, తమ సభవారిచే ప్రచురింపబడిన ౧౧-వ నిబంధనవలన లభించిన యవకాశము నాధారపరచుకొని, యీ యంశములను సంధిసభవారి దివ్యచిత్తమున కెక్కునట్లుగ మనవిచేసికొనక తప్పదని నాకు దృఢముగ తోచినది. ప్రజల కోర్కెలు సక్రమమైన వని నిరూపించుటకు కావలసిన వాదప్రతివాదముల నెల్ల యీ చిన్నలేఖలో నిమిడ్చుటకు సాధ్యపడదు కావలయు నన్న యెడల, నాకు రహదారీచీట్లను దయచేయించిన యెడల; నేను యెవరివద్దకైనను సరే వచ్చి మా భారతీయుల కోర్కెలన్నియు సహేతుకమైన వనియు, న్యాయసమ్మతమైన వనియు గట్టిగ వాదించి, వారిని ఒప్పింపగలను. నేనందుకు సిద్ధముగ నున్నాను. అది నాకును సమ్మతమే. దీని విషయమై విచారించుటకు తమ రొక కమిటీ నేర్పరచినయెడల, నేను వారి యెదుటికి వచ్చి వారడుగు ప్రశ్నల కన్నిటికిని తగు సమాధానము చెప్పి, వారికి కావలసిన విశేషాంశముల నెల్ల చక్కగ బోధపడునట్లు వారికి తెలియజెప్పి, మా కోర్కెలు సహేతుకమైన వని నిరూపింపగలను. కాని నే నచ్చటికి వచ్చుటకు నాకు రహదారీ చీటి గావలెను. అంత

దూరము పోనేల, ("హిందూదేశపక్షమున సంధిసభలో మాట్లాడుటకై నిన్ను నియమించితిమ"ని చెప్పుచు) హిందూదేశమునుండి మా ప్రజలు నాకుపంపిన మా జాతీయ సభవారి తీర్మానము నాకిక్కడ చేరకపూర్వము, సంధి సభకు వార్తాపత్రికా ప్రతినిధిగ నన్నుపోనివ్వవలసిన దనియు, దానికై నాకురహదారి చీటిని దయచేయించ వలసిన దనియు, నేను మంత్రులతో మనవిచేసికొంటిని. కాని, బ్రిటిషు గవర్న మెంటువారు నా మనవిని త్రోసివేసిరి. "ఊరక సభకు పోయి, చూచి వచ్చుటకు నీకుప్రవేశము దొరకజాలదు"ని వారేమేమో - పాపము! తలంచి నాకోర్కెను నిరాకరించిరి.

## మా దేశ వ్యవహారమును పరిష్కరించుట అత్యావశ్యకము

3. భారతప్రజలు ముందభివృద్ధినొందవలె నన్నను, లేక యికముందు ప్రపంచములో శాంతి నిలువవలె నన్నను, భారతసమస్యల నెల్ల తక్షణము తప్పక పరిష్కరించి తీరవలెను. ఇది తప్పదు. ఇది అతిముఖ్యమైనది. దీని విషయమై నేను విశేషించి వ్రాయవలసిన అవసరములేదు. మాభారతవర్షము సర్వవస్తు సంపన్నము. సర్వసమృద్ధము. పరరాష్ట్రముల యభివృద్ధిని జూచి మేము యీర్ష్యనొందు వారముగాము. వారియెడ మా కెట్టి ద్రోహచింతయును లేదు. మా దేశమునకు మించి మా కెట్టి దురాశయునులేదు. అనంతమగు వైశాల్యమును బట్టియు, తరుగని వస్తుసంపదలను బట్టియు, లెక్కకు మిక్కిలి యగు జన సంఖ్యను బట్టియు,— సర్వవిధములచేతను మా భారతవర్షము ఆశియాఖండ మంతటికిని — ఒక్క ఆశియా యన నేల, ప్రపంచము కంతకును—మార్గ దర్శకమగు నాయకజాతియై విరాజిల్లుటకు సమస్తవిధముల తగి యున్నది. ప్రపంచములో పూర్వార్ధగోళము నందు శాంతిని గాపాడుటకై మాదేశము అవలీలగ, జాతిసమితిపక్షమున కెంతయు బలవత్తరమగు మంచి యండగ నుండగలదు. ఆశియాఖండము నుండిగాని, తదితర ప్రాంతముల నుండిగాని, పరజాతు లేవియును, బ్రిటిషు సామ్రాజ్యముపై కాలు దువ్వి, విజృంభించి, దండెత్తివచ్చి చీకాకుపరుపదలంచి వాదించుటకై మా దేశము బ్రిటిషువారికి బాసటయై నిలువగలదు. కాని మా భారతవర్ష మిప్పుడు గావకీయ శృంఖలముచే బంధింపబడి యుండుటవలన, ప్రపంచజాతులలో తన స్థానము నాక్రమింప గలుగుటకు ప్రస్తుతము వీలుపడకున్నది. తనలో నిమిడి యున్న యంతశ్శక్తుల నెల్ల విజృంభింపచేసికొని, వానిని యనుభవమునకు తెచ్చుకొనుటకు సాధ్యపడకున్నది. ఈ కారణములచే, మీరు జాతిసమితిని యేయుద్దేశముతో సత్కృష్టమగు పరమసంకల్పముతో నిర్మింపరో, యట్టిప్రపంచశాంతి స్థాపనమునకు మా దేశమిప్పుడు మీకునిష్కర్షగ తోడ్పడజాలకున్నది. అదిగాక, మా దేశమీస్థితి లోనే యున్నట్లయిన, యింకొక యిబ్బందికూడ కలుగగలదు. ఏకోపాఖండములో నుండు జాతులన్నియును భారతవర్షమను 'రాజ్యామిషంబునకు కుక్కల భంగి తమ లోనకాట్లులాడ'గలవు. భారతవర్షమును జయింపవలెనను కాంక్షచే గాకపోయినను,

తుదకు యిచ్చట సంయుక్తసదౌస్యరాష్ట్రముల కొరకైనను ఆశియా అమెరికా ఖండవాసులు యూరపుఖండవాసులతో తలపడి పోరాడగలరు. వీరందరును పరస్పరము యీ రాష్ట్రములై సుందోపసుందులవలె తమలో కలహించుటం జేసి ప్రపంచములో నిజమైన యుద్ధములే పొసగుచుండగలవు. ఇట్లని తలంచుటకనేక ప్రబల కారణములు గన్పట్టుచునే యున్నవి. తన యాంతరంగిక వ్యవహారములను, తన వాణిజ్య వ్యాపారములను యితరుల ప్రమేయము లేకుండ తానే స్వయముగ నిర్ణయించుకొను అధికారము హిందూదేశమున కెంతకాలమువరకు నుండదో, అంతకాలమును యీ సుందోపసుందుల పోరాటములు జరుగుచునే యుండును. సీమలో నుండు పార్లమెంటువారు మా యాంతరంగికాది వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటవలన, ఆశియా, యిరోపా, భరతఖండాదివాసులకు దీని విషయమై గాఢముగు అనుమానములు పుట్టుచున్నవి. దీనిని వీరెంతయు ననుమానదృష్టితో చూచుచున్నారు. ఆశియాఖండమందు శాంతి నిలువవలెనన్నను, లేక ప్రపంచమునందు శాంతి నిలువవలెనన్నను, భారతవర్షమునకు తన యాంతరంగిక వ్యవహారములను తనయిట తానే స్వయముగ నిర్ణయించుకొను అధికారము నుండితీసవలెను. మరియు, ప్రాచ్యఖండము స్వాతంత్ర్యోత్కంఠాయుక్తమై మా దేశమును బలిష్టమగు స్వాతంత్ర్యదుర్గముగ నేర్పరచుకొనవలెను. ఇది అత్యవసరము. ఇట్టి సంకల్పము మహోత్కృష్టులగు రాజకీయవేత్తల యుదారభావముల కెంతయు తగి యున్నది. న్యాయ, ధర్మసూత్రముల కనుగుణముగ నున్నది. భారతీయులు ప్రకటించిన యాశయముల కెంతయు నొప్పియున్నది.

౪. ఆస్ట్రేలియా కనడా మొదలగు బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గతములగు స్వాతంత్ర్యజాతులవలె మా భరతఖండమునకుకూడ మా యాంతరంగిక వ్యవహారములను మాయంతట మేమే స్వయముగ నిర్ణయించుకొనుటకు—మాగతిని మేమే చూచుకొనుటకు— అధికారము లేనియెడల, దేశమునందు శాంతిగాని, భూగోళములో ఆయుధవంతు ప్రజలలో సంతృప్తిగాని, నిలిచియుండజాలవు. మా యాంతరంగికాది వ్యవహారములను మేమే స్వయముగ నిట్లు నిర్ణయించుకొనుచు, మేముకూడ తదితర జాతులవలెనే బ్రిటిష్ సామ్రాజ్యమను స్వాతంత్ర్యజాతుల సమిష్టి కుటుంబములో నొక భాగస్వాములుగ నుండగలము. అట్లయోల, స్వాతంత్ర్యములేనిది నిజముగ నభివృద్ధి నొందజాలము. సర్వశక్తులును నిస్సారములగును. కార్యోత్సాహము సన్నగిల్లును; యేపనిని ప్రారంభించుటకును శక్తియుండదు, స్వశక్తియందు నమ్మకము చెడును. ఇంక నసంఖ్యాకములగు నానావిధముల దాసత్వము ప్రజలకు పరమ దౌర్భాగ్యులనుగ జేయును. ఇహపర సౌఖ్యములకును, పురోభివృద్ధికిని వానిని దూరులను జేయును.

లోకమునంతయు ఆవరింపజూచిన భయంకరాకారమగు ప్రచండ జార్మన్య [illegible]ధికార శృంఖలములనుండి మానవజాతికి విముక్తిని గలిగించుటకై యొన

ర్నిన లోక వ్యాప్తంబగు ఘోర సంగ్రామమిప్పుడే యంతమొందినది. నూతన చైతన్యోదయమైనది. ఇట్టి తరుణమున పాలిత ప్రజల యిష్టమునకే, ఒకజాతివచ్చి యింకొక నాగరక జాతిమీద నధికారము చలాయించుచు, 'మీకు మేము సంరక్షకులుగనుందుము, మీ శ్రేయస్సు గోరియే మేము మిమ్ముల పరిపాలించుచుండెదము' అని యాడంబరములు పలుకను, ఆజాతిమీద పరిపాలనజేయుట కింకమీద వలను పడదు. ఈయుద్ధకాల మన్నియు తెల్లకు తెల్లమే చేసిచ్చుట వానిని గూర్చి యింతగ వాదింపబని లేదు. మాదేశమునందు సంప్రాప్తములగు క్లిష్ట సమస్యల నెల్ల మా నైసర్గిక మేధా సంపత్తిచే, మా మా స్వధర్మానుసరణముగ, మేమే స్వయముగ తరచి పరిష్కరించుకొనుటకు మా ప్రజలకు హక్కు ఉండి తీరవలెను. ఇది మా పుట్టుకతో బుట్టిన జన్మహక్కు. భారతవర్షమిప్పుడీ జన్మహక్కునే కోరుచున్నది. ఈ మహోత్కృష్ట కార్యమును పరులువచ్చి నెరవేర్పజాలరు ఇది వారికి సాధ్యముకాదు. ఎంత ప్రజ్ఞావంతులైనను, యెంత యుదారగుణులైనను, పాశ్చాత్య ధర్మములందు పుట్టి పెరిగినవారును, భారత ధర్మములందెంతమాత్రమును అవ్యాజమగు సానుభూతి లేనివారును—అగు పరిపాలకులు వచ్చి మహోత్తరమైన భారత జాతికి సద్గతిని గలిగించుటకు త్రోవజూపజాలరు. ఇట్టి మహోత్కృష్ట కార్యమునకు వారెంతమాత్రమును తగరు. ఇట్టి పనికి వారు ప్రారంభింపనేకూడదు. భారత జాతీయ సభ, ముస్లిమ్‌లీగ్—అను నివి రెండును గొప్ప రాజకీయ సభలు. బ్రిటిష్ యిండియాలోనుండు సమస్తప్రజల మనోభావములును యీ రెండు సభలద్వారానే పైకి వెలవడియున్నవి. ఈ రెండు సభల తీర్మానములకును సమస్త ప్రజలు తమ యంగీకారమును తెలిపిరి. ఇట్టి యీసభలు రెండును మొన్న డిశంబరునెలలో ఢిల్లీ పురమున సమావేశమై స్వయంనిర్ణయ సూత్రమునే గోరుచు యీ క్రిందివిధముగ తీర్మానించినవి:—

“ఇకముందు ప్రపంచ శాంతిని గాపాడవలెనన్న, అనుదిన ప్రవర్ధమానమగు జాతులకన్నిటికిని స్వయం నిర్ణయ సూత్రము వర్తింపజేయుట యవసరమని ప్రెసిడెంటు విల్సనుగారును, లాయడ్ జార్జి మొదలగు ఆంగ్ల రాజకీయ వేత్తలును చాటిచెప్పియున్నారు; కనుక యిట్టి తరుణమున, భారతవర్షము కూడ అనుదిన ప్రవర్ధమానమగుచు పైకి వచ్చుచున్న జాతులలో నొకటి యగుటను, యీదేశమునకు కూడ స్వయం నిర్ణయ సూత్రము వర్తింపజేయవలెననియు, బ్రిటిష్ పార్లమెంటు, సంధిసభలవారు అంగీకరించి తీరవలెనని యీ కాంగ్రెసు సభవారు తీర్మానించుచున్నారు.”

౫. ఈ స్వయంనిర్ణయ సూత్రమును మా దేశమునకు వర్తింపజేయకుండుటెంతమాత్రమును న్యాయముగాదు. దీని కెంతమాత్రమును కారణము గాన్పించదు. దీనికి మేము అర్హులముగామని స్వార్థపరులు జ్ఞానవిహీనులును సామాన్యముగ చెప్పు కువాదములు నిలువజాలవు. ఇవి సత్యములుగావు సరేమ్, ఆతెప్పు రాజ్య

ములగు నాగరికతలకంటెను కూడ మా భారత నాగరికత బహుపురాతనమైనది; బహు అదరణీయమైనది. దీనిని కాదను వారెవరును లేరు. అంత యేల, ఇప్పటి యైరోపా జాతులన్నియును తమ నాగరిక స్థితినుండి పైకి రాక పూర్వ మెన్నియో శతాబ్దముల క్రిందనే మా భారతవర్షము మిగుల నాగరిక స్థితిలో నుండెనని బ్రిటిష్ రాజనీతిజ్ఞులే పలువురు చాటిచెప్పియున్నారు. పరుల ప్రమేయము గాని, పరుల సహాయము గాని, యెంతమాత్రమును లేకుండగనే మా భారతజాతి యెన్నియో యుగములనుండి నిలిచియున్నది. మాదేశమునం దెన్నియో శతాబ్దములవరకును సత్పరిపాలన జరిగెను, ప్రజా సౌఖ్యమును ప్రశాంతముగ ప్రబలియుండెను. మా దేశచారిత్రము యిరోపాదేశ చారిత్రముల కెప్పుడును యెంతమాత్రమును తీసిపోదు. అలెగ్జాండరు హిందూస్థానము మీదికి దండెత్తివచ్చుటకు పూర్వ మనేక శతాబ్దముల క్రిందటనే మాదేశమునం దనేక ప్రాంతములలో ప్రజా పరిపాలనా పద్ధతి సైతము ప్రబలియుండెను. ప్రజా పరిపాలన సూత్రముల ననుసరించి స్వరాజ్యమును నిర్వహించుకొనుటకు మా భారతీయులకు సామర్థ్యము లేదని చెప్పుచు, మా యోగ్యతను అపనింద పాల్సేయుటకై పరులు గావించు పరమదూషణభావపూరితమగు అనర్హతా రోపణములను విద్యావంతులగు భారతీయులెల్లరును తీవ్రోద్రేకముతో ఖండించుచున్నారు. ప్రస్తుతము దేశము నాదరించిన ప్రజల దారిద్ర్యము, ప్రజల దేహ బలక్షీణత, పారిశ్రామికోద్ధరణము, ఆర్థిక వికాసము, సాంకేతిక ప్రాథమికాది విద్యాభివృద్ధి, వర్ణాశ్రమా చారాది ధర్మసూక్ష్మ నిర్ణయము—ఈ విధమగు నసంఖ్యాకములగు సమస్యల నెల్ల కేవలము పాశ్చాత్య నాగరిక వ్యామోహమున బడినవా రెంతమాత్రమును పరిష్కరింపజాలరు. ఇవి యెంతమాత్రమును వారివలన నెరవేరగల పనులు కావు. దీనిని నేను పూర్తిగ గ్రహించినాను. కేవలము భారతీయులవలననే యీ కార్యములు గట్టెక్కగలవు. ఈ యుత్కృష్ట కార్యమును నిర్వహించుటకు యూరోపియను లెంతమాత్రమును పనికిరారని మనవిచేసికొను చున్నాను. దీనికి తగినవారు భారతీయులొక్కరే. దీనికి మా భారతీయులు తగుదురని జాతీయ సభవారు ఘంటాపథముగ పలుకుచున్నారు. బ్రిటిష్ కార్మిక పక్షము వారును మేమిందుకు తగుదుమని యొప్పుకొనియున్నారు.

* * * *

౭. మా దేశమున కిప్పుడిచ్చెదమని చెప్పిన రాజకీయ సంస్కరణములను గూర్చి మొత్తముమీద మా భారతీయులలో యేకాభిప్రాయ మెవరికిని లేదను మాట నిజము. బ్రిటిష్ హిందూదేశమందున్న 25 కోట్ల ప్రజలలో, స్వల్ప వివరములను గూర్చి యేకాభిప్రాయ మెన్నటికి నుండజాలదు. మొన్న జర్మనీ దళములువచ్చి బెల్జియము నాక్రమించిన, ఆ నాలుగు దినములలోనే, 'మాకీ జర్మనీ ప్రభుత్వమే బాగున్నదని' సిగ్గులేక ప్రగల్భములు కొట్టినవారు బెల్జియము దేశస్థులలోనే కొందరు బయలు దేరిరి; కనుక హిందూదేశములో భిన్నాభిప్రాయములుండి

తీరును. (దీనిలో నాశ్చర్యమేమి!) కాని, యింతమాత్రము చేత, భారతీయులు తాము సంపూర్ణ స్వరాజ్యమునకు తగుదుమా లేదాయని తమలో తాము సంశేహించుకొనుచున్నారనుటకు వీలు లేదు. మా సామర్థ్యమును గూర్చి యెట్టి యనుమానమెవరికిని యెంతమాత్రమును లేదు. ప్రస్తుతము పైకి గాన్పించుచున్న భిన్నాభిప్రాయములకు మూలకారణము వేరు. దీనికి అనుమానము కారణముకాదు. (అనుమాన మసలు లేనే లేదు.)

ఎవరికిని యే శ్రమను కష్టమును గలిగించకుండ—"యొప్పటికప్పుడు ప్రస్తుత మప్పటికా మాటలాడి యన్యుని మనమున్ నొప్పింపక తానొవ్వక తప్పించుకు"— తిరుగుచు గమ్యస్థానము చేరుదమని కొందరి యభిప్రాయము. ప్రభుత్వోద్యోగుల సానుభూతిని బడసి వారితో కలిసి మెలిసి సాగిపోవుట మంచిదని మరి కొందరి యభిప్రాయము. "అధికార ధూర్వహులు సాధారణముగ తమ చేతిలోనుండు అధికారమును వదలుకొని ప్రజల చేతులలో పెట్టుటకు యిష్టపడరు. యిది స్వభావసిద్ధము; స్వరాజ్యము పేరు చెప్పిననే యధికారులకు కంటగింపుగనుండును; కనుక వారితో నెట్టియైన సమాధానపడి వారికి కోపము గలిగింపకుండ మెల్లగ పోవుదము" ని మరి కొందరు తలంచుచుందురు. ప్రజలలో పైకి గాన్పించు భిన్నాభిప్రాయములకు ఇవియే కారణములు గాని, అసమర్థులమను అనుమానము కారణముగాదు. మాలోనుండు భేదములను మేము సవరించుకొన గల శక్తి మాలోనున్నదని చెప్పుటకు మొన్న 1916 సం॥లో హిందూ మహమ్మదీయులకు లక్ష్మణపురములో కుదిరిన సఖ్యమే దీనికి ప్రబల నిదర్శనము. ఈ హిందూ మహమ్మదీయ సఖ్యమును గూర్చి మాంటేగ్యుగారు సైతము తమ రిపోర్టులో నుదహరించిరి. మీరొక్కసారి గనుక మాదేశమునకు స్వయంనిర్ణయ సూత్రమును వర్తింపజేసినచో మాలోనుండు భేదములన్నియు క్షణములో సమసిపోవును. అప్పుడు మేము, సర్వజన సమ్మతమగు రాజ్యాంగ పద్ధతిని యేర్పరుచుకొనగలము. అంతేగాక, ప్రస్తుతము భిన్నాభిప్రాయులైయున్న వారికి సైతము సమ్మతమగునట్టి రాజ్యాంగ పద్ధతిని మేము నిర్ణయించుకొనగలము. ఇప్పటికైనను, ప్రభుత్వాధికారులు దీనిచో నెంత విముఖులుగనున్నను, ప్రజలలో ముఖ్యులైన మధ్యస్థమైన చాలమంది యేకాభిప్రాయులయియే యున్నారు. ఎక్కడనో, యే కొద్దిమందియో, భిన్నాభిప్రాయులై యుండిన నుండవచ్చును; అది యొక లెక్కగాదు. మాకు స్వయం నిర్ణయాధికారముండి తీరవలెనని ప్రజలెల్లరు యేకగ్రీవముగ ఘోషించుచున్నారు. ప్రస్తుత మిచ్చెదమని చెప్పిన రాజకీయాధికారములు మాకెంతమాత్రమును సంతృప్తికరముగ లేవనియు, 'కేవల మాశాభంగకరముగ నున్నవ'నియు ప్రజలు రద్దుచేయుచున్నారు. 'మాగమ్య స్థానమగు సంపూర్ణ బాధ్యతాయుత, ప్రాతినిధ్య ప్రభుత్వ సాధనమునకిది ప్రథమ సోపానముగ నైనను నుండుటకు చాలద'ని ప్రజలెల్లరును ఘోషించుచున్నారు.

౭. 'అధమపక్షము యింతకు తక్కువగాకుండ మాకిచ్చి తీరవలెన'ని ప్రజలు కోరుటయు, అంతట ప్రభుత్వమువారు 'మే మింతకంటె యెక్కువిచ్చుటలేద'ని చెప్పుటయు యీ మొదలగు జేరముల నన్నిటిని గూర్చి యిచ్చట చర్చించుటకు నాకంతగ యిష్టములేదు. అయినను, గవర్నమెంటువారిచ్చెదమని చెప్పిన రాజ్యాంగ సంస్కరణము లేమియో, వీనిమీద ప్రజల యభిప్రాయమేమియో; వారు కోరు కోర్కెలేమియో, యిచ్చట క్లుప్తముగ వివరించుట యవసరమని తోచుచున్నది. ఏలననగ, ఈ యంశములన్నియు తెలిసికొననగాని వారిచ్చెదమని చెప్పిన రాజ్యాంగ సంస్కరణములలో నుండు అసలు ముఖ్యలోపములు బయటబడవు; నిజముగ, నిష్కాపట్య బుద్ధితో హిందూదేశ వ్యవహారములను సంతృప్తికరముగ పరిష్కరించుటకు స్వయం నిర్ణయ సూత్రము అత్యవసరమని అప్పుడుగాని గ్రహించుటకు వీలుండదు.

## ఇండియా గవర్నమెంటు, కేంద్రప్రభుత్వము

౮. హిందూదేశ సంబంధమైన పెనకటి చట్టముల నన్నిటిని క్రోడీకరించి 1915 సం॥లో పార్లమెంటువారు "హిందూదేశ పరిపాలనా చట్టము" అను పేరుతో నొకచట్టమును నిర్మించిరి. ప్రస్తుతము మాదేశ పరిపాలన యీ చట్ట ప్రకారము నడచుచున్నది. రాజ్యపాలన యంతయు చక్రవర్తిగారి పేర జరుగుచుండును. వారి యేలుబడిలోనున్న యనేక డిపార్టుమెంటులలో నిదియొక డిపార్టుమెంటు. హిందూదేశ వ్యవహారముల నన్నిటిని నడపించుటకు, చక్రవర్తిగారికి క్రిందిపెట్టున, సీమలో నొక మంత్రియుండును. కర్తృత్వమంతయు చక్రవర్తిగారిపైనమోపి, యీ యిండియా మంత్రిగారు వ్యవహార క్రియలను జరుపుచుందురు. ఈ మంత్రికి తోడ్పాటుగ నుండుటకై సీమలో నొక సభగలదు. దీనికి "ఇండియా కౌన్సిల్" అని పేరు. ఈ మంత్రిగారి యధికారమునకు లోబడి, యిండియాలో గవర్నర్ జనరలుండును. వీరికి కూడ నొక కార్యాలోచన సభ గలదు. సభాయుక్తుడగు నీ గవర్నర్ జనరలుగారు, మంత్రి యాజ్ఞ ప్రకారము, హిందూదేశమునకు సంబంధించిన సమస్త సివిల్ మిలిటరీ వ్యవహారములను నడపుచుందురు. సమస్త అధికారములును యీ సభాయుతుడగు గవర్నర్ జనరలుగారి చేతులలోనే యుండును. అధికారమంతయు నిచ్చట నొక్కచోటనే కూడుకొని అతి విస్తారముగ పేరుకొనియున్నది. అధికారమునంతను యీ యొక్క చోటనే కేంద్రీకరింప జేసిరి (అనగ అధికారము నంతను ఒక్కచోటికే చేర్చి ముద్దజేసి పెట్టిరి.) ఈ కేంద్రీకరణ పద్ధతి ప్రకారము అతి విస్తారముగ నీ దేశమును వీరు పరిపాలించుచున్నారు. రష్యాదేశమును మినహాయించిన యెడల యిరోపాఖండమెంత విశాలముగనుండునో, మా దేశము కూడ నంత విశాలముగనున్నది. ఈ దేశ ప్రజలు 25 కోట్లకు మించియున్నారు. వీరిలో ఆర్యద్రావిడ సంకరులు మొదలు సుమారు 12 శాఖోపశాఖలుగనున్నారు. వీరినందరిని యిప్పుడు గవర్నమెంటువారు యీ కేంద్రీకరణ పద్ధతిప్రకారము పాలించు చున్నారు. పరిపాలనా భాగములంతను మూడు శాఖలుగ విభజించిరి. అవేవనగ (౧) కార్యనిర్వా

హక శాఖ (౨) శాసన నిర్మాణశాఖ (౩) న్యాయ విచారణ శాఖ. కాని శాసన నిర్మాతల యిష్టప్రకారము రాజకార్యములను నిర్వహింపవలసిన బాధ్యత కార్యనిర్వాహకులకు లేదు (అనగ కార్యనిర్వాహక శాఖవారు శాసన నిర్మాణ శాఖవారికి లొంగి యుండవలసిన బాధ్యతలేదు) కాని శాసన నిర్మాతలు ఊరక చర్చింపవచ్చును. ‹‹ఈ సంవత్సరము సొమ్మియింత యెక్కువ ఖర్చు చేయకూడదు, తక్కువ ఖర్చు చేయకూడదు, అని వాదింపవచ్చును. గవర్నమెంటు వారిని కావలసినన్ని ప్రశ్నలడుగవచ్చును. తీర్మానములు చేయవచ్చును. కాని యివేమియును కార్యనిర్వాహకులను కదలింప జాలవు. వీరి తీర్మానముల ప్రకారము వారే కార్యమును నిర్వహింపవలసిన పనిలేదు. ఇవి వారి మీద బైండింగుకావు.

* * * *

అదిగాక, యీ శాసనసభలో యెక్కువమంది ప్రభుత్వోద్యోగులే యుందురు. ఇండియా గవర్నమెంటువారు సేవకమాత్రము సీమలోనుండు మంత్రికి బాధ్యులై యున్నారు. మంత్రిగారు పార్లమెంటునకు బాధ్యులై యున్నాడు. కాని పైనుదహరించిన 1915 సంవత్సరపు ‟హిందూదేశపు పరిపాలన చట్టము” యొక్క ౨౧-వ సెక్షను ననుసరించి—డబ్బు సంచీ యింతవరకు మంత్రిసభయగు ‘ఇండియా కౌన్సిల్’ వారి చేతులలో నుండును. కనుక సొమ్ము యొక్క ఆదాయ వ్యయములలో మంత్రిగారికి విశేషాధికారము లేదు. ఈ విషయములో యీయనకు విశేషమైన స్వాతంత్ర్యము లేదు. ఈ విధముగ డబ్బుసంచీ సంతను సభవారిచేతి కిచ్చివేసినప్పుడు, యీ మంత్రిగారు పార్లమెంటునకు జవాబు చెప్పవలసిన పని యేమి యుండును ? పార్లమెంటువారు యీ మంత్రిని యే విధముగ తమ కట్టుబాటులో నుంచుకొనగలరో యూహింపజాలకున్నాము. ప్రస్తుతము మంత్రి పదవిలో నున్న మాంటేగ్యూగారే యీ పద్ధతిని తీవ్రముగ ఖండించిరి. ‟ఎవరైన మిక్కిలి యోగ్యుడగు మంత్రియుండుటచే కలుగ్గించిన లాభ మవ్వునో యను భీతిచే దీనిమీద పార్లమెంటువారి యాధికారము మిదియూ లేకుండు నట్లీసభ నేర్పాటుచేసినారు.” దీని ఫలిత మేమి ? అధికారమంత వొకచోటనే విశేషముగ కేంద్రీకరింపజేసి, (అనగ పేరపెట్టి) యీ కేంద్రీకరణపద్ధతి ప్రకారము యీ భూగోళములో అయిదవవంతు ప్రజలు నివసించు అతి విస్తార మగు భూభాగమువీరు నిరంకుశాధికారమును చలాయించుచున్నారు. ఈ కేంద్రీకరణ పద్ధతి శుద్ధ పనికిమాలిన దనియు, దీనివలన లేపనులు నెరవేరజాల వనియు మా దేశములో నుండు గవర్నరులే దీనిని ఖండించిరి. దీనిని ఖండించిన వారిలో, యిప్పుడున్న మంత్రిగారు ప్రథములు. వీరికంటె దీని నెక్కువ తీవ్రముగ ఖండించిన వారెవరును లేరు. ‟ఈ కాలములో యింత ఘోరముగను, యింత యినుపపాకముగను, యింత పెడసరముగను, యింత అయోమయముగను, ఉన్న రాజ్యాంగ పద్ధతి యెక్కడను లేదు; యిది యెప్పటిదో కృతయుగమునాటి పద్ధతి; ఈ కాలమున

కిది యెంతమాత్రమును పనికి రాదు. మన యీ ప్రస్తుతకాలపు ఊహాలకిది యెంత మాత్రమును పనికిరాదు. ఇండియా గవర్నమెంటు పద్ధతికూడ యీ కాలపు కోర్కెలకు యెంతమాత్రమును సరిపోదు; దీని నిప్పు డెవ్వరును ఆమోదింపరు"— ఈ విధముగ యిప్పుడున్న మంత్రిగారు యీ రాజ్యాంగపద్ధతిని గూర్చి వ్రాతబెట్టినట్లు ఖండించియున్నారు. కాని దీని నీ విధముగ ఖండించిన యీ మంత్రి గారే మొన్న రాజ్యాంగపద్ధతియందంతటను క్రొత్తమార్పులు (సంస్కారణములు) చేయుచు యీ ప్రాత మోటుపద్ధతిని మాత్ర మట్లే నిలిపియుంచిరి. ఇండియా గవర్నమెంటు వారికున్న నిరంకుశాధికారములను తగ్గించుట కెక్కడను అవకాశములు కల్పింపలేను. అదిగాక, మీదు మిక్కిలి, యిదివరకు యిండియా గవర్నమెంటుపైనన్న పార్లమెంటువారి యధికారమును కూడ తగ్గించవలసిన దని యీ మంత్రిగారు శిఫార్సుచేసిరి. ఇది యెంతయు నాశ్చర్యోపపాదములను గొల్పుచున్నది. దీనికి వారు చెప్పిన సమాధాన మేమనగ:—

"బాధ్యతాయుత ప్రభుత్వమును (అనగ స్వరాజ్యమును) క్రమక్రమముగ, మెట్టు మెట్టుగ, అనుభవములోనికి తెచ్చుకొనవలెను; దీనికి మొదటి మెట్టు రాజధాని ప్రభుత్వము; కనుక మొదట దీనిని రాజధాని ప్రభుత్వములలో ప్రారంభించవలెను."

"ఇండియా గవర్నమెంటువారు కేవలము పార్లమెంటునకే జవాబు చెప్పవలసినవారుగ నుండవలెను. ఇప్పుడు రాజధాని ప్రభుత్వములలో క్రొత్తమార్పులను జేయబోవుచున్నాము గద. ఈ మార్పులయొక్క ఫలితము లెట్లుండ బోవునో తేలుకరకు యిండియా గవర్నమెంటువారికి — పార్లమెంటునకు జవాబు చెప్పవలసిన బాధ్యత తప్ప — యింక నెట్టి బాధ్యతయు నుండకూడదు. తక్కిన ముఖ్యాంశములలో నెల్ల యిండియా గవర్నమెంటువారి యధికారమున కెక్కడను అడ్డ ముండకూడదు. ఈ లోపుగ సామ్రాజ్యశాసననిర్మాణ సభను విస్తరింపజేయవలెను. ప్రజాప్రాతినిధ్యమున కెక్కువ అవకాశ మివ్వవలెను. గవర్నమెంటులో పలుకుబడి కలుగజేసికొనుటకు యీ సభ కెక్కువ అవకాశము లివ్వవలెను."

ఇండియా గవర్నమెంటువారి చేతులలో కేంద్రీకరింపజేసిన (అనగ పేరబెట్టిన) యధికారములో కొంతభాగమును విడదీసి రాష్ట్రప్రభుత్వములవారికి పంచిపెట్టుటకై యేదో కొద్ది యేర్పాటును మాంటేగ్యూగారు మొన్నటి నూతన సంస్కారణములలో చేసియుండిరి. రాష్ట్రప్రభుత్వములలో "ద్వంద్వపద్ధతి"ని నెలకొల్పినారు. ఈ పద్ధతి ననుసరించి గవర్నమెంటువారి యధికారమునకు కొంత హద్దేర్పడును. అందువల్లనే, తిరిగి మంత్రిగారిట్లు శలవిచ్చుచున్నారు:—

"క్రమక్రమముగ నదరు మార్పులు యిచ్చట యిండియాలో జరుగుచున్న కొలదియు, తదనుసారముగ, అచ్చట సీమలో పార్లమెంటువారును మంత్రియును

యిండియా గవర్నమెంటుపైనను రాష్ట్రప్రభుత్వములపైనను తమ యధికారమును తగ్గించుకొనుచు రావలెను,"

౯. మెట్టును, దీనివలన వచ్చు ఫలిత మేమనగ:—ఇండియా గవర్నమెంటు వారు యిక్కముందింతకంటె నిరంకుశాధికారు లగుదురు. దీని కెంతమాత్రమును సందేహము లేదు. ఏలననగ: వారిదివరకే తమపై పార్లమెంటువారి యధికారమును, మంత్రిగారియధికారమును, యెప్పుడు తొలగిపోవునా యని విసుగుకొనుచున్నారు. "మాపై యీ యధికారబంధములను తీసివేసి మమ్ములను విడిపింపవలసినది"ని వారు యిదివరకే ఘోషించుచున్నారు ఈయంశము నందరెరుంగుదురు. కేంద్రప్రభుత్వ మంతయు నిరంకుశాధికారనిలయముగ నుండి, దానిలో వైస్రాయి నిరంకుశప్రభువుగ నున్నయెడల, యిక నచ్చట ప్రజలమాట పైకివచ్చు ననుట వట్టి భ్రమ. ఇట్టి యాశ కెంతమాత్రమును తావులేదు. కేంద్రప్రభుత్వము నిరంకుశాధికారనిలయముగ నున్నంతకాలమును, మన మెన్ని మార్పులు చేసినను, రాష్ట్రప్రభుత్వములు నిజముగ విజృంభించి యెన్నటికిని ప్రజల సొమ్ము కాజాలవు దీని వలన నేమియును సార్థకము గాన్పింపదు కనుక యిప్పు డిచ్చెద మని చెప్పిన రాజ్యాంగసంస్కరణములు మా భారత ప్రజల కెంతమాత్రమును సంతృప్తికరముగ లేవు. కేంద్రప్రభుత్వములో మా కిప్పుడు కొంత యధికారభాగ మిచ్చుచు, ౧౫ సంవత్సరములలో సంపూర్ణాధికార మిచ్చితీరవలె నని ప్రజలు కోరుచున్నారు. అదిగాక సీమలో నున్న "ఇండియా కౌన్సిల్"ను పూర్తిగ నెత్తివేయవలె నని మా ప్రజలు కోరుచున్నారు.

౧౦. ఇంతవరకు సామ్రాజ్యకార్యనిర్వాహకశాఖను గూర్చి చెప్పితిని. ఇక సామ్రాజ్యశాసననిర్మాణసభను గూర్చి కొంత చెప్పెదను. ఇప్పుడున్న సభ్యుల సంఖ్యను నూరువరకు హెచ్చింపవలె ననియు, వానిలో 67 మంది ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధులై యుండవలె ననియు గవర్నమెంటువారి స్కీములోనున్నది. కాని యింత యుదారభావముతో నిచ్చినదానిని క్రియలలో నిష్ప్రయోజనము చేయుటకై యింకొక తంత్రమును పన్నిరి. ఈ సభకు పైన "కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు" అను నింకొక రెండవసభ నేర్పాటు చేసిరి. ఈ రెండవ సభలో 50 మంది సభ్యు లుందురు. వీరిలో 29 మందిని సభాయూతు డగు గవర్నర్ జనరలుగారు స్వయముగ నియమింతురు. ఇదంతయు చూడగ, కుడిచేతితో నిచ్చిన దానిని యెడమచేతితో తిరిగి లాగికొనినట్లున్నది. ఈ రెండవ సభయుండ కూడ దని ప్రజలందరు తీవ్రముగ ఖండించుచున్నారు.

## రాష్ట్రప్రభుత్వములు

౧౧. పరిపాలనా సౌకర్యమునకై హిందూదేశమునంతను రాష్ట్రములుగ విభజించిరి. వీనిని అమెరికా సంయుక్తరాష్ట్రములను పోల్పవచ్చును. కాని అమెరికా రాష్ట్రముల కున్నంత హక్కు స్వాతంత్ర్యములు వీనికి లేవు. మొత్తము

మీద ముఖ్యముగ తొమ్మిది రాష్ట్రము లున్నవని చెప్పవచ్చును. చెన్నపురి, బొంబాయి, బంగాళా రాష్ట్రములను కార్యనిర్వాహక సభాయుతులగు గవర్నరులు పాలించుచున్నారు. బీహారు ఒరిస్సారాష్ట్రములు కార్యనిర్వాహక సభాయుతుడగు లెఫ్టినెంటు గవర్నరు పరిపాలనక్రింద నున్నవి. పంజాబు, బర్మా, ఆగ్రా, అయోధ్య సంయుక్తపరగణాలు కేవలము లెఫ్టినెంటు గవర్నరుక్రింద నేయున్నవి. వీనిలో నెవరికిని కార్యనిర్వాహక సభ లేదు. అస్సాము, మధ్యపరగణాలు చీఫ్ కమీషనరుల పరిపాలనలో నున్నవి. వీనికికూడ కార్యనిర్వాహకసభలు లేవు కాని యిప్పుడు చెప్పిన యీ తొమ్మిది రాష్ట్రములలోను శాసనసభలు గలవు. ఒక్క బంగాళా రాజధానిలో తప్ప తక్కిన రాష్ట్రము శాసనసభ లన్నిటిలో ప్రజాప్రతినిధులసంఖ్య చాల తక్కువ. బంగాళా శాసనసభలో మాత్రము ప్రజాప్రతినిధులు 28 మంది యున్నారు. ఉద్యోగస్థులు 19 మందియును, గవర్నమెంటువారిచే నియమింపబడినవారు 4 గురును కలరు. ఈ శాసనసభలలోనుండు మెంబర్లు గవర్నమెంటువారిని ప్రశ్నలడుగవచ్చును. వారిని విమర్శింపవచ్చును. తీర్మానముల నెన్నియైన చేయవచ్చును. కాని యీ తీర్మానములు గవర్నమెంటువారి మీద బైండింగుకావు. గవర్నమెంటు కార్యనిర్వాహకులమీద వీరి కెట్టియధికారమును లేదు. వారు వీరు చెప్పినట్లు చేసితీరవలెనను బాధ్యత లేదు. రాష్ట్రములలో సొమ్ము నెట్లు వసూలు చేయవలెనో, యెట్లు ఖర్చుపెట్టవలెనో మొదలుగాగల ఆయవ్యయములను నిర్ణయించుటలో యీ సభ్యుల కెంతమాత్రమును అధికారము లేదు.

గౌ॥ వైస్రాయి మంత్రిగార్లు తాము వ్రాసిన రిపోర్టులో పన్నులను విధించుట, ఋణములు చేయుట మొదలుగాగల పరిపాలనాధికారము కొన్నింటిని రాష్ట్రప్రభుత్వముల కిచ్చిరి. శాసననిర్మాణ, ఆర్థిక, పరిపాలనాది విషయములలో యిదివరకు వీరిపైనున్న యిండియా గవర్నమెంటువారి యధికారమును కొంతవరకు తొలగించిరి. ప్రతిరాష్ట్రమునందు రాష్ట్రాధిపతికి తోడ్పాటుగ నుండుటకై కార్యనిర్వాహక సభయుండి తీరవలెనని యీ రిపోర్టులో నున్నది. కాని ప్రతిరాష్ట్రములో "ద్వంద్వపద్ధతి" యను నింకొక క్రొత్త పద్ధతిని నెలకొల్ప సంకల్పించిరి. ద్వంద్వపద్ధతి యన నేమి? రాష్ట్రవ్యాపారముల నన్నిటిని వారి చిత్తము వచ్చినట్లు రెండు భాగములుగ విడదీసిరి. వీనిలో కొన్ని ప్రజాధీనశాఖలు, తక్కినవి అధికారాధీనశాఖలు. అధికారాధీనశాఖలు గవర్నమెంటు కార్యనిర్వాహకుల యధీనములో నుండును. ఈ కార్యనిర్వాహకులు శాసనసభకు బాధ్యులు కానక్కరలేదు. శాసనసభవారు వీరిని తొలగింపజాలరు. ప్రజాధీనశాఖ లనగ ప్రజల యధీనము చేయబడినవి అని అర్థము. ఇక ప్రజాధీనము చేయబడిన శాఖలు ప్రస్తుతము చాల తక్కువ. యివి యంత ముఖ్యమైనవి కూడ కావు. ఈ ప్రజాధీనశాఖల నొక మంత్రిచేతికి వప్పగింతురు. ఈ మంత్రి ప్రజలచే నెన్నుకొనబడిన శాసనసభ్యుడై యుండవలెను. ఈతడు మొదట కొంత కాలమువరకు తన్నెన్నుకొనిన నియోజక

గణమునకు (ప్రజలకు) బాధ్యులై యుండవలెను. 5 సంవత్సరములైన పిమ్మట యిండియా గవర్నమెంటువారి కోరిక యైన యెడల, నీతను శాసనసభకు బాధ్యులై యుండ వలసి వచ్చును. ఈ పద్ధతి వలన మాదేశములో బాధ్యతాయుత ప్రభుత్వము ప్రారంభమయ్యెనని కొందరు వాదించుచున్నారు. ఇదిగాక పదేండ్ల కొకపర్యాయము సీమనుండి చక్రవర్తిగారొక విచారణసంఘమును పంపుదురు. ఈ విచారణ సంఘము వారిచ్చటికి వచ్చి, యిచ్చటి స్థితిగతు లెట్లున్నవో పరిశీలించి యింక నేయే శాఖలను అధికారాధీనమునుండి తొలగించి ప్రజల యధీనము చేసిన బాగుండునో నిర్ణయింతురట. ఈ ప్రకారముగ సమస్త అధికారములను, సమస్త బాధ్యతలను ప్రజల చేతులలో పెట్టువరకు చేయుచుందురట. తమపరము చేసిన శాఖలలో వేనినైనను ప్రజలు పరిపాలించుకొనలేక పాడుచేసి కొనినయెడల ఆట్టి శాఖలను ప్రజలవద్దనుండి లాగికొని తిరిగి అధికారాధీనము చేయుటకు కూడ యీ చక్రవర్తిగారు పంపిన విచారణసంఘమునకు అధికారముండును. రాజ్యతంత్రనిర్వహణము నీవిధముగ రెండుగ విభజించిరి. దీనిలో నొక భాగము ప్రజలకు లొంగి యుండవలెను. వీరిని తొలగించుటకు ప్రజల కధికారముగలదు. రెండవభాగము ప్రజలకు లొంగియుండ నక్కరలేదు. వీరిని తొలగించుటకు ప్రజల కధికారము లేదు. ఈద్వంద్వపద్ధతి కేవలము అశాస్త్రీయమైనదనియు, అగమ్యగోచర మైనదనియు, యిది యెంతమాత్రమును పనిచేయజాలదనియు మా ప్రజలెల్లరు గట్టిగ తలంచుచున్నారు. ఇప్పుడిచ్చట నున్న పరిపాలనాపద్ధతి ప్రకారము యీ శాఖలను రెండుగ చీలదీయుట కెంతమాత్రమును వీలులేదని విశేషానుభవము గల ఆంగ్లోహైందవు లెల్లరు ఖండితముగ బల్కుచుండగ, వీరువచ్చి యీ శాఖలను రెండుగ చీలదీయవచ్చునని సిద్ధాంతము చేయుచున్నారు. ఒక్క కార్యనిర్వాహకవర్గము నందే భిన్న రాజకీయ ప్రవృత్తులకు సంఘర్షణము కలుగుచున్నప్పుడు కార్య నిర్వహణమునం దెట్లు సమాధానము పొసగునో యూహింపజాలకున్నాము. (ఒక్కయొరలో రెండుకత్తు లెట్లు దూరును?) ఈ విపరీతపు ద్వంద్వపద్ధతికంటె మిక్కిలి సరళముగ పనిచేయగల చక్కని శాస్త్రీయ పద్ధతిని బహు సులభముగ నిర్మింపవచ్చును. కాని యీ ద్వంద్వపద్ధతిలోనున్న లోపాలోపముల మాట యటుంచుదము. ఇప్పుడు మేము చెప్పున దేమనగ; యీ పద్ధతిని తెచ్చిపెట్టుటచే మే మసమర్థుల మను భావము దీనిలో తప్పక స్ఫురించుచున్నది. అందువలననే, అసలు మీకు స్వరాజ్యమును మెట్లు మెట్లుగ నిచ్చెద మని వారు చెప్పిరి. ఇట్టి భావస్ఫురణకు మా దేశప్రజ లెల్లరును తీవ్రముగ రోషపూరితులై యున్నారు. మా ప్రజ లిట్లు తమ రోషావేశమును పైకి తెలుపగనె యిక్కార్యమునకై సీమ నుండి వచ్చిన మంత్రిగారి సహోద్యోగు లొక రిట్లు తక్షణమే దీని కొక సమాధానమును జెప్ప గడంగిరి. "ప్రజాప్రతినిధి సభల నెట్లు నడపవలెనో మీకు విశేష పరిచయము లేనందున, జాగ్రతగ నుండుటకై మే మీ మెట్ల పద్ధతిని పెట్టితిమి

గాని, మీ రసమర్థులనే అపనమ్మకముచేత గాదు''ని వారు శెలవిచ్చిరి. ఇదెంత మాత్రమును యుక్తమైన సమాధానము కాదని దాని ముఖము చూడగనే తెలియుచున్నది. రాష్ట్రపాలనలో తక్షణమే ప్రజలకు పరిపూర్ణాధికారమిచ్చి తీరవలెను. అధికారాధీనముగ నెట్టి శాఖలు నుండకూడదు. అన్నియును మంత్రుల చేతులలోనే యుండవలెను. ఈ మంత్రులు పూర్తిగ శాసనసభకు జవాబు చెప్పవలసినవారుగ నుండవలెను. మా యర్హతను పరీక్షించుటకై పదేండ్ల కొకసారి పరీక్ష యనునది యుండకూడదు.—ఈ హక్కుల నవశ్య మిచ్చితీరవలెనని మా జాతీయ సభవారు తీర్మానించి యున్నారు.

౧౩. రాష్ట్రీయ శాసనసభలను మాత్రము విశాలముచేసి ప్రజాప్రతినిధుల సంఖ్య హెచ్చించెదమని వారు శెలవిచ్చియున్నారు. కాని అధికారాధీనమందున్న శాఖలనుగూర్చి శాసించుటకు (అనగ శాసనములను నిర్మించుటకు) యీశాసనసభవారి కధికారము లేకుండ *"గ్రాండుకమిటీ' యను వేరొకసభ నేర్పాటు గావింప నునుకట్టిరి. ఈవిధముగ కుడిచేతితో నిచ్చినదానిని యెడమచేతితో లాగికొనుచున్నారు. ఈవిషయములో-పాపము! బంగాళా రాజధానికి మరింత యన్యాయము జరుగుచున్నది. ఏలననగ:—యిదివరకు బంగాళా శాసనసభలో ప్రజాప్రతినిధుల సంఖ్య కొంచె మెక్కువగ నుండెడివారు. వీరికి అన్నిశాఖలనుగూర్చి శాసించుటకు అధికారముండెడిది. కాని యీ ప్రస్తుత పద్ధతిమూలమున అధికారాధీనము చేయబడిన శాఖలపై వీరికెట్టి యధికారము లేకుండ పోవుచున్నది. ఇదెంతయు వక్రగతియనుట నిశ్చయము. మొట్టుకు దీనివలన మాకెంత అభివృద్ధి కలిగినది; మేమెంత ముందుకు వచ్చినాము అని చెప్పుకొన దగినదేదియును లేదు. ప్రజలందరును—ఆ బాలగోపాలము—యీ గ్రాండు కమిటీని తీవ్రముగ ఖండించిరి.

౧౪. ప్రజలు కోరినకోర్కెలును, అధికారు లిచ్చెదమని చెప్పినమార్పులును, నేనిచ్చట వివరించితిని, ఎందులకు? వానిలోని లోపాలోపములను జూపించుటకా? కాదు. అన్నిటికంటె నత్యావశ్యమైనట్టియు, అన్నిటికిని మూలాధారమైనట్టియు గొప్పసంస్కరణ మొక్కటేగలదు. దానిపేరే 'స్వాతంత్ర్యము'. ఈ స్వాతంత్ర్యమను నదే యన్నిటికంటె యెక్కువైన సంస్కరణమని మాప్రభుత్వము వారింకను గ్రహించి యుండలేదని తనకు తెలియజెప్పుటకే నేనీవివరముల నన్నిటి నిచ్చట దెలిపితిని. నిజమైన ప్రజాపరిపాలనా ధర్మముల ననుసరించి మేము మాయిష్ట ప్రకారము మారాజ్యాంగ పద్ధతిని స్వయముగ నిర్ణయించుకొని మాగతిని మేము చూచుకొనుటకు మాకు స్వాతంత్ర్యముండి తీరవలెనని మా ప్రభుత్వము వారింకను గ్రహించి యుండలేదు. అర్హతను పరీక్షించుటకై మమ్ముల నతిదీర్ఘకాల మట్టులనే శిష్యత్వ

* పార్లమెంటులో ప్యాసైనచట్టములో యీ గ్రాండుకమిటీని తొలగించిరి. కాని దీనికి వెయ్యిరెట్లధికముగ, అధికారములన్నిటి గవర్నరు చేతిలో పెట్టిరి. [illegible]యైన నేమి పండ్లూడగొట్టుకొనుటకు?

మాలో నుంచుటయు, పదియేండ్లకొక పర్యాయమువచ్చి పరీక్షించుటయు— మొదలుగాగల యిట్టి చర్యలు యీ నాగరిక ప్రపంచములో భరింపశక్యముగాని విగ నున్నవి. మాకిప్పుడు కావలసిన దేమనగ:—మా ప్రజలకు యిండియా గవర్నమెంటులో (కేంద్రప్రభుత్వములో) అధికారముండి తీరవలెను. మాకీ యధికారమున్నయెడల, స్వయంనిర్ణయసూత్రప్రకారము సమస్తమును మేమే నిర్ణయించుకొన గలుగుటకు అవకాశము చిక్కును. మా దేశములో నెన్నిరాష్ట్రములుండవలెనో, వాని కెచ్చటెచ్చట హద్దులుండవలెనో, స్వరాజ్య సాధనమునకు మొదటి మెట్టును గట్టుటకు యేయే సంస్కరణము లుపయుక్తముగ నుండునో, యెన్ని సంస్కరణములు చాలునో, మా గమ్యస్థానమగు సంపూర్ణ స్వరాజ్యమును చేరుటకు యెంత వడిగబోయిన శ్రేయస్కరముగ నుండునో,—యీసమస్యలనెల్ల మేమే స్వయముగ నిర్ణయించుకొన గలము. మా యాంతరంగిక వ్యవహారములలో పరుల జోక్యముగాని, మా యర్హతను పరీక్షించుటకు పదేండ్లకొక పరీక్షగాని, యింత వక్కరలేదు. వీనితో నవసరములేకుండ సమస్తమును మేమే స్వయముగ నిర్ణయించుకొన గలము.

బ్రిటిష్ సామ్రాజ్యమునుండి చీలిపోవలెనని గాని, బ్రిటిష్ సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోవలెననిగాని, మా ప్రజల కెంతమాత్రమునులేదు. బ్రిటిష్ వారి కేమైన నట్టియనుమాన మున్నయెడల సైన్యనౌకాదళముల పరిపాలనము, యుద్ధము, సంధి పరరాజులతోటి వ్యవహారముల నడపుట—మొదలుగాగల వానిని ప్రస్తుతము మాచేతికి నప్పగింపకుండ వారు తమ చేతులలోనే యుంచుకొనవచ్చును. వారికి మాయెడ గట్టినమ్మకము కుదురుటకై మేమిప్పుడిందుకు సమ్మతింతుము. కాని సైన్య నౌకాదళములలో నింగ్లీషువారి కే యే షరతులమీద నుద్యోగ పదవుల నిచ్చుచున్నారో, ఆషరతుల ప్రకారమే మా దేశస్థులకుకూడ నుద్యోగముల నిచ్చుచుండవలెను. మేము సదుద్దేశముతో నున్నామని బ్రిటిష్ గవర్నమెంటువారికి మాయెడ గట్టినమ్మకము కుదురుటకై ప్రస్తుతము కొద్దికాలమువరకు మేమీ నియమములకు బద్ధులమై యుండెదము. మరియు, ఖండాంతరములనున్న వలస దేశములతో బాటు మేముకూడ 15 సం॥లలో సమస్తవిధముల సమానమగు రాజకీయ పదవికి రాగలమను నాశతో మేమిప్పుడు తాత్కాలికముగ నిట్టి నియమములకు సమ్మతింపుచున్నాము.

౧౫. పై నుదహరించిన జాతీయసభవారి తీర్మానము ననుసరించి నేను బ్రిటిష్ యిండియా ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధి నైతిని. నే నాప్రతినిధి ధర్మము నిప్పుడిచ్చట నిర్వహింపవలసి యున్నది. కనుక నా స్వధర్మ నిర్వహణార్థమై నే నిప్పుడు సంధిసభవారితో హృదయపూర్వకముగ మనవి చేసికొనున దేమనగ:—

ఒకటి:—ఈజాతిసమితిలో బ్రిటిష్ వలసదేశములవారి కిట్టి ప్రాతినిధ్యాధి

కారము కలదో, అట్టి ప్రాతినిధ్యాధికారమునే మా భారతవర్షమునకు కూడ ననుగ్రహింపవలెను.

రెండు:— తమ్మును తాము పరిపాలించుకొనుటకు భారతీయులు తగియున్నారని ముందు ప్రకటింపవలెను. భారతజాతి ప్రవర్ధమాన మగుచు పైకి వచ్చుచున్న జాతి గనుక స్వయంనిర్ణయసూత్రమును వర్తింపజేసికొనుటకు యీ దేశమునకు కూడ హక్కు గలదని ప్రకటింపవలెను. సుస్థాపిత మగు ప్రజాపరిపాలనా సూత్రముల ననుసరించి, మా నైసర్గిక మేధాసంపత్తి కనుగుణముగ, మా యాత్మాభివృద్ధి కేయే పద్ధతు లత్యనుకూలముగ నుండునో అట్టి రాజ్యాంగపద్ధతులను, స్వయంనిర్ణయ సూత్రప్రకారము, మేమే స్వయముగ నిర్ణయించుకొనుటకు మా భారతప్రజలకు హక్కు గలదని ప్రకటింపవలెను. ఇట్టి ప్రకటన యెంతయు న్యాయసమ్మతమైనదని సమర్థించుటకు అక్షరములగు ధర్మసూత్రములే ప్రమాణములు. 'భుజబలమునకంటె ధర్మబలమె యజేయమైనద'ను సిద్ధాంతము దీనికంతకు పరమప్రమాణము. ఇట్టి ప్రకటన మూలమున ఆ సేతు హిమాచల పర్యంతము గల ముప్పదికోట్ల భారతీయులలో గంభీరమగు కృతజ్ఞతాభావ ముదయించుటయే గాక, వారిలో నతి తీక్ష్ణమగు నుత్సాహము కూడ ప్రబలగలదని నేను సభాధ్యక్షు లగు తమద్వారా సంధిసభవారికి గట్టిగ మనవిచేసికొనుచున్నాను. అదిగాక, బ్రిటిష్ పార్లమెంటువారి ప్రకటనను, క్రియారూపముగ నమలు జరిపినయెడల నిశ్చయముగ ప్రపంచములో శాంతి సుస్థిరముగ నిలువగలదు; భారతవర్షమున కెంతయో శ్రేయస్సును కలుగగలదు; మహత్తరమగు మా భారతసామ్రాజ్యముతో బ్రిటిష్‌వారి కున్న శ్రేయోదాయకమగు బాంధవ్యము నిలిచియుండగలదు.

ఇట్లు విన్నవించు తమవిధేయుడు.
బా. గం. తిలక్ (అని ఉన్నది)

---

# 16. శివాజీ

(కలకత్తాలో నిచ్చిన ఉపన్యాసములోని కొంత భాగము)

ఉత్సవములు లేనిది మనకు జరగదు. ఇది మానవ స్వభావము. ఉత్సవములయెడ ప్రీతిగలిగి యుండుట మనుష్యప్రకృతియొక్క లక్షణము. మనకు ఉత్సవము లుండి తీరవలెను. మన యుత్సాహశక్తులను మొక్కవోకుండ తీక్ష్ణముగ నుంచుకొనగోరిన యెడల సంవత్సరమున కొకసారియైనను మనమందర మొక్కచోట సమావేశమై మన ఆధ్యాత్మిక మేధాశక్తులను ఏదియో యొక ధూరావర్త

ప్రాప్తికై కేంద్రీకరింపజేయుట అత్యంతావశ్యమై యున్నది. ఈ యుత్సవములు పూర్వ చారిత్రాంశములను స్మరించుటకై మొదట పుట్టబడి ప్రతివత్సరమును క్రమముగ జరుపబడుచున్నవి. జాతీయ మహాసభ తప్ప మనకు ఇతరములగు జాతీయోత్సవము లేమియు లేకుండుట మన దురదృష్టము. అందుచేతనే జాతిమతి విచక్షత లేకుండ భారత వర్షమునం దంతటను వ్యాపింపగల దను ఉద్దేశముతో శివాజీ యుత్సవమును మహారాష్ట్రదేశములో ప్రారంభించినాము. శివాజీ మహారాష్ట్రుడనికాని, అతడు నవనాగరికత నెరుంగనివాడనికాని, యీ యుత్సవమున కెట్టి యభ్యంతర ముండుటకు కారణములేదు. ఇవి యంత ముఖ్యమైనవికావు. అతడు పునహాపట్టణమున జన్మించెను గనుక మహారాష్ట్రుడైనాడే కాని వేరుకాదు. జాతిని బట్టి చూచినయెడల శివాజీకూడ రాజపుత్రులలో చేరినవాడేయని తెలియుచున్నది. మీ యిష్టమైనయెడల శివాజీని రాజపుత్రుడనవచ్చును, లేక బంగాళీయనవచ్చును. (బిగ్గరగా చప్పట్లు) కనుక మనము ప్రతివత్సరముత్సవములు జరుపుచునే యుండవలెను. ఈ యుత్సవమంత యెక్కువ యుత్సాహజనకమైనది గనుక ఈ దినములలో మన కది లేనిది లాభములేదు. శివాజీ జీవితములోని సారాంశమును గ్రహించుటయే ఈపండుగలయొక్క ముఖ్యోద్దేశము. ఇచ్చటగాక, మా మహారాష్ట్రదేశములోనే ఈ యుత్సవ విషయమై అనేక అభ్యంతరములు బయలుదేరెను. "మేము మహమ్మదీయులము గనుక మేమెట్లు యుత్సవములను చేయుదు" మని మహమ్మదీయులు మొదట యభ్యంతరము జెప్పిరి. కాని ఇప్పుడు వారాయభ్యంతరమును మానివేసిరి. శివాజీ తనకాలములోనుండు మహమ్మదీయ క్రూరప్రభుత్వమును అణచుటకు పోరాడెనేగాని, తాను మహమ్మదీయులకు విరోధముగ ఎప్పుడును పోరియుండలేదు. దీని కనేక దృష్టాంతరములు గలవు. శివాజీచే బంపబడిన దండనాధు డొకడు ఒక మహమ్మదీయ దళవాయి నోడించి, వాని కుటుంబమువారిని చెరబట్టి, అయనయొద్దకు దీసికొనివచ్చెను. శివాజీ తక్షణ మామెను జనానాలోనికి బంపి, ఆమెను ఆమెభర్తవద్దకు వెంటనే పంపివేయవలసినదని తన దండనాధున కాజ్ఞాపించెను. శివాజీ చరిత్రలోని ఇట్టి యంశములనే తెలిసికొనుటకై మన మాతని జీవిత చారిత్రమును పఠింపవలెను. ఇట్టి క్రమమైన యుద్దేశముతో శివాజీచరిత్రను జదివినయెడల, మన కెచ్చటలేని యుత్సాహము పుట్టుకొనివచ్చునని నిశ్చయముగ నేను జెప్పగలను. ఈ దినములలో మన జీవితమును సన్మార్గమున నడపుకొనుటకు మనకిది సాధనభూతమైయుండును. ఇట్టి యుత్సాహశక్తి మన కేదేశచరిత్ర చదివినను పుట్టజాలదు. శివాజీ కేవలము సిద్ధిబొందిన సత్పురుషుడు. కనుకనే ఆతని జీవితమును మనము ఉత్సవరూపముగ పూజింపవలెను. కాళికాదేవి బంగాళాదేశస్థుల కందరకును అధిష్ఠానదేవత. శివాజీ రక్షకురాలుగూడ ఆకాళీకాదేవియే. ఈ దినమున నెవరో ఇచ్చట కాళినిపూజింప గూడదని యభ్యంతరము జెప్పిరి. ఇట్టి యభ్యంతర మేల యుండవలెనో నాకు

కారణము కనిపించుటలేదు. ఇది సహేతుకమైన యభ్యంతరముగాదు. మన మందిరమును హిందువులము; విగ్రహారాధకులము. అందుకు నేను సిగ్గుపడవలసిన పనిలేదు. ఇట్టి నా నిశ్చయాభిప్రాయమును ఇచట బహిరంగముగ చాటవలెను. భవానీదేవి లేనిది శివాజీని గూర్చి మనమెట్లు స్మరింపగలము? అతని జీవితమంతయును భవాని దేవతతోడనే ఏకమై అందులో లీనమైపోయినది. భవానిలేనిది శివాజీని గూర్చి మనము తలంపనేలేము. ఇప్పటికి నెలాపదిహేనుదినముల క్రిందట రాయఘరు (కోట) లో శివాజీ దేవాలయమువద్ద గొప్ప యుత్సవము జరిగియున్నది. పల్లికీలో శివాజీ విగ్రహమునుపెట్టి ఊరేగింపుచు, ఆ దేవాలయమునొద్దకు ఉత్సవముతో వెడలిపోయితిమి. దక్షిణ హిందూదేశమున ఇట్టి దేవాలయము లనేకములను ఆంగ్లేయ ప్రభుత్వమువారు ధనసహాయము చేసి కాపాడుచున్నారు. అయ్యలారా! మహమ్మదీయులువచ్చి, ఈ కాళికాలయములలో పూజింపవలయునని నేను చెప్పుటలేదు. కాని పునహాలో మన హిందువులమందరమును మొహరంపండుగలలో మహమ్మదీయుల ఉత్సవములలో నెట్లు పాల్గొనుచున్నామో, అట్లే వారు కూడ నీ యుత్సవములలో పాల్గొనవలయునని నాయుద్దేశము. వారు పూజలలో పాల్గొనకపోయిన పోవచ్చునుగాని, ఉత్సవములో నేల పాల్గొనరాదో కారణ మూహింపజాలము. మన రాజకీయాభిప్రాయములకు స్థూలరూపమును నిర్మించుటకు గాను ఇట్టి యుత్సవములను మన హిందువు లాచరింపవలసియున్నది. మహమ్మదీయ ప్రభుత్వము దౌర్భాగ్యస్థితియందున్న దినములలో సైతము హిందువులవలె మహమ్మదీయులు కూడ అత్యుత్సాహముతో శివాజీని పూజించినట్లు చరిత్రాంశములు చాటుచున్నవి.

---

# 17. శివాజీ దేశీయ మహావీరపురుషుడుకాడా?

వీరపూజ యనునది మనుష్యప్రకృతిలో గాఢముగ వేరునాటుకొనినది. మన స్వజాతిలో పుట్టిపెరిగిన వీరపురుషుని పూజించుట మన కెంతయో యుత్సాహజనకముగ నుండును. మన ప్రస్తుత రాజకీయాదర్శములకు ప్రాణముబోసి జీవనబలము నిచ్చుటకుగాను యిట్టి వీరపూజ యత్యంతావశ్యము. ఇట్టి వీరపూజకు మన హిందూదేశచరిత్ర యంతటిలో నీ శివాజీతప్ప మరి యితరు లెవరును అర్హులుగారు. దేశమంతయు అరాచకమయమయి దిక్కుమొక్కులేక యల్లాడుచు, అంధకారమున మునిగియున్న తరుణమున మహారాష్ట్రభూమిలో శివాజీ యుద్భవించెను; తన స్వార్థత్యాగమువలనను, ధైర్యసాహసములవలనను, నిరంతర కృషివలనను దేశము నుద్ధరించెను. సత్యోక్తియు డెప్పుడును మన హిందూదేశము చెడ నిర్ధ[illegible]మై మనలను దగవాడలేదని ప్రపంచమున కంతకును చాటెను. ఆదినములలో హిందువులును, మహమ్మదీయులును పరస్పర విరోధులై యున్నమాట

సత్యమే. కాని శివాజీకి మహమ్మదీయ మతము నెడ నత్యంత సహనము గలదు. అయినను దేశమును భరింపరానిదుర్దశ పాల్పేయుచున్న యప్పటి మొగలాయి ప్రభుత్వమునకు అతడు వ్యతిరేకముగ పోరాడవలసిన వాడయ్యెను. అప్పటి క్రూర ప్రభుత్వమునకు వ్యతిరేకముగ నిలచి ధైర్యముతో పోరాడెను. అట్లని యిప్పుడు మహమ్మదీయులు శివాజీని వీరపురుషునిగ నేల గౌరవింపగూడదో కారణము గన్పట్టదు. ఏలనన, మన మందరమును (హిందువులును మహమ్మదీయులును) మన కిదివరకున్న యధికారములను గోల్పోతిమి. ఇప్పుడు మనమందరమును ఒకేవిధమైన చట్టములమూలమున పాలింపబడుచున్నామే గాని భేదమేమియు లేదు. అట్లయినప్పుడు మనమందర మేల శివాజీని గౌరవింపగూడదు? కేవలము శివాజీ గావించిన పనులనే మనవారు కూడ గావింపవలెనని మాయుద్దేశము కానేకాదు. అట్లు చేయవలసినదని మేమెవరికిని బోధించుటలేదు. మేమిట్లు బోధించుచున్నామని మామీద పరులు మోపు నింద ఆంగ్లోహైందవుల పుర్రెలలో పుట్టిన బుద్ధియేగాని వేరుకాదు. మనలోని వీరికి వారిని బెదరించుటకువారు చేయు బెదరింపులేగాని యివి వేరుకావు. శివాజీ చేసిన ప్రతిపనిని మనవారు కూడ చేయవలసినదని ఎవరును కలలోనైను తలంచరు. శివాజీ తాను గావించిన పనులనెల్ల నెట్టి ఘన ప్రారంభముతో, నెట్టి పరమోత్కృష్టమైన ధర్మసంకల్పముతో, ధర్మదీక్షతో, నెట్టి కార్యోత్సాహముతో గావింపగడంగెనో నట్టి వానినే మన భవిష్యత్సంతతి వారందరును నిరంతరము పరమలక్ష్యముగను, మాతృకగను గణించి, తదనుగుణముగ ననుష్ఠింపవలయునను సదుద్దేశముతోడనే మేమీ శివాజీ జీవితపథమును దేశప్రజల మనోనయనము లెదుట సాక్షాత్కరింప జేయుచున్నాము. ఎందరెన్ని విపరీతార్థముల జెప్పినను మనల నీ సదుద్దేశమునుండి పరాఙ్ముఖులను గావింప నేరరు. పరులు జెప్పు నిట్టి జిత్తులమారి మాయమాటలచే మహమ్మదీయ సోదరులు మోసపోయి పెడత్రోవల బోకుందురుగాక; విపరీతమార్గముల బొంత బోకుందురుగాకయని నమ్ముచున్నాము. మనలో నివి హిందువులకును మహమ్మదీయులకును పరస్పరద్వేషములను పుట్టించును గనుక మనము శివాజీ యుత్సవము చేయకూడదని ఆంగ్లోహైందవులు (ఇచ్చటి తెల్లవారు) మనకు హితము బోధించుచున్నారు. అట్లయిన యెడల ఆంగ్లేయులు తమ ఇంగ్లాండుదేశ చరిత్రలో ప్రసిద్ధికెక్కిన "నెల్సన్" మహావీరుని పూజింపకూడదని యభ్యంతరము చెప్పెదరా? ఫ్రాంసు దేశస్థులు తమదేశ చరిత్రయందు ప్రఖ్యాతివడసిన "మహానెపోలియన్" వీరపురుషుని పూజింపకూడదని యభ్యంతరము చెప్పెదరా? ఇట్టిపూజలు ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని మధ్య పరస్పర ద్వేషభావములకు పురికొల్పవా? వారు నిరంతరము తమలో తాము పోరాడుకొనుచుండుట కివి కారణభూతములు కావా? వారిలో సమాధాన (సాంత్వన) భావమును పారద్రోలి యివి యుభయ దేశములకును శాశ్వత విరోధము నాపాదింపవా? ఇట్టియుత్సవములు వాటిన్నిటిని భయముచేత ఇంగ్లాండు

ఫ్రాంసుదేశములవారు వీరపూజలు సలుపకూడదనియును, జాతీయోత్సవములజేయ కూడదనియును యీ యాంగ్లోహైందవు లభ్యంతరము చెప్పగలరా ? వారట్లు చెప్ప రని మనకు తెలియునుగద, అయినను యీ ఆంగ్లోహైందవ విమర్శకులు మనయం దెవ్వటలేని దయారసభావము వెల్లివిరియ మనమీ జాతీయోత్సవముల గావింప గూడదని మనకు బోధించుచున్నారు ! తాము గావించు నిట్టి మాయా తంత్రములకు మనము లోబడి మోసపోవు దినములు వెనుకబట్టినవని వారు-పాపము ! గ్రహింపలేరు. వారి తంత్రములను మనము పూర్ణముగ గ్రహించినాము. వారు చెప్పు ప్రతిమాటను మనము వేదవాక్యముగ గ్రహించి శిరసావహించు వెనుకటి దినములు పోయినవని వారికను గ్రహింపలేరు. మహమ్మదీయులతో విరోధము పెట్టుకొనవలయునని గాని, లేక వారికి మాత్సర్యము పుట్టునట్లుజేసి వారిని ఉద్రేకింపజేయవలయుననిగాని మనమీశివాజీయుత్సవమును జరుపుచుండుటలేదని మీరు గ్రహింపవలెను. కాలములు మారిపోయినవి. ప్రజలయొక్క రాజకీయస్థితిని జూచినయెడల హిందూ మహమ్మదీయులందరును సమానస్థితిలోనే యున్నారు. ఒకరి ఎక్కువలేదు. ఒకరి తక్కువలేదు. ఇట్టిస్థితిలో శివాజీయుత్సవముద్వారా మన కావశ్యమైన ఉత్సాహమును ఆతని జీవితసారమైనశక్తులను మనము పొందజాలమా? మనకిప్పుడు తెలవలసిన యంశమిదియే. ఆతనజీవితస్మరణవలన యిట్టి యుత్సాహశక్తులను మనము గ్రహింప గలుగుదుమని మీకుతోచినయెడల, ఇక శివాజీయేజాతివాడని మీరు ప్రశ్నింపనక్కర లేదు. ఆత నేజాతివాడైననేమి ? శివాజీ మహారాష్ట్రుడని మీరెంచనక్కరలేదు. ఈ యుత్సవములనుగూర్చిన యీ యంశమునే "బంగాళీ" "అమృతబజారుపత్రిక" మొదలైన మన భరతవర్ష వార్తాపత్రికలలో మనవారు అనేక పర్యాయములు వివరించియుండిరి. మనదేశ జనుల కన్నుల గప్పుటకై యీ ఆంగ్లోహైందవులు బోధించు యీ వంకరబుద్ధుల వలన నెవరును మోసపోవుటకు వీలులేదు. మహమ్మదీయులందరును కలసి "మహాక్బరు చక్రవర్తి" పేర నొక యుత్సవము చేయుటకు సంకల్పించుకొనినయెడల మా కభ్యంతర మేమియునులేదు? ఒక్క అక్బరు చక్రవర్తియే గాక భారతవర్ష-చరిత్రలోనే వీరపురుషుని పేరనైనను ఉత్సవములు చేసికొనవచ్చును. వానివలన గలుగగల మేలు వానియందున్నది. కాని యీ శివాజీ యుత్సవములో దేశమునకంతకును ఉపకరించు మేలుకలదు. ఎవరునుకూడ యీ విషయమును మరచి పోకూడదు. ఏమనగా:—ఏ వీరపురుషుడైనను తన యుగ ధర్మమననుసరించి వర్తించును. ఈ సూత్రము ప్రతిదేశమునకును - భారతవర్షమునకైనను ఇంగ్లాండునకైనను - వర్తించును. కనుక ఆయుగ ధర్మమును బట్టియే ఆతన గావించిన పనులనెల్ల మనము విమర్శింపవలసియుండును. ఈ ధర్మసూత్రము ననుసరించి యోచించినయెడల, శివాజీలో నెట్టిలోపమును గాన్పింపదు, పైనచెప్పినట్లుగా, అంత దూరము పోనేల? ఆయనయొక్క పరమోత్కృష్టమైన ధర్మసంకల్పములే, ఆయనయొక్క కార్యదీక్షయే, ఆయనయొక్క ప్రాభవోత్సాహములే, ఆయన మహా

వీరపురుషుడని చెప్పుటకు చాలును. వేరే ఆయన చేసిన ప్రతికార్యముల నెంచనక్కరలేదు. లోకమున ధర్మము క్షీణమై అధోగతియందున్న సమయములో దుష్ట శిక్షణ శిష్టరక్షణ గావించి లోకము నుద్ధరించుటకై, యుగయుగమునందును మహాపురుషుల నుద్భవింపజేయు భాగ్యము మన భారతవర్షమునకు గలదనియును, మన భారతీయులింకను అంత నిర్వీర్యులు కాలేదనియు, ఇప్పటికిని కాజాలరనియును, మన యీ శివాజీ జీవిత చారిత్రము ప్రస్ఫుటముగ చాటుచున్నది. ఈ సారాంశముచే మన హిందూ మహమ్మదీయులందరును గ్రహింపవలసియున్నది. దీని దేశములో బాగుగ నాటజేయుటకయియే యీ శివాజీయుత్సవమును ప్రారంభించినాము. మహమ్మదీయులతోగాని, గవర్నమెంటువారితోగాని పోరాడవలెనని యీ యుత్సవమును ప్రోత్సాహించుటలేదు. అట్లు తలంచుట కేవలము యీ యుత్సవోద్దేశములకు విపరీతార్థమును లాగుటయే యగును. (దీని నిజార్థమును తెలిసికొనలేక పోవుటయే యగును.) ఆదినములలో నప్పటి రాజకీయ పరిస్థితులను బట్టియే, తదనుగుణముగనే, శివాజీ మహారాష్ట్రభూమిలో జన్మించుటకు కారణమైనది. (ఇకముందు మనదేశము నుద్ధరింపగల) భవిష్యన్మహావీరుడు యీ భారతవర్షమునందెచ్చట నుద్భవింపబోవుచున్నాడో యెవరెరుగుదురు! ఆ మహాపురుషుడు మహమ్మదీయ మహావీరుడుగా జన్మింపబోవుచున్నాడేమో యెవరెరుంగుదురు? శివాజీ యుత్సవమునకు క్రమమైన యర్థమిదియే. ఆంగ్లోఇండియనులు ఎన్నెన్ని విధముల వచించినను మనలను దీనినుండి పరాఙ్ముఖులను గావింపజాలరు.

---

# 18. శివాజీ ఉత్సవము : పునహా ౧౯౦౭.

[11 వ శివాజీయుత్సవము 1907 సంవత్సరములో పునహాపట్టణమున జరిగెను. ఈ యుత్సవమును మొదలుపెట్టిన రెండవ సంవత్సరమే చాల అల్లరులు జరుగునని భయము కలిగెను. కాని భగవదనుగ్రహమున అట్టిదేమియు జరుగలేదు. ఈ యుత్సవ సందర్భమున తిలకుమహాశయు డీ విధమున మహారాష్ట్ర భాషలో నుపన్యసించెను.]

## భావగర్భితమైన ప్రకటన

ఈ యుత్సవములను మనము జరుపుచుండుట ప్రజలలో నల్లరుల బుట్టింపవలయునను తలంపుతో గాదని ప్రభుత్వమువారింకను తెలిసికొనజాలకుండుట కడు శోచనీయము: వారి మనస్సింకను తగని యనుమానములోనే మునిగియున్నది. ఇప్పుడిచ్చట (గవర్నమెంటువారిచే నియమింపబడిన) 10, 12 మంది గూఢచారులును, రిపోర్టరులను యున్నారు. మనయందిట్టి అనుమానము, అపనమ్మకము నుండవలసిన అవసరమేమి? డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుగారు కొంచెము శ్రమజేసి తామే స్వయముగ నిచ్చటికి

వచ్చిచూచిన బాగుండియుండును. వారట్లు చేయకపోవుటవలన నాకువిచారముగ నున్నది. ఇప్పుడిట్టి సందర్భములలో శివాజీ యుత్సవస్థాపకులమైన మనమేమి చెప్పుదుమో స్వయముగ తామే వచ్చివినుట కవకాశమును మనమిచ్చి యున్నప్పుడు వారేల యీ యవకాశమును జారవిడిచెదరు (వారేలరారు)? నేను యిప్పుడిచ్చట చెప్పు ప్రతియంశమును గవర్నరుగారియెదుటనైనను నిర్భయముగా చెప్పుటకు సంసిద్ధుడనై యున్నాను. గవర్నరు నెదుటనేగాదు, ఆ భగవంతుని యెదుటగూడ చెప్పగలను. ఏలనన, నే జెప్పుదానియందు నిశ్చయముగా నాకెంత దృఢమైన నమ్మకము గలదు. నాకు హృదయపూర్వకముగ నమ్మకము గలదు. కావలసిన యెడల పట్టణములలో యిండ్ల కప్పులమీద కూడ నెక్కి బహిరంగముగ చాటించగలను. ఆగూఢచారియే నావద్దకువచ్చి యడిగినయెడల నా యభిప్రాయములను దాచక నిర్భయముగానే జెప్పగలను. నా యభిప్రాయములను రహస్యముగ చెప్పవలసిన అవసరమేమి? నిజముగ భారతీయులు తమదేశములో తామే దొంగలు కాజాలరు. వారు తమ కోర్కెలను ఆదర్శములను బహిరంగముగ ప్రకటింపగలరు. అట్లుచేయవలసిన విధికూడనై యున్నది. మేముచెప్పు సంగతులన్నిటిని మీరు వినకుండ రహస్యముగ చెప్పుకొనవలెనని మాయుద్దేశముకాదు. ఇచ్చట మాట్లాడువారి నెట్లయినను శిక్షించి కసితీర్చుకొనవలెనను దురుద్దేశముతో, తప్పుదారిగ యెచ్చటనో యే సందర్భముననో నోటివెంట వచ్చు మాటలను పట్టుకొనుటకై రహస్యముగ వెలలొడ్డి చేయు నిట్టి నీచమైన పనులను నేను నిర్భయముగ ఖండించుచున్నాను. గవర్నమెంటువారు దీనిలోని యావత్తు సత్యమును తెలిసికొనగోరిన యెడల, మేము చెప్పుదాని నంతను పూర్ణముగవిని తెలిసికొనవచ్చును. దీనికై రెండులక్షలు వృధాగ వ్యయపరచి గూఢచారులను రిపోర్టరులను మొదలైనవారి నుంచవలసిన పనియేమి? ఈ సొమ్మును యే వృత్తి విద్యకైన నుపయోగించిన మరింత బాగుండునుగదా! మేము శివాజి ఉత్సవము చేయుచున్నాము. మనగా దేశములో విప్లవము పుట్టింపవలెనను తలంపుతో నెన్నటికి కాజాలదు. మాకు తుపాకులు మందుగుండు సామాను లేవియు లేవని తెలిసియున్నప్పుడు మాకిట్టి యభిప్రాయముండుట కేవలము వెఱ్ఱిగదా.

## మార్లే మంత్రి జ్ఞానమునకు శత్రువా?

ప్రభుత్వమువారికున్న (మిలిటరీ) సైన్యబల మమితమైనది. నిమిషమునకు వందల కొలది గుండ్లను పేల్చగల యొక్క పెద్ద ఫిరంగితో యెంత పెద్ద ప్రజాసమూహమునైనను చిందరవందర జేయవచ్చును. ఈ సంగతులన్నియు గొప్ప చదువు చదివినవానికి, ఎం. ఏ. ఎల్. ఎల్. బి. పరీక్షలు ప్యాసైనవానికి, తెలియుట గొప్ప మెచ్చేయని మనము నిశ్చయముగా చెప్పవచ్చును. గొప్ప విద్యావంతులకు సహితము గోచరము కాని విషయము లీ పోలీసుగూఢచారి కెట్లు తెలియగలవు? నిరంతరము వేయికన్నులతో నెల్ల విషయములను జూచుచుండు ఆ సహస్రాక్షుడైన సర్వే

శ్వరుడే, చక్రవర్తులమీదను సామ్రాజ్యములమీదను ప్రజలపక్షమున కావలియుంచబడిన ఆగూఢచారియే,-యిప్పుడు కాకపోయిన మరొకప్పుడైనను, ఆంగ్లేయ ప్రభుత్వమువారికి (న్యాయము) బుద్ధి చెప్పగలదని (నీచముగ చూడబడుచున్న) మనము మన మనస్సుల నెట్లో సమాధానపరచుకొనవచ్చును. ఈ పెద్ద చదువులు చదువుకొనిన మనవారందరు గవర్నమెంటువారికి శత్రువులేయని వారియభిప్రాయము. ఈ యల్లరి కంతకును కారణ మిదియే. అంతమాత్రము పోనేల, ఈమాటలనే మార్లే మంత్రి తన నోటిమాటగ నాడియున్నాడు. ఈ చదువుకొన్నవారి మాటలలో పల్లెటూళ్లలోని రయితులు మొదలైనవారు యెవరును యేకీభవింపరను మొదలైన సంగతులను కొండంతలుగజేసి మార్లే మంత్రిచెప్పియున్నారు. ఆంగ్లేయాధికారుల రాజకీయ తంత్రములు, వారి యాలోచనలు, వారియుక్తులు, వారి లోతుపాతులు, మంత్రాంగపు తంత్రములు జనమునకును అడవిజాతులవారికిని విద్యాగంధము లేనివారికిని యెట్లు తెలియగలవు? (చదువుకొనినవారికి తెలియునుగాని యితరుల కెట్లు తెలియును?) ఇంగ్లీషువిద్య నభ్యసించినవారు ప్రభుత్వమువారికి శత్రువులని మార్లే మంత్రిగారు శెలవిచ్చియుండుటకు వారుచేసిన పాపమేమి? వారిలోనుండు జ్ఞానమే వారినట్లు శత్రువులుగా చేసినది! అట్లయిన నిశ్చయముగా మార్లే మంత్రి జ్ఞానమునకు శత్రువే. క్రైస్తవమత గ్రంథప్రచారము, ఆదిపురుషుడైన ఆదాము జ్ఞానవృక్షము నుండి ఫలము నొకదానిని కోసి తిన్నందున బహుకష్టము అనుభవింపవలసి వచ్చెనని మనకు తెలియును. అట్లే చదువుకొనినందువల్ల వారు పొందిన జ్ఞానమునకు ప్రతిఫలముగ మన విద్యావంతులైన భారతీయులు కష్టము అనుభవింపవలసి వచ్చుచున్నది! గవర్నమెంటువారిని యీ సృష్టిలో జ్ఞానమునకు శత్రువులుగా నుండు స్వభావముగల (జీవకోటిలో) చేర్చవచ్చునా! అట్లు చేర్చబడుటకు వారు (సమ్మతించెదరా)? వారందుకు సంసిద్ధులైయున్నారా!

## జాతీయోత్సవములవలని లాభములు

ఇక శివాజీ ఉత్సవమునుగూర్చి చెప్పెదను. శివాజీ అప్పటి తనకాలము ననుసరించి తాను గావించిన గొప్ప గొప్ప కార్యములు నన్నిటిని యెట్టి ప్రాభవముతో గావించెనో అట్టి ప్రాభవమునే, అట్టి ఘనాదర్శనములనే, అట్టి ఉత్సాహ శక్తులనే, మనముకూడ బాగుగ గ్రహింపవలెను. వానిని మన మనస్సులలో బాగుగ నాటుకొనునట్లు చేసికొని, యితరులుకూడ తెలిసికొనునట్లు చేయవలయును. అంతేగాని ఆయనచేసిన పనులనే, (ఆయన యేపనులను జేసిన ఆపనులనే) మనము కూడ చేయవలయునను అభిప్రాయమును మనమీ యుత్సవ సందర్భములలో నెప్పుడును బోధించి యుండలేదు. ప్రఖ్యాతిను గొప్ప పూర్వ చారిత్రముగల మనబోటివారికి యిట్టి యుత్సవములు మనలో న్యాయసమ్మతమైన ఆశయములను పురికొల్పుటకు సాధన భూతములైయుండును. ఇట్టియుత్సవములు మనలో ధైర్యమును పురిగొల్పును. యుద్ధభూమిని నిలిచిపోరాడి వీరస్వర్గమును జూరగొనిన వారి చరిత్రలను

చదివి, వారి యనంతకల్యాణ గుణములను బాగుగ గ్రహింప గలిగి నప్పుడు మన శక్తి యుత్సాహ సాహసములు పుట్టునో యట్టివానినే యీ యుత్సవములుగూడ మనలో ప్రజ్వలింపజేయును. 'బుద్ధీంద్రియ క్షోభయములకిది పెట్టనికోట'. నిరుత్సాహులకును, నిరాశజెందినవారికిని. యిది దురాయికట్టు. జాతీయ భావములను పురికొల్పుటకును, ఉత్సాహబీజములను నాటుటకును యీయుత్సవములు మంచి పెంట గట్టిసారవంతముగ జేయుబడిన నేలవంటివి. ఇచ్చట యీ యుత్సవములకొరకు సమకూడు జనసమూహము యొక్క ముఖ్యోద్దేశము దుర్మార్గముకొరకును అల్లరి కొరకును యెంతమాత్రమునుగాదు. అట్టి యుద్దేశము వారికే కోశమునను లేదు. నేనిప్పు డిచ్చట చెప్పు ప్రతిమాటనుకూడ యీ రిపోర్టర్లు వ్రాసుకొనవలసినదని నా కోరిక. అచ్చటచ్చట, యెచ్చటనైనను, కొంతభాగమును వారు వ్రాసికొనలేక వదలివేసిన యెడల ఆరిపోర్టర్లు నావద్దకువచ్చినట్లయిన వారు వదలివేసిన ఆయా భాగములను నేనే పూర్తిచేసి యివ్వగలను. చట్టనిరాకరణము జేసి అల్లరిగ తిరుగబడుట కిది యింకను సమయముగాదు. చట్టసమ్మతమార్గముల నింకను మనము పూర్తిగ ప్రయత్నముచేసి యుండలేదు. (చట్టసమ్మతోపాయములనే, సామోపాయమునవే, మనమింకను పోరాడవలసియున్నది) కాని యిప్పుడు వచ్చిన కష్టమేమనగ, మనము చట్ట సమ్మతముగ బోవుచున్నను, అది చట్ట సమ్మతముకాదని వారు బాధించుచున్నారు. దీనికొక ఉదాహరణము జెప్పెదను. చట్టవిరుద్ధముగ లాలా లజపతిరాయిగారెప్పుడును ప్రవర్తించి యుండలేదు. అయినను అధికారవర్గమువారందరొక్కటిగజేరి, కుట్రజేసి, ఆయనకు ప్రవాసశిక్ష విధించిరి. ఆంగ్లేయ ప్రభుత్వోన్నత్యము నిర్మూలనమగుట తప్పదనియు, నీతిబాహ్యతయు, క్షీణదశయు ప్రభుత్వములో ప్రవేశించినవనియును సూచించుట కింతకంటె స్పష్టమైన కారణముల నేనూహింపజాలను. మార్లేమంత్రి గొప్ప పండితుడు; చాల చదువుకొనినవాడు; అంతవరకు నిశ్చయమే. కాని యిట్టి జ్ఞానపేటి, యిట్టి యాంగ్లేయపండితుని లౌకికజ్ఞానమే మాత్రమెరుంగని మన కాశీపండితులవంటి పరమఘాందనులకంటె యే మాత్రమును ఎక్కువవాడుకాడని చింతింపవలసి వచ్చుచున్నది. విద్యయెంత యెక్కువ యుండునో రాజనీతిజ్ఞత యంత తక్కువయుండుట జూడ భగవన్మాయగ తోచుచున్నది. మన విద్యావంతులందరును మిగుల బీదవారని మార్లేమంత్రి పరిహసించుచున్నాడు! తనగతి యింతకంటె యెక్కువగ యుండియుండనినాటిమాట పాపమతడు మరచెనాయేమి! పెద్ద యుద్యోగములు రావలెనని మనలో చదువుకొనినవారు కోరియుండవచ్చును. కాని యీ యాంగ్లేయ పండితుడు యీ మంత్రిత్వ పదవికై యాశించియుండలేదా? ఇంతకంటె తప్పగునా మన ముద్యోగములకై యాశించుట? భారతీయుల నందరను మార్లేగారు చిత్రముగ విభజించియున్నారు. గొప్ప స్వదేశాధిపతులను, సంస్థానాధిపతులను, తమ ప్రభుత్వపక్షమట! అయిన నయి యుండవచ్చును. దీనిలో

నాశ్చర్యమేమి ? ఎందుకనగ, యీ స్వదేశాధిపతులందరును ప్రభుత్వమువారి చేతులలోని తోలుబొమ్మలేగదా ! ఈ మహారాజుల యధికారమంతయు నాంగ్లేయప్రభుత్వమువారి నోటిగాలిమీద (దయమీద) నాధారపడియున్నది. బంగాళా పంజాబు దేశములలో నల్లరులుగ నున్నందున వైస్రాయిగారు "1907 సంవత్సరపు 1 వ ఆర్డినన్సు" అను ఉత్తరువును ప్రకటించిరి. ఈ యుత్తరువునకు కొల్హాపూరు మహారాజుగారు గురియైరి. ఈ మహారాజాగారి యంతెంతమాత్రమును తప్పలేకపోయినను, వీరి చట్టమునకు అవుసర మైనదేమైరి.

ఇక వర్తక సంఘమువారందరు మా పక్షమేయని మార్లేగారు చెప్పియున్నారు. "అందరు" అనుమాట సత్యముకాదు. ఇక వీరిలో ఇంగ్లీషు వర్తకవ్యాపారము చేయువారును, జీవితభోగేచ్ఛలకై ఆ ఇంగ్లీషు వర్తకముమీదనే యాధారపడువారును ధైర్యముతో ముందునకువచ్చి, గవర్నమెంటువారికి వ్యతిరేకముగ మాట్లాడజాలరుగద. చివరకు, అంత్యజాతివారును, కడుబీదలును, విద్యాగంధములేని రైతులు మొదలగు పాటకపు జనులుకూడ తమ పక్షముననే యున్నారని మార్లేగారు శలవిచ్చి యున్నారు. ఈ యభిప్రాయమునే మొన్న బొంబాయి చట్టనిర్మాణసభలో గౌ॥ లోగన్ గారు ప్రతిధ్వనించి యున్నారు. కాని యిది వట్టిమాయ. దుర్భ్రమ. ("నేలనడిమినాటి వెన్నెల") రైతుల స్నేహితుడనని ప్రగల్భముగ జెప్పుకొను నీయధికారికి, "యిది వట్టిమాటరయే" యని తిరిగి వాని ముఖముమీదనే చెప్పుటకు వీలులేదు. ఏలనగ, ప్రజలలో విద్యలేదు. ఎవడు తమకు స్నేహితుడో, ఎవడుకాడో, ప్రజలు తెలిసికొనజాలరు. అందువలన యీ మంత్రి చెప్పు దానిలోని నిజానిజములు బయల్పడుటలేదు. ప్రజలలో విద్యను బాగుగ వ్యాపింపజేసినయెడల యీయన చెప్పు అసత్యవాక్యములన్నియు బయల్పడగలవు. ఈ కారణముచేతనే (తమగుట్టు బయల్పడునను భయముచేతనే) ప్రజలలో విద్యను వ్యాపింపజేయు విషయమున వారు కడుజాగరూకులై యున్నారు. గవర్నమెంటువారితో నిలిచి పోరాడి, యాందోళన బుట్టింపగల జ్ఞానమును, ధైర్యమును, విద్యావంతులకు మాత్రమే గలవు. అందువలననే, స్వభావసిద్ధముగ, మార్లే వారిని శత్రువులనుగ నెంచుకొనుచున్నాడు. ఇట్టిదానికై విద్యావంతులు ధైర్యమును పిడవలసిన పనిలేదనియే గట్టిగ జెప్పుచున్నాను. నిజమే, విద్యావంతు లందరును బీదవారే. కాని దీనికి మారుగ వారిలో నొక గొప్ప విశేషమున్నది. వారికి విశేష జ్ఞానముకలదు. జ్ఞానముండిన నిక దరిద్రమెక్కడ ! జ్ఞానముండిన, యెట్టి ధనమునైనను సంపాదింపగల సామర్థ్య ముండును. గవర్నమెంటువారు తాము నమ్ముకొనియున్నవారితో నింకను మఱికొంతమందిని మన వైపునకు లాగికొనవచ్చును. ఏమియు చేతిలో చిల్లిగవ్వయైన లేక, కడుబీదలై బిచ్చమెత్తుకొనువారికి గలిగిన కష్టములవలన నాశనమైపోయిన సామ్రాజ్యము లనేకములు గలవని పూర్వచారిత్రములు చాటుచున్నవి. మనభారతవర్ష చరిత్రయందు

మధ్యమయుగమున నివసించినవారిలో, చాణుక్యునికంటె కడు దరిద్రుడైనవాడు లేడు. ఆయనకు తననెత్తిమీదనున్న జుట్టుతప్ప, యితర ప్రపంచసంబంధమేమియు లేదు. అప్పుడు రాజ్యమేలుచున్న, నందవంశపు రాజొక డాయనను, బుద్ధిపూర్వకముగ అవమానపరచెను. వెంటనే (ఆయన శాపమివ్వగా) ఆ రాజులు, వంశక్షయమై, నాశనమై పోయిరి. మన విద్యావంతులందరు కడు దరిద్రులనియు, వారి కేవిధమైన వానితోను జోక్యములేదనియు, * మార్లే మంత్రివంటివాడు, తానే ఆ విధముగ, వారికి గల పలుకుబడిని గూర్చి నిరసించి యుండకూడదు. మార్లేవంటి వాడే, ముందు వెనుక లాలోచింపక, సంకుచిత దృష్టితో, వ్యవహరించుచున్నట్లు స్పష్టముగ సూచనలు గన్పట్టుచున్నప్పుడిక నిశ్చయముగ, ఆంగ్లేయరాజ్యమునకు వినాశనకాలము ప్రాప్తమైనదని స్పష్టపడుచున్నది. ఈ సందర్భములో మార్లే మంత్రి మనకొక గొప్ప సహాయమును మాత్రము చేసెను. ఇదివరకు మనలో కొంతమందికి, మార్లేగారిని గూర్చి, (స్వాతంత్ర్యప్రియుడనే) మంచి యభిప్రాయ మొకటి వుండెడిది. అదంతయు వట్టి దుర్భ్రమయే యని మన కాతడే స్పష్టముగ నిరూపించినాడు. ఆ సీమదేశములో నెంత స్వాతంత్ర్య ప్రియుడైనను, యిచ్చట హిందూదేశ వ్యవహారము వచ్చినప్పుడు మాత్రము, (స్వాతంత్ర్య విరోధియైన) పూర్వాచార పరాయణుడే యగునని మనకు ఋజువుపరచినాడు. మనలో నాబోటి పెద్దపెద్ద ముదుసలు లందరును, యికమీద (మార్లే మంత్రిబోటి సీమలోని స్వాతంత్ర్య ప్రియు లందరును, భారతవర్ష స్వాతంత్ర్య ప్రియులే యగుదురను) దుర్వాదమును చేయజాలరు. అట్టి వాదమును మేము వదలుకొనినాము. యికముందు రాబోవు యువకులన్ననో, ఇట్టి దుర్భ్రమములో బడజాలరు. ఇది యెంతయు భారతవర్షమునకు శుభసూచకము. భారతీయులు, తమంతట తామే, తమశక్తికొలది, ధైర్యముతో పాటుబడి (యితరుల సహాయ మపేక్షింపక) నిలువబడుదురు గాక యని కోరుచున్నాను.

రాజ్యపరిపాలన యనగా — "పాలకులు, పాలితులను తమలో నేర్పాటు చేసికొన్న ఒక విధమైన సాంఘిక సంబంధమైన కంట్రాక్టు లేక ఒడంబడిక" యని (ఫ్రెంచి తత్వవేత్తయైన) రూసోగారు చెప్పియున్నారు. ఈ సిద్ధాంతమునుగూర్చియే మన 'పెరంజెపీ' గారును మరియొకరును కొంత చెప్పియున్నారు. మరియు 1858 సంవత్సరమున మన విక్టోరియా రాణీగారు చేసిన "ప్రకటన" కూడ యిట్టి కంట్రాక్టేయని "డామేలు" గారు వివరించియున్నారు. "కంట్రాక్టు" అనుపదము ♦ సమానస్థితిలో (హోదాలో)

* ఏలనన, మొదట తానును దరిద్రుడే, తానును చదువుకొని, ఆ చదువువలన పైకివచ్చినవాడే.

♦ క. సమశీల శ్రుతయుతులకు | సమధనవంతులకు సమసుచారిత్రులకున్ | దమలో సఖ్యము వివా | హమునగుఁ గాకగుణ రెండు నసమానులకున్ ॥ భారతం

లేని యుద్ధవిముక్త్య సెప్పాటును జరగజాలదని నామతము. కనుక 1858 సంవత్సరపు "ప్రకటన" కూడ కంట్రాక్టునకు సరఫి ప్రాయములో బడుట మన కెంతయును హానికరము. నిజమే, మనకు వారది ప్రమాణపూర్వకముగ దయచేసిన వాగ్దానమే. కాని యది అప్పటి అల్లరులను, తిరుగబాటులను, అణచుటకు గాను వారు రాజనీతి పూర్వకమైన దూరదృష్టితో మొదట గావించిన ప్రకటనయే గాని మరి యొండుకాదు. (మొదట దానిని ప్రకటించు యుద్దేశము కేవలము ప్రజల మనస్సులను శాంతిపరచి అల్లరులను అణచుటయే గాని వేరుకాదు.) రాజ్యాంగ తంత్రము యొక్క వివేకము దానితో పూర్తిగ గాన్పించుచున్నది. * అప్పటినట్టి కష్టసమయమున వారిచ్చిన యిట్టి వాగ్దానమును కార్యరూపమున అమలు జరిపింపవలయునను యత్నమే రాజకీయాందోళనకు ముఖ్యాధారమని ఆంగ్లేయ రాజనీతిశాస్త్రము మనకు బోధింపుచున్నది. (ఇట్టి వాగ్దానములను ఆధారము చేసికొనియే, మన హక్కులకొరకును స్వరాజ్యము కొరకును పోరాడవలయునట. ఇదియే, శాస్త్రసమ్మతాందోళనయట. ఇది కేవల మాంగ్లేయులు తమ దేశములో నవలంబించు రాజకీయాందోళనాపద్ధతి) కాని మన ప్రాచీనుల పద్ధతి వేరు. అయినను, రాజుయొక్క అధికారమును తగ్గించు కొరకై ప్రజలాందోళన చేయకూడదని మనలో నెవ్వరును లేరు. రాజు దైవాంశ సంభూతుడను మాట సత్యమే. దీని నాధారముగ చేసికొని కొందరు మూఢులు "మీరు స్వతంత్రయుతమైన ప్రజాప్రభుత్వసంఘములను కోరకూడ"దని వాదించుచు మనల నట్టి ప్రయత్నములనుండి విముఖులనుగ జేయ జూచుచున్నారు. ఎందరెన్నివిధముల వ్యాఖ్యానము చేసినను, మనము ముఖ్యముగ గమనింపవలసినది ఆమాటయొక్క నిజార్థ మెక్కడిదే (తక్కినవానితో పనిలేదు) దాని నన్వయింప వలసిన విధమున సరిగ నన్వయింప నందున యీ చిక్కులు వచ్చుచున్నవి. నిజమే, రాజు దేవాంశ సంభూతుడే; అట్లే వేదాంత సిద్ధాంతములను విచారించి చూచినయెడల ప్రతిమనుష్యుడును దేవాంశ సంభూతుడే. ఏలనన ప్రతిమనుష్యుడును ఆ పరమాత్మలో నుండి యూడిపడిన కణమేకద! పూర్వము మనువు మొదలగు ధర్మ

* పూర్వము సీమలో రాజునకు నిరంకుశప్రభుత్వ ముండెడిది. కాని క్రమ క్రమముగ రాజునకు నిరంకుశాధికారముపోయి, ప్రజలకే యధికారము వచ్చినది. ప్రజలు యీ యధికారమును రాజు దగ్గరనుండి ఎట్లు లాగికొనగలిగిరి? రాజునకు కష్టసమయము వచ్చి, చిక్కులలో పడిపోయి, అసహాయస్థితిలో నుండియున్నప్పుడు ప్రజలాతని యొద్దనుండి వ్రాతమూలకముగ కొన్ని వాగ్దానములను చేయించుకొనుచుండిరి. ఆసమయమునుబట్టి రాజు ఆవాగ్దానములను చేయక తప్పించుకొనుటకు వీలుండెడిది కాదు, గనుక చేసెడివాడు. పిమ్మట యీ వాగ్దానములను అమలులో పెట్టవలసినదని ప్రజలు రాజును బలవంతపెట్టుచు, ఆందోళన చేసెడివారు. యీ వాగ్దానముల నాధారము చేసికొనియే వారు తమ హక్కులకై యాందోళన చేసెడివారు. ఇది వారి రాజకీయాందోళనా పద్ధతి.

సూత్రముల ననుగ్రహించిన వారందరును "రాజు నిర్దోషి" యని కాని, "రాజు తన ప్రజలయెడ నెట్టి బాధ్యతాయుతమైన ధర్మముల నెరవేర్పవలసిన యవసరము లేద"ని కాని యెచ్చటను చెప్పి యుండలేదు. (రాజునకుకూడ నెరవేర్పవలసిన విధులు కొన్ని గలవు) అట్లు లేవని తలంచుట శుద్ధవెర్రి. అంతదూర మెందులకు, మనువు రాజుయొక్క విధులనుగూర్చి నీ విధముగ జెప్పియున్నాడు. "అదండ్యులను దండించినను, దండ్యులను దండింపక పోయినను, అట్టి రాజు నరకమునకు బోవున"ని మనువు విధించియున్నాడు. శ్లో॥ అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్య దండయన్ అయశో మహదాప్నోతి నరకంచైవగచ్ఛతి॥ మనువు ౮ వ అధ్యా. ౧౨౮ వ శ్లో॥ మరియు దీనిలో నొక చిత్రమున్నది. ఇట్టి నిబంధన రాజునకును ప్రజలకునుమధ్య తామేర్పాటుచేసికొనిన "కంట్రాక్టు" లోని షరతు కాదు. ఇది కేవలము ఋషీశ్వరులచేత నేర్పాటు గావింపబడిన విధియై యున్నది. ఋషులనగ నెట్టివారు? ప్రాపంచిక విషయములయందు వారికెట్టి విధమైన లోక్యమును లేదు. అందువలన ధర్మసూత్రముల నేర్పరచు పవిత్రకార్యము వారికే వదిలివేయబడెను. హిందువుల కసంఖ్యాకములగు దేవతల యందు భక్తి గలదు. తన ధర్మముల నెరవేర్పని రాజుగతి యేమగునో మనకందరకును తెలియును. రాజుకూడ ఒకవిధమగు దేవతయే యగును గాక. కాని రాజు ప్రజలతో కలహించిన యెడల ఆరాజునకంటె బలవంతుడైన మరియొక దేవత పుట్టునట. ప్రజలపక్షమే న్యాయమైన యెడల యీదేవత మొదటి దేవతను (అనగా రాజును) మింగివేయునట. రాముడును, పరశురాముడును భగవంతుని యవతారములే యని మనకు తెలియును. కాని పరశురామునియొక్క ఆ ౬ వ యవతారము ముగియు కాలమునకు ఆ తేజముతో కూడుకొనిన కీర్తిజ్వాల పరశురాముని ముఖగహ్వరమునుండి వెడలి రామునియందు ప్రవేశించెనని మన పురాణాదులలో వర్ణింపబడియున్నది. ఈ జ్వాల ఆయనలోనుండి వెడలిపోవగనే పరశురాము డేమాయెను? ఆయన కేవలము మనుష్యమాత్రుడే యయ్యెనుగద. మన ప్రాచీనుల యభిప్రాయము ననుసరించికూడ, రాజులోనుండు దైవాంశ "నిరాఘాటమైనద"నికాని, "కాలకర్మదోషము ననుసరించి మారిపోవునది కాదు" అని కాని ఎచ్చటను చెప్పబడియుండలేదు. రాజెట్టివాడైనను, వాని క్రూరప్రభుత్వమునకు తలయొగ్గి పడియుండవలసినదే యని ఎచ్చటను చెప్పియుండలేదు, అట్లెచ్చటనైన నున్నదని చూపింపగలవా రుండినయెడల వారు ముందుకువచ్చి నాతో వాదింపవలసినదని నే ఘంటాపథముగ తెలియజేయుచున్నాను. రాజెప్పుడు న్యాయపథమును వీడునో అప్పుడే వాడు "అసురుడు" అగుచున్నాడు. వెంటనే అట్టివాడు తొలగింపబడి తనలోని దేవాంశ చెడిపోవని క్రొత్తదేవత యాస్థానమున నెలకొల్పబడును. శివాజీ మహారాజునకు "నావిష్ణుః పృథివీపతిః" యను వాక్యము తెలుసునో తెలియదో మన మెరుగము. రాజనీతిశాస్త్ర విషయమై "హాబ్సు" "లాక్" మొదలగు పాశ్చాత్యుల యభిప్రాయములు శివాజీ

చవలెను. పరిపాలనా యంత్రమును సరళముగా నడిపించుటకు మీరందరు అవుసరము. మీరు చక్రముల యిరుసులమధ్యనుండు తారు ఆముదము మొదలగు జిడ్డుపదార్థములవంటివారని బాగుగ గ్రహించవలెను. (ఆముదములేనిదే చక్రము సరళముగ తిరుగజాలవుకద. మీ రట్టి ఆముదంటివారు.)

## మనము పరిపాలనాయంత్రమును సాగకుండ చేయగలము.

మన మెంత నీచముగ చూడబడుచున్నను, మనలను వారెంత త్రొక్కిపెట్టి యుంచినను, మనము చేయదలచుకొనిన యెడల పరిపాలనా యంత్రమును సాగకుండ (నొక్కక్షణములో) చేయగల శక్తి మనలో నున్నదను విషయమును మాత్రము మనము గుర్తెరుంగవలెను. రైళ్ళను టెల్లిగ్రాములను నడుపునది మనము. సెటిల్‌మెంటుల నేర్పాటుచేసి, శిస్తువసూలు చేయునది మనము. తక్కువస్థితిలో చిన్న యుద్యోగపదవుల యందుండినను ప్రతివిషయములోను పాలనా చక్రమును త్రిప్పునది మనమే. ఈ నీచస్థితియందు పడియుండి పనిచేయుటకంటె యీ మనశక్తినంతను మన స్వదేశ స్వజాతి మేలు కొరకె వినియోగించుకొనుట శ్రేయస్కరమగునో కాదో మీరే విచారించుకొనుడు. మీ స్థానములలో యూరోపియనులనే వచ్చి మన కిచ్చు యీ గొప్ప జీతముల మీదనే- నెలకు 10 రూపాయిల జీతముల మీదనే పనిచేయనీయుడు. మన యీ ప్రస్తుతావస్థ మన ఆత్మగౌరవమునకును స్వజాతి లాభమునకును ఏ మాత్రమైనను సహకారిగ నున్నదేమో మీరె బాగుగ యోచింపుడు. హిందూదేశస్థులందరును 30 కోట్లమంది యుండియు యిట్టికడునీచస్థితియందు నోరుమూసికొని యేమియు చేయలేక పడియున్నారని విదేశస్థులందరును బహిరంగముగ తమ యాశ్చర్యమును వెలిబుచ్చుచుండగ, మన మెట్టి యవమానమును భరించవలసి వచ్చుచున్నదో యోచింపుడు. యిట్లని చెప్పుట చట్టోద్దేశ్యముల నుల్లంఘించుట కాదు. నిజముగ యిది మన మెరిగినంతవరకు భగవన్నిర్మితమైన న్యాయవృత్తముల నుల్లంఘించుట కాజాలదు. అట్లు భగవన్నిర్మితమైన న్యాయవృత్తముల నుల్లంఘించునది మనముకాదు. సహేతుకమైన మన హిందూదేశస్థుల కోర్కెలకు వ్యతిరేకముగ మాట్లాడువారే యీ ధర్మముల నుల్లంఘించుచున్నారు కాని మన మెన్నటికిని యుల్లంఘించుటలేదు.

## లాలాలజపతిరాయిగారి ప్రవాసశిక్షయొక్క నిజోద్దేశ్యము

ఒక్కవిషయమై మాత్రము మనము గవర్నమెంటువారిని చూచి నేర్చుకొనవలెను. (ఒక ఉద్యోగస్థుడు పోవగనే, ఆ స్థానమున తిరిగి మరియొకనిని వెంటనే నియమింతురు) అట్లే మనమును మనలో మన కొరకై దేశసేవచేయుచు పాటుపడు వారొకరు పోయిన యెడల, వెంటనే ఆయనస్థానమున మరియొకరు వచ్చి నిలువబడి పనిచేయవలెను. (నిరంతర మిట్లెడతెగక పాటుబడు వారుండవలెను.) పెద్ద కలెక్టరు లేని సమయములో చిన్న కలెక్టరెట్లు ఆయన

స్థాపన భవి మాయనో, అట్లే మన ఒక్క లాలాలజపతిరాయి గారిని ప్రవాసశిక్ష కంపిన యెడల, వెంటనే ఆయనస్థానమున మరియొకరు వచ్చి ని పనిచేయవలెను. (ఇట్టి వారెందరు శిక్షకు లోనగు నట్లు చేసెదరుంపె సిద్ధముగ నుండవలెను) మన పితృసముల వలెన లాలాగారిని పనిచేయునని తలంచుట పొరపాటైనము. వాని యాజ్ఞవమును శిక్షలో నుంచరని మనము తెలియును (వారి శిక్షలో విడుదలచేయుదురు అయినను మన పితృసముల వలెన విడుదలరు తలంచుట వెర్రి) ఆయనవలెనేకనేకులు ప్రవర్తింపుచుండ ప్రజలలో భీతిగొల్పుటకు మాత్రము లాలాగారిని శిక్షించిరి కాని కేవలము వారు చేసిన దోషమునకై వారిని శిక్షించిరని తలంచకూడదు. మన నిష్కట్టువ పెరిగిన శిక్షింపగనే, మన ప్రయత్నములను మానుకొనిన యెడల ప్రజలు మనను మాచి భయపడిరనియు, తమ బెదరింపులే జయముగాంచిన వనియు ప్రభుత్వము వారనుకొందురు. ఇట్టి సమయములలో 'మేము మందరము రాజభక్తి పూరితులమై యున్నాము' పెద్దగా వ్రాసి కేకలువేసిన ప్రయోజనములేదు. అది క్రమమైన పద్ధతి కానేకాదు. అట్లు తమ రాజభక్తిని పెద్దగ ప్రకటించువారు రాజభక్తి పూరితులేయైన నయి యుందురు గాక. యిప్పుడిచ్చట కాని వారెవరు? (అందరికిని రాజభక్తి కలదు. దీనిలో లేని దెవరికి!) ఎవరికి నిజముగ రాజభక్తి కలదో ఎవరికి లేదో నిశ్చయముగ తెలిసికొనవలయునను విచారణకు ప్రభుత్వము వారు పెట్టుకొనవలయు కొనలేదు. మనబోటి వారు చేయు యాందోళనంతయు (అరాచక ప్రోత్సాహకరమనియు) యిది రాజభక్తి యుతముగాదనియు బుద్ధి పూర్వకముగ దుర్వర్థమును చేసి మన ప్రయత్నముల నణచవలయునని వారు జూచుచున్నారు. ఇక మేమందరము రాజభక్తులమని బిగ్గరగా కేకలు వేసియు, భేరీమృదంగాదులు మ్రోగించియు, పెద్ద పెద్ద అక్షరములు వ్రాసి వీధులవెంట గోడల కంటించియు, ప్రకటించువారి విషయము 'వీరి రాజభక్తి ఎట్టిదో నిజముకనుగొనవలయున'ను ఉద్దేశ్యముతోనే గవర్నమెంటువారు ప్రయత్నములు గావించుచున్నారు. (దీనివిషయమై ప్రభుత్వము వారు మిక్కిలి తెలివిగానే ప్రవర్తించుచున్నారు.) మాకు హక్కులు కావలయునని కోరుచు, శాస్త్రసమ్మతముగ చేయు మాయాందోళనలో అరాచకము లేదని మనము గట్టిగ చెప్పవలెను. మీరట్లు కోరుట అరాచకసూచకమనియు, మీరట్లు చేయకూడదనియు వారెంత బెదరించినను? మనము తిరిగి వానిని కోరుచుండుటకు తగిన ధైర్య సాహసములు మనలో నుండవలెను. మనకు కావలసినది ధైర్యసాహసములే మరియు నింకను కావలసిన దేమనగా మన ప్రజలకు త్రాగుటకు ము పొద్దులను గంజి నీళ్ళను, జనసామాన్యమునకును ఇతరజాతులకును గౌరవార్హమైన హక్కులును తప్పక కావలెను. ఇట్లు కోరుట రాజద్రోహము కాజాలదు. ఇది రాజద్రోహమని బుద్ధి పూర్వకముగ విపరీతార్థము చేసికొనుటకు కూడ అవకాశము లేదనియే నా నమ్మకము. మనకు కావలసిన హక్కులను అధికారములను ముందు స్పష్టముగ నేర్పాటుగావించుకొని, వాని

కొఱకై ఎడతెగక పోరాడుటకు సంసిద్ధులై యుండవలసిన సమయము నిశ్చయముగ ఆసన్నమైనది. నే నుచ్చరించు ప్రతివాక్యమును, నే త్రికరణశుద్ధిగా చెప్పు ప్రతియంశమును, మీ రందరు వ్రాసికొన వలయునని రిపోర్టరులతో తిరిగి చెప్పుచున్నాను. నేను చెప్పినదంతయు మీరు పూర్తిగ వ్రాసికొననియెడల నది మాకత్యంత ప్రీతికరములైన కార్యములకు సహకారిగా నుండునేకాని హాని చేయజాలదు.

"కించార్డు"గారు పీష్వాలనాటి చరిత్రముగూర్చి యిచ్చిన యుపన్యాసము మొత్తముమీద బాగుగనే యున్నది. అప్పటి మహారాష్ట్రచరిత్రను గూర్చి మొత్తముమీద ఆయన అభిప్రాయము సరియైనదిగనే యున్నది. అయినను ఒక్క విషయములో మాత్రము నేనాయనతో నేకీభవింపజాలను "కించార్డు" గారి యభిప్రాయ మేమన:—పీష్వాలు రాజకీయాధికారమును (ప్రభువునుండి) బలాత్కారముగ అపహరించినందువలన వారి ప్రభుత్వము అంత మొందుట కది కారణమాయెనట! కాని నాయభిప్రాయ మది కాదు. ఎప్పుడును ప్రకృతి స్వభావసిద్ధమేమనగ:—కేవలము ఒక్క కుటుంబములో గాని, ఒక్క వంశములోగాని, బాలాజీ విశ్వనాథుని వంశీయులవంటి శౌర్య ధైర్యాది సాహసగుణములు గల వీర పురుషులుగాని, రాజనీతి శాస్త్ర ధురంధరులుగాని వంశక్రమాగతముగ నెడతెగక నిరంతరము ఉద్భవింపజాలరు. (పీష్వాల ప్రభుత్వమంత మొందుటకు కారణ మిదియే గాని కించార్డుగారు చెప్పిన రాజకీయాధికారాపహరణము కాదు) ఈ విధముగనే, యింగ్లాండులోకూడ ప్రభుత్వాధికారము వంశపరంపరాగతమై యుండియుండినయెడల, వారి ప్రభుత్వముకూడ నిట్లే అంత మొందియుండెడిదే. కాని యచ్చటి రాజ్యాంగ నిర్మాణపద్ధతి వేరు - ప్రభుత్వాధికారము చెడిపోకుండుటకై కాపుదలగా సీమలో పార్లమెంటుసభ గలదు. ఆ దేశములో సామ్రాజ్యాధికారమునంతను ఒక్క చక్రవర్తియందే యుంచక దానిని పార్లమెంటు సభికులయందును, మంత్రివర్గమునందును క్రమముగ పంచిపెట్టిరి. (యీ పార్లమెంటుసభ ప్రభుత్వభవనమునకు మిక్కిలి యుపయుక్తమైన పోటీగానున్నది. యిది లేనియెడల ఆ భవనమెప్పుడో కూలిపోయెడిది) ఇప్పటికి, మన హిందూదేశస్థులము కూడ, అట్టికష్టము అనుభవించిన మీదట, ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వముల ప్రాముఖ్యమును ప్రయోజనమును గ్రహింపగలిగినారము. అందువలననే మన ప్రాచీనుల రాజ్యాంగ పద్ధతులనుండి విముఖులమై మనకిప్పుడు పాశ్చాత్య పద్ధతులే కావలయునని యింతగా మన మాశించుటకు కారణమైనది.

# 19. మింటోగారి "నిజమైనస్వదేశీ"

[లాలాలజపతిరాయిగారి అధ్యక్షతక్రింద ఆ 1906 సం|| డిశంబరు 23-వ తేదీని కలకత్తాలో నిచ్చిన యుపన్యాసము]

నేను పునహానుంచి దీర్ఘప్రయాణము చేసి యిచ్చటికి వచ్చిన యీనాడు మనసే యిట్టి సభలో నుపన్యసింపవలసి యుండునని తలచియుండలేదు. అయినను ప్రస్తుత సందర్భమునుబట్టి యిప్పు డిచ్చట మాట్లాడక తప్పినది కాదు. మొన్నటి దినమున యిచ్చట మింటోప్రభువుగారు "పారిశ్రామిక ప్రదర్శనము"ను ఉపక్రమించి యుండిరి. ఆసమయమున 'నిజమైన లేక నిష్పక్షమైన స్వదేశవస్తుప్రీతికిని రాజకీయ వాంఛలను యేవిధమైన సంబంధ ముండకూడదు" అని మింటోగారు తెలవిచ్చి యున్నారు. అనగా గత 18 మాసములనుంచి యీ 'స్వదేశీ' యాందోళనచేయు వారందరును, తమ మనస్సులలో నేవియో యుద్దేశ్యములను పెట్టుకొని బయటికి మాత్రము శ్రీరంగనీతులు ప్రకటించుచు, తమ నిజహృదయము నెరింగించుట లేదని అర్థమిచ్చుచున్నది. ఇది ఎంతమాత్రమును నిజస్థితి కాదని మనము ధృవపరుప గలము. ఈ స్వదేశీకొరకై పాటుపడువారందరును కుత్సిత స్వభావులని మింటోగారు తలంచిన యెడల, యీప్రదర్శనమును ఉపక్రమించుటకు సమ్మతించి తా నేల వారితో కలియవలెను! అదిగాక, మింటోప్రభువు నిష్కళంక హృదయుడే యైయుండి, యిక స్వదేశిని బోధించు మన బంగాళా నాయకులందరును కుత్సిత స్వభావులే యైయుండినయెడల "శాస్త్రోక్తము మీరు దయచేసి మా ప్రదర్శనమును ఉపక్రమింపు"డని మీ రేల మింటో ప్రభువుగారి వద్దకు వెళ్ళి అంత ఘనతగా ప్రార్థించి యుందురు! కనుక ఏవిధముగ చూచినను, మన నాయకులను మింటో ప్రభువుగారును ఏకీభవించి పనిచేయుట సంభవింపజాలదు. మనతో ఆయన కవుసరము లేనియెడల, మనము కూడ ఆయనతో నవుసరము లేకుండగనే జరుపుకొనగలము. కనుక తానా ప్రదర్శనమును ఉపక్రమించుట కంగీకరించుటయే గొప్పతప్పు. అట్లయిన, మనము చేయు ఆందోళన యంతయు కళంకపూరితమేనా? జర్మని, ఫ్రాన్సు, అమెరికా దేశములలో (యితరదేశములనుంచి) తమ దేశములోనికి దిగుమతియగు వస్తువు లన్నిటిమీదను పన్నులను వేసి బాల్యావస్థయందున్న తమ స్వదేశ పరిశ్రమలను ప్రభుత్వము వారు గాపాడు చుందురు. హిందూదేశస్థుల మేలుకొరకే మేమీ దేశమును పాలించుచున్నామని చెప్పుకొను మన ఆంగ్లేయ ప్రభుత్వము వారుకూడ యిట్టి పని నిదివరకే చేసియుండవలసినది. వారు తమ విధిని నెరవేర్చి యుండలేదు. కనుక గవర్నమెంటువా రిదివరకనేక సంవత్సరములక్రిందటనే నెరవేర్పవలసిన యీపనిని మన దేశస్థులే యిప్పుడు పూనుకొని చేయుచున్నారు. జర్మని చక్రవర్తినిగాని,

అమెరికా ఫ్రెంచిదేశాధ్యక్షులను గాని కుత్సితబుద్ధిగలవారని మన మింటో ప్రభువు అనగలడా? ఎన్నటికిని అనజాలడు. అట్లయిన, మననాయకులు మాత్రము కుత్సిత స్వభావము గలవారెట్లగుదురు? సర్కారువారిదివరకే చేసియుండవలసిన పనిని వారు బుద్ధిపూర్వకముగ వదలివేసియుండగా, అట్టిదానిని మన దేశస్థులే పూనుకొని చేయుచున్నందులకా మననాయకులను నిందించుట? తాను నిరంకుశ ప్రభుత్వాధికారపదవి యందుండుటను బట్టి ప్రజలమైన మనము చేయు ఆందోళన యందును, మన కోర్కెల యందును తనకు అభిమానము లేకపోయిన లేకపోవును గాక. సాధారణముగ తానభిమానమును జూపజాలడు. అట్లభిమానమును జూపలేక పోయినను, దీని విషయమై (తానేమియు మనకు వ్యతిరేకముగ మాట్లాడక) మౌనము వహించియుండిన బాగుండునుగదా. నేనాయనపదవి యందే యున్నట్లయిన నేనట్లు చేసెడివాడను. కాని మింటో ప్రభువు మనలను కుత్సిత స్వభావులని యేల పిలువవలెను. అట్లయిన తనకు (రాజనీతికాదని) మర్యాదకాదని చెప్పకతప్పదు. నా నోటికి యింతకంటె కఠినమైన మాటయే వచ్చుచున్నది. (అయినను నేనిది మర్యాదకాదని మాత్రము చెప్పుచున్నాను.) ఈ స్వదేశీయాందోళన కేవలము పరిశ్రమలకు సంబంధించినదట! అందువలన దీనికి రాజకీయ విషయములతో నేమియు జోక్యము లేదట! సర్కారు వారికి వర్తకముచేయుటయే పనికాదని మనకు తెలియును. వారు మొదట వర్తకవ్యాపారము మూలముననే ఈ దేశమునకు వచ్చి యిచ్చట ప్రభుత్వమును ప్రారంభించినప్పటికిని, ఇప్పుడట్లు చేయుటలేదు. మొదటవారు తమ ఇంగ్లీషు వర్తకమును (యితరుల పోటీలేకుండ చేసికొని) కాపాడుకొనలేదా? దానిని అభివృద్ధి చేసికొనుటకు కావలసిన శాసనముల నేర్పాటుచేసికొనలేదా? సర్కారు వారు తమ జాతివారి వర్తకమును అభివృద్ధిపరచు విషయమై జోక్యము కలుగజేసికొనకుండ మానివేసిన యెడల, నేము కూడ రాజకీయ విషయములలో జోక్యము కలుగజేసికొనకుండ మానివేయు విషయమై యాలోచించెదము. రాజ్యాంగవిషయములను, ఆంగ్లేయ వర్తకవ్యాపారవిషయములను, కలిపి మన హిందూదేశ ప్రభుత్వము వారు యేకముగ నెంతకాలము పాలించెదరో, అంతకాలము మేమును రాజకీయ విషయములను స్వదేశీ ఆందోళనను కలిపియే యుంచెదము. అంతవరకును యీ రెంటిని విడదీయుట అనర్థదాయకము నిజమునకు సమస్త రాజకీయవిషయములును, పారిశ్రామిక ఆర్థిక విషయములును-యివి అన్నియు ఒక 'స్వదేశీ' యను మాటలోనే యిమిడియున్నవి. 'స్వదేశీ' యనగా వీని కన్నిటికిని అర్థమిచ్చును. మనల నభివృద్ధి పరచి, మనలను ప్రపంచమున నాగరిక జాతిగా నిలువబెట్టునట్లు చేయగల సమస్తమైన సాధనములును 'స్వదేశీ' యను ఒక్క మాటలోనే యిమిడియున్నవి. కుత్సిత స్వభావులమని మనమీదకు తేబడిన యవమానకరమైన యీ నిందావాక్యమును మన మందరము గట్టిగ నిరాకరించి, యీ అపవాదమును మనలనుంచి తొలగించుకొనవలెను.

# 20. రాజకీయస్థితి (1906)

[ఆన 1906 సం॥ జూన్ 7-వ తేదీని కలకత్తాలో బాబు మోతీలాల్ ఘోష్‌గారి యాధిపత్యముక్రింద చెప్పిన ఉపన్యాసము]

సభాధ్యక్షా ! ఆర్యులారా !

నా యుద్దేశములను మీ మనస్సులకు చక్కగ నాటునట్లు బోధింపగల శక్తి నాకులేదు. నాకును నా స్నేహితులకును మీ రొసంగిన యీ యాతిథ్యమునకు మా యుభయుల పక్షమునను నేను మా కృతజ్ఞతను చెప్పుచున్నాను. మీ రీగౌరవమును ప్రత్యేకము నాకయియే యిచ్చియుండలేదు. నేను మహారాష్ట్ర జాతిపక్షమున ప్రతినిధిగా నిచ్చటికి వచ్చినందున మీరు నాకిట్టి యాతిథ్య మిచ్చిరని తలంచెదను. మీ రొక్క * ప్రస్తుత దుస్థితిలో మా మహారాష్ట్రులు మీ బంగాళీలను చేసిన సహాయమునకు, చూపిన సానుభూతికిని ప్రత్యుపకృతిగ మీరు తిరిగి మా యెడల జూపిన కృతజ్ఞతా పూర్వక గౌరవముగ నే దీని నెంచెదను. కాలములు మారినవని మన సభాధిపతిగారు తెలిపియున్నారు. ప్రస్తుత స్థితి ♦ అసాధారణమైనదనికూడ నే చెప్పుచున్నాను. హిందూదేశ మిప్పుడు పరాధీనమైన యున్నది. పూర్వ మొకప్పుడు మనదేశస్థులీమార్పునకు చాల సంతోషించిరి! అప్పుడు దేశములో అనేకమంది రాజులుండిరి. ఒకరికొకరికి సంబంధము లేకుండెను. (వీరిలో సంఘీభావము లేకుండెను) కనుక యీ మార్పునకు మన దేశస్థులు సంతోషించిరి. కనుక నే ఆంగ్లేయు లీ దేశమున రాజ్యమును స్థాపింపగలిగిరి. ఈ మార్పు తమ కెంతియు మేలని అప్పటి మనవారు చాల సంతసించిరి. మన స్వదేశరాజుల అరాచక పరిపాలనమును, యీ బ్రిటిష్‌వారి శాస్త్రసమ్మత (శాంతియుత) పరిపాలనమును, సహస్రాంతము భేదమువారికప్పుడు కనపించెను. మనవారప్పుడు ఆంగ్లేయ ప్రభుత్వము నెడ మిగుల ఆశతోనుండిరి. కాని రానురాను వారి యాశలన్నియు నిరాశలయ్యెను. ఆంగ్లేయపాలనక్రింద తమ వృత్తులు, కళలు, పరిశ్రమలు, అభివృద్ధి గాంచగలవను గొప్ప ఆశతో మన పూర్వు లెదురుజూచుచుండిరి. యీ క్రొత్త ప్రభువుల వలన తమ కనేక మేళ్లు కలుగగలవని వారెంచియుండిరి. తుదకీ యాశలన్నియు భంగమయ్యెను. ప్రభుత్వాధికారులతో మనము నిరంతరము పెనగులాడవలసిన గతి మనకు వచ్చెను.

మనలో (జాతిమతభేదములున్నందున) వారికంటె మన మెంతయో తక్కువ సాంఘిక స్థితిలో నున్నామట! గనుక మనముకూడ వారి స్థితికి వచ్చినప్పుడు మనకు హక్కులు స్వతంత్రములు రాగలవని మూడు సంవత్సరములక్రిందటి వరకును మనవారు తలంచుచుండిరి. ఇది సహేతుకవాదముకాదని, రానురాను, సంగతి సందర్భముల నెల్ల విచారించిన మీదట, తేలినది. మన మందరమును క్రమముగ విద్యావంతులమైన పిమ్మట ప్రభుత్వమువారే మనకు హక్కులను స్వాతంత్ర్యములను దయ

* బంగాళావిభజనము ♦ ఇట్టి స్థితి ఎప్పుడును సంభవముకాలేదు.

చేసెదరని 50 సంవత్సరములక్రిందట భారతవర్ష రాజకీయవేత్తయైన దాదాభాయి నౌరోజీగారు తలంచిరి. కాని ఆ తలంపులన్నియు వ్యర్థమాయెను. తిరిగి యిప్పుడు మనలో క్రమమైన విద్య లేనందున రాజ్యమేలుటకు మన మర్హులము కామని వారు చెప్పవచ్చును! అట్లయిన "క్రమమైన విద్యలేని లోప మెవరిది"ని నే నడుగుచున్నాను! ప్రజలకు విద్య గరపవలసినవారు ప్రభుత్వమువారు; కనుక విద్యలేని లోపములన్నియు ప్రభుత్వమువారివే గాని ప్రజలవి కాజాలవు. ఏవియో చిన్న చిన్న ఉద్యోగములకు పనికివచ్చునంతవరకు మాత్రమే ప్రజలకు విద్య నేర్పించుచున్నారు. దేశపాలనలో మిమ్ముల నెప్పుడో యొక దినమున పాల్గొన నిచ్చెదమని వా రనేక వాగ్దానముల జేసియుండిరి. ఇవి యన్నియు సత్యమునకు బహుదూరములాయెను. కర్జనుప్రభు నేమి చేసెను? దేశములో విద్య వ్యాపించుట ప్రభుత్వాధికారమునకు హానికరమని యాతడు గ్రహించెను. వెంటనే విద్యావిషయమై ప్రభుత్వాధికార మెక్కువ కఠినము జేసెను. "విశ్వవిద్యాలయ చట్టము" నొకదానిని కల్పించి, దేశమునందున్న పాఠశాల లన్నిటిని ప్రభుత్వమువారి యధీనముక్రిందికి లాగుకొనెను. ఇక ముందు చదువుకొనిన వారందరు గవర్నమెంటు (గుమస్తా) నౌకరీ చేసికొనియే బ్రతుకవలెను! మన మందర మిట్టి పద్ధతిని మార్చివేయవలెను. దీని కొరకే మనవారు మొదట బొంబాయి రాజధానిలో 'ఫర్గూసన్' కళాశాలను స్థాపించిరి. దీని కిదియే ప్రథమయత్నము. 1830—1834 సంవత్సరములలో గవర్నమెంటు పాఠశాల లన్నిటిని యీ ఫర్గూసన్ కళాశాల యధీనమునందుంచుటకు ప్రభుత్వమువా రంగీకరించిరి. కాని యిప్పుడన్ననో, ఆ కళాశాలయే కొంతవరకు గవర్నమెంటువారి యధీన మయ్యెను.

గవర్నమెంటువారు ప్రజల నిప్పుడు "న్యాయము"గను "సమర్థత"తోడను పాలించుచున్నారట! "న్యాయ" మనగ నర్థమేమి? పాలకులకును, ప్రజలకును మధ్య జరుగు వ్యవహారములలో న్యాయములేదు! కాని ప్రజలలో ఒకరి కొకరికి మధ్య న్యాయమును తీర్చి పాలించుచున్నారట! ఇక "సమర్థత"తో పాలించుచున్నారన నర్థ మేమి? ప్రజల అభివృద్ధి కొరకు కాదు! అధికారులు తమలో తాము మిక్కిలి తెలివి తేటలతో (తమ పనుల నెరవేర్చుటలో) సమర్థతతో పాలించుచున్నారు. (యీ రాజ్యపద్ధతి ప్రజల యభివృద్ధి క్షేమాత్రమును సహాయకారికాదు) వా రనేక వాగ్దానముల నిదివరలో గావించియుండిరి. ఇప్పుడు వాని నన్నిటిని నెరవేర్చుట అసంభవమట! కర్జనుప్రభువంటివాడే 1858వ సంవత్సరములో మన విక్టోరియా రాణిగారు ప్రకటన పూర్వకముగ చేసిన వాగ్దానముల నన్నిటిని నెరవేర్చుట అసంభవమని త్రోసివేసెను. యీ మాటలు చెప్పినది సాధారణ యింగ్లీషువాడుకాదు. కర్జనువంటి వైస్రాయిగారే శెలవిచ్చియున్నారు.

అధికారులందరిదివరలోనే యొకపద్ధతిని నిర్మించుకొని కూర్చున్నారు. వారు దానిని అతిక్రమించి పోకుండ నుండుటకై కృతనిశ్చయులయి యున్నారు.

పాలింపబడ కోరదని మనము వారికి (శ్రీమహారాజావారికి) జూపవలెను. యీ విషయమై ప్రభుత్వమువారి మనస్సునకు గాఢముగ నాటునట్లు చెప్పవలెను.

కాని మన మీ పనిని చేయగలమా? మనము ముందునకు సాగియైనను పోవలెను, లేదా మనపక్ష వాదమును కేవలము వదలియైనను వేయవలెను. పాలకుల దయాదాక్షిణ్యభావము మీద నాధారపడవద్దు. మార్లేమంత్రి బంగాళావిభజన విషయమై ఒకసారి చింతాదయను చూపెను. ఆతను ప్రజలయెడల చాల దయగలవాడట! కాని తాను బంగాళావిభజనమును మాత్రము రద్దుపరుపజాలడట! దేశములోని చట్టములలో కూడ గవర్నమెంటువారు రిష్టి చింతదయనే చూపిరి. ఎట్లనగ (శిక్షాస్మృతిలో) పీనల్‌కోడ్డులో కొన్ని నేరములకు కొరడాదెబ్బల శిక్ష విధింపబడియున్నది. దీనికి ప్రత్యేకమైన యింకొక చట్టమున్నది అట్లు దెబ్బలు తిన్న వానిని వెంటనే చికిత్సకొరకై ఆస్పత్రికి పంపుదురట! మీ కట్టి దయ కావలసి యున్నయెడల ఎంతయైన నిచ్చుటకు మార్లేమంత్రి సిద్ధముగనున్నాడు! వారు చెప్పు మెత్తనిమాటలను విని సంతృప్తిబొంది మీరు మీ కష్టములను మరచిపో యెంచినయెడల మనము కృతార్థులము కాజాలము (మన కార్యము సఫలత నొందజాలదు). మన కార్యము నెరవేరువరకు మనము నిరంతరము ఎడతెగక మొరపెట్టుకొనుచునే యుండవలెను కార్యసాఫల్యమగు వరకును మొరలిడుచు మొరలను పెట్టుకొనుచు, ఆందోళన సల్పుచునే యుండవలెను. ఈ బంగాళావిభజనను రద్దు చేయవలసినదను మొరయే, మన దేశోద్ధరణకు పునాదిరాయి. (మన దేశమును పైకి లేవదీయుటకు యీ మొరనే ఆధారము చేసికొనవలెను) యీ మొరను మీరు వదలిపెట్టవద్దు. ఈ విషయములో హిందూదేశమంతయు మీకు సహాయమై మీపక్షమున నున్నది. (మీకు బాసటయై నిలుచున్నది.) (మన జాతీయసౌధమున) కిదియే పునాదిరాయి (ఇదియే శంఖుస్థాపనము) ఈ శంఖుస్థాపన చేసిన మీ బంగాళీ దేశస్థు లెంతయు కృతార్థులు. మిమ్ములను చూచి దేశము గర్వపడవలసియున్నది. ఆ శంఖుస్థాపన చేయు భాగ్యము (మాకు లేకుండ) మీకే దక్కెను గదా యని నేను మిమ్ములను చూచి అసూయపడవలసి వచ్చుచున్నది.

దేశమంతయు నంధకార బంధురమై, దిక్కుమొక్కులేని దుర్దశలో నున్న తరుణమున శివాజీ యుద్భవించెను. అట్లే యీ తరుణమున కూడ నట్టి మహావీరుడీ బంగాళాదేశమున నుద్భవించగలడని నే విశ్వసించుచున్నాను. అట్టి నాయకు డుద్భవించి, కేవల మా మహారాష్ట్రవీరుడు చేసిన కార్యములనే గాక, ఆయన యుద్దేశ్యములనే, ఆయన ఉత్సాహశక్తులనే, అనుసరించునుగాక యని నే గోరుచున్నాను. దైవము మనలను జారవిడువలేదని మనము చేయు నీ యుత్సవమువలన బోధపడుచున్నది. తన స్వార్థత్యాగమువలనను, నిరుపమాన దేశభక్తివలనను, నిష్కామ క్రియలవలనను దేశము నుద్ధరింపగల మహావీరు నొక్కనిని మన కనుగ్రహించును గాకయని నే సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. మన మీ భరతభూమిమీద

జాతీయసౌధమును నిర్మింపవలెను. స్వజాతీయాభిమానమునందట మానవుని ప్రథమ విధి తరువాత మతాభిమానము రెండవది: పిమ్మట రాజకీయాభిమానము; కనుక స్వజాతీయాభిమానమే మనకు ప్రథమ కర్తవ్యము.

స్వదేశీ స్వదేశీ. యనియే నిరంతరము మనము స్మరించుచుండవలెను. ప్రభుత్వము వారేమి తలపెట్టుట తలంచినను మనము యీ స్మరణమూలమున అభివృద్ధి గాంచగలము. జాతీయవిద్యయును, స్వదేశోద్యమమును యీ రెండే మనకు ముఖ్యసాధనములు.

---

# 21. మన ప్రస్తుతస్థితి (1907)

(1907-వ సంవత్సరం జనవరి నెలలో ప్రయాగలో నిచ్చిన ఉపన్యాససారము.)

స్వదేశ పరిశ్రమలు జీవము దాల్చియుండుటకు తగిన సహాయ మేమియు చేయకపోవుట గవర్నమెంటువారు చేసిన మొదటి నేరము. అట్లు సహాయము చేయకపోగా, పారిశ్రామిక విద్యను నిరుత్సాహపరచి, వారు దేశములోని పరిశ్రమల నన్నిటిని చంపివేసిరి హిందూదేశపరిశ్రమలను యితరుల పోటీనుంచి రక్షించు నిమిత్తము విదేశవస్తువుల దిగుమతులమీద రక్షణ పన్నులను విధించి ప్రభుత్వమువారు మన పరిశ్రమలను భద్రపరచజాలకపోయిరి. స్వేచ్ఛావ్యాపారపు సూత్రము అను మన దేశమునకు కూడ వర్తింపజేసిరి దీనివలన మనకు గలుగు నష్టములకు మితిలేదు. యూరపు అమెరికాదేశములతో సమానా పోటీగా వ్యాపారముచేయ గలుగుటకు తగిన పారిశ్రామికవిద్యను గవర్నమెంటువారు దేశములో వ్యాపింపజేయలేదు పరిశ్రమల నేమాత్రమును ఉత్సాహపరచినవారు లేరు. దేశములో పరిశ్రమలకు తగిన ప్రోత్సాహము నిచ్చి, అవి నశింపకుండ కాపాడవలసిన విధి ప్రభుత్వమువారి మీద నున్నది. ఇట్టి విధిని ఇంగ్లాండులోని ప్రభుత్వమువారు గ్రహించి నెరవేర్చుచున్నారు. కాని మన హిందూదేశ ప్రభుత్వమువారు మాత్రము దానిని మొదటినుంచి నిరాకరించియే యున్నారు. దీనికి ఫలితముగ హిందూదేశ వృత్తులు, పరిశ్రమలును నశించినవి. తిరిగి వానిని ఉద్ధరించి, అవి నశింపకుండ కాపాడదలచుకొనినయెడల మనమే (ప్రజలమైన మనము) రక్షణ పన్నులను విధింపవలెను. మనకు సాధ్యమైన రక్షణపన్ను ఒక్కటియే గలదు. అదే [illegible], విదేశవస్తు బహిష్కారము (విదేశవస్తువులను వాడుకొనకుండుట). మన కిది యొకటియే మార్గము. ఇంగ్లీషువారి కీ దేశము కత్తిగట్టి జయించి రనియు.

ఆ కత్తితోడనే యీ దేశమును పోకుండ నేలుకొనుచున్నారనియు, ఇంగ్లీషు పత్రికలు ప్రకటించుచున్నవి. నిజమే, కత్తికట్టి జయించి యేలుకొనుచున్నారని నేను గూడ ఒప్పుకొనుచున్నాను. కనుక కత్తితో నేలుకొనుచున్న ప్రభువులు, ప్రజలు ప్రార్థించు ప్రార్థనలవలనను, ఉపన్యాసముల వలనను, కాగితములమీద వ్రాయు పిటీషనుల వలనను, తమ అధికారమును వదలుకొని ప్రజల కిచ్చివేయుదురా? సాధారణముగ నిచ్చివేయరు. దేశమును కత్తికట్టి జయించి అధికారమును సంపాదించుకొనిన విదేశస్థు లెచ్చటను, ప్రపంచములో నేదేశములోను, తమంతట తామే ఆ స్వదేశస్థులకు కొంచెముగనైనను పూర్ణముగనైనను స్వపరిపాలన నిచ్చినట్లు ప్రపంచ చరిత్రలలో నెచ్చటను గాన్పించుట లేదు. అట్లు చేయుట మానవస్వభావము కాదు. పాలకులు తమ మేలుకొరకే చూచుకొనెదరు. ప్రజల మేలు చూడరు. రాజకీయవిషయములలో 'భూతదయ'కు నిలువ తావులేదు— వారు దేశములో శాంతిని స్థాపించినారను సంగతి మాత్రము నిర్వివాదాంశము. కొంతవరకు మనకు స్వతంత్రమును కూడ నిచ్చిరి. మనకు కొన్నిలాభములు కలుగ జేసినారు. అయినను మనస్థితిని అభివృద్ధికరముగ జేసికొనవలెనను ఆశయుండుట మనకు సహజము. ఏ జాతియైన అభివృద్ధియైనను పొందవలెను. లేదా పూర్ణముగ నశించియైనను పోవలెను. ఒక్కస్థితిలోనే యెల్లకాలము నుండజాలదు. అభివృద్ధి నొందగోరుట మనకు స్వభావసిద్ధము. మనము కోరు కోర్కెల నన్నిటిని ప్రభుత్వమువా రెప్పుడైనను తమంతట తామే, దయచేసెదరా? (అట్లు చేయరని అర్థము) అడుగుటయు వారికి సహజమే. కావలెనని కోరుట మనకు సహజము. యివ్వకుండ నుండుట వారికి సహజము. రెండును స్వభావసిద్ధములే. కొంతమితము దాటి ప్రజ లభివృద్ధి పొందకుండ నుండచూచుట ప్రభుత్వము వారికోరిక. నిరాటంకముగ ఎక్కువకు సాగిపోవలెనని మన కోరిక. కనుక కేవలము పిటీషనులవలన మన కోర్కె నెరవేరజాలదు. ప్రజల నందరను (కొంతవరకే) సమానస్థితిలోనికి తీసికొని రావలెనని ప్రభుత్వమువారి నిశ్చితాభిప్రాయము. మాలమాదిగలు మొదలగు హీనజాతులవారిని పైకి తీసికొని రావలెనని వారు ప్రోత్సహించుచున్నారు. పైకి అనగా ఎంతవరకు? తక్కిన జాతులవారితో సమానముగ వచ్చువరకు మాత్రమే. అంతకు పైన ఎవరికిని అభివృద్ధిలేదు. అందరిని ఒక్కస్థితిలోనికి తీసికొని వచ్చి, అచ్చటనే నిలువబెట్టుట వారి యుద్దేశము. (అంతకు పైకి పోవుటకు ఎవరికిని వీలులేనట్లుగా వారు చేయ చూచుచున్నారు). గవర్నమెంటులో చిన్న చిన్న తక్కువ ఉద్యోగములకు పనికి వచ్చు నిమిత్తమే ప్రజల కందరకును గవర్నమెంటు పాఠశాలలలో విద్యగరపుచున్నారు. (యీ విద్య యీ చిన్న ఉద్యోగముల కొరకే ఉద్దేశింపబడినది). గవర్నమెంటువారికి గుమాస్తాలు కావలెను, లాయర్లు కావలెను, జడ్జీలు కావలెను, ఇంజనీయరులు, డాక్టరులు కావలెను. కనుక మనకు వచ్చు విద్య యింతటితోనే ఆగిపోవుచున్నది. అందువలన విద్య నంతను జాతీయ

విద్యగ మార్పుల అత్యవసరము? మనయొక్క గమ్యస్థానము స్వరాజ్యమని దాదాభాయి నౌరోజీగారే ప్రకటించియుండిరి. కొంతకాలమువరకు యింకను కుస్తీవాదముగనే గడుపవచ్చును. కాని తుదకు, మన దృష్టిపథమున నుంచుకొనవలసిన గమ్యస్థాన మదియే. గవర్నమెంటువారు కొన్ని మార్పులు చేసిన నేమి? ఎన్నిచట్టనిర్మాణసభల నభివృద్ధిచేసిన నేమి? యిదివరకు అరడజను ఆనరబుల్ మెంబర్లుండినట్లయిన, ఇప్పుడు డజను మెంబర్లుండవచ్చును. వారి యుపన్యాసముల నన్నిటిని చక్కగ గవర్నమెంటు గెజెటులలో అచ్చువేయించవచ్చును. ఇవన్నియు ఇప్పుడెంత నిరుపయోగములో అప్పటికిని అంతే నిరుపయోగములే యగును. అంత నిర్వీర్యములే యగును. తమ ఎగ్జిక్యూటివు కౌన్సిళ్లలో నేటివు మెంబర్లను నియమించుకొను అధికారవర్గమువా రిష్టపడరు. పార్లమెంటువారు గాని, మంత్రి గాని, వారి నేమియు చేయజాలరు. (జిల్లా కలెక్టరు పరీక్ష మొదలగు) సివిల్ సర్వీసు ఉద్యోగములకు సంబంధించిన పరీక్షలను ఇంగ్లాండులోబాటు మన హిందూదేశమునందు కూడ నేకకాలమున జరుపవలెనని పార్లమెంటులో కామన్సు సభవారు తీర్మానించి యుండిరి. అయినను, యిప్పటి అధికారులకు యిష్టము లేనందున ఆ స్వతంత్రతను యిచ్చుటకువారు హిందూదేశవాసులలో నమ్మకము పెట్టలేరు. హిందూదేశములో పరిపాలన నిరంకుశముగ నుండియే తీరవలెనని (స్వాతంత్ర్య ప్రియులనబడు) మార్లే మంత్రివంటివాడే చెప్పియున్నాడు. హిందూదేశ వ్యవహారము వచ్చినప్పుడు మాత్రము సీమలోని వారందరును (స్వాతంత్ర్య ప్రియులైనను, స్వాతంత్ర్య ప్రియులు కాని పూర్వాచారపరాయణు లైనను) ఒక్కటియే! మన ప్రజా యేర్పాటులు అభివృద్ధిపొందవలె నన్నను, మన ప్రజాభిప్రాయముచే బలయుతములై యధికారమునకు రావలె నన్నను, యీ చదువుకొనిన విద్యావంతు లందరును ప్రజలలో కలిసిమెలసి సంచరించుచు, వారికి యావత్ సంగతులను తెలియజెప్పి, వారితోబాటు పనిచేయుట అత్యావశ్యకము. స్వరాజ్యమన నేమియో ప్రజలకు బాగుగ తెలియును. కాని, 'స్వాతంత్ర్యము లేనిదే పన్నులను విధింపకూడ' దనియు, "ప్రజలు పరిపాలనలో నెక్కువ పాల్గొనవలె" ననియు, మనవారు చెప్పు యీ మాటలకు వారికి అర్థము తెలియును. తమ గ్రామములలో నిదివరకు పూర్వమునుంచి యున్న (సాలి నేత మొదలగు) చేతిపనులును, పరిశ్రమలును నశించిపోయిన సంగతి వారికి బాగుగ తెలియును. తిరిగి వీని నుద్ధరించి కాపాడుటకు తగిన యేర్పాటులను మనము గావించిన యెడల, గ్రామస్థు లందరును మనకు సహాయము చేసెదరు. అధికారమునంతయు వశపరచుకొని కూర్చునియున్న ప్రభుత్వము వారి దయకై నిరీక్షించినను, లేక సహేతుకముగ వాదించుచు పార్లమెంటువారికి మన మెన్ని పిటీషనులను పెట్టుకొనినను ఆవంతయును ప్రయోజనముండజాలదు. ఈ విషయమును మనము బాగుగ గ్రహించవలెను. యీ పనులవలన మనకు కావలసిన మోక్షము రానేరదు. 'మనలో పురుషప్రయత్నముండిన యెడల భగవంతుడు

కూడ మనకు సాయము చేయుదురని చెప్పబడియున్నది. (తమను తాము సహాయము చేసికొనిన వారికే భగవంతుడు కూడ సహాయము చేయునట) మనకు మనమే సహాయము చేసికొనవలెను, వారంతట వారు వచ్చి మనకు సహాయము చేయుటకు యీ బ్రిటిషు గవర్నమెంటువారు భగవంతునికంటెను ఎక్కువవారా యేమి ?

---

# 22. స్వదేశవస్తు ప్రోత్సాహము

[ఆన 1906వ సంవత్సరములో కలకత్తాలో సమావేశమైన జాతీయ మహాసభలో రాయబహద్దూరు పి. ఆనందాచార్యులు, సి. ఐ. ఇ. గారిచేత ప్రతిపాదింపబడిన స్వదేశవస్తు ప్రోత్సాహ తీర్మానమును గూర్చి తిలక్ మహాశయుడు ఈవిధముగ నుపన్యసించెను.]

సభాధ్యక్షా ! సోదరసోదరీ ప్రతినిధులారా ! ఆర్యులారా !

నేనిచ్చట స్వదేశోద్యమ తీర్మానమును గూర్చి ఉపన్యసించుటకీ సభా వేదికపై నిలుచుండలేదు. ఈ కలకత్తాలో స్వదేశీని గూర్చి మాట్లాడుట జాహ్నవి 'కమ్మరవీధిని సూదు లమ్ముట' యగును. దీనివిషయమై మీకు తెలియజెప్పుటకు గాని, తగినంత ప్రోత్సాహవాక్యములచేత యువకులను ప్రోత్సహించుటకు గాని అవసరము లేదు. నా స్నేహితులైన సురేంద్రనాథ బెనర్జిగారివంటి మీ నాయకు లందరు స్వదేశీ విషయమై మీకు కావలసినంత శిక్షణ యిచ్చియే యున్నారు. మీనాయకులను మించి నేనిన్ని సంవత్సరములు నేర్చుకొన్నను మీతో నేమి సరిపోలజాలను. (కాదు కాదు, అని కేకలు) ఈ తీర్మానములో మొదట కొన్ని ముఖ్యమైన విషయములు వదలివేయబడినవి. వానిని నేను సవరణ పూర్వకముగ సూచింపవలసివచ్చెను. నా సవరణల నందరును అంగీకరించిరని నేనిప్పుడిచ్చటనుండి చెప్పుచున్నాను. ఈ విధముగ నిప్పుడు ఆనందాచార్యులవారిచేత చదువబడిన తీర్మానము మనవారందరి యామోదమును బడయగలిగినది. మన మందరమిట్టి యేకాభిప్రాయమునకు రాగలిగినందులకు నే నెంతయు సంతసించుచున్నాను. ముఖ్యముగా నెందుకనగా మన ఆంగ్లోహైందవ స్నేహితులు యీ యిరువదిరెండవ సభతోడనే మన కాంగ్రెసుసభ మెజారిటీవచ్చిన కొద్దికాలములోనే యిది [illegible] బడునని వారు సెలవిచ్చియున్నారు! వారు చెప్పిన జోస్యము కేవలము అబద్ధమని యిప్పుడు తేలినది (వినండి వినండి) మిక్కిలి సమర్థుడును, నిష్పక్షపాతియు, న్యాయపక్షావలంబకుడును నై మన సభ [illegible] ధ్యక్షత వహించి మనకు నాయకుడై, పూజనీయుడైయున్న యీ దాదా

# 23. జాతీయవాదుల [అతివాదుల] సిద్ధాంతములు

(1907 సం॥ జనవరి 2-వ తేదీని కలకత్తాలో నిచ్చిన యుపన్యాసము)

"అతివాదులు" "మితవాదులు" అనియు నెంచబడు పదములు ఇప్పుడు క్రొత్తగా రాజకీయ రంగమున నేడు పొడసూపినవి. యీ పేర్లు అన్నియు తాత్కాలిక ముగ నుండునవే గాని వేరుగాదు, గనుక కాలానుసారముగ నివి మారిపోవు చుండును. ఈ దినమున అతివాదులుగా నెంచబడువారు రేపు మితవాదులుగా నెంచబడుదురు. అట్లే నిన్న అతివాదులుగానున్న వారే యీ దినమున మిత వాదులుగా నెంచబడుచున్నారు. మొదట 25 సంవత్సరముల క్రిందట కాంగ్రెసు పుట్టినప్పుడు, దాదాభాయి నౌరోజీగారు వెల్లడించిన యభిప్రాయములు బహు గాఢముగ నున్నవని ప్రజలు భయపడిరి. ఆయన ఆ కాలమందున అతివాదిగనే (విపరీత వాదిగనే) యెంచబడెను. కాని ఆ యభిప్రాయములే యీ దినములలో సాధారణ మైనవిగ నెంచబడుచున్నవి. ప్రజలాయన నిప్పుడు మితవాదియనియే చెప్పుకొను చున్నారు. కనుక అతివాదియను పదము అభివృద్ధిని సూచించును. మన మందర మును యిప్పుడు అతివాదులము. మన సంతతివారు మనలను మితవాదులని చెప్పు దురు. వారప్పుడు అతివాదులగుదురు. నూతనాభిప్రాయములను వెల్లడించువారిని మొదట విపరీతవాదులనియే ప్రజలెంచెదరు. పిమ్మట క్రమముగ, వారే మిత వాదులగుదురు. కార్యరూపమునకు దిగినప్పుడు రాజకీయ విషయములకు మితము గలదు. వేయిసంవత్సరములకుముందేమి జరుగబోవునో చెప్పజాలము. అప్పటికి యీ తెల్ల జాతులవారందరును (ఉత్తరధ్రువమున) మంచుతో ఘనీభవించుకు పోయిన శీతల ప్రదేశములోనికి ఊడ్చిపెట్టుకొని పోవుదురేమో ఎవరు జెప్పగలరు? కను వర్తమాన స్థితిగతులను బాగుగ గ్రహించి, మన ప్రస్తుతస్థితిని గూర్చి పని చేయుటకై కార్యక్రమమునకు గడంగవలెను.

నాకు దయచేసిన యీ కొద్దికాలములో మన కార్యక్రమమును గూర్చి వివరించి చెప్పజాలను. కాని ఒక్క సంగతి మాత్రము నే నిశ్చయముగ జెప్పగలను. ఈ ప్రభుత్వము మనకు పనికిరాదు. ఒక రాజ్యాంగవేత్త చెప్పినట్లుగా.—"ఒకదేశ స్థులు మరియొక దేశములోనికి వచ్చి పరిపాలించుట యెన్నటికిని జయప్రదము కానేరదు, గనుక శాశ్వతప్రదముకూడ కానేరదు. యిది యొక మూలసూత్రము. ఈ మూలసూత్రము విషయమై మన యీ క్రొత్తపద్ధతి వారికిని పూర్వ పద్ధతి వారికిని భేదాభిప్రాయములేదు. ఈ విదేశ పరిపాలనవచ్చి మన దేశమును పాడు చేసినమాట సత్యము. మొదట మన దేశస్థులు వీరిని జూచి ఆశ్చర్యపడినారు. మన కండ్లు మిరుమిట్లుగొనినవి. వారుచేసిన ప్రతిపనియు మన మేలు కొరకేయని యెంచి [illegible] తైమూరు చెంగిస్ఖాను మొదలగు ముసల్మాను సైన్యపు దాడులనుండి

మనలను రక్షించి, మన దేశములోని అంతఃకలహములను మాన్పి, అంతర్బహిర్దండయాత్రలనుండి మనలను సంరక్షించుటకై మేఘములోనుండి యీ ఇంగ్లీషు గవర్నమెంటువారు దిగివచ్చినారని కూడ మొదట మనవారు తలంచిరి. కొంతకాలమువరకు మన పని హాయిగ నుండెను. పిమ్మట నిట్లు స్థాపింపబడిన శాంతివలన నేమి ఫలితము కనిపించెను? దాదాభాయి నౌరోజీగారు చెప్పినట్లుగా:—మనలో మనము ఒకరినొకరు ఒకరు కోసికొనకుండ వారు కాపాడిరి. కాని దీని వలన మన అందరి గొంతుకాయలను విదేశస్థు లొకడువచ్చి కోయుటకు మంచి వీలు గలిగెను. ఈ బ్రిటిషు గవర్నమెంటు వచ్చినందువలన మన దేశములోని సమస్త సంపదలను విదేశస్థులు వచ్చి త్రవ్వితీసికొనిపోవుటకు మంచివీలు కలిగెను. బ్రిటిషు ప్రభుత్వముకలన మనకే లాభము గలిగెనదని యిప్పుడిప్పుడే మనవారు గ్రహించుచున్నారు! ఇదివరకే గ్రహింపగలిగియుండిన బాగుండెడిది! అట్లు గ్రహింపలేక పోవుట మన దురదృష్టమే. ప్రభుత్వమువారు మన యెడల దయార్ద్రబుద్ధితో నున్నారని మనము నమ్మితిమి. కాని రాజకీయవిషయములలో దయాదాక్షిణ్యములకు నెలవులేదు. స్వప్రయోజనమును కప్పిపుచ్చుటకై వారట్టి దయయను చక్కెర పూతను దాల్చిరి. యీ చక్కెరపూతచేత గప్పబడిన స్వప్రయోజనపూర్వక ప్రకటనలన్నియు వారు నిజముగ మన మేలుకొరకే చేయుచున్నారని నమ్మి ఆ దినములలో మనము మోసపోతిమి. అది అప్పటి మనస్థితి. కాని కొంతకాలమునకు మనలో మార్పుకలిగెను. ఇంగ్లీషు విద్యవలనను, దినదినాభివృద్ధి నొందుచున్న మన దారిద్ర్యదశవల్లను, మన పాలకులతోటి యెక్కువ సాంగత్యమువలనను, మనము కొంచముగ కన్నులు దెరచితిమి. మన నాయకులు, అందులో ముఖ్యముగ దాదాభాయి నౌరోజీగారు, ప్రతిసంవత్సరము మన దేశములోనుండి కోట్లకొలది ధనము నష్టమై పోవుచున్నదనియు, అదియే దేశానర్థమునకును దేశదారిద్ర్యమునకును మూలకారణమనియు మనకు తెలియజెప్పిరి. యీ విధముగనే ఇంకను నష్టమై పోవుచుండిన యెడల దేశమున కింకను దుర్భరమైన దురవస్థ తటస్థించు ననియును వారు తెలియబల్కిరి. దీనికిదియే మూలకారణమని వారు మనస్ఫూర్తిగ నమ్మిరి. వెంటనే ఆయన మనస్సునకు దిగులుబుట్టెను. మన దేశమున కిట్టి అన్యాయము జరుగుచున్నదని ఇంగ్లీషు ప్రజలకు తెలియజెప్పుటకై తక్షణ మాయన సీమదేశమునకుబోయి అచ్చట యిరువదియైదు సంవత్సరములు పాటుబడెను. ఆయన అచ్చట బహుకష్టపడి పనిచేసెను. అచ్చట ముఖ్యమంత్రులతోడను, పార్లమెంటు సభ్యులతోడను పోట్లాడెను. దీనికి ఫలితమేమి!

నౌరోజీగారు తిరిగి మనదేశమునకు తన 82 వ యేటవచ్చెను. వచ్చియేమి చెప్పెను? తాను చేసినదంతయు నిష్ప్రయోజనమై పోయెననియు తాను నిరుత్సాహి నైతి ననియు చెప్పెను. అయినను, తాను నిరుత్సాహి కాలేదని గోఖ్లేగారు మాత్రము చెప్పుచున్నారు. ఆయన వారి పరమ స్నేహితులు. అది ఆయన నిజమైన సత్యమై

యుండవచ్చును.

గోఖ్లేగారింకను నిరుత్సాహి కాలేదు. ఇంకొక 80 సంవత్సరములు గడచిననేగాని దాదాభాయినౌరోజీగారివలె గోఖ్లేగారు కూడ నిరుత్సాహి కాజాలరు. అంతవరకును నిరీక్షించిననేగాని వారికి నిరుత్సాహము గలుగదు.

ఆయన యింకను చిన్నవాడు. నాకంటెను కూడ చిన్నవాడు. (ఇంగ్లాండులోని మంత్రులను పార్లిమెంటు సభ్యులను) ఒక్కసారి దర్శించి ప్రసంగించినంత మాత్రముచేత నిరుత్సాహము కలుగనేరదని నాకు తెలియును. ఒక్క సంవత్సరము వారితో కలసి మెలసి తిరిగినంత మాత్రముచేతనే నిరుత్సాహము కలుగనేరదు. దాదాభాయి నౌరోజీగారివంటివాడే నిరాశ జెందినప్పుడు ఇంక 20 సంవత్సరముల కైనను, గోఖ్లేగారు నిరాశజెందరా? ఇంగ్లాండులో స్వాతంత్ర్య ప్రియులైన మంత్రులు (Liberals) అధికారమునకు రాబోవుచున్నారని (మన గోఖ్లేబోటివారు) ఉవ్విళ్లూరుచున్నారు! అయినను వారి యధికార మెంతకాలముండగలదు? *తిరిగి మరుసటి సంవత్సరమే వారు పదభ్రష్టత్వము నొందవచ్చును. మరల వారిపక్షము పైకి వచ్చువరకును, మనము (నోరు తెరచుకొని) నిరీక్షించుచుండవలసినదేనా? తిరిగి వారి చేయి క్రిందయిన యెడల మనముకూడ మరల మూడవసారి వారు అధికారమునకు వచ్చువరకును (గుడ్లు తెరచుకొని) చూచుచుండవలసినదేనా? అయినను, ఒకవేళ స్వాతంత్ర్యప్రియులే యధికారమునకు వచ్చినను వారు మాత్రము మన కేమి (యుపకారము) చేయగలరు? దీని విషయమై కాంగ్రెసు పితామహుడైన "ఏ ఒ హ్యూమ్" దొరగారు, 1893 సంవత్సరములో చెప్పిన మాటలను వినుడు. "స్వాతంత్ర్యప్రియు లధికారమునకు వచ్చినను, పూర్వాచారపరాయణు లధికారమునకు వచ్చినను, వారు మనస్ఫూర్తిగ మీ కావంతయైనను అనుగ్రహింపరని మీరు గట్టిగ నమ్ముడు" స్వాతంత్ర ప్రియుల ప్రభుత్వమన నేమి? తమదేశ పరిపాలనను, స్వాతంత్ర్యయుక్తమైన పద్ధతులమీద నడిపింపవలెనని వారి గట్టికోరిక. అందువలన ఆ మంత్రులందరును, వారిదేశములో స్వాతంత్ర మాత్రములనే యనుసరించి పాలించెదరు వారు ఇంగ్లాండులో నున్నంతవరకు స్వాతంత్ర్య

---

* ఇంగ్లాండులో మంత్రివర్గములో రెండుపక్షులు గలవు (1) స్వాతంత్ర్య ప్రియులు (2) పూర్వాచారపరాయణులు. ఈ మంత్రివర్గమువారు తరుచుగ మారి పోవుచుందురు. రాజ్యములో తమపక్షము నెగ్గినయెడల తమ పదవులకు వారు వెంటనే రాజీనామాయిచ్చి తొలగిపోయెదరు. ఇది యచ్చటి చిత్రమైన రాజ్యాంగ పద్ధతి. ఒకప్పుడొక పక్షమువారును మరొకప్పుడు రెండవపక్షమువారును పైచేయి గానుందురు. స్వాతంత్రప్రియులు అధికారమునకువచ్చిన యెడల మన భారతదేశమున కేదియో మేలు కలుగగలదని గోఖ్లేబోటివారు తలంచిరి. అది వట్టి దుర్భ్రమయని తేలినది. ఎవరు మంత్రిత్వపదవికి వచ్చినను మన దేశమునకు పూర్ణానుస్వారమే.

పిప్రియులు. కాని మన దేశమునకువచ్చిన తోడనే పూర్వాచార పరాయణుల మార్గములనే వర్తింపుదురు. క్రొత్తగా యింగ్లాండు పాఠశాలలలో పరీక్షల నిచ్చి యిచ్చటికివచ్చిన క్రొత్త యూరోపియనులందరును మొదట స్వాతంత్ర్యప్రియులే. కాని యిచ్చట నున్న ఆంగ్లో హైందవులతో సంపర్కము కలుగగనే, ఆంగ్లో హైందవ స్త్రీలను పెండ్లిచేసికొనగనే వారి యభిప్రాయములు మారిపోవును. హిందూదేశమును వదిలి వెళ్ళు సమయమునకు వారు పూర్వాచారపరాయణులే యగుదురు. దేశమందంతటను ఇదియే పద్ధతి. కనుక స్వాతంత్ర్య ప్రియులైన నేమి ! పూర్వాచార పరాయణులైన నేమి ! మనము కోరు హక్కుల నెవరైన అనుగ్రహించుటకు సిద్ధముగానున్నారా ! తమకు లోబడియున్న దేశమునకు కాలానుసారముగ నిట్టి హక్కుల నీయవచ్చునని తత్త్వశాస్త్రజ్ఞులును, వేదాంతులును ఒప్పుకొందురు గాక ! అయినను వాని నిచ్చువా రెవరు ? యీ తత్త్వశాస్త్రజ్ఞులు కేవలము మేధాదృష్టిని వీక్షించి చెప్పుమాటలను కార్యరూపమున నడపున దెవరు ? వేదాంతులు అనేక సిద్ధాంతములను చెప్పవచ్చును. రాజకీయవేత్త లనేక సూత్రములను చాటింపవచ్చును ! (వట్టి మాటల నెన్నిటినైన చెప్పవచ్చును) కాని వానిని కార్యరూపమున అమలు జరుపవలసినదని వారి నెవరును నిర్బంధింప జాలరు కదా. మార్లేగారిని మనకు మంత్రిగా నియమించుట మన భారతీయుల యదృష్టమే నట ! అందులకై మన భాగ్యమును కొనియాడుకొనుచు, భారతీయుల నందఱ నభినందించుటకు మొన్న కలకత్తాలో మనవారొక సభజేసిరి. ఆ సభనుగూర్చి చదివినప్పుడు నాకు పక్కున నవ్వువచ్చెను. యిదివరకు మార్లేగారు వ్రాసిన గ్రంథములలోనుండి కొన్ని భాగముల నెత్తి ఆ కలకత్తా సభలో నందఱికిని చదివి వినిపించిరి. "ఆయనగారు వ్రాసిన గ్లాడ్‌స్టన్ జీవితచరిత్రయను గ్రంథములో యీ విధముగా చెప్పియున్నాడు; అప్పుడు యీ విధముగ చెప్పియున్నాడు; యిప్పుడు యీ విధముగ చెప్పియున్నాడు; ఆయన ఒకప్పుడు 30 సంవత్సరముల క్రిందట పత్రికాధిపతిగా నున్నప్పుడీ విధముగ వ్రాసియున్నాడు" అని ఆ పాత పత్రికలలోనుండి ఆయన పూర్వ మెప్పుడో వ్రాసిన యంశముల నెత్తి ఆ సభలో బిగ్గరగా చదివి వినిపించిరి. ఆయన పూర్వ మెప్పుడో వ్రాసిన సంగతుల నన్నిటిని చదివి వినిపించుటకంటె మన భగవద్గీతలలో నుంచి కొన్ని శ్లోకములు చదివి వినిపించిన బాగుండెడిది గదాయని నేనప్పుడు తలంచితిని. ఇప్పుడా సభగావించిన వారందరును పెద్ద మనుష్యులే, వారియెడ నాకు విశేష గౌరవము గలదు. కాని వారు మన ప్రస్తుత స్థితిగతులను బాగుగ గ్రహించియుండ లేదని మాత్రము చెప్పక తప్పదు. వేదాంతము జెప్పు వేదాంతికిని, రాజ్యతంత్రము నడుపు రాజకీయవేత్తకును గల భేదమును వారు కేవలము మరచిపోయిరి. (దానిని గూర్చి వారు విచారింపనే లేదు) రాజకీయవేత్త యెప్పుడును వర్తమాన స్థితిగతులను గూర్చి బాగుగ విచారించి, పిమ్మట పనిచేయవలసియుండును. ఏయే మార్పులు ప్రస్తుతకాలమునకు

తప్పక అవసరములో, యేది శాస్త్రోక్తముగ తప్పో, యేదియొప్పో, వీని నన్నిటిని బాగుగ విచారించి పనిచేయుటకు మంత్రి బద్ధుడైయుండవలెను. ఏదైన నొక విషయమును నిర్ధారణపరుపవలసి వచ్చినప్పుడు, ఉభయపక్షముల వాదములను బాగుగ విచారింపవలెను. ఆయన మనపక్షపు వాదము నొక దానిని మాత్రమే విని పనిచేయజాలడు గదా. మనకు ప్రతికక్షిగా నెక్కువబాధ్యతగల ఆంగ్లో హైందవులున్నారు. ఈ మంత్రి ఆంగ్లేయాధికారులందరిలోను ప్రధానుడు. కనుక యీతడు వారి పక్షమునసే మాట్లాడవలసినవాడు. యిట్టిస్థితిలో అధికారవర్గము వారును, ఆంగ్లో హైందవులిదరును, ఏకగ్రీవముగ మనకుప్రతికూలురై యున్న యీతరుణములో వారినందరిని నిరాకరించి మనము కోరుహక్కులను యీ మంత్రి మనకీయ్యగలడని యీ మనవారియూహ? అట్లిచ్చుటకీ మంత్రికిశక్తికలదా ఇది ఆయనకు సాధ్యమగునా? అట్లిచ్చినయెడల శేపే యీయనను బయటికి నడువవలసినదని వెడలగొట్టరా? కనుక మన మేమిచేయవలెను? ఇంగ్లాండులో మంత్రిని ఎన్నుకొను అధికారముగల యింగ్లీషు ప్రజల నందఱను మన వైపునకు త్రిప్పుకొనవలెను; ఇంగ్లాండులో పార్లమెంటు మెంబర్ల నెన్నుకొనుటకు వోటు గల ప్రతివానిని మనము మన వైపునకు త్రిప్పుకొనవలెను; తుదకు మెజారిటీ సైనను మనవైపునకు లాగికొనవలెను గదా; పిమ్మట స్వాతంత్ర్యప్రియులనే యధికార పదవులయందు నిలుపునట్లుగ యీ మెజారిటీ వోటర్లచేత చేయించవలెను; వారందరును మన దేశమునకు మేలు చేయుదమని కృతనిశ్చయులై యుండవలెను. ఈ (హిరణ్యాక్ష) వరములన్నియు వచ్చిన పిమ్మట మార్లేవంటి మంత్రిని మనభరతవర్షమునకు నియమించిన యెడల లాభమేమైన యుండునేమో. కాని యిప్పుడు నియమించి నందువల్ల లాభము లేదు. మనము దీనిని గ్రహించినాము. ఉపన్యాసముల ద్వారా ఇంగ్లాండులోని నియోజకవర్గముల వారి నందరిని మనపక్షమునకు త్రిప్పుకొనవలెను. కాని వారికి డబ్బు నష్టము కలుగుమాటలను చెప్పిన యెడల ప్రయోజనములేదు! (వారి డబ్బు సంచికి అంటకుండ మాటలు చెప్పవలెను. తనకు మాలిన ధర్మము నెవ్వడును చేయడు) వేదాంతోపన్యాసము విని, తన ధనమునంతను నష్టపరచుకొను నంతటి మూఢుడెవడుండడు.

"నీ యుపన్యాసము బాగుగనే యున్నది. కాని సాధనమును నేను నష్టపరుచుకొందునా" యని వా డనునుగదా. నే నొక చిన్న కథను చెప్పెదను. భారతీయులు పడుకష్టములను గూర్చి నా స్నేహితు లొకరు ఇంగ్లాండులో నొక దినమున నుపన్యసించుచుండెను. ఆ సమయమున సభలో నుండి యొకడు లేచి మీభారతీయు లందరెంతమంది ప్రజలు కలరని ప్రశ్నించెను. ముప్పది కోట్లమంది యున్నారని యాయన బదులు చెప్పెను. అట్లయిన, మీ కేమియు నీయకూడదని అతడు చెప్పిపోయెను. ప్రతి ఇంగ్లీషు కూలివానికిని మనలను గూర్చి యిదియే

యభిప్రాయము. ఇంగ్లాండులోని * "కూలీ కక్ష" యను పక్షమువారు మనకేదో యుపకారము చేయగలరని మనవారు నమ్ముచున్నారు. కాని వారికిని మనవలె అనేక కష్టములున్నవి. తక్కినవారికంటె వారు మనకెక్కువ మేలేమియు చేయజాలరు. అదిగాక, ఇతరులకంటె వారే మనల నెక్కువగ నిరసించెదరు. ఎందుకనగా, ఇంగ్లీషు కూలీలందరును మనభారతవర్షమునకు సరకుల నెగుమతి చేయుట మూలముననే బ్రతుకుచున్నారు. వారికిదియే జీవనాధారము, నిజస్థితియిది. దీనిని మనము క్రమక్రమముగ గ్రహించినాము. ఇంగ్లాండునకు పోయి దీని విషయమై శ్రమజేసిన లాలా లజపతిరాయిగారి బోటివారందరును నిరాశ జెంది యుండగా వారితో వెళ్ళిన గోఖ్లేగారిబోటి యువకులు మాత్రము నిరాశ జెందలేదట! ఇచ్చట చెప్ప తగవలసి వచ్చుచున్నది. ఇప్పుడు చెప్పచెప్పనియోపల యీ విషయములన్నియు మీకు తేటతెల్లముగ వివరించి చెప్పుటకు వీలుకాదు. కనుక నేనట్లు చేసిచెప్పవలసి వచ్చుచున్నది. అయినను, మీరందరును నాస్నేహితులే; గనుక భయములేదు. ఇప్పటి స్థితియిది-మన ప్రతిపక్షులు అవలంబించు పద్ధతి కేవలము నిష్ప్రయోజనమని మనము గ్రహించినాము. మొదట ఇంగ్లాండులోని నియోజక వర్గమువారందరిని మనపక్షమునకు త్రిప్పుకొని వారిద్వారా పార్లమెంటు మెంబర్లకు వత్తిడి కలుగజేసి, పిమ్మట పార్లమెంటువారిచే భారతవర్షమున కనుకూలురైన మంత్రివర్గమువారిని నియోగింపజేసి, తరువాత అందరు కలిసి, ఇచ్చట మన దేశములో పాలించుచున్న అధికారవర్గమువారికి వత్తిడి కలుగజేసి, తద్వారా వారు మనకోరికలను ప్రసాదించునట్లు చేయించుకొనవలెనట! ఇది యంతయును కేవలము దుస్సాధ్యము; ఇది యెప్పటికిని కొనసాగనేరదు. మనకును మన ప్రతిపక్షులకును వున్న భేద మిచ్చటనే యున్నది. ఇచ్చటి అధికారవర్గమువారితో నెంత మొరపెట్టుకొనినను నిష్ప్రయోజనము; ఈ విషయమై మన ముభయులము ఒప్పుకొనియే యున్నాము. ఇక ఇంగ్లండులోని ప్రజలతో బోయి మొరపెట్టుకొనిన లాభము కలుగగలదని మనవారి నమ్మకము; కాని మనకా నమ్మకములేదు మా స్థితి యీ విధముగ నున్నది. కనుక మనము వేరొకమార్గము ననుసరింపవలెనని తేలుచున్నది, దీనికి వేరొక మార్గముకలదు మన మూరక కూర్చొనబోవుటలేదు. మన కోర్కెలు సిద్ధించుటకు మనము వేరొకమార్గము నవలంబింపవలసి యున్నది, మనము కేవలము నిరాశ జెందలేదు. మన మే విషయమునను నిరాశజెందువారము కాము. మనము ఏడ్పుగొట్టువారము గాము. మన మెట్లయినను, కష్టపడిపనిచేసి, మన కోర్కెలను

* ఇంగ్లాండులో నిదియొక రాజ్యాంగకక్ష. వీరు యంత్రశాలలలో పనిచేయు కూలీల పక్షమువారు. వీరి పక్షమున కొందరు గొప్ప మంత్రులుకూడ ప్రభుత్వ స్థానముల గలరు. ఇది క్రమముగ బలయుత మగుచున్నది. యీ పక్షమువారితో మనము పోయి మొరపెట్టుకొనిన మన దేశస్థులకు వారేమో మేలు చేయుదు రని యాశపడి కొందరు మనవా రచ్చటికి వెళ్ళి వారికి ఉపన్యాసము లిచ్చుచున్నారు.

సఫలత నొందింప జేసికొనవలె నను తలంపుతోడనే మన మీ నూతన పద్ధతిని కల్పించినాము. ప్రభుత్వమువారు తమ ఏలుబడిలోని ప్రజలకు హక్కులను ప్రసాదించినంత మాత్రముచేత నాశనమైపోయిన సామ్రాజ్యము లెచ్చటను ఇదివరకు ప్రపంచములో లేవు. ఇట్టివి గలవని ఏ దేశచరిత్రలోను వ్రాసియుండలేదు. సామ్రాట్టులు నిరంతరము మితిలేని (భోగపాన ద్యూతక్రియా) లోలురగుటచేతను, అమితముగ అధికార గర్వపూరితులగుటచేతను, నిర్లక్ష్యభావముతో ప్రమత్తులై వర్తించుటచేతను, మరి యితర కారణములచేతను, సామ్రాజ్యములు నాశనమై పోయినవి గాని, పాలకులు తమపాలితులకు హక్కుల ప్రసాదించినంత మాత్రము చేత యే సామ్రాజ్యమును నాశనము కాలేదు.

మనకు రాణీగారి 1858 సం॥ ప్రకటన గలదు. కాంగ్రెసుసభ (పుట్టక పూర్వమే), కాంగ్రెసు వారు కోరకుండనే, యీ ప్రకటనలోని హక్కులను మనకిచ్చెదమని ప్రభుత్వము వారు ప్రకటించిరి. ప్రజలలో అణచుటకు వీలులేనంత యల్లరి తిరుగబాట్లు గలిగినందున, మాల నందరను శాంతిపరచుటకై యీ ప్రకటనను వా రప్పుడు గావించిరి. మన మెవ్వరమును అడుగకుండనే, కాంగ్రెసుసభ లేకుండనే శాస్త్రసమ్మతాందోళన లేకుండనే వారు మనకీ ప్రకటనను ప్రసాదించిరి. వారా ప్రకటనను మనయందు గల దయతోడనే, ఉదారభావముతోడనే ప్రకటించిరి. యిది ఎంతయో మంచిప్రకటన. మనప్రజల కందరికిని మనస్సులలో ఆశలను పుట్టించి, మనలను శాంతి పరచు చక్కని (తేనెలొలుకు) మాటలతో నీ ప్రకటన గావింపవలసినదని మన విక్టోరియా రాణీగారు (తన మంత్రులను ఎంతయో తొందర జేసెనట. ఆమెకు గలిగిన యీ తొందరంతయును మనము శాస్త్ర సమ్మతముగ గావించిన సక్రమాందోళన మూలమునగలిగినదా ? కాదు. 1858 సం॥నకు యింటివలనే యీశాస్త్రసమ్మతాందోళన యనునది బయలుదేరెను. దీనికిఫలిత మేమి ? ఆ సమయమునవారు గావించిన ప్రకటన అట్లే (కాగితముమీదనే) నిలిచిపోయెను. ఎందు కనగా, అప్పటి స్థితిగతులు పిమ్మట మారిపోయినవి. (దేశములో శాంతి యేర్పడెను. అవసరసమయము దాటిపోయెను) ఆ ప్రకటలోని యంశములను అమలులో పెట్టితీరవలెనని మనము వారిని నిర్బంధించలేక పోతిమి వారొరిక వాగ్దానము మాత్రము జేసిరి. ఆ సమయము గడిచిన తరువాత, దానిలోని షరతులను అమలులో పెట్టవలసినదని వారిని నిర్బంధించగలబలము ధైర్యసాహసములు మనలో లేక పోయెను! దాగిని మన మమలుజరిపించుకొనలేక పోతిమి. ఇప్పుడది అమలులో లేక పోవుట కిదియే కారణము. అధికారవర్గమువారి చేయి మీదయ్యెను. ఈ ప్రకటన లోని యంశములను అమలు జరుపుటకు సాధ్యము గాకుండునట్లుగ అధికారవర్గము వారు వేరొక పరిపాలనాపద్ధతిని ప్రారంభించిరి. కర్జనుప్రభువు యీప్రకటనను జూచి ఫూఫూ యని నిరసనభావముతో (చప్పరించెను). ఇది పార్లమెంటువారి చేత నామోదింపబడలేదు. గనుక యిదిశాస్త్రసమ్మతమైన ప్రకటన గాదని మరియొక

లాయను దీనిని త్రోసివేసెను. ఆయనపేరు సర్ జేమ్సుస్టీఫెన్" * 'ఇల్‌బర్టు బిల్లు' చర్చలో న్యాయసమయమున, నిత డీమాటలను చెప్పెను. ఏహోవిధమునదీని కర్థమును లాగి యీ ప్రకటనను కూడ త్రోసివేయవలెనని వాదించుచున్నారు; యీ వాగ్దానమును చెల్లించుటకు మార్లేమంత్రి సంసిద్ధులైయున్నారా? ఆ వాగ్దానమును చెల్లించవలసినంతి అవసర మిప్పుడు మార్లేగారి కేమిగలదు? ఇప్పుడు ఆయనను వచ్చిన నిర్బంధ మేమి? ప్రస్తుతాంశ మిది. మన మడిగియే తీరవలెనని నేనును ఒప్పుకొనుచున్నాను. కాని మనమడిగిన దానిని వారు నిరాకరించినను ధైర్యముండినట్లయినను మన మడుగవలెను గాని (పట్టిణాలతో ప్రయోజనములేదు) అడిగినదానిలోను పిటీషను పెట్టుకొన్నదానిలోను భేదముగలదు "స్వామికిస్తు బిల్లు, పెరెన్సి బిల్లు" మొదలైనవానినిగూర్చి విచారింపుడు. మనకు కష్టముగలిగినప్పుడెంతయు మన మండలములు సభలుజేసి, పిటీషనులను పెట్టుకొని, తగినవారి ద్వారా చెప్పించి పత్రికలలో వ్రాసి యీవిధముగ మనమాందోళన చేయుచుంటిమి. మన మనవులకు వారేదో ప్రత్యుత్తరము చెప్పగనే, మనమందరమును, "విన్నన్న చెప్పినది వేదముగ" శిరసా వహించి, నోరుమూసుకొని కూర్చుచున్నాము యిన్నిసంవత్సరములనుంచి గవర్నమెంటువారిపద్ధతి యిట్లున్నది యీయనుభవమునే (దేశములో నీవిధముగ ప్రజలు నోరుమూసికొని కూర్చుచున్నారను తమ యనుభవమునే) బంగాళా విభజన సమయమున యిచ్చటి అధికారులు ఇంగ్లాండులోని మార్లేమంత్రిగారికి వ్రాసియుండరని నే తలంచెదను. "మీరీసమయమున కొంచెము ఓపికవహించి కాలయాపనచేయుడు. మౌనము వహించియుండినయెడల యీ బంగాళావిభజన విషయమైన యాందోళనంతయు చల్లారిపోగలదని" బహుశః యిచ్చటి యధికారులు మార్లేగారికి వ్రాసియుండవచ్చును. "ఈ కేకలన్నియు నెవరో బహుకొద్దిమంది మాత్రము ప్రేరేపించినందువలన పుట్టుచున్నవే గాని, మరేమియు భయపడవలసిన అవుసరము లేదు. కొంతకాలము జరిగిపోయిన పిమ్మట యీ యాందోళన పూర్తిగ అణగిపోయి, బంగాళా విభజనను ప్రజలు (నోరుమూసికొని) సమ్మతించి తీరుదురు. యీ హిందూదేశస్థుల విషయమై మీకంటె మాకే ఎక్కువగ తెలియును, మేమందరము వచ్చుట యింతకాలము నుంచి హిందూదేశస్థులను ఏలుచున్నాము. ఇకముందుకూడ ఏలదలచుకొన్నాము; ఇన్ని సంవత్సరముల యనుభవము మీద మేము చెప్పువాక్యములయందు మీకే మాత్రమైన గౌరవమున్నయెడల యీభారతీయు లిప్పుడు కేకలువేసినను, బిగ్గరగా

* యూరపియన్ తెల్లవా డెవడైన నేరముచేసినట్టయిన వానిని విచారించి శిక్షించుటకు మన నల్ల మేజస్ట్రేటులకు పూర్ణమైన (పవర్సు) హక్కులులేవు. ఈపద్ధతిని తీసివేసి తెల్లవాళ్ళను శిక్షించుటకు కూడ మన మేజస్ట్రేటులకు పూర్ణాధికారమివ్వవలసినదని యొకబిల్లును 1883 సం॥ లో ఇల్‌బర్టు అను దొర సామ్రాజ్యశాసన నిర్మాణసభలో ప్రవేశపెట్టెను. కాని దీనికి తెల్లవాళ్ళకందరకును కోపమువచ్చెను. తుదకు ఆ బిల్లును త్రోసివేసిరి.

యరచిరయు గావించు యాందోళనము జూచి మీ రేమాత్రమును జంకవద్దని మేము మీకు సలహా చెప్పుచున్నాము" అని యిచ్చటివారు మార్లే గారికి వ్రాసియుండ వచ్చును. మార్లే గారికి సలహాజెప్పనది యిచ్చటి ఆంగ్లో హైందవులే. వీరు యీ సంగతుల నన్నిటిని మార్లే గారికి తెలియజెప్పిరి. ఇంతకాలమునుంచి, హిందూదేశము నేలిన పరిపాలనానుభవముమీద, నీయధికారులు చెప్పిన యభిప్రాయములను మార్లే గారు త్రోసివేయజాలరైరి. వేదాంతియైన నేమి! కాకపోయిన నేమి? (వేదాంతముతో పనిలేదు) ఇట్టి బంగాళా విభజనయుండుట పరిపాలనా సౌకర్యమునకు ముఖ్యావసరమని ఆయన నిశ్చయముగా నమ్మియుండెను. మన అందరి వలెనే, ఆయన కూడ, తాను అవసరమని గట్టిగా నమ్మినదానినే గావించెనుగాని వేరుగాదు. ఇప్పటి స్థితిగతు లీవిధముగ నున్నవి. ఈ పద్ధతి నికమీద నాశ్రటకై మన జాతీయ కక్షవారు కోరుచున్నారు. మనమందర మొక క్రొత్తస్కీమును సిద్ధముచేసినాము. దీనికి మీరు సమ్మతించి నట్లయిన, మన ప్రస్తుతదురవస్థ తొలగిపోగలదు. ప్రాతపద్ధతి వారిస్కీమున కంటె దీనివలననే మనకెక్కువ లాభము కలుగగలదు. మన పరిశ్రమలన్నియు పూర్తిగ నశించినవి. విదేశపరిపాలన వచ్చినందువలన నివి పూర్తిగ నశించిపోయినవి. మనయొక్క ధనమంతయును దేశములో నుంచి నష్టమై పోవుచున్నది. మనము కడుదరిద్రులమై, భరింపరాని నీచస్థితికి వచ్చినాము. మనకంటె దరిద్రులు మానవకోటిలో నెచ్చటను లేరు. ఈ స్థితిలో నుంచి తప్పించుకొనుటకు మనకింతకంటె మార్గమేమైనగలదా? ఈమార్గమేమనగ, పిటీషనులు పెట్టుకొనుట కాదు. బహిష్కారమే (సహాయనిరాకరణమే) మనకుమందు. మీశక్తుల నన్నిటిని యొకచోటికి జేర్చుకొనుడు. తగినవాని నేర్పాటుచేసికొనుడు. ఇట్లు సిద్ధపరచుకొనిన పిమ్మట కార్యమునకు గడంగుడు. అప్పుడు మీకోర్కెల నెవరును త్రోసివేయజాలరు. పాండవులు శ్రీకృష్ణునిసంధికై కౌరవులయొద్దకు రాయబారమంపిరి; కాని యొక వేళ, సంధి పొసగని యెడల, యుద్ధమునకు సిద్ధముగ నుండుటకై యిరుపక్షముల వారును తమతమ సైన్యబలములను గూర్చుకొనుచునే యుండిరని మహాభారతములో చెప్పబడియున్నది. ఇదియే రాజ్యతంత్రము. మీకోర్కెలను నిరాకరించిన యెడల మీరిట్లు పోరాడుటకు సిద్ధముగ నున్నారా? మీరట్లు పోరాడుటకు సిద్ధముగ నున్నయెడల, మీ కోర్కెలను వారు నిరాకరింపరు. కాని మీరు సిద్ధముగ లేనియెడల వారు మీకోర్కెలను తప్పక నిరాకరించి తీరుదురు. మీజన్మలో మీరెప్పుడును సంపాదింపనేలేరు. ఇదెంతయు సత్యము, సత్యము. మన చేతులలో ఆయుధములు లేవు. ఉండవలసిన అవసరముకూడాలేదు. బహిష్కారమే మన కాయుధము. ఇది రాజకీయాయుధము. ఇది అన్నిటికంటె బలిష్టమైన ఆయుధము. ఒక్కసంగతిమాత్రము మనకు బాగుగ తెలియును. ఏమనగ, యీ పరిపాలనలో బహు కొద్దిమంది మాత్రమే యాంగ్లేయులున్నారు. పరిపాలన యంతయు మన భారతీయుల చేతులమీదుగనే నడచుచున్నది. మన మందరమును

చిన్న చిన్న తక్కువ యుద్యోగములలో నున్నాము. కాని మనసహాయముచేతనే యీ పరిపాలనమంతయు జరుగుచున్నది. మనలో మనకు సంఘీభావ మున్నయెడల మనకెంతయు బలము కలుగగలదు. అప్పుడు మన చేతులమీదుగా జరుగు యీ పరిపాలన మంతయు మనచేయని మనమే లాగికొని మనమే యీ రాజ్యమునంతయు పరిపాలింప వచ్చును. ఈ సంగతులన్నియు మనకు తెలియకుండజేయుటకై ప్రభుత్వము వారు ప్రయత్నముచేయుచున్నారు. అధికారమంతయు మనవశముననే యుండ వలెను. ఇప్పుడు కావలసినది యిదియే (నా యింటిలో యితరులు విదేశీయులు అనేకమంది యున్నారు) వారిలో నొక్కనిమాత్రము బయటకు వెడలగొట్టిన చాలదు. నా యింటి తాళపుచెవి (బీగము) నావద్దనే యుండవలెను. స్వరాజ్యమే మన పరమలక్ష్యము. రాజ్యాంగ యంత్రమంతయు మనవశమువనే యుండవలెను. గుమాస్తాగానుండి కూర్చొనిన లాభములేదు. (గుమాస్తాపని మన కక్కరలేదు) ప్రస్తుతము మనము గుమాస్తాలమే. విదేశస్థుల పరిపాలనకు లోబడి మనలనుమనమే బుద్ధిపూర్వకముగ బాధించుకొనుటకు కారకులమగుచున్నాము ఈ ప్రభుత్వమువారు మనలను తమ స్వబలముచేత పాలించుటలేదు. ఈ సంగతి మనకు తెలియకుండ మనల నజ్ఞానదశయందుంచి, మనకన్నులమూసి, యీ ప్రభువులు మనల నేలుచున్నారు. యీ అభిప్రాయమునే 'సీలీ' యను ఆంగ్లేయ పండితుడు తెలిపియున్నాడు. తాము బహుకొద్దిమంది మాత్రమే యిచ్చటగలరని ప్రతి యింగ్లీషువానికిని తెలియును. మన హిందూదేశస్థుల మందరమును బలహీనుల మనియును, తమ యింగ్లీషువారందరును బలవంతులనియును మనలో గట్టి నమ్మకము పుట్టించి, మనలను వట్టి బుద్ధిపిచ్చివారినిగా, బుద్ధిమూఢులనుగా చేయుచుట ప్రతియింగ్లీషువానికిని పనియైయున్నది. (అవుసరమైయున్నది.) యిదియే రాజ్యతంత్రము. యింతకాలము నుండియు, యీవిధముగనే మనము మోసపోయితిమి. (మనలను మోసపుచ్చిరి.) గనుక యింకముందు చేయవలసిన పనియంతయు కేవలము మీ చేతులలోనే గలదని మీరందరు బాగుగ గుర్తెరుంగవలెను. ఈ సంగతినే నూతన పక్షావలంబకులమైన మనము చెప్పుచున్నాము. మీరు స్వతంత్రులు కాగోరినయెడల తప్పక స్వతంత్రులయి తీరుదురు. మీరు స్వతంత్రులు కాగోరనియెడల మీరు పడిపోవుదురు ఇక మీగతియెప్పుడును అధోగతియే. మీలో చాలమందికి ఆయుధము లక్కరలేదని చెప్పుచున్నారు. ఆయుధములతో పోరాడుటకు మీకు శక్తిలేనియెడల, స్వసౌఖ్యమునైన వదలుకొనుటకు మీకుశక్తి లేదా? మీరీ విదేశస్థులకు తోడ్పడకుండ మానుకొనిన, వారిప్రభుత్వము మన

మీాద సాగనీయకుండ చేయలేరా? ఇదియే బహిష్కారము. బహిష్కారమే మనకు రాజకీయాయుధమని మనము చెప్పుదాని కిదియే యర్థము. రివిన్యూ వసూలు చేయుటకును, దేశశాంతిని గాపాడుటకును మనము గవర్నమెంటువారికి సహాయము చేయము. మనసైన్యమును మనధనమును, మనహిందూదేశముదాటి పరదేశములకు పోయి యుద్ధముచేయుటకు మనము సహాయము జేయము. కోర్టులు మొదలయిన న్యాయపరిపాలన జరుగుటకు మనము సహాయముచేయము. మనమే మన స్వంతకోర్టుల నేర్పరచుకొందుము. సమయమువచ్చినపుడు పన్నులను చెల్లింపము. మీారందరేకమైనయెడల మీారిట్లు చేయజాలరా? మీారట్లు చేయగలిగినయెడల రేపే మనము స్వతంత్రులము కాగలము. ఏమియు లేనిదానికంటె మనకు సగభాగము లభించినను చాలునని యిచ్చట నెవరో యుపన్యసించిరి. మనకంతయు కావలయుననియే నే కోరుచున్నాను. యావత్తును మనకు తత్క్షణమే వచ్చితీరవలెను. కాని అంతయు మనకొకసారియే రానియెడల నే నోపిక పట్టజాలనని మీారనుకొనవద్దు. మనకు వారిచ్చు సగమును తీసుకొని, మిగిలిన సగముకొరకు ప్రయత్నింపుదము. మన మీా పద్ధతులను బాగుగ యోజించి వానిననుసరించి నడువవలెను. ఈ పద్ధతులనే మన మలవరచుకొనవలెను. మనము ఖట్టిగుబులుచేత యీ యాందోళన గావింపుటలేదు. ఇది సహేతుకమైన ఉద్రేకమే (ఉద్ధతియే) ఇది నిష్కారణముగా పుట్టినది కాదు. ఆ కారణమేమియో బాగుగ తెలిసికొనుటకై యత్నింపుడు. అట్లు తెలిసికొని, దృఢమనస్కులరై మనకు గలిగిన యీ యుద్ధతిని మరింత ప్రోత్సహించుటకై యత్నింపుడు. మేము చెప్పువానిని విని "గ్రుడ్డియెద్దు చేలబడినట్లు" ప్రవర్తించవద్దు. దీని విషయమై బాగుగ మీారంతట మీారే యోజించుకొనుడు. అట్లుయోజించుకొనిన పిమ్మట మేము చెప్పు సలహా మంచిదని మీాకు తోచినయెడల మనకు మోక్షము కలుగగలదు. మనము కృతార్థులమగుట కిదియే మార్గమని నిశ్చయముగ నమ్ముడు. మేము చెప్పు సలహా యిదియే. మా సిద్ధాంతముల నన్నిటిని అందరును యింకను ఒప్పుకొనియుండలేదని తలంచెదను. ఇదివరకు చాలకాలము నుంచి యున్న పిచ్చియూహలు యింత త్వరలో తొలగిపోవుట సాధ్యముకాదు. కాంగ్రెసు సభను భగ్నముచేయవలెనని మా యుభయకక్షులలో నెవరును కోరియుండలేదు గనుక మేము రాజీపడినాము. మా సిద్ధాంతములను కొంతవరకైనను వారు ఆమోదించిరని మేమంతటితో తృప్తి జెందితిమి. అట్లని వారు చెప్పుదానికంతకును మేము సమ్మతించితిమని యర్థము చేసికొనకూడదు. ఇక రాబోవు సంవత్సరమే మే మొక అడుగు ముందుకు వేయవచ్చును. యీ విధముగ కొద్దిసంవత్సరములు గడచిన తోడనే మాసిద్ధాంతములన్నియు అంగీ-

కృతములు కాగలవు మరికొంత కాలము గడచిన యెడల మా సిద్ధాంతములన్నియు, నిరాటంకముగ, అందరిచేతను, నిర్ణయముగ పూర్ణాంగీకారమును బడయగలవు. (ఇప్పుడున్నట్లుగ మా సిద్ధాంతములను చూచి బెదరి భయపడు వారుండరు). మేము చనిన తరువాత, మా వెనుకవచ్చు భవిష్యత్సంతతివారు యిప్పుడీ భయోత్పాతమైన విపరీత సిద్ధాంతములను ప్రకటించిన మమ్ముబోటివారిని కేవలము మితవాదులనుగనే గణించెదరు. ఏ దేశమైనను అభివృద్ధి జెందుట యిటులనే యని గ్రహించవలెను. జాతీయభావము వ్యాపించి వృద్ధిజెందుట కిదియే మార్గము ప్రస్తుతము దేశమంతటను వ్యాపించి యాందోళన గల్గించు యీ కలవరమును జూచి మనము నేర్చుకొనవలసిన దిదియే. ఇదియే పురోభివృద్ధికి మార్గము. దీనిని జూచియే మనము నేర్చుకొనవలెను. మనకు మనమే స్వయం సహాయము చేసికొనవలెను. సాధ్యమైనంత వరకు మనము మన స్వశక్తిమీదనే యాధార పడవలెను.

మన స్వసంఘ శక్తిని మనము బాగుగ గ్రహించినయెడల మనము జయము గాంచగలము. మేము చెప్పు విషయములన్నియు మీ మనస్సులకు బాగుగ నచ్చిన యెడల మనము జయమందగలము. మనల నిప్పుడనేక కష్టముల పాల్సేయుచున్న యీ విదేశ పరిపాలన నుండి విముక్తులమయి మోక్షము నొందుట కిదియే సాధనము. మనకు దీనికంటె వేరు సాధనము లేదు.

ఇంక ననేక విషయముల జెప్పవలసియున్నది. అయినను, ఒక గంటకాలములో ఇవి అన్నియు జెప్పుటకు వీలులేదు. నే జెప్పిన దానిలో మీ కేమైన తెలియని యెడల నన్నువచ్చి మీరడుగవచ్చును. మీరు చెప్పు అభ్యంతరముల నన్నిటిని మేము ఖండించగలము. మీ సందేహములను మాన్పగలము. మే మిప్పుడు చెప్పిన వానిని తిరిగి ఋజువు పర్చగలము. మీ అందరి సహాయమును సానుభూతియును మాకవశ్యము కావలసినది మీ సాయము లేనిచో, యొంటరిగా మే మేపనియు నెరవేర్పజాలము. మన ప్రస్తుతస్థితినిగూర్చి బాగుగ చూచి విచారించి లోపాలోపములను స్పష్టముగ గ్రహించి పిమ్మట మీ రందరును మాకు సహాయముగవచ్చి నిలువబడవలసినదని నేను మిమ్ములనందరను వేడుకొనుచున్నాను. మరిమరి ప్రార్థించుచున్నాను. మన యందరియొక్క సంఘీభూతమైన కృషిఫలన యీ దేశమునకు ముక్తి గలుగుగాక!

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—:o:—

## 24 సూరత్ విచ్ఛేదమునకు పూర్వము

---

### జాతీయ మహాసభ (కాంగ్రెస్) చీలిపోవుటకు పూర్వము సూరత్ పట్టణములో నిచ్చిన యుపన్యాసము.

(1907 సం॥లో కాంగ్రెస్ సభ సూరత్ పట్టణమున జరిగెను. నాయకులలో జాతీయ వాదులు మితవాదులను రెండు కక్షలేర్పడెను. దీనికి కారణ మేమనగా:— క్రిందటి సంవత్సరము కలకత్తా సభలో "స్వరాజ్యము," కావలెననియు, 'జాతీయ విద్య' కావలెననియు "స్వదేశ వస్తువులనే ప్రోత్సహించ వలెననియు" "విదేశ వస్తువులను బహిష్కరించ వలెననియు" మొదలగు గాఢమైన స్వదేశోత్సాహ జనకమైన తీర్మానము లంగీకృతములయ్యెను ఈ తీర్మానము లుపద్రవకరముగ నున్నవనియు, యిట్టివానిని మన మంగీకరించినయెడల ప్రభుత్వమువారికి ఆగ్రహము వచ్చుననియు ప్రభుత్వమువారికి ఆగ్రహము కలుగచేసినయెడల వారు మన ప్రయత్నముల నన్నిటి నాపివేసి, ఈ సభకు భంగము వాటిల్లజేసి, మనల ననేక కష్టముల పాల్సేయుదురనియు, గనుక యీ తీర్మానములను యీ సంవత్సరపు సభయందు ప్రవేశపెట్టనే కూడదనియు "మితవాదుల" కక్షవారు గట్టిగపట్టుపట్టిరి. ఈ తీర్మానము లుండియే తీరవలయుననియును, ఒకసారి యంగీకృతములైన అభివృద్ధి సూచకములగు తీర్మానములను తీసివైచి, కాంగ్రెసును మరలింప జాలమనియును, ఇది దేశాభివృద్ధికి భంగకరమనియును, 'జాతీయవాదులు' గట్టిగ పట్టుబట్టిరి. ఈ జాతీయ వాదులకు నాయకుడు తిలక్ మహాశయుడు. మితవాదులపక్షమున గోపాలకృష్ణ గోఖలే, మెహతా, మొదలగు వారుండిరి. ఈ భేదమే సభా ప్రారంభకాలమున సభాధ్యక్షుని యెన్నుకొను విషయమున క్రియారూపమున బొడసూపి, రాను రాను మాటపట్టింపులకును, పాదరక్ష ప్రయోగములకును, కుర్చీలతో త్రోపులాటలకును

కారణమై, సభికులు చెల్లాచెదరు కాగా సభ చీలిపోయెను. ఆ సంవత్సరపు సభ అంతటితో ముగిసెను. ఈ సభ చీలిపోవుటకు పూర్వము డిశంబరు 23వ తేదీని 'జాతీయవాదుల సిద్ధాంతముల' ను గూర్చి బాలాజీ చౌగన్‌లో వివిధ ప్రదేశముల నుండివచ్చిన ప్రతినిధుల సమక్షమున తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను.)

[illegible]వమిప్పుడిచ్చుట కక్షవహించి, కాంగ్రెసు సభను చీలదీయుటకు రాలేదు. ప్రత్యేకసభ చేయవలయునని మనము కోరుటలేదు. కాని ఈసభ వెనుకకు నడువ కుండ చూడవలెను. 'కాలానుసారముగ ముందునకే నడువవలెనేగాని, దీనిని వెనుకకు నడువనియ్యము' అని మనము గట్టిగ చెప్పుచున్నాము. కాని మితవాదులు మనయభిప్రాయములకు విపరీతార్థములు చేసుకొనిరి. మన యీ క్రొత్తమార్గము దేనికిని భంగకరము కాదు. కాంగ్రెసును ముందుకు నడపించుకొనుటకై యత్నించు టయే మన ముఖ్యోద్దేశము. కాలము మారినది; గనుక, తదనుగుణముగ కొన్ని మార్పులిప్పుడు జరుగవలెను.

మన ముఖ్యోద్దేశ్యము స్వపరిపాలన. సాధ్యమైనంత త్వరలో మనము దానిని పొందవలెను. యిది మీరు బాగుగ గ్రహించవలెను. ఎంత ధనవ్యయ మునకైన వోర్చి ఈ సభను జరిపెదమని నాగపూరు వాస్తవ్యులు కోరియుండగా యీసభ నెట్లైనను వెనుకకు నడిపింపవలయునను సంకల్పముతో వీరందరీసభను యీ సంవత్సరము ఈ సూరత్ పట్టణమునకు లాగికొనివచ్చిరి. యిట్టి నిరంకుశ చర్యలకు మనమందరమును సమ్మతింపజాలము. ఈ సభ నెట్లైనను జీవచ్ఛవముగ జేయవలెనని వీరు (యీసాహసికులు) చూచుచున్నారు. అందువలనే 'విదేశ వస్తు బహిష్కారము' 'స్వరాజ్యము' మొదలగు తీర్మానములకు వీరు ప్రతికూలురై యున్నారు. ప్రజలకు బాధలు కలుగజేయు నీకటిన పరిపాలనాపద్ధతిని మనము సహింపజాలము. విదేశవస్తువులను బహిష్కరించవలసినదని వారు బహిరంగముగ చెప్పుట కిష్టపడరు. వారికి మనోధైర్యములేదు. స్వదేశవస్తువులనిన వారికిని యిష్టమే కాని విదేశవస్తువులను బహిష్కరించవలసినదని వారు చెప్పుట కిష్టపడరు అట్లు బహిష్కరింపవలనివచ్చినయెడల మీరేమాత్రమును భయపడవద్దు. స్వదేశ వస్తువులే కావలెనని మనము గట్టిగ కోరినయెడల, విదేశవస్తువులను బహిష్కరిం చియే తీరవలెను. బహిష్కారము లేనియెడల, స్వదేశవస్తువులను ప్రోత్సహింపనే జాలము. మీకు స్వదేశీ కావలసిన యెడల మీరు బహిష్కారమునకు ఒప్పుకొనియే తీరవలెను. 'ఇది చేయుట మాకిష్టములేదని వట్టిమాటలు చెప్పవద్దు. మీరు చెప్ప

దానిని క్రియారూపమున నాచరింపుము.’ -యీ పద్ధతియే మనకు కావలెను. మనము మనుష్యులకొరకై పోరాడుటలేదు; సభాధ్యక్షుని విషయమై పోట్లాడుకొనుట లేదు. ధర్మసూత్రములకై నిలువబడి పోరాడగలవారే మనకిప్పుడు కావలెను. రెండువిషయములను గూర్చి యిప్పుడు పోరాటము జరుగుచున్నది. ఒకటి:- ఇది ధర్మము అని గ్రహించిన దానిని పట్టుదలతో నాచరించుట, రెండవది:- అట్లుచేయుట మంచిదే, కాని, ప్రభుత్వమువారికి కోపము తెప్పింపవద్దు! ఇప్పుడీ రెండు సూత్రములకును పోరాటము జరుగుచున్నది. ప్రభుత్వము వారికి ఆగ్రహము వచ్చినను లేక అనుగ్రహము వచ్చినను మన మేది ధర్మమని గ్రహించుదుమో దానిని ఆచరించి తీరవలసినదే. ఈ సిద్ధాంతము నంగీకరించుపక్షమువారిలో నే నొకడను. ప్రభుత్వమువారి నిగ్రహానుగ్రహములతో మనకు పనిలేదు. మనకొరకును, దేశక్షేమము కొరకును మనము మనస్వధర్మముల నెరవేర్పవలసియున్నది. విధ్యుక్తమార్గమున ప్రవర్తించు మనము ఎట్టివారికైనను ఎంత గొప్ప ప్రభుత్వమునకైనను భయపడనక్కరలేదు. హీనముగ యాచించు పద్ధతి నవలంభించుటకు మనము సమ్మతింపజాలము. దాని వలన మనకు ప్రయోజనము లేకపోగా, మన ప్రతిష్టకు భంగముకూడ కలుగును మనము నీచులమయిపోదుము. ఇట్టి గంభీరోద్దేశముల గలిగి యున్నందుననే బంగాళాదేశములో ననేకులు కష్టముల పాలుగావలసివచ్చెను. అయినను, వారిట్టికష్టములనెల్ల సంతోషముతో భరించుటకు సంసిద్ధులైయుండిరి. మార్లేమంత్రి మొదలగు సర్కారు ఉద్యోగస్తులు మనలో భేదము బుట్టింప యత్నించుచున్నట్లు గనుపించుచున్నది. మితవాదులతో నేకీభవించవలసినదని సర్కారువారు మనకు సలహానిచ్చుచున్నారు. అట్లుచేయుట మన కిష్టమేనా? ఎన్నటికిని కాదు. మనము వెనుకకు మరలుట మర్యాదగాదు; ఇది రాజనీతికాదు. క్రిందటిసంవత్సరము కలకత్తాలో అఖిలభారత పితామహుడైన దాదాభాయి నౌరోజీగారిచే స్వరాజ్యపతాక మెత్తబడినది ఇదియే మనకు పరమపదము. (ఇదియే మనకు మోక్షము) మన పితామహుడు సూచించిన యీమార్గముననే మనము నడువనియెడల ఆయన మనలనేమనును? మన మీ దేశమునకు దేశద్రోహులుగా నెంచబడుదుము. రాజకీయాభివృద్ధియే మనయాదర్శము. కాంగ్రెసుసభను యీ యాదర్శమునుండి మరల్చుట కెవరికిని హక్కులేదు. కాంగ్రెసుసభ యీ సూరత్ పట్టణములో వెనుకంజ వేసినదను అప్రతిష్టమాట యీ పట్టణమునకు రాకుండజూచుకొనుట మీ యొక్క విధియై యున్నది. ముందుకు సాగగల అభివృద్ధి లేకపోయినను బాగుగాని, కాంగ్రెసు వెనుకకు నడచిన అప్రతిష్టమాత్రము రాకూడదు. ఈ పేరు రాకుండ మనమందరము

గట్టిగ ప్రయత్నింపవలెను. దీనికై మాకు మీయందరి సహాయము కావలెను. హిందూదేశములో స్వపరిపాలన అసంభవమని మార్లెమంత్రిగారును, సైన్యపత్రికాధికారులును తలవిచ్చియున్నారు. మార్లెమంత్రికిని, సైన్యపత్రికకును సాధ్యముకాని స్వపరిపాలన మనదేశస్థులకు సాధ్యము కాగలదను సంగతినిమాత్రము మీరు బాగుగ జ్ఞాపకముంచుకొనుడు. ఏలననగ వారికోర్కెలకును మనకోర్కెలకును హస్తిమశకాంతరము భేదముగలదు. ఈకోర్కెలు పరస్పరవిరుద్ధములు ప్రజలందరును చక్కగ తెలిసికొని గట్టిగ కోరదగినదీ స్వరాజ్యవాంఛయే తప్ప యింకొకటిలేదు. మనవారిదివరలో కోరు కోర్కెలన్నియు నీయొక్కదానిలోనే యిమిడియున్నవి. స్వరాజ్యమనగా "ప్రజలకొరకు ప్రజలే ప్రభుత్వమును నడపుకొనుట."

మితవాదులకు చిక్కులు కల్పింపవలయునను తలంపుతో మనమిచ్చటికి వచ్చియుండలేదు. కాని కాంగ్రెసును వెనుకకు నడవనీయకుండ చేయుటకై మనమందరము నిశ్చితాభిప్రాయులమై యున్నాము. భగవదనుగ్రహమువలన మనము జయముగాంచగలము. మనపక్షము న్యాయపక్షముగాన మనము జయముగాంచగలమను నమ్మకము నాకు గట్టిగ గలదు. ఎవడైనను, ఎంతగొప్పవాడైనను, కొద్దివాడైనను, యెట్టివాడుగాని కాలప్రవాహము నాపజాలడు. స్వరాజ్యాదర్శమే మనకును మన భవిష్యత్సంతతివారికిని పరమావధి. యువకుల కార్యోత్సాహము నాపగూడదు. వారిని అతిగా ముందునకు దుముకనీయనూకూడదు. కాని వారిని నిర్జీవులను మాత్రము చేయకూడదు. బహిష్కారమనుమాటకు మన మితవాదులు భయపడెదరు. కాని వారికిని క్రియమాత్రమిష్టమే! స్వదేశవస్తుప్రోత్సాహము విదేశవస్తుబహిష్కారము మొదలగు నీ విషయములు ఇదివరకే దేశమందంతటను నూతనోజ్జీవమును అంకురింపజేసినవి. ఈ సంగతి వారును మనవలెనే గ్రహింపగలిగిరి. మనవంటి పరాధీన జాతులవారికి బహిష్కారమే సాధనము. 'ట్రాన్స్వాలు' దేశములోనున్న మన హిందూదేశస్థులనుగూర్చి మీరు వినియే యున్నారు. వారిని మనరాజుగారి ఆంగ్లేయ పౌరులను చూచినట్లుగ సమానముగ చూచుకొనుట లేదు. అయినను మనము సామ్రాజ్యప్రజలమేయని చెప్పుకొనవలెనట! మన మీ సామ్రాజ్యమునకు బానిసలముగాము. హిందూదేశములోనేగాక సామ్రాజ్యము నందంతటను తెల్లవారితో సమానముగ మనకును హక్కులుండవలెను. ♦ట్రాన్స్వాలులోని యధికారులు అచ్చటి మనహిందూదేశస్థులమీద 'జిజియా

♦ఆఫ్రికాఖండములో నేటాలుప్రాంతములనందు దేశముపేరు.

పన్ను' (అనగా తలపన్ను) విధించిరి. 13వేలమంది యీ యన్యాయమైన చట్టమునకు బద్ధులుగాక, నిరోధించుటకు కృతనిశ్చయులైరి. (వినండి వినండి.) కాంగ్రెసువారీచర్యను ఆమోదించిరి. ఆహ్వానసంఘములోని మితవాదులుకూడ దీని నామోదించి, తమ యామోదమును దెలుపుటకై వొక తీర్మానముకూడ ప్రతిపాదించుటకు వారిష్టపడిరి! ఎచ్చటనో దూరముననున్న మన హిందూదేశస్థులు గావించిన యిట్టి చర్యను వీరామోదించినపుడు, యిచ్చటి బహిష్కారము నేల వీరామోదింపరు? అచ్చటివారు అన్యాయమైన విజాతీయ చట్టములను బహిష్కరించిరి. దీనిలో నసందర్భ మేమియును లేదు. మన మితవాదుల యుద్దేశము సర్కారు వారిని సంతోష పెట్టవలెనని కాదు. వారట్లుచేసిన నాకును సంతోషమే. దీనిలోనున్న నిజ మేమనగా:— నాగరికతగల మన ప్రభుత్వమువారిని జూచి మన మితవాదులు భయపడుచున్నారు. అది పౌరుషేయము కాదు. కష్టముల నెదుర్కొనుటకు మీరు సంసిద్ధులు కానియెడ మీ రూరక కూర్చొనుడు. అంతే గాని, వెనుకకు నడుపుడని మమ్ములను మాత్రము నెట్టవద్దు. గత రెండు సంవత్సరముల సభలలోను మన మామోదించిన ఆదర్శములకు మీ రడ్డము రావద్దని మిమ్ములను ప్రార్థించుచున్నాను. దేశపాలనా విషయములలో ప్రజలకు పలుకుబడి లేనప్పుడిట్టి బహిష్కారమే మన కత్యంతోపయుక్తమైన సాధనము. ఓ సూరత్ పట్టణ పౌరులారా! మీ రందరును, మా యీ ప్రయత్నములకు తోడ్పడుడని ప్రార్థింపుచున్నాను.

ఇప్పుడు స్వరాజ్యమును గూర్చియు, బహిష్కారమును గూర్చియు చెప్పియున్నాను. ఇక మూడవ విషయము జాతీయ విద్యనుగూర్చి కొంత చెప్పవలెను. దీని విషయమైన తీర్మానము క్రిందటి సంవత్సరము కలకత్తాసభలో నామోదింపబడియే యున్నది. కాని ఈ సూరత్ పట్టణ ఆహ్వానసంఘమువారీ తీర్మానమును చిత్తు తీర్మానములలో చేర్చి యుండుట ధర్మమని యెంచి యుండలేదు. కొంతమంది స్వాతిశయపరుల కిది రుచించలేదట! అందువలన యిచ్చట క్రిందటి యేప్రిల్ నెలలో జరిగిన రాష్ట్రీయసభలో కూడ నీ తీర్మానమును వారు త్రోసివేసిరి. వారు చేసినట్లుగా మన మీ తీర్మానము విషయమై దౌర్జన్య భావముతో ప్రవర్తింపగోరుట లేదు. విషయ నిర్ధారణ సభవారి యెదుటను, సభా ప్రతినిధుల యెదుటను మన మీ తీర్మానమును పెట్టుదము. ఈ మహాసభయెడ మనము భక్తియుతులమై యుందుము. (మన మీ సభోద్దేశముల ననుసరించియే యుందుము.) ఈ సభపట్ల మనము జూపు భక్తికి మన స్వప్రయోజనము అడ్డము రాకూడదు. అట్లడ్డము వచ్చిన

యెడల తక్షణమే దాని నావలకు త్రోసిపారవేయ వలయును. ఇది ఒక్కరికే కావలసిన స్వప్రయోజన కార్యము కాదు. ఎంత గొప్పవాడైనను, ఎంత ఘనుడైనను, ఆయనకు జూపవలసిన మర్యాద వేరు. ఆయన మర్యాదకొరకై మన మీ సభాదర్శములకు భంగము వాటిల్లజేయ కూడదు. (ఆయన గొప్పతనమును, గౌరవమును సభోద్దేశములకు అడ్డము రాకూడదు) మన మిప్పుడు పోట్లాడినది దేశాభివృద్ధికై గదా. ఘర్షణ ఉండితీరును. ఘర్షణలేనిది చలన మెక్కడ గలదు ? ఈ సూత్రమే రాజకీయరంగమున కూడ వర్తించును. కాని దీనివలన అసలు చలనమే కేవల మాగిపోవు నంత ఎక్కువగ ఘర్షణ పుట్టకుండునట్లు మనము జాగ్రత్తగ నుండవలెను. ప్రతిదానికి పరిమితి గలదు. అందరు ఏకాభిప్రాయులై యుండుట అత్యుత్తమము. అట్లు కానియెడల, తుదకు బహుజనాభిప్రాయము (మెజారిటీ) చేతనైనను యీ తీర్మానమును ఆమోదింప జేయవలెను. ఇది యామోదము బడసిన తోడనే దీనిని కార్యరూపమున ఆచరణలో బెట్టవలెను. యిట్టి దానిని త్రోసిపుచ్చుటకు సభాధ్యక్షుని కైనను హక్కులేదు. ఒక సారి సభలో నామోదింపబడిన తీర్మానము సభలో చేరిన వారందరును, తమ కిష్ట మున్నను లేకున్నను, ఒప్పుకొనియే తీరవలెను. ఇప్పుడు దౌర్జన్య మెచ్చటను ఉండబోదు. ఎవరో యీ దురభిప్రాయమును వ్యాపింపజేసిరి. మనము శాస్త్రోక్త మార్గమున పోరాడుటకు వచ్చినామే గాని దౌర్జన్యముతో మనకు పనిలేదు. మన మీ సభయెడల భక్తిభావముతోడనే పోరాడెదము. మన ప్రతికక్షు లెట్లు ప్రవర్తించినను, మనము గౌరవము గల పెద్దమనుష్యులవలెనే ప్రవర్తించెదము. తా మోడిపోదు మని భయము తోచినతోడనే, మన ప్రతికక్షులు దౌర్జన్యమునకు గడంగెదరు. మన మిప్పుడు స్వాతిశయపరులైన విదేశీయాధికారవర్గము వారితో పోరాడుచున్నాము. ఇట్టి సందర్భమున, మన స్వగృహములోనే, మనలోనే యిట్టి స్వాతిశయభావ మున్నయెడల మనము దానినెట్లు సహింపగలము ? (అట్టిస్వాతిశయభావమును తలయెత్త నీయకూడదు). కనుక మనసభలో నిట్టి స్వాతిశయాధికారము సాగనీయకుండ చేయవలెను. ఈ జాతీయ మహాసభ (కాంగ్రెసు) ప్రజలందరి కొరకును యేర్పడిన సంస్థయైయున్నది. కనుక యీ సభలో ప్రజాభిప్రాయమే నెగ్గవలెను. ఎట్టి గొప్పవాడైనను, యెట్టి కొద్దివాడైనను వచ్చి సభోద్దేశములను భంగపరుపకుండ మనము చూడవలెను. మనము ముందుకు సాగలేక పోయినను, వెనుకకు మాత్రము అడుగువేయకూడదు. ఇట్లుజేయుట కష్టము కాదు. మన ఆదర్శములనే మనము వదలకుండ పట్టుబట్టి యుండవలెను.

(వానిని జారవిడువకూడదు). మితవాదుల పద్ధతి కేవలమూ నిర్మూలన మార్గమూ అది కేవలము ఆత్మహత్య గావించుకొను మార్గమే. మీరు దాని ననుసరించకూడదు. మనము ముందునకు సాగిపోవలెను. కనుక తిరిగిమిమ్ముల నందరిని ప్రార్థించుచున్నాను ఓ సూరత్ పట్టణవాసులారా! ఓఘూర్జర దేశవాసులారా! యీ స్వాతిశయపరుల బెదరింపులకు భయపడిపారిపోకుడు. భయపడకుడు, మనము జయము గాంచగలము.

(వందేమాతర ధ్వానము)

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 25. సూరత్ విచ్ఛేదమునకు పిమ్మట

(జాతీయమహాసభ (కాంగ్రెసు) చీలిపోయినపిమ్మట సూరత్ పట్టణములో నిచ్చిన యుపన్యాసములు)

[ఆన 1907-వ సంవత్సరము డిశంబరునెల 28-వ తేదీని అరవిందఘోషు గారి యాధిపత్యముక్రింద జాతీయవాదులసభ జరిగెను. ఆ సమయమున అప్పటి స్థితినిగూర్చి విచారించుచు జాతీయవాదులకు నాయకుడైన తిలకు మహాశయు డిట్లుపన్యసించెను ]

ఇప్పు డిచ్చట నున్నవారిలో చాలమంది జాతీయమహాసభకు వచ్చిన మధ్యరకపు ప్రతినిధులైయున్నారు. క్రిందటి సంవత్సరము జాతీయమహాసభ గావించిన యేర్పాటులను భంగపుచ్చకూడదను వాదముతో వీరందరు నేకీభవించువారై యున్నారు. క్రిందటి సంవత్సరపు యేర్పాటులకు భంగము కలుగజేయవలెనని కొందరు ప్రయత్నించిరి. దీనికి ఫలితమేమి కలిగెను? లక్షల కొలది రూప్యములను వ్యయపరచి, యిరువదిమూడు సంవత్సరములనుండి కష్టపడి నిర్మించిన యీ జాతీయమహాసభాభవనమునకే విచారకరమైన భంగము వాటిల్లెను. నేటితో యీ సభ సమాప్తినొందెను. నిరుటిసంవత్సరపు తీర్మానములనే యామోదించవలె నని యొక కక్షవారును, అంతకు పూర్వమున్న వెనుకటి పూర్వాచారమునే యనుసరించి పోవలెనని మరియొక కక్షవారును కోరిరి.

### సభను క్రిందకు వాగదీయవలెనను ప్రయత్నము

సూరత్ సభను యేర్పాటుగావించి, దానికి తగిన ప్రయత్నములన్నిటినిచేసి వ్యవహరించిన కొందరు గొప్పపెద్దమనుష్యులు, యీ సభను క్రిందటి సంవత్సరమిది కలకత్తాలో నాక్రమించిన అత్యున్నత పీఠస్థానమునుండి క్రిందికి వంగదీసి, దీనినెట్లయిన అఖిలభారతవర్ష మితవాదసభగాదింపి, దీనిని హీనస్థితిలోనికి తీసికొని రావలెనను ధృఢసంకల్పముతో నుండిరి. ఇదియే యుభయకక్షులవారి పోరా

టమునకును ముఖ్యకారణము. (యిదియే పోరాటమునకు మూలము.) (సిగ్గు, సిగ్గు అను కేకలు) యిది యెంతయు కడుహీనమైన మార్గము. ఇదెంతమాత్రమును అభివృద్ధికరముకాదు. ఇది వక్రగతి. నాలుగైదు దినములనుండియు మనజాతీయ వాదు లిట్టి వక్రగతికి వ్యతిరేకముగ నిలిచి పోరాడుచున్నారు. న్యాయముగా లాలా లజపతిరాయిగారికి రావలసిన సభాధ్యక్షపదవిని యీ సూరత్ ఆహ్వాన సంఘమువారు త్రోసిపుచ్చిరి. వారిని సభాధిపతిగా నెన్నుకొనిన యెడల గవర్నమెంటువారికి కోపము వచ్చునట! వెంటనే గవర్నమెంటువారు మన సభ గొంతును పిసికివైచి, మనల నిక యీ సభలే చేసికొననివ్వరట! (అందువలన లాలాలజపతి రాయిగారిని సభాధ్యక్షునిగా నేర్పరచుకొనకూడదట!) ఈ సభయొక్క అంత్యదశ కిదియే ప్రారంభము. మనలో కొంతమంది సర్వాధికారములను తమచేతులలోనికి తీసికొని ప్రజలకందరకును కావలసిన యీ జాతీయోద్యమమును చీలదీసి, దీనిని కేవలము ఒకపక్షమునకే సంబంధించిన ఉద్యమముగా విడదీయుట సంభవమయ్యెను. అధికారమును అసలు వారి చేతులలోనికి పోనివ్వకుండినయెడల నిది సాధ్యపడెడిదికాదు. ఈ మితవాదపక్షమువారు నిరుటి కాంగ్రెసు అభిప్రాయములను త్రోసిపుచ్చి గవర్నమెంటువారి అభిప్రాయముల కనుకూలించునట్లు తిరిగి కొన్ని కొన్ని ఉద్దేశ్యములను, ఆదర్శములను ప్రకటించిరి. అట్లని, యీ మితవాదులకును. గవర్నమెంటువారికిని మధ్య (లోపాయికారిని) రహస్యపు టొడంబడిక లున్నవని నాయభిప్రాయముకాదు ఏవిధముగ చెప్పినట్లైన గవర్నమెంటువారికి సాధ్యమైనంత తక్కువ అభ్యంతర ముండునో (కోపము రాకుండునో) అట్టిపద్ధతిని మన మితవాదు లవలంభింప గోరిరి. యీ పద్ధతియైనను గవర్నమెంటువారికి చాల యిష్టముగ నున్నదని నే జెప్పను. ఏలననగా:- మనసభ వారేపద్ధతి నవలంభించినను, వారికి ఎన్నటికిని, ఏదియును యిష్టముగ నుండనే జాలదు.

## వెనుకంజ వేయుట

గవర్నమెంటువారు ప్రజలను (నిర్దాక్షిణ్యభావముతో) కఠినముగ శిక్షింపుచున్న యీ విషమకాలములో ప్రజలమైన మనమే (కొంచము శాంతము వహించి) మితము దాటకుండ ప్రవర్తింపుట, మనకు మంచిదని మన మితవాదులు హృదయపూర్వకముగ తలంచి యుండవచ్చును. ఇది యిహసంభంధమైన లౌకిక నీతి. కాని గవర్నమెంటువారు మనల నిట్లు కష్టపరంపరల పాలుచేసిననే మన మభివృద్ధి పొందగల మని జాతీయవాదు లెంచిరి. ఇప్పుడు రెండు పక్షముల వాదములు గలవు.

(1) గవర్నమెంటువారికి వ్యతిరేకముగ నున్నను, వారితో కలసి మెలసి యుండిననే గాని హిందూదేశ మభివృద్ధి గాంచలేదని యొకపక్షవాదము (2) కాని మరియొక పక్షమువారి (జాతీయవాదుల) యభిప్రాయ మది కాదు. యీ జాతీయవాదుల వాదమే ప్రస్తుతము దేశమందంతటను అనోపము బడసియున్నది. ఇదియే దేశమున అత్యుత్సాహము పుట్టించెను. ఇప్పుడిదియే బలకరముగ నున్నది. ఈ యిరుపక్షములకును పోరాటము జరుగుచున్నది. అయినను, యింతకాలము నుండి యుభయులును యేదో విధమున సమాధానపడి ఏకముగ పని కొనసాగించుచుండిరి. క్రిందటి సంవత్సరపు సభలో సంగీకృతమైన 'స్వరాజ్యము' 'బహిష్కారము', 'స్వదేశి' 'జాతీయవిద్య' మొదలగు నీ తీర్మానములు మన మార్లే మంత్రిగారికిని, లండన్ టైమ్సు పత్రికాధిపతులకును, యితర దొరలకును, ఉద్యోగస్థులకును యిష్టముగ లేవట ! ఆ కారణముచేత వీనిని తిరిగి యీ సంవత్సరపు సభలోనికి తీసికొని రాకూడదట ! ఇట్లనుట యీ జాతీయమహాసభ కెంతయును దుర్భరమైన అప్రతిష్ట, పరువునష్ట మని యెంచవలెను. ఇది యెంతయు, సభను అవమానపరచుటయే యగును. ఎవనికి గాని, తా నెంతగొప్పపదవిలో నున్నను, యీ సభను వెనుకకు నెట్టుటకు అధికారము లేదు. మితము దాటకుండుటకును, గవర్నమెంటువారికి కోపము కలిగింపకుండుటకును, మన క్షేమముకొరకును, మన సభను కొంచము వెనుకకు నెట్టుట అవుసర మని బొంబాయిలోని మితవాదులు కోరిరి !

## మితవాదుల అతిపట్టుదల

మితవాదులు నిరుటి సంవత్సరపు 4 తీర్మానములను త్రోసివేయవలయు నని కోరిరి. సభను వెనుకకు నెట్టివేయవలె నని మితవాదుల కెంతపట్టుదల యుండెనో దానిని వెనుకకు పోనీయకుండ చేయవలె నని జాతీయవాదులకు కూడ అంత పట్టుదలయే యుండెను. జాతీయవాదుల యీ వ్యతిరేకభావము సభాధ్యక్షుని యెన్నికొను విషయములో మొదట పొడసూపెను. భారతవర్ష మంతయును ఏకగ్రీవముగ లాలా లజపతిరాయిగారిని సభాధ్యక్షునిగ నెన్నుకొనుటకు సమ్మతించినను, కేవలము గవర్నమెంటువారిని సంతోషపెట్టవలె నను తలంపుతో, డాక్టరు రసవిహారిఘోషుగారిని సభాధ్యక్షునిగా నిర్ణయించుట తప్పని, ధర్మవిరుద్ధమని జాతీయవాదులెంచిరి; గనుక యిట్టి ధర్మ విరుద్ధకార్యమునకు ప్రతిఘటించుటకే తమ విధి యని వారట్లు గావించిరి. యిదివరకు, యిన్ని సంవత్సరముల నుండి, జరుగుచున్న విధమున ఏదో విధముగ యిరుపక్షులవారును సమాధానపడిన

బాగుండి యుండెడిది. కాని బొంబాయి మితవాదు లికమీద జాతీయవాదులతో నెట్టి సమాధానమును చేసికొనుట కిష్టపడలేదు. అది గాక క్రిందటి సంవత్సరము కలకత్తాలో తాము జాతీయ వాదుల ప్రోద్బలముచేత ఒప్పుకొనిన యీ నాలుగు తీర్మానములను కూడ త్రోసివేసి, కాంగ్రెసును వెనుకకు నెట్టవలెనని మితవాదులు దృఢసంకల్పులై యుండిరి. అందువలన, జాతీయవాదు లెన్నిపర్యాయములు రాజీ మాటలు మాట్లాడుటకు వారివద్దకు - ప్రైవేటుగాను, పబ్లికుగాను - వెళ్లినను వారి నసలు * దరికే చేరనీయలేదు. ఎంతమంది స్నేహితులు మధ్యవచ్చి చెప్పినను వారిని దగ్గరకు చేరనీయలేదు. దీనికి ఫలిత మేమనగా:— అసలు సభకే భంగము వాటిల్లెను. అయినను, యీ భేదము, ఈ భంగము, మన సభలో శాశ్వతముగ నుండకుండును గాక యని కోరుచున్నాను. ముఖ్యముగ, మన మందరమును కలిసి సంఘీభావముతో నిలుచుండి, దుర్భేద్యముఖముగ నెదిరించవలసిన యీ తరుణమున మనలో నిట్టి భేదముండకూడదు. యీ భంగమునకై అందరికంటె నాకే ఎక్కువ విచారముగ నున్నది. యీ భంగమువల్ల మన కనేక హానికరమైన ముప్పులు వాటిల్లునని మన జాతీయ వాదులకు బాగుగ తెలియును. మనలోని యీ భేదము యితరుల కెట్టిచేయూత యొసంగునో కూడ మన మెరుంగుదుము. తమ వైపునకు వచ్చి తమతో నిలువబడి పోరాడవలసిన దని గవర్నమెంటువారు మన మితవాదు లను ప్రోత్సహించు చున్నారు! యీ తరుణమున గవర్నమెంటువారి చేతులలో (మాయలలో) పడకుండ జూచుకొనుట ప్రతి విద్యావంతుని ధర్మమునై యున్నది. అదృష్టవశముననో, లేక దురదృష్టవశముననో, మనలో నీ భేదము పుట్టెను. ఏల ననగా:—యిది ఒకపక్షమువారికి అదృష్టమును, రెండవ పక్షమువారికి దుర దృష్టమును గదా. ఎట్లయినను సాత్వికయులైన మితవాదులే జయముగాంచిరి. మన పక్షమువారిని కూడ కలుపుకొనుటకు వారు ప్రయత్నింపకుండ, వారు మన లను కేవలము తరిమివైచిరి. (సిగ్గు, సిగ్గు. అని కేకలు) మన మీ జాతీయ సభా గౌరవమును నిలుపబెట్టుటకు చూపిన సహేతుకమార్గములను త్రోసివైచి, ఎట్లయి నను వారే జయ మొందిరి. దేశములో నిట్టి భేదభావముండుట హానికరము. దీని నెంత త్వరగ నశింపజేసిన నంత శ్రేయోదాయకము. యీ భేదము కొద్దికాలమే యుండును గాక యని నే గోరుచున్నాను. మరియు, కొద్దిసంవత్సరముల యనుభవము మీద, మన మితవాదు లవలంబించిన మార్గము కేవలము (అనర్థదాయక మనియు) శాశ్వతాభివృద్ధికర మార్గము కాదనియు వారికే తేటబడగలదు. ఇది నాదృఢ నమ్మకము.

---

* కొంతమంది స్నేహితులకు యీ మితవాదులు దర్శనమే యీయలేదట!

## సభ కొంతకాల మాపవలసినదని తిలకుగారు కోరుట

ఉభయ కక్షలవారును అప్పుడే కోపగించుట కష్టమైనయెడల, సభాధ్యక్షుని యెన్నుకొనుటకు పూర్వమే కొందరు నాయకు లొకచోటచేరి యీ విషయమును ముందుగా పరిష్కరించుకొని యుండిన బాగుండెడిది. "సభలో మనమే యే తీర్మానములను గావింపవలసియుండునో ముందు నిర్ధారణపరచుకొని పిమ్మట సభా కార్యక్రమమును యేర్పాటు చేసికొనినయెడల, నిక సభాధ్యక్షు లెవరైనను మనము విచారింపనక్కరలేదు. అప్పుడు సభాధ్యక్షుని విషయమై తగాదా యుండనే యుండదు. కనుక సభాధ్యక్షుని యెన్నుకొనువిషయమును ప్రస్తుతము కొంచెము కాలము అపుదల చేయవలసినది. ఈలోపుగ, ప్రతిరాష్ట్రము నుండియు ఒక జాతీయవాదియు, ఒక మితవాదియు కలిసి వీరందరొక "ప్రతినిధుల సంఘముగ" నేర్పడి సభలో నేయే తీర్మానముల గావింపవలయును? సభోద్దేశ్యము లెట్లుండ వలెను? పెందలైన సభాకార్యక్రమము నంతను నిర్ధారణపరచుకొనవచ్చును. ఇట్లు నిర్ధారణపరచుకొనిన పిమ్మట, మనమందర మెవరియాటంకము లేకుండ, యేక గ్రీవముగ సభాధ్యక్షుని యెన్నుకొనవచ్చును. అదెంతపని. కనుక ప్రస్తుతము అధ్యక్షుని యెన్నుకొను విషయమును మాత్రము అపుదలచేయవలసినది." ఈ విష యములన్నియు నేను సభాపీఠమున మాట్లాడదలచితిని. అంతియేగాని, కేవలము అసలు సభనే యాపవలసినదని నే కోరలేదు. మన మందర మొకసంఘముగచేరి ముందు సభాకార్యక్రమమును నిర్ణయించుకొనుటకు, తగిన యవకాశముండునట్లుగ, తగిన వ్యవధియుండుటకై అప్పటికి ప్రస్తుతము సభాధ్యక్షుని యెన్నుకొనువిషయ మును మాత్రము కట్టిబెట్టవలెసినదను సవరణను నే జేయగోరి యుంటిని.

ఇదియే నే చేయదలచుకొనిన సవరణ. దీనికొరకయియే నేను సభాపీఠమున నెక్కి మాట్లాడదలచుకొంటిని. (కాని వారు నన్నట్లు మాట్లాడనీయలేదు.) ఉభయులకును రాజీ కుదుర్చవలయునని అనేకమంది స్నేహితులు ప్రయత్నించి నను, మన ప్రతికక్షు లొకయంగుళమైనను అటునిటు కదలుట కిష్టపడనందున, వారి ప్రయత్నములు విఫలములయ్యెను. సూరత్ పట్టణములో తన పక్షమున పోరాడుటకు చాలమంది మితవాదులున్నారను ధైర్యముతో వారీ కాంగ్రెసు సభను వెనుకకు నెట్టిరైనను, తమ యుద్దేశ్యములనే సభికులందరిచేతను పట్టుబట్టి యొప్పింపజేయుట కిదియే మంచి సమయమని బొంబాయి మితవాదులు తలంచి యుండిరి. వారియందు సమానభావము లేకపోయినందువలననే యిట్టి విపరీత స్థితి సంభవించెను.

## మితవాదుల అసందర్భపు ప్రవర్తన

జాతీయవాదులే కొంచెము సహనము చూపియుండిన బాగుండెడి దని కొందరు తలపిచ్చిరి. అయినను, సహనమునకు సైయితము మితముకలదు. మనము జాతీయసభను వెనుకకు నడువనిచ్చెదమా? (లేదు, లేదు అని కేకలు) దీనికి ఫలిత మేమి? దేశోపకారార్థమై నిర్మింపబడిన యీ సభకే భంగము వాటిల్లెను మన హిందూకుటుంబములో అంతః కలహములుకలిగి విభాగములయినప్పుడు, భాగస్వాము లెట్లు బలహీనస్థితికి వచ్చుచున్నారో, అట్లే యీ భంగపాటువలన మన యిరుకక్షులవారమును బలహీనులమైనారము. ఈ సభను వెనుకకు నడిపింపగోరిన మనవారందరును త్వరలో తమ తప్పును తాము తెలుసుకొందురుగాక! మితవాదుల నందరిని తమ పక్షమునకువచ్చి నిలువబడు డని గవర్నమెంటువారు కోరినను దాని వలన మన కావంతయు ప్రయోజనముండజాలదు. ఎవరికిని స్వప్రయోజనము లేకపోగా మొత్తముమీద సంఘమున కంతకునుకూడ నేమిప్రయోజనము లేదు. మన మితవాదుల ప్రస్తుతస్థితి మిక్కిలి అసందర్భరముగనున్నది. ఇదెంతయు ఆత్మహత్యాకారకము. ఈ సంగతులన్నియు కొంతకాలము పోయినతరువాత గవర్నమెంటువారి చర్యలవలన వారికే తెలిసిరాగలవు. "ఈదుస్థితిలో బడకుండ గాపాడుకొనుటకింకను మన కవకాశముగలదు కనుక దీని విషయమై మనమంద రమును యీ సభలో ఆలోచింపకొనెదము గాక" యని నే జెప్పియుంటిని. అందుమీద నాకును, గోష్, మాల్వీగారికిని కొంత ప్రసంగము జరిగెను. అంతట సభయందంతటను గొప్ప సంక్షోభము పుట్టెను. గొప్పధ్వని బయలుదేరి, అందరును కేకలువేయసాగిరి. ఆ ధ్వనిలో, సభ నిప్పటికి చాలించినామని సభాధ్యక్షులు ప్రకటించిరి. సభ తిరిగి యెప్పుడు సమావేశము కాబోవునో ♦చెప్పలేదు. అధ్యక్షుని యెన్నుకొను విషయమై పుదల చేయవలసినదని చెప్పుచు, దీని విషయమై సభాపీఠమున మాట్లాడుట కనుజ్ఞ యివ్వవలసినదని నే గోరినప్పుడు, వారు "సభనింతటితో ఆపివేసినాము" ని బహిరంగముగ ప్రకటించిరి. కాని యీసంగతినిగూర్చి మితవాదు లేమియు మాట్లాడుటలేదు. మన మీ సంగతిని జ్ఞాపకముంచుకొనవలెను. బహుశః మాల్వీ, గోషు గారలకు పైన జరిగిన ప్రసంగములో "సభను యింతటితో ముగించెదము" ను సంగతి వచ్చియుండవచ్చును గాని, దానిని

---

♦ సభను ఆపుదలచేసినామను సంగతిని వీరు రహస్యముగ మాట్లాడుకొనినప్పుడు తిలకు గారితో చెప్పినారేమోగాని, బహిరంగముగ సభలో వారికి ప్రకటింపలేదు. అని మితవాదుల వాదన.

బహిరంగముగ వారు ప్రకటింపలేదట! అధ్యక్షుని యెన్నికొను కార్యము ఆపవలసినదని సూచింపను, ఈ విషయమై మాట్లాడుట కనుజ్ఞ యియ్యవలసినదని కోరుచు (నే పంపిన చీటీలోని) సంగతులను సభాధిపతిగారు సభవారికి బహిరంగముగ తెలియజెప్పియుండలేదు నేనాసందర్భమున మాట్లాడుట శాస్త్రసమ్మతముగాదని సభాధిపతిగారు నా ప్రార్థనను త్రోసిపుచ్చిన సంగతికూడ బహిరంగముగ సభలో ఆయన ప్రకటించియుండలేదు. నా చీటీలోని సంగతులను గూర్చి సభవారి నేమియు ప్రశ్నించియుండలేదు! సభవారి యభిప్రాయమేమియో కనుగొనియుండలేదు సభవారి వోట్లను తీసికొనలేదు. ఈ సంగతులన్నియు మన మితవాదులుకూడ ఒప్పుకొని యున్నారు. కాని నే జేసినపనులలో రెండు అశాస్త్రీయచర్యలుగలవని వారు వాదించియున్నారు. (1) సభాధ్యక్షుని యెన్నికొను పనిని ప్రస్తుతము ఆపుదల చేయవలయునను సవరణ గావించుటకును, దీనివిషయమై సభాపీఠమున మాట్లాడుటకును, నా కనుజ్ఞ నీయవలయునని నే కోరుట మొదటితప్పట! (2) ఇట్లుగావింప కూడదనియు, దీని విషయమై ఇప్పుడు సభాపీఠమున మాట్లాడుట అశాస్త్రీయమనియు, సభాపతి ఆజ్ఞాపించినప్పుడు "నేను మాట్లాడుటకు నాకు హక్కుగలదు" అని నేను గట్టిపట్టుబట్టి నిలువబడుట రెండవతప్పట! కనుక యిప్పుడు ఈ రెండుచర్యలుగాని, వీనిలో నే యొక్కచర్యగాని, అశాస్త్రీయమగునా, కాదా? యను విషయమై మనము విచారించవలెను. వీనితోబాటు ఆసందర్భమున సభాపతిగావించిన ప్రతియొక్క చర్యయును శాస్త్రీయమా, అశాస్త్రీయమా యనికూడ విచారించవలెను. ఇవియన్నియు నెంతవరకు శాస్త్రీయమెమో, ఎంతవరకు అశాస్త్రీయమో విచారించవలెను. నేను పంపిన చీటీలోనిసంగతులను తాను విచారించితిననియు, దానిలోని సంగతులు జరుగుటకు వీలులేదనియు సభాపతిగారు శలవిచ్చిరి అదిగాక "మీరిదివరకే దీనివిషయమై తగినంత విరోధించియే యున్నారు; యికమీద విరోధించిన నేమియు ప్రయోజనము లేదు (కావలసినపని యిదివరకే జరిగిపోయినది). సభాకార్యమునకు భంగము గలుగును. గనుక యికమీద మీరు మాట్లాడకూడదు. మీ స్థానమున మీరు కూర్చుండుడు" అని సభాధిపతులు (గోష్‌గారు) నాతో చెప్పిరి.

### జీవముతో కూడుకొనిన సభయే మనకు కావలయును.

ఇకమీద నీ సభాకార్యములు నెరవేర్చుకొనుటకు తగిన మార్గములను మన జాతీయవాదులు ఆరయవలసియున్నది క్రిందటి సంవత్సరము కలకత్తా సభలో జరిగిన యేర్పాటులను పునాదిగా నుంచుకొని దానిమీద సభాకార్యములను కొనసాగిం

చుటకు తగిన త్రోవలను మనమిప్పుడు వెతుకవలెను ప్రాపంచికదృష్టిని చూచిన యెడల, ఆ క్రిందటిసంవత్సరపు తీర్మానములను త్రోసిపుచ్చి సభను వెనుకకు నెట్టుటయే మంచిదని చెప్పవచ్చును. కాని దేశాభివృద్ధి కిది మార్గముకాదు. ప్రభుత్వమువారి మెప్పు వడయుజూచుకొనుట కిది యదను కాదు. ప్రభుత్వమువారిని నిరోధించగల మనలోని ఆత్మశక్తిని ప్రకటించుటకిది తరుణము. అట్టిసమయ మిప్పుడాసన్నమయినది. ప్రభుత్వమువారి చట్టము లెంతక్రూరమైనవైనను, కఠినమైనవైనను, లేక మరియెట్టివైనను, వానికిలొంగి, వానికి భయపడుచు, ఏ ప్రకారము మనము నడచుకొనిన ఆ శిక్షలనుండి తప్పించు కొందుమోయని ప్రవర్తింపుచు ప్రభుత్వమువారిని సంతోషపెట్ట జూచుచు, కాలము గడపుకొనవలసిన సమయమిది కాదు. ఇది మనలోని నిరోధశక్తిని జూపవలసిన సమయము మనలోనుండు (ఆత్మశక్తి) యను అగ్నికణములు చల్లారిపోకుండ గాపాడుటకై తగిన సాధనములను మన జాతీయవాదులు శక్తివంచనలేక అవలంబింపవలసి యున్నారు. వీని నిట్లు కాపాడినయెడల, యీ అగ్నికణములే కాలగతినిబట్టి, కొంతకాలమునకు దగుల్కొని అనివార్యమగు మహాదావాగ్నిగా ప్రజ్వలింపగలవు. (గనుక అంతవరకును యీ యగ్నికణములను చల్లారిపోకుండ కాపాడుకొనుడు) మన జాతీయవాదుల ఏర్పాటులన్నియు ప్రభుత్వము వారెంతవరకు సాగనిచ్చిన అంతవరకే కొనసాగ గలవిగా నుండకూడదు. మన ఏర్పాటులు జీవముగలవై యుండవలెను. ఎట్టికష్టములపాలైనను, ఎట్టి విపరీతపరిస్థితులు సంభవించినను, ఎంత నిరుత్సాహము గలిగినను, ప్రభుత్వము వారెన్ని నిర్బంధములు బెట్టినను, వీని నన్నిటిని జయించి యథేచ్ఛగా విజృంభింపగల సజీవమైన సభలనే మనము నిర్మింపవలెను. ఇట్టి క్రొత్తయేర్పాటులను గావించుటకే నేడు జాతీయవాదులమైన మనమిచ్చుట సమావేశమైనసారము.

## దీనికి తగిన మార్గములు సాధనములు

ఈ క్రొత్తయేర్పాటుల గావించు టెట్లు? జాతీయమహాసభకు నేడు గలిగిన యీ భంగపాటువలన దేశమునకు కలుగగల నష్టానష్టములను అప్రమత్తతతో, కనిపెట్టియుండి చూచుటకును, అట్లుకలుగగల నష్టములను నివారించు మార్గముల సూచించుటకును, సాధ్యమైన యెడల తిరిగి రాబోవు సంవత్సర మిచ్చటనైన యీ జాతీయమహాసభను సమావేశపరచుటకు తగిన యేర్పాటుల గావించుటకును మొప్పది యేబదిమంది సభికులు గల కమిటి నొకదాని నేర్పరచుట మిక్కిలి

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—:o:—

## 26. గోపాలకృష్ణగోఖలే నిర్యాణము

---

[ఆన 1915 సం॥ ఫిబ్రవరి నెల 19 తేదీన గోపాలకృష్ణ గోఖలుని మరణము వలన దేశమంతయు చీకటులు గ్రమ్మి, ప్రకృతి సౌందర్యముమాసి, రోదసీకుహరము కళావిహీనమయ్యెను. శ్మశానవాటికయందు శవదహన సమయమున గోఖలుని గూర్చి బాలగంగాధరు డిట్లువిలపించెను. తనను జూచి అచ్చటికివచ్చిన ప్రజలందరును కోలాహలము చేయగా గంగాధరు డిట్లు ప్రారంభించెను.]

ఉత్సాహమున కిది సమయముగాదు. ఇది దుఃఖమున కన్నీరు విడచుచు విలపింపవలసినసమయము. గోఖలుని నిర్యాణమువలన మనకు సంభవించిన తీరని విపత్తునకై మనము దుఃఖింపవలసిన కాలము వచ్చెను ఈ భారతవర్షపు అమూల్యమణి-ఈ మహారాష్ట్రమున కలంకారభూషణము -ఈ దేశసేవకులనాయక రత్నము ఇప్పుడిచ్చటశ్మశానవాటికయందు శాశ్వత విశ్రాంతిని గైకొనుచున్నాడు. మీరందరొకసారి ఆమహాత్మునివంక జూడుడు! చూచి ఆజీవిత మార్గమున ననుష్ఠింప యత్నింపుడు. తన విధుల నెల్ల క్రమముగ, సంతృప్తికరముగ నెరవేర్చుకొని మనల నందరి నిచ్చట దిగవిడచి, గోపాలకృష్ణుడు తనమార్గమునుబట్టి తానేగుచున్నాడు. ఆయనలేని లోపమును మీరెవరైన దీర్పగలరా? ఈ ప్రపంచమున తనకీర్తిని శాశ్వత బ్రహ్మకల్పముగ, చిరస్థాయిగ చేసికొని జయలక్ష్మిచే వరింపబడిన మహావీరునివలె తానేగుచున్నాడు తన జీవితమువంతను మాతృ దేశారాధనకై వినియోగపరచి, మాతృభూమి ఋణమును తీర్చుకొనినానని పరలోకమున సర్వేశ్వరునియెదుట సంతృప్తికరముగ సాక్ష్యము జెప్పగలవాడు ఈమహానీయుడు తప్ప నిప్పు డిచ్చట సమకూడినవారిలో నెవడుగాని, మరియే యితర భారతవర్ష పౌరుడు గాని లేడని నిశ్చయముగ జెప్పనగును. అట్లు తమ నిజవిధులను సంతృప్తికరముగ నెరవేర్చినామని భగవంతునియెదుట ఋజువివ్వగలిగిన అదృష్ట

వంతులు చదివ వారిలో నింతవరకును బహుకొద్దిమంది మాత్రమే గలరు. గోఖలువి నేను చిన్నతనమునుండియు నెరుంగుదును. అతను మొదట సాధారణ మానవుడే. ఈనాందారుడు కాడు. సంస్థానాధిపతి గాడు. మన అందరివలెనే అతడు కూడ సాధారణస్థితిలోనే యుండెను. కేవలము తన మేధాశక్తివలనను ధైర్య సాహసములవలనను సామర్థ్యమువలనను తన కృషివలనను అత నిట్టి ఉచ్ఛదశకు రాగలిగెను. అట్టి గోపాలకృష్ణు డిప్పుడు మనలను దిగనాడి జనుచున్నాడు. కాని మన మనుష్ఠింపవలసిన సన్మార్గముల ననేకములను మనకై యిచటనే విడచి చనుచున్నాడు. మన మందరమును ఆయనయొక్క జీవిత పథమును మాతృకగ మన మనో నయనముల యెదుట నిరంతర ముంచుకొని దానియందే బుద్ధినిలిపి తదేక దీక్షగ కృషిచేసి, ఆయన లేని లోపమును తీర్చుటకై ప్రయత్నింపవలెను. ఇట్లు మన మాయన మార్గమున ననుష్ఠింప ప్రయత్నము చేయుచుండిన యెడల, పరలోకమున నున్న ఈ మహనీయుని యాత్మకు శాంతి గలుగగలదు.



శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 27. గోక్లేనుగూర్చిన పొగడ్త

[అన 1915 సం॥ లో బొంబాయి రాష్ట్రీయసభలో గోపాలకృష్ణ గోఖలేని నిర్యాణమునుగూర్చి తమ యార్తిని దెలుపుకొనుచు గాంచిన తీర్మానమును ఉపపాదింపవలసి వచ్చినపుడు తిలక్ మహాశయుడిట్లు చెప్పియున్నాడు:]

నేనిప్పుడు యీ తీర్మానమును ఉపపాదింపవలసిన యీ పాపిష్టిదినము నాకు సంప్రాప్తించుట నా దురదృష్టముగదా. మొదట గోఖలేని రాజకీయ క్షేత్రమున ప్రవేశింపజేయుటకు కొంతవరకు నేనే కారకుడను. అందువలన యితరులకంటె యీదుఃఖము, యీవిచారము, నన్నె యెక్కువ బాధించుచున్నది. ఈ క్షేత్రముననే యీ కార్య దీక్షా పరతంత్రుడు అత్యధికమగు కృషివలన తన ప్రాణమును గోల్పోయెను (ఈసమయమున అత్యధికమగు మనోవేదనవలన దుఃఖసముద్రమున మునిగిపోయి, కన్నులవెంట శోకబాష్పములు విడచుచు, మాటరాడలేక, ఎట్టకేలకు మాట్లాడుట కుపక్రమించి, హృదయమునుండి దుఃఖతరంగములు పరంపరలుగా వచ్చి తన దేహమునంతయు నిటునటు నూగింప నోటివెంట మాటతొట్రిలుచుండ గంగాధరుండిట్లు మాట్లాడదొడంగెను.) *పైపై సంగతులను మా క్రమము చూచి, జనులు మాయిద్దరికిని యుండు సంబంధమునుగూర్చి విచారించ కూడదు. గోఖ్లేతో కలసి నేను 8 సంవత్సరములు ఫెర్గూసన్ కళాశాలలోపని చేసినాను. ఆయన రాజకీయ జీవితమున ప్రతివిషయమును నాకు తెలియును. ఆయన సుగుణ సంపదను గూర్చిగాని, ఆయన హృదయమునుగూర్చిగాని, అతని దేశభక్తిని, నిష్కళంక హృదయమునుగూర్చిగాని, తాబూనిన కార్యము నెరవేరువరకు నిరంతరము పాటుబడి కృషిచేయుటయందు ఆయనకున్న మనోనిశ్చయమును తనదేశదీక్షను గూర్చిగాని, నాకు తెలిసినట్లుగా యితరుల కెవరికిని తెలియ

* వీరి యిద్దరి రాజకీయ పద్ధతులును పరస్పరవ్యతిరేకములు తిలక్ జాతీయవాదుల నాయకుడు; గోఖ్లే మితవాదులకు నాయకుడు.

జాలదు. ఇటువంటి పుత్రులనేకులు గలదని మన భరతమాత గర్వింపజాలదుగదా! ఇది యంతయు మన దురదృష్టము ఇట్టి సమయములో గోకులునివంటి సత్పుత్రుని మరణము వలన గలిగిన నష్టమును మనము తిరిగి కూడ దీసికొనజాలము. ఇదెంతయు మనకు తీరనినష్టము. అయినను, సాధ్యమైనంతవరకు నట్టి లోపమును పూర్తిజేసికొనుటకై మనమందరమును ప్రయత్నింపవలెను. మీరందరను దీనికై ఎక్కువగ విలపించి ప్రయోజనములేదు. దుఃఖింపవద్దు. ఆగోకులునివలెనే మనము కూడ ప్రవర్తించుటకై పాటుబడుట వీరపురుషలక్షణము. మరణ మందరికిని ధృవమే. బ్రతికిన నాలుగు దినములును మనదేశ (దేశాభ్యుదయమునకై) పాటుబడకూడదా? అందరును గోక్లేవంటి వారు కాజాలరు. అయినను, హిందూదేశస్థులందరును గాజులు తొడిగించుకొని మూల కూర్చొనిన అనువారు కారనుమాట నిశ్చయము. దాదాపు గోక్లేతో సామర్థ్యములో సమానమైనవారిని అనేకులను నే నెరుగుదును. కాని దురదృష్టవశమున, వారికి దేశాభ్యుదయ ప్రాప్తికై గోకులుని కున్నంత తదేకదీక్షయును, త్యాగబుద్ధియును, మొక్కవోని యభిమానమును లేవు. నేనిప్పుడు ప్రతిపాదించు యీ తీర్మానమును గోకులుని మరణమునకై దుఃఖించుచున్న వారికుటుంబమువారికి మన సభికు లందరియొక్క దుఃఖమును తెలుపుచు వారికి కొంత దుఃఖోపశమనము చేయగలదు తమ దుఃఖమును యితరులు కూడ పంచుకొనినందున తమకు కొంత శోక శాంతి గలుగునని మన కందరకును తెలియునుగదా. అయినను నే నీ తీర్మానమును ఉపపాదించుట ముఖ్యముగ అందులకై కాదు. మనమెప్పుడును చింతాక్రాంత హృదయులమై విలపించుచుండినను ప్రయోజనము లేదు. అట్లుచేయుట మన పేలతనమును ప్రపంచమునకు చాటుటయే యగును. గోకులుని మరణమువలన మనకు గలిగిన విచారకరమైన యీ నష్టమును కూడ దీసికొనుటకై మన శక్తివంచనలేక మనమందరము కలిసి ప్రయత్నముచేసి పాటుబడవలయునను తీర్మానమును మీహృదయములలో ధృఢముగ నాటచేసికొనదని మీ యందరను గట్టిగ కోరుచున్నాను ఈ తీర్మానమును మనహృదయములలో చేసికొనవలయునేగాని, (నట్టి కాగితముమీద వ్రాసియుంచిన లాభము లేదు.) అందువలననే యీ మాటలను నే నిప్పుడు ప్రతిపాదించు తీర్మానములో వ్రాసియుండలేదు. ఇకముందు మనమెట్లు పనిచేయవలెనను పద్ధతులనుగూర్చి నేనిప్పుడు ప్రశంసించను. ఎందుకనగా ఒకరిపద్ధతి ఒకరికి సరిపడదు. ఎవరికనుకూలమైన విధమున వారు, ఎవరి శక్తి సామర్థ్యముల ననుసరించి వారు, తమ తమ పద్ధతుల నేర్పాటు గావించుకొందురుగాక. కాని అందరి హృదయములలోను నే చెప్పినప్రకారము ఉద్దేశ్యము మాత్ర మొక్కటియే యైయుండవలెను.

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—— :o: ——

## 28. ఆలీసోదరుల నిర్బంధవాసము

— —

[మహమ్మదాలి, షౌకతాలి యను మహమ్మదీయ సోదరు లిరువురు కలరు. వారు మన చక్రవర్తిగారి శత్రువులతో నుత్తర ప్రత్యుత్తరముల జరుపుచు నేదో సంబంధము కలిగియున్నారను అనుమానముమీద "హిందూదేశ రక్షకశాసనము" అను చట్టము ననుసరించి విచారణ లేకుండగనే వీరిని ఖైదులోనుంచిరి. వారిని విడుదలచేయవలసినదని హిందూదేశస్థు లందరేకమై సర్కారువారిని కోరినను మాంటేంగ్యు మంత్రిగారిని ప్రార్థించినను వారినిద్దరిని విడుదల చేయలేదు. 1917-వ సంవత్సరములో కలకత్తాలో జాతీయ మహాసభ (కాంగ్రెసు) జరిగినప్పుడు వీరి తల్లిగారు ఆసభకు వచ్చెను సభికు లందరును గౌరవపూర్వకముగ లేచి నిలువబడి, ఆమెను ఆహ్వానించిరి సభాధ్యక్షురాలైన శ్రీమతి బీసెంట్కయును శ్రీమతి సరోజినీ దేవియును ఆమెను సభాపీఠముపైకి తీసుకొనివెళ్ళి యుచితాసనమున గూర్చుండ బెట్టిరి. అప్పుడు యీమె కాతిథ్యపూర్వకముగ తిలక్ మహాశయుడొక కొంత యుపన్యసించి, పిమ్మట యీమె పుత్రుల నిరువురను విడుదలచేయవలసినదని ప్రభుత్వమువారిని ప్రార్థించుచు నొక తీర్మానమును ప్రతిపాదించెను. ఆసమయమున తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను:]

ప్రభుత్వమువారికి యీ సోదరు లిరువురియెడ అనుమానము దినక్రమమున పెరిగెను. కనుక వీరిని ముందుగా చెరసాలలో నుంచి పిమ్మట యనుమానమునకు తగిన కారణముల నరసిరి. ఈ దేశబాంధవు లిరువురును "హిందూదేశరక్షణ శాసనము" అను నూతన చట్టము ననుసరించి నిర్బంధవాసమున నుంచబడిరి. ఈశాసనమున కే విధమైన అర్థమును తీసినను తీయవచ్చును. నిరంకుశ ప్రభుత్వాధికారుల కిది నిరాటంకసాధనము ! పోలీసుగూఢచారుల విచారణ ననుసరించి [illegible], దేశశాంతికిని ఎవరియొక్క వలననైనను భంగకరము

కాగలదను అనుమానముండినయెడల పోలీసువారి సాక్ష్యముమీదనే (అట్టిసాక్ష్యము నిజమైనదైనను లేక బనాయింప జేసినదైనను) అట్టివానిని స్వేచ్ఛగా వదలివేయుట దేశక్షేమమునకు హానికరమనియే అధికారవర్గము వారు నిర్ధారణ పరుపవచ్చును. దేశక్షేమమున కేమియో, దానికెట్లు భంగము వాటిల్లునో తెలియపరచవలసిన అగత్యము లేకుండగనే అధికారవర్గమువారు నిర్ధారణ పరుపవచ్చును! పిదప వీరిద్దరిని 1914 సం॥ అక్టోబరు నెలలో నిర్బంధవాసమున నుంచిరి. మహమ్మదాలీని సాధించుటకు గవర్నమెంటువారి కేవిధమున జూచినను సాధ్యపడినది కాదు. అందువలన, "విన్న విచారించకుండనే ఖైదులో నుంచవలెను"ని ప్రభుత్వము వారు కలవిచ్చిరి! నిరంకుశాధికారుల కిదియొక్కటియే గదా సాధ్యమైనమార్గము! నిరంకుశాధికారుల కిది యొక్కటే స్వాధీనమైన శస్త్రము! దీనినే మహమ్మదాలీగారి మీద ప్రయోగించిరి. మహమ్మదాలీని స్వేచ్ఛగా వదలివేసినయెడల దేశశాంతికి భంగము వాటిల్లునని భయపడుట కేమి కారణములు గలవో ప్రకటింపవలసినదని మహమ్మదీయులును, హిందువులును కలిసి సర్కారువారిని ప్రార్థించిరి. కాని సర్కారువారేమియు కారణములను చెప్పియుండలేదు కాని వారిని విడుదలచేయుటకు సమ్మతించి యుండిరి. దానికి తగిన వ్యవహారములు సంవత్సరము పొడుగునను గ్రంథము జరుగుచునే యుండెను. గౌరవనీయులగు మహమ్మదాబాదు రాజాగారును, జిన్నాగారును పలుకుబడిగల తదితరమహమ్మదీయప్రముఖులును మహమ్మదాలీని విడుదలచేసినయెడల దేశమున కేవిధమైన హానియును జరుగనేరదని హామీపడుటకు సంసిద్ధులైయుండిరి. దేశమంతటను హిందూ మహమ్మదీయ సంఘముల వారిరువురును వీరికి తోడ్పాటై యుండిరి. వీరిని విడుదల చేసినయెడల హానికలుగదని మహమ్మదీయులుమాత్రమే గాక హిందూదేశస్థులందరును గవర్నమెంటువారికి దృఢముగ నచ్చచెప్పిరి. గవర్నమెంటువారు కొంచెముగ క్రిందిమెట్టునకు దిగిరి కాని పోలీసు గూఢచారడిపార్టుమెంటువారు దీనికి యిష్టపడలేదు. (భస్మాసురుడను రాక్షసుడు శివుని యనుగ్రహమున నుద్భవించెను తిరిగి ఆభస్మాసురుడే శివుని భస్మముచేయ యత్నించెను. వీరి నెట్లులైనను శిక్షలో నుంచవలయునని కష్టపడి తగిన సాక్ష్యమును ప్రోగుచేయుటకై యత్నించిన పోలీసు సి ఐ డి. డిపార్టుమెంటువారు యీ భస్మాసురిని వంటివారే. వారికి సాక్ష్యము దొరుకలేదు. కనుక గవర్నమెంటు వారు వీరిద్దరిని విడుదలచేయుటకు సిద్ధపడిరి; హామీ కావలయునని కోరిరి. తాము పరలోకమున భగవంతునియందును, యీలోకమున ప్రభుత్వమువారియెడలను భక్తియుతులమై యున్నామని యిద్దరివద్దనుండియు ప్రమాణములు గైకొనబడినవి. రాజభక్తి యుండినయెడల తమ స్వమతమునందు పట్టుదలయు భక్తియు నుండకూడదా?

ఈరెండిటికిని వైరుధ్యమేమియులేదు. ఈసిద్ధాంతమునే రెండువేల సంవత్సరముల క్రిందట ఏసుక్రీస్తు బోధించియున్నాడని బైబిలుగ్రంథము చాటుచున్నదిగదా! క్రైస్తవమతగ్రంథము లొప్పుకొనియున్న సిద్ధాంతమునే యీ క్రైస్తవాధికార వర్గమువారేల యీ మహమ్మదీయ సోదరులయెడ వర్తింపచేసి యుండలేదో దుర్గ్రాహ్యము. పోలీసు (సి. ఐ. డి.) వారికొక ఉత్తరము దొరికినదట! ఆయుత్తరమును మహమ్మదాలీ షౌకతాలి గార్లు వ్రాసిరని తలంపబడుచున్నది! ఆయుత్తరములో వీరు మన చక్రవర్తిగారి శత్రువులతో జేయుచున్న కొన్ని రహస్య కుట్రాలోచనలను గూర్చి వీరికిని ఢిల్లీలోనున్న ఒకమహమ్మదీయ మతగురువునకును జరుగుచున్నట్లెంచబడిన ఉత్తర ప్రత్యుత్తరములకు సంబంధించిన సంగతులున్నవట! ఇత్యాది విషయములు నాకు తెలియవచ్చినవి. వీనినిప్పు డిచ్చట చెప్పుటకు నేనే యుత్తరవాదిని. అసలు యీ వుత్తరము పోలీసువారి కెట్లుచేరినది? నిర్బంధవాసమున నుంచబడిన మనుష్యుడు ప్రత్యేక (కెన్నార్డు అను) అధికారిద్వారా తప్ప మరి యితరవిధమున, బయటి మనుష్యులతో నుత్తర ప్రత్యుత్తరముల జరుపుటకు వీలే లేదుగద. ఇది పోష్టుద్వారా బోవుచుండగా చింద్వారా ఢిల్లీలమధ్య యీ యుత్తరమును పట్టుకొనియుండవలెను ఈవుత్తరమును వైస్రాయిగారి యెదుటపెట్టిరి. వారీ యుత్తరమును వ్రాసినారా లేదా? యని వీరిద్దరిని గవర్నమెంటువారు అడిగి యుండవలసినది. వ్రాసియుండలేదని వారు చెప్పినట్లయిన అప్పుడు పోలీసువారి సాక్ష్యముమీద వారిని ప్రాసిక్యూషన్ చేసియుండవలసినది. ఈవుత్తరమునుగాని తత్సంబంధమైన యేయుత్తరమునుగాని తాము వ్రాసియుండలేదని వారుచెప్పినట్లు నాకు నమ్మకమైన సమాచారము వచ్చినది. మనమిప్పుడీ తీర్మానమును ఈ సోదరుల తల్లిగారి సమక్షమున నామోదించుచున్నాము. సాధారణమానవులకు తల్లియగుట కంటె నిట్టి వీరపురుషులైన సత్పుత్రులనుగన్న తల్లియగుటయే అత్యుత్తమమైన జన్మ సాఫల్యమని యీ సభవారి యందరి పక్షమునను యీ వీరమాతతో మనవిచేసుకొను చున్నాను. ప్రభుత్వమువారు మీకుచేసిన యిట్టి (యపకృతిని) మరచిపోయి వారిని మన్నింప వలసినదనియు, భారతవర్షీయులెల్లరు మీ ప్రస్తుత దుస్థితికై వగచుచు మీ యెడ నత్యంత సానుభూతిని గలిగియున్నారని యెంచి దుఃఖమునువీడి మన శ్శాంతిని బొందియుండ వలసినదనియు, యీసభికులెల్లర పక్షమునను మిమ్ములను ప్రార్థించుచున్నాను. మరియు నిట్టి వీరమాతల ననేకులను మనదేశమున కనుగ్రహిం చునుగాక యని నే సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. మన కందరకునుండు నిట్టి వాంఛయే ప్రస్తుతస్థితిలో నీయమకు దుఃఖోపశమనము చేసి మనశ్శాంతి నిచ్చుగాక! మీ యందర యనుజ్ఞనుపొంది నేజెప్పు మనస్తాపోపశమన వాక్యము లివియే.

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—:o:—

## 29. జాతీయవిద్య

[1908 సం॥లో ఝాన్సీలో మహారాష్ట్రభాషలో చెప్పిన ఉపన్యాసములోని కొంతభాగము:]

నేనిప్పుడీ సాయంకాలము జాతీయవిద్యనుగూర్చి మాట్లాడెదను. ఇది మనకు క్రొత్తమాట గనుక కొంచెము విప్పి చెప్పవలసియున్నది. వ్రాయను చదువను మాత్రము నేర్చుకొనియుండుట విద్యకాదు. విద్యను సాధించుటకివి ఉపకరణములు మాత్రమే యైయున్నవి మనపూర్వుల యనుభవముల నన్నిటిని చక్కగ మనకు తెలియజేయుగలది మాత్రమే 'విద్య' యనబడును. అది మనకు గ్రంథములద్వారాగాని, లేకమరియేయితర విధముననైగాని లభింపవచ్చును. ప్రతివిషయములోను, ఆయా విషయములకు సంబంధించిన విద్య మనకు అవుసరము. కనుక ప్రతి మనుష్యుడును తన పిల్లలకు విద్య గరపవలయును. నిజముగ విద్యఅక్కరలేని వృత్తియే లేదు. మన పరిశ్రమల నన్నిటిని యితరులు, లాగికొనిపోయినారు. కాని ఆసంగతి మనకేమియు తెలియదు పింగాణీ (చీనామట్టి) తో కుండలనెట్లు చేయవలయునో మన కుమ్మరికి తెలియును. కాని ఆమట్టి నెట్లుజేయుదురో వానికి తెలియదు. కనుక వానివృత్తి పోయినది. ఈవిధముననే మతసంబంధమైన విద్యకూడా మిక్కిలి అవుసరమే. తనమతమును గూర్చి అవంతయు తెలియనపుడు ఆమతమునందతనికి భక్తిశ్రద్ధలు కలిగి "ఇది నామతము" అను అభిమాన మెట్లు పుట్టగలదు? మనలో నీ మతవిద్య లేనందువలన నే క్రైస్తవ పాదరీల (మిషనరీల) మతప్రచారము మనదేశములో నడుగిడుట కొక కారణమైనది. ఇది దేశమంతటను ప్రబలుటకు హేతువైనది. మొన్నమొన్నటివరకు మనకిట్టి (అత్యవుసరమైన మన) మతవిద్యను చెప్పుచున్నారా లేదా యను యోచనయే మనకు కలుగలేదు. (దీనివిషయమై ఆలోచించినవారే లేకపోయిరి) ఇప్పుడిచ్చట కూర్చునియున్న వర్తకులు తమ పిల్లలను తమ మనస్ఫూర్తిగ యీపాఠశాలలకు (స్కూళ్ళకు) పంపుచుండుటలేదు ఎందువలన? వారివర్తకమునకు కావలసినవిద్య నచ్చట చెప్పుచుండుటలేదు. గనుక కొందరు

అసలు పంపనే పంపుచుండుట లేదు. అదిగాక యిప్పటి యీచదువులు చదువుకొన్న కుర్రవాళ్ళు షోకీపురుషులు (నవనాగరికులు)గా మారిపోవుచున్నారు. (కలెక్టరాఫీసులో) గుమాస్తాలగుటయే వారికోరిక! తమతాత తండ్రులు కూర్చుని, తమయావదైశ్వర్యమును భాగ్యమును సంపాదించిన అగల్లాపెట్టెముందర కూర్చుండుట వారికి మిక్కిలి అవమానకరముగానున్నది దీనికంతయూ కారణమేమి? మన కిప్పుడు చెప్పబడువిద్య కేవలము ఒక్కపనికొరకే (గవర్నమెంటునౌకరీకే) పనికివచ్చునదై యున్నది. గవర్నమెంటువారికి గుమాస్తాలు డాక్టరులు, ఇంజనీయరులు కావలసి వచ్చినది. కనుక యిట్టిగుమాస్తాలు మొదలయినవారిని తయారుచేయగల పాఠశాలల నేర్పరచిరి కనుక వీనిలోనుండి బయటకువచ్చిన విద్యార్థులు ముందు గవర్నమెంటు నౌకరీ కొరకే చూచుకొనుచుండిరి. ఇదివరకు (మొదటిరోజులలో) ఏవో 3,4 క్లాసులు ప్యాసయినతోడనే గొప్పఉద్యోగములు జీతములిచ్చెడివారు దానితో ఎట్లో కాలక్షేపము చేయుటకు (జీవనముచేయుటకు) సాధ్యముగా నుండెడిది. ఇప్పుడన్ననో, బహుకష్టమైనది ఏర్పాటకు ఆర్పాటయే గడచుట కష్టముగనున్నది. కనుక యిప్పటికి మనకు సంగతి తెలిసివచ్చినది. మన మింతకాల మింతచదువు చదువుకొనినప్పటికిని తినుటకుతిండి, కట్టుకొనుటకుగుడ్డ సంపాదించుకొన లేనంతటి హీనస్థితికి మనమువచ్చుటకు కారకులము మనముకాదని యిప్పటికి కొంతవరకు బాగుగతెలినది (ఆలోపము మనలో లేదు) ఈలోపము కేవలము మనకు వారనుగ్రహించిన విద్యలోనే వున్నది. కనుక "యీప్రస్తుత విద్యాపద్ధతి నెట్లుమార్చవలయును ?" అను సమస్య మనకు తోచుట స్వభావసిద్ధమైనది. విద్యాశాఖాధికారము మనచేతులలోనే యున్నయెడల తక్షణము దానికి కావలసిన మార్పులను వెంటనే చేసియుండియుందుముగద. ఈశాఖపై మాకధికారమివ్వవలసినదని మనము కోరినాము. మొదట పాఠశాలలో వాచకపుస్తకములను నిర్ణయించు అధికారము మాకివ్వవలయునని కోరినాము. మనలను మంచి పౌరులనుగా చేయగల విద్య మనకత్యవసరమని మనకిప్పుడు బాగుగతట్టుచున్నది. బొంబాయి గవర్నరుగారుకూడా ప్రస్తుత విద్యాపద్ధతిలో మార్పు అవుసరమేయని శలవిచ్చియున్నారు. కాని దీనికై గవర్నమెంటువారివద్ద తగినంత ధనము (ఫండు) లేదట. వీరుచెప్పిన అభ్యంతరము నిజముకావచ్చును, లేక అబద్ధముకావచ్చును. (నిజమో అబద్ధమో నాకు తెలియదు) కాని ఇది ఎంతమాత్రము సహేతుకమని నేతలచను. కాని దీనిలో నిజమైన సంగతి మాత్రమొకటి యున్నది ఏమనగా దీనివిషయమై ప్రభుత్వమువారు విశేషము యోచింపజాలరు. ప్రభుత్వమువారు మనకుమతవిద్య గఱపజాలరు.

అదియు నొకకేంద్రే. ఏలనవగా వారు మన స్వమతస్థులు కారు. మనలో దేశభక్తిని పురిగొల్పగలవిద్యను మనకువారు ప్రసాదించుటలేదు. అమెరికాదేశములో అమెరికాదేశపు స్వాతంత్ర్య ప్రకటననుగూర్చి 5, 6వ తరగతులలోనే పిల్లలకు బాగుగ బోధించెదరు. ఈవిధముగ వారు తమపిల్లలకు దేశభక్తిని మొదటినుండియు పురికొల్పి, రాజకీయవిద్యను చెప్పెదరు. 80, 90 సంవత్సరములక్రిందట ఇంగ్లాండునకును, జర్మనీకిని గలిగిన వర్తకపు పోటీమూలమున జర్మనీ దేశపు పరిశ్రమలన్నియు క్షీణించినవి. వెంటనే జర్మనీ ప్రభుత్వమువారు దేశమందంతటను పారిశ్రామిక శాస్త్రవిద్యను వెదజల్ల ప్రారంభించిరి. కనుక జర్మనీదేశ మిప్పటికి వర్తకవ్యాపారములో యితరదేశములన్నియు తనను చూచి గడగడ వణకునట్లు చేయగల అత్యున్నత స్థానమునకు రాగలిగినది. న్యాయముగా యీపనులను ప్రభుత్వమువారే చేయవలసిన బాధ్యత వారియందున్నది. మనకు మేలుకలుగజేసి మనలను కాపాడుదురను ఉద్దేశ్యముతోడనే మనమందరమును పన్నులనిచ్చుచున్నాము. కాని మనలననదలనుచేసి (కుంటివాండ్లనుగాజేసి) కూర్చొనబెట్టవలెనని ప్రభుత్వమువారు చూచుచున్నారు ♦ ఇంగ్లాండునకును హిందూదేశమునకును వర్తకపు విషయమైన కొన్ని చిక్కులున్నవి. కనుక గవర్నమెంటువారేమియు దీనివిషయమై (గట్టిగ) పనిజేయజాలరు. గ్రామాదులలో తగిన పాఠశాలలు లేనందున, మన గ్రామస్థులు తమ పిల్లలకు తగినంత విద్యను చెప్పింపలేకున్నారు. కనుక మనమీపనికి పూనుకొనవలెను. దీనివిషయమై (దేశములో) చాలా చర్చ జరిగినది. అన్ని విషయములలోను పూర్ణమైన విద్యను గరపుటకు దేశమంతట జాతీయ విద్యాలయములను నెలకొలుపవలెనను సారాంశము తేలినది. అచ్చటచ్చట ప్రైవేటు పాఠశాలలున్నవి.

---

♦. మనపరిశ్రమ లభివృద్ధియైన యెడల యింగ్లాండు వర్తకము చచ్చిపోవును. ఇంగ్లండులో వర్తకులకు నష్టము కలుగుపని చేసినయెడల వారచ్చటి పార్లమెంటును ప్రభుత్వమును నిద్రపోనివ్వరు మంత్రులకు పదభ్రష్టత్వము కలుగును. పార్లమెంటు మెంబర్లకు రెండవ పర్యాయము తిరిగి పార్లమెంటులో అడుగు బెట్టుటకు ఆశలేదు. దానికి తగినవోట్లు ఎన్నిక సమయమున వారికిరావు. యీవర్తకులే అచ్చట పలుకుబడి గలవారు. వోట్లనిచ్చునదివారే. వీరిని చూచిన అందరు వణకు చుందురు. వారిష్టము వచ్చినట్లుగనే మనహిందూదేశమును పరిపాలించవలెను గనుక గవర్నమెంటువారు యీపరిశ్రమల విషయమై గాని, వర్తకవిషయమై గాని, మన కేవిధమైన ఉపకారమును చేయుటకును భయపడెదరు మనను పాలించునది యింగ్లీషు వర్తకులే గాని, యింగ్లీషు రాజనీతిజ్ఞులు కారు

కాని తమకు వచ్చు అగ్రాంటు కాస్తా పోయి పోతుందనే భయముచేత, మనకు కావలసిన విద్యను వారచ్చట చెప్పుచుండుటలేదు. మనవిద్యకు ప్రత్యేకము మన పాఠశాలలే యుండవలెను. మన మీ పనిని స్వార్థత్యాగముతో ప్రారంభింపవలెను. ఇట్టి ప్రయత్నములు దేశమునందంతటను ప్రారంభింపబడియే యున్నవి. హరిద్వారములోనున్న గురుకులాశ్రమము యీపద్ధతుల మీదనే నడుపబడుచున్నది. బీరారు, మద్రాసు రాజధానులు యీవిధమునసే పనికి బూనుకొనినవి. మనమహారాష్ట్రదేశమే యీ విషయములో కొంచెము వెనుకబడి యున్నది. ఇచ్చటకూడ కొద్ది ప్రయత్నములు చేయబడుచున్నవి. గానిఅట్టివానికి మీయందరి ప్రోత్సాహ మవుసరము. ఈపనికి డబ్బుచాల కావలసియున్నది. మీరు దీనియొక్క అవుసరమును, ప్రాముఖ్యమును బాగుగ గ్రహించినయెడల, యిట్టిపనికై బూనికొనియున్న మముబోటివారినందరిని మీరు ఎక్కువగా ప్రోత్సహింతురని నానమ్మకము. ఇంతవరకు దీనిని గురించి మీకు చెప్పినాను. యికముందు యీపాఠశాలలలో నెట్టిజాతీయవిద్య చెప్పబడెనో మీకు తెలియ చెప్పెదను.

ఈ పాఠశాలలో చెప్పు అన్ని విషయములలో మేమెక్కువగా శ్రద్ధతీసికొని, ముఖ్యముగా మొట్టమొదట చెప్పబూనుకొన్నది "మతవిద్య" మనుష్యునికి సుగుణమేర్పడుట కొరకు ప్రాపంచికవిద్య చాలదు. మతవిద్య మిక్కిలి అవుసరము. ఎందుకనగా అత్యున్నతమైన ధర్మసూత్రముల నెరింగిననేగాని, మనము చెడు మార్గము చెంతబోకుండ నుండము. అసర్వేశ్వరుని నిజస్వరూపమును మనకు గోచరింపచేయునది మతమే. తాను చేయు క్రియలవలన మనుష్యుడు దేవత్వము కూడ బడయగలడని చెప్పియున్నారు మనక్రియలవలన మనకు దేవత్వమేసిద్ధింపగలప్పుడు, ఇక వానివలన మనము తెలివిగలవారమై ఎందుకు గొప్పవారము కాకూడదు? మతముఅనేక పోరాటములకు కారణమగునని కొందరనెదరు. కాని పోరాటములు తెచ్చిపెట్టుకొనవలెనని మతములో నెచ్చట జెప్పియున్నది? పరమతములయందు సమానముతో నుండవలసినదనియు బోధించు మతము యీ ప్రపంచమున నేదైన కలదా యని ప్రశ్నించినయెడల, అట్టి మతము ఒక్క హిందూమతమే యని ప్రత్యుత్తరము చెప్పవచ్చును. మన యీ పాఠశాలలో హిందువులకు హిందూమతమును, మహామ్మదీయులకు మహామ్మదీయమతమును బోధింపబడును; పరమతముల యెడ భేదభావముంచక, అట్టి భేదములను మరచిపోయి, వానియెడ సమానమును గలిగి యుండవలయునని కూడ యీ పాఠశాలలో బోధింపబడును

ఈ పాఠశాలలోచేయు రెండవపని యేమనగా :— పరభాషలను నేర్చుకొనవలసిన భారమును తగ్గించుదుము. మన హిందూదేశములో నింతకాలమునుంచి

యున్నను, మహారాష్ట్ర భాషనుగాని, ఏ యితర దేశభాషనుగాని ధారాళముగ రెండుగంటలసేపు మాట్లాడగల యూరోపియను డెవడును లేడు. కాని మన దేశస్థులకు యింగ్లీషు భాషలో తప్పక ఎక్కువగ వ్రాయను చదువను సమర్థత యుండవలెనట! మంచి ఇంగ్లీషు వ్రాయను చదువను నేర్చిననాడే ఈ దినములలో మంచి విద్యావంతుడట! కేవల మొక్క భాషాజ్ఞానమే నిజమైనవిద్య కాజాలదు. పరభాషను తప్పక నేర్చుకొని తీరవలయునని నిర్బంధమొక్క మన యీ హిందూదేశములో తప్ప ప్రపంచమున మరి యెచ్చటను కానరాదు. మనదేశభాషలలో 7,8 సంవత్సరములలో నేర్చుకొన గల విద్యకొరకు మనమిప్పుడు 20, లేక 25 సంవత్సరముల కాలమును వ్యయపరచుచున్నాము. మనమిప్పుడు యింగ్లీషు విద్యను మానివేయుటకు వీలులేదు. కాని దానిని నేర్చుకొనవలయునను నిర్బంధముండుటకు కారణము గన్పట్టదు. మహామ్మదీయుల ఏలుబడిలో పారసీభాషనుకూడ నేర్చుకొనవలసినదని వారే కాని, మీరు దానిని తప్పక చదివి తీరవలయునను నిర్బంధమేమియు పెట్టలేదు అనవుసరముగ కాలము వృథ పుచ్చకుండుటకుగాను మనమీ జాతీయపాఠశాలలో విద్యవంతయు దేశభాషలలోనే చెప్పెదము.

మూడవది పారిశ్రామికవిద్య:— ఇప్పటి పాఠశాలలో నెచ్చటను యీవిద్య చెప్పబడు చుండుటలేదు. ఈ పాఠశాలలలో మనమీ విద్యను, చెప్పెదము ఇది చాల ముఖ్యమైనది. నూరుసంవత్సరముల యీ మధ్యను నిప్పుపుల్ల నెట్లు చేయుదురో మనమెరుగము. షోలాపూరులో గడ్డిలోనుంచి నిప్పుపుల్లలను చేయుచున్నారు. మనదేశములో కావలసినంత గడ్డియున్నది. కనుక యీ పరిశ్రమకు మనము పూనుకొన్నయెడల యితర దేశములనుంచి నిప్పుపుల్లల దిగుమతి చాలవరకు తగ్గును ఈ విధముగనే పంచదార పరిశ్రమ విషయమైకూడ చేయవచ్చును మారిషస్ ద్వీపములో దొరకు చెరుకుగడలకంటె మంచిచెరుకు గడలను మనదేశములో పండించవచ్చును, మారిషస్ ద్వీపములో దొరకు చెరుకు గడలోనుంచి తీయు పంచదారవంటి పంచదారను పునహా చుట్టుపట్లపండు చెరకుగడలలోనుంచి తీయవచ్చునని శాస్త్ర పరిశోధనల వలన కనుగొనబడినది. ఈ ఒక్క పంచదారకొరకై మన హిందూదేశమునుంచి ప్రతిసంవత్సరమును ఆరుకోట్ల రూపాయలు (యితరదేశములకు) పోవుచున్నవి. ఇట్లెందుకు జరుగవలెను? సరే! మనకిక్కడ చెరుకుగడలు దొరకవా? దానిని చేయుటకు కావలసిన యంత్రములు దొరకవా? దీనికి కారణమేమనగా ఆ పరిశ్రమకు తగిన విద్యను చెప్పువారు మన కిచ్చట లేరు. జర్మనీదేశములో యీ విధముగలేదు. పరిశ్రమాభివృద్ధికై జర్మనీలో ప్రత్యేకమొక "పారిశ్రామిక శాఖ" గలదు. దేశములో యేయే పరిశ్రమలు క్షీణించుచున్నవో

యీ డిపార్టుమెంటువారు కనిపెట్టుచుందురు; అట్లైదైనను క్షీణించుచున్నయెడల, వెంటనే దానిని తిరిగి ఉద్ధరించుటకు కావలసిన (ధన) సహాయమును ప్రభుత్వము వారిచేత నిప్పింతురు. మన ఇంగ్లీషుప్రభుత్వమువారు కూడ తమ ఇంగ్లాండు దేశములో నిట్లే తమ పరిశ్రమలకు సహాయము చేసెదరు. కాని మన ప్రభుత్వము వారు మాత్రమిచ్చట ఆ విధముగ చేయుట లేదు. అది పొరపాటువలననైయుండ వచ్చును. లేదా తమకు తెలిసియుండియే యూరకొని యుండవచ్చును. ఏది ఎట్లున్నను, ప్రభుత్వమువా రూరకున్నారని మనము కూడ నోరుమూసికొని కూర్చుండకూడదు. దీనికొరకై మనము ప్రత్యేకముగ పెద్ద పారిశ్రామిక, శాస్త్ర పరిశోధనాశాల నొకదానిని నిర్మించదలచినాము. పంచదారలోనుంచి రమ్మును తీయవచ్చును. ఆ రమ్ములోనుంచి సారాయి తీయవచ్చును. కాని దానికి గవర్నమెంటువారు ఒప్పుకొనరు. కనుక మనకు చవుకగా పంచదార దొరకదు. ప్రతి సంవత్సరము మారిషస్ ద్వీపమునుంచి యిరువదివేల టన్నుల పంచదార దిగుమతి యగుచున్నది. దీని కంతకును కారణము ప్రభుత్వమువా రేర్పాటుచేసిన పద్ధతియే. కాని మనము దీని విషయమై పట్టుబట్టి యెడతెగక వారిని ఒత్తిడి చేసినయెడల యిట్టి స్థితిని వారు తప్పక మార్చివేసెదరు. చదువు వదిలిపెట్టివేసిన యిరువది అయిదు సంవత్సరములకు గాని మాకీ సంగతు లన్నియు బాగుగ తెలిసినవి కావు; కాని యికముందు రాబోవు మన కుర్రవాండ్రందరును యీ సంగతు లన్నిటిని చిన్నప్పుడే తెలిసికొనవలెను.

ఇక నాలుగవ విషయము:— "రాజకీయ సంబంధమైన విద్య" యీ విద్యను మనకు గవర్నమెంటు స్కూళ్ళలో చెప్పుటలేదు. విక్టోరియా రాణీగారు 1858 సంవత్సరములో చేసిన ప్రకటనయే మన హక్కులకు పునాది యని ప్రతి కుర్రవాడును తెలిసికొనవలెను. ఈ సంగతులన్నియు మన కుర్రవాళ్ళకు తెలియకుండ చేయవలయు నని గవర్నమెంటువారు చూచుచున్నారు. మన దాదాభాయి నౌరోజీగారు 50 సంవత్సరములు నిరంతరము ఎడతెగక పాటుపడి తాను తెలిసికొని, యితరులకు తెలియునట్లుగా బుజావుపరచిన, యావద్విషయములను మన యువకులకు చిన్నతనమందే తెలియచెప్పవలెను. (యీ సంగతు లన్నియు చిన్నతనమందే నేర్చుకొనవలెను) ప్రతిసంవత్సరమును మన హిందూదేశమునుంచి 30, 40 కోట్ల రూపాయిలు, మనకు తిరిగి ఏ విధమైన లాభము లేకుండ, పోవుచున్నవి. గనుక మన మందరము భరింపరాని దారిద్ర్యమునందు మునిగిపోయినాము. ఈ సంగతులన్నియు చిన్నతనమందే నేర్చుకొనిన యెడల మనస్సునకు బాగుగ పట్టును. పెద్దవారైన తరువాత సాధ్యముకాదు. కనుక యీ విద్యను మన పాఠ

శాలలలో చేర్పి తీరవలెను. 'ప్రొఫెసరు బిజపూర్కర్' మొదలగు విద్యావంతు లందరును తమ యావచ్ఛక్తిని దీనికై ధారపోయుటకు సంసిద్ధులై నిలిచియున్నారు. విద్యావంతు లందరును తమ విద్యను, తమ అనుభవమును దీనికై వినియోగపరచు చున్నారు. కనుక ధనవంతులందరును దీనికగు ధన సహాయమును చేయవలసి యున్నది ఇది అందరి బాగునకును కావలసినదే. భవిష్యత్సంతతివారు విద్యావంతులై, తమయన్నమును తాము తినగలిగి, మంచివారలై యుండుట మన కందరకును కావలసినదే గద. ఈ పనిని ప్రభుత్వమువారే చేసి యుండినయెడల మన మందరమును సంతోషించెడివారము. వారుచేయలేక పోయినయెడల, మనము చేసికొని తీరవలెను ప్రభుత్వమువారు మన జోలికిరారు. అట్లు వచ్చెనెడల మనము దానిని లక్ష్యము చేయకూడదు సూర్యోదయము గాకుండ నెవ డాపగలడు? అట్లే మనలను నెవడును అపజాలడు మన మింకను పూర్తిగ దరిద్రులము కాలేదు. అమెరికాదేశములో నిట్టిపనిని ఒక్కడే చేయగలిగెను. మన దేశములో నట్లుచేయలేక పోయినయెడల, యీ పనిని మన మందరమును కలిసి చేయుదము. మనము 30 కోట్లమంది ప్రజలమున్నాము. ప్రతి సంవత్సరము ఒక్క షోలాపూరు నుంచి, సారాయికొరకు 5 లక్షల రూపాయిలు పోవుచున్నవి. మీ రందరి పనికి సహాయము చేయలేరా? మనోనిశ్చయమే కావలెను. గవర్నమెంటువారికి కోపము వచ్చిన వచ్చును గాక. మన విధిని నెరవేర్చితీరవలెను. గవర్నమెంటువారు మనలను నిర్బంధపరుపరు. ఎవరును పెళ్ళిళ్లుచేసికొనకూడదని గవర్నమెంటువా రుత్తరువు చేసినయెడల మనము దానికి విధేయుల మయ్యెదమా? విద్యావిషయమై కూడ నట్లే. ఎలుకలు కన్నములు త్రవ్వునని భయపడి యెవ్వడైనను యిల్లు కట్టుకొనుట మానునా? అట్లే గవర్నమెంటువారికి కోపమువచ్చునని భయపడి మన పనిని మానివేయుదుమా? బహుశః ఏదైనా కష్టములు వచ్చినయెడల మన యువకులు వాని నెదుర్కొనుటకు సంసిద్ధులై యుండవలెను. కష్టములకు భయపడుట పురుష లక్షణమును వీడుట యగును. కష్టములే మనకు మేలుచేయును. అవి మనలో ధైర్యమును పురిగొల్పును. కష్టములను ధైర్యముతో నెదుర్కొనగల శక్తిని మనోనిశ్చయమును, మన కవి యిచ్చును. ఏ కష్టములును రానిదే యే దేశమును, యే జాతియును అభివృద్ధి బొందజాలదు మన కీ విద్య రాకపోవుటకు కారణము మనకు స్వరాజ్యము లేదు గనుకనే. కాని మనకు స్వరాజ్యము వచ్చువరకు దీని కొరకై నిరీక్షింప కూడదు. మన మిప్పుడే లేచి మన పనిని ప్రారంభింపవలెను.

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 30 వైశ్యసోదరులారా!

—:o:—

[ఆన 1916-వ సంవత్సరము మే నెలలో అహమ్మదునగరులో జరిగిన మండలసభకు బోయినప్పుడు ఆ యూరిలోని "దూదివర్తకసంఘము" వారు లోకమాన్యున కొక విజ్ఞాపనపత్రము నర్పింపగ దానికి ప్రత్యుత్తరముగ నీ విధమున నుపన్యసించెను ]

వై శ్య సో ద రు లా రా !

మీరు నాకీ విజ్ఞాపన పత్రము నర్పించి, నన్ను గౌరవించినందులకు, నే నెంతయు మీకు కృతజ్ఞత జూపవలసి యున్నది. నేను దేశాభ్యుదయమునకై గావించిన పనుల నెల్ల మీ రెక్కుడుగ వాగ్విలాసము మెరయ బొగడుటవలన నా హృదయము చలింపు చున్నది. ఈ పత్రమును మీ రెట్టి యుద్దేశముతో నా కర్పించి నను యీ సమయమున నా హృదయములో నుండు కొన్ని విషయములను మీ మనస్సులలో పాదుకొనునట్లు చేయ సంకల్పించినాడను. నే నీ యవకాశమును దీనికై వినియోగించెదను. కాని ముందు నేను మీ కొక సంగతిని చెప్పవలసి యున్నది. నే జెప్పబోవు ప్రతి విషయమును నే జేయ సమకట్టిన దేశాభ్యుదయ కార్యమునకే వర్తించును. ఈ మహాత్కార్యము నాకు నప్పగింపబడినది. ఇది నే జేయవలసిన కార్యము "నా కార్యము" అని నే జెప్ప దానియందు నా కెంత బాధ్యత, స్వతంత్రత గలదో, మీకును అట్టి బాధ్యతయే గలదు. దీనిని "మా కార్యము" అని మీరు పిలుచుకొనవచ్చును. కనుక ఈ కార్యసాఫల్యమునకై మీ యందరి సహాయమును, క్రియారూపకమైన సానుభూతియు కావలసియున్నవి. ఎందు కనగా, ఈ భారతవర్షము "నా దేశ" మెట్లయినదో, అవిధముగనే "మీ దేశము" కూడ నైయున్నది. ఈ దేశము నాయొక్కడిదే గాక, మీ యందరిది కూడ నైయున్నది. కనుక యీ దేశము తన వివిధజాతి ప్రజల సహాయమును, సేవను, ఆపేక్షించుచున్నది. దేశాభ్యుదయమునకై యెల్లరును పాటుబడవలసిన యవసర మున్నది. ప్రతివాడును దేశసేవ చేయవలసినదే.

ఆర్యులారా!

మనలోని గొప్ప గొప్ప ప్రతిభావంతులు యీ భారతవర్షము యొక్క * ఆర్థికాభ్యుదయము విషయమై, యోచించి యున్నారు. వీరందరి యోచనల యొక్క సారాంశ మొక్కటే తెలుపుచున్నది ప్రప్రథమమున మనకు "స్వరాజ్యము" అను నీ సర్వసాధారణ హక్కు లేనియెడల, మన భారతవర్ష మభివృద్ధి గాంచనేరదని నేచెప్పగలను. (చప్పట్లు) "స్వరాజ్య" మనగా మన ప్రజల కోరికల ప్రకారము మన దేశములోని రాజ్యాంగ వ్యవహారముల నన్నిటిని, మనమే పాలించుకొను హక్కు. దీనినిగూర్చి నేను మీకు వేరుగ చెప్ప నక్కరలేదు. బ్రిటిషు సామ్రాజ్యముక్రింద నుండు కనడా, ఆష్ట్రేలియా మొదలగు వలసదేశములతోబాటు మనకు కూడ స్వపరిపాలన నిచ్చితీరవలెను. వలసదేశముల వారికంటె మన కేమియు నెక్కువ నక్కరలేదు మన యింటి వ్యవహారములలో, నెవడో యిరుగుపొరుగు వాడువచ్చి చెప్పిన ప్రకారము చేయము గద; అట్లే పబ్లికు వ్యవహారములలో కూడ నెవడో చెప్పినట్లు చేయకూడదు.

పబ్లికు వ్యవహారముల నన్నిటిని ప్రజాభిప్రాయానుకూలముగ నెరవేర్పవలసి యున్నది. దేశప్రజలయొక్క మంచి చెడ్డలను విచారించి, వారికి సౌఖ్యము నొడగూర్చుటయే ప్రభుత్వముయొక్క ముఖ్య కార్యము. దీనికొరకే ప్రభుత్వ మేర్పడినది. ఇది ప్రభుత్వము వారు నెరవేర్పవలసిన ప్రాథమికధర్మము. ప్రజలు తమ కోర్కెలను నెరవేర్చుకొనగలుగుటకు ప్రభుత్వస్థానమునవారికిపలుకుబడియు, తగిన అధికారమును లేనిదే, యీధర్మము సంతృప్తికరముగ నెరవేరజాలదు. రాజ్యపాలనము మన ప్రజల యిష్టప్రకారము నడపుటకు మనకు తగినంత రాజకీయాధికారము లేమిచే మన కోరికలన్నియు నట్లే నిలచియున్నవి; మన కష్టములన్నియు నట్లే యున్నవి. దీని కిదియే కారణము. మన జాతీయాభ్యుదయమున కిదియే కొఱంత. మన కీ రాజకీయాధికారము లేకపోవుట యొక్కటియే పెద్దకొఱత. ఇదియే మన పురోగమనమునకు పెద్దయాటంకము. మన జిల్లాలో నొక రైలుమార్గము వేసికొనవలెనని మనకు కోరిక యుండవచ్చును; క్రొత్తక్రొత్త పరిశ్రమలను స్థాపింప మనము కుతూహలపడవచ్చును; త్రాగుబోతుతన మను నీ దురాచారమును మనము తొలగింప గోరవచ్చును; ఇట్టి కార్యముల నెన్నియో గావింపవలయునని మనకు కోర్కె యుండవచ్చును; కాని వీనిని నెరవేర్చువారెవరు? ఇట్టి

* డబ్బు లేక ధనమునకు సంబంధించిన అభివృద్ధి; అనగా ప్రజలందరును భాగ్యవంతులుగ నుండుట.

గొంతెమ్మకోర్కెలు కోరినంతమాత్రముచేత నవి సఫలత నొందజాలవు. వీనిని క్రియారూపమున నెరవేర్పగలుగుటకు మనకు రాజకీయాధికార ముండవలెను. "మీకు రాజకీయాధికార మెందుకు ? త్రాగుడును మాన్పింప దలచినయెడల మీరు పోయి త్రాగవద్దని ప్రజలకు బోధింపరాదా ? ప్రజలకు మంచిమాటలతో సలహా నివ్వరాదా ?" యని కొందరందరు. దుర్మార్గులను త్రాగుబోతుతనము నుండి మాన్పించుట వట్టి మాటలచేత నెరవేరు పనికాదు. వట్టిమాటలచేతనే యీ కార్యములు నెరవేరునెడల రాజ్యపాలనాభార మెంతయును తగ్గిపోవును ; రాజ్యమును పాలించుట బహు తేలిక యగును. అట్లయిన నిక ప్రభుత్వ మెందులకు ? ప్రజలు యభివృద్ధికి పనికివచ్చు సంస్కారణములను గావించుటకే ప్రభుత్వ మనున దొకటి యేర్పడి యున్నది. ఇది ప్రభుత్వముయొక్క మూల ధర్మము. 'మీ దూది దళారుల సంఘముయొక్క ముఖ్యోద్దేశమేమి ? దేశమును భాగ్యవంతముగ జేయుటయే మీ సంఘముయొక్క ముఖ్యోద్దేశమై యుండవలెను దేశభాగ్యమును మీ రేమైన వృద్ధి నొందింపుచున్నారా ? * అది లేకపోగా, పైగా మీ రందరును పరదేశ వర్తకులు భాగ్యమును పెంపొందించుచున్నారు. కాని, మనకు స్వరాజ్యము వచ్చినప్పుడు, మన స్వదేశపరిశ్రమలను, వర్తకమును యెక్కువ ప్రోత్సాహపరచుటకు అనుకూలమైన యేర్పాటులను గావించెదము. ప్రస్తుతరాజ్యపాలనా పద్ధతిలో నిట్టి యేర్పాటు లేమియును లేవు. మన పరిశ్రమలును, వర్తకమును అభివృద్ధి నొందుటకు యిప్పటి రాజ్యపద్ధతిలో అవకాశమే లేదు. కనుక రాజ్యపాలనలో మనకు కావలసిన మార్పులను చేయు టెంతయు నవుసరమై యున్నది సర్వవిధములచేతను మనము చట్టసమ్మతముగనే యీ మార్పులను గావింపవలసి యున్నది. "ప్రభుత్వము వారు దయాధర్మబిచ్చముగ. మీ కనుగ్రహించు దానితో మీరుసంతృప్తి జెందియుండ

* మనదేశములో పండిన దూదిని మన దేశములోనె నూలుగ వడకి, యిచ్చటనే బట్టలు నేయుటకు యిప్పుడు వీలులేదు.. ఈ పండిన దూదిని సీమదేశమున కెగుమతిచేసి, అచ్చట యంత్రములద్వారా నూలుగ వడకించి, బట్టలను నేయించి, మనము వాడుకొనవలసివచ్చుచున్నది. కనుక దానిలోని లాభ మంతయును విదేశ వ్యాపారస్థులకే బోవుచున్నది. స్వరాజ్యము వచ్చినయెడల మన దూదిని యితర దేశముల కెగుమతిచేయకుండ, నిచ్చటనే నూలుగ వడకి, యిచ్చటనే బట్టలను నేసి, ఆ లాభమును మనమే పొందుదుము. స్వరాజ్యము లేని లోపముచేత, అధికారము మన చేతులలో లేని కారణముచేత, మన మిప్పు డట్లు చేయుటకు వీలులేకున్నది.

రాదా ?" యని కొందరందురు. ఇది యంతయు కేవలము అసందర్భముగ నాకు గాన్పించుచున్నది. అనుదిన ప్రవర్ధమానమగుచుండు ప్రజల వాంఛలను దీర్చుటయే ప్రభుత్వముయొక్క ప్రథమ విధి యని నా మతము. చక్రవర్తిగారి యెడలను ప్రభుత్వము ఎడలను నెరవేర్పవలసిన ధర్మములు మన ప్రజలకున్నట్లులనే, ప్రజలమైన మనయెడ నెరవేర్పవలసిన ధర్మములు మనల నేలు చక్రవర్తికిని ప్రభుత్వము వారికిని గలవు. మనయెడ కొన్నిధర్మముల నెరవేర్పవలసిన బాధ్యత నిజముగ వారి మీద గలదు. నిజమే, గవర్నమెంటువారు రైళ్లను వేసిరి. పోస్టు, టెల్లిగ్రాపులను యేర్పాటు జేసిరి. కాలువలు త్రవ్వించిరి. రోడ్లువేసిరి కాని నే జెప్పునది యింకొకటిగలదు; వారిదివరలో జేసినవానితో మనము తృప్తినొంది యూరకొనకూడదు. వారింతకంటె యింకను యెక్కువ పనులను గావించి యుండవలసినది. ఇది నా యొక్క ముఖ్యమైన వాదము. ప్రభుత్వమువారు చాలకాలము క్రిందటనే మనకు స్వపరిపాలనా కార్యము నుపదేశించి యుండవలసినది. ప్రభుత్వముపెడ అసహ్యమును, నిరసనభావమును మనము ప్రజలలో పుట్టించుచున్నామని కొందరు మనమీద నిందమోపెదరు. ప్రజలకు ప్రభుత్వము పెడ అసహ్యము పుట్టించునది మన ప్రతిపక్షులే గాని, మనము కాము. తమ స్వధర్మము నాచరింపవలసిన దని మనము ప్రభుత్వమువారిని కోరుచున్నాము మన ప్రతిపక్షు లన్ననో, మన మిచ్చు యీ సలహాకు అడ్డమువచ్చుచున్నారు మనము స్వరాజ్యమును కోరుచున్నప్పుడు, బ్రిటిషు సామ్రాజ్యమునకు భక్తులమయియే యుందు మని ముఖ్యముగ నొక్కి చెప్పుచున్నాము. మనయొక్క స్వరాజ్యము బ్రిటిషు సామ్రాజ్యాంతర్గత మయియే యుండునని మనము స్పష్టముగ చెప్పుచున్నాము. ప్రస్తుతపరిపాలనా పద్ధతిలో శాస్త్రానుసారముగ కొన్ని యవుసరములైన మంచి మార్పులను గావింపవలసిన దని మనము కోరుచున్నాము. మనకు కావలసిన మార్పుల నన్నిటిని సమకూర్చి, యొకబిల్లుగ నేర్పాటుచేసి, యా బిల్లును పార్లమెంటు వారి యెదుట పెట్టదలచుకొన్నాము. ఇదంతయు స్పష్టముగ గాన్పించు చుండగ, దీనిలో ననుమానమున కేమైన సందు గలదా ? మన మేమైన ఘోరపాప మాచరించుచున్నామా ? నేరము చేయుచున్నామా ? మన మట్టింత మాత్రమును చేయుటలేదని నే నొక్కి వక్కాణించుచున్నాను. సామ్రాజ్యాధికార మంతయును బ్రిటిషువారి చేతులలోనే యుండనిండు. బ్రిటిషు సింహాసనమునకు మేము భక్తులమయియే యుందుము. కాని మే మడుగునది మాత్ర మొక్కటియే; భారతవర్ష ఆంతరంగిక రాజ్యపాలనావ్యవహారముల నన్నిటిని మా చేతులలోనే పెట్టవలెను మేము కోరున దిది. దేవాలయములోని దేవుని విగ్రహమును (మూలవిరాట్టును) మార్చివేయవలయు నని మాకు

ఉద్దేశము లేదు. అర్చకులు (పూజారులు) మారిపోవలెనే గాని, దేవుడు మార్చనక్కఱలేదని, మన కపర్ది గారు మృదుమధురముగ, సమయస్ఫూర్తిగ, శెల విచ్చియున్నారు (చప్పట్లు)

## స్వరాజ్యముయొక్క ముఖ్యసారాంశము.

మన మందరమును బాగుపడి యభివృద్ధిలో నుండవలెననిమన చక్రవర్తి గారి కోరిక. కాని వారి కోర్కె యేల నెరవేరలేదు ? యీ యధికారవర్గము వారి రాజ్యపాలనా పద్ధతి మూలముననే వారి కోర్కె కొనసాగలేదు. ప్రభుత్వమువారు గావించు ప్రతికార్యములోను వారు ప్రజలకు ఉత్తరవాదులై యుండవలెను. అనగా ప్రజలు కోరు ప్రతిదానికిని ప్రభుత్వమువారు జవాబు (లేక ప్రత్యుత్తరము) చెప్పి తీరవలెను. కాని యిప్పటిపద్ధతి యిట్లులేదు; ప్రభుత్వమువారు ప్రజలకు జవాబు చెప్పుట యనునది లేనేలేదు. కనుక యిట్టి జవాబుదారీ లేని పరిపాలన వెంటనే అంతమొంది తీరవలెను. యిట్టిపద్ధతి యికముందు సాగకూడదు (చప్పట్లు) మేము బ్రిటిషు సింహాసనమునకు భక్తులమై యుండగోరుచున్నాము ; మరియు, యీ యధికార వర్గమువారు ప్రజలకు ఉత్తరవాదులై యుండవలెనని కూడ కోరుచున్నాము. (అనగా ప్రజలకు ప్రతి విషయములోను సంజాయిషీ లేక జబాబు చెప్పితీరవలెను.). మనము గోరు స్వరాజ్యముయొక్క ముఖ్యసారాంశ మిదియే. మన స్వరాజ్యమున కిదియే విశదమైన యర్థము. మన కిట్టి స్వరాజ్యార్హత గలదని ఋజువు పరచుటకును, ఈ మహాసామ్రాజ్యమునకు జెందిన స్వచ్ఛంద పౌరులకుండవలసిన హక్కు గౌరవములు మనకు కూడ నుండి తీరవలయునని దెల్పుటకును, మన మీ తరుణమున మన పాలకుల కనేకవిధముల హృదయపూర్వకముగను సంతోష పూర్వకముగను సహాయ మొనర్చియున్నాము. మనకు ప్రియతమమైనట్టి, సన్నిహిత బంధుల నెల్ల రణరంగమున కంపి, వారి హృదయ శోణితముచే రణభూమిని తడిపివేసినారము. మన మీ విధముగ మన రాజభక్తిని లోకమునకు చాటినారము. తన రాజభక్తిని దెల్పుట కెవడైనను యింతకంటె యెక్కువ జేయగలడా ? కనడా, ఆస్ట్రేలియా మొదలగు వలస రాజ్యముల వారికంటె మేము రాజభక్తియందేమి, పరస్పరము సహాయము గావించుటయందేమి, ధైర్యసాహసాది వీరపురుషోచిత సుగుణసంపదయందేమి, నాగరికతయందేమి, అంతయెక్కువ గాకపోయినను, తుదకు వారితో సమానుల మయినయే యున్నప్పుడు, మేముగోరు న్యాయసమ్మతమైన యీ పరిపాలనా గౌరవమును, మా కేల

యొసంగరు; మాకు లేకుండ నేల జేసెదరు? తమ వ్యవహారములను తామే వ్యవహరించుకొని, పాలించుకొను అధికారమును పరదేశస్థుల కొసంగి, మా కేల యొసంగరు? మమ్ముల నేల శిశుప్రాయులుగా జూచెదరు? మమ్ముల నిక మీద నిట్లే చూచినట్లయిన, మే మొప్పుకొనము. (చప్పట్లు.) ఇట్టి పద్ధతిని యిక మీద మేము సాగనియ్యము. ఇది మా దృఢసంకల్పము (చప్పట్లు) సర్వసాధారణమైన యీ స్వచ్ఛంద పౌరసత్వ హక్కులను మన కనుగ్రహించిన గాని మన కీ నిరాధారస్థితి యంతరింప దని, మన భారత పితామహుడు స్పష్టముగ తెలియబల్కి యున్నాడు మన యనుభవమును బట్టియు, ప్రకృతిశాస్త్ర ప్రమాణములను బట్టియు, నిట్టి నిర్ధారణయే సత్యమని తేలుచున్నది స్వాతంత్ర్యము లేనిదే యే జాతియు, వీర్యవంతము కానేరదు. మన యదృష్టవశమున మనకు మంచిదినములు వచ్చుచున్నవి తూర్పువైపున ఆకాశము నిర్మలముగ నున్నది అరుణకాంతులు ఉదయింపబోవు సూర్యుని తేజోమూర్తిని వెల్లగక్కుచున్నవి. సామ్రాజ్యాంతర్భాగము లన్నిటిని బలపరచి, యితరుల ప్రమేయము లేకుండ, యిక వేనియంతట యవి, తమ వ్యవహారములను తామే జూచుకొని, తమ తమ గృహకృత్యములను తామే నెరవేర్చుకొనుచుండునట్లు చేయు టెంతయు సామ్రాజ్యమునకు శ్రేయోదాయక మని, రాను రాను, బ్రిటిషు ప్రజల మనస్సుల కిప్పుడు గాఢముగ నాటుచున్నది; వా రిప్పు డిట్లు గ్రహించు టెంతయు ఆనందదాయకము సామ్రాజ్యాంతర్భాగము లైన రాష్ట్రముల బలమే సామ్రాజ్యబల మని వా రిప్పుడు గ్రహించినారు. బ్రిటిషు ప్రజ లిప్పుడు మనయెడ సానుభూతిని జూపుచున్నారు. మన మీ మంచియనుకూలమైన యవకాశమును పోనివ్వకుండ, వినియోగపరచుకొనవలెను. మనము వారితో స్నేహభావమున వర్తింపుచు, వారి సానుభూతి మరింత గాఢమగునట్లు గావింపవలెను. ఇట్టి మంచి, యత్యద్భుత మైన యవకాశము మనకు తిరిగి నూరు సంవత్సరములకైనను రాదు. ఈ యవకాశమును మీరు మీ చేతులలో నుండి జారిపోనిచ్చెదరా? లేక పదుముల బిగించి, "మా హక్కులను మా కిచ్చి తీరవలె నని దృఢసంకల్పముతో ప్రభుత్వమువారికి వత్తిడి కలుగజేసెదరా? మీ యందరి దృఢసంకల్పమే మన కిప్పుడు కావలసినది. "రాజకీయాధికారమును, హక్కులను మేము సంపాదించి తీరుదుము, స్వరాజ్యమును పొంది తీరుదుము. వీనిని సంపాదించువరకు మేము నిద్దురపోము" అని మీరు ప్రతిజ్ఞచాల్పవలెను. ఈ ప్రతిజ్ఞయే మీ మనస్సులలో నెల్లప్పుడును కలచుచుండవలెను; మీ మనస్సుల కిది తప్ప వేరే యాందోళన యుండకూడదు. తక్కిన కోర్కెలన్నియు దీని ముందు అదృశ్యమై పోవలెను. రాత్రింబవళ్లు మీరు స్వరాజ్యమును గూర్చియే

యోచింపుచుండవలెను. మేల్కొని యున్నప్పుడు దీని విషయమై మీరు దీర్ఘముగ యోచింపుచుండవలెను; నిద్రింపుచున్నప్పుడు సైతము దీనిని గూర్చియే కలలగనుచుండవలెను. దీనిని గూర్చియే కలవరింపుచుండవలెను; దీనినిగూర్చియే యున్మత్తులవలె, పిచ్చివారివలె. యేకధోరణిగ చింతింపుచుండవలెను; (మనస్సున కీధోరణి తప్ప వేరు ధోరణి యుండనే కూడదు). మేము క్రిందటినెల బెల్గాములో 'స్వరాజ్యసమితి' నొకదానిని స్థాపించినాము. దీనియొక్క పరమలక్ష్యము స్వరాజ్యప్రాప్తికై కృషిసల్పుటయే చెన్నపురి ప్రజలు కూడ నిట్టి సమితిని నెలకొలుపు నుద్దేశములో నున్నారు. ఈ పద్ధతుల ననుసరించియే జాతీయమహాసభ కూడ నొక చిత్తుతీర్మానమును సిద్ధము చేయుచున్నది. కనుక మీ శక్త్యానుసారము మీ రందరును మా యీ ప్రయత్నములకు దోడ్పడుదురు గాక యని మిమ్ములను ప్రార్థింపుచున్నాను మీ రందరును దీనికి సాయపడి నట్లయిన, స్వరాజ్యసంపాదనకై మనము గావించు కృషి యంతయు జయప్రదముగా గల దని నా నిశ్చయాభిప్రాయము. (చాలసేపువరకు చప్పట్లు).

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 31. పైసాఫండు

[అన 1915 వ సం॥ అక్టోబరునెల 15-వ తేదీన బొంబాయిలో మాధవ బాగ్‌లో నిచ్చిన యుపన్యాసము]

నేనిప్పుడు పైసాఫండుయొక్క ముఖ్యలక్షణములను గూర్చి మాట్లాడుటకై మీ యెదుట నిలిచియున్నాను కాని ముందు మీకు కొన్ని విషయములను క్లుప్తముగ చెప్పవలసి యున్నది. ఇదివరకే పైసాఫండు యేయే కార్యములను, స్వల్పముగనైనను చేయ గలిగినది? యేయే కష్టముల నిది యనుభవింపవలసి వచ్చెను? ముందు మన కిది యేయే మంచిమార్గములను జూప గలిగినది? ఈ విషయముల నెల్ల ముందు క్లుప్తముగ విచారింపవలెను ఆర్యులారా! పైసాఫండన నేమియో మీకు నేను వేరే చెప్పనక్కరలేదు దాని యర్థమెల్లరకు తెల్లముయియే యున్నది ఇది ప్రజ లెల్లరు తమంతట తామే, యనన్య ప్రేరితముగ, సమర్పించిన చందాలవల్ల ప్రోగయిన సొమ్ము. పైసాకు (మూడుదమ్మిడీలకు) తక్కువ గాకుండ చందాల నివ్వవలెనని దీని కొక నియామక మున్నది ఈ "పైసాఫండు" అనుమాటలోని సొగసంతయు దేనిలో నున్నది? 'పైసా' యనుమాటలో లేదు; 'ఫండు' అనుమాటలోను లేదు. దీనిలో నుండు సొగసంతయు ఆరెండుమాటల మధ్యనులోపించిన వొకానొక పదములో నున్నది. కనుక దీనిని "మధ్యమపదలోపి సమాసమ"ని చెప్పవచ్చును. (అమధ్యను లోపించిన పదమేమి?) మనయీమహారాష్ట్ర దేశములోను, తదితర ప్రాంతముల లోను ప్రజలీఫండు నేవిధముగ (సెంతఉత్సాహముతో, సెట్టిదీక్షతో) వసూలు చేసిరో దానినిమీరు గుర్తించిన యెడల, పైనలోపించినవని చెప్పినపదములను మీరే పూర్తి చేసికొనవచ్చును.

పది సంవత్సరములనుండి, యేటేట, వసూలైన మొత్తమిప్పటికి సుమారు 50,60, వేల రూపాయలైనది. కాని బొంబయివంటి యీపెద్దపట్టణమునకీ మొత్త మొక గొప్పదియా? మనమంతగ చెప్పుకొనవలసినంత విశేషమేమియు నిందులేదు. కావలెనంటే, బొంబయివంటి యీ గొప్పపట్టణములో, యేపెద్దవర్తకుడైనను,

ప్రజోపయోగార్థమై యేకార్యమునకైనను యింతకంటె నెక్కువ సొమ్మునే యీయగలడు. నేటి సభకధిపతులగు మన మాననీయులగు మన మోహనదాస్ రామ్‌జీ గారు తమయింటిలో నేదైన వివాహము వచ్చినయెడల, వారు దానికై యింతకంటె యెక్కువ సొమ్మునే వ్యయపరచెదరని చెప్పిన నది అతిశయోక్తి కాజాలదు. దీనితో పోల్చిచూచినట్లయిన మనము వసూలుచేసిన సొమ్మొక సొమ్మే కాదు. ఇంతమాత్రమునకే మేమేదో ఘనకార్యము చేసితిమనియు, మేము దీనికెంతో శ్రమపడితిమనియు, ప్రగల్భములు కొట్టిన యెడల మన గుజరాతీసోదరులు మనలను జూచి నవ్వుదురు. కాని నాయుద్దేశ్యమేమనగ :— 'మన మింతవసూలుచేసితిమా, అంతవసూలు చేసితిమా' యనునది ప్రస్తుతాంశము కాదు. (ఎంతవసూలైన నేమి? మొత్తముతో మనకు పనిలేదు.) దీనిని వసూలుచేయుటలో ప్రజలుచూపినశక్తి, స్వార్థత్యాగబుద్ధి, మహారాష్ట్రప్రజలెల్లరు జూపిన గాఢ దేశాభిమానము—యివి మనకిప్పుడు కావలసినవి! ఇవి! నాకిప్పుడాశ్చర్యమును గలుగజేసినవి! దీనికిట్టి లక్షణములే యుండవలెను. ఈలక్షణములనే, యీభావములనే మీరందరు నలవరచు కొనవలెనని నాకోరిక.

ఇప్పుడు క్రొత్తగనీయుద్ధము వచ్చినపిమ్మట కాదు. మన తిలకుస్వరాజ్యనిధి ఉద్దేశము గలిగినది. ప్రస్తుతము ప్రపంచమునంతను నాశనమొనర్చుచున్న యీ యుద్ధము వచ్చుటకనేకసంవత్సరములకు పూర్వమే మన మీపైసాఫండును స్థాపించితిమి. అదిగాక, గవర్నమెంటువారీఫండునకేవిధమైన సహాయముగాని ప్రోత్సాహముగాని యనుగ్రహించి యుండలేదు. మొదట నీఫండు నేర్పాటు గావించిన వారి సంకల్పమేమనగ:— పరులసహాయమున కాశింపకుండ, తమ స్వప్రయోజకత్వము వలన తమ స్వకృషివలన, ప్రజలేదైన నొక కార్యమును చేయగలరా లేరాయని పరీక్షించుటకై దీని నేర్పరచిరి. ఈచందాలద్వారా మనము మొట్టమొదట కనీసము 500 రూపాయలైనను ప్రోగుచేయ గలిగినయెడల, పిమ్మట దీని నింకను వృద్ధిపరచి, కృషిచేసి, క్రమముగ నెక్కువ మొత్తముల ప్రోగుచేయవచ్చునను తలంపుతో మొదట దీనిని ప్రారంభించిరి. ఈవిధముగ కష్టపడి పనిచేసినయెడల ఒక్క సంవత్సరములో పైసాపైసా చొప్పున మనదేశములోగల 30 కోట్ల ప్రజలమీద మొత్తము 50 లక్షల రూపాయలను ప్రోగుచేయవచ్చునని నిజముగ కొందరప్పుడూరక లెక్కలను కూడవేసిరి. కాని క్రియకు వచ్చుసరికి యీ లెక్కలన్నియు నిష్ప్రయోజనములగును. ఇవన్నియు పిచ్చికోర్కులని ధృవపడును. కాని, అట్టి కోర్కెలెంతమాత్రము పనికిరావని చెప్పుచున్నానని మీరనుకొనవద్దు. ఏలయన,

మొదట నిట్టి పరిహాసపాత్రములుగ నుండి తుదకు సత్ఫలములనిచ్చిన సంకల్పము లనేకములు గలవు. ఈసంకల్పములే మొదట మన మెన్నడు కలలోనైన యూహింపని సత్ఫలముల నొసంగినవి. పవిత్రవంతమైన యీ కార్యమును శక్తివంచనలేక నత్యుత్సాహముతోడను గాఢాభిమానముతోడను స్వార్థత్యాగబుద్ధితోడను నెరవేర్చుటకు తగిన చాకచక్యముగల స్వచ్ఛంద సేవకులు (Volunteers) కావలెను. ఈపనికవసరమైనది ముఖ్యముగ వారే. మన భాగ్యవశమున మన మహారాష్ట్ర దేశములో నిట్టిస్వార్థత్యాగ దీక్షగలవారికి కొఱతలేదని యిన్నటి యనుభవమును బట్టి మనకు తెలియవచ్చినది. అంతమాత్రముచేత, మన గుజరాతీ సోదరులలో వితరణోదార భావములేదని నేజెప్పను. వారుగావించిన పెద్దపెద్ద దానధర్మముల నొకసారి చూచినచో నిట్టివిభయమునకు తావుండదు. వారి ధర్మబుద్ధిని దెలుపుటకు వారు గావించిన ధర్మములే చాలును. కాని వారివిషయమై యింకొకమాట మాత్రము చెప్పవలసి యున్నది. మనస్వదేశపరిశ్రమల నభివృద్ధిచేయుట మను తలంపుతో తమ యాదాయములో కొంతధనమును ప్రత్యేకము తీసియుంచి మూలధనముగ నేర్పరచుటమను ఉద్దేశమువారి కింకను గలుగలేదు. ధనాఢ్యులయిన మన గుజరాతీ సోదరులు చేయలేని పనిని మన పైసాఫండు వారుచేయగలిగిరి. దీనికై మిక్కిలి స్వార్థత్యాగమును జూపి కృషిసలిపిన దేశసేవకులు చేయగలిగిరి. ఈపైసాఫండు వారు గావించిన స్వల్ప ఉపకారమేమైన నున్నయెడల నదియంతయు నిస్వచ్ఛంద దేశసేవకుల మూలముననే వారు చేయగలిగిరని యెఱుంగవలెను. నిష్కల్మష హృదయముతోడను, తుదవరకు కడతెగని దీక్షతోడను, కృషిచేసినచో యిట్టిసదుద్దేశములు తప్పక నెరవేరి తీరునని ఈ పైసాఫండువారు గావించిన పనినిబట్టి మనము నమ్మకతప్పదు. మొదట చిన్నమొత్తముతో ప్రారంభించినను యిట్టికొద్దిపాటి పరిశ్రమలను జయప్రదముగ కొనసాగింప వచ్చునని ఈ పైసాఫండు మూలమున ధృవపడినది. (జర్మనీ, పారిసు మొదలగు) పరదేశములకుబోయి, అనేక విధములైన పరిశ్రమలలో తరిఫీయతయి వచ్చినవారేమి చెప్పుచున్నారు? వారు చెప్పునదేమనగా:—"మొట్టమొదటనే కనీసము 4,5 లక్షల రూపాయల మూలధనముతో ప్రారంభించిననే గాని యేపరిశ్రమయు (యేవ్యాపారమును) జయప్రదముగ కొనసాగనేరదు; అట్లు జయప్రదముగ కొనసాగునని ఆశపెట్టుకొనవద్దు" అని శలవిచ్చుచున్నారు!

కాని అంతపెద్దమొత్తమెంతమాత్రము అవసరము లేదని మనము స్పష్టముగ ధృవపరచినాము. ఇట్టిపనులకు కావలసినది అంతగా ధనము కానేకాదు. మనలో మంచిసదుద్దేశమును, నిష్కల్మషమైన గాఢాభిమానమును

అత్యంత దేశభక్తియు నున్నచో మూలధనములేని కొరంతను చాలవరకు తీర్పవచ్చును. మన మీకొరతను దీర్పగలమని ఋజువుపరచుటయే యీపైసాఫండుయొక్క ప్రధానోద్దేశము. ఈపైసాఫండుయొక్క ముఖ్యోద్దేశమేమి? సొమ్ము కూడబెట్టుటయా? కాదు, యెంతమాత్రమును కాదు. వర్తకవ్యాపారముచేసి, తద్వారా లాభము దీయుదమను సంకల్పముతో మొదట మనవారీ పైసాఫండును ప్రారంభింపలేదు. లాభము దీయుదమను ఉద్దేశమే మొదటవారికున్న యెడల, వారప్పుడే బొంబయి వర్తకుల వద్దకుబోయి, "అయ్యా! మేమువర్తకము చేయబోవుచున్నాము; మీరందరీ వ్యాపారములో డబ్బు పెట్టుబడి పెట్టండి; దీనిలోవచ్చు లాభమును మీరందరుకూడ పంచుకొనవచ్చును" అని వర్తకులనందరిని ప్రోత్సహించెడివారే. కాని, వర్తకము చేయుదమను ఉద్దేశము వారి మనస్సులలో నప్పుడు పుట్టనేలేదు ఈ పైసాఫండును స్థాపించుటలో మొదట వారిఉద్దేశమేమనగా:— ప్రజలను మొదట తమ నిద్రనుండి మేల్కొలుపవలెను. తరువాత, మనంతట మనము మన కాళ్లమీదనే నిలువబడవలెనని వారికి తెలియజెప్పవలెను. "పరులసహాయ మపేక్షింపకుండ మనంతట మనమే యీకార్యముల నెల్ల నెరవేర్చుకొనవలెను; మనమీపనిని చేయగలము; ఈపనులనెల్ల నెరవేర్పగలశక్తి మనలో నంతర్గర్భితమై దాగియున్నది; ఇట్టిశక్తి మనలో వంశపరంపరానుగతముగ వచ్చుచునేయున్నది. దాని నిప్పుడు పైకి తీసికొనివచ్చి దానిని సద్వినియోగ పరచుకొనవలెను"— అనునిట్టి భావోద్బోధనగావించుటయే యీపైసాఫండువారి పరమ సంకల్పము. మన భరతవర్షముయొక్క మహోత్కృష్టమైన జాతీయస్వత్వమును ప్రజలకు సత్వరముగ దెలియజెప్పి, తద్వారాస్వదేశపరిశ్రమాభివృద్ధికై నూతన పరిశ్రమలు నెలకొల్పుటయే యీపైసాఫండువారి ప్రథమ సంకల్పము. తాను పెట్టినపెట్టుబడిమీద నేమాత్రమైన లాభము దీయుదమని లెక్కలు జూచుకొను వాడు యిట్టి నమ్మకములేని వ్యాపారములో నొకదమ్మిడీయైనను పెట్టుబడిపెట్టడు. ఈవ్యాపారములో లాభమువచ్చునా రాదాయని పరీక్షించుటకై ముందేదో విధముగ ప్రారంభించిన నిట్టివ్యాపారములో పెట్టుబడి పెట్టుట నిజముగ సొమ్మునష్టమే. కాబట్టి, సదాలాభము మీదనే దృష్టి పెట్టుకొనువాడిట్టినమ్మకములేని వ్యాపారములో తనసొమ్మును పెట్టుబడి పెట్టుననిమే మెన్నడాశింపలేదు. ఎట్టికష్టనష్టములు సంభవించినను వాని నన్నిటిని భరించి తీరుదమను దృఢనిశ్చయముతోడనే మొదట నీపైసాఫండు బయలుదేరినది.

ప్రపంచములోనుండు అన్ని దేశములవారికిని, అన్ని ప్రభుత్వములవారికిని, తమతమ స్వదేశపరిశ్రమల గాపాడుకొనుట విధినిర్ణీతమైయున్నది. అధర్మమును

నిర్వహించుటకే మన పైసాఫండు పూనియున్నది. మన పరిశ్రమలను రక్షించుకొనుటకై మన పైసాఫండు వారిప్పుడు వెచ్చింపు మన్నంతధనమును గవర్నమెంటు వారు వెచ్చింపలేరని మీరనుకొనవద్దు. ఈ మొత్తము గవర్నమెంటువారి కొక లెక్క కాదు. వారనేకవ్యాపారముల మీద లక్షలకొలది రూపాయలను వ్యయపరచుచున్నారు. మొన్న నీమధ్యనే గవర్నమెంటు వారొక కమీటీ నేర్పరచిరి. ఎందుకు? మన దేశములో నూతనపరిశ్రమలను ప్రారంభించుట కేమైన వీలుపడునో లేదోయని విచారించుటకు ఇది మనకు మంచిదే. నాకును సంతోషముగనే యున్నది. గవర్నమెంటువా రీపనిని చాలకాలము క్రిందటనే చేసియుండవలసినది. కాని వారు దీనిని బుద్ధిపూర్వకముగ అశ్రద్ధచేసి వదలివేసిరి. వారు అశ్రద్ధగ వదలివేసిన పనినే మన పైసాఫండువారు కొంతవరకు నెరవేర్చిరి. ఇంతమాత్రముచే మేమేదియో ఘనకార్యమొనర్చితిమని మేము ప్రగల్భములు గొట్టుకొనుటలేదు. మేము చేసినపని కొద్దిదైనను, సర్వమును మేమే చేసితిమనిగాని, యిదంతయు మా తెలివితేటలవల్లనే నెరవేరినదిగాని మేమాడంబరములు గొట్టుటలేదు. కాని, మనకున్న యీకొద్దిపాటి సాధనములను విచారించి చూచినయెడల, పైసాఫండువారు గావించినపని యంతతీసి పోయినదని యెవరును అనరు. మన మీవిధముగ పాటుబడుటను జూచి 'మావలన మీకేమిసహాయము గావలెనని గవర్నమెంటువారిప్పుడు మనల నడుగజొచ్చిరి! ఇదియొక గొప్పసంగతి కాదా? ఇది సామాన్యమైన విషయమా? గవర్నమెంటువారు మనకేమి సహాయముచేసినను దానిని మనము సంతోషపూర్వకముగ నందుకొందము. కాని, పరులసహాయ మపేక్షింపకుండ మనంతట మనమే మన మోక్షమునకై పాటుబడ గడంగినచో మనకది యెక్కువ శ్రేయోదాయకమని నానమ్మకము. ఇంతవరకీఫండు విషయమై ప్రజలెట్టి యుత్సాహమును జూపిరో, అట్టి యుత్సాహమునే యికముందుకూడ విడువక జూపుచు వచ్చిన యెడల మనస్వదేశపరిశ్రమ లింతకంటె యెక్కువ వృద్ధిగా గలవని మానమ్మకము. ఈవిధముగ మనము యోచించినయెడల, మన మెంత మొత్తమును వసూలు చేయగలిగితిమని వేరుగ చింతింప నక్కరలేదు. ఎంత మొత్తమైన నొకటియే; పెద్ద మొత్తమును వసూలు చేయగలిగితిమా లేదాయను విషయమంత ముఖ్యమైనది గాదు. ఈవిషయమై మీరందరు నాతోనేకీభవింతురని నానమ్మకము. మన ప్రజలు తమ మోక్షమునకై తామేగట్టిగ ప్రయత్నించినయెడల, తమకున్న తెలివితేటలను శక్తివంచనలేక దేశోపకారార్థమై వినియోగించినయెడల, తాము తప్పక జయముగాంచి తీరుదురను విశ్వాసము ప్రజల మనస్సులలో గాఢముగ నాటుకొనునట్లు చేయవలెను. ప్రజలలో యీనమ్మకము, యీ విశ్వాసము జారిపోకుండ

గట్టిగ కాపాడవలెను. నేను మీయందరికిని గట్టిగ చెప్పదలచుకొన్న దీవిషయమే. ఈపైసాఫండువలన మనము ముఖ్యముగ నేర్చుకొనవలసిన దీవిషయమే.

ఈఫండునకు ఒక్కొక్క రోజు రూపాయిచొప్పున చందానిచ్చుటకంటె, ఆరూపాయి మొత్తమునే అరువదినలువురకలిసి తలకొకపైసా (మూడుదమ్మిడీల) చొప్పున నిచ్చినబాగుండునని నాకోరిక. దీనిలోని ముఖ్యోద్దేశమేమనగ:— ఈ పైసాఫండు యొక్క నిజస్థితిగతులన్నియు సాధ్యమైనంతవరకు ప్రజాసామాన్య మందరికిని బాగుగ తెలియవలెను. కేవలము తమయొక్క మేలుకొరకే గాక తమ మాతృదేశాభివృద్ధికై సైతము తమశక్తికొలదిని సహాయముచేసి, యీ ఫండును తప్పక వృద్ధిపరచి తీరవలెననియు, అట్లుచేయుట తమకు విధ్యుక్త ధర్మమనియు, ప్రజలలో గాఢాభిమానమును పుట్టించవలెను. అట్టి అభిమానము తిరిగి నశింపకుండ దానిని కాపాడవలెను. అట్లయినచో మనఫండున కెప్పుడును లోపముండదని నా నిశ్చితాభిప్రాయము: ఇదెప్పుడును దిక్కులేక నశింపదని నా నమ్మకము. సర్వేశ్వరు డీ ఫండును సదా కాపాడును గాకయని వేడుకొనుచున్నాను. ఒక వేళ నికముం దెప్పుడైన యీ ఫండు నశించు సూచనలు గాన్పించినచో — (పాపము శమించు గాక!)— దీనికి కారణము మహారాష్ట్రుల కార్యశూరత్వమునకు పటుత్వము జారి పోయినదని చెప్పవలసి వచ్చును. (అట్లెప్పుడును కాను కాదని కేకలు). అయ్యా! కాదు కాదని మీరు వట్టి కేకలువేసిన ప్రయోజనములేదు. ఈ భారమునంతను మీరు వహింప వలెను. దీని విషయమై ప్రజలలో బుట్టిన గాఢాభిమానమును పోకుండ పట్టియుంచు బాధ్యతను మీరు వహింపవలెను. ఈ సంగతిని మాత్రము మీరు మరచిపోకూడదు ఈఫండు విషయమై, అతి చాకచక్యముతో, శక్తివంచనలేక పాటుబడుటకు మీరందరు సిద్ధముగ నున్నారని నేను నిశ్చయము చేసికొనవచ్చునా? ("ఆ! చేసికొనవచ్చును, చేసికొనవచ్చును," అని కేకలు).

మన మీ పైసాఫండును స్వదేశపరిశ్రమల నభివృద్ధి పరచుటకై స్థాపించితిమో, లేక మన మనస్సులలో నేవియో రాచకీయ సంబంధమగు నితర యుద్దేశములను పెట్టుకొని, వానిని గప్పిపుచ్చుటకై పైకిమాత్ర మీ మిషను పన్నితిమో గ్రహింపజాలక చాల కాలమువరకు గవర్నమెంటువారు మనయెడల తగని యనుమానమును వహించి వర్తించిరి. దీనిలోని నిజానిజములను వారు గ్రహింపలేక పోయిరి. మనయుద్యమము యొక్క నిజోద్దేశముల విషయమై వారి కెంతమాత్రమును నమ్మకములేక, ఒకనాడు, అకస్మికముగ, నెవరికి తెలియకుండ, మా పైసా ఫండు ఆఫీసులోనికివచ్చి, వారు మా లెక్కల నన్నిటిని బహుసూక్ష్మముగ పరిశో

ధించి చూచిరి. కాని, వానిలో వారి కే విధమైన లోపమును గాన్పింపలేదు. అది గాక, మేమీ వ్యాపారమునంతను చక్కఁగ తెలివితేటలతోను, అతి సమర్థతతోను నిర్వహింపుచుంటిమని వాకీతనిఖీ వలన పూర్ణముగ గ్రహింపగలిగిరి. దీనితో వారి కిదివరకున్న యనుమానము లన్నియు పూర్తిగ తొలఁగిపోయెను. కాని, అయ్యా! మనమింత మాత్రము చేత ఉబ్బితబ్బిబ్బులుగా నక్కఱలేదు. ఇదివరకంటె కాల మిప్పుడు మంచిదిగా మారినట్లు స్పష్టముగ సూచనలు గాన్పించుచున్నవి. ఈ దేశ పరిశ్రమల నభివృద్ధిపరచుట తమకు విధ్యుక్త ధర్మమని గవర్నమెంటువారిప్పుడిప్పుడే గ్రహించుచున్నట్లు గన్పట్టుచున్నది. ఈ యుద్దేశముల నిదివరకే మన మనేక కోట్ల మంది ప్రజలలో మేల్కొలిపి యుంటిమి. సంవత్సరమునకు కనీసమొక దినమైనను స్వార్థత్యాగబుద్ధితో పైసాఫండును వసూలుచేసి, మాతృదేశారాధనజేసి, తీరుద మను గాఢాభిమానమును మనము ప్రజలలో బుట్టించితిమి. ఈఫండుతో మన మొక గ్లాసు ఫ్యాక్టరీని యేర్పరచి, దానిలో పలువిధముల గాజుసామాగ్రిని తయారుచేయుచున్నాము. కాని మన మీఫ్యాక్టరీలో తయారుచేయు నీపెలుసు గాజుసామాగ్రికంటె, మనము ప్రజలలో రగుల్కొలిపిన యీ గాఢాభిమానమే, యీ మాతృదేశారాధన దీక్షయే యెన్నియో మడుంగు లెక్కువ ముఖ్యమైనదనియు, యెక్కువ శాశ్వతమైనదనియు మన మెఱుంగవలెను. మనకిదివరకు గవర్నరుగనుండి వెళ్లిన సిడెన్హామ ప్రభువుగారు తలేగాంలోని మనగ్లాసు ఫ్యాక్టరీలో తయారగుచున్న గాజుసామాగ్రిని చూచి మిక్కిలి సంతోషించినవాఁడై, "యీ ఫండువలన మీరింత పనిచేయుగలరని నేనెన్నఁడు తలంపలేదు; నేననుకొనిన దానికంటె మీరెక్కువ బాగుగ చేయగలిగిరి" అని తన మనస్సులోని నిజాభిప్రాయమును వెల్లడించెను. (చప్పట్లు) మనము చేసినకృషికి గలిగిన ఫలితములను జూచి, యీ ఫండుపట్టి బూటకము గాదనియు, మన మీఫండును సదుద్దేశముతో స్థాపించితిమనియు గవర్నమెంటువారి మనస్సునకు గట్టిగ నాటినది. గవర్నమెంటువారికీవిధముగ గట్టినమ్మకము కుదురుటతోడనే, తలవని తలంపుగ నీ యుద్ధము తటస్థించెను. ఈ యుద్ధమువలన సంభవించిన పరిస్థితుల మూలమున మనదేశ పరిశ్రమల నభివృద్ధిచేయుట అత్యంతావశ్యమని గవర్నమెంటువారికి మరింత గట్టినమ్మకము గలిగినది. ఈ యుద్ధమువలన తటస్థించిన యనుకూల పరిస్థితులలో మన పైసాఫండు గ్లాసు ఫ్యాక్టరీకి కూడ కొంతలాభము వచ్చినది. కాని అయ్యా! మన మింతటితో సంతోషించి యూరకొనుట యెంతయు బుద్ధిహీనతయని నా నమ్మకము. మనకు ప్రతిదినమును వాడుకకు కావలసిన సమస్త గాజుసామాగ్రిని మనము తయారు

చేయుటకు తగినసామర్థ్యమును సంపాదింపవలెను. ఒక చిన్నయుదాహరణ చెప్పెదను. దేశములో విశేషముగ గాజులు కావలసియున్నవి మన దేశములో పురుషులెంతమందియున్నారో, గాజులు తొడిగించు కొనవలసిన స్త్రీలుకూడ నంతమంది యున్నారు (నవ్వు) ఈలెక్క ప్రకారము షుమారు 15 కోట్ల స్త్రీలు గలరని తేలుచున్నది దేశములో నింతమందికి గాజులు కావలసివచ్చినప్పుడు మనము తయారు చేయుగాజులు వీరందరికిని సరిపోవునా? మనకు ప్రతిదిన మత్యవసరముగ కావలసిన యిట్టివస్తువులను మనము తయారుచేసి కొనలేక పోవుచున్నాము! దీనికి మనమంతయు సిగ్గుపడవలసి యున్నది! ఇదివరకొకసారి ♦ "కీరుహార్డీ"గారు మన దేశమునకు వచ్చినపుడు, "మీపల్లెటూళ్ళలోని ప్రజల స్థితిగతులెట్లుండునో నే నొకసారిపోయి స్వయముగ చూడవలెనని యున్నది" అని ఆయన నాతోచెప్పెను. అంతట నే నాయనను శివపురమను గ్రామమువరకు తీసికొనిపోతిని. ఆగ్రామస్థులు కొందరచ్చట గాజులను తయారుచేయుచుండిరి. దీనికి కావలసిన మోటుగాజు ముక్కలను తయారుచేయుట పాపమాగ్రామస్థులకు తెలియదు. ఈ మోటుగాజు ముక్కలను వారు "జూనగడము" అనుపట్టణమునుండి కొనితెచ్చుకొని, వానితో గాజులనుచేయుచుందురు. అప్పుడు నేను మెల్లదిగ కీరుహార్డీ గారితో నిట్లు ప్రసంగించితిని "నిజమే, మన గవర్నమెంటువారు తమస్వజాతి వారైన యింగ్లీషువర్తకులయెడ పక్షపాతము వహించియుండుట సహజమే. అదియటుండనిండు. కాని ఎవరోపరాయి జాతివారైన ఆస్ట్రియాదేశపు వర్తకులును పెట్టుబడిదార్లును వచ్చి మాహిందూదేశ ప్రజల రక్తమాంసాదులను పీల్చి పిప్పిచేయుచుండగ మనగవర్నమెంటు వారేల చూచి సహించి యూరకొనిరి? గవర్నమెంటు వారిట్లు చేయుట ధర్మమా? న్యాయమా? మీబుద్ధికేమితోచుచున్నది!" అని నేను ప్రశ్నించితిని. ఈప్రశ్నకు కీరుహార్డీగారు నిరుత్తరులు గావలసివచ్చెను. దీనికి తామేమియు జవాబుచెప్పలేక, ఆశ్చర్యమును వెలిబుచ్చు ముఖముతో మిన్నకుండిరి. కాని, ఆర్యులారా! ప్రస్తుతము పరిస్థితులన్నియు మారిపోయినవి. మనకిప్పుడిదిమంచి యనుకూలమైన తరుణము. ఇదివరకు నశించిన పరిశ్రమలనెల్ల పునరుద్ధరింపవలెను. అవి తిరిగి చెడిపోకుండ వానిని దృఢమైన గట్టిపునాదులమీద నెలకొల్పవలెను. అవి శాశ్వతలాభప్రదముగ నుండునట్లు వానికి స్థిరమైన యేర్పాటులను చేయవలెను. మనపరిశ్రమలను మనమిట్లు జయప్రదముగ కొనసాగింప గలమని మన మిదివరకు చేసిన కృషివలన బుజువుపరచి

---

♦ ఈయన ఆంగ్లేయుడు. హిందూదేశముపై నభిమానము గలవాడు. మన దేశస్థితిని జూచి పోవలెనని యీయన ఒకసారి మనదేశమునకు వచ్చెను.

యున్నాము. మనమిప్పుడు పట్టి కబుర్లను చెప్పుటలేదు. అదిగాక మనమిప్పుడు గవర్నమెంటువారితో పోరాడదలచుకొనలేదు. మనమిప్పుడు గవర్నమెంటువారిని కోరబోవునదేమి ? "అయ్యా! ఇదిగో మేమీవస్తువులను మాఫ్యాక్టరీలో తయారు చేసినాము. ఈపనినే మేమింక వృద్ధిపరచి, ఇంక ననంఖ్యాకములగు సామాగ్రిని తయారుచేయవలసి యున్నది. కానిదీనికై మీరు మాకుసహాయము చేయవలెను" అని మన మడుగవలెను. ఇట్టి పరిశ్రమలకు సహాయము చేయుట గవర్నమెంటువారి విధియై యున్నది. అదిగాక యీ పైసాఫండు విషయమై మీ కంపరుకూడ నిట్టి యభిమానమునే జూపవలసినదని నేను ప్రార్థింపుచున్నాను. మన గ్లాసుఫ్యాక్టరీ కిప్పుడత్యవసరముగ కావలసిన వనేకములున్నవి. క్రొత్తరకపు గాజుసామాగ్రిని తయారుచేయుటకు కొంతమంది బాలురను యీవిద్యలో తరిఫీదు చేయవలెను దీనికి ప్రత్యేక మొకపాఠశాల యుండవలెను ఇదివరకున్న రకములుగాక నింకనేమి క్రొత్త క్రొత్త రకములను తయారుచేయుటకు సాధ్యమగునో పరిశోధించి చూచుటకు ప్రత్యేక మొక కర్మాగారముండి తీరవలెను. ఈ రెండును ప్రస్తుతము అవశ్యము కావలసియున్నవి ఇదివరకు తయారైనవానికంటె యెక్కువ పనివానితనము గల అందమైన చక్కనిగాజు సామానులను మనము తయారుచేయగలమని (మనకే గాక) గవర్నమెంటువారికిగూడ గట్టి నమ్మకము గలిగినది. క్రొత్తరకముల సామాగ్రిని చేయుటకు సాధ్యమగునో కాదో పరీక్షించి చూచుటకు తగిన నూతన పరిశోధనము, నూతన ప్రయోగములను గావింపవలసియున్నది. ఈపరిశోధనల కగు వ్యయమంతయు గవర్నమెంటువారు భరించుట న్యాయము. అన్నిదేశములలోను యిదియే ఆచారము మనగవర్నమెంటువారిప్పుడీపనికై పూనదలచు టెంతయు మనభాగ్యము. దీనికి మన కృతజ్ఞతను దెలుపుటకు పట్టినోటిమాటలు చాలవు. సరి, అదంతయు నటుండనిండు. మనచే స్థాపితమైన యీ యుద్యమమును మన స్వకృప వలన, మనము వసూలుచేసినసొమ్ముతో మనమే నిలువబెట్టుకొందుము గాక. ఈ యుద్యమమునకు తాముకూడ సహాయము చేయవలసినదని మనము గవర్నమెంటువారి నడుగుదము. వారేమైన నిచ్చినసరే; సంతోషమే. వారేమిచ్చినను వందనపూర్వకముగ నందుకొందము. కాని యీ పైసాఫండుయొక్క ప్రధానసంకల్ప మేమి ? తమలో నంతర్గర్భితమైయున్న సర్వశక్తులను ప్రజలకు తెలియజెప్పి, వారిని మేల్కొలుపుటయే దీనియొక్క పరమ సంకల్పము. మనశక్తినంతను ధారవోసి, యుత్తమమైన యీ యుద్దేశమును కొనసాగించుటకు మనము దృఢసంకల్పులమై యున్నాము.

## బ్రాహ్మణ ఫండు కాదు

ఈమధ్య నిచ్చటనెవరో "యీ పైసాఫండు కమిటీలో నందరును బ్రాహ్మణులే యున్నార"ని అభ్యంతరము చెప్పిరి ఈఫ్యాక్టరీవలన వచ్చు లాభమంతయు బ్రాహ్మణులకే చెందుచున్నదని కొందరు వాదించుచున్నారు. కాని, యీపని వంతను నేర్చుకొని, గాజుసామాగ్రిని నంతను తయారుచేయువారిలో చాలమంది శూద్రులే యున్నారను సంగతిని పాపమీయభ్యంతరము చెప్పువారు గ్రహించినట్లు కనిపించదు నిజమాలోచించినచో, గాజుసామాగ్రిని తయారుచేయుట మొదట బ్రాహ్మణుని వృత్తి కానేకాదు. ఈగాజుసామాగ్రిని చేయుటకు కావలసిన దేహబలము, ఓర్పు, మొదలగు లక్షణములన్నియు శూద్రులకేగలవు గాని బ్రాహ్మణులకు లేవు. అందువలన, యీపనికి సహజముగ శూద్రులే తగుదురు. బ్రాహ్మణుల యుపయోగార్థమయిరయే యీ పైసాఫండును స్థాపించితిమని యభ్యంతరపరచు వారికి నేజెప్పు సమాధానమేమియో తెలియుటాకి పైసాఫండు గ్లాసు ఫ్యాక్టరీని అభివృద్ధిపరచుదమను అభిమానముగలవా రెట్టివారైనను వారు తమకక్కిరోలది పాటుబడుటకేమియు నభ్యంతరము లేదు అట్టివాడు బ్రాహ్మణుడైనను, లేక యే యితర కులమువాడైనను మాకభ్యంతరము లేదు. కాని, దీనిలో నొకవిషయమును మాత్రము మనమందరమును గ్రహింపవలెను. ఏమనగ:— ఏవిధమైన పనిపాటలను జేయకుండ యితరులనుచూచి యూరక హేళనచేయువారికి మాత్రము మన గ్లాసుఫ్యాక్టరీలోనికివచ్చి నిలుచుండుటకు తావులేదు. (నవ్వు). ఆర్యులారా! పైసాఫండునకై మీరిచ్చు యీమూడు దమ్మిడీలను మీరు పవిత్రవంతమైన కార్యమునకై సమర్పించితిరని గట్టిగనమ్ముడు. మీరిచ్చు యీ ఋణము దేశప్రజలలో నిద్రింపుచున్న గొప్ప ఆధ్యాత్మిక శక్తులను మేల్కొలుపుచున్నదని మీరెరుంగవలెను.

## స్వచ్ఛంద సేవకులు (Volunteers)

[ప్రతిఫలమును గోరక, దేశమంతటను తిరిగి యీఫండునకు చందాలను ప్రోగుచేసిన దేశసేవకులు]

ఈచందాలను ప్రోగుచేసిన స్వచ్ఛందసేవకుల విషయమై నే నిచ్చట కొంత చెప్పవలసియున్నది. వారియెడ మేముజూపు కృతజ్ఞతను వెలిబుచ్చుటకు నోటిమాటలెన్నియైనను చాలవు. దినమంతయు వారు బాడుగబండ్లమీద నూరంతయు తిరిగి చందాలను ప్రోగుచేసిరి. తుదకు, ఆ బాడుగకైనను వా రీఫండులో నుండి యొకదమ్మిడీయైనను తీసికొనలేదు. వారిలోనుండు మహోదారబుద్ధియు, మాతృదేశారాధన దీక్షయే వారినిట్టి స్వార్థత్యాగమునకు పురికొల్పినది. దీనికి మన

మెంతయు వారిని కొనియాడవలసియున్నది. ఇట్టి మహాసంపదవలనే మనజాతి యంతటను వృద్ధినొందింపవలెను; ఇట్టివానినే మనము జాగరూకతతో గాపాడు కొనవలెను. తాము వసూలు చేసిన సొమ్ములో తమకు కొంత కమీషను నిచ్చెద మని మనమాశపెట్టినను, సాధారణముగ నిట్టిపనికి వకుడు తెగించి ముందుకురాడు. అపని యందు గాఢాభిమానమును దేశభక్తియు నున్నవారిచేతనే యీపనులు కొనసా గునుగాని యితరు లెవరిచేతను గావు. దీనికై మనము కమీషనివ్వ మొదలిడినచో, అసలువసూలైన మొత్తములో సగమో కమీషను క్రిందనే వ్యయమగును; మిగతా సగమును యేయితర చిల్లరఖర్చులకో సరిపోవును. ఈఫండును వసూలుచేయు శుభ కార్యమునకై మనము దసరాపండుగ దినము నేర్పరచితిమి. కొన్ని సంవత్సరముల వరకు యీ పండుగదినముననే మనము వసూళ్లను చేయుచుంటిమి. కాని, యీ మధ్య యీపనియంతయు కొంతవరకు మందగించినది. అయినను తిరిగి మీరీ పనికై మీశక్తినంతను వినియోగపరచవలసినదని మిమ్ములనెల్ల ప్రార్థింపుచున్నాను. ఈ ఫ్యాక్టరీవలన మనమెంత సామాగ్రిని తయారు చేయుచున్నామను విషయమై మీరు చింతింప నక్కరలేదు. అదంత ముఖ్యమైన సంగతి కాదు. గాజుసామగ్రిసహజముగ పెలుసైనది - యీసంగతి అందరికిని తెలియును. కాని నేజెప్పున దేమనగా:— "మనమీఫండును యేవిధముగ ప్రోగుచేయుచున్నాము? దీనికి మన మే యేర్పాట్లను చేసితిమి? దీనివలన మనకు గలిగిన నూతనశక్తియేమి? దీనివలన మనము నేర్చుకొనవలసిన నూతనవిశేషము లేమి?" మనకిప్పుడు కావలసిన వివి గాని, తక్కున వానితో పనిలేదు. ఇహసంబంధమైన వ్యాపారములలో మనమభివృద్ధి జెందుట కివి యే ప్రథమబీజములు. వీనిమూలముననే మనకుముందు మేలుగలుగగలదు. మనము కూడ గాజుసామాగ్రిని తయారుచేయగలమని గవర్నమెంటువారిప్పుడు గ్రహింప గలిగిరి. ఇదిమనకు మంచిదే. ఇక, గవర్నమెంటు వారేమిజెప్పిన తాముకూడ దానికే తలలూచు పెద్దలు సైతము, సహజముగ, మన నిజోద్దేశములను గ్రహింపగలి గిరి. ఇప్పుడెవరికి నెట్టిసందేహములు లేవు. ఇదివరకున్న మబ్బులన్నియు పూర్తిగ తొలగిపోయినవి. ముదుసలులమైన మాబోటివారందరును తమ శక్తికొలది తాము చేయవలసినపనిని చేసిరి. సాయంకాలపు చీకట్లు క్రమముగ మాచుట్టును క్రమ్ము కొనుచున్నవి. మేమెప్పుడస్తమింతుమో యింకను తెలియదు. కాన యీభార మంతయు మీబోటి యువకులే యెత్తవలెను. ఈజ్ఞానజ్యోతిని, మీరు దేశదేశములకు గొంపోవలెను. మీకెన్నికష్టములు వచ్చినను వానికి జంకక పైన భగవంతునిశక్తిని ఆధారముచేసికొని మీరీపనిని అత్యంత అభిమానముతోడను యుత్సాహముతోడను నిర్వహింతురని నాకు గట్టివిశ్వాసము గలదు.

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—————:o:—————

## 32. రాజభక్తి

[ఆన 1916 సంవత్సరము ఏప్రిల్ నెలలో బెల్గాముపట్టణమున సమావేశమైన బొంబాయి రాష్ట్రీయసభలో మొదటితీర్మానమైన "రాజభక్తి" తీర్మానమును బలపరుచు తిలక్ మహాశయు డిట్లుపన్యసించెను].

సభాధ్యక్షా! ప్రతినిధులారా!

నేనిప్పుడు బలపరుపబోవు తీర్మానమునకు "యుద్ధము; రాజభక్తి" యని పేరిడినారు. యుద్ధమునకును, రాజభక్తికిని సంబంధమేమి యని మీకు యీమాట వినగానే మొదట సందేహము గలుగవచ్చును. కనుక యీరెంటికిని సంబంధ మేమైన కలదేమో, చూచి, విచారించుటకే నేనిప్పు డీవిషయమై మీతో ముచ్చటింపబోవుచున్నాను ఈరెండిటికిని యిట్టిసంబంధ మేమైననున్నచో, మనము తద్విషయమై నెరవేర్పవలసిన విధియేమి ? యని విచారింపవలెను. ఆర్యులారా! నేనిప్పుడు మీకు ఒక్కసంగతినిమాత్రము స్పష్టముగ తెలియజెప్పవలసియున్నది అదియేదనగ:— మనమిప్పుడు ప్రభుత్వమువారికి వత్తిడి గలుగజేయుము, తదేకదీక్షగా మనకు హక్కులనిచ్చి తీరవలయునని కోరుకోర్కెలకును, యీయుద్ధములో మనము వారికి చేసిన సహాయమునకును యేవిధమైన సంబంధమును లేదు. ఈయుద్ధములో మనము వారికిచేసిన సహాయమునకు ప్రతిఫలముగ యీ హక్కుల ననుగ్రహింపవలసినదని మనము కోరుటలేదు. యుద్ధమురాక పూర్వమే, చాలకాలము క్రిందటినుంచియు మనమీ హక్కులను కోరుచున్నాము. కనుక మనముకోరు యీహక్కులకును, యుద్ధమునకును ఎట్టి సంబంధమునులేదు మనముకోరు యీహక్కులన్నిటికిని నిశ్చల ధర్మమే (న్యాయమే) మూలాధారము ధర్మమే దీనికి పునాది. (చప్పట్లు) ఇవి క్రొత్తవికావు. మన కీహక్కులు కావలెనని మనము పాతిక, ముప్పైసంవత్సరముల నుండియు, గవర్నమెంటువారి చెవులు తడకలుగట్టునట్లుగ, చెప్పుకొనుచున్నాము. ఇప్పుడన్ననో, పూర్వముకంటె మరిరెండింతలు గట్టిగ చెప్పుకొనుచున్నాము. మన మిప్పుడు కోరుచున్నవానినే, మరింత గట్టిగ చెప్పుకొనుటకు మనకు ప్రస్తుత స్థితి

గతులనుబట్టి, మంచి యవకాశము చిక్కినది. అధికారవర్గమువారికి మనయందుండు అపనమ్మకము చేతనేగాని లేనియెడల చిరకాలము క్రిందటనే మన కీ వాక్కులను ప్రభుత్వమువారు ప్రసాదించియుండెడి వారు. మన భారతీయుల నందరను కత్తులు పుచ్చుకొన నిచ్చినట్టయిన, వెంటనే భారతవర్షమునుండి ఆంగ్లేయాధికారమును త్రోసివేయునిమిత్తము మన మీ కత్తులను వారి మీఁదనే ప్రయోగించెద మని మొన్న మొన్నటివరకును యీయధికారవర్గమువారు తలంచుచుండిరి. కాని దానిఫలిత మిప్పు డేవిధముగ పరిణమించినది ? మన భారతీయులవలన నేఁడో రేపో ముప్పువాటిల్ల గల దని వారు పడిన పిచ్చిభయము లన్నిటికంటె మించిన గొప్పయుపద్రవము, గొప్ప దురవస్థ, యీయుద్ధరూపమున సంభవించినది. అయినను మన మీ తరుణమున జూపిన రాజభక్తిని, మన మనేకవిధముల వారికి నిప్పుడు చేయుచున్న సహాయమును, చూచియైనను, అధికారవర్గమువారు మనయందుండు అపనమ్మకమును అనుమానమును, వదలివేయవలెను. (చప్పట్లు) మన మిప్పుడు వారికి సంతోషపూర్వకముగను, హృదయపూర్వకముగను గావించుచున్న సహాయమునుబట్టి యైనను మన మిప్పుడును ఆంగ్లేయులను భారతవర్షమునుండి తరిమివేయవలయునను ఉద్దేశమును మన మనస్సులలో సంకల్పించుకొని యుండలేదని యధికారవర్గమువారి మనస్సులకు నాటవలెను. ఆంగ్లేయప్రభుత్వముపోయి, ఇంకొక విదేశప్రభుత్వము వచ్చి, మాభారతవర్షము నేలవలయు నని మే మెప్పుడును ఉద్దేశపడియుండలేదు. అట్లుగాక, ఆంగ్లేయ ప్రభుత్వమును యెక్కువగ బలపరచునిమిత్తమే, మాశక్తివంచన లేక మా రక్తమును ధనమును, ధారపోయుటకు సమ్మతించియున్నాము. (బిగ్గరగ చప్పట్లు) మా నిష్కళంకమైన రాజభక్తిని తెలుపుట కింతకంటె ఎక్కువ బుజు వేమి కావలెను ? ఆయుధశాసనమును రద్దు పరచవలసినదని మనము ప్రభుత్వమువారిని వేడుకొనుచున్నాము. అట్లుచేయుటకు వారిప్పుడు భయపడినయెడల, యుద్ధము ముగిసిన తరువాతనే దానిని రద్దు పరుపవచ్చును ప్రస్తుతము కైనను లేకుండ కొంతమందికి మాత్రము ఆయుధముపట్టుకొను అధికారమును యిచ్చిచూడుడు వారా యాయుధములను సక్రమముగ ఉపయోగించుకొని రని ప్రభుత్వమువారి మనస్సునకు తృప్తికలిగినయెడల, పిమ్మట యీయాయుధశాసనము నంతను పూర్తిగ రదుపరుపవచ్చును.

మాయొక్క స్థితిగతులను, మా మొరలను, దయారసభావముతో చూచి, ఆలకించువారెవరైన గలరా యని ప్రశ్నించిన, అట్టివారు యీఆంగ్లేయులు తప్ప మరి ఇతరు లెవరును లేరని మాకు గట్టి నమ్మకము గలదు. (బిగ్గరగ చప్పట్లు) మాయొక్క మంచిచెడ్డలను విచారించి, మాశ్రేయస్సుకోరి, మేలుచేయువారు

యీ యాంగ్లజాతివారు తప్ప మరియే యితర జాతివారును లేరని మాకు దృఢ నమ్మకము గలదు. (బిగ్గరగ చప్పట్లు) ఈ విషయమై మాకు గట్టి నమ్మకము గలదు. కాని ప్రస్తుత పరిపాలనాపద్ధతిలో నుండు అనేకములైన లోపములచేత, దేశమునం దంతటను విశేషమైన అసంతృప్తియు, అశాంతియు ప్రబలియున్న మాట వాస్తవము. దీనిని కాదనుటకు వీలులేదు. కాని దేశములో అసంతృప్తి ప్రబలియున్నంత మాత్రముచేత, మాహక్కులను మా కిచ్చుటకు అభ్యంతర మేమిక్కి తమకుండు గౌరవము పోవునను వెఱ్ఱిభయముచేత, యీ యధికారవర్గమువారు తమ యధికారము ను వదలుకొనుట కిష్టపడుట లేదు అసలు దీనికి నిజమైనకారణ మిది. కాని ౧౯౧౬ యుద్ధములో మనము వారికి చేసిన సహాయముచేత, మరియొక్క నిజస్థితి ఆంగ్లప్రజలకు గోచరమైనది. వారిప్పుడే కండ్లు తెరచి, మన నిజస్థితిని జూడ గలిగిరి. మనయందు అధికారవర్గమువారికి అనుమాన ముండుటకు నిజముగ నెట్టి హేతువును లేదని, వారికి, పూర్వమునకంటె, యిప్పు డెక్కువగ మనస్సునకు నాటినది. అధికారవర్గమువారికి మన భారతీయుల యెడ అనుమాన ముండుటకు కారణము వారి స్వలాభాపేక్షయే తప్ప మరివేరు కారణము లేదని ఆంగ్లప్రజ లిప్పటికి తెలిసికొనియుందురు. బ్రిటీషుప్రజాపాలకుల కిప్పటికి మనభారతవర్ష నిజస్థితిగతులు తెలియవచ్చినవి గనుక, మన హక్కులను అనుగ్రహింపవలసిన దని వారికి గట్టిగ ఒత్తిడికలిగించి, పార్లమెంటు చట్టముద్వారా మన హక్కులను పొంద గలుగుట కిదియే మంచి యనుకూలమైన తరుణ మని నే గట్టిగ చెప్పుచున్నాను. ప్రస్తుత యుద్ధమునకును, మన రాజభక్తిని, యున్న సంబంధ మిదియే యని నా యభిప్రాయము. (చప్పట్లు).

ఆర్యులారా! ఇదివరలో మన భారతవర్షము రణరంగమునకు పంపిన సేనల కంటె యింకను ఎక్కువ మందిని పంపి యుండవలసిన దని కొందరు చెప్పు చున్నారు. నిజమే, దీనిని కాదనిన వారెవరు? కాని, మనకు శక్తిలేని పనిని మన మెట్లు చేయగలము? మనలను నిందించిన ప్రయోజన మేమి? మనకు కూడ కొంత యధికార మిచ్చియున్నట్టయిన, శత్రువులతో పోరాడుటకు కోటి సంఖ్యగల పెద్ద సైన్యమును మనము కూడ యిచ్చటినుండి పంపెడివారము. అదియును గాక, అట్టి పెద్దసైన్యమును మన భారతవర్షము పంపలేని యసమర్థతను వెలిబుచ్చుటకు కారణము, యీ యధికారవర్గమువారి లోపముగాక మరేమైన గల దేమో విచారింపు డని మిమ్ములను హృదయపూర్వకముగ ప్రశ్నించుచున్నాను. తాము పాలించు ప్రజలయెడల, పాలకులకు విశేషము అభ్యాయయుండుటచేతనే, పూర్వము రోము,

గ్రీసు మొదలగు పెద్దపెద్ద సామ్రాజ్యములు నాశనమై పోయినవని చరిత్రాంశములు చాటుచున్నవి ఘోరాకారమును దాల్చిన యీ అసూయా, దురాశా, పిశాచములు పూర్వ మెచ్చటనో, అనాగరికులైన మోటుజాతి ప్రజలలో మాత్రమే ప్రబలముగ వ్యాపించియున్నట్లును, అవి యిప్పుడు క్రమక్రమముగ మాసిపోవుచున్నట్లును చరిత్రకారులు వర్ణించుచున్నారు. ఆపిశాచము లిప్పు డంతరించుటవలననే, వర్తమాన కాలమందలి గొప్పసామ్రాజ్యము లన్నియు నశించిపోకుండ నిలిచియున్నవట ! దీని కిదియే కారణ మని చరిత్రకారులు వచింపుచున్నారు కానియిప్పటి యుద్ధములో జరిగిన జాతులవారి ప్రవర్తనను జూడ, పైనచెప్పినమాట శుద్ధ అబద్ధ మని తేలుచున్నది. ఈ పైన చెప్పిన అసూయా దురాశాపిశాచము లింకను అంతరింపలేదు. పూర్వమెంత భీకరాకారమును దాల్చి చరింపుచుండెడివో, యిప్పుడు కూడ ఆ విధముగనే విచ్చలవిడిగ నీపిశాచములు సంచరింపుచున్నవి. కనుక పెద్దపెద్దసామ్రాజ్యము లన్నియు యీపిశాచముల వాత బడకుండ గాపాడ జూచుకొనుట రాజ్యాంగవేత్తల విధియై యున్నది; సామ్రాజ్యమును నీట ముంచినను, పాల ముంచినను, ఆభారము నంతను తమయందే యుంచుకొని, సామ్రాజ్యచక్రమును ద్రిప్పు రాజ్యాంగవేత్తల విధియై యున్నది. అది గాక సామ్రాజ్యాంతర్భాగము లైన దేశము లన్నియు, తమకాళ్లమీద తాము నిలువబడగల శక్తి సామర్థ్యములను గలిగియుండవలెను. (వేని యంతట యవి, బ్రతుకుచుండిన, పెద్దరాజ్యమునకు తేలిక) సామ్రాజ్యమును నిలువబెట్టుట కిది యెంతయు అత్యవసరమై యున్నది. ఇట్లుచేయుట స్పష్టముగ రాజకీయవేత్తల విధియై యున్నది. భారతవర్షము సైన్యములోనికి యెంతమంది నైనను పంప గలదు. ఇదియంతయుమనభాగ్యము, కాని యీశక్తులన్నియు యిప్పుడు అణగి నిద్రించుచున్నవి. గజమునకు ఒక్కొక్కని వంతున వరుసగా మన మనుష్యులను నిలువబెట్టినట్లయిన, యిచ్చట కలకత్తా దగ్గరనుండి (జర్మనీలోని) బెర్లిన్ పట్టణము వరకు ఎడతెగని ఒకేపంక్తిగా నిలువబెట్టవచ్చును (నవ్వు, బిగ్గరగచప్పట్లు). అట్లుండియు సైన్యములోనికి మనుష్యు లెక్కువగ వచ్చిచేరకుండుటకు కారణమేమి? దీనికొకటే కారణముకలదు. అదేదనగ అధికారవర్గము వారికి మనమీద నున్న అనుమానమే. వారి యనుమానము కుత్సితస్వభావమువలన పుట్టినదిగాక పోవచ్చును; అయినను నిష్కల్మషహృదయముతో మనము నిజమని నమ్మినది, నిజముగ, నిజము కాక పోవచ్చును. (చప్పట్లు) నిష్కల్మషహృదయము తోడనే, వారట్లు మనయందు అనుమానము వహించియున్నను ఆట్టియనుమానము అపనమ్మకము [illegible]ము వారు మనయొక్క నిజోద్దేశములను కనుగొనలేని కారణముచేత పుట్టినదేగాని [illegible]

యిప్పుడు స్పష్టముగ బుజువైనది ఆంగ్లేయ సామ్రాజ్యమును పడగొట్టుట మన యుద్దేశము కానే కాదని మనము స్పష్టపరచి యున్నాము (బిగ్గరగ చప్పట్లు) ఆంగ్లేయులతో సంబంధము త్రెంపుకొనవలెనని మనము సంకల్పించి యుండలేదు. మన జాతీయాశముల యెడ నిర్దుష్టమైన సానుభూతిని జూపగలవారు ఆంగ్లేయులే యని మనకు గట్టి నమ్మకము గలదు. మన యవుసరములను దీర్పగలవారు వారే. (చప్పట్లు). ఇది చాలముఖ్య విషయము. దీని కెవరును తప్పుడు అర్థముచేసికొన కూడదు మనము మన చక్రవర్తిగారి 'మూర్తి'కిని వారి సామ్రాజ్యమునకు ఎంతయు భక్తులమై యున్నాము (చప్పట్లు) వారు చక్రవర్తిగా నుండుటకు మనకేమియు అభ్యంతరములేదు వారి సింహాసనముతో సంబంధము త్రెంపుకొన వలయునను ఉద్దేశము మాకులేదు. అయినను "సామ్రాజ్య" మనగా "అధికారవర్గమాశ్రి" అట్లె న్నడును కాదని యెరుంగవలెను. యీ సామ్రాజ్యమునకు జెందియున్న పౌరుల మయిన మనకు కొన్ని హక్కులుండి తీరవలెను. ఈ హక్కులకొరకు మనము శాస్త్రసమ్మతముగ అధికారవర్గమువారితో పోరాడవచ్చును. దీనిలో తప్పులేదు. మనమిట్లు పోరాడినంత మాత్రముచేత సామ్రాజ్యమును పడగొట్టుటకు యత్నించు చున్నామని యొన్నటికి అర్థమివ్వదు (చప్పట్లు) న్యాయశాస్త్రానుసారముగ మనకు జెందవలసిన హక్కులకై మనము చేయు ప్రయత్నములను గూర్చి యిట్టి విపరీతార్థములు జేయు టెంతయు కేవలము క్రూరస్వభావ ప్రేరితమని నే జెప్పవలసి యున్నది. ప్రభుత్వమువారికి సహాయము చేయవలయు నని మనకు నిశ్చయముగ కోరిక గలదు. మనము క్రియా రూపమున అనేక విధముల వారికి సహాయముచేసి యున్నాము; మన కేదియో ప్రతిఫలము రాగల దను ఆశతో మన మీ సహాయముచేసి యుండలేదు. ఇట్లెంతమాత్రమును కాదు ప్రభుత్వమువారికి సహాయము చేయుట మన విధి గనుక, మన మట్లు సాయపడినాము. (చప్పట్లు) వారి కెంతయో అత్యవుసరమైన యీ కష్టసమయమున మనము వారికి సహాయము జేయుచు, మన మిదివరకు కోరుచున్న కోర్కెలను మరి రెండింతలుగ నొక్కి యడుగుటకిదియే మంచి యవకాశము గనుక మన మట్లు తప్పక కోరవలసిన విధియై యున్నది. మనము నెరవేర్పవలసిన యీ రెండు విధులనుండియు, ఒక అంగుళమైనను అటునిటు తొలగకూడదు.

న్యాయుధము లెందుకు కావలెను? వానితో మీకు పని యేమి? పరదేశములనుండి యితరులు దండెత్తివచ్చి మిమ్ములను బాధింపకుండ గాపాడుట కును, మీలో మీకుండు అంతఃకలహముల వలన మీ కపాయము గలుగకుండ

కాపాడుటకును, నే నిచ్చటనుండగ, మీ కాయుధములతో బని యేమి?" అని కొందర రధికారులు వాకొనుచున్నారు. కాని నే నొక చిన్న ప్రశ్నవడిగెదను. చుట్టుప్రక్కల అడవిలోనుండి యొక పెద్దపులివచ్చి, యూళ్ళమీదపడి మనుష్యులను, పసువులను చంపి తినుచు, దేశమునంతను నాశనము జేయుచుండగ, "ఆ క్రూర వ్యాఘ్రము బారినుండి మమ్ములను రక్షింపవలసిన" దని పోలీసు డిస్ట్రిక్టు సూపరింటెండెంటుగారివద్ద కేల ప్రజలు పరుగెత్తి పోవలెను? ఇట్లొకసారి జరిగిన విషయము నా కొకటి తెలియును. "సింహఘర్" అడవిలో నుండి యొకసారి యొక పెద్దపులి వెడలివచ్చి, యూళ్ళమీదపడి, గ్రామములన్నిటిని నాశనము చేయ మొదలిడెను. కాని ఆ పెద్దపులి బారినుండి తప్పించుకొనుటకు ప్రజలశక్తులైయుండిరి. కనుక వారు వెంటనే పునహాకు పరుగెత్తుకొని వెళ్ళి, పోలీసు సూపరింటెండెంటుగారితో చెప్పుకొని, తమ ప్రాణములను రక్షింప కోవలసిన వారైరి. అందుమీద, పోలీసు సూపరింటెండెంటు పులియున్న చోటికి వచ్చి, దానిని చంపెను. ఇట్టి చిన్న విషయములలో సైతము మన మేల అధికారవర్గము వారి సహాయముపై ఇంతగ నాధారపడి యుండవలెను? పెద్దపులిని జంపుటయన, ప్రజలలో కల్లరులును, తిరుగు బాటులను బుట్టించుటయా? (చప్పట్లు, నవ్వు) కాని మన మీ వర్తమాన సంగ్రామమున వారికి చేసిన యత్యద్భుతమైన సహాయమును బట్టి, మనకు నిజముగ రాజభక్తి గల దని ప్రభుత్వము వారికి పరిపూర్ణముగ తృప్తికలిగినది. దీని విషయమై, ఎచ్చటను, ఏకోశమునను, ఎట్టి సందేహమును లేదు. దీని విషయమై యీషణ్మాత్రమైనను అనుమాన ముండవలసిన పనిలేదు. మనయందు ప్రభుత్వము వారికి అనుమానము పోయినది గనుక, మన మాయుధములను ధరింపగల గౌరవమును పొంది తీరవలెను. ఇట్టి గౌరవమును బొందుటకు మనకు సర్వవిధములను హక్కు గలదు. ఇట్టిహక్కును మన కనుగ్రహించినందువలన, మనయొక్కరి మేలునకే గాక, సామ్రాజ్యాభివృద్ధి కెంతయు నిది తోడ్పడగలదు. ఇది మన శ్రేయస్సు నభివృద్ధి బొందించును. సామ్రాజ్యమునకు బలము నిచ్చును. దేశ శాంతికి భంగము గలుగకుండ రక్షించును ముప్పదికోట్ల భారతీయులు ఆయుధపాణులై నిలువబడిన యెడల, ఎట్టి శత్రువున కైనను గర్భనిర్భేదముగ నుండదా? భయోత్పాతముచే, శత్రువుల గుండె లవియవా? సామ్రాజ్యమును రక్షింప కంకణము గట్టుకొని కోట్లకొలది యాయుధపాణులై యున్న సైనికులను రెప్పపాటు కాలములో రణరంగమున కురికింప గల నిట్టి గొప్పరాజ్యముతో, నెట్టి శత్రువైనను, యుద్ధమునకు తలపడగలడా? ఇట్టిరాజ్యముతో యుద్ధముచేయుటకు

శత్రువునకు ధైర్యము నిలువజాలదు. ఇట్టివాక్కును ప్రజల కనుగ్రహించినయెడల, ప్రజ లెంతయు ధైర్యవంతు లగుదురు; ఇట్టిది వారికి బలము నిచ్చి, వీరోత్సాహమును పురిగొల్పును. ఇది లోకశాంతిస్థాపన కెంతయును తోడ్పడును. విశ్వమానవకోటికి మనశ్శాంతిని, శ్రేయస్సును, అపాదించును. యుద్ధము వచ్చినప్పుడు "ప్రజ లందరును సైన్యములోనికి వచ్చితీరవలెను" అను నిర్బంధ శాసనము గావింప నవుసర ముండదు. సామ్రాజ్యమున కెట్టి యాపదవచ్చినను, ఎట్టి విపత్తుఘటిల్లినను తా మొక్కరే యీ సామ్రాజ్యమును రక్షింప గలమని యీ యధికారవర్గము వారింకను బింకములు గొట్టుచున్నారు. ఇతరుల సహాయము లేక తా మొక్కరే యీ సామ్రాజ్యమును కాపాడుకొన గల శక్తి సామర్థ్యములు వారికి గలవట! కాని యిదెంతయు వట్టి ఉప్పు డాంబికములే యని యీ వర్తమాన సంగ్రామము వలన ఋజువైనది. ఈ సామ్రాజ్యమును గాపాడుకొనుటకు, ప్రజలమైన మన యొక్క సహాయ ముండియే తీరవలె నని యీ యుద్ధమువలన స్పష్టమైనది. కనుక యీ వర్తమాన స్థితిగతుల యవుసరమును బట్టి, మనమింతకాలము నుండియు కోరు న్యాయ సమ్మతమైన కోర్కెను యిది మరింత బలపరచుచున్నది. కాబట్టి ఆయుధములను పట్టుకొను హక్కును మనకు దయచేయవలసిన దని ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నాము. ఇంతకాలమునుండియు మన రక్తమాంసాదులను పీల్చి పిప్పి చేసి దేశమును నిర్వీర్యమును, నిస్తేజమును జేసిన "ఆయుధశాసనము"ను యీ సర్వ నాశన హేతువైన క్రూరశాసనమును శాసన గ్రంథము నుండి రద్దుచేయవలసిన దని ప్రభుత్వమువారిని వేడుచున్నాము. ఇట్లు గావించినయెడల, కోట్లకొలది ప్రజల కెంతయు ఉత్సాహమును, సంతోషమును గలుగును. కోట్లకొలది ప్రజలు సంతోషించెదరు. అవుసరమైనప్పుడు సామ్రాజ్యరక్షణార్థము, కోట్లకొలది ప్రజ లాయుధపాణులై వచ్చి నిలువబడుటకు శక్తియుతు లగుదురు. ఈ హక్కు ప్రజల కనుగ్రహించినయెడల ప్రజల రాజభక్తి కెంతయు గట్టి పునాది యేర్పడ గల దని ప్రభుత్వమువారికి తిరిగి నచ్చజెప్పుచున్నాము. ప్రజ లెంతయు బలయుతు లగుదురు. దానివలన, సామ్రాజ్యమునకు కూడ నెంతయు బలము చేకూరగలదు.

ప్రతినిధివర్యులారా! ఈ మాటలతో నికముగించి, మీ యందరి యనుమతికొరకై నే నీ తీర్మానమును మీ యెదుట నుంచుచున్నాను. మీ రంద రీ తీర్మానమును ఉత్సాహపూర్వకముగ నామోదించెదరు గాక యని కోరుచున్నాను. (చాల సేపు కరతాళ ధ్వనులు) "లోకమాన్యుడు చిరంజీవి యగు గాక!" తిలక్ మహారాజ్ కి జయ్!"

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 33. బీదరైతుల హక్కులు

[బొంబాయి రాష్ట్రములోని రైతులందరొకసారి చికోడీయనుచోట సమావేశమై, తిలక్ మహాశయుని ఆహ్వానించిన తరుణమున "బీదరైతుల హక్కులను" గూర్చి యీ విధముగ నుపన్యసించెను ]

నన్ను మీ రిక్కడి కాహ్వానించి, "బీదరైతుల పక్షమున" నన్ను గౌరవించుచున్నారన నేమిటో నాకు సరిగ బోధపడుట లేదు. నేనును మీ యందరి వలెనే పేదవాడనే గాని, మీ కంటె నా కెక్కువ హక్కు లేమాత్రమును లేవు. నేను మీ యందరి వలెనే, యేదియో యొక వ్యాపారమును బెట్టుకొని ఘటయాత్ర నడుపుకొనుచున్నాను. "భాగ్యవంతుల" పక్షమునజరుగుదానికిని "బీదల" పక్షమున జరుగుదానికిని నాకేమియు భేదము గాన్పించుట లేదు. రైతుల యిక్కట్టు లేమి? వారికి ముందు అడ్డమురాగల యిబ్బందులేమి? వారికేవిధమైన సాయము చేయవలసియున్నది? వారి మేలుకొరకై యెట్టిపనులగావింప వలెను? వీనినన్నిటిని గూర్చి నేను చాల కాలమునుండియు విచారించుచున్నాను. మీ యందరి వలెనే నేను నొక బీదరైతుగ నేయుండి, వీనినెల్ల విచారించుచుంటిని; గాన మీకుండు కష్టనిష్ఠురములన్నియు నాకు బాగుగ తెలియును. అదిగాక నేనును మీ వొక డనేగదా యని నామన సుప్పొంగుచున్నది.

మన ప్రస్తుత దుస్థితికై నా మనంబెంతయు పరివేదనమొందుచున్నది. మన ప్రస్తుత దుస్థితిని దొలగద్రోయుటకై మనమేమి జేయవలయును? ఈ తరుణమున ప్రభుత్వమువారు నెరవేర్పవలసిన ధర్మమేమి? అత్యంతావశ్యములగు నిట్టి సమస్యలన్నియు మనకిప్పుడు కన్పట్టుచున్నవి. వీనిని మనమెట్లు పరిష్కరింపవలయునో యోచింపవలెను. బీదరైతులను పరిపాలించు వారు ప్రభుత్వమువారైయున్నారు; అంతమాత్రముచేత, బీదరైతులైన నాబోటి వారికి ప్రభుత్వమువారిమీద నధికారము లేదని చెప్ప వీలులేదు. ప్రభుత్వమనునది భాగ్యవంతులకై యేర్పాటుగా బడలేదు. అది కేవలము బీదరైతులకయియే యేర్పరుపబడినది. నిరుపేదయైన

రైతు తనను తాను సంరక్షించుకొనలేడు; ఒక తెగవారు మరియొక తెగవారిపై, నిరంకుశముగ ప్రాపించేయ మొదలిడి వారిని పీడించుచున్నప్పుడు, వారిని రక్షించు భారము ప్రభుత్వమువారిపైనున్నది. మన ఇక్కట్టుల నెల్ల ప్రభుత్వమువారికి తెలియపరచుకొని, వానిని వారు నివారించువరకు మన పట్టును విడువకూడదు; ఇట్లు చేయించుకొనుటకు మనకు ప్రభుత్వమువారిపై యధికారము గలదు. వారిపై నిట్టియధికారమును చలాయించుటకు ప్రతివానికిని హక్కుగలదు; చలాయించి తీరవలెను. ప్రభుత్వమువారు మన మొఱలను విననియెడల, వారు తప్పక విని తీర వలయునని మనము వారిని నిర్బంధించవలెను. బీదలను పీడించి వారివద్దనుండి ధనమును గ్రహించి, భాగ్యవంతులను తృప్తినొందించి, దానివలన వచ్చులాభము నంతను భాగ్యవంతులకే కట్టిపెట్టకూడదు. ప్రస్తుతకాలమున, బీదలకంటె, భాగ్య వంతులవద్దనుండియే యెక్కువపన్నులను గ్రహింపవలయును. తమక్రిందిరైతు,— పాపమా బీదరైతు—సౌఖ్యముగనున్నాడో, లేక కష్టములలో బడియున్నాడో, ప్రభుత్వమువారు విచారింపనియెడల, వారట్లు విచారించునట్లు చేయింపవలెను. అందులకయియే, అధికార పదవులయందు మనవారుండవలెనని మనమింతకాలము నుండియు గోరుచున్నాము. ప్రజలందరును అధికార పదవులయందుండజాలరుగద. కనుక ప్రభుత్వమును నడపుట కవుసరమైన యధికారులను ప్రజలమైన మనమే యెన్నుకొనవలెను. ఇప్పుడుమనమేమి విచారింపవలెను? ప్రస్తుతమున్నపరిపాలనా పద్ధతి యీ విధముగ నున్నదా లేదా యని విచారించి చూడవలెను. ఇట్లనేక సందేహములు బయలుదేరును. మన పరిశ్రమలు, మనచేతిపనులు (మన వర్తకము) సక్రమరీతి లభివృద్ధిలోనున్నవా లేవా, యని కూడ విచారింపవలెను. వీనికన్నిటికిని మూలకారణమైన రాజ్యాధికారమే యీ సందేహముల నన్నిటిని పరిష్కరింప గలదు. ప్రతివారును దీని నొప్పుకొని తీరవలయును.

మీరందరీ సమయమున గవర్నమెంటువారికి యుద్ధమునకై సహాయము చేయవలసినదని మీ యందరితోడను మనవిచేయుటకయియే నే నిప్పుడిచ్చటికి వచ్చితిని. కాని మీరందరును యుద్ధఫండును వసూలుచేయుచు తన్మూలమున ప్రభు త్వమువారికి సహాయము చేయుచున్నప్పుడు మీ ఇక్కట్టుల నెల్ల గవర్నమెంటు వారికి తెలియజెప్పుకొను విషయమును మాత్రము మరచిపోవద్దు. ధనసహాయమును చేయవలసినదే; కాని మీ మొఱల నన్నిటిని యాలకించి వానిని తీర్పవలసిన బాధ్య తను మాత్రము మీరు గవర్నమెంటువారిపై బడవేయుడు." ముందుదబ్బివ్వవలసినదే; పిమ్మట యెప్పుడో మీ మొఱలను విని యోచించెదములే" యని జెప్పిన యెడల

(మనదేశములో తప్ప) నింకే యితర దేశములోని ప్రజలును యిట్టిమాటలను విని సహించి యూరకొనరు. మనమిచ్చుధనమును, మన హక్కులును ఒకటిగనే యుండ వలయును. కోట్లకొలది జనము యుద్ధమునకు బోవ సిద్ధమేయని మనము చెప్పుచునే యున్నాము. బీహారు పరగాణాతో కలుపుకొని మొత్తము బొంబాయి రాజధాని యంతట మీదను వేయిమంది జనము యుద్ధములోనికి రావలెనని ప్రభుత్వమువారు కోరిరి. కాని ఒక్క బొంబాయి మాత్రమే 800 మందిని సప్లై చేసినది. మీరందరును యుద్ధ పత్రములు కొనవలసినదే; కాని ప్రతి యొక్కొక్క పత్రమును ఒక్కొక్క చిన్న "స్వరాజ్యపు దస్తావేజు" అని మీరెంచుకొనవలెను డబ్బివ్వవలసినదనియు యుద్ధమునకు సహాయము చేయవలసినదనియు కోరుచు, మనకేమియు హక్కులను మాత్రమీయకుండుట చూడ, బహు వింతగనున్నది. "డబ్బివ్వవలసినదేగాని, హక్కులను కోరవద్దు" అని మన చక్రవర్తిగారు శెలవిచ్చుటలేదు "ప్రస్తుతమిప్పుడు మీరందరు డబ్బివ్వండి; పిమ్మట యుద్ధమంతయు ముగిసి, దేశమంతయు శాంతముగనున్న తరువాత, తక్కిన వాని విషయమై యోచించెదను" అని చెప్పుట న్యాయముకాదు ప్రజల మనస్సులను సంతోష పెట్టగలిగినప్పుడే, ప్రజలవద్ద నుండి ధనము రాగలదని గవర్నమెంటు వారికి తెలియజెప్పవలెను. గొప్పవారు, కొద్దివారు, భాగ్యవంతులు, బీదలు, వారు వీరననేల ప్రతివాడును ముందు తన హక్కులను గూర్చి బాగుగ యోచించుకొని మనస్సును దృఢపరచుకొనవలెను. అటుపిమ్మట ధనసహాయమును జేసి హక్కులను సంపాదించుకొనవలెను. మనదేశమిప్పుడు మిగుల పేదస్థితిలో నున్నదని ప్రతివానికిని, కన్నులు తెరువని పసికూనకు సైతము తెలియును. ఇట్టిదేశములో 150 కోట్ల రూపాయలు వసూలు చేయవలసి నప్పుడెంత కష్టము కలిగినదో విచారింపుడు పూర్వము నూరు సంవత్సరముల క్రిందివరకు పరదేశమునుండి మనదేశముమీదికి దండెత్తివచ్చి, మనదేశమును కొల్లగొట్టి, కోట్లకొలదిధనమును పరదేశస్థులెత్తుకొని పోవుచుండిరి. కానిఇప్పుడన్ననో అట్టిమనదేశములోనే గవర్నమెంటువారికి సహాయము చేయవలయునని మనకెంత ఉత్సాహమున్నను యుద్ధఫండునకు కావలసిన ధనమును ప్రోగుచేయలేకున్నారము. మనదేశ మిప్పుడెంత నిరుపేదస్థితికివచ్చినదో చూపుటకీ నిదర్శనమొకటి చాలదా? ఈ దుస్థితిని తొలగ ద్రోయుటకు మనకిప్పుడొకటే మార్గముకలదు అదేదన స్వరాజ్య సంపాదనమే. దీనికి మార్గము స్వరాజ్యమననేమి? నాయిష్టప్రకారము, నా వ్యవహారములు జరుగుచుండవలయును. ఇదే స్వరాజ్యము ఇప్పుడున్న కలెక్టరులందరును మిక్కిలి తెలివిగలవారు! కాని వారందరును ప్రజలకు సేవకులై వర్తింపు

చుండిన యెడల యిప్పటికంటె ప్రజలకు పదిరెట్లెక్కువ మేలు జరుగగలదు. అధికారులకందరకును ఉద్యోగములిచ్చుట, జీతముల నిర్ణయించుట, మొదలగు సీహక్కులన్నియు ప్రజల చేతులలోనే యున్నయెడల, రాజ్యపాలనాధికారమంతయు ప్రజల వశముననే యుండగలదు. అసలు ప్రజలకు సేవకులుగ నుండవలసిన ఈ యుద్యోగస్థులందరిప్పుడు తామే యజమానులమని తలంప మొదలిడిరి. నిజముగ, వీరందరును ప్రజా సేవకులుగనే యుండవలెను. ధనమంతయు మనదే యైనప్పుడు, దానిని మన యిష్ట ప్రకారమే ఖర్చుపెట్టవలయును. తెల్లవాళ్ళను వెళ్ళగొట్టవలసినదని యిప్పుడెవరును చెప్పుటలేదు. యుద్ధఖండు వసూలుచేయుటకై మనమిప్పుడేల సహాయము చేయుచున్నాము? జర్మను లిక్కడికివచ్చి మనమీద రాజ్యమేలవలయుననియా? అట్లెంతమాత్రమును కాదు. సామ్రాజ్యపరిపాలన మనకుండి తీరవలయును. ఇంగ్లీషువారి సహాయముననే మన మభివృద్ధి గాంచవలెను. దీనిలో రాజద్రోహముగాని, శాసనోల్లంఘనముగాని యించుకంతయు లేదు. తామే యిప్పుడు పరిపాలకులమని తలంచు యీ సేవకులందరును, సేవకులుగనే యుండవలెను. ప్రభుత్వమువారికై మీ ప్రాణములను ధారవోయుడు; వారికి సహాయముజేయుడు, కాని మీపరమలక్ష్యమెల్లప్పుడు స్వరాజ్యము మీదనే యుండవలెను; మీరు దానిని మరువ కూడదు. ఇకముందు మీకు మేలు దానివలననే గలుగవలయును. నేనిప్పుడు మీకు చెప్పదలచిన దేమనగా:— గవర్నమెంటువారికి సహాయము చేయవలసినది. కాని నోరుమూసికొని కాదు. డబ్బుసంచులూరక తీసికొనివెళ్ళి వారికి సమర్పింపవద్దు. "మీరుమాకు స్వరాజ్యమిచ్చు నిమిత్తమై, మేముమేము దీనిని మీకుబహుమానముగా యిచ్చుచున్నాము" అనివ్రాసి యొక చిన్నచీటీని పరిసంచికిని కట్టి గవర్నమెంటువారి పెట్టెలో బడవేయుడు. గవర్నమెంటువారు మనకు స్వరాజ్యమిచ్చెద మని వాగ్దానము చేసినయెడల, ఒక్క 150 కోట్లుమాత్రమేగాక, 300 కోట్ల రూపాయలను మనము సప్లై చేసెదము.

కేవలము దోషరహితమైన విషయములనుగూర్చి మాట్లాడుటకు మీకు జంకకూడదు. మనకు కొంతకష్టము రావచ్చును. కాని, కష్టములేనిది యేపనియు జరుగనేరదు మీకు స్వరాజ్యము ఆకాశమునుండి యూడిపడదు.

బాధపడువాడు మాల్గును. కాని దానికి మన మేమి చేయగలము. కనుక మీ రందరును, అత్యుత్సాహముతో, మనస్ఫూర్తిగ పనిచేయవలసి యున్నది. ప్రస్తుతము సీమలోని ఆంగ్లప్రజలు మన మొరలను వినుటకు సిద్ధముగనున్నారు. ఇదంతయు మన యదృష్టమే. కాంగ్రెసు (జాతీయమహాసభ) వారు స్వరాజ్య తీర్మాన

మును ఆమోదించి యున్నారు. హిందూమహమ్మదీయు లేకమైయున్నారు. మితవాదులను, అతివాదులును తమ తమ భేదములెల్ల మాపుకొని యున్నారు. కార్యాచరణ కిది తరుణము. నేనీవిషయముల నెల్ల నెక్కువగ బీదలకే తెలియజెప్పవలసి యున్నది. భాగ్యవంతులయొద్ద నాకంతఎక్కువగ నమ్మకములేదు. మేము పైసా ఫండును వసూలుచేయ బోయినప్పుడు భాగ్యవంతులకంటె బీదలే యెక్కువ యుత్సాహముతో, యెక్కువమనస్ఫూర్తిగ, ధనము నిచ్చిరని మే మనుభవము మీద జూచితిమి. నేనును మీ యందరివలెనే, పేదవాడను గనుకనే, మీయందరి తోడను మాట్లాడుచుంటిని. స్వరాజ్యమహాత్మ్యమేమో మీకు తెలియునా! మనకు స్వరాజ్యము వచ్చినయెడల, మనకోర్కెలన్నియు క్షణములో నెరవేరును. మనము మనస్ఫూర్తిగ, కష్టపడి పనిచేసినట్టయిన, యుద్ధము ముగియగనే రెండుమూడు సంవత్సరములలో మనకుస్వరాజ్యము రాగలదని సూచనలనేకములు గన్పట్టుచున్నవి. మనలో మనకుండు పోరాటములన్నియు మాపుకొందుము గాక. స్వరాజ్యమునకు వ్యతిరేకముగ మాట్లాడువారి మాటలను మనము వినకూడదు మీమనస్సులను దృఢపరచుకొనుడు. దృఢసంకల్పులైయుండుడు. (స్వరాజ్యసంపాదనకై) విడువక పాటుబడుడు రాజభక్తి పూరితులై యుండుడు. సీమలోని ఆంగ్లప్రజలెల్ల మీపక్షమునకు వచ్చి, మీపక్షమున పోరాడునట్లు మీరు కృషిసలుపవలెను. అట్లయిన యెడల, పరమేశ్వరుడు మీకోర్కెల నెల్ల నిశ్చయముగ నెరవేర్పగలడు. మనస్ఫూర్తిగ జయమొందవలయునని పాటుబడువారికే భగవంతుడు సహాయపడును; అట్టి వారికే జయమునిచ్చును.

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—:o:—

## 34 హిందూమత ప్రాశస్త్యము

[ఆన 1906 సం॥ జనవరి మూడవతేదీని కాశీపట్టణములో "భారతధర్మ మహామండలి" పక్షమున నిచ్చినయుపన్యాసము.]

ఇంగ్లీషు మహారాష్ట్రిభాషలలో తప్ప నింక నేయితరభాషలోను నే నుపన్యసింప జాలనందుల కెంతయు జింతింపుచున్నాను. మతవిషయమై మాట్లాడ దలచుకొన్నపుడు ఇంగ్లీషుభాష నుపయోగింపనే కూడదు. ఇంగ్లీషుభాషను బహిష్కరించియే తీరవలెను. కాని నేనిప్పుడట్లు చేయుటకు వీలులేదు. యిప్పుడింగ్లీషు నుపయోగింపక తప్పకవచ్చినది అందులకు మీరు నన్ను క్షమింతురుగాక. హిందూమత ప్రాముఖ్యమును గూర్చియు, దాని ప్రస్తుతస్థితిని గూర్చియు, అది నశించిపోకుండ దానిని గాపాడుటకై ప్రస్తుతము దేశమునందు జరుగుచున్న ప్రయత్నములను గూర్చియు, నే నిప్పుడు నాలుగుముక్కలను జెప్పెదను. హిందూమతమన నేమి? మన దేశములోని వివిధప్రదేశములకు బోయి జూచిన యెడల, పలువురు, పలుచోట్ల, పలుతెరంగుల, వేర్వేరు అభిప్రాయములతో నున్నట్లు గనిపించును. ఇచ్చట నీదేశములో చాలమంది వైష్ణవమతావలంబకు లైయున్నారు. మీరు దక్షిణ దేశమునకు బోయి జూచినయెడల, మీకచ్చట రామానుజమతస్థులును యింక ననేక మతావలంబకులును, గాన్పింతురు. అట్లయినప్పుడింక హిందూమత మన నేమి? ఈ వివిధమతముల నన్నిటిని, తనలోనికి లోగొని, వీనినన్నిటిని తనలో నిమిడ్చికొని, పరస్పర విద్వేషములు లేక వీనినన్నిటిని సమన్వయింప జేసికొనినానే గాని లేనియెడల, యీ భారతధర్మ మహామండలి నిజముగ మహామండలి యనిపించుకొనజాలదు. హిందూమత శాఖలనన్నిటి నొకటిగజేర్చి వానినన్నిటిని యీమండలి యాజమాన్యముక్రింద సమన్వయింపజేసినప్పుడే యీమండలి యొక్క కృషి సార్థకమగును. ఈ వివిధమతము లన్నియు వేదమతమునుండి బయలుదేరిన

శాఖలేనైయున్నవి. "సనాతన" ధర్మమనగేమి? మన మతము చాలపురాతనమైనదని యీ పేరువలన తేలుచున్నది. మానవజాతియనునది యెంతకాలముక్రిందట పుట్టినదో మన మతముకూడ నంతకాలము క్రిందటనే పుట్టినది. వేదమతమనునది బహుపురాతనకాలమునుండియు, మన యార్యులచే నవలంబింపబడుచు వచ్చినమతమే. కాని, యేశాఖయును తనంతట తానే నిలువజాలదు గద. ఈ విషయమందరికిని తెలిసియే యున్నది. హిందూమతమునం దనేక శాఖోపశాఖలు గలవు. ఇవన్నియు కలిసియే హిందూమతమగుచున్నది. ఇవన్నియు నొక గొప్పమతమునుండి యుద్భవిల్లిన కొడుకులు, కూతుళ్ళవంటి పెద్దసంతానమై యున్నది. వీనిలో వీనికిట్టి పరస్పర బాంధవ్యముగలదు. మన మీవిషయమును దృష్టియందుంచుకొని, యీ వివిధశాఖల నన్నిటిని యొకటిగా జేర్చుటకై కృషిసలిపినయెడల, మనహిందూమత మభేద్యమగు గొప్పశక్తిగాగలదు. ఎంతకాలము మనలో మనకిట్టి భేదములుండునో, ఎంతకాలము ఒక శాఖను మరియొక శాఖకునుగల సంబంధమును మనవారు గ్రహింపరో, అంతవరకును మనము హిందూమతస్థుల మను పేరు బెట్టుకొని పైకి రాజాలము. మతమనునది 'జాతీయస్వత్వము'లో (Nationality) లో నంతర్భాగమై యున్నది. ధర్మమను పదమునకు "బంధము" లేక "ముడి" యని యర్థము. "ధర్మ" మనుపదము 'ధృ' అను మూలమునుండి యుత్పత్తి యైనది. "ధృ" అనగా వహించుట, లేక రెండువస్తువుల నొకటిగాజేర్చి కలిపియుంచుట (బంధించుట). ఒకటిగా కలిపి యుంచుట కేమిగలదు? ఒక జీవాత్మను మరియొక జీవాత్మతోడను, ఒక్కొక్క జీవాత్మను పరమాత్మతోడను, కలిపి యుంచునదేది? ధర్మమననేమి? మనము భగవంతుని యెడలను, మనలో మనయెడలను, ఎట్లు ప్రవర్తింపవలెనో, యేయేవిధుల నెరవేర్పవలెనో, తెలుపునదే ధర్మమనబడుచున్నది. ఈ రెండును కలిసియే మతమగుచున్నది. మనము భగవంతునియెడ నెట్టిధర్మముల నెరవేర్పవలెను? నరులలో నరుల కెట్టి పరస్పరధర్మ ముండవలెను? ఈ రెండునుకలిసి మత మగుచున్నది. కనుక మన హిందూమతము మనకు * సౌశీల్యము, † సాంఘిక బాంధవ్యమును, (యీ రెంటిని) బోధింపుచున్నది. ఇదియే హిందూమతము యొక్క నిర్వచనము (Definition) మనము కొంచెము వెనుకకుబోయి, పూర్వకాలమునుండియు, మనహిందూమత మీ నిర్వచనానుసారమెట్లు ప్రవర్తిల్లినదో విచారించి

---

* భగవంతునియెడ నెరవేర్పవలసిన ధర్మముల నెరవేర్చుట సౌశీల్యము (Morality) మనుష్యునకును మనుష్యునకును గల సంబంధము పేరు "సాంఘిక సంబంధము" ఈ రెండు ధర్మములను మన హిందూమతము బోధింపుచున్నది.

చూపెదము గాక. ఈ నిర్వచనమెట్లు సార్థకమైనదో (యెట్లాచరణలోనికి గొని రాబడినదో) విచారించి జూడవలసి యున్నది. వేదకాలము నాటికి మన భరతవర్షము సర్వ సమృద్ధమై నెగడుచుండెను. భరతఖండమంతయు గొప్ప మహాజాతిగ, నొక్కటై, సంఘీభావముతో ప్రవర్తిల్లెను. కాని, ఇప్పుడిట్టి సంఘీభావ మదృశ్యమైనది. మనమందరము మధోగతియందు పడియుండుట సంభవించినది. కనుక యిట్టి సంఘీభావమును తిరిగి యుద్ధరించుట దేశ నాయకుల ధర్మమై యున్నది. ఇచ్చట కాశిలోనుండు హిందు వెంత హిందువో, బొంబాయి, చెన్నపట్టణములలో నుండు హిందువు కూడ నంతియే హిందువు. వీరిలో భేద మేమాత్రమును లేదు వీరందరొకే విధమైన దుస్తులు ధరింపక పోవచ్చును; ఒకే భాషను మాట్లాడక పోవచ్చును; కాని ప్రతివాని హృదయమును చలింపజేయున దొక్కటే భావము గలదు. వీరి మనంబులందుండు భావములన్నియు నొక్కటే. భారత, భాగవత, భగవద్గీత, రామాయణాది పవిత్ర గ్రంథ పఠనమువలన జనులందరి మనంబులొకే విధమున జలింపుచుండును; వీనివలన అందరికి నొకేభావము లుత్పన్నమగును. వేదములు, భగవద్గీత, రామాయణము - యివన్నియు మనకు సర్వ సాధారణమైన, అమూల్య సంపదలుగావా? ఇవన్నియు మనము సర్వసాధారణముగ ప్రేమిక్క పవిత్ర గ్రంథములు కావా? మన మీ విషయము నెడలనే యెక్కువ శ్రద్ధ వహించి తక్కిన యల్ప భేదముల నన్నిటిని మరచిపోవలెను. మనమిట్లు కార్యాచరణకు గడంగిన యెడల, భగవదనుగ్రహమువలన, మన మచిరకాలములోనే శాఖోపశాఖల నన్నిటిని నొకటిగా జేర్చి, దీనినొక గొప్ప హిందూమతముగా జేయగలము. ఇదియే ప్రతి హిందువునకు నుండవలసిన పరమోత్కృష్టమైన సంకల్పము. మీరందరును కలియుట కిట్లు మీరు కృషిసలిపిన యెడల కొద్ది సంవత్సరములలోనే, దేశము నంతటను ఒకే భావమును, ఒకే వాంఛయును, ప్రజల మనములలో తాండవమాడుచు నుండగలదు. మనము చేయవలసిన పని యిది. ప్రస్తుతము మన మతస్థితి యెంతమాత్రమును బాగుగ లేదు.. ఇట్టిది మన కెంతమాత్రమును పనికిరాదు. మనమందరమును చీలిపోయి యున్నామని మన మనస్సుల కెల్లప్పుడును తోచుచుండును. పూర్వకాలమున మనలోనున్న ఆ ఏకజాతీయతా-భావము నేడదృశ్యమైనది. మనలో మనకిట్టి భేదములు, శాఖోపశాఖలు, నుండుట నిజముగ మనయొక్క దురదృష్టము. మనలోనుండి యదృశ్యమై మనలను బాసిపోయినట్టియు మనము కేవలము నేడు మరచిపోయినట్టియు ఆ పూర్వపు యేకజాతీయతా భావమును, సంఘీభావమును తిరిగి పునరుద్ధరింపజేయుట యీ భారత ధర్మ మహామండలి వంటి

సంఘములయొక్క ధర్మమైయున్నది. ఆ యేకజాతీయతా భావము లేనియెడల, మన భరతఖండము తక్కిన జాతులతో బాటు సమాన పదవియందుండజాలదు. షుమారు రెండువేల సంవత్సరములనుండియు మనదేశ మిట్టి స్థితియందే బడియున్నది. కొంతకాలము బౌద్ధమతము ప్రబలినది. బౌద్ధ, జైన మతస్థులు మన హిందూమతముపై దండయాత్రలు సలిపిరి. ఇట్లారువందల సంవత్సరములు సంక్షోభమున బడియున్న తరువాత, శ్రీ శంకరాచార్యులవారను మతోద్ధారకు లుద్భవించిరి. ఆయన మన మతమునందుండు వేదాంత ధర్మములనెల్ల క్రోడీకరించి, వానిని ప్రమాణ పూర్వకముగ బుజువుపరచి, వానిని ప్రపంచమునకు బోధించి మనమతమును తిరిగి స్థాపించిరి. వెంటనే బౌద్ధ (చార్వాకాది) మతములు దేశమునుండి తుడిచిపెట్టుకొని పోయినవి.

ఈలోకమున ధర్మమెప్పుడు నశించునో, అప్పుడు తద్ధర్మసంస్థాపనార్థమై తాను యుగ యుగమునందున-యవతారమెత్తి యీలోకమునకు వచ్చుచుందు నని శ్రీకృష్ణులవారు భగద్గీతలలో మనకు వాగ్దత్తము జేసియున్నారు. ఇది శాశ్వతమును పరమోత్కృష్టము నైన వాగ్దానము. వివిధభేదములవలన, నరులలో సంఘీభావము లేనందువలన, ధర్మము నశించినప్పుడు, సాధులకుహింసగలిగినప్పుడు, మనలనురక్షించుటకై శ్రీకృష్ణులవా రవతారమెత్తెదరు. ఎన్ని పర్యాయములు కావలసిన, నన్ని పర్యాయములు భగవంతుడు మనకొరకై యవతారమెత్తివచ్చి మనలను రక్షింపగలడని, నరులకు ధైర్యమును జెప్పగల మతము మన హిందూమత మొక్కటే తప్ప, ప్రపంచమున నింకే మతమును లేదు. నరుల కుత్సాహమును పురిగొల్పగల యిట్టి వాగ్దానము యేమతములోను లేదు మహమ్మదు తరువాత యేప్రవక్తలును, యే యవతార పురుషులును, వత్తురను వాగ్దానమేలేదు. యేసు క్రీస్తు ఒక్క పర్యాయమే యవతరించెను. ధైర్యమును పురిగొల్పి యిట్టి యుత్సాహమును పుట్టింప గల వాగ్దాన మే మతములోను లేదు. ఈ కారణము చేతనే మన హిందూమతము నశింపలేను మనకెప్పుడును నిరుత్సాహము లేదు. మనమెప్పుడును నిరాశ జేసికొనము.

మన మతధర్మములును, మతసూత్రములును సత్యము లని ప్రపంచమంతయు గ్రహింపగల సమయము వచ్చితీరును. ప్రతిమనుష్యుడును దీని విషయమై తనశక్తి వంచన లేక పనిచేయవలసియున్నది. ఈ భారత ధర్మమండలి కూడ శక్తి వంచన లేక కృషిసలుపుచున్నది. గాన హిందూమతావలంబకుడైన ప్రతిమానవుడును, దీనికి తోడ్పడి, యీ యుద్యమమును జయప్రదముగ కొనసాగింతురుగాక. దీనికి తోడ్ప

డుటకై యిప్పు డెవరును ముందునకు వచ్చి నిలువబడకపోయినను, యికముందు భవిష్యత్సంతతివారైనను దీనికి తోడ్పడగలరను నాశతో మన మెదురు చూడవలసి యున్నది. మన మెప్పుడును నిరాశ చేసికొనము. శ్రీకృష్ణులవారు మన కనుగ్రహించిన సుస్థిరమైన, పవిత్రవంతమైన, యిట్టి వాగ్దానమే యితర మతములోను గానరాదు. ఈ వాగ్దానమునకు సత్యమే యాధారము. సత్య మెప్పుడును నశింపదు. నేనీవాక్యములను దృఢమనస్సుతో జెప్పుచున్నాను. నే జెప్పుదానిని ఋజువుపరచుటకు సిద్ధముగ నున్నాడను. సత్యమనునది యొకరి సొమ్మె కాదు. సత్యమనునది యీ విశ్వమంతయు వ్యాపించి, యతివిశాలమై యున్నది; ఈవిశ్వవ్యాప్తతయే సత్యము యొక్క ముఖ్యలక్షణ మైయున్నది. సత్యమనునది యొకజాతియందే యిమిడి యుండలేదు. హిందూమతమున కన్ని మతములయెడ సహనము గలదు. సమస్త మతములును సత్యమునే యాధారము చేసికొనియున్నవి. కనుక "నీవు నీ మతము నవలంబింపుము; నేను నామతము నవలంబించెదను" అని హిందూమతము బోధింపుచున్నది.

శ్లో॥ యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేపి మా మేవ కౌన్తేయ ! యజన్త్యవిధి పూర్వకమ్॥

భగవద్గీతా 9 వ అధ్యా; 23 శ్లో॥

అన్యమతావలంబకు లందరును క్రమమైన మార్గమున గాకపోయినను, యేదియో యొక విధమున భగవంతుని గొల్చుచునేయున్నారని శ్రీ కృష్ణులవారు శలవిచ్చి యున్నారు. అన్యమతావలంబకుల కందరకును శాశ్వతనరకప్రాప్తియే గతి యని శ్రీకృష్ణులవారు చెప్పియుండలేదు. ఇతర మతగ్రంథములలో నెచ్చటనైన నిట్టి వాక్యములు గలవనిజూపింపగలవారెవరైన నున్నయెడలజూపింపవలసినదని నేప్రతిజ్ఞ జేయుచున్నాను. ఇట్టివాక్యము లేయితరమతగ్రంథములలోను గాన్పింపవు; ఏలనన తక్కినమతము లన్నియు కొంతవరకే సత్యములైయున్నవి. హిందూమతమన్ననో, అట్లుగాక, పూర్ణమైన, శాశ్వతమైన, సనాతన సత్యముమీద నాధారపడియున్నది. కనుక తుదకు మనమతమే జయమొందితీరును. బహుసంఖ్యాకులైన జను లీమతావలంబకులై యుండుటకూడ దీనికొక విధమైన బలమే యని చెప్పవచ్చును. కోట్లకొలది ప్రజలచే ననుష్ఠింపబడుమతము నశించిపోగలదా? అట్లెంతమాత్రమును నశింపదు మన ప్రజలందరును అకస్మికముగ, నొకేసారి (ప్రళయకాలములోవలె) తుడిచిపెట్టుకొని పోయిననే తప్ప, లేనియెడల, మనమతము నశింపజాలదు మనకు కీర్తిప్రదమైన జయము చేకూరవలె ననిన ఒకేఒకమార్గము కలదు. అదేదనః— అనేక అంతర్భాగ

ములుగ జీలి శాఖోపశాఖలుగనున్న వివిధ మతములనన్నిటిని నొకటిగ జేర్చవలెను. వీనిలో నున్న సర్వసాధారణ ధర్మముల నెల్ల క్రోడీకరించి యొకటిగ జేర్చవలెను. అనివార్య మగు మహావేగముతో ప్రవహించు మహానదివలె మన హిందూమతమును ఒకే ప్రవాహముగ చేయవలెను. ఈ భారతధర్మ మహామండలి చేయవలసిన గొప్పకార్య మిది యైయున్నది. మన మందరమును సంఘీభావముతో వర్తించెదము గాక. ఒకడు భిన్నమగు వస్త్రములనుధరించి, వేరొకభాషను మాట్లాడుచు, వేరొక దేవత నుపాసించుచున్నంత మాత్రముచేత, హిందూసోదరు డైనయట్టి వానికి మనము సాయపడక యూరకుండవలసినదేనా ? సమస్తమైనవానిని తనలో నిముడ్చుకొనుటయే మన హిందూమతముయొక్క ముఖ్యలక్షణ మై యున్నది—ఇట్లే మన హిందూ మత వాఙ్మయమంతయు కడువిశాలమై విశ్వమునంతను తనలో నిమిడ్చుకొని యున్నది. మన కత్యద్భుతమైన గ్రంథరాజములును, అతివిశాల మగు వాఙ్మయములునుగలవు. భగవద్గీతలలో 7వందల శ్లోకములలోనిండి, నిబిడీకృతమైయున్న జ్ఞానమతి విశాలమై యున్నది. పాశ్చాత్యవేదాంతముగాని, తదితర వేదాంతముగాని, ఎట్టిదైనను, యీ భగవద్గీతలలో నిమిడియున్న జ్ఞానమును జయింపజాల దని నా దృఢనమ్మకము. ప్రస్తుతము మన మతమునకు వ్యతిరేకముగ ప్రతిఘటించి నిలువబడియున్న గొప్పశక్తులు రెండుగలవు. వానినిగూర్చి యిప్పుడు విచారించుదము. అవేవనగ (1) ప్రకృతిశాస్త్రము (= Science = సయిన్సు) (2) క్రైస్తవమతము. మన మతమునకు వ్యతిరేకముగ ప్రతిఘటించుచున్న వేవైన గలవాయని విచారించి చూచిన యెడల యిప్పుడీ రెండే గాన్పించుచున్నవి. మొదట దాని విషయమై యోచించుదము. ప్రకృతిశాస్త్ర మభివృద్ధియైన కొలది, పాశ్చాత్యుల యభిప్రాయములలో గొప్ప మార్పు కలుగుచున్నది పాశ్చాత్యులు క్రొత్తగా కనిపెట్టినామని చెప్పుకొను గొప్పగొప్ప ప్రకృతి సిద్ధాంతము లన్నియు పూర్వము మన ఋష్యాదులకు కరతలామలకము లైయుండెను. మన పూర్వుల సుజ్ఞానమును, వారి సిద్ధాంతములను సత్యములనియు, ఇవియే యన్నిటికంటె ప్రశస్తమైనవని పిలిపించుకొనగల హక్కు వానికే గలదనియు, యిప్పుడిప్పుడు ప్రకృతిశాస్త్రము వలన ప్రపంచమునకు బోధపడుచున్నది. వర్తమానకాలమున ప్రకృతిశాస్త్రపరిశోధనాగారము లెక్కువయిన కొలదియు, ప్రకృతిశాస్త్రజ్ఞానము విరివిగా ప్రబలిన కొలదియు, మన హిందూ ధర్మములసత్యము పాశ్చాత్యులకు తెల్లమగుచున్నది మనహిందూమత సిద్ధాంతములను, మూలసూత్రములను, తదితర హిందూధర్మము లన్నియును సత్యమువే (సుస్థిరమైసత్యమువే, నిశ్శంకమైన సత్యమువే) యాధారము చేసికొని నిలచియున్నదనిపాశ్చాత్యు లిప్పుడిప్పుడు గ్రహింపగల్గుచున్నారు. దీనికొక యుదాహరణ

జూడుడు :— చైతన్యమనునది యీ విశ్వమంతయూ వ్యాపించి యున్నది. ఇది కేవలము హిందూమత సిద్ధాంతము, ఈవేదాంత సిద్ధాంతము, యిప్పటి ప్రకృతి శాస్త్రప్రకారము (సయిన్సు ప్రకారము) అక్షరాలా సత్యమని మొన్న మొన్ననే ప్రొఫెసర్ బోసుగారు ఋజువు పరచియున్నారు. ఇంకొక యుదాహరణ జూడుడు. "ఆత్మకును, యీ శరీరమునకును యెట్టి సంబంధమును లేదు. ఈశరీరము నశించిన పిదప సైతమూ, ఆత్మనశింపక నిలచియే యుండును" ఈ సిద్ధాంతమును విచారించి చూడుడు. కర్మ సిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము నను నీ రెండును పైన చెప్పిన దానితో నేకీభవించుచునే యున్నవి. ("స్పెన్సరు") అను తత్వవేత్త యీ సిద్ధాంతములలో సత్యమున్నదని యెన్నడును నమ్మియుండ లేదు. కాను మొన్న మొన్ననే "సర్ ఆలివర్ లాడ్జి" "మేయరు" అను వారు వీనిలోని సత్యమును గ్రహింప గలిగిరి. "శరీరము నశించినను ఆత్మ నశింపదను" మన హిందూ సిద్ధాంతము సత్యమేయని వారు ప్రకటించిరి. ఇది మన ప్రతిభ కెంతయు వన్నెదెచ్చునదై యున్నది వారి మనస్సుల కిప్పు డంతవరకైనను బోధపడి, వచ్చినది. ప్రస్తుతపు ప్రకృతిశాస్త్ర ప్రకారము (సయిన్సు ప్రకారము) పునర్జన్మ సిద్ధాంతము గాకపోయినను, తుదకు కర్మ సిద్ధాంతమైనను సత్యమని యొప్పుకొను చున్నారు కాని క్రైస్తవ మతస్థులు దీనికి కూడ సమ్మతింపరు క్రైస్తవుల సిద్ధాంత మేమనగః- "భగవంతుడు తిరిగి తిరిగి ప్రతిపర్యాయ మొక్కొక్క క్రొత్తఆత్మను నరున కిచ్చుచుండునని వారు తలం చెదరు. కనుక పాశ్చాత్యుల యభిప్రాయములలో క్రమక్రమముగ మార్పులుగలుగు చున్నట్లు మనకు గాన్పించుచున్నది. సయిన్సు (ప్రకృతిశాస్త్ర) జ్ఞాన మెక్కువైన కొలదిని మన ప్రతిపక్షులు క్రమక్రమముగ నదృశ్య మగుచున్నారు. గాన ధైర్య మవలంబింపుడు. కార్యసాఫల్యతకై కృషిసలుపుడు. తుదకు మనము జయమొంద గలము. మీ రందరు కొద్దిగ్రశమబూని, మనలో నైకమత్య మభివృద్ధి బొందింపు టకై పాటుపడిన యెడల, మనకు ముందెంతయో మేలుగలుగ గలదు భావికాలము మనకెంతయో శుభదాయకముగ గన్పట్టుచున్నది . ఈదినములలో అమెరికా దేశ స్థులు మన వేదాంతము నంతను ఊరకచదువుట మాత్రమేగాక, బాగుగ పరిశ్రమ జేసి దానిలోని సారమును గ్రహింపుచున్నారు. ప్రతిమనుష్యుని శరీరములోను "గుండెకాయ" యనునదొకటియుండును అది యెల్లప్పుడును (గడియారమువలె) కొట్టుకొనుచుండును. అది యట్లు కొట్టుకొనకుండ మనయిష్టము వచ్చినపుడు మనం తట మనమే యాపివేయ వచ్చును. (అని మన యోగశాస్త్రములో జెప్పియున్నారు) కాని ఏ యూరపియన్ డాక్టరు (వైద్యుడును) దీనిని నమ్మడు. కాని అట్లు

వాస్తవముగ నాపివేయవచ్చునని మనవారు ఋజువుపరచిరి మనవేదాంత, యోగ శాస్త్రములు రెండును సత్యములు; సత్యములని ప్రస్తుతప్రకృతిశాస్త్ర పరిశోధనల వలన దృఢపరుపబడినది ఈ రెంటివలనను మనకు ఆత్మసాయుజ్యము రాగలదు. కనుక మనమందరమును సత్యమార్గావలంబకులమై మన మతగ్రంథముల నన్నిటిని తిరిగి పరిష్కరించి, ప్రస్తుత ప్రకృతి శాస్త్రజ్ఞానానుసారముగ నందరకును బోధపడునట్లుచేసి, ప్రచురించుట మన ధర్మమైయున్నది. కాని ఇట్టిపని నెరవేరుటకై ఐకమత్య మత్యవసరమని నేను తిరిగి నొక్కి చెప్పుచున్నాను. మీ మీ రాష్ట్రీయాభిమానములను వదలివేసి, సర్వజనోపయోగకరమైన యిట్టి సంఘీభావమును పెంపొందింప జేయనియెడల, మీరు మీ యెడలను, మీ పితృపితామహులయెడలను నెరవేర్పవలసిన ధర్మముల నతిక్రమించినవార లగుదురు. మన మింతకాలమునుండియు సోమరులమైయుంటిమి. మన యీ సోమరితనమువలన, మన మీనిర్వ్యాపారము వలన, కడుమందబుద్ధులమైతిమి. మన తలక్రింద నున్నవి నిజముగ బంగారు గనులు గాని, ఇనుపముక్కలు గావని విదేశస్థులు వచ్చి మనకు జెప్పవలసివచ్చెను. ప్రకృతిశాస్త్రజ్ఞానమును, విద్యయును వర్తమాన కాలమున విరివిగ వ్యాపింపుచున్నవి. వీని నాధారముచేసికొని మనము కృషిసలిపిన యెడల, మన కివి యెంతయో మేలు చేయగలవు. ఇట్లుగావించినయెడల నచిరకాలములో దేశమునందంతటను క్రైస్తవ పాదిరీలు క్రైస్తవమతము బోధింపుదినములు వెనుకబట్టి తత్స్థానమున హిందూమత ప్రచారకులు సనాతన ధర్మమును బోధింపుచుండుట మనము కండ్లార జూడగలము. అట్టి సుదినములు రాగలవు. మీ మీ శక్తుల నన్నిటి నొకచోటికి జేర్చి యైకమత్యమును పెంపొందింపుడు. మీ శక్తులనెల్ల కేంద్రీకరింప జేయుడు. ప్రస్తుతకాలపు ప్రకృతి శాస్త్రములతో బాటు, మనమతవిద్యను గూడ నేర్పు హిందూవిశ్వవిద్యాలయ మొక్కటి యుండి తీరవలయునను నూహ కడు సమంజసముగ నున్నది. దీనికై దేశమంతయును సహాయము చేయవలసి యున్నది. నేను తిరిగి మీ యందరితోడను, తుదిసారి మనవి చేసికొనుచున్నాను. ప్రస్తుతము మన దేశములో శాఖోపశాఖలుగనున్న వివిధమతములన్నిటి నొకటిగజేర్చి యైకమత్యమును పెంపొందింప జేయవలసి యున్నదని తిరిగి మీకు తెలియ జెప్పుచున్నాను. మనమందర మిట్లేకగ్రీవముగ నైకమత్యముతో మెలంగుచు అనాదినుండియు మనకు హక్కు భుక్తములలో నున్న మనకీర్తి ప్రతిష్ఠలను నిలుపుకొని, మనదేశమును ప్రపంచములోని నాగరక జాతులకెల్ల శిరోరత్నమై వెలుంగునట్లు చేయవలయును.

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

---

## 35. అంటరానివాళ్లు

—:o:—

రాజకీయముగ ఆలోచించినను, సాంఘికముగ ఆలోచించినను అంటరాని వాళ్లను గురించిన విషయము చాల ముఖ్యముగ కనబడుచున్నది. ఈ విషయము తక్షణము పరిష్కారము కావలెను పరిష్కరించుటకు తగినదిగా కూడ నున్నది. కొంతమందిని అంటరానివారినిగా ఉంచుటకు అర్థమేమి? హిందూసంఘములో వీరు అంటరానివారుగా ఉండవలెనని యేశాస్త్రము చెప్పుటలేదు. మన స్వజనమైన అంటరాని వారికన్న పరమతస్థులగు యవనులను (మహమ్మదీయులను) చక్కగ ఆదరించుచున్నాము. అంటరానివారికి ప్రత్యేక సంఘప్రాతినిధ్యముండవలెనా? కూడదా? అనేమాట చాలదూరపుమాట. కాని దేశక్షేమమునకై మనము చేయు అన్ని ప్రయత్నములలోను వారు మనతో కలసి పనిచేయవలసియున్నది. కాబట్టి వారిని అంటతగిన వారినిగా ఒప్పుకొనవలెను. దేశక్షేమునకై మనము చేయుపనులకు మనుష్యబలము అవసరము. అంటరాని వారిని వృద్ధిలోనికి తీసికొని వచ్చుటకు చేయుప్రయత్నము, దేశాభ్యుదయమునకు మనము చేయుచున్న ప్రయత్నములకు ఆటంకముగా నుండరాదు. అంటరాని వారిని బాగుచేయవలెనను ప్రశ్నయెంతత్వరగా పరిష్కారమైన అంతమంచిది. పీష్వాలురాజ్యముచేసిన రోజులలో బ్రాహ్మణులుకూడా అంటరానివారు తయారు చేసిన తోలుసంచులతో తెచ్చిన మంచినీటిని త్రాగెడివారు. మనలో మనము భేదములను పెంచుకోడము దేశ నాశనమునకు గుర్తు. యుద్ధములలోను, గొప్పయుత్సవములలోను, యీ భేదములకు తావులేదు. అంటుకొతగిన వారు అంటుకో తగనివారు భుజములు భుజములు రాచుకొనుచు యుద్ధముచేయునప్పుడును, కలసి మెలసి పనిపాటలు చేయునప్పుడును, ఈ భేదములు కంటికైనా కనుపడవు. ప్రతిరోజు మనము బయటతిరిగి చేయుపనులలోకూడ నిట్టిభేదముల నెవ్వరు పెట్టుకొరాదు. అంటరానివారని ముట్టుకుంటే పాపము వస్తుందనే అభిప్రాయమును వదలండి. మన స్వజనాన్ని మనము హీనముగాను, అంటుకో తగనివాళ్లుగాను చూచుట యెప్పుడు మానెదమో అప్పుడే

నిజమైన దేశవృద్ధికి వీలు కలుగును. తెల్లవారికి కూడ కొంతమందిని అంటుకో కూడదనే అభిప్రాయమున్నది. నీగ్రోలను వారు అంటరానివారినిగా చూచెదరు. అమెరికా దేశపు ప్రసిడెంటగు డాక్టరు విల్సనుగారు ఒకమాటు నీగ్రోవారి యింట భోజనము చేసిరి. తెల్లవాళ్ళకు ఒళ్లుమండి గందరగోళము చేసిరి. తెల్లవారు తఱుచుగా వెళ్లి భోజనము చేయు పూటకూళ్ళ యిండ్లకు నీగ్రోలను రానియ్యరు. ఇట్టి భేదములను తొలగింప ప్రయత్నించుట, ప్రయత్నించి తగుమార్గముల నవలంభించుట, అవలంభించి భేదములను నిర్మూలము చేయుట, ఇవి దేశాభ్యుదయమునకు నిజమైన గుర్తులు. దేశాభ్యుదయమునకే కాదు, మతసంస్కరణమునకు కూడ యివి చేవదైన పనులు. ఆర్యులు మొదట భరతవర్షమునకు వచ్చినప్పుడు యీదేశమునందలి ఆదిమనివాసులను తమకంటె హీనులనుగా చూచిరి. ఇది తెల్లవారు నీగ్రోలను నీచముగా చూచుటకును పోలియున్నది. బ్రాహ్మణులు చేయతగిన మతకర్మ లేవి? ఇతరులు చేయవలసిన మతకర్మలేవి యనువిషయములను గురించి తఱుచుగా చర్చలు జరిగినవి. అన్నివర్ణములవారికి అన్ని మతకర్మలు జేయుటకు సమానమైన హక్కు కలదు. హిందువులు కాని వారిని హిందూమతములో కలుపుకోవచ్చునా? కూడదా యను విషయమై హిందూమత వ్యాపకసంఘము స్థాపించినప్పుడు తీవ్రమైన చర్చ జరిగినది. నిజమునకు హిందూమతము ఒక తరహాయైన కలగూరగంప. హిందూమతము యెవరినైనా తనలోనికి లాగుకొని యిముడ్చుకోగలదు. ఈ లాగుననే ముందుకూడ జరుగవలెను.

అంటరాని వానిని బాగుచేయు ప్రయత్నానికి మీరు ఏ విధముగా సహాయము చేస్తారని నన్ను చాలమంది అడిగెదరు. ఇది నాపనిగాదని అందుకు నా జవాబు. నేను అనేక పనులను ఒక్కమాటు నెత్తినవేసుకోలేను. అనేక ఉద్యమములను నడుపుటకు నా మెదడుకు శక్తిలేదు. కాని ఇటువంటి వుద్యమముల యందు నాకు పరిపూర్ణమైన అభిమానము, ఆమోదము కలదు. 1894 వ సం॥ గణపతి యుత్సవములలో మాదిగవాఁడొకడు తన గణపతి విగ్రహమును తీసికొని వచ్చెను. వానిని వుత్సవములలో చేరనియ్యలేదు. అతడు నాతో వచ్చి చెప్పుకొనెను. నేను నా గణపతిని పెట్టుకున్న బండిలో పెట్టుకో మని చెప్పి పెట్టించితిని. ఈ సంగతి పత్రికలలో ప్రచురింపబడెను. కాని నన్నెవ్వరును బ్రాహ్మణవర్ణమునుండి బహిష్కరించలేదు. ఆ రోజులలో నిమ్నజాత్యుద్ధరణ సంఘములు లేవు. ఇట్టి సమయములు మానవుని జీవితములో నెప్పుడో ఒక్కమాటు వచ్చును. వచ్చినప్పుడు సమయస్ఫూర్తిగా నడుచుకోవలెను. బెళగానులోని గ్లాసు ఫ్యాక్టొరీలో

మేము అన్నివర్ణముల కూలీలను పెట్టినాము. పరిశుభ్రముగా ఉంటేచాలు; మేము యెవరినైనా దగ్గరకు రానిచ్చెదము. నీవు మాదిగవాడవా? అంటరానివాడవా అని అడుగము. పరిశుభ్రముగా వుండగానే ముట్టుకోతగిన వాడని అప్పుడే తెలియును పూనాలో పాదరక్షలు అమ్మే దుకాణాలు మాదిగ వాళ్ళవి యెన్నో వున్నవి. ఆ దుకాణాలలోనికి బ్రాహ్మణులు వెళ్ళి చెప్పులు, మాచ్చెలు కొని తెచ్చుకొనుచున్నారు. కాని వారు యింటికి వచ్చి స్నానములు చెయ్యరు. క్రిమక్రమముగ మంచిరోజులు వచ్చుచున్నవి. ముందు ముందు యింకను బాగుపడును. అంటరాని వారికి మంచిరోజులు త్వరలో రావలెననిన, యేమియూలేదు. దేశాభ్యుదయకరములగు పనులలో వారును మనము చేతులు చేతులు పట్టుకొని పనిచేయుటకు తగిన అవకాశములను మనమే కల్పించవలెను వారిక్షేమము, అనగా దేశక్షేమమునకు వారును మనమును కలిసిమెలసి యెప్పుడు పనిచేసెదమో అప్పుడే భేదములన్నియు సమసిపోవును. సపంక్తి భోజనములు, యిచ్చిపుచ్చుకొనుటకు ఇత్యాళ్ళనే జరుగవలెనన్న తొందర ఏమీలేదు. ముందు ఈ అంటరాని తనాన్ని తీసిపారవేసి తరువాత ఆ విషయాలు ఆలోచించెదము. కొంత కాలమునకు భోజనప్రతి 'భోజనములు సంబంధ బాంధవ్యములను గురించి కూడ ఆలోచించి పరిష్కరించవలసి యుండును. పరిష్కరించక తప్పదు. ఇప్పుడు తక్షణము జరుగ వలసిన దేమియనిన, ముట్టుకుంటే మయిల పడతామనే అభిప్రాయం పోవలె. నాశనమై పోవలె. అంటరానివారు కాంగ్రెసుకు ప్రతినిధులుగా రాకూడదని యెక్కడా రాసిపెట్టలేదు. కాంగ్రెసుకు అందరు రావచ్చును. దేశములో జరిగే యితర కాన్ఫరెన్సులకు కూడ అందరు వెళ్లవచ్చును. అందరు కలియుటకు అనేక అవకాశములు కలవు. అంటరానివారు దూరదూరముగా ఉండుటమాని కాంగ్రెసు, కాన్ఫరెన్సులకు వచ్చి వానియందు పాల్గొనుచుండు పక్షమున అంటరాని తనమనే కళంకము దానంతటదే మాయును. దేశక్షేమమునకు సంబంధించిన కార్యములలో అన్యోన్యముగా పనిచేస్తే ఆ కళంకము దానంతటదే తుడిచిపెట్టుకు పోతుంది. వారిలో విద్యకూడా వ్యాపించవలెను. ఈ కళంకాన్ని తీసివేయుటకు విద్య చాల సహకారి. మతము అందరికీ ఒకటే. దేవుడు అందరికి కావలసినవాడే. భగవంతునిదృష్టికి యీ కళంకము యెక్కడా కనబడదు. అట్టి విషయములో దీనిని యెందుకు పాటించవలెను? భగవంతునికి యెవడు అంటరానివాడు కాడో వానిని మనము చూపి, ఇదుగో! ఇతడు అంటరానివాడు. అనుట, భగవంతునియెడ అపచారముచేయుట. అందరు చేరవలసిన గమ్యస్థానము చేయవలసినపని, ఒక్కటైనప్పుడు అందరుకలిసి తప్పక ఒకరి

కొరకు చేయూతగా పనిచేయుదురు. ఆపనియొక్క స్వభావమును బట్టి భేదములు మరతురు. ఎప్పుడో సభలలో కలసినప్పుడును, దేశాభ్యుదయ కార్యమును చేయునప్పుడే కాదు. ప్రతిరోజు మనము అనేక పనిపాటలలో అంటరానివారిని కలియుచుందుము. అట్టిసమయములలో కూడ నీభేదములు లేకుండ చూడవలెను. కాంగ్రెసులోను, కాన్ఫరెన్సులలోను, ఈ భేదములు తీసి వేయకుండా ఉండుటకు వీలులేదు. అవి ఒకరివి కావు. అందరికి సంబంధించినవి కాంగ్రెసు యేకోరిని చేరవలెనని, ఏగమ్యస్థానమును పొందవలెనని ప్రయత్నించుచున్నదో దానిని పొందితే యీలాటి సంస్కరణము చేయుటకు నిమిషముపట్టదు. అనుకూలమైన, సరియైన, సమయములు కని పెట్టి వడిగా సంస్కరణములు చేయవలెను. దేశసేవకుడెప్పుడు దేశక్షేమమునకు సంబంధించిన ప్రశ్నలన్నిటిని గురించి ఆలోచించుచుండును అంటరానితనాన్ని రూపుమాపుట యను ప్రశ్న తక్షణము పరిష్కారముకావలెను. కాని యింతకంటె ముఖ్యమైన విషయము లున్నవి. వాటికి యేమీ భంగముకాకుండా చూచి దీనిని పరిష్కరించవలెను. అంటరానివారిని గురించిన విషయపరిష్కార మెక్కువకాలము ఆగదని నా నమ్మకము. హిందూ మతము శూద్రులను తనలో నిముడ్చుకున్నది. అంటరానివారిని మట్టుకు జీర్ణించుకోనలేదా? మనపూర్వులు చేసినట్టు చేసినచో నీ విషయ పరిష్కారముదాపులోనేయున్నది. ఈ ప్రశ్నను పరిష్కరించుట దేశమునకు చాల అవసరము, ముఖ్యము. భగవంతునియెదుట శూద్రుడని, అంటరానివాడని భేదమువారికిలేదు. మనము మావాళ్ళు, మాసోదరులు, మాస్వజనం, అని పిలిచిన భగవంతుని కేమీ కోపమురాదు. మనకేమీ మయిల సోకదు. దేశ సంఘకార్యములలో అంటరానివారిని మనతో పాటు నడిపించుకపోవలెను. వారిని లెక్కసేయకుండా యుండుటకు వీలులేదు తప్పక చేయవలసిన, తక్షణము చేయవలసిన, పనిని నిర్లక్ష్యము చేయజాలము. ఈ పనిని నిర్లక్ష్యము చేసితిమా! దేశాభివృద్ధికి కీడుచేసినట్టె నేను యెప్పుడూ యీభేదములు పాటించను. నాయింటిలోనికి అంటరానివారు నిరాఘాటముగా రావచ్చును ఒక నాడు కొంతమంది అంటరానివారు నాతో నేమో నాలోచించుటకు మా యింటికి వచ్చారు. వారు నాతో పాటు లోపలికివచ్చి నాసరసనే కూర్చున్నారు. అంటరానివారిని వృద్ధిలోనికి తీసికొనివచ్చుపనిని, నాజీవితములో సాధించవలసిన ఉత్తమ పరమార్థముగా నేను పెట్టుకొనక పోయినను యీ యుద్యమమునందు నాకు గల ఆదరము అనన్యము. స్వరాజ్యము లభించిన యితర సమస్య లన్నియు పరిష్కరింపబడును. అంటరానివారి వృద్ధికై జరుగుప్రయత్నములకు మేముచేయూత నొసగుటకు సిద్ధముగా మన్నాము.

స్వరాజ్యోద్యమమునకు అంటరానివారు సహాయము చేయక తప్పదు. వారును మనమును కలసి పనిచేయకపోతిమా, వారికి మనము, మనకువారు, అంటరానివార మగుదుము. ఏకీభావముతోను అన్యోన్యసహాయముతోను పనులను చక్క బెట్టుకొను పక్షమున అంటరానితనము మాయమైపోవును. ఇంకొకమాటు నొక్కి చెప్పుచున్నాను. అంటరానివారిని బాగుచేయుటకు సాగించుచున్న ప్రయత్నములకు నే నేవిధముగాను, వ్యతిరేకుడనుగాను. అంటరానివారు యికముందు అంటరానివారుగా వుండకూడదని నాఖండితమైన అభిప్రాయము. వీరిని అంటరానివారినిగా ఉంచుట యనునది హిందూసంఘములో నేర్పరచిన ఒక ఆచారము. సంఘాచారములు మారితీరవలెను ఎన్నడో అనాదికాలములో నిరంకుశులగు బ్రాహ్మణు లీ యాచారము నేర్పరచిన మాట వాస్తవము కాదని నేనను. ఇది ఒకతరహారోగము. ఈ రోగమును కుంకుటివేళ్లతో పెరికివేయవలెను దీనిని పెరికి వేయుభారము మనది. మనమందరము కలసి పట్టుపట్టి పనిచేసిన, ఈ రోగము నిర్మూలమగునని నేను నమ్ముచున్నాను.

(కృష్ణాపత్రికనుండి)



శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

—— :o: ——

## 36. సంఘసంస్కరణము

బెల్గాంనందు, తనకీయబడిన విజ్ఞాపనమునకు లోకమాన్యు డిటుల జవాబిచ్చెనని హిందూపత్రికలో ప్రచురింపబడినది. భిన్నాభిప్రాయ ప్రకటనమునకు తమ కిష్టము గలదని లోకమాన్యుడు దెలిపెను. ఏలనన, ప్రజాప్రభుత్వమునం దధిక సంఖ్యాకుల యిష్టమే ప్రవర్తిల్లును. ప్రజలలో నిట్టిభావమును చొప్పించుటకే తానింత కాలము నుండియు ప్రయత్నించు చుండుటచే, నూతన చైతన్యమును లోకమాన్యుడామోదించుచున్నాడు. హిందూ మహమ్మదీయుల ఐకమత్యము గుదిరియుండగ బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల కట్టి సంయోగము కుదురదా యని వారు ప్రశ్నించిరి. తాను అంటరానివారితో కలసి భుజించుటకు సిద్ధముగ నున్నటుల లోకమాన్యుడు దెలిపెను. రాజకీయ స్వాతంత్ర్యమును ముందుగ పడయవలయును. సాంఘిక విభేదములు రాజకీయాభివృద్ధిని భంగపరుప గూడదు. ప్రస్తుతమున్న కృత్రిమ సాంఘిక విభేదములు తొలగిపోవలయును. అవి తొలగిపోగలవు. కాని, ఇందుకు కాలము పట్టును. వాణిజ్యము, పరిశ్రమలు, మిగిలిన లాభకరమగు వృత్తులన్నియు, బ్రాహ్మణేతరుల హస్తములందే యున్నవి. దేశములో బ్రాహ్మణులకన్న బీదవారు లేరు. వారు కడునీచమగు సేవకావృత్తి మూలమున పొట్టపోసికొను చున్నారు. ప్రజల కష్టములు ప్రభుత్వమువారి లాండు రివిన్యూ, గ్రామపరిపాలనపు పద్ధతుల ఫలితములు. అంతియగాని, ప్రభుత్వమువారి ఆజ్ఞలను కొనసాగించుచున్న ఏజంటు లిందుల కుత్తరవాదులుగారు. సంపూర్ణ స్వపరిపాలనమును ప్రభుత్వమువారు, బ్రాహ్మణేతరుల హస్తములలో బెట్టుచో, బ్రాహ్మణులు తమ మతస్థానమును సంతోషపూర్వకముగ విసర్జింపగలరు. తాను రాజకీయాందోళనము నందు మగ్నుడై యుండుటచే, సాంఘిక విషయములగూర్చి కాలమును వినియోగింపలేక పోయెను. మాతృదేశోద్ధరణము కొరకై, ఎల్లరును తమ భేదభావములను మరచి, కృషి సలుప వలయునని లోకమాన్యుడు సభాసదులను హెచ్చరించెను.”

(ఆంధ్రపత్రిక 10-3-20.)



# లోకమాన్యుని ఉపన్యాసములు

—— :o: ——

## 37. జ్ఞానము, రాజ్యతంత్రము (7-3-15)



[మన యాంధ్రదేశమున భద్రాద్రిరామదాసుగా రెంత భక్తులుగ నెన్నబడుచున్నారో, అట్టే మహారాష్ట్రదేశములోకూడ రామదాసుగా రనునొక భగవద్భక్తులు గలరు. వారి ఖ్యాతి మహారాష్ట్రమునం దంతను వ్యాపించినది. వీరు శివాజీకి గురువులు. ప్రతిసంవత్సరమును మహారాష్ట్రదేశములో వీరి పేర నొక ఉత్సవము జరుగును. ఇట్టి ఉత్సవసమయమున, 7-3-15 వ తేదీని పునహాలోని విష్ణ్వాలయములో, "భగవద్భక్తులకును, రాజ్యతంత్రమునకును గల సంబంధమును గూర్చి తిలక్ మహాశయుడు డీ విధమున నుపన్యసించెను.]

ఆర్యులారా!

మన మీదినమున నిచ్చట మహారాష్ట్ర చరిత్రయందు ప్రఖ్యాతివడసి మహామహులైన, భగవద్భక్తులనొక్కరిని గూర్చి స్మరింపుటకై సమావేశమైనారము. తనకీర్తిని యీప్రపంచమునశాశ్వత బ్రహ్మకల్పముగ, చిరస్థాయిగ జేసికొని, యేగిన, రామదాసుగారిని గూర్చి యొక్కమారు స్మరించుటకై మనము నేడిచ్చట సమకూడినారము. రామదాసుగారి జీవిత మంతయును, శివాజీ మహామహుడు గావించిన మహోత్కృష్టకార్యములతో కలసి, వానిలో లీనమైపోయినది. కనుక రామదాసుగారి చరిత్ర నొకసారి క్లుప్తముగ స్మరింప నెంచినను, మనకు శివాజీ గావించిన పనులెల్ల స్మరణకు వచ్చితీరును. రామదాసుగారి జీవితచరిత్ర బాగుగ గ్రహించినయెడల, శివాజీయొక్క గుణగణము లన్నియు మనము బాగుగ గ్రహింపగలిగినవార మగుదు మని నే జెప్పిన నది యతిశయోక్తికానేరదు.

ఆర్యులారా! ధర్మసంరక్షణార్థమే యింగ్లాండుదేశము ప్రస్తుతము యీమహాసంగ్రామములోనికి దిగినదని స్పష్టముగ తెలియబలుకుచు ఇంగ్లాండులోని కొందరు విద్వాంసు లొకపత్రికను తమసంతకములతో ప్రచురించిరి. ఈ విషయమందరికిని తెలిసియేయున్నది. ఈ విద్వాంసులు చూపిన కారణములను నేనిప్పుడు పరీ

క్షింప బూనుకొనలేదు. దానిలోని సూత్రములను నే నిప్పుడు ప్రపంచమునకు జాట బూనుకొనలేదు. నేను చెప్పబూనుకొనిన దొక్కటియే గలదు. పెద్దపెద్ద సామ్రాజ్య పాలనాచక్రములను జేత బట్టుకొని త్రిప్పు రాజ్యాంగ వేత్తలకు. ధర్మాధర్మ విచారణచేసి, న్యాయశీలవృత్తములను బోధింపగల భగవద్భక్తులు గూడ సహాయముగ నుండిననేకాని వీలులేదని మనవి చేయుచున్నాడను. పరలోకచింతయు, భగవద్భక్తియు, మొదలగు దైవజ్ఞానముతో బాటు, లౌకికజ్ఞానముగల సత్పురుషుల సహాయ మత్యవసరము. రామదాసుగారికిని, శివాజికిని ఉన్న సంబంధ మిట్టి సూత్రము ననుసరించియే ప్రవర్తిల్లినది. ఋషీశ్వరులు ప్రపంచమున కనుగ్రహించు ధర్మ సూత్రముల ననుసరించియే రాజులు భూమిని పాలింపవలెను.

తే॥ గీ॥ అధిప ! యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుడును, ధనుర్ధరవర్యు డర్జునుడు నెచట,
నిలిచి రచ్చట విజయంబు నీతిసిరియు, భూతి నిత్యంబులగు విదినా తలంపు॥
భారతం. భీష్మపర్వం.

"ఎచ్చట శ్రీ కృష్ణులవారును అర్జునుడును నిలిచియున్నారో, అచ్చట విజయము, నీతి, సిరి యెల్లప్పుడును నిలిచియుండును.

శ్లో॥ యత్రయోగీర్వరః కృష్ణో యత్ర పార్థోధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువానీతిర్మతి ర్మమ॥ మోక్షసన్న్యాసయోగం,
అని భగవద్గీతలో చెప్పియున్నారు.

రాజులుపాలించు రాజ్యములలో జ్ఞానుల కెక్కువ గౌరవ ముండితీరవలెను. మహోత్కృష్ట కార్యముల గావింప బూనుకొనిన ప్రతివానికిని, తన కెన్ని కష్టములువచ్చినను తప్పక జయముగాంచి తీరుదునను మనోనిశ్చయ ముండవలెను. మనోధైర్యమును వజ్రకవచముండితీరవలెను. ఇట్టి మనోధైర్యమును బొంద గలుగుటకు మహాప్రతిభాశాలియైన జ్ఞానియొక్క సహాయ ముండితీరవలెను, మహాజ్ఞానియొక్క ఆజ్ఞల ననుసరించి వర్తింపుమండవలెను. జ్ఞానియొక్క సహాయమును పొందనివాడు "తెలిసియు తెలియని వరు" డనబడును. దీనికి "నానాఫర్మవీసే" తార్కాణము. నానాఫర్మవీసునకు కావలసినంత దూరదృష్టి యున్నది. దూరదృష్టి లేకపోలేదు. కాని దానికి తగినంత ధైర్యసాహసములు, చొరవ, యెంతమాత్రమును లేవు. శివాజీ ఉత్కృష్టకార్యములను గావించెను; ఆయన గావించిన పనుల నెల్ల రామదాసుగారు తన "దాసబోధ" యను గ్రంథమునందు వ్రాసి దేశమందంతటను వానిని వ్యాపింపజేసెను.

ఆర్యులారా! ఆ కాలమున రామదాసుగారొక్కడే భగవద్భక్తుడని చెప్పుటకు వీలులేదు. అనేకమంది యుండిరి. కాని వారలెల్లప్పుడును ఏదో చెట్టుక్రిందనో కూర్చొని రుద్రాక్షతావళములు త్రిప్పుకొనుచు, భగవత్కీర్తనలు పాడుకొనుచు కాలము గడపుకొనుచుండిరి. వారసమర్థులని నే జెప్పను. వారీ లోకమున నిజముగ తాము గావింపవలసిన పనుల నెల్ల నెరవేర్ప నసమర్థులైరని నేను వాదింపను. వారిని ఆవరించిన పరిస్థితులు, వారిని అంత నిరుత్సాహపరచినవని మాత్రము చెప్పవలెను. వారిట్టి పనులను గావింపలేకపోవుట కిదియే కారణము. జ్ఞాన ముడ్నంతమాత్రము చేత ప్రయోజనము లేదు. వారునూచించు జ్ఞానమార్గముల ననుసరించి వర్తించు శిష్యసంఘము లేనిదే వారేమియు నెరవేర్పజాలరు. శ్రీ కృష్ణులవారు భగవద్గీతను అర్జునునకే యుపదేశించెను. కాని దుర్యోధనునకా గీతారహస్యము నెప్పుడైన నుపదేశించెడివాడా? మహోత్కృష్టమైన ధర్మసూత్రములను, వానిని గ్రహించుటకు తగినంతసమర్థత గలవానికే యుపదేశింపవలెను గాని, కట్టి మూఢున కుపదేశించిన నేమి ఫలము? దీనిని బట్టి శ్రీ కృష్ణులవారు గీతారహస్యమును దుర్యోధనునకు నుపదేశింపకుండ, అర్జునునకే యేల నుపదేశించెనో మనము సులభముగ గ్రహింపగలము. అవిధమునినే తనబోధలను విని బాగుగ గ్రహించి, తదను గుణ నాచరించుటకు తన మహారాష్ట్ర ప్రజలు సమర్థులగు వరకును రామదాసుగారు కూడా వానిని దాచియుంచెను. అత్యుత్తమమైన మహోత్కృష్టమైన వేదాంత సిద్ధాంతముల నన్నిటిని తన "దాసబోధ" యను మహాగ్రంథమునందు వ్రాసియుంచెను. మొదటి భాగమంతయును వేదాంతపరముగ నుండెను ఇదంతయును కేవలము వేదాంతమే. చివరభాగములో మాత్రము అప్పటి దేశకాలపాత్రముల ననుసరించిన కొన్ని లౌకిక విషయములను గూర్చి చర్చించియున్నాడు; ఉండవలసిన క్రమము కూడనిదియే. కొన్ని ధర్మసూత్రములను ముందు చెప్పి, వానిని క్రియారూపమున నెట్లాచరింపవలయునో తెలియ జెప్పవలయును రెండును పరస్పర సంబంధములు, ఆచరణలేని వట్టి శాస్త్ర మెంతనిష్ప్రయోజనమో, అవిధముననే శాస్త్ర ప్రమాణములేని ఆచరణగూడ వట్టి నిష్ప్రయోజనమని యెరుంగవలెను. మనమేదైన మంచికార్యము చేయదలంచుకొని, దానికేదైన అడ్డము వచ్చినట్టయిన "అది నెరవేరు మంచి యనుకూలమైన కాలమింకను రాలేదు!" అని మనము నిరుత్సాహులమై యూరకొనెదము. "దానికి తగిన కాలము రాలేదు. వచ్చినట్లయిన అపుడి నెరవేరెడిదే." యని మన మను కొనెదము. నిజమే! నేనును ఒప్పుకొనెదను; దానికితగిన అవకాశము, తగినకాలము, వచ్చిననేకాని, అది నెరవేర

జాలదు; కాని నేనొక చిన్నప్రశ్న నడిగెదను; ఆ మంచికాలము, ఆ మంచి అవకాశము, మన కెట్లు రాగలదు? ఈ ప్రశ్నకు నేను జెప్పు ప్రత్యుత్తరమేమో తెలియునా? ఆ మంచి అవకాశమును, ఆ మంచికాలమును నీవే సృష్టించుకొనవలెను. నీ కృషివలన, నీ ప్రయత్నమువలన కార్యసాఫల్యమునకు కావలసిన పరిస్థితులను నీవే కల్పించుకొనవలెను. మనకెప్పుడో మంచిదినములు రాగలవని నోరుతెరచుకొని యెదురుచూచిన ప్రయోజనము లేదు మన కార్యమునకు అడ్డము వచ్చువారిని క్షమించు, వారిని శాంతముగ మందలించి త్రోవలో లేవవలసినదని హితబోధ గావించి, మనపనిని మనము కొనసాగింప కొనవలెనని మని "శంకర్ గణేశ" గారు సెలవిచ్చియున్నారు. కాని నా యభిప్రాయ మిచ్చట భేదమని మాత్రము నే చెప్పవలెను. మన మీలోకమున ననేకవిషయముల గాంచుచున్నాము. యీ కలియుగమున కేవలము శాంతభావము వహించి మనము ఊరకొనజాలము. కొందరు దుర్మార్గులు మనయభిప్రాయములకు విపరీతార్థములను కల్పించి మనకార్యమున కెంతయు భంగము కలిగింపుచుండగ, మనము మౌనము వహించి, అట్టి దుర్మార్గుల యెడల శాంతభావము వహించినయెడల, మనకార్యమును మనమే చేతులారా ధ్వంసము చేసికొనినవార మగుదుము. అట్టి సందర్భములలో మనము వారియెడ కొంత కఠినభావమును వహించి తీరవలెను. అట్టి వానినిగూర్చి మనము మాట్లాడునప్పుడు మనము కఠినముగను, గాఢముగను మాట్లాడవలసి యుండును. మనము వారికి హానిగావింప సంకల్పించుకొనము గనుక, అట్టి కఠినభావ లాడినను అది పాపము కానేరదు. రామదాసుగారు వ్రాసిన దాసబోధ యను గ్రంథములో నీ నాటిమార్గమునే మూలసూత్రముగ గ్రహించినారు. ఒకడుచేయు పనులయొక్క నిజానిజములను మనము కనుగొనగోరిన యెడల, వాడు చెప్పువాక్యములబట్టి, వాని మనస్సును పరిశోధించి చూడవలెను. సాధులను రక్షించుటకున్ను, దుర్మార్గులను నశింపజేయుటకును భగవంతుడు యుగయుగమునను అవతారములను దాల్చుచుండును. ("పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ, సంభవామియుగేయుగే" ). భగవంతు డెల్లప్పుడు శాంతస్వరూపుడని యనుకొనవద్దు. కొన్ని సమయములలో రుద్రరూపమును ధరింపవలసి యుండును. రావణాసురుని సంహరించిన పిమ్మట రాములవారు విభీషణునితో నే మని బల్కెనో మీకు తెలియునా? "రావణుడు నశించెను; రావణుడు మృతుడాయెను; అతడు నీకెట్లు సోదరుడో, నాకును అట్లే సోదరుడైయుండెను."

కట్టి శాంతస్వభావమే రామదాసుని గుణము కాదు? "ఎవడైనను నిన్నొక చెంపమీద కొట్టినట్టయిన,, నీ రెండవ చెంప కూడ నందియ్యవలసిన దని" ఏసు క్రీస్తు బోధించియున్నాడు. కాని రామదాసుగా రట్లు బోధించి యుండలేదు. నిన్నెవడైన నొక చెంపకాయ కొట్టినట్టయిన, వెంటనే తిర్గి వానినొక చెంపపెట్టు పెట్టవలసినదని రామదాసుగారు బోధించి యున్నారు. గాని కేవలము దురుద్దేశముతో గాని, స్వలాభాపేక్షకై గాని మనల నట్లు చేయవలసిన దని ఆయన బోధింపలేదు. కేవలము శాంతభావము వహించియుండుటయే యీ జన్మయొక్క సాఫల్యమని మన మనుకొనకూడదు. అదియే పరమార్థమని యనుకొనకూడదు. ఈ శాంత స్వభావ మను నది మనుష్యులను "నిర్వీర్యులను, నిస్తేజులను" జేయునని "నీష్కీ" యను జర్మనువేదాంతి చెప్పియున్నాడు. శ్రీ కృష్ణులవారు అర్జున కేమని బోధించిరి?

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయ దౌర్బల్యం, త్యక్త్వోత్తిష్ఠ పరంతప.—ద్వి అ. 3 శ్లో.

అర్జునుని హృదయమందు ఉత్సాహాగ్నిని ప్రజ్వలింప చేయుటకే శ్రీకృష్ణుని వా రా విధముగ బోధించియున్నారు. రామదాసుగారి జీవితమునుండి యిట్టి యుత్సాహశక్తిని మనము పొందగలిగి నప్పుడే యిట్టి యుత్సవములవలన మనకు ప్రయోజనముండును. ఈ ఉత్సవముల అంతరంగికోద్దేశ మిదియే. ఇట్టియుత్సవములు మనకు ధాతుపుష్టి నిచ్చును. ఈ దినమున మీరు రామదాసు గారి జయంతుత్సవము గావించినంత మాత్రముచేత మీ రాయన యొక్క యిహ సంబంధమైన కర్మసంబంధములను తెంపుటలేదు; మీరు మీ యాత్మలనే పవిత్రవంతముగ జేసికొనుచున్నారు. రామదాసుగారు మీ సహాయము కొరకై యెదురు చూచుటలేదు. ఆయన కిదివరకే మోక్షప్రాప్తి కలిగినది. మన మాయన జీవిత సారమును గ్రోలుటకే, ఉత్సాహ రసమును గ్రోలుటకే, మనమిట్టి తరుణములయందు సమావేశ మగుదుము. "ధర్మము కొరకు నీ స్వధర్మము నాచరింపుము" అను ఉత్కృష్ట బోధలను తెలిసికొనుటకే మనమీయుత్సవములను గావింపుచున్నారము. మన దేశాభ్యుదయమునకే గాక, మనయొక్క జీవన్ముక్తి సాధనకొరకే మన మీ యుత్సవములను గావింపవలెను. దేశాభ్యుదయమునకై మన మందరమును పాటుబడి తీరవలయునను దీక్షను తిరిగి స్మరించుటకే మన మిట్టి యుత్సవములను గావింపుచున్నార మని ముఖ్యముగ మనలోని యువకులు గ్రహింతురు గాక యని నా దృఢమైన నమ్మకము.

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

---:o:---

## 38. తిలకు, గాంధీగార్ల భిన్నదృక్పథము

---

[లోకమాన్య తిలకుగారు, గాంధిగారిచే నడుపబడెడి యంగు ఇండియా పత్రిక కిటుల వ్రాయుచున్నారు.]

గత వారపు పత్రికలలో సంస్కరణముల తీర్మానము గూర్చి మీరొక వ్యాసమును వ్రాయుచు, రాజకీయవిషయములలో నన్ని మార్గములను సవ్యములే యని సెలవిచ్చినటుల తెలిపినందులకు నాకు చింత వొడముచున్నది. నా యుద్దేశము వ్యాసమునందు తిన్నగ నిరూపింపబడలే దనిమీకు దెలుపుటకీ లేఖను వ్రాసితిని. రాజకీయవిషయములు లౌకికులు చేపట్టదగిన క్రీడలు గాని, సాధువు లవలంబింపదగినవి గావు. బుద్ధు డుపదేశించిన, "అక్రోధేన జినేత్క్రోధం" అను సూత్రముకన్న శ్రీకృష్ణు డుపదేశించిన "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం" అను సూత్రముపై నేనెక్కుడుగ నాధారపడి యుందును. దీనిని బట్టి నే నుపయోగించిన "పరస్పరసహకారము" అను వాక్యమునకు గల నిజార్థమును అభిప్రాయభేదమున కంతకుగల కారణమును స్పష్టపడగలవు. రెండు పద్ధతులును నిష్కళంకమును, పవిత్రమునగు పద్ధతులే. కాని అందులో నొకటి మరియొక దానికన్న నీప్రపంచమున కధికముగ ననుకూలించును. ఈభేదమునుగూర్చి నా గీతారహస్యమునం దింకను వివరముగ దెలిపితిని" ఇందుపై గాంధిగా రిటుల వ్రాసిరి:—

"మతగ్రంథముల వ్యాఖ్యానమునకు సంబంధించినవిషయములలో, లోకమాన్యునితో వివాదము సలుపుటకు, నాకెంతయో బిడియము గలదు. కాని, కొన్ని సందర్భములలో వ్యాఖ్యానమున సహితము, స్వాభావికజ్ఞాన మతిక్రమించును. లోకమాన్యుడు ఉదహరించిన రెండుసూత్రములలో నా కేమియు భేదము గాన్పించుట లేదు. బౌద్ధగ్రంథము, శాశ్వతసూత్రము నొకదానిని ప్రతిపాదించుచున్నది. భగవద్గీతా వాక్యము, ద్వేషమును ప్రేమచేతను, అనృతమును సత్యముచేతను, ఎటుల

జయింపవలెనో, ఆమార్గమును నాకు గనుపరచుచున్నది. మన మిత్రులయెడ నెటుల ప్రవర్తింతుమో. భగవంతుడు కూడ మనయెడ నటులనే ప్రవర్తించు ననుట నిశ్చయమే అయినయెడల, మనము దండనము నుండి తప్పించుకొనుటకు, క్రోధముపై క్రోధమును ప్రయోగింపక, క్రోధముపై గూడ సౌమ్యతనే ప్రయోగించుట యవసరము. ఈ సూత్రము, ప్రపంచబాహ్యులకే కాక, కేవలము లౌకికులకును వర్తించును. ప్రపంచము సాధువులకొరకు గాదని తలంచుట, మానసికపు మాంద్యమును తెలుపునని, నుడువుటకు నేను సాహసించెదను. పురుషార్థమును పెంపొందించుటయే, మతసారము. పురుషార్థమనగ సాధువుగనుండ ప్రయత్నించుటయే. లోకమాన్యుని సిద్ధాంతము ప్రకారము రాజకీయవిషయములం దన్ని మార్గములను సత్యములే యని నేను వ్రాసినపుడు, వారు తరుచుగ నుదహరించిన 'శఠం ప్రతిశాఠ్యం, అనువచనము నా మనమునందుండెను. ఇది మంచి సూత్రమును దేనిని విదూపించుట లేదు. ఈ సూత్ర మసత్యమని, లోకమాన్యుడే ఒకానొకదినమున తన పాండిత్య ప్రకర్షము జూపి, వ్యాఖ్యానము నొకదానిని ప్రచురించి హిందూదేశము నాశ్చర్యనిమగ్నము గావించునని, నా కాశగలదు. ఎటులయినను, శతాబ్దములో నాకు గల మూడువంతుల యనుభవము బట్టి "శఠం ప్రతిశాఠ్యం" అను సిద్ధాంతమును నే నంగీకరింపను. "శఠం ప్రత్యపి సత్యం" అను న్యాయమే సత్యమయినది" (ఆంధ్రపత్రిక 2-2-20).

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 39. గీతారహస్యము

—:o:—

[ఆన 1917 సంవత్సరములో అమరావతిలో నిచ్చిన యుపన్యాససారము.]

మొట్ట మొదట నే నేల, భగవద్గీతలను జదువ బ్రారంభించితినో మీకు కొంచెము చెప్పెదను. కేవలము శాస్త్రసమ్మతానుసారముగ, శ్రోత్రియముగ, మన మతగ్రంథములలో విధించిన విధుల ననుసరించి, యిప్పటి కలికాల దినములలో సంసారసాగరమునబడి కొట్టుకొనుచుండు మనము వడమకొనుట సాధ్యము కాదని చిన్నప్పుడు మా తల్లిదండ్రులు నాతో చెప్పుచుండెడివారు. మోక్షము రావలయు నని యెవరైన గోరిన యెడల, (యెల్లరు బొందగోరు) అత్యుత్తమ మైన ఆ మోక్ష సాయుజ్యము నెవడైన బడయగోరినయెడల, అట్టి వాడు ఇహసంబంధ మైన వాంఛల నన్నిటిని విసర్జించి, సర్వసంగ పరిత్యాగి యై యీ ప్రపంచముతోడి బంధములను త్రెంపు కొని తీరవలయు నట! భగవత్సాన్నిధ్యమునకును యిహసంబంధమునకును యీ రెంటికిని పొసగదట ! దేనినో యొకదానినే కొలిచియుండవలయునుగాని, రెంటిని కొలచియుండుటకు వీలులేదట! ఈవిధముగ చిన్నప్పుడు మా పెద్దలు నాతో జెప్పుచుండెడివారు. కాబట్టి, ఈలోకమున నెవడైన తన జన్మసాఫల్యము నొందించుకొన గోరినయెడల, సక్రమమైన జీవితపథమున నడవగోరినయెడల, అట్టి వాడు, యీప్రపంచముతో సంబంధము నెంత త్వరగ త్రెంపుకొనిన నంత మేలని తేలుచున్నది నా మనస్సునకు బోధపడిన యర్థమిది. అంతట నేను తీవ్రముగ దీని విషయమై యోచింప మొదలిడితిని. నేను నా మనస్సులో శంకజేయ మొదలిడితిని. నేను చింతింప మొదలిడినదేమనగ "నా జన్మను సఫలత నొందించుకొనుటకుగాని, నేను సిద్ధిపొందుటకుగాని, ముందు నేనీప్రపంచముతోటి సంబంధమును వదలుకొని తీరవలయున"ని చెప్పు మత మేదైన కలదా ? అట్లు చేయవలసియుండు నని యే మతమైన బోధింపుచున్నదా ? సమస్త హిందూ

మత ధర్మములను, వేదాంతసిద్ధాంతము లన్నియు, భగవద్గీతలలో నిమిడియున్నవని ప్రపంచమంతయు నొప్పుకొనియున్నా రని కూడ చిన్నప్పుడు మావారు నాతో జెప్పుచువచ్చిరి. అట్లయినయెడల, నామనశ్శంకకు సమాధాన మీ గ్రంథములో గానవగునని యూహించి, నే నీ గ్రంథపఠనమునకు గడంగితిని. నేను భగవద్గీతలను పఠింప మొదలిడినప్పుడు ప్రథమమున నామనస్సులో నెట్టి వేదాంత సిద్ధాంతముల గూర్చిగాని, ధర్మశాస్త్రములగూర్చిగాని, యెట్టి యభిప్రాయములును లేవు. నా మనస్సులో నేదియో యొక సిద్ధాంతమును పెట్టుకొని, దానిని బలపరచు నిమిత్తమై భగవద్గీతలో నే మైన ప్రమాణ వాక్యములు దొరకునా యని వెదకు నిమిత్తమై నేను భగవద్గీతలను పఠింప బూనలేదు. (నిర్మలమైన మనస్సుతోనె పఠింప బూనితినే గాని, వేరొక యుద్దేశముతో పఠింపబూనలేదు). ఏదియో యొకదానిని ముందుగ మనస్సులో బెట్టుకొని, చదువప్రారంభించినయెడల, అట్టి వాని మనస్సు నిష్కళంకముగ నుండజాలదు. నిష్కళంకహృదయముతో పఠింప నేరడు. దీని కొక చిన్న యుదాహరణ జెప్పెదను. క్రైస్తవు డెవరైన భగవద్గీతలను జదువ ప్రారంభించినయెడల వా డేయుద్దేశముతో మొదలిడును? భగవద్గీతలలో నిజముగ నేమి జెప్పబడి యున్నదో దానిని గ్రహించుటకై నిష్కల్మషహృదయముతో, చదువ యత్నింపడు. అట్లుగాక, తన బైబిలుగ్రంథములో నిదివరకుతాను జదివిన విషయము లేమైన నీ భగవద్గీతలలోనున్నవా? యని వెదుక ప్రారంభించును. అట్టివైన కొన్నివిషయములు తనకు గనుపించినయెడల వెంటనే "ఆ ! నిజముగ, బైబిలును, చూచియే వీరీ భగవద్గీతలను వ్రాసికొనినారు" అని తక్షణమే సిద్ధాంతీకరించును. నేనీవిషయములను గూర్చి నా "గీతా రహస్య" గ్రంథములలో విశదీకరించియున్నాను. గాన తిరిగి నేనిప్పుడు విశేషించి చెప్పవలసిన దేమియును లేదు. కాని నేనిప్పుడు మీ కందరకు నొక్కి చెప్పునదేమనగ.—మీ రే గ్రంథమునైనను, అందులో ముఖ్యముగ భగవద్గీతలవంటి యుద్గ్రంథమును, పఠించి, దానిలోని సారాంశమును గ్రహింపగోరినయెడల మీరు మొదట నిష్కల్మషహృదయముతో శంకాకళంక రహితమైన మనస్సుతో, నట్టి గ్రంథమును పఠింప బూనవలెను. ఇట్లు చేయుట బహుకష్టమైన పనియని నాకు తెలియును. నిష్కళంకహృదయముతో పఠింపుచున్నామని చెప్పుకొను వారందరికిని, మనస్సులో నేమూలనో నేదియో శంక, యేదియో యుద్దేశముండితీరును. ఈ శంక, యీ యుద్దేశము, కొంతవరకు నిర్మల గ్రంథపఠనమునకు కళంక మాపాదించును. అయినను గ్రంథములో నుండు సత్యము నెట్టిదైన గ్రహింపగోరినయెడల, నట్టివాని మన స్సివిధముగ నుండవలయు

వని మీకు మనవిచేయుచున్నాను. ఈ విధముగ నుండుట కలవాటు పడవలెను. అట్లు చేయుట యెంతకష్టమైనను, చేసి తీరవలెను గ్రంథపఠనమున కవుసరమైన విషయ మింకొకటి కలదు ఆగ్రంథము నెప్పుడు, యేకాలములో, నేయే సందర్భములలో నెందునిమిత్తమై రచించిరో, మొదలగు విషయములను గూడ మనస్సునం దుంచుకొనవలయును. ఇట్టి పూర్వోత్తర సందర్భములను గ్రహింపకుండ నిట్టి గ్రంథములను చదువరాదు. అందులో ముఖ్యముగ భగవద్గీతలవంటి గ్రంథమును చదువ ప్రారంభించినప్పుడు వీని నన్నిటిని పాటించి తీరవలయును భగవద్గీతలపై వాఖ్యాత లనేకులు, అనేక వ్యాఖ్యానములను వ్రాసియుండిరి. కాని మొదట నీ గ్రంథరాజమును రచించిన మహామహుడు యిన్ని వ్యాఖ్యానములను మనస్సులో పెట్టుకొని వ్రాసియుండడు గద; ఏదియో యొక యుద్దేశమునే తన మనస్సునం దుంచుకొని గ్రంథమును వ్రాసియుండును. ఈ యుద్దేశ మేదియో గనుగొనవలెనని నేను ప్రయత్నించితిని. ఈ కవి హృదయమేమై యుండునో దానిని కనుగొన ప్రయత్నముజేసితిని నాప్రయత్నము సఫలత జెందిన దనియు, నేను కవిహృదయమును కనుగొన గలిగితిననియు నా నమ్మకము. ఏలనన:—ముందు నే నే ప్రత్యేక యుద్దేశమును మనస్సులో పెట్టుకొని, ఆ యుద్దేశమును బలపరచుకొను నిమిత్తమేమైన ప్రమాణ మీ సర్వజనాదరణీయ గ్రంథములో దొరకునా యని వెదకు తలంపుతో నే నీగ్రంథమును చదువ నారంభింప లేదు. ముందు నే నేదియో యొక నాసొంత సిద్ధాంతమును మనస్సులో నుంచుకొనలేదు. గాన, ఆ గ్రంథములోని శ్లోకములను నా సిద్ధాంతమున కనుకూలించునట్లు, మార్చి, పెడార్థమును దీయవలసిన యవుసరము నా కేమియు లేదు. ఇదివరకు భగవద్గీతలపై వ్యాఖ్యానము వ్రాసిన ప్రతివ్యాఖ్యాతయును; ముందు తా నేదియో యొక సొంత సిద్ధాంతమును బయలుదేర దీసి, అట్టి తన సిద్ధాంతమునకు భగవద్గీతలలో ప్రమాణము గలదని జూపింపని వాఖ్యాత యొకడును లేడు. (అనగా ప్రతి వ్యాఖ్యాతయును, యేదియో యొక తన సొంత, క్రొత్త సిద్ధాంతమును బయలుదేరదీసి "ఇదిగో! నా సిద్ధాంతమునకు భగవద్గీతలలో ప్రమాణము గలదు" అని జూపింప యత్నించుచుండెను.) భగవద్గీతలను పఠించిన పిమ్మట నాకు గన్పట్టిన సారాంశ మేమనగా:— జ్ఞాన, భక్తి యోగమార్గముల రెంటి తోడ్పాటువలన నరుడు అత్యున్నతమైన ఆ పరమాత్మస్వరూపముతో లీనమైపోయినను, అట్టి వాడు సైత మీ లోకమున కర్మ ఆచరించియే తీరవలయు నని మనకు భగవద్గీత బోధించు చున్నది. పరమేశ్వరు డీప్రపంచమును క్రమమైన పరిణామమార్గమున పోవుటకై సంకల్పించి

యుండెను. అట్టిక్రమమైన పరిణామమార్గమున నీ ప్రపంచము నడచుటకై ప్రతి వాడును కర్మ నాచరించి తీరవలయును. పరమాత్మతో లీనమైనవాడు సైతము భగవత్సంకల్పసిద్ధికై యీ ప్రపంచమున కర్మ నాచరించియే తీరవలయును. ఈ కర్మ తనను మోహాంధకారమున బడవేయకుండ గాపాడుకొనుటకు నరుడు నిష్కా-మముగ కర్మల నాచరింపవలయును. భగవత్సంకల్పసిద్ధికి తన కర్మకూడ తోడ్పాటు కావలయునను పరమోద్దేశముతో ముందు రాబోవు ఫలప్రాప్తిపై నెట్టివాంఛయు లేకుండ, నరుడు కర్మ నాచరింపవలయును భగవద్గీతలవలన మనము నేర్చుకొనవలసిన ధర్మమిదియని నా తాత్పర్యము జ్ఞానయోగము కూడ గలదు; నిజమే. అట్లే భక్తియోగము కూడ కలదు అదియును నిజమే; లేవని యెవరనగలరు? కాని, ఈరెండును, భగవద్గీత లుపదేశించు కర్మయోగమునకు క్రింది మెట్లై యున్నవి; విషాద సాగరమున మునింగియున్న అర్జునుని యుద్ధమునకు పురికొల్పుటకై,- కర్మాచరణమునకు పురిగొల్పుటకై—భగవద్గీత లుపదేశింపబడినవి గద. అట్లయినప్పుడీ భగవద్గీతలు మనకు బోధించునది కేవలము భక్తి జ్ఞానమార్గములే యని యెట్లు జెప్పనగును? నిజమాలోచించినయెడల, భక్తి, జ్ఞాన, కర్మ యోగమార్గములన్నియు భగవద్గీతలలో నిమిడియున్నవి. వీని యన్నిటి సారమే గీతాసార మగుచున్నది. భూమి నావరించియున్న గాలియంతయు నొకటియేగాక, దానిలో ప్రాణవాయువు అమ్లవాయువు మొదలగు వాయువు లనేకములు, పాళ్లనుసను, అన్నియు కలిసి యున్నట్లే, భగవద్గీతలలో నీ యోగములన్నియు కలిసి యొకటిగా నున్నవి.

జ్ఞాన, భక్తియోగమార్గముల పరిపూర్ణుడై, తన్మూలమున నరుడు పరమాత్మతో లీనమైపోయినను, అట్టివాడు సైతము కర్మ నాచరించి తీరవలయునని భగవద్గీతలుమనకు బోధింపుచున్నవి. సాధారణముగ ఇదివరకున్న వ్యాఖ్యాతలందరియభిప్రాయమునకును, నాయీయభిప్రాయమునకును భేదముకలదు. ఈశ్వరుడు,నరుడు,ప్రకృతి(ప్రపంచము) ఈమూడింటికిని మూలములోనే, ఐక్యముకలదు. ఈప్రపంచ మెట్లు సృష్టింపబడినది? ఈశ్వర సంకల్పమే యీ ప్రపంచసృష్టికి కారణము. ఈశ్వరసంకల్పమే యీ ప్రపంచస్థితికి కారణము. నరుడు భగవంతునితో నైక్యమగుటకై యత్నించును; ఇట్లైక్యమును బొందినప్పుడు, జీవాత్మపోయి పరమాత్మలోలీనమగును. నరుడిట్లైక్యమును బొందిన పిమ్మట, "నేనే నే కర్మలనుచేయను; నేనీ ప్రపంచమున కేమియు సహాయముచేయను" అనియనునా? నరుడు తానింతకాల మేరూపముతో నైక్య మొందవలయు నని పరితపించెనో, అట్టి యా పరమాత్మయొక్క సంకల్పానుసారమే యీ ప్రపంచ మీ రూపమును దాల్చియున్నది గద. అట్టి ప్రపంచముతో

తన కేవిధమైన సంబంధమును లేదనియు, దానికి తాను సహాయము చేయవలసిన బాధ్యత తనకు లేదనియు, పరమాత్మ సాయుజ్యమును బొందిన దగునా? ఇది యెంతమాత్రమును హేతువాదమునకు నిలువదు? ఈ మాటల జెప్పునది నేను కాదు; ఆ భగవద్గీతలే యిట్లు పల్కుచున్నవి.

శ్లో॥ నమే పార్థాఽస్తి కర్తవ్యం, త్రిషు లోకేషు కించన
నాఽనవాప్త మవాప్తవ్యం, వర్తయే వచ కర్మణి॥ 3అ. ౨౨ శ్లో.

తానీ మూల్లోకములలోను బొందవలసినదేమియు లేదని శ్రీకృష్ణులవారు చెప్పియున్నారు; అయినను తాను కర్మ నాచరింపుచునే యుందునని దెలిపియున్నారు. తా నేల కర్మ నాచరింపవలెను? ఎందుకనగా — తానట్లు కర్మ నాచరింపనియెడల ప్రపంచము నశించును; గాన తాను కర్మ నాచరించి తీరవలెను. నరుడు పరమాత్మతో నైక్యము నొందగోరినయెడల, యీ ప్రపంచమందు కూడ నభిమానము గలవాడై యిహ సంబంధమైన వానితోగూడ నైక్యమొందుటకై యత్నించి తీరవలయును. ఇహ సంబంధమైన వానికై పాటుబడి తీరవలయును. తా నట్లాచరింపనియెడల, నరుడు కోరు ఆత్మైక్యము పరిపూర్ణము గాజాలదు. ఎందుకనగా, ఐక్యమనగా జీవాత్మ, పరమాత్మ, ప్రపంచము — ఈ మూడును యేకమైననే గాని పరిపూర్ణమైన ఐక్యము కానేరదు. జీవాత్మ, పరమాత్మ — ఈ రెండు మాత్రమే ఐక్యమై ప్రపంచమును వదలివేసినయెడల నది పూర్ణైక్యము కాజాలదు. మొదట నా మనస్సునకు దోచిన శంక నిట్లు సమాధానపరచుకొంటిని. ప్రపంచమును గొల్చియుండి కర్మ లాచరింపుచు తన్మూలమున పరమేశ్వరుని కొలిచియుండుటయే యత్యుత్తమమైన మోక్షప్రాప్తికి మార్గమని నా దృఢనమ్మకము. మన మీ ప్రపంచమును విడిచి పెట్టిపోకుండ, దానిలోనుండియే యీ మార్గము ననుష్ఠింపగలమని నా నిశ్చయాభిప్రాయము.

---

శ్రీ

# లోకమాన్యుని ఉపన్యాసములు

## 40. కర్మయోగము

[1917 సంవత్సరం మేనెలలో నాశికాపురబ్రాహ్మణ సంఘమువారు తిలక్ మహాశయుని దర్శించి, ఒక విజ్ఞానపత్రమును సమర్పింపగ, దానికి ప్రత్యుత్తరముగ తిలక్ మహాశయు డీవిధమున నుపన్యసించెను.]

బ్రాహ్మణోత్తములారా! పండితవర్యులారా!

మీరు నాకిప్పు డర్పించిన యీ విజ్ఞాపన పత్రములో నన్ను గూర్చి మీ రనేకచోట్ల ననేకమారులు, వాగ్విలాసము మెరయ నెక్కువగ బొగడియున్నారు. కాని యట్టి పొగడ్తకు నే నర్హుడను కానని విన్నవించుచున్నాను. కవితకు సహజములైన అతిశయోక్త్యాద్యలంకారములను, స్తోత్రములను అటుంచి, మీరిచ్చిన యీపత్రమును, మీరు నాయెడ హృదయపూర్వకముగ గావించిన ఆశీర్వాదచిహ్నముగ నే నెంచి, దీనిని కృతజ్ఞతతో, మనఃపూర్తిగ నందుకొనుచున్నాను. మీరీపత్రములో నన్ను "కర్మయోగాచార్య!" యని సంబోధించియున్నారు. కాని మీ రీబిరుదమును అనర్హున కొకనికి కట్టి పెట్టితిరని మనవిచేసుకొనుచున్నాడను. నిజముగ నీలోకమున "కర్మయోగాచార్యుడు"* జనకమహారాజొక్కడే కలడు. "కర్మయోగమును" ప్రపంచమునకు మొదట దెలిపినది శ్రీకృష్ణులవారొక్కరే కాదు వీరే మొదటివారు కారు. మన భారతవర్షము కీర్తిశిఖరము నధిష్ఠించియున్న కాలమున నీకర్మయోగము మనదేశమున ప్రచారములో నుండెను. ఈకర్మయోగమును మనవారు వదలినకొలది దేశసౌభాగ్యము కూడ నానాట క్షీణింప మొదలిడెను. ఏదినమున మనభారతీయులు యీకర్మయోగము నెడ

* భగవద్గీత: 3-వ అధ్యాయము కర్మయోగము 20-వ శ్లోకము॥ కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః, లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి.

నెరవేర్పవలసిన ధర్మములే లేవని తలంచుట కేవలము తప్పు. భగవంతుడు సర్వశక్తి సంపన్నుడనియును, ఆయనయే మనకొరకై యన్ని కార్యములను నెరవేర్చుననియును, గనుక మన మీ లోకమున గావింపవలసిన పనులే లేవనియు వాదించుట వలన నేమియు ప్రయోజనము లేదు. నిజమే, భగవంతుడు సహాయము చేయును. కాని తమ స్వాభివృద్ధికై పాటుబడ సంకల్పించుకొని, ప్రయత్నింప సమకట్టిన వారికే దైవము తోడ్పాటగును గాని, (ఇతరులకు తోడ్పడడు). "తమకు తాను సహాయము చేసికొను వారికి భగవంతుడు సహాయము చేయును" అని యొక ఇంగ్లీషు సామెతగలదు. ఇది ప్రకృతి సిద్ధమైన మూలసూత్రము. ఒక సంస్కృతకవి యీవిధముగ జెప్పియున్నాడు. "భగవంతుడు మనల నీలోకమున పుట్టించుటకు ముందుగనే మన తల్లిచనులలో బాలు నింపి పిమ్మట మనలను పుట్టించెను. మనకు కావలసిన యేర్పాటుల నన్నిటిని ముందు గావించియే మనలను సృష్టించినాడు; అట్టి భగవంతుడు మనల నీ జన్మాంతమువరకు కాపాడడా? కాబట్టి యుదరపోషణార్థమై మన మేల పాటుబడవలెను? దీనికై మన మేల యింత తాపత్రయపడవలెను?" కాని యీ శ్లోకములను వ్రాసిన యాకవి యట్టి సోమరిపోతనిమాత్రము చెప్పి తీరవలెను. సంస్కృతభాషలోని ప్రతిశ్లోకమును, వేదవాక్యముగ భావించి, దానినే నమ్మి దానినే పరమప్రమాణముగ గ్రహింపకూడదని నేను నిశ్శంకముగ జెప్పుచున్నాను. పరమప్రమాణముగ గ్రహింపబడగలుగుటకు ఒక్క వేదవాక్యములకే మాత్రము, గౌరవముగలదు. గాని ప్రతిసంస్కృతశ్లోకమునకును అట్టిగౌరవము లేదు. సంస్కృతభాషలో నున్నంత మాత్రముచేత ప్రతిశ్లోకమునకును వేదఋక్కుల కున్నంత పరమ ప్రమాణార్హత గలదని తలంపగూడదు. వేదమేమనకు పరమ ప్రమాణము గాని ప్రతి సంస్కృతశ్లోకమును ప్రమాణము కానేరదు.) ప్రతిసంస్కృతశ్లోకమునందు అట్టి గుడ్డి నమ్మక ముండవలయునని యే శాస్త్రములోను చెప్పియుండలేదు. ఇది క్రమపద్ధతి కాదు. స్వధర్మానుష్ఠానమునుండి మనలను విముఖులను గావింపజాలు నిట్టి శ్లోకములను నిస్సారమైన పిప్పిగా భావించి, నావలకు త్రోసివేయవలెను. ఇవి మన యాత్మకు మోక్షప్రాప్తి కలుగకుండ నాటంకపరుచును. గనుక వీని నవలకు త్రోసివేయవలెను. మన మీ యిహలోకమున అధికారమును, పరలోకమున అత్యుత్తమమైన ఆత్మసామ్రాజ్యమును, బొందగోరినయెడల మనము స్వాభివృద్ధికై శక్తివంచనలేక పాటుబడి తీరవలెను. సోమరితనమును, నిర్వ్యాపారమును పురిగొల్పు అసత్యాభిప్రాయములను మీ మనంబులనుండి పారద్రోలి, కార్యమునకు గడంగవలెను. అప్పుడే మనము సఫ

తీకృత మనోరథములను కాగలము. నిజమే, కాలానుసారముగ సంభవించు స్థితిగతులను మన యిష్టము వచ్చినట్లు మన కనుకూలముగ, మార్చివేయుటకు మన కెల్లప్పుడును సాధ్యము కాదు. (కాలగతిని మార్చివేయుటకు మనకుసాధ్యము కాకపోవచ్చును) అయినను, మనస్వధర్మము ననుష్ఠింపవలసినవిధి, బాధ్యత, మనమీద తప్పక నుండియే యున్నది. మన స్వధర్మము ననుష్ఠించియే తీరవలెను. అందులో, ముఖ్యముగ మన కనుకూలమైన యవకాశము చిక్కినప్పుడు, మనధర్మమును నెరవేర్చియే తీరవలెను. కర్మకు ప్రతిఫల ముండియే దీరును ప్రతిఫలములేని కర్మయే యుండనేరదు. ఇవి పరమ ప్రమాణ వాక్యములు: వీనిని వేరుగ ఋజువుపరుపవలసిన పనిలేదు. "కర్మయోగమ"న నేమి? దీని మూలసూత్రమేమి? సన్నిహిత ప్రతిఫలాపేక్ష లేకుండ, అనగా మనకు వెంటనే ప్రతిఫలము కలుగగలదనెడి యాశ లేకుండ, కేవలము ధర్మముకొరకై నీవు నీ స్వధర్మమును ఆచరించి తీరవలెను. దీని కింతకంటె యెక్కువ అర్థములేదు. ఒకడు, తాను గావించు సత్కార్యముయొక్క సత్ఫలమును, యిప్పుడు గాకపోయిన ముందు మరొకప్పుడైనను పొంది తీరునని మనము గట్టిగ నమ్మవలెను. దీనికి సత్ఫలము ముందుండియే యున్నది. మన కప్పుడప్పుడు నిరుత్సాహము కలిగినను ఎట్టిభంగము వాటిల్లినను, కష్టములు వచ్చినను, మనధర్మమును మనము నెరవేర్చి తీరవలయును. మనపనిని మనము కొనసాగించుచునే యుండవలెను. మనము చేయు ప్రతి కార్యమునకును వెంటనే ఫలితము వచ్చునను నాశ యుండుటచేతనే మనకిట్టి నిరుత్సాహము కలుగుచుండును. దీనికిదియే కారణము. మనదృష్టి యీ యాశమీదనే నిలుపక యుండినయెడల, మనము నిరుత్సాహులము గావలసిన యవసరమేయుండదు (ఫలాపేక్షయే లేనప్పుడు నిరుత్సాహులము గావలసినపని యేమి?) ఒకవ్యక్తికి (అనగా మనుష్యునకు) వర్తించు నీ విషయమే ఒక జాతి వారికి కూడ వర్తించును. మనమిప్పుడు తినుటకు మామిడిపండ్లు ఎచ్చటనుండివచ్చినవి? మన తాత ముత్తాతలు చెట్లువేసి కష్టపడి పెంచియుండబట్టియేగదా, మనమిప్పుడు హాయిగ మామిడిపండ్లు తినుచున్నాము. అవిధముననే మన మనుమలు, మునిమనుమలు మామిడిపండ్లు తినవలెనని మనకు కోరిక యున్నట్లయిన మనముకూడ చెట్లునాటి నీరుపోసి బాగుగ పెంచవలెను. కనుక మన జీవితకాలములో మన కృషివలన కలుగు ఫలితమును మన మనుభవింపలేకపోయినను, మనము సదా కృషి సలుపుచునే యుండవలెను. నీ స్వధర్మమును అనుష్ఠించుచునే యుండవలెను. ఈ "కర్మచక్ర"మెప్పుడును తిరుగుచునే యుండును. ఇది నిలువజాలదు. ఈ కర్మచక్రమెప్పుడును దిరుగుచునే యుండవలసిన దని, శ్రీకృష్ణులవారు వివరముగను

గావించియున్నారు. మనము పాటుపడక, స్వధర్మానుష్ఠానమును వదలివేసిన యెడల మన భవిష్యత్సంతతివారు మనలను శపించెదరు. "ధాత వ్రాసిన వ్రాత" చేతనే మనమిట్టి దుస్థితికి వచ్చినా మని తలంచుట కేవలము తప్పు. ప్రతివిషయము బ్రహ్మవ్రాతయేయని మనము తలంచుటకు కారణము చిరకాలానుగత రాజకీయ పరాధీనతేయని నానమ్మకము. అనగా మనము చిరకాలమునుండియు విదేశ పరిపాలనక్రింద నణగిపోయి యున్నందున, ప్రతిదానికిని "బ్రహ్మవ్రాతయే కారణ" మని మనము దుర్భ్రమ పడుచున్నాము.

## ధర్మముకొరకు ధర్మమాచరింపుము

**మంచిపరిపాలన** యననేమి? ఏరాజ్యమునందు ప్రజలలో ప్రతిమనుజునకును, తమతమ శక్తులను అభివృద్ధినొందించుకొనుటకు స్వతంత్రహక్కు గలదో, అట్టిరాజ్యమే మంచిరాజ్య మనబడును. ఏరాజు తనప్రజలను, తమతమశక్తులను, అభిరుచులను స్వేచ్ఛగ వృద్ధినొందించుకొనకుండ నాటంకపరుచునో, తత్సంబంధమైన యత్నములను నిరుత్సాహపరచునో, అట్టిరాజు పరలోకమున సుఖమును బొందజాలడని పూర్వము మనకు ధర్మసూత్రముల ననుగ్రహించిన "మనువు" చెప్పియున్నాడు. మన రాజుగారి మూర్తి భగవంతుని యవతారమనియే మనము భావించుచున్నాము. ఇప్పుడుకూడ నావిధముననే భక్తిపూర్వకమైన పవిత్రభావముతోడనే మనము మన రాజుగారియెడ వర్తింపుచున్నాము. కాని యదంతయు నటుంచి, రాజ్యాధికారమును వహించి రాజనను బిరుదమును వహించినట్టి, తమకుకూడ నెరవేర్పవలసిన ధర్మములు కొన్ని గలవని మాత్రము నొక్కి చెప్పుచున్నాము. దీని విషయమై మను వేమి చెప్పియున్నాడో చూడుడు. "స్వధర్మముల నెరవేర్పని రాజు ఉభయలోకములందును (అనగా యిహమందును, పరమందును) నిందకు పాలగును" గనుక నేను మీకందరకును చెప్పునదేమనగా:—సన్నిహితప్రతిఫలాపేక్ష లేకుండ కేవలము, ధర్మముకొరకే ధర్మమాచరింపుము నిష్కామకర్మాచరణము గావింపుచు, "స్వ," "రాజ్య", ముల రెంటిని బడయవలెను. ఈ విషయము మీ మనస్సులలో బాగుగ పాదుకొనవలెను. ఇదియే "కర్మ" సిద్ధాంతముయొక్క మూలసూత్రము. ఇహసంబంధమయిన భాగ్యభోగ్యములను గూర్చి విచారించినప్పుడు కూడ నీ సూత్రమే యెట్లు వర్తించునో మనము చూడవలసియున్నది. పండితవర్యులారా! స్వారాజ్యహక్కు గౌరవములు మాకిచ్చి తీరవలెనని మన మెందుల కోరుచున్నాము? మన భవిష్యత్సంతతివారి మేలుకొరకే, వారి సౌఖ్యము

వర్తమానపరిస్థితులను బట్టి మనదేశము ప్రపంచమునందుండు తక్కిన దేశము లన్నిటితో విడిపోయి ఏదియో యొకమూల నణగియుండుటకు సాధ్యము కాదు, మనకును బ్రిటిషుసామ్రాజ్యమునకును అనేక సంబంధము లున్నవి. [illegible] తక్కిన జాతులన్నిటితోడను మనకు సంబంధము కలిగినది. మన స్వరాజ్యపద్ధతిలో నీ సంబంధములన్నిటిని నిలుపుకొనవలసినదే. అవి లేకుండ మన మేమియు చేయజాలము. ప్రస్తుత ప్రపంచస్థితిగతు లెట్లున్నవి? యీ ప్రపంచములో మనదేశ మేస్థానమున నున్నది? యీ ప్రపంచనాటకచరిత్రలో మనదేశ మేపాత్రను ధరించి నటింపగలదు? ఈ మొదలైన విషయములనెల్ల మనము పరిశీలింపవలసి యున్నది. స్వరాజ్యవిషయమై మన మాలోచించినప్పుడు ముందు ఈ సంగతుల నెల్ల విచారించవలసియున్నది. మన యాందోళనయొక్క ముఖ్యోద్దేశము, స్వరాజ్యసంపాదనయే భారతీయుల స్థితి నభివృద్ధిపరుపవలెను. కొంచె మెచ్చుతక్కువగ పశువులతో సమానముగ నెంచబడుచున్న మనభారతీయులను మనుష్యమాత్రులనుగ జేయవలెను. ఇదియే స్వరాజ్యముయొక్క ముఖ్యోద్దేశము. యజమానుడు తనవద్దనున్న పశువులకు నీళ్లుపోసి, మేతవేసి, కేవలము తానే వానిని కాపాడుచున్న విధమున మన భారతీయులెల్లరును యీ యధికారవర్గమువారిచే నావిధముగ పోషింపబడుచున్నారు. తన రాష్ట్రములో పండిన పంటవంతయు రాష్ట్రప్రజలకు సరిపోవునో, లేదో, అను విషయమును గవర్నరుగారే చూడవలసియున్నది కఱవుచే చనిపోవుచున్న బీదజనుల రక్షణార్థము సొమ్ము వసూలు చేసి, యొకఫండును యేర్పాటుచేయుటకై గవర్నరుగారే వచ్చి జాగ్రతపుచ్చుకొనవలెను. దేశమంతను నాశనపరచు ప్లేగువ్యాధి నివారణార్థము గవర్నరుగారే వచ్చి యోచించి పనిచేయవలసియున్నది. మనమెంత నిరాధారులము! ప్రస్తుతరాజ్య పాలనాపద్ధతిలో నుండు నీ నిరాధారస్థితి నేమనవచ్చును! మన కీ దినములలో చెప్పబడు విద్య యెట్లున్నదో చూడుడు? ఏవియో కొన్ని కొన్ని సిద్ధాంతములను, సూత్రములను

నిరర్థకముగ, అర్థజ్ఞానశూన్యముగ, ఊరక వల్లెవేయుట తప్ప, విశేషభాగ మింతకంటె యెక్కువ యుపయోగ మేమియును లేదు. ఇట్టి విద్యాపద్ధతితో మనమే కార్యముల నెరవేర్పగలము? ఇది మన కెంతవరకు పనికివచ్చును

పండితవర్యులారా! స్వాతంత్ర్యహక్కులను పొందగలుగుటకు మనము యెడతెగక పట్టుదలతో పోరాడవలసి యున్నది. ఈ పోరాటములో నేమియు తప్పులేదు; ఇది శాస్త్రవిరుద్ధము కాదు. శాసనవిరుద్ధము కాదు. పరలోకమున ఆత్మస్వారాజ్యమునకై నిరంతరము పాటుబడు మనవారు, ఏల యీలోకమున స్వాతంత్ర్య సంపాదనకై గడంగరు? ఇదెంతయు వింతగనున్నది. ఆంగ్లేయుల శరీరములోను, మన భారతీయుల శరీరములోనుకూడ ఒక్కటే ఆత్మ కలదని ప్రతి వేదాంతియు ఒప్పుకొనును. ఇది నిజమైనయెడల, స్వేచ్ఛావిహారులైన ఆంగ్లేయుల యొక్క స్వాతంత్ర్యభావములను చూచి మనమేల భయపడవలెను? పాశ్చాత్యదేశములలో వేదాంతులు లేరని తలంపవద్దు. ఒక్క మనదేశములోనే వేదాంతులున్నారని యభిప్రాయపడకుడు. రాజకీయాధికారము లేని జాతివారు, నిజముగ మనుష్యులు కారనియే పాశ్చాత్యవేదాంతుల యభిప్రాయము (చప్పట్లు). అట్టివారికి మనుష్యుల కుండవలసిన లక్షణములు లేవనియే వారియభిప్రాయము (అనగా అట్టివారు పశుసమాను లనియు; మృగప్రాయు లనియు వారి యభిప్రాయము). మనమిట్టి నిరాధారస్థితిలోనేపడియుండి, మనభవిష్యత్సంతతివారినిగూడ నీ దుస్థితిలోనే పడియుండునట్లు చేసినయెడల—మన యవస్థనే, మనవారికి కూడ తెచ్చిపెట్టినయెడల—మన జాతికి శాశ్వతహానిసత్వము నాపాదించినవార మగుదుము. దేశమును శాశ్వతముగ హానిసత్వము పాల్జేసినవార మగుదుము; గనుక జాగ్రత! ఆర్యులారా! ఇకముందు మన దేశమును బాగు చేసినను, పాడుచేసినను, అంతయును, మీరే చేయవలెను. అంతయును మీచేతులలోనే యున్నది; ఈసంగతిని మీరు జ్ఞాపక ముంచుకొనుడు. ఎవరి యదృష్టమునకు వారే కర్తలు. "మనకు మిత్రుడైననూ తానే, మనకుశత్రువును అయియున్నాడు" అని 6 వ అధ్యాయము ఆత్మసంయమయోగము 5 వ శ్లో॥ ఆత్మైవ హ్యాత్మనోబన్ధు రాత్మైవ రిపురాత్మనః॥ భగవద్గీతలలో చెప్పియున్నారు. భగవంతుడు మనకు స్వతంత్ర బుద్ధి, స్వతంత్రశక్తిని, యిచ్చియున్నాడు. మీరువాని నుపయోగపరచుకొనని యెడల, అది భగవంతుని తప్పుగాదు; అది కేవలము మీలోపమే మనుష్యునకు దృఢసంకల్ప ముండినయెడల' తాను భగవంతునితో సమానము గాగలడు. (అహం బ్రహ్మ) ఈసూత్రమును స్వరాజ్యప్రాప్తికై యేల మనము వర్తింపజేయకూడదు?

ఈ ప్రపంచమంతయు వట్టి మిథ్యయనియు, మాయ యనియు, మన వేదాంతులు
కొందరు చెప్పెదరు. మనమిది నిజమని యొప్పుకొందము; అయినను, నీ స్వధర్మము
నుండి నీవు విముఖుడవగుటకు నీకేమి హక్కుకలదు? (నీ స్వధర్మము నాచరింప
కుండ, నీ వెట్లు తిరస్కరింపగలవు?; నీవు ఆహారమును భుజింపమానితివా? నిద్రింప
మానితివా? ఇవిమాత్రము వట్టి మాయ కాదా? వట్టి మిథ్య కాదా? బహుశః మీకంద
రకును "ఏనుగును, వేదాంతిని" గూర్చిన కథ తెలిసియే యుండును. ఒకదినమున
ఒక ఏనుగు ఒకసన్యాసిని తరుముకొనిరాగా, ఆయన భయముచే పరుగెత్త మొద
లిడెను. అదిజూచి యొకడు, "ఓ స్వామీ! మీరేల పరుగెత్తుచున్నారు? మిమ్ములను
తరుముకొనివచ్చు ఆయేనుగు మాయ కాదా? అదిమిథ్య కాదా?" యని ప్రశ్నించెను.
ఆ సన్యాసి వెంటనే వానికీవిధమున ప్రత్యుత్తరము చెప్పుచున్నాడు. "నన్ను
తరుముకొనివచ్చు ఆయేనుగ యేవిధముగ మిథ్యయో, అట్లే నేను పరుగెత్తుకొని
పోవుటయు మిథ్యయే? నేను నిజముగ పరుగెత్తుకొని పోవుచున్నానని నీవు తలంప
వద్దు" కనుక యీ కథవలన మనమొక గొప్ప నీతిని నేర్చుకొనవలసి యున్నది.
ఆసన్యాసి చెప్పిన ప్రత్యుత్తరములో గొప్పనీతికలదు. మన మాచరించు ప్రతికార్య
మును మిథ్యయే యైనను, మనధర్మమును మాత్రము మన మాచరించియే తీరవలెను.
మన శరీరము మిథ్యయే యని మనము ఆత్మహత్య గావించుకొందుమా? మన శరీర
ములు నిజమనియే మనము భావించునంతకాలమును, మనమాచరించు వివిధ ధర్మ
ముల నెల్ల నిజమనియే యాచరింపవలెను. మనహృదయములో నివి యెల్ల మిథ్యయే
యని భావించిన భావింతుముగాక. మన మీదృఢసంకల్పముతో ధైర్యముగ నిలువ
బడినయెడల, మనము మన స్వధర్మమునుండి విముఖులము గావలసిన యవసర
ముండదు. ఈ ప్రపంచ మంతయు మాయ యనియు, గనుక యిహసంబంధ మైన
కార్యములతో జోక్యము కలుగజేసికొనకుండ సోమరిగ నుండవలసినదనియు మనకు
కొందరు వేదాంతులు బోధింపవచ్చును. కానివారిని నేనొక చిన్నప్రశ్న నడిగెదను.
"నీకు కనుపించునదంతయు మాయయే యయినయెడల, నీ శరీరము నొకకత్తితో నేల
నరికివేసికొనకూడదు?" గనుక దీనిలోని నిజస్థితి యేమనగా, "ప్రపంచ మంతయు
మిథ్యయే" యని చెప్పు సిద్ధాంతముయొక్క నిజార్థమును మీరు బాగుగ గ్రహింప
లేదని తేలుచున్నది. "ధర్మముకొరకు ధర్మ మాచరింపుము" ఇదియే కర్మయోగము
యొక్క సారాంశము. ఇట్టిధర్మాచరణము మన మోక్షప్రాప్తికి అడ్డము రాజా
లదు. మనకు జయము వచ్చినప్పుడు పట్టరాని సంతోషమును పరాజయ మైనప్పుడు
అమితదుఃఖమును, నిరాశయును కలుగగూడదు. ప్రతిఫలాపేక్ష లేకుండ స్వధర్మము

నాచరించుటయే "కర్మయోగము" యొక్క సారాంశము. (ఇదియే నిష్కామకర్మ) వేదాంతసిద్ధాంతములను గూర్చి తప్పుడు అభిప్రాయము లుండుటచేతనే మన దేశ మీ దుస్థితికి వచ్చినదిగాని, కేవలము యదార్థమైన వేదాంతబోధవలన మనదేశము చెడిపోలేదు. విదేశాధికార ప్రాబల్యముచేతనే కొంతవరకు మనకీ తప్పుడు అభిప్రాయములు గలిగినవి. పూర్వము మనవారు రాత్రులందు యింటి తలుపులను పూర్తిగ తెరచియుంచియే పరుండి నిద్రించుచుండెడివారని గ్రీకు దేశపు యాత్రికులు వ్రాసియున్నారు. అప్పటి పూర్వకాలపు దినములలో, మనదేశస్థులందరును అంత ఎక్కువ పరలోకచింతతోడను, సుశీల వృత్తముతోడను విరాజిల్లుచుండిరని దీనివలన తెలియుచున్నది. ఇప్పుడీ స్థితియంతయు మారిపోవుటకు కారణ మేమి? ఏల మారిపోవలెను? మనయొక్క శీలవృత్తములయం దింతహీనస్థితి సంభవించుటకు కారణము, మనము విదేశపరిపాలన క్రింద యింత కాల మణగి పడియుండుటవలననే యని నాబుద్ధికి తోచుచున్నది చిరకాలము పనిచేయకుండ మన యవయవముల నటించి వైచిన యెడల, నవియెట్లు బలహీనములైపోవునో, అట్లే మనోబుద్ధ్యాదులను, మెదడును కూడ విశేష కాలము నిర్వ్యాపారముగ నుంచిన యెడల వానిశక్తి కూడ పోవును. మనముకూడ గొప్పవారమే యనుసంగతిని మరచిపోయి చాల కాలమునుండి ఆవిషయమును గూర్చియే చింతపడకుండుటవలన మన మిట్టి నిరాధారస్థితికి వచ్చినాము మన యిబ్బందులవల్లను, మనలోనుండు అంతఃకలహముల వల్లను మన కర్మరంగము మిక్కిలి సంకుచిత మైనది; అట్లే మన యాదర్శములను కూడ సంకుచితముగ నున్నవి. (అనగా మనముగొప్పగొప్ప కార్యములజేయ మరచినాము; గొప్ప విషయములను గూర్చి చింతింపమరచినాము) స్వార్థపరత్వము మన కన్నులను గప్పినది. మనమందరమును ఎవరి మేలును వారే చూచుకొనుచున్నాము. మన ప్రస్తుత లాభముతప్ప, అంతకు మించినవానిని గూర్చి మన మేమియు చింతింపుట లేదు. మనగ్రామమును దాటి, అంతకుపైగా, మనముపోయియే కార్యములను జేయజాలకున్నాము. దేశమును గూర్చియు, ప్రజలను గూర్చియు, మనము చింతింప నవసరము లేదనియు, దాని విషయమై ప్రభుత్వమువారే జాగ్రత పుచ్చుకొనెదరనియు తలంచుట కేవలము హాస్యాస్పదము. గొప్పసామ్రాజ్యమునకు జెందినవారలమైన మనబోటివారికి యుండవలసిన లక్షణ మిదికాదు గృహస్థులౌసంగు భిక్షయే యాధారముగ జీవించుసన్యాసులైనను యిట్టివాద మెంతయు రుచింప కూడదు గద, మనయూహ లన్నియు, మనయింటిని దాటి, బయటిదేశమునంతను గూర్చి చింతింప మొదలిడినప్పుడే, మనము వేదాంతముయొక్క నిజసారమును గ్రహించినా మని చెప్పుకొనగలము.

## భక్తి యన నేమి

పండితవర్యులారా !

మన మిప్పుడు మంచి యనుకూలమైన కాలములో నివసించుచున్నాము. యూరపుఖండ మంతయును యిప్పుడు మేల్కొనియున్న దని మన మనేకసారులు చెప్పుకొనుచున్నాము. మనదేశమునుగూడ తక్కినదేశములలోబాటు పైకి తీసి వెనుక బడియుండవలెను? రష్యాదేశము మేల్కొంచి, తన స్వధర్మము నాచరింపు చున్నది. బెల్జియంబోటి చిన్నచిన్న దేశముల స్వాతంత్ర్యములను గాపాడుటకై మన ఆంగ్లేయదేశము పోరాడుచున్నది. కడు చిన్నదేశము సైతము నాగరికతాప్రపంచ మున తాను ముందు నడువ యత్నింపుచున్నది. బ్రాహ్మణోత్తములారా! మీ రేల హీనమైన మీప్రస్తుత నిరాధారస్థితిలో పడియుండ తృప్తినొందవలెను. మీకిప్పుడు చిక్కిన యీ మంచి యనుకూలమైన యవకాశమును మీరు జారవిడిచెదరా? భక్తి యన నేమి? మీ రాచరింపు పవిత్రకర్మలవలన భగవంతుని సంతృప్తిబరచుటయే భక్తి యనబడును. ఇంతకంటె వేరేమియు లేదు, కర్మ ఎచ్చటనైతే కలదో, ఫలితము కూడ దానిననుసరించి యచ్చటనే యుండును. కర్మను, తత్ఫలితమును, విడదీయు టకు వీలులేదు. ఇదియే కార్యసిద్ధాంతముయొక్క అనతిక్రమణీయ మైననూత్రము. మీరు మీ దేశము నుద్ధరింప బూనినయెడల, మిమ్ములను విజయవంతులను గావింప భగవంతుడు సిద్ధముగ నున్నాడు. నీకు నీవు సహాయము చేసికొననిదే భగవంతుడు సాయపడడు తనకు తానే పురుషుడు తన మోక్షమునకై యత్నించుకొనవలెను. మనము మనుష్యమాత్రులముగ వర్తింపనియెడల, మనవలన మనదేశమున కేమిలాభము కలుగగలదు? దేశమనగా భూగోళ భాగము గాదు; దేశమనగా చెట్లుచేమలుకాదు; నదులు, పర్వతములు, చెరువులు, కోట్లు, పట్టణములు కావు దేశములో నే జాతి ప్రజలున్నారో వారేదేశము, వారే దేశప్రజలు, మనదేశమును హిందూస్థాన మని పిలిచెదరు దీనికీపేరు స్వాతంత్రము, చెట్లుచేమలను బట్టి రాలేదు. హిందీప్రజలను మనుష్యులచేత నాక్రమించియున్నది గనుక, యీదేశమునకు హిందూస్థానమను పేరు వచ్చినది. మీప్రవర్తనమువల్లను; మీ సాహసకార్యములచేతను, మీరును ఒకజాతివారును సజీవులనియు, ప్రపంచమునకు జూపుడి. అట్లు జూపి నప్పుడే మనదేశము హిందూస్థాన మనిపించుకొనును. మనకు ప్రస్తుతముండు నీ నిరా ధారత మనకెంతయుసంతృప్తికరముగ లేదని, మీక్రియల వలన, ప్రపంచమునకు జూపినప్పుడే మీరు స్వరాజ్యమునకు అర్హులని ఋజావుపరచినవార లగుదురు.

మీరహోరాత్రములు కృషిచేయవలెను. మీరు హృదయపూర్వకముగ, ఆత్యాతుర బుద్ధితో కష్టపడి పనిచేసినయెడల, మనకు ఒకటి, రెండు, సంవత్సరములలో స్వరాజ్యము వచ్చితీరునని నాకు విశ్వాసముగలదు ఒకటి రెండుసంవత్సరములలోనే స్వరాజ్యము, మనది కాగలదు. (బిగ్గరగ చప్పట్లు), ప్రస్తుత యవకాశములను మీరు వినియోగపరచుకొనిన చాలునని భగవంతు నెదురుచూచుచున్నాను. జాతీయాభ్యుదయమను పురోగమన సూచకమైన, (జగన్నాథ) రథము కదలినది. మీభుజములను ఆ రథచక్రములకు సంధించి, దానిని ముందునకు సాగించెదరు గాక! మీకీర్తి సమృద్ధిని భగవంతుడు పుట్టించును గాక! బ్రాహ్మణోత్తములారా! ఉత్తిష్ఠత! జాగ్రత! (మేల్కొంచుడు! లెండు!) నేచెప్పిన దంతయు నింతియే. నా వాక్యములను మీరు పెడచెవిని బెట్టకుందురు గాక! (చాలసేపువరకు చప్పట్లు)

ఓం. తత్ సత్ బ్రహ్మార్పణమస్తు.

సంపూర్ణము.

శ్రీ

# గంగాధరుని నిర్యాణము

[ఆ 1920 సం॥ ఆగష్టు 14 వ తేది శనివారం ఆంధ్రపత్రికానుబంధమునుండి]

ఘను తెవ్వారు ధరిత్రి మాతిలక భాస్వద్వ్యాఖ్యానోత్సాహికిన్।
సమధర్మ ప్రతిపత్తి జాతి మత వైషమ్య ప్రతీహారికిన్।
విను లాంగ్లేయ సుశాస్త్రకాగ్రహణ పృథ్వీపాలకోత్సాహికిన్
జమదగ్ని ప్రతిరూప వేదఖనికిన్ జాతీయతావాదికిన్॥

సీ॥ అధ్యాత్మవిద్యారహస్య సంవేదియై, గీతారహస్య నిర్మాతయగుట।
వేద వేదాంగ ప్రవీణాగ్రగణ్యుడై, ఋగ్వేద వృత్తినిర్ణేత యగుట।
బహుతరసిద్ధాంత వరరుచితుల్యుడై, జ్యోతిషామృతపాదశుద్ధు డగుట।
ఉన్నతబహు పరీక్షోత్తీర్ణ దక్షుడై, యాంగ్లభాషాగ్రవిహారి యగుట॥

గీ॥ పాఠశాలనిర్మాణ పాటవంబు। మహిత విద్యానుసంఘ నిర్మాణపటిమ
గలిగియుండుట బండిత తిలక మగుచు। దిలక పండితు డంతయు తేజరిల్లె॥

గీ॥ ఘనతరం బైన భారతాకాశమందు। అరువ దారేండ్లు తేజస్వియై చరించి।
అవిరళాజ్ఞాన తిమిరంబు నవలద్రోసి। అప్పులార! తిలకార్కు డస్తమించె॥

క॥ ఘనహితుడు మనకు మిత్రుడు। మనసత్పథ దర్శకుండు మనదేశికుడున్
మనమాన్యుడు మన ధర్ముడు। మనలన్ విడనాడె నేడు భారతులారా॥

క॥ ప్రజలతి భక్తి గొల్వగ స్వరాజ్య ఫలాప్తికి ప్రయత్నముల్।
విజయముగ సల్పి యాధునిక విందలకోర్చి ప్రవాస వేళలన్।
గజిబిజి కాగ దేశహిత కాంక్షను కష్టము లొంది యక్కటా।
విజయము గల్గు వేళ మనవీరుడు స్వర్గము చేరఁ బెల్లునే॥
క॥ "ఆపద గడవన్ నోపి శుభంబైనదాని జాడగూర్పను మన।
పుట్టువునకు తిలక కృష్ణపాలుడు గాంధి జూపి జనియె మహాత్మన్॥